# సంగీత శబ్దార్థ చంద్రిక



**1954.**

ప్రథమ ముద్రణ 1500 కాపీలు.



సంగీత శబ్దార్థ చంద్రిక

వెల రు 10–0–0



ముద్రితము:

ములుకోల ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ—౨.

# సంగీత శబ్దార్థ చంద్రిక

## ప్రాచీన, నవీన, వాగ్గేయకారక, గాయక, వాదక, రచయితల సహిత నిఘంటువు



గ్రంథకర్త:
గానకళావిశారద,
**అరిపిరాల సత్యనారాయణమూర్తి** *(Violinist)*
మెంబరు, బోర్డు ఆఫ్ ఎగ్జామినర్సు ఇన్ ఇండియన్ మ్యూజిక్,
ఆంధ్రా యూనివర్సిటీ.
గాంధీనగరము :: విజయవాడ



# వి ష య సూ చి క.



# పీఠిక



లలితకళలన్నిటిలోను సర్వోత్కృష్టమైన కళ సంగీతమగుట నిర్వివాదాంశము. అయ్యది శిశు, పశు, ఫణ్యాదులను సయితమానందాబ్ధి నోలలాడించుటయేగాక ముక్తి నొందుటకుకూడ సాధనమగుచున్నది. అయితే లక్ష్య, లక్షణ సమన్వితమైన ఈ పవిత్ర సంగీత కళోపాసన సద్గురు కటాక్షమునగాని సిద్ధింపదనుట యదార్ధవిషయమగును. కాని మానవ జీవితమే యత్యల్పమైన నేటి కాలములో గానకళార్థులు దీర్ఘకాల గురుకులవాస మొనర్చుటగాని, మహత్తరమైన నీ సంగీతకళను నిరంతరము కంఠస్థముగనుంచుకొనుట గాని యసాధ్యమైన విషయముగాకమానదు. గనుకనే మన ప్రాచీన వాగ్గేయకారులు ఆ యా కాలములందుగల సంగీత లక్ష్య, లక్షణ విధానముల కనుగుణముగా, మాతృభాషయైన సంస్కృతములో ననేక గ్రంథములను రచించి దేశోపకారమొనర్చిరి. అందుకు వారెంతయును చిరస్మరణీయులగుదురు.

ఈ విధముగా మన పూర్వీకులచే లోగడ యనేక గ్రంథములు వెలువడి యున్నను, కర్నాటక సంగీత శాస్త్రమునకు సంబంధించిన వివిధ విషయములనొకచోట దెలుపగల నిఘంటు గ్రంథము తెలుగులో లేకుండుట నిజముగా మన సంగీత వాఙ్మయమునకే ఒక లోటుగా నెంచదగియున్నది. ఇట్టి కొఱత కొంతవఱకైనదీర్చుట సుపయుక్తముగనుండునని తలచి "సంగీత శబ్దార్థ చంద్రిక" అను పేరుతో నేనీ గ్రంథమును రచింప సాహసించితిని. కాని సంగీత శాస్త్రమంతటికిని సంబంధించిన ఈ విశేష కృషిలో వివిధ లక్షణ, లక్ష్యములకు చెందిన శ్రుతి, రాగ, తాళ, వాద్య, గ్రంథ, ముద్రా, బిరుద, రచన, నృత్య, అభినయాది అనేక రకములకు చెందిన శబ్దములను సమకూర్చుటలోనేమి, వాటిని అకారాది వరుసక్రమమునందేర్పఱచుటలోనేమి, అట్టి వాటికి నేటి సంగీత శాస్త్ర సంప్రదాయానుగుణ్యమైన యర్థముల నన్వేషించుటలో నేమి నేనుఅనేక శ్రమలకు లోనుగావలసి వచ్చినందున 1943 వ సంవత్సరములో ప్రారంభింపబడిన యీ గ్రంథ రచన 1948 వ సంవత్సరమునకుగాని పూర్తి గావింపలేకపోతిని.

ఈరీతిగా దీర్ఘకాల కృషితో ముగింపబడిన యీ నిఘంటు గ్రంథమునందు అ, నుండి క్ష, వఱకు నిప్పటికి లభ్యమైన 6026 సంగీత పారిభాషిక పదములను, వాటికి యర్థములను పేర్కొనబడుటయేగాక, ప్రాచీనకాలమునుండి నేటివఱకు యీ సంగీత కళాభివృద్ధికై నిరంతర కృషిచేసిన మహనీయులలో నాకు లభించిన 414 మంది సుప్రసిద్ధ వాగ్గేయకారక, గాయక, వాదక, రచయితలను గూర్చిన ముఖ్యాంశములుగూడ దీని కనుబంధముగ జేర్చి ముగింపగలిగితిని.

ఈవిధముగా నా చిరకాల ఆశయమైన నీ నిఘంటువును 6440 ప్రాముఖ్య విషయములతో గననయునూ, 568 పుటలలో ముద్రణమునూ, పూర్తిగావించి గావ

కళాభిలాషుల కందజేయు భాగ్యము నా కనుగ్రహించిన అపరాత్పరుని కెల్లప్పుడు నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాను.

బహువిధ లక్షణములతో కూడిన యీ నిఘంటు గ్రంథరచనలో నాకృషి తొలి ప్రయత్నమే యగుటవల్లగాని, ప్రచురణాది సహజకారణములవల్ల గాని గలుగు లోపములేవైన యున్నచో గుణగ్రహణ పారీణులగు పండితులు వానిందెలిపిన సాదరముతో నందుకొని పునర్ముద్రణమున సవరణజేయుదునని మనవిజేయుచున్నాను.

నాగ్రంథమును మొదటినుండి, తుదివఱకు తగు విచక్షణతో పరిశీలించి నాప్రయత్నమున కెంతయు దోహదమొనర్చుటయేగాక నీగ్రంథమునకు తగు నుపోద్ఘాతము (Foreword) ను కూడ వ్రాసిపంపిన మద్రాసు యూనివర్సిటీ సంగీత శాఖా ప్రధానాధికారియును, ఆంధ్రా యూనివర్సిటీ మ్యూజిక్ బోర్డు సభ్యులునగు సంగీతకళా శిఖామణి, ప్రొఫెసరు శ్రీ పి. సాంబమూర్తి (బి. ఏ; బి. యల్;) గారికిని, మొదటినుండియు నా గ్రంథరచనల నెంతయు ప్రోత్సహించుటయేగాక నీనిఘంటు గ్రంథము నామూలాగ్రముగా పరిశీలించి తమ అమూల్యాభిప్రాయముల నొసంగిన శ్రీ విజయనగరం మహారాజావారి సంగీతకళాశాల మాజీ అధ్యక్షులును, ఆంధ్రా యూనివర్సిటీ మ్యూజిక్ బోర్డు సభ్యులునగు సంగీతకళానిధి, సంగీతరత్నాకర, కళా ప్రపూర్ణ, డాక్టర్ శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడుగారికిని, మద్రాసు టీచర్సు మ్యూజిక్ కాలేజీ అధ్యక్షులును, ఆంధ్రా యూనివర్సిటీ మ్యూజిక్ బోర్డు అధ్యక్షులును, ఆల్ ఇండియా రేడియో మ్యూజిక్ అడిషన్ బోర్డు (S. I.) ఉపాధ్యక్షులునగు సంగీత కళానిధి, శ్రీ టి. వి. సుబ్బారావు (బి.ఏ;బి.యల్;) గారికిని, తిరుపతి శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ సంగీతకళా పరిశోధకులును, సంగీత, సాహిత్య కళావిశారదులగు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారికిని నా మనఃపూర్వకాభివందనములు దెలుపుకొనుచున్నాను.

విశేష వ్యయ ప్రయాసలతో కూడిన యీ గ్రంథమును ప్రచురించు సందర్భములో ప్రజాప్రభుత్వమువల్లగాని, ప్రజలవల్లగాని యెట్టి ఆర్థిక సహకారము లభింపక నిరాశావహుడనై యుండుతరి వుపయుక్తమైన నీగ్రంథమును శక్తికొలదిగానైన ప్రచురించు టెంతయు నవసరమని కొందరుపెద్దలు సలహానిచ్చుటచే 1948 లో నేనీ గ్రంథము‌ను 128 పేజీలవఱకు నచ్చొత్తించి ధనాభావముచే విరమించితిని. కాని దైవకృపచే నాకీనాడులభించిన ఆర్థిక సహకారమే ఆనాడు నాకు లభించియున్నచో సుమారు 5 సంవత్సరముల క్రితమే నేనీగ్రంథమును ప్రకటించి ప్రజల కందించి యుండువాడను. పైకారణములవల్లనే 1953 వఱకూ నేనీగ్రంథమును ప్రకటింపలేక జగత్కార్య కారణకర్తయగు శ్రీభగవానుని ప్రార్థింప ఆదయామయుని కరుణచే ప్రేరేపింపబడిన ప్రముఖులగు ఆంధ్ర, తమిళ, కర్నాటక మహాశయులొనర్చిన ఆర్థిక తోడ్పాటుతో 15-2-53 న నాకొక గొప్ప సన్మానముజరిపి తద్వారా నా 4, 5

గ్రంథరచనలగు "సంగీతశబ్దార్థచంద్రిక" "సంగీతకళాప్రదర్శిని" అను గ్రంథముల నచ్చొత్తించి యిచ్చుటకు బాధ్యతవహించిన శ్రీ విజయవాడ కర్నాటక సంగీత గ్రంథ ప్రచురణ సంఘమువారికిని, అందును ముఖ్యముగా నీ వుత్తమకార్య నిర్వహణలో విశేష శ్రమజేసి జయప్రదమునర్చుటయేగాక నా మొదటి నిఘంటుగ్రంథ ప్రచురణమును నేటికి పూర్తిగావించిన గ్రంథప్రచురణ సంఘాధ్యక్షులును, వర్తకశిఖామణులగు శ్రీ మాజేటి రామమోహనరావుగారికిని, గ్రంథప్రచురణసంఘ సభ్యులును, కళాప్రియులునగు శ్రీ డి. కృష్ణమూర్తిగారికిని, శ్రీ కె. జగన్నాథన్ గారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములను తెలుపుకొనుచున్నాను.

విశేష శ్రమతోకూడిన యీ సంగీత నిఘంటు గ్రంథ ప్రచురణలోని బాధ్యతల నెంతయు గుర్తించి తగునోర్పుతో నీగ్రంథ ముద్రణమును పూర్తిగావించిన శ్రీ విజయవాడ ములుకోల ప్రెస్ వారికికూడ నే నెంతయు కృతజ్ఞుడ నగుచున్నాను.

విజయవాడ,
1-10-1954.

ఇట్లు,
గ్రంథకర్త.

# FOREWORD

SANGITA SIKHAMANI,
P. SAMBAMOORTI, B. A; B. L; 13th Aug. 1954
Head of the Department of Indian Music,
Madras University, MADRAS. MADRAS.

I am glad that Sri Aripirala Satyanarayana Murthy has completed his work; "Sangita Sabdartha Chandrika" This work will go down in Musical history as the first Musical reference book of its kind to be published in Telugu.

The treatment of the matter in the book is concise and interesting. The general Reader as well as the student of Music will find this a useful work. Most of the important items pertaining to lakshana or musicology lakshya or repertoire and Charitra or history have been covered in this book. For those who are conversant only with Telugu this book will be of great help in understanding the extant and width of our Musical heritage.

(Sd.) P. Sambamoorti.

సంగీత శిఖామణి,
ప్రొఫెసర్. పి. సాంబమూర్తి, బి. ఏ; బి.యల్: 13—8—54
హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంట్ ఆఫ్ ఇండియన్ మ్యూజిక్ మద్రాసు.
మద్రాసు యూనివర్సిటీ, మద్రాసు.

శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు "సంగీత శబ్దార్థ చంద్రిక" అను తమ గ్రంథమును పూర్తిచేసినందుకు నేనెంతయు సంతసించుచున్నాను. తెలుగులో సంగీతవిషయ పరిశీలన (రిఫరెన్సు) గ్రంథములలోనిది ప్రథమముగానుండి సంగీత చరిత్రలో శాశ్వతమైన కీర్తిని గడించగలదు.

ఇందులోని విషయ నిర్వహణ యుక్తరీతిగను, సంక్షేపముగను, ఆసక్తిని కలిగించునదియై యున్నది. సామాన్య పాఠకులకును, సంగీత విద్యార్థులకును యీ గ్రంథము మిక్కిలి ఉపకరించగలదు. లక్షణ లేక సిద్ధాంత భాగమునకును (మ్యూజికాలజీ) లక్ష్యభాగమునకును, చరిత్ర భాగమునకును సంబంధించిన విశేష ప్రాముఖ్యమైన అంశములనేకము యిందు చర్చింపబడినవి. ఆంధ్రభాష మాత్రమే తెలిసినవారికి మన సంగీత శాస్త్రముయొక్క వైశాల్యమును గ్రహించుటకు యీ నిఘంటు గ్రంథము మిక్కిలి సహకారియగునని నేను ఆశించుచున్నాను.

(సం.) పి. సాంబమూర్తి.

---

# పండితాభిప్రాయములు

సంగీత కళానిధి, సంగీత రత్నాకర,
కళాప్రపూర్ణ:
డాక్టరు ద్వారం వేంకటస్వామినాయుడు.

ద్వారం హౌస్,
ట్రిప్లికేన్, మదరాసు
27 ఆగష్టు 1954.

విజయవాడ వాస్తవ్యులగు గానకళావిశారద, శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారిచే నూతనముగ రచింపబడిన "సంగీత శబ్దార్థ చంద్రిక" యను గ్రంథమున పరికించి మిగుల సంతసించితిని. వీరు చక్కని గ్రంథములను తయారుచేసి యిదివరకె సంగీత గ్రంథకర్తగా తెలుగుదేశమున విశేష ప్రఖ్యాతి నార్జించియుండిరి. ఇంతకు పూర్వము రచించిన సంగీత గ్రంథములన్నిటికంటెకూడా యిప్పుడు రచించిన యీ సంగీత నిఘంటు గ్రంథము మిక్కిలి ప్రయోజనముకలదియగును. తెలుగున యిట్టి ముఖ్యమగు సంగీత గ్రంథము యింతవరకు వెలువడలేదనియే నేనభిప్రాయపడుచున్నాను.

ఈ "సంగీత శబ్దార్థ చంద్రిక" విద్యార్థులకు మాత్రమేగాక సంగీత విద్వాంసులకుకూడ - యెక్కువగా నుపయోగపడగలదని నేను భావించుచున్నాను. మిక్కిలి ప్రయోజనకారికాగల యిట్టి గ్రంథమును రచించుటలోగల శ్రమయెట్టిదో విద్వద్జనులుకూహ్యామే. ఈ గ్రంథము సంగీతమును గురించిన విషయములను తెలుసుకొనదలచు ప్రతియాంధ్రునియింటను ముఖ్యముగా నుండదగినదని నా విశ్వాసము. ఇందు శబ్దార్థములతోబాటు ప్రాచీన, నవీన, వాగ్గేయకారుల, గాయకుల, వాదకుల, రచయితలను గురించికూడ క్లుప్తముగ వ్రాసి యనుబంధమునచేర్చుట ప్రశంసనీయము. బహుశ్రమాదులకునోర్చి శ్రీ సత్యనారాయణమూర్తిగారు తెలుగున యిట్టి గ్రంథమును పూర్తిజేసి ఆంధ్రదేశమునకు చాల యుపకారమొనర్చినవారగుచున్నారు. ఇందుకు వారిని నేను హృదయపూర్వకముగా నభినందించుచున్నాను.

వీరు యింకను పెక్కు ఉత్తమ సంగీత గ్రంథములను రచించి సంగీత లోకమున కుపకరించునట్లు పరమేశ్వరుడనుగ్రహించుగాక యని కోరుచున్నాను.

(సం) ద్వారం వేంకటస్వామి.

---

# (EXPERT OPINIONS)

SANGEETA KALANIDHI,
SANGEETHA RATNAKARA,
KALA PRAPURNA,
Dr. Dwaram Venkata Swami Naidu,

Dwaram House,
Triplicane,
MADRAS.
27th August 1954.

I am greatly delighted by "Sangitha Sabdartha Chandrika" a new book written by Ganakala visarada, Sri Aripirala Satyanarayana Murthy Garu of Vijayawada, which I have perused. Sri Satyanarayana Murthy has already written five books in Music and has acquired special reputation as a musical author in the Andhra State. The present work which is a Sangeetha Nighantu, will be more useful than all the previous ones. In my opinion an important book like the present one has not been written in Telugu heretofore. It is my conviction that this "Sangeetha Sabdartha Chandrika" will be very useful not only to students, but also to scholars. Eruditemen can imagine what amount of labour is involved in preparing such a useful book. I strongly hope that this book will be found in the home of every Andhra, desirous of knowing facts about music. It is a praiseworthy feature of this book that along with synonyms for words, there is an appendix containing material regarding ancient and modern composers, musicians, instrumentalists in a concise manner...Sri Satyanarayana Murthy has rendered very great service to Andhra Desh by producing a work of this magnitude after considerable toil. I heartily congratulate him on this effort.

I wish that Almighty may give him opportunity for writing several other high class musical works and thus serve the musical world'

(Sd) Dwaram Venkataswami Naidu.

---

T. V. Subba Rao, B. A; B. L;
Advocate
Chairman:
Board of studies in Indian Music
Andhra University
Member:
Board of studies in Indian Music
Mysore University.
Principal:
Teachers Music College Madras,
Vice-Chairman:
Board of Audition in Indian Music All India Radio (S. I.)

Phone: 86188
185 High Road
Rayapettah
Madras-14.
D/ 22nd May 1954.

I have perused with interest "Sangita Sabdartha Chandrika" of Sri Aripirala Satyanarayana Murthy of Vijayawada. I have no doubt it will prove useful to all students of Music as well as those interested in the academic aspect of it. I have much pleasure in commending the book to the public.

(Sd.) T. V. Subba Rao.

టి. వి. సుబ్బారావు, బి. ఏ; బి యల్;
అడ్వొకేట్
చైర్మన్:
బోర్డు ఆఫ్ స్టడీస్ ఇన్ ఇండియన్ మ్యూజిక్
ఆంధ్ర యూనివర్సిటీ,
వైస్ చైర్మన్:
బోర్డు ఆఫ్ ఆడిషన్ ఇన్ ఇండియన్ మ్యూజిక్
ఆల్ ఇండియా రేడియో (సౌ. ఇం.)
మెంబరు:
బోర్డు ఆఫ్ స్టడీస్ ఇన్ ఇండియన్-మ్యూజిక్ మైసూర్ యూనివర్సిటీ,
ప్రిన్సిపాల్:
టీచర్సు మ్యూజిక్ కాలేజి-మదరాసు

ఫోన్: 86188
188 రాయపేట హైరోడ్డు
మద్రాసు
ది 22 మే 1954

విజయవాడ వాస్తవ్యులగు శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు రచించిన "సంగీత శబ్దార్థ చంద్రిక" అను గ్రంథమును నేను ఆసక్తితో చదివితిని. సంగీత విద్యార్థులకును, సంగీతశాస్త్రమందు కుతూహలము గలవారికిని యీ గ్రంథము వుపకరించుననుటలో సందేహములేదు. ఈ గ్రంథముయొక్క ప్రాశస్త్యమునుగూర్చి ప్రజానీకమునకు వెల్లడించుటకు నేను మిక్కిలి సంతసించుచున్నాను.

(సం.) టి. వి. సుబ్బారావు.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.
సంగీతకళాపరిశోధకులు,
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాపరిషత్.

తిరుపతి.
ది 9–9–1954.

విజయవాడ వాస్తవ్యులగు గానకళావిశారద, శ్రీ అరిపిరాల సత్యనారాయణ మూర్తిగారు రచించిన "సంగీతశబ్దార్థచంద్రిక" అను గ్రంథమును చదివి సంతసించితిని. కర్నాటక సంగీతకళకు ఎన్నోయేండ్లుగా వారుచేయుచున్నసేవ సుప్రసిద్ధమైనది. లక్ష్య, లక్షణములనుగూర్చి యిదివరకు వారురచించిన అనేకగ్రంథములు విద్యార్థులకు యెంతో వుపకరించుచున్నవి. కాని తెలుగులో పారిభాషికశబ్దముల నిఘంటువొకటి కర్నాటక సంగీతశాస్త్రమున కెంతో అవశ్యకమని గుర్తించుటచే వీరీ గ్రంథము నిప్పుడు రచించియుండిరి. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి "భరతకోశము" సంస్కృత భాషయందును, శ్రీ పి. సాంబమూర్తిగారి "డిక్ష్నరీ ఆఫ్ సౌత్ ఇండియన్ మ్యూజిక్ అండ్ మ్యూజిషియన్సు" ఇంగ్లీషుభాషయందును గలవు. కాని రెండవది ఇంకను పూర్తిగా ప్రకటింపబడలేదు. తెలుగులో పూర్తిచేయబడిన ఈ నిఘంటుగ్రంథము ఇదంప్రథమముగా వీరు కైకొన్న మహాకార్యము. ఈపనికి ఎంతో పరిశోధన, ఓర్పు, పాండిత్యము, పరిశ్రమ, వ్యయము లావశ్యకములు. ఇదిగాక ప్రాచీనాధునిక వాగ్గేయ కారకుల నిఘంటువుకూడ దీని కనుబంధముగా చేర్చుటచే నీగ్రంథమువిలువ హెచ్చినది. ప్రథమప్రయత్నము గనుక ఇందు చేయదగుమార్పులు, చేర్పులు ఏవైన తోపవచ్చును. ఈ నిఘంటు గ్రంథము ఆంధ్రదేశములోని సంగీత విద్యార్థులకును, సంగీత విద్వాంసులకుకూడ ఎన్నో నూతనవిషయములను ప్రామాణికముగా తెలుపుననుట నిస్సందేహము. ఇందుకు శ్రీ సత్యనారాయణమూర్తిగారు చాలా అభినందనీయులు. ఆంధ్ర గాయకలోకము యీ గ్రంథముయొక్క అర్హతనుగ్రహించి యాదరింతురనుట నా శుభాశంస.

(సం) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

---

RALLAPALLI ANANTA KRISHNA SARMA
Reader in Indian Music
Sri venkateswara Oriental Institute

TIRUPATI
9—9—1954.

I read with pleasure the book "Sangeetha Sabdartha Chandrika" written by Ganakala visarada Sri Aripirala Satyanarayana Murthy Garu of Vijayawada. The service that he has been rendering to the cause of Musical Art for several years past is well known; the several books written by him already on "Lakshya" and "Lakshana" have been extremely useful to students of Music. But, as a dictionary in Telugu on Technical terms has been felt as a great want by him, he has written this new work. The work "Bharata Kosam" in the Sanskrit Language by Sri Manavalli Ramakrishna Kavi and the Dictionary of South Indian Music and Musicians in English of Sri P. Sambamoorti, are now available. But the latter has not been completely published. The work in Telugu completed by Satyanarayana Murthy is the first great one of its kind. For this work considerable research, patience, scholarship, industry expense are necessary. In addition to this, this work has increased in value by adding an appendix on "Ancient and modern Musicians" (Vaggeyakarakas). Being a first effort, there may be the possibility for any deserving alterations or additions. But it is doubtless that the book will enlighten music- students and music scholars on several novel matters with authority. On this Sri Satyanarayana Murthy deserves to be congratulated. It is my blessing that this work will be respected as a meritorious work by the musical world in Andhra.

(Sd) Rallapalli Anantakrishnasarma.

---

# సంగీత కళాభిమానులారా?

గానకళావిశారద, శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారిచే రచింపబడిన "సంగీత శబ్దార్థ చంద్రిక" యను సంగీత నిఘంటు గ్రంథ ప్రచురణము ది 5-10-54 తేదీ సాయంకాలము 6-30 గంటలకు సంగీతకళానిధి శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడుగారి అధ్యక్షతన, ఆంధ్ర ప్రభుత్వ విద్యాశాఖా మాత్యులు గౌ॥ శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావుగారి సముఖమున జరుపబడును.

సుమారొక వత్సరము పూర్వము మేము స్వతంత్రించి మిమ్ము విరాళములడిగిన విషయము మీకు జ్ఞప్తియందుండే వుండును. అప్పటిలో మేమీ కార్య మసాధ్యమని యభిప్రాయపడ్డాము. కాని శ్రీ చెరుకూరి రామనాధబాబు, శ్రీ నిడమర్తి సూరయ్య, శ్రీ హెచ్. టి. వాసుదేవరావు, శ్రీ మాజేటి రామమోహనరావుగార్ల వుదార విరాళములతో మా ఆశయాన్ని కొంతవరకు సాధించగలిగాము. దీనికితోడు ఆంధ్రదేశమునందలి కర్నాటక సంగీతాభిమానులు విరివిగా ఒసంగిన విరాళములద్వారా మా అంచనా ప్రకారము వలయు నిధిని చాలవరకు సేకరించగలిగాము.

కర్నాటక సంగీత శాస్త్రము, దాని అభివృద్ధులయం దాసక్తిగల ఆంధ్ర ప్రముఖులు విరాళములకై మేముచేసిన విజ్ఞప్తిలో తమ పేర్లనుకూడ చేర్చుకొన సమ్మతించినపుడే మా యీ కార్యక్రమము జయప్రదమగునను నమ్మకము కలిగినది.

మా విజ్ఞప్తిద్వారా మాకు లభించిన బహుముఖ ఆదరాభిమానములవలననే భారతదేశ సంగీత శాస్త్ర చరిత్రలో మొట్టమొదటిసారిగా ఒక లక్షణజ్ఞుడు తన గ్రంథమును ప్రజలొసంగిన విరాళములద్వారా ప్రచురించగలిగిరి. ఇటువంటి చరిత్రాత్మకమైన సంఘటన ప్రప్రథమముగా ఆంధ్రదేశములో - అందులో ఆంధ్రరాష్ట్రము యేర్పడిన తొలి వత్సరములోనే జరిగినందుకు మనమందరము యెంతో గర్వించదగినది.

రాబోవు తరములవారికి సైతము సంగీత శాస్త్రమునందుగల యీ విలువైన గ్రంథమత్యంతోపయుక్తమని మహా విద్వాంసులీ గ్రంథముపై తమ అమూల్యాభిప్రాయములను వ్యక్తముచేసిరి. ఈ గ్రంథ ముద్రణకై రచయితకుచేసిన సన్మాన, ధన బహూకరణ సభలకు, మద్రాసు విశ్వవిద్యాలయపు భారతీయ సంగీత శాస్త్ర ప్రధానాధికారియగు ప్రొఫెసర్ శ్రీ పి. సాంబమూర్తి (బి. ఏ; బి. యల్;) గారు అధ్యక్షత వహించుటయు, వారే ఈ గ్రంథమునకు తొలిపలుకులు వ్రాయుటయు ఈ గ్రంథమున కెంతయో విశిష్టత యేర్పడినదనుట నిర్వివాదాంశము.

మా యీ ప్రయత్నానికి ప్రతిదశలోను మాకొసంగిన సహాయ సహకారములతోకూడిన సలహాలకు సంగీత కళానిధి శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడుగారికి మేమెంతయు కృతజ్ఞులము.

ఆంధ్రదేశమున కర్నాటక సంగీతశాస్త్ర జ్ఞానము విస్తృతముగావలెనను ఆశయముతో గ్రంథకర్త తన గ్రంథవిక్రయ ధనమునందుగల కొంతభాగముతో పేద విద్యార్థులకొక ఉచిత సంగీతవిద్యాలయము నెలకొల్పుటకుగాను విజయవాడ శ్రీ కనక దుర్గా కళాసమితివారికి 200 గ్రంథ ప్రతులను బహూకరించుట ముదావహము.

విజయవాడ,
1-10-54.

కె. జగన్నాథన్.
డి. కృష్ణమూర్తి.

# సంగీత శబ్దార్థ చంద్రిక



**అంక:**— తొమ్మిది అంకెను తెలియ జేయు పదమునకుగల పేరు. ఇది 'స్వరార్ణవము' అను గ్రంథములో 9 వ స్వరస్థానమైన శుద్ధధైవతమును తెలుపుటకు ప్రయోగింపబడినది.

**అంక్య:**—ఒక రకపు డమరుకము లేక ఢంకా.

**అకళంక:**— 18 వ శతాబ్దమునకు చెందినట్టియు, సంగీతశాస్త్రములో సంస్కృతమునందు 'సంగ్రహ చూడామణి' అను గ్రంథమును రచించినట్టియు శ్రీ గోవిందాచార్యునికివ్వబడిన బిరుదు.

**అకార సాధకము:**— సంగీతమును గాత్రమున ప్రదర్శించుటకై యభ్యసించునపుడు గాత్రము చక్కగా పలుకుటకు స్వరావళ్యాదులను 'అ' అను అచ్చు అక్షరముతో త్రికాలముగాని లేక షట్కాలముగాని సాధకముచేయుదురు. దీనినే అకార సాధకమని చెప్పుదురు. ఇట్లు చేయుటలో సంగీతములోని సాహిత్యమునందలి సంగతులు గాత్రమున బాగా పలుకుటకు తగినటుల 'అ' నేగాక ఇ, ఉ, ఎ, ఒ, అను అచ్చు అక్షరములనుగూడా షట్కాలము సాధకము చేయుదురు. ఇట్లు చేయుట వలన గాత్రము బాగా పలికి సంగతులు గిర్రున తిరుగుచు వినుటకు మాధుర్యముగా నుండును. మరియు పై కాలములోని సాహిత్యమునందలి సంగతులుగాని, రాగమునందలి సంగతులుగాని విస్పష్టముగా పలుకుటకు ఈ అకార సాధకము యెంతయు సహాయకారిగా నుండును.

**అకారసాధనై:**— అకార సాధకమునకు తమిళమునందు వాడినపదము.

**అంకి:**— చిన్నదైన ఒక రకపు చర్మ వాద్యము అంకి యనబడును.

**అంకిన్:**— చర్మ వాద్యములలోని ఒక రకపు వాద్యము.

**అంకియగీతము:**—అస్సామ్ నాటకములలో వినపడుచుండు కథాగానము.

**అంకిల్ బెల్స్ (Ankle Bells):**— నర్తకులును, హరికథా కాలక్షేపములు చేయు భాగవతారులును, నృత్యముకొరకు తమ పాదములకు కట్టుకొను చిన్న గజ్జెలకు ఇంగ్లీషులో చెప్పబడు పేరు.

**అఖిల రాగమేళ వీణ:**— దక్షిణ భారతములో యీ కాలమునందు వాడబడు చున్న వీణకు పేరు. ఇరువదుగల మెట్లు అన్నియు కదలకుండునటుల వీణకు బిగింపబడి యుండును. ఈ మెట్లను కదల్పకనే

సంగీతమును వివిధ రాగములందు ప్రదర్శింపవచ్చును. ఇది సర్వరాగమేళ వీణను బోలియుండును.

**అఖిలరాగమేళ శుద్ధమేళ వీణ:—** సోమనాథుని 'రాగవిబోధ' మను గ్రంథములో చెప్పబడిన 5 వీణలలో 2 వ వీణ. [రా. బో. అనుబంధము 2 లో చూడుము.]

**అఖిలరాగమేళమధ్యమేళవీణ:—** ఇదియు 'రాగవిబోధ' మను గ్రంథమున జెప్పబడిన 5 వీణలలో మూడవవీణ [రా. బో. అనుబంధము 3 లో చూడుము.]

**అగ్గం:—** చర్మసంబంధమైన పటహవాద్యములలోని 12 రకములలో నొకటి.

**అగండి:—** ఒకరకపు సంగీత వాద్య విశేషమునకు అగండియని చెప్పబడును.

**అగప్పైక్కిన్నరి:—** బాణమువలె వంగియుండి ఒకే తీగెను కలిగిన వాద్యమునకు తమిళమున పేరు. వీటిలో కొన్నిటికి రెండు తీగెలుకూడ వుండును. ఒక కొబ్బరిచిప్పమీద చర్మము మూయబడి వుండును. దీనికి వెదురుచెక్క బిగింపబడి కొబ్బరిచిప్ప మధ్యభాగముగుండా చెక్కమీదకు తీగెబిగింపబడును. దీనికి మెట్లుండవు. గనుక వయొలిన్ మీదవలె వ్రేళ్ళతోనే తంతినినొక్కుచూ వాయింపవలెను. ఈ వాద్యము షుమారు 18 అంగుళము లుండును. ధ్వని విశేషము ఖంగుమనుచుండును. కాని క్రమముగా నివి పొడుగు తీగెలు కలిగియుండి, వినుటకు తగిన ధ్వని విశేషముగల వాద్యములుగా యేర్పడి ప్రచారములోనికి వచ్చినవి. ఇది [illegible]స్త్రమును బోలియుండునని తెలియుచున్నది.

**అగత్తియమ్:—** అగస్త్య మహర్షిచే రచింపబడినట్లు చెప్పబడిన తమిళములోని నొక సంగీత శాస్త్ర గ్రంథము.

**అంగతాళము:—** 'భరతనాట్యశాస్త్ర' మను తమిళమునందుగల సంగీత గ్రంథము లోని ఒక తాళము.

**అంగతాళములు:—** ఆయా తాళములకు గల అంగములచే లెక్కింపబడునవి. [illegible] 108 తాళములు యీరకములోనివి.

**అంగము:—** సంగీత రచనలోని ప్రతి భాగమునకు అంగమని చెప్పబడును. (అంగము = భాగము) కృతి లేక వర్ణము లోని పల్లవి, అనుపల్లవి, చరణము అను వాటిని అంగములని చెప్పుదురు.

**అంగము:—** సంగీత కాలమును లెక్కించుట కుపయోగింపబడు షడంగములలో నొక్కొక్కటి అంగము అని చెప్పబడును. ఇవిఆరు. అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము.

**అంగము:—** తాళదశ ప్రాణములగు కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారములలో నాల్గవది యగును.

**అంగము:—** స్వరాష్టకమగు 'సరిగమ పధనిస'లో 'సరిగమ' అనెడి మొదటి

చతురశ్రస్థాయిని పూర్వాంగ మనియు, "పధనిస" అనెడి రెండవ చతురశ్రస్థాయిని ఉత్తరాంగమనియు చెప్పుదురు. గనుక యీ రెండుభాగములలోని ప్రతి ఒక భాగము అంగమని చెప్పబడును.

**అంగము :—** భావశాస్త్రమునందు చెప్పబడిన వ్యభిచారి భావము యేర్పడునట్టి ముదటి 3 విధములగు వాక్య, అంగము, సత్వములలో 2 వది అంగమని చెప్పబడును. ఈ వ్యభిచారి భావము 33 విధములుగా నున్నది. [గా. భా. 434 పేజీ చూడుము]

**అంగసంజ్ఞ :—** తాళషడంగములగు అనుద్రుత ◡, ద్రుత 0, లఘు I, గురు 8, ప్లుత 8̀, కాకపాద + ములకివ్వబడిన యీ గుర్తులకు "అంగ సంజ్ఞ" అని చెప్పబడును.

**అంగహార :—** నృత్యములో గల వివిధ రకములైన కదలికల సమూహము.

**అంగహారి :—** 1. కదలికల సమూహము. 2. నృత్య ప్రదర్శనశాలకు పేరు.

**అంగలతా :—** 28 వ మేళకర్తయగు హరికాంభోజియొక్క జన్యరాగము.
ఆరోహణము :— స గ రి గ మ ప ని ధ ని స.
అవరోహణము :— స ధ మ గ రి మ గ స.

**ఆంగికాభినయము :—** శరీరావయవముల యొక్క కదలికలకు పేరు.

**అగ్ని :—** 72 మేళకర్తలలో 13 నుండి 18 వరకు గల 6 మేళకర్తలు గల 3 వ చక్రమునకు వెంకటమఖి పెట్టిన పేరు.

**అగ్ని-గో :—** వెంకటమఖి కల్పించిన 12 మేళచక్రములలో 3 వ అగ్నిచక్రములోని 3 వ మేళమగు 15 వ మేళకర్త మాయామాళవగౌళకు వెంకటమఖి పెట్టిన సంకేత నామము.

**అగ్ని-పా :—** మూడవ అగ్నిచక్రములోని 1 వ మేళమగు 13 వ మేళకర్త గాయకప్రియకు గలసంకేత నామము.

**అగ్ని-భూ :—** మూడవ అగ్నిచక్రములోని 4 వ మేళమగు 16 వ మేళకర్త చక్రవాకమునకు గలసంకేత నామము.

**అగ్ని-మా :—** మూడవ అగ్ని చక్రములోని 5 వ మేళమగు 17 వ మేళకర్త సూర్యకాంతమునకు గల సంకేతనామము.

**అగ్ని-శ్రీ :—** మూడవ అగ్ని చక్రములోని 2 వ మేళమగు 14 వ మేళకర్త వకుళాభరణమునకు గలసంకేత నామము.

**అగ్ని-షా :—** మూడవ అగ్నిచక్రములోని 6 వ మేళమగు 18 వ మేళకర్త హాటకాంబరికి గలసంకేత నామము.

**అగ్నికోపము :—** 20 వ మేళకర్తయగు నఠభైరవియొక్క జన్యరాగము.
ఆరోహణము - స గ మ ప ని స.
అవరోహణము - స ని ప మ గ రి స.

**అగ్నిదార :—** 27 వ, మేళకర్తయగు సరసాంగియొక్క జన్యరాగము.
ఆరోహణము - స రి గ మ ప మ ని ధ ని స.
అవరోహణము - స ని ధ మ రి స.

**అంగురు :—** 7వ మేళకర్తయగు సేనాపతియొక్క జన్యరాగము.
ఆరోహణము - స గ మ ధ ని స.
అవరోహణము - స ని ధ మ గ స.

**అంగుసత్రేణి :—** ఇది హంసధ్వని రాగముయొక్క ప్రఖ్యాత మహారాష్ట్రమని నందనార్ చరిత్రముయొక్క ప్రథమ ప్రచురణయందు తెలుపబడినది. అనగా హంసధ్వని రాగము అనుటకు బదులు అచ్చు తప్పుగాబడిన పేరు.

**అంగుళిస్థాన్ :—** సంగీత వాద్యముయొక్క దండికి గల (ఫింగర్ బోర్డు)పేరు.

**అంఘ్రి :—** మాతంగునియొక్క "బృహద్దేశి" అను గ్రంథమునందు జెప్పబడిన యొక రాగము.

**అజ్ఞాతయౌవనే :—** నాయికా లక్షణములందు జెప్పబడిన మూడువిధములగు నాయికలలో మొదటిదైన స్వీయనాయిక యందలి 5 రకములలో 2 వది.

**అచలనాట :—** 36 వ, మేళకర్త యగు చలనాటయొక్క జన్యరాగము.
ఆరోహణము - స రి గ మ ధ ని స.
అవరోహణము - స ని ధ మ గ రి స.

**అచలవీణ:—**ద్వావింశతి శ్రుతులను ప్రదర్శించుటకు ప్రయోగార్థముగా శార్ఙ్గదేవునిచే వుపయోగింపబడిన యొక రకపు వీణకు పేరు. దీనినే ధృవ వీణ అనికూడా చెప్పుదురు. దీనిలో తంత్రులు యెత్తుపల్లములు లేక సమముగా నుండును.

**అచలస్వరములు :—** సప్తస్వరములగు షడ్జ, రిషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములలో వికృతి (మార్పు) చెందని షడ్జ, పంచమము (స. ప) లు అచలస్వరము లనబడును.

**అచ్యుత మధ్యమ:—** శుద్ధమధ్యమ స్వరమును బోలిన స్వరమునకు పేరు. దీని స్వాభావికము (F Natural) 4/3. దీనికిని, శుద్ధ మధ్యమముకంటె కొంచెము తక్కువైన చ్యుత మధ్యమ గాంధారమునకును తేడాగలదు. ఈ తక్కువ స్వరముయొక్క ప్రకంపనము 81/64 వుండును.

**అచ్యుత రాజేంద్రమేళ వీణ :—** 'స్వరమేళకళానిధి'లో రామామాత్యునిచే పేర్కొనబడిన ఒకవిధమైన రుద్రవీణకు పేరు. ఈ వీణలో పైన 4 తంత్రులుండును. అవి, 1 మంద్రపంచమము, 2 మంద్రషడ్జము, 3 అనుమంద్ర పంచమము, 4 అనుమంద్ర షడ్జము అను స్వరములకును ప్రక్క 3 తంత్రులు మధ్య షడ్జ, మంద్రపంచమ, మంద్రషడ్జ స్వరములకును శృతిచేయబడును.

**అచ్యుత షడ్జము :—** షడ్జ స్వరమునకు సమానమైన స్వరమునకు పేరు. దీనికిని, షడ్జముకంటె కొంచెము తక్కువైన చ్యుత షడ్జ నిషాదమునకును తేడాగలదు. ఆ తక్కువ స్వరముయొక్క ప్రకంపనము 243/128 అగును.

**అచేతనము :—**హరిపాలదేవుని "సంగీత సుధాకరము" గ్రంధములోని సంగీతస్వరముల విభజనలోగల 3 రకము

లలో 2 వ ది. వీణ వయొలిన్ వంటి అచేతనమైన వస్తువులనుండి ధ్వని వచ్చునపుడు అచేతన మనబడును.

**అజంతా గుహలు** :— హైదరాబాదు సంస్థానములోని ప్రపంచ ప్రసిద్ధమైన వివిధ సంగీత వాద్యముల శిల్పములు గల నొక ప్రదేశము.

**అజని** :— వేగవాహిని మేళమునందు జన్యమైన ఒక భాషాంగరాగముగా 'చతుర్దండి ప్రకాశిక' యొక్క అనుబంధ గ్రంథములో జెప్పబడిన యొక రాగము.

**అజపానటనమ్** :— దక్షిణ భారత దేశమున గల తంజావూరు జిల్లాలోనున్న 'తిరువారూరు' లోని త్యాగరాజస్వామి దేవుని విగ్రహముతో అనునయింపబడు నృత్య విశేషము.

**అజగర్‌కురవంజి**:—(Azhagar Kuravanji) కవికుంజర భారతి తమిళములో వ్రాసిన కురవంజి రకమునకుచెందిన నాటకము.

**అంజనావతి** :— 43 వ మేళకర్తయగు గవాంబోధియొక్క జన్య రాగము.
ఆరోహణము :— స రి గ మ ప ధ స.
అవరోహణము :— స ధ ప మ గ రి స.

**అంజనగీతము** :— కథా కాలక్షేపములలో పాడబడు ఒకరకమైన పాట.

**అంజలి** :— నృత్యములో నుపయోగింపబడు ముద్రలలో నొకరకము.

**అంజి** :— కురవంజి నాటకప్రదర్శనములలో వుపయోగించు నృత్యపదము. తెలుగులో పదము అని అర్థము.

**అఝుంగు** :— (Azhungu) పురాతన తమిళ పద్ధతిలో "పాలైయాళ్" (Palaiyazh) 20 ఉత్పత్తులలోనొకటి.

**అటచాపు** :— ప్రాచీనకాలములో వాడుకలోనున్న చాపుతాళములలోని యొకరకపు తాళమునకు పేరు. దీనికి 7 అక్షర కాలము. అది 1 ఖండ లఘువు 1 ద్రుతముగా నుండును. దీనినే పూర్వులు 1 లయ (ఘాత) 4 గురువులు (4 వ్రేళ్లు) 1 లయ (ఘాత) 1 విరామము (ఉసి) అనగా 1+4+1+1=7 అక్షర కాలముగా చెప్పినట్లు తెలియుచున్నది. కాని దీనినే మనము యిప్పుడు 1 ఖండ లఘువు. 1 ద్రుతమని చెప్పవచ్చును.

**అటంత** :— కథాకళి సంగీతములో, అటతాళమునకు వాడిన పేరు.

**అటతాళము** :— ప్రముఖమైన ధృవాది సప్త తాళములలో 6వ తాళమునకు పేరు. దీనికి అంగములు, 2 లఘువులు, 2 ద్రుతములు. అంగసంజ్ఞ ।।00. అక్షరకాలము లఘువుయొక్క జాతినిబట్టి వరుసగా 10 గాని, 12 గాని, 14 గాని, 18 గాని, 22 గాని వుండును.

**అటతాళము**:— శార్ఙ్గదేవుని "సంగీత రత్నాకర" మను గ్రంథములోని120తాళములలో 108 వ తాళమునకు పేరు. దీని అంగములు 0।।.

**అటతాళము :—** అష్టోత్తరశత తాళము లలో గల మొదటిది చచ్చత్పుటాది పంచ తాళములు 5 ను చేర్చి యేర్పడిన మొత్తం 108 తాళములలో 72 వ తాళమునకు పేరు. దీనికి అంగములు I O O I. మాత్రలు 3. అక్షరకాలము 12. గనుక లఘువులు రెండును చతురశ్ర లఘువు లుగా యెంచుకొనవలెను.

**అటాణా :—** 29 వ మేళకర్త యగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య రాగము.
ఆరోహణము — స రి మ ప ధా ని స.
అవరోహణము — (1) స ని ధా ప మ ప గా రి స. (2) స ని ప మ గ మ రి స.

**అటాణి :—** అటాణా రాగమునకు సరి పోవునట్టిదే ఒక రాగము.

**అడక్కుస్వరమ్ :—** రాగభావమునకు వ్యతిరేకమైనట్టి స్వరమునకుగల పేరు. వివాదిస్వరమును బోలియుండును. ఈ పేరు 'భారతసేనాపతీయము'పై వ్రాయ బడినట్టి వ్యాఖ్యాన గ్రంథములో గలదు.

**అడంగన్ముఱై :—** తేవారములు రచించిన తిరుజ్ఞాన సంబందర్, అప్పర్, సుందరర్, అను ముగ్గురియొక్క సమూహ రచన లకు పేరు.

**అడవు :—** నాట్యమును యభ్యసించు ప్రతి విద్యార్థి ప్రథమములో నేర్చుకొను ప్రాథమిక అభ్యాసములగు పదముల కదలికలకు పేరు. ఇవి కర్నాటక సంగీతములోని స్వరావళికి అనుగుణముగా నుండును.

**అడవుజాతులు :—** నాట్యము నేర్చుకొను విద్యార్థి ప్రథమంలో నేర్చుకొను ప్రాథ మిక అభ్యాసములోని జాతులకు పేరు.

**అండాళికురింజి :—** తమిళములో గల 'తేవారమ్' అను సంగీత రచనలో కను పడు నొకవిశేషమైన 'పణ్'కుగల పేరు. ఇది మనము ప్రస్తుతము పాడుకొను సామ రాగమునకు సరిపోవునదిగా నుండును.

**అడి :—** కీర్తనలో గల ఒక భాగమును, లేక ఖండికకు పేరు. కొన్ని కీర్తనలలోగల భాగము లన్నియు ఒకే రకపు సంగీతము నందు పాడబడుచుండును. అట్టి కీర్తనలు మొదటిభాగము స్వరముతో వ్రాయబడి, మిగతాభాగములు అదేవిధముగా పాడు కొనవలయునని వ్రాయబడి వుండును.

**అడి :—** నృత్యపదమునకుగల ఒక పేరు.

**అడిల్లకము :—** స్నిగ్ధమై, మధురమై, సౌకు మార్యముగలదై, మంద్ర,మధ్యమములందు ప్రౌఢివహించి కఫమువలనబుట్టిన శబ్ద మును అడిల్లక మనబడును.

**అడుగు :—** నృత్యముచేయునపుడు పాద ములకు గజ్జలు కట్టుకొని తాళముతో కూడిన జతులనడకకు తగినట్లుగా పాద ముల నుంచుటను అడుగువేయుట అందురు.

**అడైవు :—** ఇదియు అడవుమాదిరిగానుం డును. విద్యార్థి నాట్యమునభ్యసించు పుడు మొదట నేర్చుకొను ప్రాథమిక అభ్యాసములగు పదముల కదలికకు పేరు.

**అణి :**— సంగీత రచనలోని యేదైన ఒక నిర్దిష్టమైన కళ. అనగా సంగతి, స్వరాక్షర, చిట్టస్వర, స్వరసాహిత్యములు అను నవి యిందులోని ముఖ్య భాగములగును. ఇవి మూడురకములుగా నున్నవి.

**అన్సైను :**— సంగీతవాద్యములలో గాత్రి వాద్యమునకు పైన అమర్చబడుట్టి లోహపు తంతమునకు పేరు.

**అంత్యప్రాస :**— సంగీత రచనలలోని చరణము లేక పాదములయొక్క అంత్యాక్షరముల పోలికకు పేరు. ఇట్టి అంత్య ప్రాసలు జయదేవుని 'గీతగోవిందము' నందలి అష్టపదులలోను, సదాశివ బ్రహ్మేంద్రముయొక్క 'శివాష్టపదుల' వంటి మరికొన్నియితర రచనలలోను గల చరణములందున్నవి.

**అంతర :**— వ్యవధి లేక తేడాకు పేరు. అనగా ఉ|| 22 శృతుల యందలి 5 వ శృతియగు చతుశ్శృతి రిషభమునకును, 7 వ శృతియగు సాధారణ గాంధారమునకును మధ్య అంతరము 2 శృతులుగా నెరుగునది.

**అంతర & కాకలి :**— సామగాన శ్రేణి యొక్క కాలము తరువాత మానవుడు తెలుసుకొనిన రెండు స్వరములగు అంతర గాంధార, కాకలీ నిషాదము లనునవి.

**అంతరక్రీడ :**— అష్టోత్తర శతతాళము లగు 108 తాళములలో 63 వ తాళము నకు పేరు. దీనికి అంగములు 0 0 0 ◡ మాత్రలు 1¾. అక్షరకాలము 7.

**అంతరప్రక్రీడా తాళము :**— శార్ఙ్గదేవుని రత్నాకర గ్రంథమునగల 120 తాళము లలో 95 వ తాళమునకు పేరు. దీని అంగములు 0 0 0 ◡.

**అంతరకొట్టు :**— నృత్యమునకు పూర్వము చేయబడు ప్రదర్శనమునకు పేరు. ఇది 'కలప్పదికారం' అను తమిళ గ్రంథమునందు పేర్కొనబడినది.

**అంతరకొట్టు :**— నాటకమునకుముందట ప్రదర్శించు నొకరకమైన నృత్యము.

**అంతరగాంధారము :**— సప్తస్వరముల లోని మూడవ స్వరమైన గాంధారము లోని మూడురకములలో తీవ్రజాతికి చెందిన 3 వ గాంధారమునకు పేరు. దీనికి శంకరాభరణరాగము ఒక ముఖ్య ఉదాహరణముగా తీసుకొనవచ్చును.

**అంతరదుందుభి :**— స్వర్గసంబంధమైన ఒక రకపు చర్మవాద్యమునకు పేరు.

**అంతరధ్రువ :**— నాటకములందు పాడ బడు ఒకరకమునకు చెందిన పాటకు పేరు.

**అంతరభాష :**— సంగీత రత్నాకరమున చెప్పబడినమార్గసమూహమునకుచెందినఒక రాగము.

**అంతరభాషాకిరణావళి :**— సంగీత రత్నాకర గ్రంథములో పేర్కొనిన 'కిరణావళి' రాగముయొక్క రకమునకు చెందిన రాగము.

**అంతరభాషాభాషావలిత :—** సంగీత రత్నాకరములో చెప్పబడినట్టియు,ఇప్పుడు వాడుకలో లేనట్టి యొక రాగము.

**అంతరభాషాశాకావలిత :—** ప్రస్తుతపు ఆచరణలోలేని సంగీత రత్నాకరములో చెప్పబడిన మరియొక రాగము.

**అంతరభాషారాగము :—** సంగీత రత్నాకరములో పేర్కొనబడి మార్గ రాగము లోని 6 విధములలో 6 వ రాగము.

**అంతరమార్గ :—** రాగములకు సంబంధించిన త్రయోదశలక్షణములలో నొకదానికి పేరు. ఇది రాగమునకు ఇతరమైన స్వరముగాని లేక అన్యరాగమునుగాని ప్రవేశ పెట్టుటగును. ఇట్టిది కొన్ని రాగములలో మాత్రమే సాధ్యమగును. ఇటులచేయునపుడు రంజకముగను, రాగ అలంకారము చెడకుండునట్లుగను చూడవలెను.

**అంతరవాహిని :—** 29 వ మేళకర్తయగు ధీరశంకరాభరణరాగముయొక్క జన్యరాగము.
ఆరోహణము:— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము:— స ని ధ ప మ గ రి స.

**అంతరా :—** భరతునిచే జెప్పబడిన గాంధారముయొక్క వికృత రకము.

**అంతరా :—** హిందూస్థానీ సంగీత మాధుర్యములలోని రెండవ భాగము.

**అంతరి :—** 'శిలప్పదికారము' అను ప్రాచీన తమిళ గ్రంథమందు చెప్పబడిన చర్మ వాద్యములలోని ఒక రకము.

**అంతరి :—** అనగా ముగించుటయని అర్థము. గీతముయొక్క రెండు భాగములను కలుపు సంగీత పదసమూదాయమునకు పేరు. రాగాంగ రాగ లక్షణ గీతములందు సూత్రఖండమునకు, ఉపాంగఖండమునకు నడుమ, ఉపాంగ ఖండముపూర్తి చేయునపుడును, భాషాంగ ఖండమును ప్రారంభించునపుడు ఇట్టిదియుండును. ఉ॥ రవికోటి తేజ. [మా. గౌ. రా.]

**అంతలవరాతి :—** 'సంగీత సమయసారము'లో చెప్పబడిన ఒక సంపూర్ణ ఉపాంగరాగమునకు పేరు.

**అతి అతి కోమలము :—** అతికోమలను కంటె 1 శ్రుతి తక్కువగను, కోమలను కంటె 2 శ్రుతులు తక్కువగనుండు స్వరమును తెలియజేయునది.

**అతి కోమలము :—** కోమల స్వరము కంటె 1 శ్రుతి తక్కువైన స్వరమును తెలియజేయునది.

**అతిచిత్రతమ మార్గము :—** మార్గ భేదములలోని 6 వ ది. ప్రతి తాళాక్షరమునకు నాల్గవవంతు మాత్రాకాలముండును. ఉ॥ 'శ్రీ మహాగణపతి' అను గౌళరాగములోని దీక్షితులవారి కృతి ఈ అతిచిత్రతమమార్గమునకు చెందినది.

**అతిచిత్రము :—** తాళముయొక్క కాల ప్రమాణమునందు తెలిపిన దశ ప్రాణములలో 2 వ దైన మార్గములోగల 6 భేద

ములలో పదక హ్రస్వాక్షర ప్రమాణము గల 6 వ భేదము అతిచిత్రమనబడును.

**అతితగ్గుస్వరము :—** ప్రపంచములోగల ఆర్గనులన్నిటిలో పెద్దదైన ఐరోపా దేశమందలి నొక వాద్యములోని మొదటి స్వరమునకు వేపనములు $16\frac{1}{2}$ మాత్రమే యగుటవలన యీ మొదటి స్వరమునకు పాశ్చాత్యులు నిర్ణయించిన పేరు.

**అతితారస్థాయి:—** పంచస్థాయిలగు అనుమంద్ర, మంద్ర, మధ్య, తార, అతితార స్థాయిలలో 5 వ దానిని అతితార స్థాయి అని చెప్పుదురు. దీనికి గుర్తుగా స్వరముల పైన రెండేసిచుక్కలుండును. ఉ॥ స̈ రి̈ గ̈ మ̈.

**అతితీవ్రము:—** తీవ్ర స్వరముకంటె ఒక శృతి యెక్కువగల స్వరము.

**అతిదేశకము:—** భావశాస్త్రమందు చెప్పబడిన వాగారంభాను భావములు 11 లో 8 వది 'అతిదేశక' మని చెప్పబడును.

**అతివిస్రబ్ధనవోఢ:—** నాయికాలక్షణమందు జెప్పబడిన మూడువిధములగు నాయికలలో మొదటిదైన స్వీయనాయికలోని 5 భేదములలో 5 వది. [గా. భా. 435]

**అతిస్వార్యః:—** సామగానమునందు పలుకు 'గా రీ సా నీ ధా పా' అనెడి 6 స్వరములలో 6వది 'అతిస్వార్య' యనబడును.

**అతిసూక్ష్మము:—** నాదము, మనుష్యుని లోపలినుండి యూర్ధ్వముగా బయలు



వెడలుటలో నాభియందుండునపుడు 'అతిసూక్ష్మ' మనబడును.

**అతిహెచ్చుస్వరము:—** ప్రపంచములో గల ప్రాముఖ్యమైన ఆర్కెస్ట్రాలలో నొకటైన "ఫిల్హార్మోనిక్" ఆర్కెస్ట్రాలో గల నొక వాద్యమందలి అతిహెచ్చుస్వరమునకు వేపనములు సెకండుకు 4752 గా వున్నందున యీ హెచ్చు స్వరమునకు పాశ్చాత్యులు పెట్టిన పేరు.

**అత్తిని:—** హస్తిని అనుపదమునకు తమిళరూపము. శృంగారశాస్త్రములో చెప్పబడియున్న నాలుగు రకముల స్త్రీలలో తక్కువ రకము. మిగిలినవి చిత్రిణి, పద్మిని, శంఖిణి అనునవి.

**అతీతగ్రహకీర్తన:—** తాళాంత్యమున గాని, లేక తాళము వేయుటకుముందుగాని ప్రారంభించునట్టి కీర్తనలకు పేరు. ఉ॥ సింధుమందారిరాగము, ఆదితాళము లోని "శ + రణించుటకిదె" అనుకృతి యిందుకొక ముఖ్యవుదాహరణ మగును.

**అతీతగ్రహపల్లవి:—** పల్లవిని ప్రారంభించునపుడు ఎడుప్పుతో + $\frac{1}{4}$ గాని, + $\frac{1}{8}$ గాని, + $\frac{1}{16}$ గాని, + $\frac{3}{4}$ గాని, అక్షరకాలము తాళము వేయుటకు ముందుగా కలిపి ప్రారంభించు పల్లవి.

**అతీతగ్రహము:—** సంగీతరచనలలోని యే భాగమునైనను తాళాంత్యమునగాని, లేక తాళముప్రారంభించుటకు ముందు గాని మొదలిడు తావునకు అతీతగ్రహమని పేరు (గ్రహము = ఎత్తుట). ఉ॥ భైరవిరాగము,

అటతాళములోని "విరిబోణి" వర్ణములో చరణము తరువాత ప్రారంభించు 1, 2 ఎత్తుగడ స్వరములగు (1) మప+గా, రీస. (2) ధా+నినిసధా. అనునవి రెండును యిందుకు ముఖ్య వుదాహరణము లగును. ఇందు మొదటి ఎత్తుగడ స్వరములోని "మప" రెండవ ఎత్తుగడ స్వరములోని "ధా" ఇవి రెండును తాళము ప్రారంభించుటకు ముందుగానే పాడి తాళముతో మిగత భాగమును పాడుకొనవలెను.

**అతీతము:**—"సంగీతకాముది" అను లక్షణ గ్రంథములో చెప్పబడిన 9 గ్రహములలో 4 వ దానికి అతీత మని పేరు.

**అంపాళి:**—"కుడుంజియాజ్" నుంచివచ్చిన 32 గతములలో ఒకదానికి పేరు. ఇది పురాతన తమిళ సంగీతము యొక్క ప్రాసమిక పద్ధతి.

**అదిర్వు:**—'యాజ్' అనువాద్యము వాయించునప్పుడు ప్రతివిద్వాంసుడు అనగమించవలసిన 4 లోపములలో ఒకదానికి గల పేరు. ఇది "శిలప్పదికారమ్" అను ప్రాచీన తమిళ గ్రంథములో జెప్పబడినది. ఆనెర్వ యాజ్ యొక్క క్రింది తీగలు మీటినప్పుడు వచ్చునది. ఇది తీగలు మీటిన తరువాత తీగలు తేలికగా నొక్కుటవల్ల పోవును. దీనిని చేతితోగాని చిన్న కర్రపుల్లతోగాని నొక్కి చేయవచ్చును. ఈ పద్ధతిననుసరించే "పియానో" వాద్యములో నొక్కుడు పద్ధతి యేర్పడి యుండవచ్చును.

**అధమరాగము:**—'రామామాత్యులు' తన "స్వరమేళకళానిధి" గ్రంథములో సంగీత రచనలకు ఆయా రాగములు సహజముగా నుపయోగపడు యోగ్యతనుబట్టి రాగములను ఉత్తమ, మధ్యమ, అధమ, అను 3 విచిత్రమైన రీతులుగా విభజించెను. వాటిలో 3 వ దానికి అధమరాగమని పేరు. ఈ విభజనను 'సోమనాథుడు' కూడా బలపరచెను. కాని కాలక్రమముగా యీ విభజన అంతరించెను. ఇది గీత, ప్రబంధ, తాయ, ఆలాపములు చేయుటకు యోగ్యము కానిదయు, సంకీర్ణమైనదియు, పాటలు భ్రమింప దగినదియు, ప్రచారము లోనుండునట్టి రాగమని చెప్పబడెను.

**అధమవాగ్గేయకారకుడు:**— వాగ్గేయకారకులలోని 3 రకములలో 3 వ రకమునకు చెందినవానికి గల పేరు. ఇతడు మనోహరముగ మాతువు (సాహిత్యము)ను రచింపగల్గినను, ధాతు (స్వర) జ్ఞానము మందమైన వాడుగానుండును.

**అధమాధమవాగ్గేయకారకుడు:**— వాగ్గేయకారకులలో అన్యులు రచించిన ధాతువు (స్వరము) నందు తన మాతువు (సాహిత్యము)ను చేర్చువానికి పేరు. వీనినే కుట్టికారుడనియు చెప్పబడును.

**అధ్యాత్మరామాయణకీర్తనలు:**— 'సుబ్రహ్మణ్యకవి'చే తెలుగులో వ్రాయబడిన ప్రఖ్యాత గ్రంథమునకు పేరు. ఈతడు రామాయణ గాథను నూటొక్క కీర్తనలలో వివరించెను. ఈ రామాయణములోని 'అరణ్యకాండము'లో రెండు ప్రారంభ కీర్తనలను ఒక అందమైన చూర్ణికను కూడా రచించెను. సంస్కృత తాంత్రికములలో గొప్ప పండితుడైన యీ గ్రంథకర్త చాలా

చోట్ల ఉన్నతమైన భావము తన రచనలయందు ప్రయోగించెను. ఈ కీర్తనలు ఆంధ్ర దేశమున యెక్కువగా ప్రచారములో నున్నవి. ఈ కీర్తనలలో కొన్నిటికి 12 లేక 14 చరణములు కూడ రచింపబడియున్నవి. ఈ గ్రంథములో మంగళ కైశికి, కర్ణాట సారంగ, జుజావంతి, మాళవి, మాళవ, గౌళ, గుమ్మకాంభోజి, జివంటి అప్రసిద్ధ రాగములందు కీర్తనలు గలవు. ఇతడు 19 వ శతాబ్దము పూర్వభాగములో జీవించి యున్నట్లు తెలియుచున్నది.

**అధ్యాత్మ సంకీర్తనలు :—** తిరుపతి తాళ్ళపాకం 'అన్నమాచార్యుని'చే తెలుగులో వేదాంత విషయముగా వ్రాయబడిన కీర్తనలకు పేరు. తాళ్ళపాకము కృతికర్తలగు ఇద్దరిలో మొదటివాడు చిన్నయ్య. రెండవవాడు యీ అన్నమాచార్యులు. వీరి కీర్తనలు యిటీవల తిరుపతి దేవస్థానమువారిచే ప్రకటింపబడుచున్నవి. ఇవి వినుటకు మిక్కిలి రంజకముగా నుండును.

**అధ్యాత్మ వివేకము :—** 'సంగీత రత్నాకర' గ్రంథకర్తయగు 'శార్ఙ్గదేవుని'చే వ్రాయబడిన ఒక వేదాంత గ్రంథము.

**అధివసు :—** 41 వ మేళకర్తయగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము:— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము :— ని ధ మ గ స.

**అధిదేవత :—** వివిధములైన రాగములకును సంగీత వాద్యములకును అధిదేవతలుందురు. ఉ॥ బంగాళారాగమునకు 'గణేశుడు' అధిదేవతయనుచు చెప్పబడినది. ఇందుకు నిదర్శనముగా 'త్యాగరాజు' తన యొక్క రచనలలో మొదటి విఘ్నేశ్వర ప్రార్థనగా రచింపబడిన "గిరిరాజసుత" అను కృతిని 'బంగాళారాగము' నందే వ్రాయబడి యుండుట ముఖ్యముగా గమనింపదగిన విషయము.

**అద్భుత :—** రాగములకు ప్రధానమైన నవరసములగు శృంగార, హాస్య, కరుణ, వీర, భయానక, శోక, రౌద్ర, అద్భుత, శాంత రసములలో 8 వ దానికి పేరు. ఈ రసమునకు ఉదాహరణము బంగాళరాగమని "సంగీత చంద్రిక" యను ప్రాచీన గ్రంథమందు చెప్పబడినది.

**అద్భుదము :—** ఇది 8 వ మేళకర్తయగు 'హనుమత్తోడి'యందు జనించిన జన్యరాగము.
ఆరోహణము :— స గ మ ధ ని స.
అవరోహణము :— స ని ధ మ గ స.

**అనంగతాళము :—** శార్ఙ్గదేవునిచే రచింపబడిన "సంగీత రత్నాకర" గ్రంథమునందు గల 120 తాళములలో 62 వ తాళము. దీని అంగములు । 3 । । 8. అనగా లఘువు ప్లుతము, లఘువు, లఘువు, గురువులనునవి.

**అనంగతాళము :—** అష్టోత్తర శత తాళములగు 108 లో 66 వ తాళమునకు పేరు. దీని అంగములు । 3 । । 8. అక్షరకాలము 32. ఈ 66 సంఖ్య వచ్చునప్పటికి పంచతాళములతో చేర్చి లెక్కింపబడినది.

అనంగాభరి :— ఇది 39 వ మేళకర్త యగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరో :— స రి గ రి మ ప ని ధ ని స
అవ :— స ని ప స మ గ మ రి స.

అనంత :— 17 వ మేళకర్త యగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి మ ప ధ ని స.
అవరోహణము :— స ప మ గ రి స.

అనంత :— రాగాలాపనలో ప్రచ్చరించుటకు దగిన అక్షరసముదాయములో 'అనంత' నామోచ్చారణ మిగుల శ్రేష్ఠమనియు పరమార్థమునకు ప్రపకరించుననియు పూర్వవాగ్గేయకారులు వ్రాసిన పదము.

అనంత :— రాగాలాపన తరువాత పల్లవి పాడుటకు ముందు 'తానమ్' పాడుదురు. ఈ తానమ్ తానమ్ అను పదములయొక్క అంతర్యముగూడా అనంత శబ్దోచ్చారణకు సంబంధించినదై యుండుట గమనించదగును.

అనందమ్ :— అనంతరాగము వలెనుండు మరియొక రాగము.

అనభ్యాసము :— రాగము యొక్క అల్పత్వ లక్షణమును తెలియపరచు రెండు విధములలో ఒకదానికి గల పేరు. రాగములో అల్పత్వ స్వరము అరుదుగా పాడబడును. మొదటిరకమైన అనభ్యాసము మాటిమాటికి పాడకుండునట్టి స్వరము. అల్పత్వములోని రెండవరకమునకు 'లంఘనమని' పేరు. అనగా ఒక స్వరము తేలికగానుచ్ఛరించివదలివేయుట.

అనలి :— సంగీత భాషలో 3 అంకెను తెలియచేయును. 'స్వరార్ణవము' అనెడి గ్రంథములో 12 స్వరముల సంజ్ఞా పద్ధతిలో 3 వ రిషభ స్వరమైన 'షట్శ్రుతి రిషభము'ను తెలియజేయుట కుపయోగింప బడినది.

అనలి :— 'ఓరియంటల్ మ్యూజిక్' గ్రంథములోని 35 తాళముల పట్టికలో "అనలి" అను పదము త్రిశ్రజాతి ఏక తాళమును తెలియజేయును. [అనల = అగ్ని] దీనికి అంగము 1. అక్షరకాలములు 3.

అనవధానుడు — సంగీతములోని గమకవ్యవస్థల నెరుంగక గానముచేయు గాయకునికి పేరు.

అనక్షరఆలప్తి :— అర్థము గల పదములుగాని, అక్షరములుగాని, గాయకునిచే ఉచ్చరింపబడకుండా గానముచేయు రాగాలాపనమునకు పేరు. ఇది సాక్షర ఆలప్తికి వ్యతిరేకము. దీనిలో డమరుకమును వాయించునపుడు వచ్చు శబ్దములును, తమ్, నమ్, వంటి పదములును, శంకర, వంటి పదములు ఉపయోగింపబడును. శ్లోక ఆలప్తి అనునదిగూడ సాక్షర ఆలప్తిలోని ఒకరకము. యీ అనక్షర ఆలప్తి రాగాలాపనలో అచ్చులు తఱచుగా నుపయోగింప బడును. (పార్శ్వదేవుడు) అయితే వాద్య సంగీతమునకు సంబంధించినంతవరకు ఇది అనక్షర ఆలప్తియా, లేక సాక్షర ఆలప్తియా, అను ప్రశ్నయే అంకురించదు. కారణమేమనగా వాద్యములో స్పష్టం, లేక పవిత్ర

సంగీతముయొక్క స్వరమాత్రమే కన బడును. గనుక ఈప్రశ్నకు తావే లేదు.

అన్ననాద :— అష్టోత్తరశత తాళము లగు 108 లో 31 వ తాళమగు 'హంస నాద' తాళమునకు తమిళ గ్రంథములలో చెప్పబడిన పేరు.

అన్నలీల :— అష్టోత్తరశత తాళము లగు 108 లో 20 వ తాళమగు 'హంస లీల' తాళమునకు తమిళ సంగీత గ్రంథ ములలో చెప్పబడిన పేరు.

అన్యతాళము :— 'నవసాంధ చూడా మణి' యొక్క "తాళసముద్రిక్" అను గ్రంథములలో చెప్పబడిన యొక తాళము.

అన్యముకుందము :— నవీన గ్రంథ ములలో చెప్పబడిన 108 శాస్త్రీయ తాళములకు చెందని తాళములలో నొకటి.

అన్యరాగకాకు :— ఇంకొక రాగ ఛాయయొక్క ప్రత్యక్షము. అనగా రాగ ప్రస్తారములలో ప్రధానస్వరమును ఒకచోటునుండి యింకొకచోటికి ఆధా రముగా మార్చుటచే మరియొక రాగమును ప్రవేశపెట్టినట్లగును. దీనినే అన్యరాగ కాకు అందురు.

అన్యస్వరము :— భాషాంగ రాగ ములలో రంజనముకొరకై పూర్వాచా ర్యులు ప్రయోగించిన అన్యరాగాంగ స్వర ములకు యిచ్చిన పేరు. ఇది తన జనక రాగ స్వరమునకు వ్యతిరేక మైనదిగా నుండును. భాషాంగ రాగములు ఈ అన్య స్వరములవలన యొక్కువ రంజింపబడును. కాని ఈ ప్రయోగములు కొన్ని ప్రత్యేక సంచారములందు యుండునే గాక ఒకటి లేక రెండు అన్యస్వరములు మాత్రమే ప్రయోగింప బడుచుండును.

అన్యస్థానస్వరము :— ఇది తన స్వస్థానము తన సహజ ప్రకంపన క్రమములో ధ్వనింపని స్వరమగును. అనగా ప్రక్క నున్న స్వరముయొక్క ప్రకంపనములలో ధ్వనించును. ఇట్టి స్వరములు కొన్ని రాగ ములందు మాత్రమే వుండును. ఉదాహర ణము. అసావేరిరాగము. ఈ రాగములో "గా రి స" అను ప్రయోగములో ని గాంధార స్వరము, రిషభస్థానములోనే ధ్వనించుచున్నది. తన సహజస్వనికి తక్కువగా ధ్వనించుచున్న యీ గాంధా రము అన్యస్థాన స్వర మనబడును.

అనాగతగ్రహ కీర్తన :— అనాగతగ్రహ మునందు ప్రారంభించు కీర్తనకు పేరు. ఉ॥ కాంభోజి రాగము, ఆదితాళములోని

; ; ; + మా జా న । కి చె । ట్ట బట్ట ॥
గ + మహరాజు । పై । ... తి ॥
ని + అనుత్యాగరాజునికృతి యిందుకు

ఒక వుదాహరణముగా తీసికొనవచ్చును.

అనాగత గ్రహ (ఎడుప్పు) పల్లవి :— పల్లవియొక్క ప్రారంభము లేక ఎడుప్పు లోనుండి $-\frac{1}{4}$ గాని, $-\frac{1}{2}$ గాని, $-\frac{3}{4}$ గాని, $-\frac{7}{8}$ గాని, $-1$ గాని, $1\frac{1}{4}$ గాని, $-1\frac{1}{2}$ గాని అక్షర కాలమును తాళమువేసిన తదుపరి తీసివేసి ప్రారంభించుపల్లవికి పేరు. ఉదాహరణము. కల్యాణిరాగములో ఆదితాళమునందలి

అన్వియతాళము :— 'పరిపూర్ణ చూడామణి' యొక్క "తాళసముద్రమ్" అను తమిళ గ్రంథములో చెప్పబడిన యొక తాళకాల ప్రమాణమునకు పేరు.

అనీకిని :— 7 వ మేళకర్తయగు 'సేనాపతి' యొక్క జన్యరాగమునకు పేరు.
ఆరోహణము :— స రి గ మ ప ని స.
అవరోహణము :— స ని ప మ గ రి స.

అనుకారుడు :— గాయకులలోని 5 రకములలో నొకరకపు గాయకునికి పేరు. ఇతడు ఇంతరుల గానపద్ధతిని పూర్తిగా ననుకరించి గానము చేయుచుండును.

అనుకూలుడు :— అనగా శృంగార నాయకులలోని 4 రకములలో 1 వ రకపు నాయకునికి పేరు. ఇతడు తన నాయికయందే యొక్కువ అనురాగముగల వాడుగా నుండును.

అనుమంటి :— 47 వ మేళకర్త యగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము:— స రి మ గ మ ప ని స.
అవరోహణము:— స ని ధ ప మ గ రి స.

అనుఘృష్టము :— తాళమునకు సంబంధించిన 12 మార్గములలో 11 వ, దానికి "అనుఘృష్టం" మని పేరు.

అనుతాళము :— 'భరతనాట్యశాస్త్రమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన యొక తాళమునకు పేరు.

అనుత్తరపంచమము :— 'కొరంజియాల్' నుండి వచ్చిన సమూహరాగములకు చెందిన పన్‌లలో ఒకదానికి పేరు.

అనుత్రుటి :— తాళమునకుగల 12 మార్గములలో 9 వ దానికి 'అనుత్రుటి' యని పేరు.

అనుగ్రహతాండవము :— ఆశీర్వాద సంబంధమైన యొకరకపు నృత్యము.

అనుద్యమము :— "సంగీత కౌముది" అను ప్రాచీనలక్షణ గ్రంథములోగల 9 గ్రహములలో 5 వది 'అనుద్యమ' మని చెప్పబడును.

అనుదాత్తము :— వేదములు నాలుగింటిలో మొదటిదైన ఋగ్వేదమును పఠించునప్పుడు ప్రయోగించు ఉదాత్త, అనుదాత్త, స్వరితము లనుమూడు స్వరములలో క్రింది (తగ్గు) స్వరమునకు పేరు.

అనుద్రుతము :— సంగీత కాలమును తెలియజేయు తాళముయొక్క 6 అంగములలో మొదటిదానికి పేరు. ఈ అంగము యొక్క కాలపరిమితి 1 అక్షరకాలము. ఇది ఒక ఘాతతో తెలియజేయబడును. దీని గుర్తు ∪.

అనుద్రుతమేరువు :— తాళప్రస్తారము యొక్క 14 రకములలో 5 వ దానికిగల పేరు. సమసంఖ్యగల ఒక అంగము ఎన్ని ప్రస్తారములలో వచ్చియున్నదో తెలియుటకై అనుద్రుతమును లెక్కచేయుట చెప్పబడిన పేరు.

**అనునాదము** :— అనగా సహకారి స్వర ములకు పేరు. ప్రాథమిక స్వరముతో పాటు కలిగించు విధానములో వినపడు ద్వితీయ స్వరమైన 5 వ హార్మోనిక్ స్వరము. ఇది అంతర గాంధారము బాగుగా వినపడునట్లు శ్రుతి చేయబడిన తంబుర యొక్క మంద్రతంత్రి నుండి వినపడును.

**అనునాసికధ్వని** :— కొందరు సంగీతము పాడునపుడు వినపడునట్టి ముక్కుతో వచ్చు ధ్వనికిగల పేరు. ఇది పాటకునిలో గల లోపములలో నొకటియగును.

**అనునాసికము** :— అనుద్రుతమునకు గల విశేషనామములు 6 టిలో 4 వ దానికి పేరు.

**అనునాసికుడు** :— ముక్కుతో ధ్వని వచ్చునటుల పాటపాడునట్టి గాయకునికి పేరు.

**అనుపల్లవి** :— కర్నాటక సంగీత రచన లగు వర్ణము, కృతి, కీర్తన పదములలో గాని మరికొన్ని ఇతర రచనలలోగాని గల 3 ముఖ్యాంగములగు పల్లవి, అనుపల్లవి, చరణములలో రెండవదానికి పేరు. ఇది పల్లవి అంతగాని లేక పల్లవికి రెట్టింపు పొడుగుగలదిగా గాని వుండును. యీ పల్లవి, అనుపల్లవి చరణముల ప్రారంభ స్వరములు ఒకనిర్ణీత విధానము ననుసరించి యుండును. అనగా ఒకే స్వరములుగాగాని స్థాయిసంబంధము గలిగిన స్వరములుగా గాని, ఒకదాని కొకటి సంవాది స్వరములుగాగాని, అయివుండవచ్చును. ఒకప్పుడు అగుడుగా ఒకస్వరము యింకొకదాని అనువాది స్వరమైకూడా యుండవచ్చును.

**అనుపల్లవి అంతపొడవు చరణములు గల రచనలు** :— శ్యామశాస్త్రిచే రచియింపబడిన 'శంకరాభరణ రాగము' ఆదితాళములోని ‟సరోజదళనేత్రి” వంటి కృతులలోని చరణములు యిట్టివిగా నుండును.

**అనుపల్లవికి నాలుగురెట్లు పొడవు చరణములు గల రచనలు**:— 'త్యాగరాజు' నిచే రచియింపబడిన 'దేవగాంధారి' రాగము, ఆదితాళములోని, ‟క్షీరసాగరశయనా” వంటి కృతులలోని చరణములు యిట్టివాటికి ముఖ్యవుదాహరణములగును.

**అనుపల్లవికి రెట్టింపు పొడవు చరణములు గల రచనలు** :— త్యాగరాజునిచే రచింపబడిన 'ఖమాసు రాగము, ఆది తాళము' లోని ‟సీతాపతే నామనసున” వంటి కృతులలోని చరణములు యిట్టివాటికి ముఖ్యవుదాహరణము లగును.

**అనుపల్లవి రెండుపాదములలోను యతులుగల రచనలు** :— త్యాగరాజునిచే రచియింపబడిన 'కోకిలధ్వని రాగము, ఆది తాళము'లోని ‟తొలినేనుజేయు పూజా ఫలమీలాగే” అను కృతిలోని అనుపల్లవియందు

‟వెలవేసి తీయగవచ్చునా ।
వెతదీరునా – మనసార”

వంటి అనుపల్లవి రెండు పాదములయందును యతులు గల రచనలు యిందుకు ముఖ్యవుదాహరణము లగును.

**అనుపల్లవిలో ప్రాసయతిగల రచనలు:—** 'త్యాగరాజుని'చేరచియింపబడిన,అభేరిరాగము, ఆదితాళములోని "నగుమోము గన లేని" అను కృతిలో అను పల్లవియందు

"నగరాజా ధరనీదు పరివారిమెల్ల
ఒగిబోధన జేసే వారలు గారే"

అనునట్టి ప్రాసయతి గల అనుపల్లవులు గలిగిన కృతులు యిందుకు ముఖ్యవుదాహరణములగును.

**అనుపల్లవిలో మధ్యమకాల సాహిత్యములుగల రచనలు :—** 'ముద్దుస్వామి దీక్షితునిచే రచియింపబడిన 'శంకరాభరణరాగము' మిశ్రచాపు తాళములోని "అక్షయలింగవిభో" అనుకృతిలో అను పల్లవియందుగల రెండవభాగములో చెప్పబడిన

"దక్షశిక్షణ, దక్షతర, సురలక్షణవిధి
విలక్షణ, లక్ష్యలక్షణ బహుళక్షణ,
సుధాభక్షణ గురుకటాక్ష వీక్షణ"

అనునది యిందుకు ముఖ్య వుదాహరణముగా తీసికొనవచ్చును.

**అనుప్రాస :—** సంగీత రచనలో ఒకే మాదిరి అక్షరములను, వర్ణములను మాటలను తిరిగి వుపయోగించుటకు అనుప్రాస యందురు. ఇది ద్వితీయాక్షరప్రాస, అంత్యప్రాసలకు యితరమైనది. కృతియొక్క సాహిత్యమునకు అలంకారము నిచ్చును. 'సుబ్బరాయశాస్త్రిలు' రచియించిన 'వనజాసన' అను శ్రీరాగములోనికృతియిందుకొకముఖ్య వుదాహరణమగును.

**అనుబంధము :—** 18 వ శతాబ్దములో రచింప బడిన పూర్వుల తానవర్ణములకు చివర అనుబంధము అనుభాగము కలిగి యుండెను. తరువాత కాలములోని తాన వర్ణకర్తలు వీటిని వర్ణముల చివర రచించి యుండలేదు. అనుబంధము కలిగి యున్న వర్ణమును పాడునప్పుడు పల్లవి, అనుపల్లవి, ముక్తాయి స్వరము, చరణము, ఎత్తుగడ స్వరములు వరుసగాపాడిన పిమ్మట తిరిగి చరణము పాడబడును. ఆతరువాత అనుబంధము ప్రారంభించబడును. దీనిలోని సాహిత్యము పై సాహిత్యముయొక్క భావమును పూర్తి చేయును. కొన్ని అనుబంధములలో సాహిత్యము జతులను కలిగియుండును. కొన్నింటిలో సాహిత్యము మాత్రమేయుండును. ఉ॥ భైరవిరాగము, అట తాళములోని "విరిబోణివర్ణము" యిట్టి అనుబంధము కలిగియున్నది. ఇది "చిరు చెమటలు" అనుపదములతో ప్రారంభింపబడును. తిరువాత అనుపల్లవి ఆఖరు భాగమైన "శ్రీ, రాజగోపాలదేవ" అని పాడి విరిబోణి అనుభాగము పాడుటతో పూర్తి చేయబడును. కాలక్రమమున యీ అనుబంధమును పాడుట విడిచి పెట్టబడెనది. రామస్వామి దీక్షితార్, శొంఠి వెంకటసుబ్బయ్యగార్లు రచించిన తానవర్ణములు అనుబంధములు కలిగియుండును. అనుబంధము ఒకప్రత్యేక భాగమగుటచే రచయితలు తమముద్రను యిందులోకూడ యేర్పరచి యుండిరి. త్యాగరాజు తన పంచరత్న కీర్తనలలో ఆరభిరాగము ఆది తాళములోగల "సాధించెనే" అనుదానిలో చివర"సద్భక్తుల"అనునొక అనుబంధమునంటి భాగమునుకలిపెను. దీనిని ఎత్తుగడ పల్లవి తరువాత భాగములవలెగాక సాహిత్యముతోనే పాడబడుచుండును.

**అనుభావము:—** భావశాస్త్రము నందు

చెప్పబడిన 5 విధములగు విభావ, అనుభావ, సాత్త్వికభావ, వ్యభిచారి భావములలో 2 వది 'అనుభావ' మనబడును.

**అనుమకలకము:-** భరతుని "సేనాపతీయము" అను తమిళ గ్రంథములో చెప్పబడిన నాట్య శాస్త్ర గ్రంథమును 'అనుమకటక' మనబడును.

**అనుమకుంబతాళము:—** 'వసపాద చూడామణి' యొక్క "తాళసముద్రము"లో చెప్పబడిన కాలమానములలో నొకటియగును.

**అనుమంద్రపము :—** వీణయొక్క నాల్గవ తంతికిగల పేరు. దీనిని అనుమంద్రస్థాయి పంచమునకు సరిపోవునట్లు శృతి చేయబడును.

**అనుమంద్రస్థాయి :—** పంచ స్థాయిలలో మొదటిదైనట్టియు మంద్రస్థాయికి క్రిందనున్నట్టి స్థాయిని అనుమంద్రస్థాయి యనబడును. దీనికి గుర్తు అక్షరము క్రింద రెండుచుక్కలుండును. ఉ॥ ని̤ స̤ ప̤.

**అనురణనము :—** స్వయంభూస్వరమునకు సంస్కృతములోగల పేరు. దీనినే ఇంగ్లీషులో "హార్మొనిక్సు" యని చెప్పబడును.

**అనురణనాత్మకధ్వని :—** ఇదియు స్వయంభూస్వరమునందు గల ధ్వని విశేషమగును.

**అనులాపము :—** భావశాస్త్రములో చెప్పబడిన వాగారంభాను భావములు 11 లో 5 వ దానిని 'అనులాప' మనిచెప్పుదురు.

**అనులోమక్రియ :—** అనులోమమును పాడుటలోగల విధానమునకు పేరు.

**అనులోమపల్లవి :—** పల్లవి పాడుటలో తాళమును ఒకేవిధముగా వేయుచూ పల్లవి సాహిత్యమును ఒకదాని కొకటి రెట్టింపు వేగముతో త్రికాలము పాడునట్టి పల్లవిని అనులోమ పల్లవి యనబడును.

**అనులోమము :—** తాళమును ప్రథమ కాలములోనే నడుపుచూ పాటను గాని స్వరములనుగాని నోటితోగాని వాద్యములోగాని వరుసగా త్రికాలములో పాడుట 'అనులోమ' మనబడును. ఇదిసనో సర్మ్త సంగీతమునకు ముందడుగు వేయునట్టిది. పల్లవులలో యిట్టి అనులోమములను ప్రదర్శించుటకు ప్రయత్నింతురు. ముఖ్యంగా దీనికి తాళజ్ఞానము నిర్దిష్టముగా నుండవలెను.

**అనువాది :—** వాది, సంవాది వివాది, స్వరములలో యే రకమునకు చెందని స్వరము. ఇదియొక సేవకుని వంటిది. వాది స్వరముతో 5/4 అంతర గాంధారముగాని లేక 6/5 సాధారణ గాంధారముగాని సంబంధముగల స్వరములను అనువాదిస్వరములందురు.

**అనుస్వరము:—** ఒకస్వరము పలికించుటలోదానిచుట్టు అలంకారమునకువాయింపబడు లేక పాడబడు స్వరములను అనుస్వరములని చెప్పబడును. ఇది రాగాలాపలోను సంగీతరచనలు పాడుటలోను వుపయోగింపబడును. అయితే యీ అనుస్వర

ములు ప్రధానమైనవిగా నుండవు, గనుక స్పర్శించినవెంటనే వదలివేయబడును.

**అనుసారణి:**— ద్వితీయసారణి, లేక రెండవషడ్జమును అనుసారణియందురు. తంబురలో 2 వ తంతికి తరువాతనుండుతంతికిఇవ్వబడినపేరు. తంబురలో మొదటితంతి మంద్రపంచమముగను రెండవ మూడవ తంత్రులు రెండును మధ్యషడ్జముగను నాల్గవ తంతి మంద్రషడ్జముగను శృతి చేయుదురు. అనగా " పా సా సా సా" అను స్వరములుగా శృతి చేయబడును. పైనాల్గుశృతులు గల తంత్రులలో 2 వదానిని సారణి అనియు 3 వ దానిని అనుసారణి అనియుచెప్పుదురు. [సారణి యనగా మధ్యషడ్జము అనిఅర్థము.] ఈ సారణి, అనుసారణి తంత్రులు సరిగాశృతిచేసి ఒకటిమీటినపుడు రెండవది దానంతట అదేప్రకంపించును. ఈ ఏకప్రభావ ప్రకంపనములు తంబురవాద్యమునందు ప్రదర్శింపవచ్చును.

**అనుసారణి:**— వీణయొక్క ప్రక్కతాళ తంత్రులు 3 టిలో మొదటిదానినికూడఅనుసారణి యని చెప్పబడును. ఇదియు మధ్యస్థాయిషడ్జమునకే శృతిచేయబడును.

**అనుహతి:**— వీణను మీటుటలోగల ఒక ప్రత్యేక విధానమును 'అనుహతి' యనబడును.

**అనూదనము:**— "సంగీతకౌముది" అను లక్షణ గ్రంథములోని గ్రహాలక్షణము సంబంధించిన పంచగతుల సంబంధమగు నవగ్రహములలో 6 వ దానిని అనూదన మనబడును.

**అనూపసంగీతరత్నాకరము:**— 'భావభట్టుని'చే సంస్కృతములో వ్రాయబడిన యొక సంగీత గ్రంథము.

**అనూప సంగీతవిలాసము :**— 'భావభట్టుని'చే వ్రాయబడిన సంస్కృతములోని సంగీతగ్రంథములలో నొకదానికి యివ్వబడిన పేరు.

**అనూప సంగీతాంకుశము :**— 'భావభట్టుని'చే సంస్కృతములో వ్రాయబడిన మరియొక ప్రాచీనసంగీత గ్రంథము.

**అపదేశకము :**— భావశాస్త్రము నందు గల వాగారంభాను భావములు 11 లో 10 వ దానిని "అపదేశక" మని చెప్పుదురు.

**అపన్యాసము :**— పురాతన సంగీతములో జతులకు చెప్పబడిన 13 లక్షణములలో నొకదానిని "అపన్యాస" మని చెప్పుదురు.

**అపరాంతకము :**— మార్గ సంగీతమునకు చెందిన ఒకరకమైన పాటను అపరాంతకమని చెప్పుదురు.

**అపరూపము :**— 'సారంగపాణి' పదములలో కనుపడు నొకఅరుదైన రాగము. అతనిచే రచింపబడిన "వలచితినే నీపై" అనెడి చాపుతాళపదము ఈ రాగమునకు చెందిన రచనయగును.

**అపలాపము :**— భావశాస్త్రము నందు గల వాగారంభాను భావములు 11 లో 6 వ దానిని 'అపలాప' మని చెప్పుదురు.

**అపశ్రుతి :—** తంబురను గాని, వయొలిన్ నుగాని, వీణనుగాని శ్రుతి చేయునపుడు దానికిగల తంత్రులను సరిగా ఆయా శ్రుతుల స్వరములకు తగినట్లు చేయక హెచ్చుతగ్గులు గల ధ్వనులతో శ్రుతిచేసినచో అట్టి శ్రుతులను అపశ్రుతులందురు. అనగా తప్పుగా శ్రుతిచేయుట అని అర్థము.

**అపస్వరము :—** స్వరములు పాడుటలో ఆయాస్వరములకుగల నియతమగు స్థానములకు తగినట్లు పాడనిచో వాటిని అపస్వరము లనబడును. అనగా సుస్వరమునకు వ్యతిరేకము. సుశ్రోతలగువారి చెవికి యీ అపస్వరము కర్ణకఠోరముగా నుండుటయే గాక వ్యతిరేకభావమునుగూడ కలిగించును.

**అపస్వరుడు :—** స్వరశుద్ధములేక గానముచేయు గాయకుని 'అపస్వరు'డని చెప్పబడును.

**అపస్థానవరాటిక :—** 'సంగీత రత్నాకరము'లో చెప్పబడిన యొక ప్రాచీన రాగము.

**అపస్మారము :—** భావశాస్త్రమునందు చెప్పబడిన 'వ్యభిచారిభావము' లోని 33 విధములలో 22 వ ది "అపస్మార"మని చెప్పబడును.

**అప్రతిమధ్యమము :—** "మేళాధికార లక్షణము" అను సంగీత గ్రంథములో శుద్ధమధ్యమమునకు ప్రతి మధ్యమమునకు మధ్యనుండు శ్రుతికి 'అప్రతి మధ్యమ' మని పేరు. ఇది బేగడరాగములో నుండు మధ్యమమునకు సరిపోవునదిగా నుండును.

**అప్రమేయము :—** ఇది 65 వ మేళకర్త యగు 'మేచకల్యాణి' యొక్క 'జన్యరాగము', ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము — స ని ప మ గ మ రి స.

**అప్సరలు :—** స్వర్గమునకు సంబంధించిన సంగీతవిద్యా ప్రవీణురాండ్రు. వీరలు గీత, వాద్య, నృత్యాదులయందు మిగుల ప్రావీణ్యము గలవారు. స్వర్గమునకు సంబంధించిన పాటలు పాడుటలోను వాద్యములు వాయించుటలోను నృత్యములు చేయుటలోను సమర్థులు. గంధర్వుల భార్యలు. వీరి ప్రభువు ఇంద్రుడు.

**అప్సరస్త్రీలు :—** స్వర్గసంబంధమైన స్త్రీలకు పేరు. శ్రీ కృష్ణునిచే చేయబడిన 'హల్లీస'అను నృత్యములో యీ అప్సరస్త్రీలు మృదంగమును వాయించేవారని కూడ తెలియుచున్నది.

**అపురూపము :—** అనగా అరుదు అను మాటకు పర్యాయపదము. క్రింది శతాబ్దములోనికొందరుసంగీతగ్రంథకర్తలుకొన్ని రాగములను గుర్తించుటలో చాలా శ్రమ పడవలసి వచ్చినది. రాగములను సరిగా చెప్పలేని కొన్ని సంగీతరచనలను వారు అపురూపములనియు అపురూప కీర్తనలనియు చెప్పుచుండిరి. కాని దూరదృష్టివశమున యీ అపురూప మనునది ఒకరాగమునకు సంబంధించినదికాదనే అభిప్రాయము యేర్పడినది. ఉ॥ త్యాగరాజుల వారి రచనయగు "ఎంత వేడుకొందు రాఘవా"అనుకృతిగల"సరస్వతీమనోహరి" రాగమునేఅపురూపరాగమని ప్రాచీన తమిళగ్రంథమైన "త్యాగరాజకృతులు" అను గ్రంథమున పేర్కొనబడినది. అయితే అపు

రూప మనునది సంగీతరచనలకు సంబంధించి నదేగాని రాగము కాదని నిర్ణయించవలెను.

**అపురూప కీర్తనలు** :— అపురూప రాగము లనబడేవాటిలోని సంగీత రచనలను అపురూపకీర్తన లనబడును.

**అపుష్టము** :— బలహీనమైన సంగీతస్వని లేక నాదముయొక్క 5 విభాగములలో నొకదానిని "అపుష్ట" మనబడును. మిగతా నాలుగు సూక్ష్మము, అతి సూక్ష్మము, పుష్టము, కృత్రిమము అనునవి.

**అపూర్ణము** :— అసంపూర్ణము లేక పూర్తికానిది. 6 స్వరములుగల 5 స్వరములుగల 4 స్వరములుగల కొలతలు (స్కేలులు) గలవి.

**అపూర్ణ మేళములు** :— సంపూర్ణ ఆరోహణముగాని లేక సంపూర్ణ అవరోహణముగాని తీసికొనని రాగములకు యివ్వబడిన పేరు.

**అపూర్ణ లక్షణ రాగమాలిక** :— లక్షణమునకు సంబంధించిన రెండుమూడు ముఖ్య విషయములు లేని రాగమాలికా రచన. దీనికి వ్యతిరేకమైనది పూర్ణలక్షణ రాగమాలిక. ఇందు అన్ని ముఖ్యలక్షణ విషయములు వివరముగానుండును.

**అపూర్వ రాగము** :— అరుదైన రాగమునకు చెప్పబడిన పేరు. ఉ॥ నాద చింతామణి రాగము ఒక అపూర్వ రాగమునకు ఉదాహరణగా తీసికొనవచ్చును.

**అప్లైడ్‌మ్యూజిక్ (Applied Music)** :— ప్రయోగింపబడిన సంగీతము. అనగా పదముల ప్రాముఖ్యము కలిగి సాహిత్యము పాడుటచే వుపయోగింపబడు సంగీత రచనలన్నింటికీ యివ్వబడిన ఇంగ్లీషు పేరు. సాహిత్యములోని భావమును తెలియబర్చుచూ సంగీతము ఉచ్ఛస్థాయినిగాని మధ్యమస్థాయినిగాని కలిగియుండును. పవిత్ర సంగీతము, గేయఘనాతులు, నృత్య సంగీతము ఈరకమునకు చెందినవైయున్నవి. దీనికి వ్యతిరేకమైనది స్వచ్ఛసంగీతము లేక మనోధర్మ సంగీతము. దీనిలో సంగీతపద్ధతికే యెక్కువ ప్రాముఖ్య ముండును.

**అంబరికల్యాణి** :— "సంగీత రత్నాకరము" అను కన్నడగ్రంథములో చెప్పబడిన యొక రాగమును.

**అంబరీషచరితము** :— "స్వాతి తిరునాళ్" వారిచే వ్రాయబడిన నొక కథాకళి నాటకమునకు యివ్వబడినపేరు.

**అబ్జనాభ** :— తిరువాన్కూరు మహారాజా యగు శ్రీ "స్వాతితిరునాళ్" వారిచే వ్రాయబడిన సంగీతరచనలలో వుపయోగింపబడిన ముద్రలలో నొకటి. అనగా "పద్మనాభ" అనునట్టివారి అసలు ముద్రకు పర్యాయ ముద్రగా నిది వాడబడినది.

**అంబామనోహరి** :— ఇది 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.

ఆరోహణము – స రి గ మ ధ ని స.
అవరోహణము – స ని ధ మ గ రి స.

**అపశ్రుతి** :— తంబురా గాని, వయొలిన్ గాని, వీణ గాని శ్రుతి చేయునప్పుడు వానికిగల తంత్రులను సరిగా ఆయా శ్రుతుల స్వరములకు తగినట్లు చేయక హెచ్చుతగ్గులు గల స్వరములతో శ్రుతిచేసినచో అట్టి శ్రుతులను అపశ్రుతులందురు. అనగా తప్పుగా శ్రుతిచేయుట అని అర్థము.

**అపస్వరము** ;— స్వరములు పాడుటలో ఆయాస్వరములకుగల నియతమగు స్థానములకు తగినట్లు పాడనిచో వాటిని అపస్వరము లనబడును. అనగా సుస్వరమునకు వ్యతిరేకము. శ్రోతలగువారి చెవికి యీ అపస్వరము కర్ణకఠోరముగా నుండుటయే గాక వ్యతిరేకభావమును కూడ కలిగించును.

**అపస్వరుడు** :— స్వరశుద్ధము లేక గానముచేయు గాయకుని 'అపస్వరుడ'ని చెప్పబడును.

**అపస్థానవరాటిక** :— 'సంగీత రత్నాకరము'లో చెప్పబడిన యొక ప్రాచీన రాగము.

**అపస్మారము** :— భావశాస్త్రమునందు చెప్పబడిన 'వ్యభిచారిభావము' లోని 33 విధములలో 22 వ ది "అపస్మార"మని చెప్పబడును.

**అప్రతిమధ్యమము** :— "మేళాధికార లక్షణము" అను సంగీత గ్రంథములో శుద్ధమధ్యమమునకు ప్రతి మధ్యమమునకు మధ్యనుండు శ్రుతికి 'అప్రతి మధ్యమ' మనిపేరు. ఇది బేగడరాగములో నుండు మధ్యమమునకు సరిపోవునదిగా నుండును.

**అప్రమేయము** :— ఇది 65 వ మేళకర్త యగు 'మేచకల్యాణి యొక్క' జన్యరాగము.
ఆరోహణము – స రి మ ప ని స.
అవరోహణము – స ని ప మ గ మ రి స.

**అప్సరలు** :— స్వర్గమునకు సంబంధించిన సంగీతవిద్యా ప్రవీణురాండ్రు. వీరలు గీత, వాద్య, నృత్యములయందు మిగుల ప్రావీణ్యము గలవారు. స్వర్గమునకు సంబంధించిన పాటలు పాడుటలోను వాద్యములు వాయించుటలోను నృత్యములు చేయుటలోను ప్రసిద్ధులు. గంధర్వుల భార్యలు. వీరి ప్రభువు ఇంద్రుడు.

**అప్సరస్త్రీలు** :— స్వర్గసంబంధమైన కన్యలకు పేరు. శ్రీ కృష్ణునిచే చేయబడిన 'హల్లీస'అను నృత్యములో యీ అప్సరస్త్రీలు మృదంగమును వాయించేవారని కూడ తెలియుచున్నది.

**అపురూపము** :— అనగా అరుదు అను మాటకు పర్యాయపదము. క్రింది శతాబ్దములోని కొందరు సంగీతగ్రంథకర్తలు కొన్ని రాగములను గుర్తించుటలో చాలా శ్రమ పడవలసి వచ్చినది. రాగములను సరిగా చెప్పలేని కొన్ని సంగీతరచనలను వారు అపురూపములనియు అపురూప కీర్తన లనియు జెప్పుచుండిరి. కాని దురదృష్ట వశమున యీ అపురూప మనునది ఒక రాగమునకు సంబంధించినది కాదనే అభిప్రాయము యేర్పడినది. ఉ|| త్యాగరాజుల వారి రచనయగు "ఎంత వేడుకొందు రాఘవా" అనుకృతిగల "సరస్వతీమనోహరి" రాగమునే అపురూపరాగమని ప్రాచీన తమిళ గ్రంథమైన "త్యాగరాజకృతులు" అను గ్రంథమున పేర్కొనబడినది. అయితే అపు

రూప మనునది సంగీతరచనలకు సంబంధించి నదేగాని రాగముకాదనియెంచవలెను.

**అపురూప కీర్తనలు :—** అపురూప రాగము లనబడేవాటిలోని సంగీత రచనలను అపురూపకీర్తన లనబడును.

**అపుష్టము :—** బలహీనమైన సంగీతధ్వని లేక నాదముయొక్క 5 విభాగములలో నొకదానిని "అపుష్ట" మనబడును. మిగతా నాలుగు సూక్ష్మము, అతి సూక్ష్మము, పుష్టము, కృత్రిమము అనునవి.

**అపూర్ణము :—** అసంపూర్ణము లేక పూర్తికానిది. 6 స్వరములుగల 5 స్వరములుగల 4 స్వరములుగల కొలతలు (స్కేలులు) గలవి.

**అపూర్ణ మేళములు :—** సంపూర్ణ ఆరోహణముగాని లేక సంపూర్ణ అవరోహణముగాని తీసికొనని రాగములకు యివ్వబడిన పేరు.

**అపూర్ణ లక్షణ రాగమాలిక:—**లక్షణమునకు సంబంధించిన రెండుమూడు ముఖ్య విషయములు లేని రాగమాలికా రచన. దీనికి వ్యతిరేకమైనది పూర్ణలక్షణ రాగ మాలిక. ఇందు అన్ని ముఖ్యలక్షణ విషయములు వివరముగానుండును.

**అపూర్వ రాగము :—** అరుదైన రాగమునకు చెప్పబడిన పేరు. ఉ|| నాద చింతామణి రాగము ఒక అపూర్వ రాగమునకు ఉదాహరణగా తీసికొనవచ్చును.

**అప్లైడ్‌మ్యూజిక్ (Applied Music) :—** ప్రయోగింపబడిన సంగీతము. అనగా పదముల ప్రాముఖ్యముకలిగి సాహిత్యము హెచ్చుటచే వుపయోగింపబడు సంగీత రచనలన్నింటికీ యివ్వబడిన ఇంగ్లీషు పేరు. సాహిత్యములోని భావమును తెలియబర్చుచూ సంగీతము ఉచ్ఛస్థాయినిగాని మధ్యమస్థాయిని గాని కలిగియుండును. పవిత్ర సంగీతము, గేయఘణుతులు, నృత్య సంగీతము ఈరకమునకు చెందినవైయున్నవి. దీనికి వ్యతిరేకమైనది స్వచ్ఛసంగీతము లేక మనోధర్మ సంగీతము. దీనిలో సంగీతపద్ధతికే యెక్కువ ప్రాముఖ్య ముండును.

**అంబరికల్యాణి :—** "సంగీత రత్నాకరము" అను కన్నడగ్రంథములో చెప్పబడిన యొకరాగమును.

**అంబరీషచరితము :—** "అశ్వతి తిరునాళ్" వారిచే వ్రాయబడిన నొక కథాకళి నాటకమునకు యివ్వబడినపేరు.

**అబ్జనాభ :—** తిరువాన్కూరుమహారాజా యగు శ్రీ "స్వాతితిరునాళ్" వారిచే వ్రాయబడిన సంగీతరచనలలో వుపయోగింపబడిన ముద్రలలో నొకటి. అనగా "పద్మనాభ"అనునట్టివారిఅసలు ముద్రకు పర్యాయ ముద్రగా నిది వాడబడినది.

**అంబామనోహరి :—** ఇది 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి'యొక్క జన్యరాగము.

ఆరోహణము – స రి గ మ ధ ని స.
అవరోహణము – స ని ధ మ గ రి స.

అంబాహేరి :— "సంగీత రత్నాకర గ్రంథము"లో చెప్పబడిన టక్క రాగము యొక్క భాషలలో నొకటియగును.

అంబాహేరిక :— "సంగీతసుధ" అను గ్రంథములో చెప్పబడిన 21 టక్కభాషలలో నొకటి యగును.

అంబుజనాభ :— 'స్వాతితిరునాళ్', వారి చే రచింపబడిన రచనలలో పద్మనాభముద్ర కుబదులుగా వుపయోగింపబడిన పర్యాయముద్రలలో నొకటి యగును.

అంభణము :— వేదకాలమునకు చెందిన వీణలలో స్థానించునట్టి 'దండికి' అంభణమని పేరు.

అభంగతాళము :— 'సంగీత రత్నాకర ము'లో చెప్పబడిన 120 తాళములలోని 71 వ తాళము. దీని అంగములు I 3.

అభంగతాళము :— అష్టోత్తరశత తాళ ములనబడు 108 తాళములలోని 79 వ తాళము. దీని అంగములు I 3. మాత్రలు 4. అక్షరకాలము 16.

అభంగలు :— మహారాష్ట్ర భాషలో పవిత్ర సంగీతజాతికి చెందిన ఒకరకమైన సంగీతరచనలకు పేరు. తంజావూరును మహా రాష్ట్రరాజులు పరిపాలించు కాలములో 'తుకారామ్' మొదలైనమహారాష్ట్ర కృతి కర్తలయొక్క అభంగలు దక్షిణదేశ ములో యెక్కువగా ప్రచారములోనికి తే బడినవి. ఈ అభంగలు నేటికిని అచ్చట భజనలలోను, హరికథా కాలక్షేపముల లోను మిక్కిలి ఆసక్తితో పాడబడుచూ వున్నవి. వీటిలో పల్లవి చరణములు కలిగి యుండును. ఇవి సాధారణముగా వేరు వేరు సంగీత శైలిలో నుండును. కాని ఒకప్పుడు రెండును ఒకే శైలిని కలిగి యుండుటకూడ కలదు. ఇవి వినుటకు చాలా రంజకముగా నుండును.

అభయాంబనవావరణము :— 'ముద్దు స్వామిదీక్షితుల' వారిచే 'అభయాంబ' దేవతను కీర్తించుతూ రచింపబడిన తొమ్మిది కీర్తనలయొక్క సమూహము. ప్రాముఖ్య మైన ఈనవావరణ కీర్తనలు వారియొక్క ఇతర రచనలకువలె ప్రసిద్ధిగానున్నవి.

అభావము :— రాగప్రస్తారములో రాగముయొక్క భావమును వుపయో గములోలేకుండాచేయుట కుపేరు. అనగా రాగములో ఒక అల్ప ప్రయోగమును లేఅచుగా ప్రయోగించుట యగును. ఎటు లనగా 'శ్రీరాగము' ఆలాపించుటలో "ప ధ ని ప మ" అను అల్ప ప్రయో గమును మాటిమాటికి ప్రయోగించుట యీ అభావమునకొక వుదాహరణగా తీసికొనవచ్చును. ఇట్లే మిగతా రాగము లందుకూడా వుండుట గమనించదగును.

అభ్యాస గానము :— విద్యార్థులు ప్రారంభ అభ్యాసముకొరకు పాడబడు నట్టి సంగీతమును అభ్యాసగానమని చెప్ప బడును. అనగా నిది సంగీత సభలలో పాడబడునట్టి సంగీతమునకు వన్నె తెచ్చు నది. గనుక కచ్చేరీ సంగీతమునకు వ్యతిరేక మైనదిగా నుండును. ఎటులనగా విద్యార్థులు తాము గాత్రమునందుగాని వాద్య

మునందుగాని సంగీతమును శ్రావ్యముగా ప్రదర్శించుటకు తగిన నైపుణ్యమును పెంపొందించుటకు ప్రథమాభ్యాసము నందలి కొన్ని రచనలు అభ్యసింతురు. వీటిలో ముఖ్యమైనవి ఉ॥ స్వరావళి, దాటు వరుస, హెచ్చువరుస, తగ్గువరుస, జంట వరుస, అలంకార, గీత, వర్ణాదులు. వీటిని త్రికాలము రాగ భావ తాళయుక్తముగా నభ్యసించిన కచ్చేరీ సంగీతము ప్రదర్శించుటకు తగిన అర్హతను పొందగలుగుదురు. అయితే యీ అభ్యాసగానము సరియైన గురువువద్దనే జరుపుట యెంతయు నవసరమగును.

**అభ్యాసము :—** రాగమునకు గల దశ లక్షణములగు 10 టి లో 9 వ దానిని బహుత్వమని చెప్పెదరు. ఈ బహుత్వములోని రెండు విధములలో 2 వ దానిని అభ్యాస మనబడును. అనగా ఒకే స్వరమును ముఖ్యంగాను తరచుగాను పాడుట యగును. పై రెంటిలోను మొదటిదైన అలంఘనము తేలికగా పాడే విడువబడు నట్టిదిగా నుండును.

**అబ్ధితాళము :—** 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములోని 35 సూళాదితాళములు తెలుపు పట్టికలో చతురశ్రజాతి ఏక తాళమునకు పేరు. అంగసంజ్ఞ 1, అక్షరకాలము. 4.

**అభినన్దతాళము :—** 'సంగీత రత్నాకర గ్రంథ' స్థమగు 120 తాళములలో 61 వ తాళము. దీని అంగములు I I 0 0 8.

**అభినందనతాళము :—** 'అష్టోత్తర శత తాళము'లగు 108 లో 62 వ తాళమునకుగల పేరు. దీని అంగములు I I 0 0 8. మాత్రాకాలము 5. అక్షరకాలము 20.

**అభినయమ్ :—** అభినయమునకు తమిళములో గల పేరు. దీనివివరములు అభినయమునందు చూడదగును.

**అభినయగానము :—** నటనముతో కూడిన పాటలేక సంగీతమును అభినయగానమని చెప్పబడును.

**అభినయదర్పణము :—** సంస్కృతభాషలో నృత్యశాస్త్రమును గురించి 'నందికేశ్వరుడు' వ్రాసిన ప్రాముఖ్యమైన యొక గ్రంథము. ఈతనికి 'నందిముడు' అను పేరు కూడ కలదు.

**అభినయపాట్టు :—** నటనతో కూడిన పాటకు తమిళభాషలో వాడునట్టి పదము.

**అభినయము :—** ఒక సంగీతరచనయొక్క హావభావములను తెలియపరచునట్టి నటన పేరు. అనగా శరీరముయొక్క అవయవములచే జరుపు కదలికలవల్లను, ఆకృతుల వల్లను తెలియదగినవాచక, అంగికాభినయములు. ఇవి నాలుగు విధములుగా నుండును. 1. అంగికాభినయము, 2. వాచికాభినయము, 3. ఆహార్యాభినయము, 4. సాత్త్వికాభినయము మొదలగునవి. వాని వివరములు ముందు చూడదగును.

**అభినయ లక్షణము :—** 'తంజావూరు' లోని 'సరస్వతీమహలు' గ్రంథాలయములో నున్న "నాట్యకళా" గ్రంథమునకు

పేరు. ఇది శ్రీరంగ శేఖరునిచే వ్రాయబడినదిగా తెలియుచున్నది.

**అభినయశాస్త్రము:**—"నృత్యశాస్త్రము" ను గురించి సాధారణముగా చెప్పబడునట్టి మరియొక పేరు.

**అభినయసార సంపుటము :**— 'నారాయణ అయ్యంగారి'చే తమిళభాషలో, నృత్య శాస్త్రమును గురించి వ్రాయబడిన గ్రంథము. ఇది ఆరు విభాగములను కలిగియుండును. అవి యేవనగా

1. వివేక ప్రకాశబోధము
2. నాయికా నాయక భావలక్షణము
3. రసపరిమళము
4. ఉపమాన చింతామణి
5. అభినయామృతము
6. భావ ప్రకాశము అనునవి.

**అభినయ హస్తము :**— స్వచ్ఛమైన నృత్యములో నుపయోగింపబడు నృత్య హస్తమనెడి చేతికదలికకు పేరు.

**అభినయాంకురము :**— కథాకళి నృత్యమును గురించి 'గోపీనాథ్, 'నాగభూషణము'లచే 1946 సంIIలో వ్రాయబడిన యొకగ్రంథము పేరు.

**అభినయాది విచారము :**— తంజావూరులోని 'సరస్వతీమహాల్' అను ప్రసిద్ధమైన గ్రంథాలయమునందు ప్రకటింపబడనట్టి యొక నాట్యకళా గ్రంథమునకు గల పేరు.

**అభినయామృతము :**— 'అభినయ సార సంపుటము' అను తమిళములో గల నృత్య శాస్త్రమనెడి గ్రంథములో 6 విభాగములలో 5వ దానికి పేరు. ఇది తల, చేతులు మొదలైన వాటియొక్క కదలికలను గురించి తెలియపరచునదిగా నుండును.

**అభినవ:**—"భరతనాట్య శాస్త్రమ్"అను గ్రంథమును వ్యాఖ్యానించిన కాశ్మీర బ్రాహ్మణుడైన 'అభినవగుప్తుని' అప్పుడప్పుడు పిలుచునట్టి గౌరవనామము.

**అభినవ :**— 'భరతనాట్య శాస్త్రము'ను వ్యాఖ్యానించిన 'కీర్తిధరుడు' అను మరియొక వ్యాఖ్యానకర్తకు గల గౌరవ నామము.

**అభినవజయదేవ :**— సాహిత్యములో నవీన జయదేవుడుగా పేరుపొంది తెలుగు పదములను రచించిన ప్రముఖుడగు 'క్షేత్రయ్య'ను అప్పుడప్పుడు యితరులు పిలుచునట్టి గౌరవనామము.

**అభినవతాళమంజరి :**— 'అప్పాతుల్సీ' (బొంబాయి) అనునతనిచే తాళములను గురించి వ్రాయబడిన గ్రంథమునకు పేరు.

**అభినవపురందర :**—ఆదిగురువగు 'పురందర విఠలునికి గల గౌరవనామము.

**అభినవపురందరవిఠల:**— పురందరవిఠలుని నాల్గవ కుమారునిచే రచింప బడిన రచనలోని ముద్రకు పేరు. ఉII పదుమనాభా పరమపురుషా, అను 'మలహారి రాగము'లోని నాల్గవ పిళ్లారి గీతము యిట్టి ముద్రకు పుదాహరణ మగును.

అభినవభరతసారసంగ్రహము:— 'చిక్క భూపాలుని'చే నృత్యమునుగురించి వ్రాయబడిన శాస్త్రగ్రంథము.

అభినవభరతాచార్య :— సాహిత్యములో నవీనభరతాచార్యుడు, కళ్ళినాథుడు, కుంభకర్ణుడు (సంగీతరాజ గ్రంథకర్త) రామామాత్యుడు నంటి సంగీత లక్షణకారులకు యివ్వబడిన బిరుదు.

అభినవ భారతి :— 'అభినవ గుప్తుని'చే 'భరతుని' 'నాట్యశాస్త్రము' పై వ్రాయబడిన ప్రఖ్యాత వ్యాఖ్యాన గ్రంథము. ఈగ్రంథమున ప్రాచీన సంగీతసంప్రదాయములకు చెందిన యనేక విశేషములు పొందుపఱచబడి యున్నవి.

అభినవభోజ :— సాహిత్యములో నవీనభోజు డనదగు 'ఉడైయార్ పాలెమ్' నకు చెందిన 'యువరంగభూపతి(19వ.శ) కి యివ్వబడిన బిరుదు. ఈయన కళావేత్త విజ్ఞానవేత్తయేగాక చాలా పదములనుకూడ రచించిన ప్రఖ్యాత పురుషుడు.

అభినవ రాగమంజరి :— 'విష్ణుశర్మ' అను పేరుతో పండిత 'వి. యన్. భాట్ ఖండే' అను పండితునిచే 1921సం॥లో సంస్కృతమునందు వ్రాయబడిన ప్రఖ్యాత సంగీత గ్రంథము.

అభిమానిని :— 5 వ మేళకర్త యగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి గ మ ధ ని స.
అవరోహణము — స ని ధ మ గ రి స.

అభిరుద్గత :— షడ్జగ్రామములో వికృతస్వరములలో నొక దానికిగల పేరు. ఇది దక్షిణ దేశపు సంగీత శాస్త్రములోని 6వ మేళమగు నవీన 'తోడి' రాగమును దాదాపుగా పోలియుండును.

అభిరూపత్వము :— భావములు 5 టిలో నొకటి విభావమునందలి 2 విధములలో నొకటైన ఉద్దీపన విభావమునందు చెప్పబడిన 7 విధములగు గుణములలో 5 వ దానిని 'అభిరూపత్వ' మని చెప్పుదురు.

అభిసారిక :— నాయికా లక్షణమందు చెప్పబడిన అష్టవిధ నాయికలలో 8 వ రకమునకు చెందిన నాయికను 'అభిసారిక' యనబడును. ఈమె స్మరపీడితురాలై తన వద్దకే నాయకుని రప్పించునదిగాగాని లేక నాయకుని వద్దకే తానేగునదిగా గాని అయియుండును.

అభిసారికా :— 'నారదుని' 'సంగీతమకరందము'లో చెప్పబడిన రాగములలోనొక రాగము.

అభీర :— 'సోమనాథుని'చే అతని 'రాగవిబోధము'లో చెప్పబడినయొక రాగము.

అభీరు :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి గ రి మ ప ని స.
అవరోహణము:— స ధ ప మ గ స.

అభ్యుచ్ఛ్రయము :— ఆరోహి అలంకారములోని ఒకరకము. దీనిలో ఒక

స్వరము విడిచి మరియొక స్వరము వరకు ఉండియుండును. ఉ॥ స గ ప ని. యీ విధముగానుండును.

అంభోగిని :— 28 వ, మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి గ మ ధ స.
అవరోహణము :— స ధ మ గ రి స.

అంభోజిని :— 28 వ మేళకర్తయగు 'హరి కాంభోజి' యొక్క జన్య రాగము.
ఆరోహణము :— స రి గ మ ధ ని స.
అవరోహణము :— స ని ధ మ గ రి స.

అంభోరుహము :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్య రాగము.
ఆరోహణము :— స రి గ ప ధ ని స.
అవరోహణము :— స ని ప ధ మ గ రి స.

అమరసింధు :— తిరుపతి 'తాళ్ళపాకం అన్నమాచార్యుని' చే రచింపబడిన 'శృంగార సంకీర్తనలు' అను రచనలలో తెలుపబడినట్టియొక రాగము. (తిరుపతిముద్రణ)

అమర్షము :— భావశాస్త్రమునందుగల వ్యభిచారి భావములోని 33 విధములలో 25 వ దానిని 'అమర్షము' అని చెప్పుదురు.

అమరావళి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్య రాగము.
ఆరోహణము :— స రి గ మ ధ స.
అవరోహణము :— స ని ధ ప మ గ రి స.

అమృతపంచమము :— ఇది అప్రసిద్ధమగు [illegible] రాగము. ఈ రాగము 'పల్లవి శేషయ్యర్' వ్రాసిన గ్రంథము నందలి రాగపట్టికలో చెప్పబడెను.

అమ్మానై :— తమిళ సంగీతమునకు అనుగుణముగా ఆడపిల్లలచేత, లేక స్త్రీలచేత చిన్న బంతులతో ఆడబడునట్టి ఒక ఆటకు తమిళనామముగాని పేరు. ఈ ఆట కొన్ని బంతులను పైకి ఎగురవేయుచూ తిరిగి పట్టుకొనుచూ ఆడునట్టిదిగా వుండును.

అమ్మానైప్పాట్టు :— అమ్మానై అను ఆటలో పాడబడునట్టి ఒక పాటకు తమిళములోని పేరు.

అమ్మానైవరి :— 'అమ్మానైప్పాట్టు' వలెనుండునది. దీనిని 'శిలప్పదికారమ్' అను తమిళ పద్యగ్రంథములో చెప్పబడినది.

అమీర్ :— పర్షియాదేశములో సంగీత విద్వాంసులకు యివ్వబడునట్టి ఒక బిరుదు. ఉ॥ ఖుస్రూ అను ఆ దేశపు గొప్ప గాయకునికి యిట్టి బిరుదు యివ్వబడి 'అమీర్ ఖుస్రూ' అని పిలువబడుచుండెను.

అమీర్‌కళ్యాణి :— 'హమీర్‌కల్యాణి' రాగమువలెనుండు ఒక రాగము.

అముక్త :— సన్నాయి, లేక ముఖవీణవంటి గాలివాద్యములలో వ్రేలిరంధ్రము ను వ్రేలితో పూర్తిగా మూయబడునట్టి స్థితిని

**అమృతవసంతము** :— 57 వ మేళకర్త యగు 'సింహేంద్రమధ్యమము' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి గ ప ధ ని స.
అవరోహణము :— స ని ధ మ గ స.

**అమృతవాహిని** :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి మ ప ధ ని స.
అవరోహణము :— స ని ధ మ గ రి స.

**అమృతస్వరూపిణి** :— 72 వ మేళకర్త యగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి గ మ ప ధ స.
అవరోహణము :— స ధ ప మ గ రి స.

**అమృతా** :— 'సంగీతసామోదరము'అను గ్రంథములో ధైవతస్వరమునందుగల రెండవ శృతికి పేరు.

**అయన్** :— తమిళభాషలో సంగీతమునకు సంబంధించినటువంటి పేరు.

**అయన్‌పాటకన్** :— ముఖ్య సంగీతపాటకునికి తమిళములోని పేరు. ఇది పిన్‌పాట్టుకారన్ కు వ్యతిరేకమైనదిగా నుండును.

**అయన్‌వాద్యకారన్** :— అనగా సంగీత వాద్యములైన వయొలిన్, వీణ, గోటు, మురళివంటి వాద్యములను వాయించువానికి తమిళములోని పేరు.

**అయ్యర్‌వాళ్** :— తమిళదేశములో 'త్యాగరాజు'ను గురించి ప్రజలు చెప్పుకొనునట్టి ఒక ప్రత్యేక గౌరవ నామము.

**అయ్యావాళ్‌కృతి** :— తమిళదేశములో 'త్యాగరాజు'ని కృతికి ప్రజలు యివ్వబడిన గౌరవ నామము.

**అయ్యావాళ్** :— 'తిరువైయూరు' నివాసియు అనేక భక్తిరస కీర్తనలను, జంబునాథ అష్టకము, గంగాష్టకము, శివభక్తికల్పలతిక, అర్ధనారీశ్వరస్తోత్రము వంటి అనేకమైన అపూర్వ గ్రంథములను రచించిన శ్రీధర 'వేంకటేశ్వరదీక్షితారు' నకుగల ప్రఖ్యాతి గౌరవ నామము.

**అయిప్పు** :— పురాతన తమిళ సంగీత శ్రేణికి సంబంధించిన 'కుడుంజియాన్' యొక్క 8 ఉత్పత్తులలో నొకటిగా 'చూడామణినిఘంటు' గ్రంథము నందు తెలుపబడిన పేరు.

**అయోగము** :— శృంగార రసమునందలి రెండువిధములలో మొదటిదైన 'విప్రలంబశృంగారము'న గల 5 విధములలో మొదటిదానికి పేరు.

**అరఆవర్తము** :— ఒక తాళ ఆవర్తములోని సగభాగమునకుగల పేరు.

**అరఝంప** :— ఝంపతాళములో సగము అని అర్థము. ఇది ఖండచాపు (2+3) తాళముయొక్క ప్రఖ్యాతమైన నామము. ఈ అరఝంప తాళముయొక్క అక్షరకాలము విలువ 5. అసలు మిశ్రజాతి ఝంపతాళముయొక్క అక్షరకాల

మురిలువ 10 లో యీ 5 సంఖ్య సగము అగుటచే దీనిని 'అర్ధఝంపతాళ' మని చెప్పుటకు కారణ మైనది.

అరంగమ్ :— సంగీత సభా ప్రాంగణమునకు తమిళములో చెప్పబడు పేరు.

అరంగేట్రమ్ :— ప్రారంభము లేక ప్రవేశము. అనగా సంగీత విద్వాంసుడు లేక నర్తకుడు, లేక నటకునిచే చేయబడు మొదటి ప్రదర్శనకు తమిళములోని పేరు. ఇది కళోపాసకుడు తన కళయందు ప్రవీణుడైన తరువాత రసికులుగల సభయందు సాధారణమైన పద్ధతిలో యివ్వబడునట్టి ప్రదర్శనము.

అరంజ :— పూర్వ మధ్య యుగములో వాడుకలో నున్న భాషాంగ రాగములలో నొకదానికిగల పేరు.

అరణ్యకగానకాలమ్ :— పురాతన భారతీయ సంగీతకాలములోని యుగము. ఇది గ్రామ గానకాలముతో గుర్తింప దగినది.

అరపాలమ్ :— 'కరుణామృతసాగరము' లో చెప్పబడిన 'దేశాసమ్' నకు చెందిన ఆరు ప్రాథమికపద్ధతులలోని ఒకరాగము.

అరళు :— పురాతన తమిళపద్ధతిలో గల 'కురింజియాళ్' నుంచి వచ్చిన 8 ఉత్పత్తులలో నొకటి. (దివాకరమ్).

అ్రమిన్ :— స్వరమండలము లేక 37 తంత్రులు కలిగి 3 స్థాయిలు కలిగిన ఒక భారతీయ సంగీత వాద్య విశేషమునకు తమిళములోని పేరు. దీని పైభాగమునగల తంత్రులనుకూడ వాయించబడును. పైతంత్రులు ఉక్కువిగాను క్రింది తంత్రులు ఇత్తడివిగాను వుండును.

అర్కప్రియ :— పురాతనమైన ఒక రాగమున కివ్వబడిన పేరు.

అర్కప్రియ :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.

ఆరోహణము :— స రి గ మ ప ధ ని స.

అవరోహణము :— స ధ ప మ గ రి స.

అర్కవర్ధని :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.

ఆరోహణము :— స రి గ మ ప స.

అవరోహణము :— స ని ధ ప మ గ స.

అర్ధఆవర్తము :— తాళఆవర్తములో సగమైన అర ఆవర్తమునకుగల మరియొక పేరు.

అర్ధకంపితరాగము :— రాగములో కొన్ని స్వరములు మాత్రమే కంపితములై తక్కిన స్వరములన్నియు స్వచ్ఛముగా నుండు రాగము. ఇది 'నారదుని' 'సంగీతమకరందము' లోని రాగవిభజనలో చెప్పబడిన "ముక్తాంగ కంపితరాగ" "అర్ధకంపితరాగ" "కంపవిహీనరాగ" ములను 3 రకములలో 2 వది.

అర్ధచంద్రము :— 'అనుద్రుతము'నకు గల పర్యాయపదములలో నొకదాని పేరు. ఇది సంగీత కాలమును లెక్కించుటకు ప్రయోగింపబడు ఆరు అంగములలో మొదటి

టిని. దీనికి అంగసంఖ్య 1. అంగసంజ్ఞ ౹. అక్షరకాలము 1.

అర్ధచంద్రము :— నృత్యములో నుపయోగింపబడు 'అసంయుత హస్తము'లలోని రకములలో నొకదానిపేరు.

అర్ధచిత్రము :— తాళకాల ప్రమాణములో ఒక ప్రత్యేక ప్రమాణము కలిగినదానిని 'అర్ధచిత్రము' అని చెప్పుదురు.

అర్ధఝంప :— ఇది అపరఝంప తాళమునకు మరియొక పేరు. ఖండచాపు వలె 2+3 = 5 అక్షరకాలములుగా నుండును.

అర్ధపతాకము :— నృత్యములో నుపయోగింపబడు ఒకరకమైన అసంయుత హస్తము.

అర్ధభాషాంగరాగము :— భాషాంగరాగములలో కొన్ని తావులందు అన్యస్వరములుగా ప్రక్కనుండు అన్యరాగస్వరములను తీసుకొనుటలో ఆ సమీప శ్రుతిస్థానమునకు చెందిన అన్యరాగ స్వరమును పూర్తిగా తీసికొనని అనగా (ఆ అన్యస్వర ప్రకంపనములకు చేరక యుండునట్టి) భాషాంగరాగమును 'అర్ధభాషాంగరాగ' మని చెప్పుదురు. ఉ॥ సావేరిరాగములో "స రి గ రి స" అను ప్రయోగములోను "ప ధ ని ధ ప" అను ప్రయోగములోను గల గాంధార, నిషాద శ్రుతులు తన నియత శ్రుతులగు అంతరగాంధార, కాకలీ నిషాదములకంటె కొంచెము తక్కువగాను అన్యస్వరములైన సాధారణ గాంధార, కైశికీనిషాదములుగాకను వుండి త్రిశ్రుతి గాంధార, త్రిశ్రుతి నిషాదములుగా పలుకుచున్నవి. గనుకనే యిట్టి రాగములను అర్ధ భాషాంగ రాగములని చెప్పుటకు కారణమైనది.

అర్ధమాగధి :— భరతునిచే "నాట్యశాస్త్రము"లో చెప్పబడినట్టి నృత్యములో నుపయోగింపబడు నొకరకమైన సంగీత గానము.

అర్ధమాత్ర :— తాళదశాంగములలో రెండవదైన ప్రమితమునకుగల విశేష నామములు 5 టిలో మొదటిది.

అర్ధముక్త :— 'మురళి' వంటిగాలి వాద్యమునందుగల రంధ్రమును వ్రేలితో సగముమూయు స్థితిని 'అర్ధముక్త' యని చెప్పుదురు.

అర్ధవేసరి :— "సంగీత రత్నాకరము" లో 'మాళవకైశిక' యొక్క భాషలలో ఒకటియని చెప్పబడిన పురాతన రాగము.

అర్ధస్థాయివాద్యము:—అర్ధస్థాయి క్రమము కలిగినట్టి యొకరకపు సంగీత వాద్యమునకు యివ్వబడినపేరు.

అరాగము :— 'పింగళనిఘంటు' లో చెప్పబడిన పురాతన తమిళ పద్ధతిననుసరించి "పాలైయాళ్" నుండి ఉత్పన్నమైన 5 పద్ధతులలో నొకటి.

అరాళము :— నృత్యములో నుపయోగింపబడుచున్న అసంయుత హస్తపు రకములలో నొకటి.

అర్ధాంబరి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. [సంగీత కౌముది]
ఆరోహణము :— స రి గ మ ప ధ ని స.
అవరోహణము :— స ని ప మ రి స.

అరిత్తాళమ్ :— "అరిబట్టునావలర్"చే "భరతశాస్త్రిక్" అను తమిళ గ్రంథములో చెప్పబడిన తొమ్మిది తాళముల లోనొకటి.

అరియకుడిపంథా :— దక్షిణ భారతములో కర్ణాటక సంగీతములో ప్రముఖ గాయకుడుగా పేరొందిన భారత ప్రభుత్వముచే 'పద్మశ్రీ' సన్మానమందిన అరియక్కుడి రామానుజఅయ్యంగారి సంగీతము కళాపరిపుష్టతగను, సంప్రదాయసిద్ధముగాను, రాగభావయుక్తముగాను, సజీవముగాను, ఆకర్షణీయముగాను యుండును. గనుక అపూర్వమైన వారి సంగీత ప్రదర్శనాపద్ధతిని నేడు అరియక్కుడిపంథా యని ఒక ప్రమాణముగా తీసికొనబడుచున్నది.

అరియగమ్ :— డొల్లగానుండి ఘల్లు ఘల్లుమనెడి 'కాలిఅందెకు' తమిళములో వాడునట్టి పేరు.

అరుట్పా :— 19 వ శతాబ్దపు కవియు కృతికర్తయునగు 'రామలింగస్వామి' తమిళములో వ్రాసిన ప్రార్థనా రూపమైన రచనలకు పేరు.

అరుట్పురి :— "పింగళేంద్రై"లో చెప్పబడిన "కురింజియాజ్" అను పురాతన తమిళ పద్ధతియొక్క 32 ఉత్పత్తులలో నొకదానికి పేరు.

అరుణకాంతము :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి మ ప మ ధ ని స.
అవరోహణము :— స ని ధ ప మ ధ మ గ రి స. [సంగీత కౌముది]

అరుణక్రియ :— 57 వ మేళకర్తయగు 'సింహేంద్ర మధ్యమము' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి మ ప ని స.
అవరోహణము :— స ని ధ ప మ గ రి స.

అరుణగిరి :— 64 వ మేళకర్తయగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి గ మ ధ స.
అవరోహణము :— స ధ మ గ రి స.

అరుణగిరి :— 'త్యాగరాజుని' తరువాత కాలములోని వాడైన "అరుణాచల శాస్త్రి" సంస్కృతములో రచించిన తన కృతులకు యేర్పరచిన 3 ముద్రలలో 3 వ దానికి పేరు.

అరుణగిరి :— 'అరుణగిరినాథరు' అను తమిళ రచయితను అప్పుడప్పుడు యితరులు పిలుచుచుండెడి హ్రస్వనామము.

అరుణగిరియార్ :— సుప్రసిద్ధ తమిళ కీర్తనల రచయితయగు 'అరుణగిరినాథరు' నొకొక్కప్పుడు యితరులు పిలువబడునట్టి గౌరవ నామము.

**అరుణచంద్రిక** :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్య రాగము. [సంగీత స్వరప్రస్తార సాగరమ్]
ఆరోహణము :— స రి గ ప ని స.
అవరోహణము :— స ని ప మ గ స.

**అరుణచంద్రిక** :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' లోని మరియొక జన్యరాగము.
ఆరోహణము :— స గ మ ప ని స.
అవరోహణము :— స ని ప ధ ప మ గ రి స. [సంగీత కౌముది]

**అరుణజ్వలిత** :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి గ మ ధ ని స.
అవరోహణము:— స ని ధ ప మ గ రి స.

**అరుణాచల** :— 'అరుణాచల శాస్త్రి' రచించిన సంస్కృత కీర్తనలలో నుంచ బడిన మూడు ముద్రలలో మొదటిది.

**అరుణాద్రి** :— 'అరుణాచల శాస్త్రి' రచించిన సంస్కృత కీర్తనలలో యెప్ప రచుకొనిన మూడు ముద్రలలో రెండవ దానికి గల పేరు.

**అరుణాంబరి** :— 38 వ మేళకర్తయగు "జలార్ణవము" యొక్క జన్యరాగము.
ఆరోహణము :— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప ధ మ గ రి స.

**అరుది**:— తాళము పూర్తిచేయుటకు ముం దుగాని లేక చివరి భాగము గాని అగును. ఉ॥ ఒక రచన అతీతగ్రహములో ప్రారం భించబడినప్పుడు ఆ రచన అరుదిలో ప్రారం భించబడినదిగా తమిళములో చెప్పబడును.

**అరుది** :— పల్లవిలోని "పదగర్భము నకు తమిళములోని పేరు. ఇది మనో ధర్మ సంగీతములోని భాగము. పల్లవి యొక్క రెండు భాగములైన ప్రథమాం గము, ద్వితీయాంగములని విభజించు చోటునకు పదగర్భ మందురు. దీనియొద్ద స్వరము నొక్కబడుస్వరముగ నుండును. దీనితరువాత చిన్నవిరామము వచ్చును. ఈ స్వరము పల్లవియొక్క గ్రహస్వరముతో ఒక ప్రత్యేక సంబంధమును కలిగియుం డును. అది సమస్వరముగాని, స్థాయి స్వరము గాని, సంవాదిస్వరము గాని (5 వ లేక 4 వది) అయియుండవచ్చును.

**అరుదిస్వరము** :— పల్లవిలోని అరుది లేక పదగర్భముతో ఏకకాలమున వచ్చు స్వరమునకు తమిళములోని పేరు.

**అరుమతాళము** :— "భరతశాస్త్రిరమ్" అను తమిళ ప్రాచీన గ్రంథములో చెప్ప బడిన 9 తాళములలో 2 వ దానికి యివ్వ బడిన పేరు.

**అరుమతాళము** :— "పింగళనిఘంటు" గ్రంథములో పేర్కొనబడిన అరుమతాళ మును బోలిన మరియొక తాళము.

**అరుమ్పాలై** :— పురాతన తమిళ సంగీ తము (సెంపాలై) యొక్క ప్రాథమిక కొలతలోని 4 వ స్వరమును ధృఢ స్వర ముగా తీసికొనుటచే యేర్పడిన స్థాయి లేక కొలత.

అరుకరమ్ :— 'దివాకరము' లో చెప్పబడిన ఆరుతంత్రులుగల యొక రకపు వాద్యమునకు పేరు.

అరుళ్ తాండవము :— ఆశీర్వాద నృత్యమునకు సంబంధించినట్టిది. ఇది శివునిచే చేయబడిన నృత్యములలో నొకటిగా చెప్పబడినది.

అరుళ్ నట్టమ్ :— 'అరుళ్ తాండవ' మునుబోలినట్టి నృత్యము.

అర్జునభరతమ్ :— సంస్కృతములో సంగీత, నృత్యములమీద వ్రాయబడిన ఒక చిన్న గ్రంథము. ఇది యింకను ప్రచురణ కాలేదు. వ్రాత ప్రతి రూపములోనే యున్నది.

అరూక్ష :— దూరమునందుండినను వినుటకు శ్రావ్యమై మనోహరముగా నుండు గానమును "అరూక్ష" అని చెప్పుదురు.

అరైచాపు :— మృదంగమునందు కుడి మూతమీద చేతితోఁ గొట్టు దెబ్బకు తమిళములో 'అరైచాపు' అనిపేరు.

అరైయర్ :— దక్షిణ దేశములో పండుగ దినములందు వైష్ణవ దేవాలయములలో కృష్ణలీలలను నాట్యము ద్వారా అభినయించు పూజారి నర్తకులకు పేరు.

అరైయర్ గానమ్ :— అరైయరులచే చేయబడు నృత్యములందు పాడబడునట్టి భక్తిరస గానము. ఈ గానము ఈ నృత్యము వైష్ణవ ఋషులు 12 గురిలో ఒకరైన 'తిరుమంగైఆళ్వార్'చే రూపొందించబడినదిగా తెలియబడుచున్నది.

అరైయర్ నటనమ్ :— శ్రీరంగము మొదలగు వైష్ణవ దేవాలయములలోని అర్చక నర్తకులు చేయబడు నాట్యమునకు పేరు. ఇటువంటి నృత్యమును శ్రీరంగ క్షేత్రములో డిసెంబరు, జనవరి మాసములందు నేటికిని చూడవచ్చును.

అలకవరాళి :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము—స ని ధ ప మ గ రి గ స.

అలకావళీ :— "సంగీతకౌముది" అను గ్రంథములో అలకవరాళి రాగమునకు బదులు తప్పుగా పడినటువంటి పేరు.

అలకోజ :— గాలివాద్యమునకు చెందిన ఒకరకపు వాద్యము. ఇది ఒక స్వరనాడిని ఒక శృతినాడిని కలిగియుండును. సాధారణముగా యీ వాద్యము గ్రామములందు జరుగు వుత్సవములలో వాయింపబడును.

అలగులు :— తమిళములో వ్రాయబడిన ఒక పురాతన సంగీత గ్రంథములోని యిరువది రెండు శృతులను 22 అలగులు అని చెప్పబడినవి. ఈ 22 అలగులు కలది ఒక స్థాయి యనబడును.

అలపద్మ :— నృత్యములో నుపయోగింపబడు 'అసంయుత హస్తము'లలోని ఒక రకము.

**అలబుసారంగి :—** ఉత్తర దేశములో నుపయోగింపబడుచున్నట్టి విల్లు (కమాను) తో వాయింపబడు నొక విధమైన తంతి వాద్యము.

**అలరు :—** 37 వ మేళ కర్తయైన 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స గ మ ధ ని స.
అవరోహణము—స ని ధ మ గ స.

**అలవ :—** 42 వ మేళ కర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స గ మ ధ ని స.
అవరోహణము—స ని ధ మ గ స.

**అలంకారప్రియ :—** 10 వ మేళ కర్తయగు "నాటకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి గ మ ధ ని స.
అవరోహణము—స ని ధ మ గ రి స.

**అలంకారము :—** ప్రధానమైన సప్తతాళములకు పంచజాతి సంబంధము కలుగుటచే యేర్పడిన ముప్పది యైదు తాళములను ప్రదర్శించుటకేర్పరచిన స్వర సంబంధమైన రచనలకు అలంకారములని పేరు. ఉ॥ స రి గ మ । గ రి । స రి గ రి । స రి గ మ॥ అనునది చతురశ్రజాతి ధ్రువతాళమును ప్రదర్శించుటకేర్పరచిన ఒక అలంకారమునకు వుదాహరణము. ఇవి అభ్యాస గానమునం దుపయోగింతురు.

**అలంకారము :—** పురాతన సంగీత విధానములో స్వరసముదాయములోని ఒక రకము. అనగా స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి వర్ణములను భేదముల ననుసరించి స్వరములను జేర్చుటను అలంకార మనబడును. ఇది గానమునకు రంజకమును కలిగించునదిగానుండును. పురాతన సంగీతములో యివి గమకముల పాత్రను వహించినట్లుగా తెలియబడు చున్నది.

**అలంకారిణి :—** 'భావభట్టు'ని గ్రంథములో తెలుపబడిన 22 శృతుల పట్టికలో మధ్యమ స్వరము యొక్క 4 వ శృతి లేక ఆఖరు శృతికి పేరు.

**అలంకృత :—** "నారదశిక్ష" అను గ్రంథములో చెప్పబడిన సంగీతమును పాడుటలోగల పది విధములలో నొకదానికి పేరు. ఇది ఒక స్థాయియొక్క పద సమూహమును యింకొక స్థాయిలో పాడునట్టిదిగా నుండును.

**అలంకృతులు :—** "ఉద్దీపన విభావము"నందుగల గుణములు, చేష్టలు, అలంకృతులు, తటస్థములు అను 4 విధములలో 3 వ రకము. అనగా వస్త్రములు, ఆభరణములు, పుష్పములు, విలేపనములు మొదలగునవి. 'అలంకృతు'లనబడును.

**అలంఘనము :—** ఇది రాగ దశలక్షణములలో 9 వ దైన 'బహుత్వ'మను రాగ లక్షణమును తెలియపరచు రెండు విధములలో నొకటి. అనగా నిది ఒక స్వరము తేలికగా తగలకుండానే దాటివేయబడునదిగానుండును. మిగతరెండవవిధము అభ్యాసము. (దీనినిఅభ్యాసమునందు చూడుము.)

**అల్పత్వము** :— రాగములకుగల త్రయోదశ లక్షణములలో నొకటి. రాగములో తక్కువగా నుపయోగింపబడు స్వరమును తెలియజేయును. ఉ॥ 'సారంగ' రాగములోని ధైవతము యిందుకు వుదాహరణగా తీసికొనవచ్చును. బహుత్వమునకు వ్యతిరేకమైన యీ అల్పత్వము 'లంఘనము, అనభ్యాస'మను రెండు విధములుగా నున్నది. వాటి వివరములు యీ గ్రంథమునందే చూడదగును.

**అలారిప్పు** :— భరతనాట్య ప్రదర్శనములో మొదటిభాగమని చెప్పబడు ఒక రకమైన నృత్యము. ఇది పవిత్ర నాట్యములో రసవంతమైనట్టియు, శక్తివంతమైనట్టి భాగమగును. నాట్యాచార్యునిచే జతులకు చేయబడు యీ నృత్యముయొక్క సంగీత నడక చతురశ్ర, త్రిశ్ర, లేక మిశ్రగతిగానుంచవచ్చును. నృత్యభాషలో నిది 'అడవు'అనికూడాచెప్పబడియున్నది. ప్రార్థనావిధానమైన యీ రచనలలో అంగ, భంగిమములు క్లుప్తముగా చెప్పబడును. సంగీత స్వారస్యము యిందు విశేషముగానుండును. ఈ అలారిప్పులోని సాహిత్యము జతులుగలిగి తాళగణితశాస్త్రమునకు సంబంధించినదై మధ్యమకాలములో పాడదగినదిగానుండును. సాధారణముగా సంగీత కచ్చేరీలలో ప్రారంభమున పాడునటువంటి తానవర్ణమువలన కచ్చేరీకికలుగునట్టిపుపయోగమే నృత్యమునందు ఈ అలారిప్పు వలన కలుగును. ఈ అలారిప్పు నాట్యముచేయువానిని ప్రవేశపెట్టును. ఇట్టివి దక్షిణభారతమునందు భరతనాట్య ప్రదర్శనములలో నేటికిని పాడుచుండుట వినవచ్చును.

**అలియబిలావల్** :— ఇది శంకరాభరణమేళమునకుచెందినట్టి ఉత్తరహిందూ దేశమునందు వాడుకలోనున్న రాగము.

**అలివర్ధని** :— 17 వ మేళకర్తయగు "సూర్యకాంతము" యొక్క జన్యరాగము. [సంగీతకౌముది.]
ఆరోహణము — స రి గ మ ని స.
అవరోహణము — స ని ధ ప మ గ రి స.

**అల్లియమ్** :— పవిత్రమైన 11 నృత్యములలో నొకటి. ఇది కామవిమోచనానంతరం శ్రీ మహావిష్ణువుచే చేయబడినదిగా తెలియుచున్నది.

**అవంజి** :— ఇదియొకరకమైనచర్మవాద్యము. ఇది ఆవుచర్మముతో మూయబడిన వాద్యమగుటచే తమిళములో దీనికీపేరు నచ్చినట్లు తెలియుచున్నది.
[వంజిత్తోల్ = ఆవుచర్మము]

**అవ్యక్తము** :— 'మాతంగుని'చే చేయబడిన నాదమునందలి విభాగములలో నొకదానికిగల పేరు.

**అవ్యక్తుడు** :— గద్గదస్వరముగలవాడై సాహిత్యమునుచ్చరించుటయే తెలియకగానముచేయు 'గాయకుని'కి గల పేరు.

**అవనద్ధకుతప** :— ఢంకా మొదలగు లయవాద్యములను వాయించు వాద్యకుల బృందమునకు పేరు.

**అవనద్ధవాద్య** :— చర్మముతో కప్పబడిన యొకరకపు తాళవాద్యము. ఇది

'డమరుకము' లేక చర్మవాద్యముల రకమునకు చెందినది.

**అవనాధ :—** సంగీత వాద్యవిభజనలోని మూడవరకము.

**అవరోహణత్వ :—** అవరోహణక్రమములోని స్థితిని తెలియచేయునది.

**అవరోహణమ్ :—** దశవిధగమకములలో రెండవదానికి పేరు. ఇది అవరోహణ క్రమములోనున్న స్వరములను రంజకముగా నుచ్చరించుటను కలిగియుండును.

**అవరోహణము :—** హెచ్చునుండి తగ్గునకు దిగునట్టి స్వరముల వరుసకు పేరు. ఉ॥ స ని ధ ప మ గ రి స.

**అవరోహణస్థాయి :—** రాగాలాపనలో రాగవర్ధని తరువాతవచ్చు రాగాలాపన చివరి స్థితిలోని ఒక భాగము. ఇక్కడ స్థాయిస్వరములు అవరోహణక్రమములో నుండును. ప్రతిస్థాయి స్వరముతో మొదలుపెట్టు సంచారములు పైకి వెళ్ళుచుండును. అనగా ప్రతిచోట సంచారములు స్థాయిస్వరముల క్రిందికి వెళ్ళవు. ఇటువంటి రాగాలాపన మధ్యమకాలములోనే జరుపబడును. ఇది ఆరోహణ స్థాయికి వ్యతిరేకమైనదిగా నుండును.

**అవరోహ్యాలంకారము :—** అలంకార భేదములగు 5 విధములలో మూడవది.

**అవరోహివర్ణము :—** గానక్రియ లేక వర్ణముల యొక్క 4 రకములలోనొకటి ఇది. గానము చేయునపుడు ప్రారంభించెడి స్వరమునుండి అవరోహణ క్రమముగా దిగుట. ఉ॥ స ని ధ ప మ గ రి స. ని ధ ప మ గ రి స. ధ ప మ గ రి స. ప మ గ రి స.

**అవలచ్చువై :—** తమిళములో కరుణారసముకర్థము. ఇది దీనస్థితినిచూచి కలుగు భావము. నవరసములలో నొకటి.

**అవలయప్పాట్టు :—** అవలయతో కూడిన పాటకు తమిళములోని పేరు. దీనిని అవలయములో చూడుము.

**అవలయమ్ :—** తప్పుగా వేయబడునట్టి లయ లేక తాళము. ఇది తాళజ్ఞానములేని గాయకుని సంగీతములో వినపడును. దీనినే 'అవలయప్పాట్టు' లేక 'అవలయవాసిప్పు' అని చెప్పుదురు.

**అవ్యవస్థితుడు :—** గానము చేయు పద్ధతులను వ్యవస్థలను యెఱుంగక తనకు తోచినటుల గానము చేయునట్టి గాయకుని పిలువబడు పేరు.

**అవస్థానవరాటి :—** 'పార్శ్వదేవుని 'సంగీత సమయసారము'లో చెప్పబడిన సంపూర్ణ రకమునకు చెందినఒక ఉపాంగరాగము.

**అవహిత్థ :—** భావశాస్త్రమునందు చెప్పబడిన 'వ్యభిచారి భావము'నందుగల 33 విధములలో 26 వది.

**అవాంతరశృతి :—** మధ్యస్థముగవచ్చు శృతి లేక స్వరము. అనగా యిరువది రెండు

శ్రుతుల శ్రేణిలో యేవైనా రెండు వరు సగానుండు స్వరములునివ్వవచ్చు శ్రుతికి పేరు.

అవికృతస్వరము :— ధ్వనియందు మార్పులేనట్టియు ఇతరజాతి స్వరములను అనుమతింపనట్టివగు షడ్జ, పంచమ(స, ప) స్వరములకు పేరు. వీటినే అచలస్వరము లని చెప్పుటకూడ కలదు. ఒక స్థాయిలో గల 7 స్వరములలో పై స, ప, అను రెండు స్వరములుగాక మిగిలిన రి, గ, మ, ధ, ని అను ఐదు స్వరములు షడ్వి, వికృతరకముల రెంటిని అనుమతించును.

అవినయకూట్టు :— 'శిలప్పదికార' మను తమిళగ్రంథముయొక్క వ్యాఖ్యలో చెప్పబడిన అవయవముల కదలికలకు గల భాషను వుపయోగించు నొకనృత్యము.

అవినయమ్ :— అభినయమునకు తమిళములో వాడునట్టి పేరు.

అంశము :— రాగముయొక్క రసమును తెలియపరచునదో లేక వివరించునది.

అంశస్వరము :— దీనినే జీవస్వరమనియు, రాగచ్ఛాయాస్వరమనియు పిలువబడును. అంశస్వరము రాగము యొక్క ఆత్మగా నుండును. ఒకరాగము ఒకటిలేక యెక్కువ జీవస్వరములను కలిగియుండవచ్చును. పురాతన సంగీత గ్రంథములలో చెప్పబడిన రాగత్రయోదశలక్షణములలో నీ 'అంశస్వరము' ఒకటిగాచెప్పబడినది.

అశ్వక్రాంతము :— ఆదిమ శ్రేణియైన షడ్జగ్రామముయొక్క గాంధారమూర్ఛనకు పేరు. దక్షిణదేశపు సంగీతము యొక్క కల్యాణి మేళమునకు ఈ మూర్ఛన సరిపోవును.

అశ్వతరము :— పూర్వము సరస్వతి యనుగ్రహమువలన శ్రేష్టమైన నాదవిద్యనుపొంది దానిచే మహాదేవుని సంతోషపరచిన ఫలితముగా ఆయనకు కర్ణాభరణమైన యొకపాము కుగల పేరు.

అశ్వతానము :— మనోధర్మ సంగీతము లోని ఒకభాగము. సప్తస్వరములు గల పదములను తఱచుగా నుపయోగించు నొక రకపు తానము. ఇది ఘనతానములోని 8 విధములలో 2 వది.

అశ్వతాళము :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను సంగీత గ్రంథములో చెప్పబడిన మిశ్రజాతి ఏకతాళము. దీనికి అంగములు 1. అక్షరకాలము 7.

అశ్వరూఢా :— 'బృహద్ధర్మపురాణము' లో చెప్పబడిన ప్రాథమిక రాగ వసంత కుగల 6 రాగిణిలలో నొకటి.

అశ్రువు :— భావశాస్త్రమునందు చెప్పబడిన సాత్వికభావమునంపుగల 8 విధములలో 7 వది.

అష్టకము :— ఒక రచనలో ఎనిమిది భాగములువుండి అందలి ప్రతిభాగము ఒకే సంగీత విధానమునందు పాడునట్టి పాట.

**అష్టకల్యాణి :—** కల్యాణి రాగమునకు సంబంధించిన ఒక సంగీత పదముగా తోచినను నాలుగుకాళ్ళు, ముఖము, తల, తోక, రొమ్ము భాగములు తెల్లగానుండు సత్తెగుఱ్ఱమునకు అశ్వశాస్త్రమునందు చెప్పబడినట్టి పేరు.

**అష్టగణములు :—** తాళవిధానములో నుపయోగింపబడు 8 గణములకు పేరు. ప్రతిగణము మూడు అంగములను కలిగి యుండును. వివిధగణములకుగల భేదము వాటి అంగములయొక్క అమరిక విధానము నందుగల తేడాలలో తెలియనగును. 108 తాళముల లక్షణ శ్లోకములందు గణములలో తాళములయొక్క అంగములను చెప్పబడియున్నవి. ఈ అంగములను గురువును 8 అను గుర్తుచేతను లఘువును । అను గుర్తుచేతను తెలియజేయబడును. ఈ క్రింద తెలుపబడినవి అష్టగణములయొక్క అంగములుగా తెలియనగును.

(1) మ గణము...... 8 8 8
(2) భ గణము...... 8 । ।
(3) జ గణము...... । 8 ।
(4) స గణము...... । । 8
(5) న గణము...... । । ।
(6) య గణము...... । 8 8
(7) ర గణము...... 8 । 8
(8) త గణము...... 8 8 ।

**అష్టదశాంగుళము :—** "సంగీత రత్నాకరము"లో జెప్పబడిన ఒక రకమైన 'మురళీ' వాద్యము. దీనిలో ఊదు రంధ్రమునకు మొదటి వ్రేలి రంధ్రమునకు మధ్య దూరము 18 అంగుళములుండును. దీనిలో 1-7 వ్రేలి రంధ్రములను మూసి ఊదినపుడు మంద్రమధ్యమము పలుకును.

**అష్టతాళము :—** కన్నడములో వ్రాయబడిన యక్షగానమునందు కనబడు ఒక రకమైనతాళము.

**అష్టపదులు :—** 'జయదేవు'నిచే విరచితమైన శృంగార రసప్రధానమగు 'గీతగోవింద మహాకావ్యము'లోని సంగీత రచనలకు పేరు. ఇవి సంగీత కీర్తనలకు ప్రప్రథమములుగానున్నవి. ఇవి 24 అష్టపదులు. ఒక్కొక్కదానికి 8 పాదములుండును.

**అష్టపదులకంటె పురాతన రచనలు :—** రాగములను మాత్రమే యివ్వబడి తాళములను యివ్వకపోయినను వాటి కాలకొలతలను మనము వూహించుకొనదగినట్లు తమిళ భాషలో వ్రాయబడిన 'తేవారములు' యీరకములోనివి.

**అష్టపదులననుసరించి వ్రాయబడిన రచనలు :—** 'వెంకటమఖి' (17వ, శ.) వ్రాసిన 'త్యాగరాజాష్టపది'యు 'చంద్రశేఖరేంద్ర సరస్వతి' (18 వ, శ.) వ్రాసిన 'శివాష్టపది'యు రామకవి (19 వ, శ.) వ్రాసిన 'రామాష్టపది'యు యీ రకమునకు చెందిన రచనలైయున్నవి.

**అష్టభుజ నటరాజు :—** 8 భుజములు కల నటరాజు శిల్పము. ఇటువంటి నృత్యసంబంధమైన 'నటరాజ శిల్పవిగ్రహము' 'ఎల్లోరా' గుహలలో కలదు.

**అష్టభుజ మురళీ కృష్ణుడు :—** మురళిని వాయించుచున్నట్లు 8 భుజములుగల కృష్ణుని శిల్పముపేరు. ఇట్టి చెక్కడములు దక్షిణ దేశమున 'కాంచిపురము'లోని

'వరదరాజస్వామి' దేవాలయములోను, దిండిగల్ సమీపమున 'తాడికొంబు' లోని 'సుందరరాజ పెరుమాళ్' దేవాలయములోని మంటపములందును మురళీ వాయించునట్టి అష్టభుజ మురళీకృష్ణ శిల్పములు గలవు.

అష్టమహిషి కల్యాణము :— తిరువెంకటనాథుని (చిన్నయ్య)చే రచింపబడిన ద్విపదకావ్యము. శ్రీకృష్ణుడు స్వర్గ సంబంధమైన 8 మంది భార్యలను పెండ్లి చేసుకొనువిధమును 5 అంకముల కథగా తెలుగులో వ్రాయబడిన గ్రంథము.

అష్టమూర్తి :— 36 వ మేళ కర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స గ రి మ ప ని ధ స.
అవరోహణము—స ని ధ మ ని మ గ రి స.

అష్టవిధతాన ప్రవీణ :— క్రిందటి శతాబ్దమునకు చెందినట్టియు 8 విధములగు తానములను పాడుటలో మేటియని ప్రఖ్యాతి నొందినట్టియు 'సత్తనూరు పంజు అయ్యర్'కుగల బిరుదు.

అష్టవిధతానములు :— 'తానమ్' పాటలో వచ్చు అలంకార భేదములు లేక పదసమూహముల అమరికనుబట్టి విభజించబడిన మానవ, అశ్వ, గజ, మర్కట, మయూర, కుక్కుట, మండూక, చక్ర అనెడి 8 తానములను అష్టతానములని చెప్పుదురు. పూర్వీకులు యీ తానముల లక్షణములను సాదృశ్యమునుబట్టి ఆయా జంతువుల, పక్షుల పేర్లను వీటికి పెట్టి యున్నట్లు మనమూహింపవచ్చును.

అష్టవిధ నాయికలు :— నాయికా లక్షణమందు చెప్పబడిన స్వాధీనపతిక, వాసక సజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషిత భర్తృక, అభిసారిక అని యవస్థాసరములయందు నాయికలలోని 8 విధములకు పేరు.

అష్టాదశ వాద్యము :— దక్షిణదేశమున ప్రసిద్ధ దేవాలయములలో పూజలు జరుగు సమయములందు వాయింపబడు 18 రకములగు సంగీత వాద్యములకు పేరు.

అష్టాపదము :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స మ ప ధ ని స.
అవరోహణము — స ని ధ ప మ స.

అష్టి :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ మ ధ ని స.
అవరోహణము — స ని ధ మ గ స.

అష్టోత్తరశత తాళములు :— 108 తాళములకు యివ్వబడిన పేరు. చచ్చత్పుట, చాచపుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్టక, ఉద్ఘట్ట, ఆది, దర్పణ, చర్చరి, సింహలీల, కందర్ప, సింహవిక్రమ, శ్రీరంగ, రతిలీల, రంగ, పరిక్రమ, ప్రత్యంగ, గజలీల, త్రిభిన్న, వీరవిక్రమ, హంసలీల, వర్ణభిన్న, రంగద్యోతన, రాజచూడామణి, రాజ, సింహవిక్రీడిత, వనమాలి, చతురశ్రవర్ణ, త్రయశ్రవర్ణ, మిశ్రవర్ణ, రంగప్రదీప, హంసనాద, సింహనాద, మల్లికామోద. శరభలీల, రంగాభరణ, తురంగలీల, సింహనందన, జయశ్రీ, విజయా

నంద, ప్రతి, ద్వితీయ, మకరంద, కీర్తి, విజయ, జయమంగళ, రాజవిద్యాధర, మఠ్య, జయ, కుడుక్క, నిస్సారుక, క్రీడ, త్రిభంగి, కోకిలప్రియ, శ్రీకీర్తి, బింద మాలి, సమ, నందన, ఉదీక్షణ, మట్టిక, ఢేంకిక, వర్ణమట్టిక, అభినందన, అంతర క్రీడ, మల్ల, దీపక, అనంగ, విషమ, నంది, ముకుంద, కందుక, ఏక, అట, పూర్ణకం కాళ, ఖండకంకాళ, సమకంకాళ, విషమ కంకాళ, చతుస్తాళ, డోంబులి, అభంగ, రాయవంకోల, లఘుశేఖర, ప్రతాపశే ఖర, జగఝంప, చతుర్ముఖ, ఝంప, ప్రతిమఠ్య, గారుగి, వసంత, లలిత, రతి, కర్ణయతి, యతి, షట్, వర్ధన, వర్ణయతి, రాజనారాయణ, మదన, కారిక, పార్వతి లోచన, శ్రీనందన, లీల, విలోకిత, లలిత ప్రియ, ఝల్లక, జనక, లక్ష్మీశ, రాగవర్ధన, ఉత్సవ, అనెడి 108 తాళములకు పేరు.

**అష్టోత్తరశత మేళములు** :— 72 క్రమ సంపూర్ణ మేళములను 36 వికృతపంచమ మేళములను కలిసి 72+36=108 మేళములకు యివ్వబడిన పేరు.

**అష్టోత్తర శత రాగ తాళమాలిక** :—— 108 రాగ, తాళములలోని రాగతాళమాలికకు పేరు. ఇది రామస్వామి దీక్షితారునిచే (1735-1817) వ్రాయబడినది. భారతీయ సంగీతములో నిదియొక పెద్ద రచన. దీనిని ప్రదర్శించుటకు మూడు గంటలకాలముపట్టును. రచనలోని ప్రతిభాగములోను రాగముద్ర, తాళముద్రకలిగి యుండును. దీనిలో శ్రీమత్కీర్తివంటి అపూర్వ తాళములు గూడ గలవు.

**అసతి** :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ మ ధ ని స.
అవరోహణము — స ని ధ మ గ స.

**అసంకీర్ణస్థాయి** :— రాగము యొక్క ప్రాముఖ్యత్వముతో కలిసియుండు తక్కువగా తెలిసిన 20 స్థాయలలో ఒకదానిపేరు.

**అసంపూర్ణతానము** :— ఏడు స్వరములను కలిగియుండని స్వరములతో కూడిన పదము. లేక తానము. ఇందు 6, 5, 4, 3, 2 స్వరములుమాత్రమే కలిగియుండును.

**అసంపూర్ణ మేళములు** :— ఆరోహణముగాని అవరోహణముగాని రెండుగాని సంపూర్ణముగాలేని మేళములు. అనగా షాడవముగాని ఔడవముగాని అయివుండునవి. 'కనకాంబరి' 'ఫేనద్యుతి'గల వెంకటమఖి మేళ పట్టికలోని చాలా మేళములు యీ అసంపూర్ణ మేళములుగా నున్నవి.

**అసంబాధ** :— 29 వ వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణరాగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి స మ ప ధ ని ధ స.
అవరోహణము — స ని ధ ప మ గ మ రి స.

**అసంయుతహస్తము** :— ఇది ఒకే చేతితో చేయబడుకదలిక. రెండు చేతులతో చేయబడు సంయుతహస్తమునకు వ్యతిరేకము.

**అసాధారణ** :— 'సంగీతరత్నాకరము' లో చెప్పబడిన 33 సంకీర్ణ స్థాయల (Compound Gamakas) లోఒకటి.

**అసావేరి** :— 8 వ మేళకర్త యగునట్టి 'హనుమత్తోడి' యొక్క జన్యరాగము. ఆరోహణము — స రి మ ప ధ స. అవరోహణము— స ని స ప ధ మ ప రి గా రి స. లేక స ని స ప ధ ని ధ ప మ గ రి స.

**అసావేరితోడి** :— 8 వ మేళకర్తయగు 'హనుమత్తోడి'యొక్క జన్యరాగము. ఆరోహణము — స రి మ ప ధ ని స. అవరోహణము — స ని ధ ప మ గ రి స.

**అసుణమ్** :— తమిళ సాహిత్యములో చెప్పబడిన సంగీతము నాస్వాదించు ఒక విధమైన పక్షికిపేరు. వేటకాండ్రు ఈ పక్షులను పట్టుకొనుటకు మాధుర్యమైన సంగీతమును వాయించెడివారట. ఆ సంగీత మాధుర్యమునకు ఆపక్షి తన్మయత్వముచెందియుండగా వేటకాండ్రు పెద్ద పెద్ద ఢంకాలను గట్టిగా వాయించగనే కఠినమైన ఆ శబ్దమును వినలేక ఆ పక్షి చచ్చిపడియుండెడిదని చెప్పబడియున్నది. కాని కొందరు పండితులు 'అసుణమ్' అనునది పక్షికాదనియు ఒక పురుగుఅనియు చెప్పుచున్నారు.

**అసుణమా** :— 'అసుణమ్'నకు గల మరియొక పేరు.

**అసురసాధకము** :— నిరంతర సాధకము అను అర్థము నిచ్చు గ్రామ్యపదము. సాధారణముగా సంగీతము నభ్యసించు గాయకులు,వాద్యకులు ప్రతిదినమును సంగీతమును యెక్కువగంటలు సాధకము చేయుటవలన లభించు నట్టి సంపూర్ణమైన ప్రావీణ్యము యీ అసుర సాధకమువల్లనే పొందగలిగినట్లు చెప్పెదరు.

**అసూయ** :— భావశాస్త్రమునందు చెప్పబడిన 'వ్యభిచారి భావము'నందుగల 33 విధములలో 4 వది.

**అక్షరకాలము** :— సంగీతములో కాల ప్రమాణము. ఈ అక్షరకాలము విలువ యింకొకదానికి సంబంధించినదేగాని స్వతంత్రమైనదికాదు. ఉ॥ చతురశ్రజాతి త్రిపుట తాళము. దీని అక్షరకాలము విలువ 8. అనగా 4+2+2=8 అగును.

**అక్షరతాళము** :— 'రామస్వామి దీక్షితారు'నిచే రచింపబడిన 108 రాగతాళమాలికలో కనపడు ఒక అపూర్వమగు తాళము.

**అక్షరము** :— (1) సంగీతమునకు సంబంధించిన స్వరములన్నియు వాటికిగల ధ్వనులులేకుండా ఉచ్చరించినచో నవి అక్షరములుగనే యెంచబడును. (2) ఆయాభాషలకు సంబంధించిన వర్ణములన్నియు ఆయాభాషలకుగల అక్షరములుగనే చెప్పబడును. ఉ॥ తెలుగు భాషలో అ మొదలు క్ష వరకు గల వర్ణములన్నియు అక్షరములుగనే చెప్పబడును. ఇట్లే ఇతర భాషలయందును చెప్పబడును.

**ఆకాశవీణ :—** పండితారాధ్య చరిత్రలో 'పాల్కురికి సోమనాథ కవి'చే చెప్పబడిన ఒక రకమైన వీణకు పేరు.

**ఆక్టేవు :—** సప్తస్వరములు వాటి భేదములగు ద్వాదశ స్వరములతో కూడిన యొక భాగము లేక స్థాయికి ఇంగ్లీషులో చెప్పబడు పేరు.

**ఆకు :—** నాదస్వర వాద్యకులు నాదస్వరమును వాయించుటకు వుపయోగించు నాలుక లేక కీలకను 'ఆకు' అని చెప్పుదురు. దీనిని రెల్లు సంబంధమైన ఒకరకపు గడ్డి ముక్కను ముక్కలు చేసి తయారు చేయుదురు. ఈ ఆకును నాదస్వరపు కంఠమునకు కూర్చి నోటిలోనుంచుకొని తమ పుము సరియైన నాదము వచ్చునట్లు చేసి వాయింతురు.

**ఆకోట్పరై :—** యుద్ధములో శత్రువుల కోటను పట్టుకొనుటకు వుపయోగించు ఒక విశేషమైన డమరుకము లేక చర్మవాద్యమునకు తమిళములోని పేరు.

**ఆగలమ్ :—** 17 వ శతాబ్దమునందు వ్రాసిన 'భరతనాట్టియ శాస్త్రమ్' అను తమిళ వ్రాత ప్రతిలో చెప్పబడిన ఒక రాగము.

**ఆగాంతికము :—** భాషాంగ రాగములలో అప్పుడప్పుడు రంజకమునకై వుపయోగించునట్టి అన్యరాగస్వరము.

**ఆంగిక :—** అంగములకు సంబంధించిన యొక పదము. ఇది ఆంగిక అభినయము వలె నుండునది.

**ఆంగిక అభినయము :—** అభినయములోని 4 రకములలో నొకదాని పేరు. అవయవముల కదలికలతో కూడుకొనియుండును.

**ఆఘాట :—** నృత్యమునకు అనుగుణముగ వాయింపబడు నొక అతిప్రకంపన వాద్యవిశేషము ; గుస్తులు.

**ఆఘాటి :—** నృత్యము ననుసరించుట కుపయోగింపబడు గుస్తులు. ఇది ఋగ్వేద, అధర్వణ వేదములలో చెప్పబడినది.

**ఆచార్యముద్ర :—** సంగీత రచనలలో కనుపడు 12 రకముల ముద్రలలో ఒకటి. కృతికర్త తన సంగీత రచనలోని సాహిత్యములో తన ఆచార్యుని లేక గురువు యొక్క పేరును ముద్రగా పెట్టుకొనును. ఉ॥ గానవిద్యాధురంధర, అను నాటరాగములోని గీతము దీనికొక మంచి వుదాహరణ యగును.

**ఆఴ్వార్ (ఆళ్వార్) తిరునగరి :—** తిరునల్వేలి జిల్లా (ద.భా.)లో సంగీత శిల్పములు గలిగిన ఒక ప్రఖ్యాత వైష్ణవ దేవాలయము. దీనిలో అందమైన సంగీత శిలాస్తంభములును ఒక అరుదైన రాతి నాగస్వర వాద్యము కలదు.

**ఆట :—** కన్నడములోని యక్షగానము లేక నృత్యనాటికకు పేరు.

**ఆట భాగవతమ్ :—** ఆంధ్రరాష్ట్రంలోని కృష్ణాజిల్లాలోగల 'కూచిపూడి' గ్రామములోగల భాగవతులచే ఆడబడు ఒక తెలుగు నృత్యనాటిక.

**ఆటవర్ణము** :— నృత్యమునకై ఉద్దేశింపబడిన ఒక రకపు వర్ణరచనము. ఇది పదవర్ణమును బోలినదిగావుండును.

**ఆట్టకథ** :— 'కథాకళి'కిగల మరియొక పేరు.

**ఆట్టమ్** :— తమిళ, మళయాళ దేశములకు చెందిన ఒక రకపు నృత్యమునకు పేరు.

**ఆట్టి పైప్పవర్** :— నట్టువనార్ లేక నృత్య ప్రదర్శనయొక్క నిర్వాహకునికి తమిళములోని పేరు.

**ఆంటొఫోనెస్** (Antophones :— చిరతలు, చేతాళములు వంటి స్వయం ప్రకంపనములుగల వాద్యములకు ఇంగ్లీషు పేరు.

**ఆడర్ కూట్టియర్** :— నృత్యముచేయు బాలికలకు తమిళములోని పేరు.

**ఆడంబర** :— పురాతన సాహిత్యములో చెప్పబడినట్టి యుద్ధమునందుపయోగింపబడు నొక రకపు డమరుకము. లేక చర్మ వాద్యము.

**ఆడంబరఘాత** :— 'ఆడంబర' అను ఒక రకపు డమరుకము (చర్మ వాద్యము)ను వాయించువాడు.

**ఆడనూర్** :— 'గోపాలక్రిష్ణ భారతి'చే కీర్తనల రూపముగా నాటకము వ్రాయబడిన భక్త 'నందనారు' యొక్క పుట్టిన గ్రామము. ఇది దక్షిణ ఇండియాలో 'తంజాపూరు' జిల్లాలో వున్నది.

**ఆడనూల్** :— నృత్యశాస్త్రమునకు సంబంధించిన ఒక తమిళ గ్రంథము.

**ఆడల్** :— తమిళములో నృత్యము లేక ఆట.

**ఆడలాసిరియర్** :— నాట్యోపాధ్యాయునికి తమిళములోని పేరు. ఆతని అర్హతలు అవసరములనుగురించి తమిళ నృత్యశాస్త్ర ప్రమాణ గ్రంథములలో చెప్పబడినవి.

**ఆడలిడమ్** :— తమిళములో రంగస్థలము లేక ప్రదర్శనా స్థలమునకు పేరు.

**ఆడవల్లాన్** :— తంజావూరు దేవాలయములోనున్న నటరాజ విగ్రహమునకు తమిళములోని పేరు.

**ఆడవై** :— నృత్యముచేయు స్థలము లేక హాలుకు తమిళములోని పేరు.

**ఆణి** :— వీణయొక్క దండెని చక్కగా బిగించెడి యినుప వస్తువుకు (నట్టు) తమిళములోని పేరు. ఇది యినుముతో చేయబడును.

**ఆతంబార్** :— అరబ్బులు వుపయోగించు నొకరకపు మృదంగము.

**ఆతోథ్య** :— ఇదియొక రకపు సంగీత వాద్యము.

**ఆతోద్యతుంబురు** :— 'నరసింహవర్మన్' అను రెండవ రాజునకుగల బిరుదు. ఇతని

యొక్క ఇతర సంగీత విశేష నామధేయములు వాద్య విద్యాధర, వీణా నారద అనునవి.

ఆందోళము :— దశవిధగమకములనెడి 10 గమకములలో నొకదానికి పేరు. ఇది ఆందోళిత గమకమువలెనుండును.

ఆందోళము :— 'నారదుని' 'సంగీత మకరందము'లో చెప్పబడిన సూర్యాంశ రాగములలో నొకటి.

ఆందోళి :— 'నారదుని' 'సంగీతమకరందములో' చెప్పబడిన చంద్రాంశ రాగములలో ఒకటి. ఇది 'భరతశాస్త్రిరమ్' అను తమిళ గ్రంథములోకూడా చెప్పబడినది.

ఆందోళిక :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి మ ప ని స.
అవరోహణము — స ని ధ మ రి స.

ఆందోళితము :— పంచదశగమకములను 15 టిలో నొకటి. ఇది ఒకస్వరస్థానములో తంత్రినిలాగి హెచ్చుస్వరమును పలికించును.

ఆది :— సూళాది 35 తాళములపట్టికలో 'చతురశ్ర' జాతి త్రిపుట తాళమునకు గలపేరు. అంగములు I 0 0. ఆవర్తమునకు అక్షరకాలము 8.

ఆది :— శాస్త్రీయమైన 108 తాళములలో ఒకే లఘువును కలిగిన యొక తాళము. అంగములు I. మాత్రలు 1. అ.క.గ.కాలము 4.

ఆది :— "మేళాధికార లక్షణము" అను గ్రంథములో వ్రాయబడిన 4624 సంపూర్ణ మేళముల ప్రణాళిక (స్కీము)లో మొదటి మేళము. గ్రంథకర్త యీపట్టికలో షడ్జ పంచమములతోపాటు ప్రతి శుద్ధ రిషభ, ప్రతి శుద్ధ గాంధార, శుద్ధ మధ్యమ, ప్రతి శుద్ధ ధైవత, ప్రతి శుద్ధ నిషాదములను స్వరములు కలిగియున్నటుల పేర్కొనెను. షడ్జము దీనికి గ్రహము, అంశము, న్యాసము అని చెప్పబడెను.

ఆదికామోద :— 'పార్శ్వదేవు'ని యొక్క 'సంగీత సమయసారము'లో చెప్పబడిన భాషాంగ సంపూర్ణ రాగములకు చెందిన ఒక రాగము.

ఆదికామోది :— 'రఘునాథుని'చే అతని 'సంగీత సుధ'లో చెప్పబడిన 20 భాషాంగరాగములలో ఒకటి. సంగీత రత్నాకరములోగూడ ఈ రాగము పేర్కొనబడినది.

ఆదిగురు :— సంగీతమును క్రమబద్ధముగా బోధించుటకు తగిన రచనలు వ్రాసిన మొదటి గురువు. సంగీత ప్రసమాభ్యాసమునకు తగిన స్వరావళ్యాదులు, అలంకారములు, పిళ్లారిగీతములు, ఘనరాగగీతములు, సూళాదులు మొదలగునవి రచించిన పురందరదాసు (1484 - 1564) వారికిగల గౌరవనామము.

ఆదిత్య :— 72 మేళకర్తలలో 67 - 72 వరకుగల 6 మేళములను కలిగియున్న 12 వ మేళచక్రమును తెలియజేయునది.

ఆదిత్యా - గో :— 12 వ చక్రము లోని 3 వ మేళమగు 'ధాతువర్ధని'ని తెలియజేయునది. ఇది 69 వ మేళకర్త రాగము.

ఆదిత్యా - పా :— 12 వ చక్రము లో 1 వ మేళమగు 'సుచరిత్రము'ను తెలియజేయునది. ఇది 67 వ మేళకర్త రాగము.

ఆదిత్యా - భూ :—12 వ చక్రము లోని 4వ మేళమగు 'నాసికా భూషణి'ని తెలియచేయునది. ఇది 70 వ మేళకర్త రాగము.

ఆదిత్యా - మా :—12 వ చక్రము లోని 5 వ మేళమగు 'కోసలము'ను తెలియచేయునది. ఇది 71 వ మేళకర్త రాగము.

ఆదిత్య - శ్రీ :— 12 వ చక్రము లోని 2 వ మేళమగు 'జ్యోతి స్వరూపిణి'ని తెలియచేయునది. ఇది 68 వ మేళకర్త రాగము.

ఆదిత్యా _ షా :— 12 వ చక్రము లోని 6 వ మేళమగు 'రసికప్రియ'ను తెలియచేయునది. ఇది 72వ మేళకర్త రాగము.

ఆదిత్యా :— 'సంగీత రత్నాకరము' లో చెప్పబడిన ఒక రకమైన మురళి. దీనిలో వూదు రంధ్రమునకును మొదటి వ్రేలి రంధ్రమునకును గల దూరము 12 అంగుళములు. ఇందుగల 1-7 వ్రేలి రంధ్రములు మూసి వూదినచో మంద్రస్థాయి షడ్జమము పలుకును.

ఆదిత్యా :— 'స్వరార్ణవము' లో నున్న స్వరములపట్టికలో 12వ స్వరస్థానమునకు గల పేరు. సంగీత శాస్త్రములో ఆదిత్యా అను పదము 12 అంకెను తెలియచేయును.

ఆదితాళము :— చతురశ్రజాతి త్రిపుట తాళమునకు పేరు. ఈ తాళమును సంగీతాభ్యాసమునందు ఆదియందే అనగా ప్రథమ శిక్షణయందే నేర్చుకొందురు. గనుకనే దీనికి ఆదితాళమను పేరు కలిగినట్లుగా చెప్పుదురు. దీనికి అంగములు 100. అక్షరకాలము 8.

ఆదిద్విపద :—నృత్యనాటికలో నాటిక ప్రారంభమునందుగల కథావిధానములోని సారమును ద్విపదలో చెప్పబడునది.

ఆదిదేశ్య :— 39 వ మేళకర్త యగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ని స.
అవరోహణము — స ని ధ ప మ గ రి స.

ఆదిభరతము:—సాహిత్యములో మొదటి భరతముగా చెప్పబడు 'భరతు'ని నాట్యశాస్త్ర'మను గ్రంథము. ఇదే పేరుగల బ్రహ్మ, జైమిని, అర్జున, భరతములున్నను వాటికిని దీనికిని తేడా గలదు.

ఆదిభైరవి :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ రి మ ప ధ స.
అవరోహణము — స ధ ప మ ప గ రి స.

**ఆదిపంచమము:**—48వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి ప స ని స.
అవరోహణము—స ని ధ ని ప మ గ రి స.

**ఆదిప్రాస :**— సంగీత రచనల యొక్క పాదములలో కనపడు ద్వితీయాక్షరప్రాస. దీనికి వేరొకటైనపేరు అంత్యప్రాస.

**అదియాజ్ (ళ్) :**—పురాతనమైన దక్షిణ దేశపు సంగీతవాద్యము. ఇది 1000 తంత్రు లను గలిగియుండినట్లు చెప్పబడినది.

**ఆదిరసము:**—మానవునిచేఅనుభవింపబడ వలసిన 9 రసములలో ఒకటైన శృంగార (ప్రేమ) రసమునకు పేరు. ఇది నవరస ములలో మొదటి దగుటచే ఆదిరసమని చెప్పబడినది. పదములు, జావళ్లువంటి సంగీత రచనలు శృంగారరస ప్రధాన ముగా నుండును.

**ఆదివరాళి :**— 57 వ మేళకర్తయగు 'సింహేంద్రమధ్యమము' యొక్క జన్య రాగము.
ఆరోహణము :- స రి మ ప ధ స.
అవరోహణము:-స ని ధ ప మ రి మ గ స.

**ఆదివసు :**— 41 వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

**ఆదిశుద్ధరామక్రియ :**—'రాగతాళచింతా మణి' అను తెలుగు గ్రంథములో వ్రాయ బడియున్న ఒక రాగము.

**ఆదిస్వరములు :**— భారతీయసంగీతము నందు కలిసిన మొదటి స్వరములు. ఇవి వేదములలో ఉదాత్త, అనుదాత్త, స్వరి తములని చెప్పబడును. సంస్కృత వ్యాక రణ కర్తయగు "పాణిని" ఈమూటిని ఆది స్వరములుగా పేర్కొనెను.

**ఆంధ్రదేశిక :**— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ మ ప స ని స.
అవరోహణము— స ని ప స ప మ గ రి స.

**ఆంధాళి :**— 28 వ మేళకర్తయగు 'హరి కాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి గ మ రి స.
ఇది ఒక పురాతన రాగముగా 'సంగీత సమయసారము'లో చెప్పబడినది.

**ఆంధాళిభాష :**—'సంగీతరత్నాకరము' లో చెప్పబడిన ఒక రాగము.

**ఆధారషడ్జము :**— బీజస్వరము, శృతి స్వరము లేక ఆధారశృతి. ఇది మధ్య స్థాయి షడ్జమును కలిగియుండునట్టి ప్రాస మిక స్వరము.

**ఆంధ్రి :**— 'సంగీతరత్నాకరము' లో చెప్పబడిన 11 వికృతజాతులలో నొకటి.

**ఆధునికపద్ధతి :**— ఆధునికముగా ఒప్పు కొనబడిన సంగీత పద్ధతి లేక సంగీత విధానము.

ఆధునికప్రసిద్ధరాగములు :— పూర్వము ప్రసిద్ధములైన రాగములకు యితరమైనట్టి ఈ కాలమునందు ప్రసిద్ధిగానున్న రాగములు. ఇవి 'శార్ఙ్గదేవుని' 'సంగీత రత్నాకరము' లో చెప్పబడిన రాగవిభజనయందు గలదు.

ఆధునికసంగీతము :— నవీన సంగీతము లేక ఈ కాలమునందు ఆచరణలో నున్నటువంటి సంగీతము.

ఆనక :— పూర్వకాలములో పవిత్ర సమయములలో నుపయోగింపబడు ఒక పెద్ద చర్మవాద్యము. (Drum)

ఆనకదుందుభి :— పురాతనకాలమున యుద్ధమునందు వాడు ఒక పెద్ద చర్మవాద్యము.

ఆనందకళిప్పు :— 'నాదనామక్రియ' రాగములో 'చాపు' తాళములో ఒక ప్రాముఖ్యమైన తమిళ జానపదగేయము. ఇది సంగీత నాటికలలో కనపడును.

ఆనందకాలిప్పు :— సంగీత శాస్త్రమునకు సంఖ్యాశాస్త్రములేని రోజులలో శ్రుతులకు పేర్లయిచ్చి జ్ఞప్తిలో నుంచుకొనుటకు తగినట్లుగా వ్రాసిన తమిళ రచన.

ఆనందతాండవము :— చిదంబరములో చేయబడిన ప్రఖ్యాత నటరాజ నృత్యము.

ఆనందనటని :— 2 వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ని స.
అవరోహణము — స ని ప మ గ రి స.

ఆనందభైరవ :— భైరవ రాగ జాతికి చెందిన ఒక ఉత్తరదేశపు రాగము.

ఆనందభైరవి :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ రి గ మ ప ధ ప స
అవరోహణము — స ని ధ ప మ గ రి స.
ఇది భాషాంగరాగము. తీవ్రధైవతము స ని ధ ని స - స ని ధ ప - ప ధ ని ధ ని స అను ప్రయోగములలో అన్యస్వరము లుండును. సా. గాం - ప. మ - దై - నిషాదములు జీవస్వరములు. ఎల్లప్పుడు పాడదగును. సాధారణముగా పెండ్లిపాటల జోలపాటలు ఈ రాగములోనే వుండును

ఆనందమ్ :— దక్షిణదేశములో వివాహ సమయములందు వధువు మెడలో వరుడు మంగళసూత్రమును కట్టినపుడు నాదస్వరములో భైరవిరాగములలో 'ఆనందమానంద మాయెనే', అని వాయింపబడుచున్నట్టి పవిత్రమైన ఒక పాట.

ఆనందభోగి :— 42 వ మేళకర్త యగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ని ధ ని.
అవరోహణము — ధ ప మ గ రి స ని.

ఆనందముఖి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స మ గ మ ప ధ ని ప స.
అవరోహణము — స ని ధ ప మ గ రి స.

ఆనంద లహరి :— 29వ మేళకర్తయగు

'ధీర శంకరాభరణము' యొక్క జన్య రాగము.
ఆరోహణము — స రి గ మ ప ధ ని ప స.
అవరోహణము — స ని ప మ గ రి స.

ఆనందలహరీ :— చాపమును కలిగియుండి విల్లు (కమాను) ను తంత్రులుగల ఒక రకమైన పురాతన సంగీత వాద్యము.

ఆనందలీలా :— 33 వ మేళకర్తయగు 'గాంగేయ భూషణి' యొక్క జన్య రాగము.
ఆరోహణము — స రి గ మ ప ని స.
అవరోహణము — స ని ధ ప మ గ రి స

ఆనందవారిధి :— 22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి మ ప ని ధ ప స.
అవరోహణము — స ని ధ ప మ గ రి స.

ఆనందినీజాతిప్రబంధము :— ఏక జాతి ప్రబంధములోని 5 జాతులలో 2 వజాతి ప్రబంధము. ఇది 5 అంగములు కలిగి 10 భేదములను కలిగియుండును. ఉ|| 'పల్లవి శేషయ్యర్' ధన్యాసిరాగము, ఆది తాళములో వ్రాసిన 'తిల్లాన' యిందుకు ఒక మంచి వుదాహరణ మగును.

ఆనందై :— 'కరింజియాజ్' సమూహము నకు చెందిన తమిళ సంగీతములోని ఒక పురాతన జన్యరాగము.

ఆనీకిని :— 7 వ మేళకర్తయగు 'సేనాపతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ధ ని స.
అవరోహణము — స ని ధ మ గ రి స.

అప్రదేశి :— 62వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ మ ప ధ ని ధ స.
అవరోహణము — స ని ధ ప మ గ స.

అబ్రదేశి :— 62వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ మ ప ధ ని ధ స.
అవరోహణము — స ని ధ ప మ గ రి గ స.

ఆబాలి :— 'తిరుపతి' 'తాళ్ళపాకమ్' వారి ప్రచురణలలోని కీర్తనలలో కనపడు ఒక అపూర్వరాగము. 'పయటందించేవె' అను కీర్తన ఈ రాగములోనిదే. ఇది తాళ్ళపాకమ్ వారి రచనలలో 3 వ భాగమగు శృంగార సంకీర్తనలలో నొకటి.

ఆభరణములు :— 'ఉద్దీపనవిభావము' నందలి భాగములగు అలంకృతులలోగల 4 రకములలో 2 వ దానికి పేరు.

అభిరనాట :— 'సోమనాథుని' చే అతని 'రాగవిబోధ' గ్రంథములో చెప్పబడిన 23 మేళములలో నొకదానికి పేరు. ఇదే పేరుతో ఒకజన్యరాగము కూడ ఈ మేళములో నున్నట్లు అతని గ్రంథము నందే చెప్పబడెను.

అభిరి :— 'సంగీత రత్నాకరము' లో ఈ రాగమును 'మాళవకైశిక' యొక్క భాషలలో నొకటిగా పేర్కొనబడినది. దీనినే 'సంగీతసమయసారము' లో ఒక 'భాషాంగ సంపూర్ణ రాగముగను 'సంగీత సుధ' లో 'మాళవకైశిక' యొక్క 13 భాషా రాగములలో నొకటిగను,

'రాగవిబోధము' 4 వ అధ్యాయము 25వ శ్లోకములో సంధ్యాసమయమునందు పాడదగినఒకసంపూర్ణ రాగముగను చెప్పబడినది.

**ఆభీరికా** :— 'సంగీత రత్నాకరము' లో దీనిని 'కకుభ' యొక్క 'విభాష' లలో నొకటిగా పేర్కొనబడినది. 'సంగీతసుధ' లో 'పంచమము' యొక్క 10 భాషారాగములలో నొకటిగా చెప్పబడినది.

**ఆభీరు** :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ రి మ ప ని స.
అవరోహణము — స ధ ప మ గ స.

**ఆభేరి** :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ మ ప ని స.
అవరోహణము — స ని ధ ప మ గ రి స.
ఈ రాగములో 'పధప' అను ప్రయోగములో శుద్ధ ధైవతము అన్యస్వరముగా వచ్చును. గాంధార, మధ్యమ, నిషాదములు జీవస్వరములు. అన్ని వేళలందు పాడదగును. 'త్యాగరాజుని' 'నగుమోము గనలేని' కృతియు 'శ్యామశాస్త్రి' 'నిన్ను వినామరి' కృతియు "దీక్షితారుని" "వీణాభేరి" కృతియు ఈ రాగములోని ప్రసిద్ధ కృతులు. హిందూస్థానీ సంగీతములో 'భీమ్‌ఫలాసి' రాగము ఈ రాగమునకు కొంతవరకు సరిపోవునదిగా నుండును.

**ఆభోగ** :—పురాతన ప్రబంధములలోని 4 ధాతువులు లేక అవయవములలో నొకటి. ఇది ప్రబంధముయొక్క పూర్తిచేయు భాగమునకు పేరు. దీని పూర్వవిభాగములు ఉద్గ్రాహ, మేళాపక, ధ్రువ, అనునవి. ఈ 4 వది ఆభోగమనబడును.

**ఆభోగఖండ** :—గీతరచనయొక్క చివర భాగము. దీనిలో అ ఇయ, తి ఇయ, అ ఇయమ్ వా ఇయ వంటి పదములు కనపడును. ఉ॥ 'మీనాక్షిజయకామాక్షి' అను శ్రీ రాగము. ధ్రువతాళములోని గీతము ఇట్టి అభోగఖండమునకు వుదాహరణ మగును.

**ఆభోగచరణ** :—కృతి లో కృతికర్త యొక్క సంతకము లేక ముద్ర కలిగి యుండు ఆఖరుచరణము పేరు. ఈ ఆభోగచరణము యెక్కువ చరణములు కలిగియున్న కృతిలో ఆఖరు చరణముగా నుండును. ఒకే చరణముగల కృతిలో ఆ ఒకచరణమే ముద్ర చరణముగా నుండును, ఇవి మూడు విధములుగా నుండును.

i కృతికర్త ముద్ర కలిగియున్నది.
ii కృతికర్త ముద్ర కలిగియుండనిది.
iii కృతికర్త ముద్ర అంతకుముందు భాగములో అనగా పల్లవిలోనో లేక అనుపల్లవిలోనో యుండునది.

**ఆభోగి** :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ. స.
అవరోహణము— స ధ మ గ రి స.

**ఆమంతిరికై** :—'శిలప్పదికారమ్' అను తమిళ ప్రాచీన గ్రంథములో చెప్పబడిన యొకరకపు చర్మవాద్యము.

అ్రమదేశి :— 62వ మేళకర్తయగు 'రిషభ ప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.

అ్రమపంచమము :— 48 వ మేళకర్త యగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.
ఈరాగము సంగీత సమయసారములో చెప్పబడినది. మరియు 'సంగీత రత్నాకర ము'లోకూడ అకాలములోని 10 ప్రసిద్ధ దేశిరాగములలో నొకటిగా చెప్పబడినది.

ఆమా :— సంగీత కచ్చేరీలలో ఆనందకర మైన రాగాలాపనగాని స్వరప్రస్తారము గాని సాహిత్య ప్రస్తారముగాని భావ పూరితమైన సంగతులు గాని వచ్చినపుడు బాగడ్తగా తమిళులు 'ఆమా' (అవును) అను తమిళ పదమును వుపయోగింతురు.

ఆయత :— 'శార్ఙ్గదేవు'ని చే సంగీతరత్నా కరములో 22 శృతులకు చెప్పబడిన 5 జాతులలో 2 వది. మిగిలినవి దీప్తా, కరుణా, మృదూ, మధ్యా అనునవి.

అయప్పాలై :— పురాతన తమిళ సంగీత ములో కనపడు 4 పెద్దపాలైల(Scales) లో ఒకటి. మిగతా మూడు పాలైలు తిరిణోణపాలై, చతురపాలై, వట్టపాలై అనునవిగా చెప్పబడెను.

అయర్ కుజల్ :— గొల్లెల కాపరి వాయించునట్టి ఒకరకపు మురళీవాద్య మునకు తమిళములోని పేరు.

అయిత్తము :— రాగమును ప్రారంభించు టకు గల ప్రయత్నము. అనగా రాగా లాపనయొక్క ప్రారంభభాగమగును. ఇది అక్షిప్తికవలె నుండును.

అరత్తిపాట్టు :— పూజా విధానములో హారతి యిచ్చునపుడు అనగా పళ్లెములో కర్పూరము వెలిగించి త్రిప్పుచూ పాడు నట్టి పాటకు తమిళములోని పేరు.

అరభి :— 29 వ మేళకర్తయగు 'ధీరశం కరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి మ ప ద స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఉపాంగరాగము. ఘనరాగము. రిషభ మధ్యమ, ధైవతములందీనికి జీవస్వరములు.

అర్గన్ :— (Argan) యూరపియన్ సంగీత సంప్రదాయము ననుసరించి యేర్ప రచిన 'కీ' బోర్డు గల గాలిసంబంధమైన వాద్యమునకు ఇంగ్లీషు పేరు. ఉ॥ పియానో, పెద్దహార్మోనియము వంటి వాద్యములు యీ రకమునకు చెందినవి.

అర్ద్రిదేశి :— 15 వ మేళకర్త యగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స ని స.
అవరోహణము — స ధ ప మ గ రి స.
ఉపాంగరాగము. స ని ధ ప అను ప్రయోగము అరుదుగా నుండును. 'ముద్దుస్వామి దీక్షితుని, 'శ్రీ గణేశాత్పరమ్' అను ఝంప తాళకృతి ఈ రాగములోనిదై యున్నది.

**అర్ధ్రదేశిక** :— అర్ధ్రదేశి రాగమువలె నుండినట్టి రాగము.

**ఆర్ట్‌మ్యూజిక్** :— (Art music) కళాత్మకసంగీతము, లేక మనోధర్మ సంగీతము. సంగీతము ప్రధానముగాగల అన్ని సంగీత రచనలకు గల ఇంగ్లీషు పేరు.

**ఆర్య** :— మహారాష్ట్ర హరికథా కాలక్షేపములందు వుపయోగించబడు నొక ప్రత్యేక సంగీతరచనకుగల పేరు. ఈకాలములో దక్షిణదేశమునందు కాలక్షేపములు చేయు కథకులు . ఈ ఆర్యలను సాధారణముగా 'బేహాగ్' రాగములోనే పాడుచుందురు.

**ఆర్యసంగీతము** :—పురాతనకాలములో హిందూదేశమునకు వచ్చిన ఆర్యులు పాడిన సంగీతము. ఇది కర్నాటక, హిందూస్థానీ సంగీతములకు వేరైనదిగా నుండును.

**అర్షభి** :— షడ్జగ్రామముయొక్క నాలుగు జాతులలో ఒకటి. ఇది దక్షిణదేశపు సంగీతముయొక్క 'తోడి' రాగమునకు సరిపోవునదిగా నుండును.

**అర్ధ్రాంబరి** :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ రాగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.
ఇది అర్ధాంబరి రాగమును బోలినది.

**అరియకుచ్చరి** :— పురాతనతమిళపద్ధతిలోని "కురుదయల్" నుండి ఉత్పన్నమైన 16 భాగములలో ఒకటి.

**అరియకూత్తు** :— 'శిలప్పదికారమ్' అను తమిళ గ్రంథములో చెప్పబడిన ఒకరకపు నృత్యము. ఇది కర్రలతోను త్రాళ్లతోను చేయబడు కసరత్తు రకమునకు చెందిన నాట్యముగా నుండును.

**అర్చిక** :— అసంపూర్ణములగు షాడవ ఔడవ, స్వరాంతరాది ఆఱువిధములగు స్వరసమూహములలో ఏకస్వర ప్రయోగమునకు పేరు. 'అర్చినోగాయంతి' అనునది ఋగ్వేదభాగములో ఒకే స్వరమునందు పాడవలెనని తెలియజేయును. మిగిత రెండు, మూడు స్వరములు గలవి గాథిక, సామిక అనునవి.

**ఆర్ఫిక్‌స్కూల్** (Arfic School):— సంగీత మాధుర్యశక్తిచే రోగ నివారణను చేయుటను గురించి శాస్త్రయుక్తముగా నేర్పబడు విద్యాలయమునకు ఇంగ్లీషులోని పేరు.

**అరియవేళర్‌కొల్లి** :— పురాతన తమిళ పద్ధతిలోని "సేవ్వలియాల్" నుంచి వచ్చిన 16 ఉత్పత్తులలో ఒకటి.

**అర్‌ప్పు** :— 'శిలప్పదికారమ్ - వేనిర్‌కాదై'లో చెప్పబడిన యాళ్ (Yazh) అను వాద్యములోని లోపములలో ఒకటి.

**అఙ్ఞుచ్చెందిరమ్** :— పురాతన తమిళ సంగీత ప్రాథమిక పద్ధతి అయిన 'కురింజి యాళ్' యొక్క 8 ఉత్పత్తులలో ఒకటి.

ఆరూరన్:—'సుందరమూర్తినాయనార్' చేరచింపబడిన 'తేవారమ్' రచనలలోగల మూడు ముద్రలలో ఇది ఒకటి. ఈతని మిగతా రెండు అంకితములు ఊరన్, నంబియారూరెన్ అనునవి.

ఆవోదిమట్టమ్ :—'వనపాదచూడామణి' వ్రాసిన "తాళసముత్తిరమ్" అను తమిళ వాదిత్రప్రతిలో చెప్పబడిన తాళములలో నొకటి.

ఆరోహ :—దశవిధగమకములలో మొదటిది. ఆరోహణక్రమములో నున్న స్వరవిధానమును తెలియపరచును.

ఆరోహణ :— ఆరోహణ క్రమములో నున్న స్వరములు. అనగా ఒకదానికంటె నొకటి హెచ్చుగా నుండు స్వరముల వరుస. ఉ॥ స రి గ మ ప ధ ని స.

ఆరోహణక్రమము :— ఆరోహణము లోని క్రమము లేక వరుస.

ఆరోహణగతి :— ఆరోహణ క్రమము లోని నడకను తెలియపరచునది.

ఆరోహణత్వము :—ఆరోహణ క్రమము లో నుండు స్థితిని తెలియజేయునది.

ఆరోహణ - అవరోహణ ప్రస్తారము :— ఆరోహణ అవరోహణములందలి వివిధ రకములతో సంబంధమైన సంశ్లేష విశ్లేష ములకుపేరు. ఈ ఆరోహణ,అవరోహణ ములు క్రమగతిరకములలోగాని వక్రగతి రకములలోగాని ఉండును. ఆరోహణ అవరోహణములలో యేర్పడు సంపూర్ణ షాడవ, ఔడవ రకముల సంఖ్య 484. అవియేర్పడునట్టి విధమును యీ దిగువ నుదహరించుట గమనించునది.

| | | |
|---|---|---|
| సంపూర్ణ | — సంపూర్ణ భేదము | 1 |
| సంపూర్ణ | — షాడవ భేదములు | 6 |
| సంపూర్ణ | — ఔడవ భేదములు | 15 |
| షాడవ | — సంపూర్ణ భేదములు | 6 |
| షాడవ | — షాడవ భేదములు | 36 |
| షాడవ | — ఔడవ భేదములు | 90 |
| ఔడవ | — సంపూర్ణ భేదములు | 15 |
| ఔడవ | — షాడవ భేదములు | 90 |
| ఔడవ | — ఔడవ భేదములు | 225 |
| పైవిధముగా ఏర్పడిన | రాగములు | 484 |

ఒక్కొక్క మేళమునకు 484 వంతున $72 \times 484 = 34{,}848$ రాగములు 72 మేళ ములతో కలుపుకొనివచ్చును. ఇవిగాక సం భవమైన స్వరాంతరికములు 20. ఇవి సం పూర్ణ షాడవ, ఔడవ, భేదములచే 1280 రకములరాగములుయేర్పడును.ఎటులనగా,

| | | |
|---|---|---|
| స్వరాంతర | — సంపూర్ణ భేదములు | — 20 |
| స్వరాంతర | — షాడవ భేదములు | —120 |
| స్వరాంతర | — ఔడవ భేదములు | —300 |
| సంపూర్ణ | — స్వరాంతరభేదములు | — 20 |
| షాడవ | — స్వరాంతరభేదములు | —120 |
| ఔడవ | — స్వరాంతరభేదములు | —300 |
| స్వరాంతర | — స్వరాంతరభేదములు | —400 |
| 1 మేళకర్తకు | స్వరాంతరరాగములు | 1280 |

72 మేళకర్తలకు $72 \times 1280 = 92{,}160$ స్వరాంతర రాగములు యేర్పడుచున్నవి. ఇవి వక్రగతినొందుటచే అనంతములగును.

ఆరోహణావరోహణములు:—రాగములో స్వరములు హెచ్చుట తగ్గుటవల్ల కలిగిన

ఒక క్రమము లేక గతి. రాగముయొక్క ఆరోహణావరోహణములు రాగ స్వరూపమును క్లుప్తముగా తెలియపరచునదిగా నుండును. ఇది క్షేత్ర గణితములోని సిద్ధాంతమును పోలియుండును. ఉ॥ స రి గ మ ప ధ ని స — స ని ధ ప మ గ రి స.

**ఆరోహణస్థాయి** :—శాస్త్రీయ పద్ధతిలో ప్రయత్నింపబడు రాగాలాపనయొక్క మూడవభాగము. రాగవర్ధని ఆలాపన తరువాత 'తానము'నకు ముందు 'స్థాయి' ఆలాపన చేయబడును. ఆరోహణస్థాయి ఆలాపనలో ప్రథమ స్వరములు లేక స్థాయిస్వరములు ఆరోహణక్రమములో నుండును. ఉ॥ స రి గ పా. మొదలగునవి.

**ఆరోహ్యలంకారము**:—అలంకారభేదములగు 5 టిలో 2 వది.

**ఆరోహివర్ణము**:—ఆరోహణక్రమములో నుండు కళాత్మకమైన స్వరసముదాయములు. గానము ప్రారంభించిన స్వరము నుండి హెచ్చుగాబోవునట్టిది. ఉ॥ స రి గ మ, రి గ మ ప మొదలగునవి.

**అల్ గోస** :—ఉత్తర హిందూస్థానములో వాయింపబడు మురళి (Flute) వాద్యములోని ఒక రకము.

**అలప్తి**:—రాగమును విస్తరింప జేయునట్టి రాగాలాపనము. ఇది రెండు విధములు (1) అలప్తి (2) రూపక అలప్తి అనునవి. (1) అల్లప్తిఅనునది పద్ధతిలేకుండా చేయబడునట్టి సాధారణమైనరాగాలాపనము.(2) రూపక అలప్తి అనునది పద్ధతి సహాయముతో చేయబడునట్టి రాగాలాపనము.

**అలంబనవిభావము** :—భావములు 5 విధములలో మొదటిదైన విభావము నందలి రెండు రకములలో మొదటిది. అనగా రసములు, స్థాయీభావములు ఏవస్తువుల నాశ్రయించి గలుగుచున్నవో అట్టి వస్తువులు అలంబనవిభావమగును. స్థాయీభావములు నాయికా నాయకుల నాశ్రయించి యుండును. గనుక నాయికా నాయకులు 'ఆలంబన విభావము' అగునని చెప్పుదురు.

**అలవణి**:—'హరిపాలదేవు' నిచే 'సంగీత సుధాకరము' అను గ్రంథములో చెప్పబడిన ఒకరకమైన వీణ.

**అలస్యము** :— 'వ్యభిచారిభావము' లోని 33 విధములలో 7 వ దానికి పేరు.

**అలాప్** :—ఆలాపనవలె నుండునది.

**ఆలాప** :—ఆలాపనలేక రాగముయొక్క పరిపూర్తియైన అభివృద్ధి.

**ఆలాప** :—గాంధార గ్రామముయొక్క మ, మూర్ఛనకు గల పేరు.

**ఆలాపన** :—రాగవివరణ లేక మనోధర్మ సంగీతముయొక్క ముఖ్యభాగము. రాగముయొక్క అన్నిరసభావములను తెలియచేయును. రాగాలాపనలో పాటకులచే ఉపయోగింపబడు అనంత, అనునది దేవుని యొక్క పేరు. భారతీయ సంగీతములో

రాగాలాపన అతిముఖ్యమైన భాగము. ఇది మూడువిధములుగా నుండును.

i. ఆక్షిప్తిక లేక ప్రథమభాగము.

ii. రాగవర్ధని లేక ఆలాపనయొక్క స్వరూపము.

iii. స్థాయి, మకరిణి అను పూర్తి చేయుట.

ఆలాపము :— భావశాస్త్రమునందు గల 'వాగారంభానుభావము' లోని పద కొండు విధములలో మొదటిది.

అలాపి :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి గ మ ప ధ ని స.

అవరోహణము—స ని ధ ప మ గ రి స.

ఆలాపిని :— 'భరతుని' 22 శృతులపట్టికలో పంచమస్వరముయొక్క 4 వ శృతి లేక చివరశృతి.

ఆలాపిని :— వాద్యముయొక్క దండి లేక వ్రేళ్లు ఆనుకొనే చదునైన బల్లను వెదురుతో చేయబడిన ఒకరకపు తంత్రీ వాద్యము.

ఆలాపికవంశ :— 'ఋగ్వేదము' లో చెప్పబడిన ఒకరకపు మురళీవాద్యము.

ఆలిక్రమప్రబంధము :— 'శార్ఙదేవుడు' మొదలగు లక్షణకారులచే విభజింపబడిన ప్రబంధములలోని 3 రకములలో ఒకటి. మిగత 2 ప్రబంధములు 1 శుద్ధ ప్రబంధము. 2 విప్రకీర్ణ ప్రబంధము అనునవి.

ఆలింగ్య :— సమమైన స్థితి. ఈపదము ఒక వాద్యమును సమతలమైన స్థితిలో పెట్టి వాయించబడు పద్ధతిని తెలియజేయును. ఉ॥ మృదంగము 'ఆలింగ్య' స్థితి (సమముగా భూమికి ఆనించుట) గా పెట్టబడి వాయించబడు వాద్యము. గనుక యిది ఆలింగ్యస్థితి యగును.

ఆవడైయార్ కోవిల్ :— 'మాణిక్కవాచగర్' అను ఋషి ఉపదేశము పొందినట్టి 'తంజావూరు' జిల్లాలోని ప్రఖ్యాత దేవాలయము. ఇది సుప్రసిద్ధ సంగీత వాద్య శిల్పములను సంగీత నృత్యముల పురాతన శిల్ప వర్ణనలను కలిగియున్నది.

ఆవర్త :— సూళాదిసప్తతాళ అలంకారములకు ప్రాచీనులు యేర్పరచిన పేర్లలో 6 వది.

ఆవర్తము :— ఒక పూర్తి కాలప్రమాణము. అనగా ఒక తాళముయొక్క అంగములన్నియు ఒకసారి పూర్తిగా వేయుటకుపట్టుకాలము. ఉ॥ఆదితాళము. దీనికిగలఅంగములు I 0 0. ఈమూటితో 8 అక్షరకాలము వేయుట ఆవర్తమనబడును.

ఆవాపము :— సంగీతకాలమును తెలియ చేయుపద్ధతులలోఒకటి. ఇది చేతినియెత్తి 4 వ్రేళ్ళను లెక్కపెట్టునట్లు ముడుచుటను కలిగియుండును. మార్గక్రియాష్టక సమూహమునకు చెందిన 4 నిశ్శబ్ద క్రియలలో యిది యొకటి.

ఆవేగము :— వ్యభిచారీ భావములోని 33 విషయములలో 16 వ దానికి పేరు.

ఆశ్రితరంజని :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్రము' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ని స.
అవరోహణము — స ని ధ ప మ గ రి స.

ఆషాఢ కన్నడ :— తమిళకృతికర్తయగు 'ముత్తుతాండవర్' యొక్క కృతులలో కనబడునట్టి ఒక అపూర్వ రాగము. "పెశప్పు మెణ్ణాడె" అనునది ఈ రాగములోని రచనయగును.

అసాన్ :— పురాతన తమిళ పద్ధతికి చెందిన 'పాలైయాజ్' నుండి వచ్చిన 5 ఉత్పత్తులలో ఒకటి.

అసారి:— 'పింగలంధై' లో చెప్పబడిన '16 పెద్ద 'పణ్' లలో యిది ఒకటి.

అసావరి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి'కి చెందినదై హిందూస్తానీ సంగీతములో వాడునట్టి ఒక రాగము.

అసావేరి :— 8 వ మేళకర్త యగు 'హనుమత్తోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి మ ప ధ స.
అవరోహణము — స ని స ప ధ మ ప రి గా రి స.

ఆస్థానవిద్వాన్ :— ఆస్థానసంగీతవిద్వాంసునికిగల పేరు. భారతదేశములో మహారాజులయొక్క సంస్థానములలో గొప్ప విద్వాంసులకు గౌరవ వేతనము లిచ్చి ఆస్థాన విద్వాంసులుగా నియమించుకొని గౌరవించెడివారు. ఉ॥ మైసూరు, తిరువాన్కూరు మొదలగు సంస్థానములు యీరకమునకు చెందినవైయున్నవి.

ఆహతము :— మానవ ప్రయత్నముచే పాడబడు సంగీతము. ఇది అనాహత లేక స్వాభావిక సంగీతము (యోగులకు చెందిన సంగీతము) నకు ఇతరమైనది. ఆహత సంగీతము నేర్చుకొనదగిన విద్య. ఇది గీత వాద్య, నృత్యములుగా విభజింప బడినది.

ఆహతము:—ఇది ఒకరకమైన గమకము. వీణమీద ఒక స్వరమును మీటి పలికించి దానిమీద రెండవ స్వరమును మరియొకసారి మీటకనే పలికించుట. ఇది గాత్రమునకు వాద్యమునకు సంబంధించిన పంచదశ గమకములలోను దశవిధగమకములలోను ఒకటియైయున్నది. దీనికి వ్యతిరేకమైన గమకము 'ప్రత్యాహతము' అగును.

ఆహతి :— 'సోమనాథుని' 'రాగవిబోధము'లో చెప్పబడిన 'వీణ' యొక్క తంత్రులను మీటుటలో గల ఒక విధమైన నైపుణ్యమునకు పేరు.

ఆహార్య :—అభినయములోని 4 రకములలో ఒకటి. ఇది పాత్రోచితమైన దుస్తులకును నగలకును సంబంధించినది.

ఆహరి :— 'ఆహిరి' రాగమువలెనుండునది. ఇది 'సంగీతమకరందము' 'సంగీతసమయసారము' 'రాగతాళచింతామణి' అను గ్రంధములయందు చెప్పబడినది.

ఆహంశం :— సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారుచేరి రామాయణము (బాలకాండము) మీద వ్రాయబడిన వ్యాఖ్యలో చెప్పబడిన ఒక రాగాంగ రాగము.

ఆహిరి :— 14 వ మేళకర్త యగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి స గ మ ప ధ ని స.
అవరోహణము—స ని ధా ప మా గ రి స.
ఇది భారతీయ సంకీర్ణ శృతులకు చెందిన సంకీర్ణ రాగము. నేర్పుతో పాడదగిన రాగము. మధ్యమ, నిషాదములు జీవ స్వరములు. విచారమును తెలియజేయగల రాగము. పురాతన రాగము. ఈ రాగమును యెవరు ఉదయకాలమునందు పాడుదురో అట్టివారు ఆరోజున ఆకలినుండి విముక్తులగుదురని ఒక లోకోక్తి కలదు.

ఆహిరితోడి :—ఇది 8 వ మేళకర్తయగు "హనుమత్తోడి" యొక్క జన్యరాగముగా "చిట్టిబాబునాయుడు"చే వ్రాయబడిన "కీటు హిందూ మ్యూజిక్" అను గ్రంథములో చెప్పబడినది.

ఆహిరినాట :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్య రాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము—స ని ప ధ ని ప గ మ గ స.

ఆహోరి :— ఇది 20 వ మేళకర్తయగు "నఠభైరవి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము—స ని ధ ప మ గ రి స.
ఈ రాగము "గానవిద్యాప్రకాశిక" అను తమిళ గ్రంథములో చెప్పబడినది.

ఆళుడైయపిళ్ళైయార్ :— "తేవారమ్" రచయితలలో నొకడైన "తిరుజ్ఞానసంబందర్" కు గల మరియొక పేరు.

ఆక్షిప్త :—ఆరోహి అలంకారము యొక్క రకము. స స గ గ — రి రి మ మ — గ గ ప ప — మ మ ధ ధ — అనునటువంటి స్వర సముదాయముల రకములను తెలియపరచును.

ఆక్షిప్తిక :— ఇది రాగాలాపనయొక్క మొదటి భాగము. ఎక్కువ వివరములలోనికి పోకుండగనే రాగముయొక్క రసములను క్లుప్తముగా వివరించబడును. దీనినే "ఆయిత్తము" అనికూడ పిలువబడును.

ఆక్షిప్తిక :—"సంగీత రత్నాకరము" లో వివరించబడిన ఒక పురాతన సంగీత రూపమునకు ఇదే పేరు గలదు.

---

# ఇ

ఇంటర్వల్ :— (Interval) విరామము లేక విశ్రాంతికి గల ఇంగ్లీషు పేరు. అనగా ఒక తగ్గుస్వరము ఒక హెచ్చుస్వరము ఈ రెంటిలో తగ్గుస్వరముకంటె హెచ్చుస్వరము ఎన్నిపర్యాయములు ఎంతెంతకాలము

నస వచ్చునో తెలుపు పరస్పర సంబంధము (Ratio) కుగల పేరు.

ఇండియన్ ఆర్కెస్ట్రా (Indian Orchestra) :— కొన్ని తంత్రీ వాద్యములను కొన్ని గాలివాద్యములను కొన్నిచర్మములో సంబంధమైన లయవాద్యములను ఉపయోగించి సంయుక్తమైన మనోహరమగు గంభీర స్వరముతో భారతీయ సంగీతమును ప్రదర్శించు వాద్యసమూహమునకు ఇంగ్లీషులోని పేరు.

ఇండియన్ మ్యూజిక్ (Indian music) :— ప్రపంచంలోగల మిక్కిలి పురాతనమైన సంగీత విధానములలో నొకటై భారతదేశము (ఇండియా) నందు అమలులోనున్న సంగీత విధానమునకు ఇంగ్లీషులోని పేరు. ఇది 12 శతాబ్దముల క్రిందట రెండు విధములుగా విభజింపబడి కర్నాటక (నారద) సంగీతమని దక్షిణ హిందూదేశములోను, హిందూస్థానీ (ఆంజనేయ) సంగీతమని ఉత్తర హిందూస్థానములోను నేటివరకు వాడుకయందున్నవి.

ఇంద్రనీల :— సూళాదిసప్త అలంకారములలో ఒకటవ అలంకారమునకు యివ్వబడిన పేరు.

ఇంద్రప్రియ :— 1 వ మేళకర్తయగు "కనకాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ మ ధ ని స.
అవరోహణము — స ని ధ మ గ స.

ఇంద్రప్రియ :— 24 వ మేళకర్తయగు "వరుణప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ధ ని స.
అవరోహణము — స ని ధ మ గ రి స.

ఇంద్రప్రియ :— 54 వ మేళకర్తయగు "విశ్వంభరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ధ స.
అవరోహణము — స ధ ప మ గ రి స.

ఇంద్రవంశ :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము - స గ మ ధ ని స.
అవరోహణము - స ని ప ధ మ గ రి స.

ఇందు :— వెంకటమఖి 72 మేళకర్తలను విభజించి యేర్పఱచిన 12 మేళ చక్రముల లో 1 వ దానికి పేరు. దీనిలో 1 మొదలు 6 వరకు మేళకర్తలు వుండును.

ఇందు - గో :— వెంకటమఖి యేర్పఱచిన 12 మేళ చక్రములలో మొదటి చక్రము లోని 3 వ మేళమగు 'గానమూర్తి'కి యిచ్చినసంకేతనామము. ఇది 3 వ మేళకర్త.

ఇందు - పా :— వెంకటమఖియేర్పఱచిన 12 చక్రములలో 1 వ చక్రములోని 1 వ మేళమగు 'కనకాంగి' కి యిచ్చినసంకేతనామము. ఇది 1 వ మేళకర్త.

ఇందు - భూ :— 12 మేళచక్రములలో 1 వ చక్రములోని 4 వ మేళమగు 'వనస్పతి'కి వెంకటమఖి

యిచ్చిన సంకేత నామము. ఇది 4 వ మేళకర్త.

ఇందు - మా :— 12 మేళ చక్రములలో 1 వ చక్రమునందు గల 5 వ మేళమగు 'మానవతి'కి వెంకటమఖి యిచ్చిన సంకేతనామము. ఇది 5వ మేళకర్త.

ఇందు - శ్రీ :—12 మేళచక్రములలో 1 వ చక్రమునందు గల 2 వ మేళమగు 'రత్నాంగి'కి వెంకటమఖి యిచ్చిన సంకేత నామము. ఇది 2 వ మేళకర్త.

ఇందు - షా :— 12 మేళ చక్రములలో 1 వ చక్రమునందలి 6 వ మేళమగు 'తానరూపి' కి వెంకటమఖి యిచ్చిన సంకేత నామము. ఇది 6 వ మేళకర్త.

ఇందు కాంతి :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ధ స.
అవరోహణము — స ధ ప మ గ రి స.

ఇందు గీర్వాణి :— 42 వ మేళకర్త యగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప స.
అవరోహణము—స ని ప ధ ని ప మ గ రి స.

ఇందు ఘంటారవము :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.

ఆరోహణము — స గ మ ప ధ ప ని.
అవరోహణము — ధా ప మ గ రి స ని.

ఇందు ధన్యాసి :— 46 వ మేళకర్త యగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ మ ధ ని స.
అవరోహణము — స ని ధ ప ధ మ గ రి స.

ఇందు ధవళి :— 21 వ మేళకర్త యగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి గ మ స మ ప ధ ని స.
అవరోహణము — స ని ధ ప మ గ స.

ఇందుభోగి :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ రి గ మ ప ధ స.
అవరోహణము — స ని ధ ని ప మ గ రి స.

ఇందుమతి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

ఇందుశీతల :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

ఇందుసారంగనాట :— 8 వ మేళకర్త యగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

ఇనకరప్రియ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

ఇనవర్ధని :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

ఇనుకొండవిజయరామ :— తెలుగులో శృంగారరస పద కవులగు 'ఇనుకొండ' వారు రచించిన పదములందు యేర్పఱచిన 'ముద్ర'కు పేరు.

ఇనుపశనగల :— 'వెంకట్రామయ్య' అను ప్రాచీన సంగీతవిద్వాంసుని రచనల యొక్క కాఠిన్యమునుబట్టి 'ఇనుపశనగల వెంకట్రామయ్య' అను బిరుదుతో ఆయన పిలువబడినందున యేర్పడిన పేరు.

ఇబిన్‌సీనా :— రోగములపై సంగీతమునకు గల ప్రభావమునుగుఱించి గ్రంథము వ్రాసిన ఒక అరబిక్ రచయితకు పేరు.

ఇరవుప్పణ్ :— పురాతన తమిళ సంగీతమునగల రాగ విభజనలో రాత్రికాలమందు పాడదగిన రాగములకు పేరు. 24 రాగములలో యిట్టి రాగములు 9 మాత్రమే గలవని తెలుపబడినది.

ఇరాయికా సింఫనీ :— జర్మనీ దేశపు గొప్ప గాయకుడగు 'బీథోవెన్' రచించిన మూడవ సింఫనీకిగల పేరు. దీనిని ప్రదర్శించుటకు 52 నిమిషముల కాలము పట్టునని తెలియుచున్నది.

ఇలకంఠి :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి మ గ స.

## ఈ

ఈక్వల్‌టెంపరుమెంటు (Equal Temperment) :— సమానమైన ధ్వనికలుగు స్థితిని తెలియజేయుదానికి ఇంగ్లీషులోని పేరు. ఇది 'పియానో' జాతికి సంబంధించిన 'కీ బోర్డు' గల వాద్యములలో గలుగు రాగపద్ధతి లేక శృతివిధానము.

ఈర్ష్యమానము :— విప్రలంబశృంగార రసమునందలి 5 విధములలో మూడవదైన 'మానము' లోని 2 రకములలో రెండవ దానికి ఈర్ష్యమానమని పేరు. వీటిలో మొదటిది 'ప్రణయమానము' అనబడును.

ఈశ :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను సంగీత గ్రంథములోని 'మిశ్రజాతి త్రిపుట' తాళమునకు యివ్వబడిన మఱియొక పేరు. దీని అంగములు 1 0 0. అక్షర కాలములు 11.

ఈశగిరి :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు సరిపోవును.

ఈశగౌళ :— 7 వ మేళకర్తయగు 'సేనావతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని సఁ.
అవరోహణము— సఁ ధ ప ధ మ గ రి స.

ఈశప్రియ :— 61 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ సఁ.
అవరోహణము— సఁ ధ ప మ గ రి స.

ఈశమనోహరి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని సఁ.
అవరోహణము— సఁ ని ధ ప మ రి మ గ రి స.
ఇందు కాకలీనిషాద ప్రయోగముఒప్పను.

ఈశ్వరి :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ సఁ.
అవరోహణము— సఁ ధ ప మ గ రి స.



ఉకప్రియ :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ధ ని సఁ.
అవరోహణము — సఁ ని ధ మ గ రి స.

ఉకవాణి :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ధని సఁ.
అవరోహణము — సఁ ని ధ మ గ రి స.

ఉగ్ర :— 'సంగీత మకరందము' అను గ్రంథములో చెప్పబడిన 22 శృతులలో 'రిషభము' నకు గల 3 శృతులలో 3 వది.

ఉగ్రత :— 'వ్యభిచారీభావము' లోని 33 విధములలో 27 వది.

ఉగ్రా :— ద్వావింశతి శృతులగు 22 శృతులలో 21 వ శృతియగు 'కాకలీ నిషాదము' నకు యివ్వబడిన పేరు. శంకరాభరణము, మాయామాళవగౌళ రాగములు యిట్టి కాకలీ నిషాద శృతి గల రాగములకు ముఖ్య వుదాహరణములగును.

ఉచ్చస్థాయి :— పంచస్థాయిలలోగాని త్రిస్థాయిలలోగాని మిక్కిలి హెచ్చుగా నుండు స్థాయిని ఉచ్చస్థాయి యనబడును.

ఉజ్వలము :— ఏ ధ్వని ధాతు, మాతువుల సహితమై, సుశబ్దయుక్తమై, చక్కని గాత్రమునుండి బయలువెడలి వినువారి వీనులకు విందు గావించునో అట్టి ధ్వనిని 'ఉజ్వల' మనబడును.

ఉడాల్ :— తాళవాద్యములలో కేవలము కాలమును సూచించుటేగాక పాటనుగూడ యనుకరించు చర్మ సంబంధమైన నొకరకపు వాద్యము.

**ఉడుక్కు** :— చర్మవాద్యములలో కాలమును సూచించుటేగాక పాటను గూడ యనుకరించు నొకరకపు వాద్యము.

**ఉత్తమరాగము** :— 'రామామాత్యునిచే' చేయబడిన రాగత్రయ విభజనలోని మొదటిరాగము. ఇది గీత, ప్రబంధ, ఠాయ, ఆలాపములు జేయుటకు యోగ్యమైనదియును ఇతర రాగ సంకరము కొంచెమైనను లేని స్వచ్ఛమైన రాగముగా నుండును.

**ఉత్తమ వాగ్గేయకారకుడు** :— వాగ్గేయకారకులలోని మూడు రకములలో మొదటి రకమునకు చెందిన ఉత్తమ లక్షణములు గలవానికి పేరు. [గా. భా. 150 పుట చూడుము.]

**ఉత్తరమంద్రము** :— షడ్జ గ్రామములోని 7 మూర్ఛనలలో 1 వ మూర్ఛనయగు షడ్జమ మూర్ఛనకుగల పేరు.

**ఉత్తరమేళకర్తలు** :— 72 మేళకర్తలలో 37 నుండి 72 వఱకుగల 36 ప్రతిమధ్యమ రాగ మేళకర్తలకు గల పేరు.

**ఉత్తరాంగము** :— సప్త స్వరములగు 'స రి గ మ ప ధ ని' లో మొదటి 'సరిగమ' అను భాగముగాక మిగత 'ప ధ ని' అను రెండవభాగమును 'ఉత్తరాంగ' మని చెప్పబడును.

**ఉత్తరాంగము** :— తాన వర్ణములలోని పల్లవి, అనుపల్లవి, ముక్తాయి స్వరములతో కూడిన మొదటిభాగమైన పూర్వాంగము తరువాత నుండు చరణము, ఎత్తుగడ స్వరములుగల రెండవ భాగమును ఉత్తరాంగమని చెప్పుదురు.

**ఉత్తరాయతము** :— షడ్జగ్రామములోని 7 మూర్ఛనలలో 3 వ మూర్ఛనయగు ధైవత మూర్ఛనకుగల పేరు.

**ఉత్తరి** :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

**ఉత్సవతాళము** :— 'సంగీతరత్నాకర' మను గ్రంథములో చెప్పబడిన 120 తాళములలో97వ తాళము. దీనిఅంగములు । 3.

**ఉత్సవతాళము** :— 'అష్టోత్తరశత' తాళములగు 108 తాళములలో 108 వ తాళమునకు యిచ్చిన పేరు. దీనికి అంగములు 3 ।. మాత్రలు 4. అక్షరకాలములు 16.

**ఉత్సవసమయపాటలు** :— ఉత్సవ సమయములందు సంఘముగా కొందరు కలసి పాడునట్టి నామావళులు, దివ్యనామ సంకీర్తనలు మొదలగు వాటికి గల పేరు.

**ఉత్సవ సంప్రదాయ కీర్తనలు** :— త్యాగరాజు తాను నిత్యము భగవంతునికి జరుపునట్టి ఉత్సవసమయములలో భక్తితో పాడుకొనుటకు తగినట్లుగా రచింపబడిన సంప్రదాయ కీర్తనలకు పేరు.

**ఉత్సాహము** :— స్థాయీభావములలోని 8 విధములలో 2 వ దానికి పేరు.

ఉత్తుంగమాన :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్య రాగము.
ఆరోహణము — స గ మ ప ధ ప ని స.
అవరోహణము — స ధ ప మ రి స.

ఉత్కృష్ట :— సామగానమునకు చెందిన సప్తస్వరములలో మొదటి హెచ్చుస్వర మైన 'శుద్ధమధ్యమ' స్వరమునకు పేరు.

ఉద్ఘట్టము :— 'అష్టోత్తర శతతాళము' లగు 108 తాళములలోని మొదటి 'చచ్చ త్పుటాది' పంచతాళములలో 5 వది. దీనికి అంగములు 8 8 8. మాత్రలు 6. అక్ష రకాలములు 24. ఇది ఈశ్వరుని పంచ ముఖములలోని 5 వ ఈశాన్యముఖము నందు పుట్టిన తాళమని చెప్పుదురు.

ఉద్వడుడు (ఉద్ఘటుడు) :— గానము చేయునపుడు మేకవలె నెమరువేయుచూ నోటిని కదలించునట్టి గాయకునికి పేరు.

ఉదయ :— ఖండజాతి మఠ్య తాళము నకు యివ్వబడిన మరియొక పేరు. దీని అంగములు । O ।. అక్షరకాలములు 12.

ఉదయరవి :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స గ మ ప ని స.
అవరోహణము — స ని ధ ప మ గ స.

ఉదయరవి :— 36 వ మేళకర్త యగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి మ ప స ని స.
అవరోహణము — స ని ప మ రి స.

దీనినే కొందరు 'ఉదయ రవి చంద్రిక' గా చెప్పుదురని తెలియుచున్నది.

ఉదయరవిచంద్రిక :— 20 వ మేళ కర్తయగు 'నఠభైరవి' యొక్క జన్య రాగము.
ఆరోహణము — స గ మ ప ని స.
అవరోహణము — స ని ప మ గ స.

ఉదాత్తము :— ఋగ్వేదమును పఠించున పుడు పలుకు హెచ్చుస్వరమైన "రిషభ" స్వరమునకుగల పేరు.

ఉద్ఘాటిత :— పురాతన సంగీత గ్రంథ ములలో సంచారి అలంకారమున కిచ్చిన శాస్త్రీయుక్తమైన 3 పేర్లలో 3 వది. ఉ॥ స రి ప మ గ రి — రి గా ధ ప మ గా మొదలగువిధముగా నుండును.

ఉద్గ్రాహము :— ప్రబంధమునకు అవయ వమగు ధాతువులోని 4 విధములలో మొ దటిది. ఇది ప్రబంధముయొక్క మొదటి భాగము లేక గానమును మొదట గ్రహిం చునదిగా నుండును.

ఉద్వాహిత :— పురాతన గ్రంధస్థమైన సంచారి అలంకార జాతిలోని 3 విధము లలో మొదటిది. ఉ॥ స రి గ రి — రి గ మ గ — గ మ ప మ — మ ప ధ ప — మొదలగు విధముగా నుండును.

ఉద్దిష్ట :— కూటతానముయొక్క క్రమ సంఖ్యను కనుగొను పద్ధతికి పేరు. ఒక మేళములో స్వరములయొక్క వరుస సం ఖ్యను కనుగొనుటకు యీ ఉద్దిష్ట సహా యపడును. [ఉద్దిష్ట = కోరబడినది.]

ఉద్దిష్టము :— తాళ ప్రస్తార భేదము లగు 14 టిలో 2వది. ఇది ఇన్నవ ప్రస్తారమని లెక్కచేయుట కేర్పడిన పేరు.

ఉద్దీపన విభావము :— భావములు 5 రకములలో మొదటిదైన విభావములోని 2 విధములలో 2 వది. ఇది గుణములు, చేష్టలు, అలంకృతులు, తటస్థములని 4 విధములు గలదిగా నుండును.

ఉదీర్ణ :— మిశ్రజాతి మఠ్య తాళము నకు గల మరియొక పేరు. దీని అంగములు I O I. అక్షరకాలములు 16.

ఉదీక్షణ తాళము :— 'సంగీత రత్నాకర' మను గ్రంథములోని 120 తాళములలో 57 వ తాళమునకు పేరు. దీని అంగములు I I 8.

ఉదీక్షణ తాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 లో 58 వ తాళము. దీని అంగములు I I 8. మాత్రలు 4. అక్షరకాలములు 16.

ఉద్వీక్షణ తాళము :— ఆదితాళము, రతితాళము కూడి యేర్పడిన మారసాలగ తాళమునకు యిచ్చిన పేరు.

ఉదృష్టుడు :— గానముచేయుటలో విరసముగా నధికధ్వని గలిగి పాడునట్టి గాయకునికిపేరు.

ఉన్మాదము :— వ్యభిచారీ భావము లోని 33 విధములలో 30 వదానికి పేరు.

ఉపకళలు :— ఏకకళ, ద్వికళ, చతుష్కళ అను మూటికిగల పేరు.

ఉపదేశకము :— వాగారంభానుభావములు 11 విధములలో 11 వ దానికిపేరు.

ఉపనాయకులు :— పీఠమర్దనుడు, విటుడు, చేటుడు, విదూషకుడను నల్గురి నాయకులకు చెప్పబడిన పేరు.

ఉపనాయికలు :— దూతి, దాసి, సఖి, చేటి, ధాత్రేయి, ప్రాతివేశిని, లింగిని, శిల్పిని అను 8 మంది నాయికలకుగలపేరు.

ఉపపతి :— నాయకులలోని 3 విధములలో 2 వ రకమునకు చెందినవానికి పేరు. ఇతడు పరకీయకు రహస్యనాయకుడుగా నుండును.

ఉపపల్లవి :— తానవర్ణములలో రెండు పల్లవులుండును. అందు మొదటిది సాధారణముగా పల్లవి అని చెప్పబడునది. రెండవది చరణము అని చెప్పబడునది. ఈ రెండవదైన చరణమునే 'ఉపపల్లవి' అని చెప్పబడును.

ఉపరాగము :— మార్గరాగములోని 6 విధములలో 2 వ దానికి పేరు.

ఉపాంగతాళము :— 'భరతనాట్య శాస్త్రమ్' అను పురాతన తమిళ గ్రంథములో గల యొకతాళమునకుపేరు.

ఉపాంగరాగము :— దేశ్యరాగము లోని 4 విధములలో 2 వది. ఇది తన

జనక రాగముయొక్క స్వరములకు చెందిన స్వరములనే కలిగినదియై యుండును. ఇట్టి రాగమునకు ఉ॥ హంసధ్వనిరాగము.

ఉపాంగమే భాషాంగమైన రాగము :— పూర్వము ఉపాంగరాగములుగా నుండి క్రమేణా హిందూస్థానీ సంగీత సంపర్కముచే మార్పుచెంది యిప్పుడు భాషాంగ రాగముగా నేర్పడినవాటికి పేరు. ఉ॥ ఖమాసురాగము యీరకమునకు చెందినది.

ఉపేంద్ర వజ్రం :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ'కు జనించిన జన్య రాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ ప గ రి స.

ఉభయ వక్రరాగము :— ఆరోహణ, అవరోహణముల రెంటియందును వక్రముగా నుండు స్వరములుగల రాగము. ఇది నారదుని 'సంగీత మకరందము'లో కూడ చెప్పబడిన విభజన యగును. ఉ॥
1. నీలాంబరి రాగము యీరకములోనిది.
ఆరోహణము — స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము—స ని ప మ గ రి గ స.
2. సహాన— స రి గ మ ప మ ధా ని స.
అవరోహణము— సనిధపమగమరీగరిస.

ఉమా తిలక ప్రబంధము :— మూడు రాగములును, మూడు తాళములును కలిగి యుండుఒకరకపు రాగతాళమాలికకుపేరు.

ఉమాదాస :— దక్షిణదేశపు పూర్వ వాగ్గేయ కారులలో నొకడై సంస్కృతము, తమిళము, తెలుగు భాషలలో గొప్ప పండితుడైన 'ఆనయ్య' రచించిన రచనల యందుగల ముద్రకు పేరు. ఈతని రచనలలో ఉ॥'ఇంతపరాకా'అను'నాదనామ క్రియరాగ' కృతిలోను, "భజనసేయవే" అను'కేదారరాగ'కృతిలోను యిట్టి ముద్రలను చూడవచ్చును. ఈతని శిష్యుడే సుప్రసిద్ధుడైన మహావైద్యనాథయ్యర్. వీరుభయులును తంజావూరి జిల్లాలోని "వైయెచేరి" అను ఒకే గ్రామమునకు చెందినవారుగా తెలియుచున్నది.

ఉమాభరణము — 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్య రాగము.
ఆరోహణము — స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ రి గ మ రి స.

ఉల్లశితము :— పంచదశ గమకములగు 15 టిలో 10 వది. దీనినే జారు యనబడును. ఇది రెండు విధములు (1) ఎక్కుజారు, (2) దిగుజారు అనునవి.

# ఊ

ఊర్మిక :— 57 వ మేళకర్త యగు 'సిహ్మేంద్రమధ్యమము' యొక్క జన్య రాగము.
ఆరోహణము — స రి గ మ ప ని స.
అవరోహణము — స ని ప మ గ రి స.

**ఋగ్వేదస్వరములు** :— ఋగ్వేదములోపలుకు ఉదాత్త, అనుదాత్త, స్వరితము అను మూడు స్వరములకుగల పేరు. ఉదాత్తము. రి – ఇది హెచ్చుస్వరము. అనుదాత్తము. ని – ఇదితగ్గుస్వరము. స్వరితము. స – ఇది మధ్యస్వరము పై మూడు స్వరములతో ఋగ్వేదమును పఠించుదురు.

**ఋతుచక్రము** :— 72 మేళకర్తలకు వెంకటమఖి యేర్పఱచిన 12 చక్రములలో 6 వది. దీనిలో 31 నుండి 36 వరకు శుద్ధమధ్యమ మేళకర్త లుండును.

**ఋతు-గో** :— ఇది 6 వ మేళ చక్రము లోని 3వ మేళమగు 'గాంగేయభూషణి' కిగల సంకేత నామము. 33 వ మేళకర్తయగును.

**ఋతు-పా** :— ఇది 6 వ మేళ చక్రములోని 1 వ మేళ మగు 'యాగప్రియ' కు గల సంకేత నామము. 31 వ మేళకర్తయగును.

**ఋతు-భూ** :— ఇది 6 వ మేళ చక్రములోని 4 వ మేళమగు 'వాగధీశ్వరి' కి గల సంకేత నామము. 34 వ మేళకర్తయగును.

**ఋతు-మా** :— ఇది 6 వ మేళ చక్రములోని 5 వ మేళమగు 'శూలిని' కి గల సంకేతనామము. 35 వ మేళకర్తయగును.

**ఋతు-శ్రీ** :— ఇది 6 వ మేళ చక్రములోని 2 వ మేళమగు 'రాగవర్ధని'కిగలసంకేతనామము. 32 వ మేళకర్త యగును.

**ఋతు-షా** ఇది 6 వ మేళచక్రములోని 6 వ మేళమగు 'చలనాట' కు గల సంకేతనామము. 36 వ మేళకర్త యగును.

**ఋతుతాళము** :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను సంగీత గ్రంథములోని చతురశ్రజాతి రూపకతాళమునకు పేరు. దీనికి అంగములు 0 ।. అక్షరకాలములు 6.

**ఋతుతాళము** :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను సంగీత గ్రంథములోని త్రిశ్రజాతిఝంపెతాళమునకు పేరు. దీనికి అంగములు । ◡ 0. అక్షరకాలములు 6.

**ఋష్యకేతుప్రియ** :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము – స రి గ మ ప ని స.
అవరోహణము – స ని ప మ గ రి స.

***ఋషభప్రియ** :— 72 మేళకర్తలలో 62వ మేళకర్తకుగల పేరు. ఇది 11 వ రుద్ర చక్రములోని 2 వ మేళకర్తయగును. ప్రతిమధ్యమ రాగము. కటపయాది సంఖ్యకు సరిపోవునటుల దీనిని 'రిషభప్రియ' అను పేరుతో వాడుచున్నారు.

**ఋషభము** :— సప్తస్వరములలో రెండవస్వరమునకు శాస్త్రరీత్యా యిచ్చిన నామము. ఈ స్వరముయొక్క ధ్వని ఋషభము (యెద్దు) ధ్వనివలె గంభీరత్వము గలదై హృదయమున ప్రవేశించునది

ఎక్స్టెంపర్ మ్యూజిక్ Extempore Music) :— మనోధర్మ సంగీతమునకు ఇంగ్లీషులోని పేరు. దీనిలో రాగాలాపన, మధ్యమకాల లేక తానమ్, పల్లవి, స్వరము, నిరవల్ లేక ప్రస్తారములను అయిమును వుండును. ఇవి మనోధర్మ సంగీతములోని భాగములు అనుసు.

ఎకమ్మత్తలి :— ఒకనొక్క్ల తర్మ వాద్యమునకు తమిళములో చెప్పబడుపేరు.

ఎకమ్మి :— ఒకతంతిగల వాద్యమునకు తమిళములోని పేరు. ఇది ఏకతంత్రీ వాద్యరకమునకు చేరినది.

ఎక్కాలమ్ :— సంగీత వాద్యములలో శ్రేష్ఠ అనుకొనెంపకు రంధ్రములు లేక ఊదుటద్వారా గాలిని పోయనవసరము లేకనే వాయింపబడు వాద్యము. దీనిని దేవాలయములందుజరుగు ఉత్సవములందు ముఖ్యముగా వాడుదురు.

ఎకాస్టిక్సు :— (Ekastiks) ధ్వని, ధ్వని యొక్క కారణము, ధ్వనుల యొక్క తత్వములను గూర్చి వ్రాయబడునట్టి విషయమునకు ఇంగ్లీషులోని పేరు.

ఎంకిపాటలు :— 'నండూరి సుబ్బారావు' మొదలగు వారిచే తెలుగులో రచింపబడిన శృంగారరస ప్రధానమైన జానపద గేయములకు పేరు.

ఎక్కుజారు :— ఏదైన ఒక స్వరము నుండి దానికి పైనుండు మరియొక స్వరమునకు పోవునపుడు నడుమనుండు స్వరముల నంటి రాచుకొని పోవుటకుగల పేరు. [illegible] . దీనిలో మధ్యపంచమమునుండి [illegible] మునకు పోవునపుడు ప నుండి స, [illegible] ములనంటిని రాచుకొని సావరకు [illegible] లేక తంతిపై లాగుటకు 'ఎక్కు [illegible]' అని చెప్పుదురు.

ఎక్కువస్థాయిలుగలి సంగీతవాద్యము :— [illegible] యన్ సంగీతవాద్యములలో $7\frac{1}{2}$ స్థాయి (అక్టేవు)ల హెచ్చువరకు ధ్వనించు నట్లు ఏర్పాటుచేయుచున్న యొకరకమైన సంగీత వాద్యమునకు యివ్వబడిన పేరు.

ఎట్టియపురము :— ఇది సంగీతకళను యెక్కువగా పోషించినట్టి తిరునల్వేలి జిల్లా (ద. ఇం.) లోనిఒక సంస్థానము. ఇచ్చటనే శ్రీసుబ్బుస్వామి దీక్షితులు, బాలస్వామి దీక్షితులు, సుబ్బరామ దీక్షితులు ఆస్థానవిద్వాంసులుగా నుండిరి. ఈ సంస్థానాధీశుని ప్రోత్సాహముననే 'సుబ్బరామదీక్షితులు' 'సంగీతసాంప్రదాయ ప్రదర్శిని' అను గ్రంథములను గ్రంథము బహు 1-2 భాగములను అనేక లక్ష్యలక్షణములతో రచించి ప్రకటించెను.

ఎడుప్పు :— సంగీత రచనలో సంగీతము తాళ ఆవర్తమునందు ప్రారంభించు తావునకు తమిళములో 'ఎడుప్పు' అని చెప్పుదురు. దీనినే సంస్కృతములో 'గ్రహము' అనియు తెలుగులో 'ఎత్తుట' అనియు చెప్పబడును. ఇది మూడు విధములు. 1 సమఎడుప్పు 2 అతీతఎడుప్పు 3 అనాగత ఎడుప్పు అనునవి.

ఎడుప్పు :—రాగవర్ధని అను రాగాలాపన లోని 4 భాగములలో ప్రతియొక్కదాని మొదటను ప్రారంభములేక ఎత్తుట అని

అందురు. దీనినే తమిళములో 'ఎడుప్పు' అని చెప్పుదురు.

ఎత్తుక్కడై :— ఎత్తుగడ పల్లవికి తమిళములో చెప్పబడు పేరు.

ఎత్తుక్కడైపల్లవి :— ఎత్తుగడ పల్లవికి అనగా వర్ణములోని చరణమునకు తమిళములో చెప్పబడు పేరు.

ఎత్తుగడపల్లవి :— తాన వర్ణములలో నుండు పల్లవి, 'అనుపల్లవి, ముక్తాయిస్వరముల తరువాతనుండు చరణము లేక ఉపపల్లవిని 'ఎత్తుగడ పల్లవి' యనికూడ చెప్పుదురు. ఉ॥ శంకరాభరణ రాగము, ఆదితాళములోని 'సామి నిన్నేకోరి' అను తానవర్ణములో 'నీరజాక్షి' అనుచరణము ఎత్తుగడపల్లవికి ఒక వుదాహరణ మగును.

ఎత్తుగడస్వరము :— తానవర్ణములలో పూర్వాంగమగు పల్లవి, అనుపల్లవి, ముక్తాయిస్వరముల తరువాత ఉత్తరాంగమునందు గల చరణము తరువాత నుండు ప్రతిస్వరభాగమునకు ఎత్తుగడ స్వరమని చెప్పుదురు.

ఎమున్‌కల్యాన్ :— ఇది హిందూస్థాని సంగీతమునకు సంబంధించిన ఒకరాగము. 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము. ఆరోహణమునందు ధైవతము వర్జమగుటచే షాడవ—సంపూర్ణ రాగమని చెప్పబడును.

ఎలిఫంట్‌కేవ్‌స్(Elephanta Caves):- బొంబాయికి సమీపములోనుండు వివిధ సంగీత వాద్యశిల్పములుగల గుహలు. 8 చేతులుగల నటరాజు, గంధర్వులు మొదలగువారు వీణాది సంగీత వాద్యములను వాయించుచున్నట్లు కనుపడు అద్భుత శిల్పములు గలవు. ఇవి 7 వ శతాబ్దమునకు చెందిన శిల్పములుగా తెలియుచున్నది.

ఎల్లోరాకేవ్‌స్ (Ellora Caves) :— ఇవి హైదరాబాదు సంస్థానమునకు చెందిన గుహలు. ఇచ్చట అష్టభుజ నటరాజు, మృదంగము వాయించుచున్నట్టి నందివిగ్రహము, ఢోలు, బ్రహ్మతాళము, రెండు తంత్రులవీణ మొదలగు అనేక సంగీతవాద్యములశిల్పములు గలవు. ఇవి 5 వ శతాబ్దమునకు చెందినవిగా తెలియుచున్నది.

ఎరకలకాంభోజి :— ప్రాచీనులు 'యదుకులకాంభోజి' అను రాగమునకు యుప్యోగించిన మరియొక పేరు.

ఎరుకల కాంభోజి :— ఈ కాలములో 'యదుకుల కాంభోజి' రాగముగా వాడుచున్న రాగమునకు కొన్ని ప్రాచీనగ్రంథములలో చెప్పబడిన పేరు.

ఎరుకలరుంపె :— యక్షగానములో వాడబడు నొకరకమైన తాళమునకు పేరు.

ఎసాంధోలి :— 46 మేళకర్తయగు షడ్విధ మార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

ఏకతాళము :— ప్రాముఖ్యమైన ధృవాది సప్తతాళములలో చివరిదైన 7 వ తాళము. దీనికి అంగము ఒక లఘువు మాత్రమే యుండును. గనుక 'అహోబలుడు' తన 'సంగీతపారిజాత' గ్రంథములో దీనిని 'లఘుతాళ'మని చెప్పియుండెను. త్రిశ్రాదిపంచజాతుల ననుసరించి దీని అక్షరకాలములు 3, 4, 5, 7, 9 ఈవిధముగా మారుచుండును.

ఏకతాళము :— 'సంగీత రత్నాకరము' లోని 120 తాళములలో 67 వ తాళమునకు ఇదే పేరుగలదు. దీని అంగములు 0.

ఏకతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 లో 71 వ తాళమునకు యిదే పేరుగలదు. దీని అంగములు 0. అనగా ఒక ద్రుతము. అక్షర కాలములు 2.

ఏకధాతు దివ్యనామకీర్తన :— దివ్యనామకీర్తనలలోని కొన్నిటిలో పల్లవి, చరణములుండి యీ రెండును ఒకే సంగీత శైలిని (ధాతు)గలిగియుండును. గనుక వీటిని ఏకధాతు దివ్యనామకీర్తనలని చెప్పుదురు. ఉ॥ "శ్రీరామజయరామ" అనుయదుకుల కాంభోజిరాగము'లోని త్యాగరాజ కీర్తన యిందుకు ఒక మంచి వుదాహరణయగును. దీనికి వ్యతిరేకమైనది ద్విధాతు దివ్యనామ కీర్తన. దీనిలో పల్లవి, చరణములు వేరు వేరుధాతు (స్వరము) లను కలిగియుండును.

ఏకముఖవాద్యము :— ఒకే ముఖమును కలిగిన చర్మవాద్యమునకు పేరు. దీనికి 'డమారము' అనువాద్యము ఒక మంచి ఉదాహరణముగా నుండును.

ఏకముద్రప్రబంధము :— సంగీత రచనలలో వుపయోగింపబడునట్టి ద్వాదశ (12) ముద్రలలో ఒకే ముద్రను వుపయోగించు రచనకు పేరు. ఉ॥దీక్షితునిగురుగుహముద్ర.

ఏకరాగమేళవీణ :— ఒకసారి ఒకేరాగమును మాత్రమే ప్రదర్శించుటకు తగినట్లు మేళముచేయు వీణకు పేరు. దీనిలో రాగము మారినప్పుడు మేళముకూడా మార్పు చేయవలసి యుండును. దీనికి ఉ॥ సితార్ వాద్యము. దీనికి వ్యతిరేకమైనది సర్వరాగమేళ వీణ. ఇందుగల మెట్లు బిగింపబడి యుండును. దీనికి ఉ॥ ఇప్పటి దక్షిణదేశపు వీణ యగును.

ఏకలీల :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ని ధ ని ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

ఏకలుడు :— గానముచేయుటలో ఒకడుగా నుండి గానముచేయువానికి పేరు.

ఏకవీర :— ఒకరకపు మురళీవాద్యమునకుగల పేరు. దీనిలో ఊదు రంధ్రమునుండి మొదటి వ్రేలి రంధ్రమునకుగల దూరము 1 అంగుళము వుండును. 1-7 వ్రేలిరంధ్రములను మూసి దీనిని ఊదినచో తార స్థాయి షడ్జము పలుకును.

ఏకశృంగి :— 'సంగీత స్వరప్రస్తార సాగరము'లో చెప్పబడిన 39వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి గ మ గ రి ప ని ధ ని ప ధ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఏకశ్రుతి దైవతము :— 22 శ్రుతులలోని 15 వ శ్రుతికి పేరు. ఇది 'సావేరి' రాగములోని దైవతమునకు సరిపోవును. దీని ప్రకంపనములు ఒక సెకండుకు 128/81.

ఏకశ్రుతి రిషభము :— 22 శ్రుతులలోని 2 వ శ్రుతికి గల పేరు. ఇది 'గౌళరాగము' లోని రిషభమునకు సరిపోవును. దీని ప్రకంపనములు ఒక సెకండుకు 256/243.

ఏకస్వర వక్రరాగము :— ఆరోహణ అవరోహణముల రెంటిలోను ఒక్కొక్క స్వరమే వక్రముగా నుండు రాగము. ఉ॥ నటాభరణము 10 వ మేళకర్త జన్యము. సరిగమపసపనిస — సనిధపమగమరిస.

ఏకస్వర వర్జరాగము :— రాగమునకు గల ఆరోహణావరోహణములలో ఒక స్వరము వర్జముగా నుండు రాగము. అనగా షాడవరాగమని అర్థము. ఉ॥ మలయమారుతరాగము: స రి గ ప ధ ని స— స ని ధ ప గ రి స. 16వ మేళకర్తజన్యము.

ఏకస్వర శ్రుతివాద్యము :— ఒకేరకపు ధ్వనియిచ్చు వాద్యమునకు పేరు. ఇట్టి వాద్యమునకు ఏక్తార్, తుంతిన, ఒత్తు వాద్యములు ఉదాహరణములగును.

ఏకాండవీణ :— ఏకాండమైన ఒకే కఱ్ఱతో పూర్తి చేయబడు వీణకు పేరు. ఇటుల ఏకాండమగు కఱ్ఱతో చేయబడు వీణయొక్క ధ్వని మాధుర్యముగాను, గంభీరముగాను వుండును. గనుకనే దీని ఖరీదు కూడ యెక్కువగా నుండును. ఇట్టి వీణలు మైసూరులో తయారు చేయుదురు. సుప్రసిద్ధ వైణికులు వీటినే ముఖ్యంగా వుపయోగింతురు.

ఏకాంత వాద్యము :— మిక్కిలి సున్నితమైన నాదముగలిగి నునుపుగాను అందముగాను చేయబడినదై రాజ అంతఃపురములందు వాయింపబడు వీణకుగల పేరు.

ఏక్తార్ :— తంత్రీ వాద్యములలో శ్రుతి వాద్యమునకు సంబంధించిన ఒకే తంత్రి గల వాద్యము. దీనిని సాధారణముగా బైరాగులు అనబడు సన్యాసులు వాయించుదురు. ఇది ఒకేరకపు ధ్వనిని యిచ్చును.

ఏకాగ్రణి :— 'ఏకాఘ్రుణి' అను రాగమునకు సరిపోవునట్టి రాగము.

ఏకాఘ్రుణి .— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము—సని ధ ని ప మ గ మ రి స.
ఇది సంగీత కౌముదిలో చెప్పబడినట్టి రాగము.

ఏకాకిరి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి గ మ ప ధ ని స.
అవరోహణము—స ని ప మ రి గ మ స.

ఏకోత్తరశతతాళములు :— 'పార్శ్వదేవుని' యొక్క "సంగీత సమయసారము"

లోను నారదుని యొక్క "సంగీత మకరందము"లోను చెప్పబడిన 101 తాళములకు యివ్వబడిన పేరు.

ఏకాంకప్రియ :—37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగముగా చిట్టిబాబునాయుడుయొక్క "కీ టు హిందూ మ్యూజిక్"(Key to Hindu Music) అను గ్రంథములో చెప్పబడినది.

ఏకాంకమనోహరి :— ఇది 'ఏలాంక మనోహరి' వలెనుండునట్టి రాగము.

ఏలప్రభావము :—29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఏలాంకమనోహరి :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.
ఇది ఏకస్వరవర్జ్య రాగమునకు చెందును.

---

## ఐ

ఐరావతి :—45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

ఐరావతి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

## ఒ

ఒడెయపురందరవిఠల :—పురందరదాసు విఠలుని, సేవకుడు రచించిన కన్నడము లోని కీర్తనలందు గల ముద్రకు పేరు.

ఒత్తు :— శ్రుతివాద్యములలోని ఒకరకమైన వాద్యమునకుగల పేరు.

ఒదిగింపు :— వీణావాద్యములో [illegible] తంతిని ఎడమచేతి వ్రేళ్ళతో లాగుటకు ఒదిగింపు అని పేరు. [illegible] ధారము లేక శుద్ధమధ్యమమును గూడ పలికింతురు. ఇటులనే తదితర రాగము లందుగూడ పలికించుట గమనింపదగును.

ఒరదికీర్తన, ఒరదిదరు, ఒరదిపదము:— ఇవి పవిత్ర సంగీతములోను, ఓపెరా సంగీతములోను వచ్చును. వీటికి పల్లవి, అను పల్లవి, చరణములను విభజన కలదు. వీటిలోగల చరణములు పాడవలెనుగానుండి ధాతు (స్వరము) అనేకపర్యాయములు వచ్చినను [illegible]

**ఒరయిక** :— ఒక స్వరమునుండి మరియొక స్వరమునకు దిగునపుడు దానికి మీదిస్వరముల ఛాయ గనుపించునటుల రాచుకొని దిగుటకు 'ఒరయిక' అనిచెప్పుదురు. ఉ॥ సా నీ ధా పా అని పలికించునప్డు సారి - నీస - ధాని - పా అను విధమున స్వరములను పలికించుట యగును.

**ఒరిక** :— ఒరయిక అను పదమునకు గల మరియొకపేరు. [ఒరిక = రాచుట.]

# ఓ

**ఓంకార ఘోషణి** :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ని స.
అవరోహణము — స ని ప మ గ రి స.

**ఓంకార స్వరూపిణి** :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ని స.
అవరోహణము — స ని ప మ గ రి స.

**ఓంకారి** :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ధ స.
అవరోహణము — స ధ ప మ గ రి స.

**ఓంకారి** :— 48 వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ప ధ స.
అవరోహణము — స ధ ప మ గ రి స.

**ఓపెరా సంగీతము** :— ఇది అప్లైడ్ సంగీతములోని ఒక ముఖ్య భాగము (గేయ నాటకము) నకుగల ఇంగ్లీషుపేరు.

**ఓరియంటల్ మ్యూజిక్** :— 'ఏ. యమ్. చిన్నస్వామి మొదలియార్ చే' ఇంగ్లీషులో వ్రాయబడిన యొక సంగీత గ్రంథము. ఇందులో సంగీతమునకు సంబంధించిన అనేక ముఖ్యవిషయములు గలవు.

**ఓవి** :— మహారాష్ట్ర భాషలో వ్రాయబడి దక్షిణభారతములో హరికథా కాలక్షేపములందు ముఖ్యముగా పాడబడుచున్నట్టి ఒకవిధమైన పవిత్రసంగీతరచనకు గలపేరు.

**ఓషధి** :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ మ ధ ని స.
అవరోహణము — స ని ధ మ గ రి స.

**ఓషధీశప్రియ** :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ ధ ని స.
అవరోహణము — స ని ధ గ రి స.
ఇది ఔడవ-ఔడవరాగమునకు చెందిన ఒక వుదాహరణ మగును.

ఔడవ :— ఇది అయిదు సంఖ్యను తెలియజేయును. అసంపూర్ణములగు ఆరు విధములైన స్వరసమూహములలో 5 వది. దీనిలో 5 స్వరముల కొలత యుండును.

ఔడవఔడవ :— ఆరోహణ అవరోహణముల రెంటియందును 5 స్వరములు మాత్రమేకలిగియుండురాగము. ఉ॥(1)మోహన. స రి గ ప ధ స – స ధ ప గ రి స. (2) హంసధ్వని–స రి గ ప ని స–సని ప గ రి స.

ఔడవగీతము :— 5 స్వరములను మాత్రమే కలిగియుండు రాగములోని గీతము. ఉ॥ఆనలేకర,అను శుద్ధసావేరి రాగగీతము.

ఔడవరాగము :—ఔడవ ఔడవ రాగమునకుగలమరియొకపేరు. ఉ॥ హిందోళ.

ఔడవషాడవరాగము :— ఆరోహణములో 5 స్వరములును అవరోహణములో 6 స్వరములును యుండునట్టిరాగము. ఉ॥ i మలహరిరాగము. 15 వ మేళకర్త జన్యము.
స రి మ ప ధ స – స ధ ప మ గ రి స.
ii జగన్మోహినిరాగము. 15 వ మేళకర్త జన్యము. సగమపనిస – సనిపమగారిస.

ఔడవ సంపూర్ణరాగము :— ఆరోహణములో 5 స్వరములు మాత్రమే యుండి అవరోహణములో సప్తస్వరములు అనగా 7 స్వరములుండునట్టి రాగము.
ఉ॥ i బిలహరిరాగము. 29 వ మేళకర్త జన్యము. సరిగపధస – సనిధపమగరిస.
ii ధన్యాసిరాగము. 8 వ మేళకర్త జన్యము. సగమపనిస – సనిధపమగరిస.

ఔడవస్వరాంతర :— 5 స్వరములు గల ఔడవము ఆరోహణములోను 4 స్వరములుగలస్వరాంతర అవరోహణములోను యుండునట్టిరాగము. ఉ॥ రత్నజ్వాలితరాగం. ఇది 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
స రి ప ధ ని స – స ని ప గ స.

ఔడువ :— ఔడవ అనుపదముయొక్క పురాతనరూపమే ఔడువ యగును.

ఔత్తరరాగము :— ఉత్తరదేశమునుండి తీసుకొనబడిన రాగమునకుగల పేరు. ఉ॥ ఖమాసు, కాపి రాగములు మొదలగునవి. వెంకటమఖివారు తోడిరాగమునుగూడా ఔత్తరరాగమనే చెప్పియుండుట గమనింపదగిన విషయము.

ఔత్సుక్యము :— వ్యభిచారీ భావములోని 33 విధములలో 20 వది 'ఔత్సుక్య' మని చెప్పబడును.

ఔదార్యము :— భావములు 5 టిలో రెండవదైన అనుభావమునందు గల 4 విధములలో మొదటి చిత్తజానుభావములందు గల 10 రకములలో 10 వది 'ఔదార్యము' అని చెప్పబడును.

ఔమపత్యము :– ఔమాపతము వలెనుండుదాని పేరు.

ఔమాపతము :— 'ఉమాపతి' చే వ్రాయబడిన ఒకనవీన గ్రంథము. ఇది 38 చిన్నఅంకముల (Chapters) ను కలిగియుండును. ఇందలి విషయము శివ, పార్వతుల యొక్క సంభాషణలుగా రూపొందించ

బడెను. సంగీతమునకు సంబంధించిన సాంకే తికపదముల పట్టిక యొకటి దీనిలో వేయ బడినది. శుద్ధరాగ, సూళాది, గీత, వేణు, వీణ, అవనద్ధవాద్య, తాళ,నృత్య, లక్షణ ములు యిందుగలవు.

ఔర్వ(శేయప్రియ :— 1 వ మేళకర్త యగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

---

# క

కంకణాలంకారి :— 52వ, మేళకర్త యగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కచరాజ :— 27 వ, మేళకర్తయగు 'సర సాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి స.

కచ్చేరీసంగీతము :— లౌకిక గానము నకుగల పేరు. గాయకుడు తనకు సహా యభూతమగు ప్రక్క వాద్యములతో రాగాలాపన, వర్ణ, కృతి, తాన, పల్లవి, స్వరకల్పన పద, జావళులు మొదలగు ప్రాముఖ్య రచనలను తాళయుక్తముగా నిర్దిష్టమైన కచ్చేరీ సంప్రదాయము నను సరించి రంజకముగ గానమొనర్చుటకుపేరు.

కంజపుంజి :— 46 వ, మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కంజభవప్రియ :— 68 వ మేళకర్త యగు 'జ్యోతిస్స్వరూపిణి' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కంజీరా :— పాట ననుకరించగల చర్మ సంబంధమైన యొక లయవాద్యమునకు గల పేరు. ఇది దక్షిణ హిందూదేశమున సాధారణముగా గానసభ లన్నిటియందు ను పుపయోగింప బడుచున్నది. కీర్తి శేషులయిన పుదుక్కోట 'దక్షిణామూర్తి పిళ్ళై' ఈవాద్యమునం దద్వితీయ ప్రతిభా విశేషమును సంపాదించి చిరకీర్తి నొందెను.

కటకము :— పూర్వపు గాయకులగు కవులు చిట్టతానములకు పెట్టినపేరు. కాని వెంకటమఖి మొదలగువారు ఈ కటక ములను తానములనియే చెప్పియుండిరి.

కటకప్రియ :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ధ ప ధ మ గ రి స.

కటపయాదిసంఖ్య :— 72 మేళకర్త రాగములయొక్క వరుసనంబరును రాగ ముపేరు వినగనే మనము కనుగొనుటకు సహాయపడు సూత్రపద్ధతికి 'కటపయాది సంఖ్య' అనిపేరు. దీని పూర్తివివరములం

నా 'సంగీతలక్షణసంగ్రహము' అను గ్రంథములోని 28 వ పేజీలో చూడనగును.

కంఠ :— పంచమస్వరము జనించు పంచస్థానములలో 3 వ స్థానమునకు 'కంఠ' అని చెప్పబడును.

కంఠధ్వనులు :— 'హెల్మ్ హోల్ట్జ్' అనునతడు వ్రాసిన గ్రంథము పేరు.

కతిన్య :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

కణక :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

కత్తళము :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ స.

కదంబ :— త్రిశ్రజాతి ఝంపతాళమునకుగల మరియొక పేరు. దీనికి అంగములు I ◡ 0. అక్షరకాలములు 6.

కదనకుతూహలము :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యమైనను, 29 వ మేళకర్త జన్యముగనే సాధారణముగా అందరు వాడుచున్నారు.
ఆరోహణము— స రి మ ధ ని గ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కదనము :— 27 వ, మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ స.

కదరము :— 21 వ, మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

కందర్పతాళము :— 'రత్నాకర గ్రంథము'లోని 120 తాళములలో 11 వ తాళము. దీనికి అంగములు 0 0 I 8 8.

కందర్పతాళము :— 'అష్టోత్తరశత తాళములగు 1 0 8 లో 10 వ తాళము. దీనికి అంగములు 0 0 I 8 8. మాత్రలు 6. అక్షరకాలములు 24.

కందర్పమనోహరి :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కందుకతాళము :— 'రత్నాకరగ్రంథము'లో గల 120 తాళములలో 66 వ తాళము. దీనికి అంగములు I I I I 8.

కందుకతాళము :— 'అష్టోత్తరశత తాళములగు 108 లో 70 వ తాళము. దీనికి అంగములు I I I I 8. మాత్రలు 6. అక్షరకాలములు 24.

కనకకుసుమావళి :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.

ఆరోహణము_ స రి గ మ ప ధ స.
అవరోహణము_ స ధ ప మ గ రి స.

కనకగిరి :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స రి గ మ ప స ని స.
అవరోహణము_ స ని ధ ని ప మ గ స.

కనకగీర్వాణి :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స రి మ ప మ ధ ని స.
అవరోహణము_ స ధ ప మ రి స.

కనకఘంట :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స గ రి గ మ ప ని ధ స.
అవరోహణము_ స ని ప మ రి గ మ రి స.

కనకచంద్రిక :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స రి గ మ ప ధ ని స.
అవరోహణము_ స ని ధ ప మ గ రి స.

కనకజ్యోతిష్మతి :— 72 వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స మ ప ధ ని స
అవరోహణము_ స ని ధ ప మ స.

కనకదీపరము :—45వ, మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స గ మ ప ధ ప ని.
అవరోహణము_ ధ ప మ గ రి స ని స.

కనకనాసామణి :—62వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.

ఆరోహణము_ స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము_ స ని ధ ప మ గ రి స.

కనకనిర్మప :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స రి గ మ ప మ ధ స.
అవరోహణము_ స ని ధ ప మ గ రి స.

కనకభవాని :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స మ గ మ ప ధ ని స.
అవరోహణము_ స ని ప మ రి స.

కనకభూషావళి :— 58 వ మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స గ మ ప ధ ని స.
అవరోహణము_ స ని ప మ గ రి స.

కనకరసాళి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స రి గమ ధ ని స.
అవరోహణము_ స ధ ప మ గ రి స.

కనకవరాళి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స రి మ ప ని స.
అవరోహణము_ స ని ధ ని ప మ గ రి స.

కనకవసంతము :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స గ మ ప ని ధ స.
అవరోహణము_ స ని ధ ప మ గ రి స.

కనకశ్రీకంఠి :— 60 వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ని ధ ని ప మ రి స.

కనకసింహారవము:—61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

*కనకాంగి :— 72 మేళకర్తలలో 1 వ ఇందుచక్రములోని 1వ మేళకర్తకుగల పేరు.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కనకాద్రి :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

కనకాంబరి :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

*కనకాంబరి :— 'వెంకటమఖి' 72 మేళకర్తలకు యేర్పఱచిన పేర్లలో 1 వ మేళకర్తకుగల పేరు.

కన్నడ :— కన్నడదేశ (రాష్ట్ర)ములో జనించునట్లుగా సూచించు ఒక రాగము. ఇది 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగముగానున్నది.
ఆరోహణము- స మ గ మ ధ ని స.
అవరోహణము- స ధా ప మ గ మ రి స.

కన్నడకురంజి :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము,
ఆరోహణము- స గ రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ రి స.

కన్నడగౌళ :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

కన్నడదర్బారు :— 33 వ మేళకర్తయగు 'గాంగేయ భూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ప స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

కన్నడదీపరము :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప ధ మ గ రి స.

కన్నడపంచమం :— 26 వ మేళకర్తయగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ని ప మ గ స.

కన్నడభాషలోనిపవిత్రసంగీతరచనలు:- పిళ్లారిగీతములు,సూళాదులు, దేవర నామములు మొదలగు ప్రాముఖ్యమైన రచనలు యీ రకమునకు చెందినవిగా నున్నవి.

కన్నడభోగి :— 50 వ మేళకర్త యగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి గ స.

కన్నడభోమణి :— 70 వ మేళకర్త యగు 'నాసికాభూషణి' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి మ గ స.

కన్నడమల్లారు :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— సనిధమగస. [గా. భా.]

కన్నడమారువ :— 53 వ మేళకర్త యగు 'గమన శ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

కన్నడమారువ :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.
(సం. స్వ. ప్ర. సా. 477 పుటచూడుము.)

కన్నడరచయితలు :— పురందరదాసు, శ్రీపాదరాజు, వ్యాసరాయిస్వామి, వాదిరాజు, కనకదాసు, జగన్నాథదాసు మొదలగు ప్రసిద్ధ రచయితలకుగల పేరు.

కన్నడవేళావళి :— 48 వ మేళకర్త యగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ప ని స రి గ మ ప.
అవరోహణము— ప మ గ రి స ని ధ ని ప.
ఇది పంచమాంత్యరాగమునకు సరిపోవు రాగముగా నుండును.

కన్నడసౌరాష్ట్రము :— 10 వ మేళకర్త యగు 'నాటకప్రియ' యొక్క జన్య రాగము.
ఆరోహణము—స రి మ గ మ ధ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

కన్యావితాన :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి గ రి స.

కనిష్ఠ :— ఒక నాయకునికి ఇద్దరు నాయిక లున్నచో అందు నాయకుని ప్రియము తక్కువగా కలిగియుండు నాయికను 'కనిష్ఠ' యనబడును.

కంపవిహీనరాగము :—అర్ధకంపిత రాగమునకు గల మరియొక పేరు. రాగములో గమకస్వరములు లేకుండా శుద్ధస్వరములతో కూడినదైన నిది 'నారదుని'చే విభజింప బడిన రాగవిభజనలో మూడవది యగును.

కపాలములు :— 'శార్ఙదేవుడు' 'గీతికలకు' తోడు రచించిన యితరజాతి రచనలకు గలపేరు.

కపిల :— 12 వ మేళకర్తయగు 'రూపవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కంపితము :— ఒక స్వరమును ఒక అక్షరకాలము కదలించి దానికిసమీపమైన స్వరచ్ఛాయను రాకుండునటుల జేయుటను 'కంపిత' మని చెప్పబడును.

**కంపితగాంధారము** :— గాంధారమును కదలించుటచే యేర్పడునట్టి పేరు. ఉ॥ సహానరాగము. ఈ రాగములో ప్రయోగించునట్టి అంతరగాంధారమును అవరోహణమునందు కదలించునపుడు గలుగు పేరు.

**కంపితుడు** :— గానము జేయుటలో శరీరమునకు కంపము గలుగునట్లు గానము చేయు గాయకునికిగల పేరు.

**కంబద్విజ** :— 60వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

**కంబలము** :— పూర్వము సరస్వతి యనుగ్రహమువలన శ్రేష్ఠమగు నాదవిద్యను పొందినదై మహాదేవుని సంతోషపఱచి యాతనికి కర్ణాభరణమైనట్టి యొక పామునకుగల పేరు.

**కంబలములు** :— 'శార్ఙ్గదేవుడు' గీతికలకు తోడు రచించిన మఱియొక యితరజాతి రచనలకుగల పేరు.

**కమల** :— 23వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

**కమలనారాయణి** :— 55వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.

**కమలపాణి** :— 70వ మేళకర్తయగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

**కమలమోహన** :— 28వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

**కమలవసంతము** :— 37వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి స మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

**కమలవిలసిత** :— 29వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధా ని ప మగమరిస.

**కమలసూన** :— 38వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ స.
అవరోహణము- స ని ప ధ ప మ గ రి స.

**కమలాతరంగిణి** :— 20వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స
అవరోహణము- స ని ధ ప మ రి స.

**కమలాపతి** :— 6వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ స.

కమలాప్తప్రియ :— 51వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

కమలాభరణము :— 45వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప ని ధ మ గ రి స.

కమలామనోహరి :— 27వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

కమలాసనప్రియ :— 24వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కమలిని :— 1వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కమలిని :— 30వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

కమలు :— 60వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

కమలోత్తరం :— 65వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ స.

కర :— ముప్పదియైదు తాళములలో 'సంకీర్ణజాతి ఝంపెతాళము'నకు గల పేరు. దీనికిఅంగములు ।◡0.అక్షరకాలములు12.

కరక :— 15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

కరంజకం :— 28వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ స.

కరణము :— రాగాలాపనలోని భాగములగు రాగవర్ధనులకుగల మరియొక పేరు.

కరణయతి :— 'అష్టోత్తర శతతాళము' లగు 108 లో 91 వ తాళమునకుగల పేరు. దీనిఅంగములు0 0 0 0, అక్షరకాలములు8.

కరణయతి :— 'రత్నాకర గ్రంథము' లోని 120 తాళములలో 84 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 0 0.

కరణి :— 22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

కరతోయ :— 7 వ మేళకర్త యగు 'సేనావతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కరతోయ :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ స.

కరపాణి :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కరభుడు :— గానము చేయుటలో ఒంటెవలె గళమును పైకెత్తికొని గానమొనర్చు గాయకునికి గలపేరు.

కరలాధరి :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

కర్తరాగము :— 72 మేళకర్త రాగములలో ప్రతియొక్క మేళకర్త రాగమును క్లుప్తముగా చెప్పదగినట్టి పేరు.

కర్మరవి :— 'రత్నాకరగ్రంథము'లో తెలుపబడిన 11 వక్రజాతులలో 8 వ దానికి 'కర్మరవి' యని పేరు.

కరాళుడు :— గానమొనర్చుటలో భయము గలిగించునట్లు నోరుతెఱచి గానము చేయు గాయకునికి గలపేరు.

కర్నాటక అంధాళి :— 14 వ మేళకర్త యగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

కర్నాటకకమాసు :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

కర్నాటకతరంగిణి :— 61 వ మేళకర్త యగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ప మ గ రి స.

కర్నాటకదేవగాంధారి :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ని స గ మ పా.
అవరోహణము— ధా ప మ గ రి స ని.

కర్నాటకమంజరి :— 54 వ మేళకర్త యగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధా ని స.
అవరోహణము— స ని ధ ప మ ప గ రి స.

కర్నాటకలఘువు :— ఇది 16 అక్షరకాలముఙగల దేశ్యశుద్ధ సంకీర్ణలఘువునకు గల మరియొక పేరు.

కర్నాటకవిధానము :— దక్షిణభారత దేశములో అమలునందున్న సంగీతవిధానమునకుగల పేరు.

కర్ణాటక సంగీతము :— దక్షిణ భారత దేశములో ప్రచారములోనున్నదై, ఆర్య సంగీతముయొక్క వ్యక్తిత్వమును భద్రముగా కాపాడిన లక్ష్య, లక్షణయుక్తమగు సంగీతమునకుగల పేరు.

కర్ణాటక సంగీత పితామహ :— కర్ణాటక సంగీతములో ప్రారంభమున నభ్యసింపదగు స్వరావళి, అలంకార, పిళ్ళారి గీత, ఘనరాగగీత, సూళాదులేగాక లక్షల కొలది సంగీతరచనలు (దేవరనామములు) రచించి తరించిన మహాభక్తుడగు శ్రీపురందరదాసు విఠలునకుగల బిరుదు.

కర్ణాటక సురటి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ రి స.

కరుణ:— రాగ నవరసములగు 9 టిలో 3 వ దానికి'కరుణ'రసమని పేరు.

కరుణ :— 'ద్వావింశతి, శ్రుతులనబడు 22 శ్రుతులు ఏర్పడియున్న 5 జాతులలో 3 వ జాతికిగల పేరు. మిగిలినవి దీప్త, ఆయత, మృదు, మధ్య అనునవి.

కరుణతాళము :— 'సంగీత రత్నాకర' గ్రంథములోగల 120 తాళములలో 102 వ తాళమునకుగల పేరు. దీనికి అంగము 8. అనగా ఒకగురువు.

కరుణప్రియ :— 37 వ మేళకర్తయగు 'సాలగము'యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని ధ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

కరుణాకరి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ స.

కరుణామృతసాగరము :— శ్రుతులను గురించి విశేషముగ పరిశోధించిన మిస్టర్ 'అబ్రహమ్' పండితర్ చే వ్రాయబడిన ఒక ద్రావిడ గ్రంథమునకుగల పేరు.

కరువలి :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప గ స.

కర్పూరము :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ స.

కర్మవు :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ స.

కలకంఠధ్వని :— 26 వ మేళకర్తయగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప గ రి స.

కలకంఠి :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి మ ప ఢ ని స.
అవరోహణము— స ని ఢ ప మ రి స.

కలకడ :— 13 వ మేళకర్త యగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ఢ ని స.
అవరోహణము— స ని ఢ ప మ రి స.

కల్గడ :— 13 వ మేళకర్త యగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ఢ ని స.
అవరోహణము— స ని ఢ ప గ రి స.

కలధ్వని :— 'సంగీతరత్నాకర' గ్రంథస్థము గు 120 తాళములలో 113 వ తాళమునకు గలపేరు. దీని అంగములు । । 8 । 3.

కల్పనస్వరములు :— మనోధర్మ సంగీతములోని ఒక శాఖకు గలపేరు. సంగీతరచనలు పాడునపుడు పల్లవి, లేక అనుపల్లవి, లేక చరణములలో ఒకచోట జాగాచేసి ఆరాగములోనే స్వరములను కల్పించి ¼, లేక ½, లేక 1, లేక 2, లేక 4, లేక 8 ఆవర్తములస్వరమును తాళముతో పాడి సభికులను రంజింప చేయుదురు. ఇట్లు కల్పించు స్వరములను "కల్పనస్వరము" లందురు.

కలవకుళ :— 70 వ మేళకర్త యగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కలవసంతము :— 43 వ మేళకర్త యగు 'గవాంబోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ స.

కలహంస :— 31 వ మేళకర్త యగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

కలహంసగామిని :— 8 వ మేళకర్త యగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కలహాంతరిత :— సఖుల యెదుట నాయిక పాదములమీదపడి వేడికొన్న నాయకుని నిరాకరించి తదుపరి పరితాప పడునట్టి నాయికకు 'కలహాంతరిత' యని పేరు.

కలాభరణి :— 52 వ మేళకర్త యగు 'రామప్రియ' యొక్క జన్యరాగము
ఆరోహణము— స గ రి గ మ ప ని ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని స.

*కలావతి :— వెంకటమఖి కల్పించిన 72 మేళకర్తరాగములకుగల నామములలో 31 వ మేళకర్త రాగమునకు గలపేరు.

కల్యాణకేసరి :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

కల్యాణగౌరి :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప గ రి స.

కల్యాణదాయిని :—65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

కల్యాణవసంతము :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కల్యాణి :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క సంపూర్ణజన్య రాగము. శుద్ధరాగము. పెద్దరాగములలో ఒకటి. సర్వస్వర గమక వరీక రాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
స ని ధ ప మ ప గా రి స.

కల్వారు :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ప స.
అవరోహణము— స ధ ప మ రి స.

కల్పితమేళకర్తలు :— వెంకటమఖికి పూర్వము వాడబడిన 19 మేళకర్తలను మరియు 20 మేళకర్తలను కల్పితమేళకర్తలని వెంకటమఖిచే చెప్పబడెను.

కల్పితసంగీతము :— ఇంతకుపూర్వము రచింపబడినదై వల్లెవేసి పాడబడునట్టి సంగీత రచనలకు కల్పితసంగీత' మని పేరు.

కల్లినాథుడు :— తోడరమల్ల కులమందు జనించిన 'లక్ష్మణాచార్యుని' కుమారుడు. అభినవ భరతాచార్యరాయడను బిరుదు వహించిన చతురకల్లినాథుడు. విద్యానగరము నేలిన ఇమ్మడిదేవరాయల ఆస్థాన పండితుడు. ఇతడు క్రీస్తుశకము 1553 లో 'సంగీతరత్నాకర' గ్రంధమునకు జగత్ప్రఖ్యాతి నొందునట్లుగా 'కళానిధి' అను వ్యాఖ్యానము వ్రాసి కీర్తినొందిన మహనీయుడు.

కలోపనతము :— మధ్యమ గ్రామము లోని 3 వ మూర్ఛనకు గల పేరు. ఇది రిష భమునుండి ప్రారంభమగునదిగా నుండును. చతుర్దశమూర్ఛనలలో ఇది 10వ మూర్ఛన.

కల్లోలబంగాళ :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని ధ స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

కల్లోలము :— 18 వ మేళకర్త యగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

కల్లోలసావేరి :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కవర్ధము :— 43 వ మేళకర్త యగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

కళ :— లఘువునకు గల విశేష నామము లలో నాలుగవది 'కళ' యని చెప్పబడును.

కళ :— తాళముయొక్క అక్షరకాలము లోని సమా సర్వాంగములకు కళలని పేరు. అనగా తాళములో ఒక్కొక్క నడచునట్టి అక్షరములకు 'కళలని' పేరు.

కళానిధి :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ స ప మ ధ ని స. అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కళాబోగి :— 69 వ మేళకర్త యగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ధ ప స. అవరోహణము- స ధ మ ప మ గ రి స.

కళామూర్తి :— 44 వ మేళకర్త యగు 'భవప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- ని స గ రి గ మ ప స. అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కళావతి :—16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి మ ప ధ స. అవరోహణము- స ధ ప మ గ స రి స.

కళావతి :— 31 వ మేళకర్త యగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ధ ని ధ స. అవరోహణము- సనిధ ప మ రి గ మ రి స.

కళాస్వరూపి :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గా మ ప ధ ని ప స. అవరోహణము- స ని ప మ గా రి స.

కళాసావేరి :— 8 వ మేళకర్త యగు 'హనుమత్తోడి' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ధ ని స. అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కళ్లాడము :—సంగీత గ్రంథము కానట్టియు, తాళమునుగురించి మాత్రమే వ్రాయబడినట్టి ఒక తమిళగ్రంథమునకు 'కళ్లాడము' అని పేరు.

కళిందజ :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ని స. అవరోహణము- స ని ప మ గ రి స. ఇదిషాడవ-షాడవ రాగమునకు సరిపోవును.

---

# కా

కాకపాదము :— సంగీత కాలమానమును లెక్కించుటకు నుపయోగించు షడంగము లలో ఆఖరిదానికి గలపేరు. అనగా ఒక ఘాత (దెబ్బ) ఒక పతాకము, ఒకకృష్య, ఒక సర్పిణి యీనాలుగు కలసి కాకపాద మగును. ఈ నాల్గింటిలోను ఒండొంటి మధ్య 4 అక్షర కాలము లుండుటచే మొత్తము 16 అక్షరకాలములగును. అనగా 4 చతురశ్ర లఘువులగును. దీని గుర్తు + ఈవిధముగా నుండును.

కాకపాదమేరువు :— తాళప్రస్తార భేదములగు 14 టిలో 11 వ దానికిగల పేరు. అనగా కాకపాదమును లెక్క చేయుటకు గాను ఏర్పడినట్టి ప్రస్తార భేదము.

కాకలిరాగము :— 55 వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

కాకలీనిషాదము :— నిషాదములో ని భేదములలో తీవ్రజాతి స్వరమునకు గల పేరు. అనగా మూడవ నిషాదమునకు యిచ్చిన పేరు.

కాకి :— గాయకదోషములందు చెప్పిన 25 దోషములలో 9 వ దానికిగల పేరు. ఇది కాకమువలె క్రూరధ్వని గలిగి పాడునటువంటి గాయకునికి చెందును.

కాకోలము :— గానము ప్రదర్శించునపుడు శ్రోత్రానందదాయకముగా నుండక వినుటకు కఠినముగా నున్న ధ్వనితో పాడునట్టి గాయకుని 'కాకోలము' అని చెప్పుదురు.

కాంచనమాల :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

కాంచనవతి :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

కాంచనవతి :— 58 వ మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

కాంచనాంగి :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

కాంచనాంగి :— 55 వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స
అవరోహణము– స ధ ప మ గ రి స.

కాంచనాంబరి :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

కాంచని :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

కాణము :— షడంగములలో 4 వ దియగు గురువునకు గల విశేషనామములలో 4 వ దానికి 'కాణము' అని పేరు.

కాంత :— 'సంగీత మకరందము' లో చెప్పబడిన 22 శ్రుతులలో షడ్జమునకు గల 4 శ్రుతులలో 3 వ శ్రుతికి గల పేరు.

కాంతధన్యాసి :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప ని ప మ గ రి స.

కాంతమంజరి :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము—స ని స ధ ప ని ధ మ రి గ రి మ గ రి స.

కాంతరాక్షస :— 45 వ మేళకర్త యగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ధ ని స,
అవరోహణము— స ధ ప మ గ రి స.

*కాంతామణి :— 72 వ మేళకర్తలలో 61 వ మేళకర్త రాగమునకు గల పేరు. ఇది 11 వ రుద్ర చక్రములోని మొదటి మేళకర్త యగు ప్రతి మధ్యమరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కాత్యాయని :— 62 వ మేళకర్త యగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కాంతారకపాణి :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

కాంతారత్న :— 61 వ మేళకర్త యగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కాంతి :— 38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కాంతి :—భావశాస్త్రములో చెప్పబడిన చిత్తజాను భావములు 10 లో 5 వది.

కాంతిమతి :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ప మ గ రి స.

కాంతిమతి :— 60 వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

కాంతిస్వరూపిణి :— 68 వ మేళకర్త యగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స

కాదంబిని :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి గ మ గ స.

కాదంబిని :— 19 వ మేళకర్తయగు 'ఝుంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కాదినవకము :— 72 మేళకర్తలయొక్క సంఖ్యలను ఆ యా రాగములకుగల పేర్లలోని మొదటి రెండు అక్షరములను బట్టియే సులభముగా తెలుసుకొనుటకు యేర్పరచిన కటపయాది సూత్రములోని ఒక భాగమునకుగల పేరు. అనగా 'కటపయాది' చక్రములోని మొదటి వరుసయగు క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, అను 9 అక్షరముల క్రమమునకు 'కాదినవక' మని చెప్పుదురు.

కాన్సంటు (Consent) స్వరము :— అనగా ఒక స్వరమునకు సహాయభూతమగు స్వరము (సంవాది స్వరము)ను ఇంగ్లీషులో 'కాన్సంటుస్వర' మని చెప్పబడును.

కానడ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ప మ ప ధ ని ధ ప మ గా మ రి స.

కాననప్రియ :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

కానారవకళి :— 43 వ మేళకర్తయగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ రి ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కాపి :— దేశ్యరాగమైన నొక జన్యరాగమునకు గలపేరు.

కాపి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యభాషాంగరాగము.
ఆరోహణము— స రి గా మ రి ప మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కాపినారాయణి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కాబరత్ (Cabarat) నృత్యము :— యూరప్ ఖండములో సామాన్యముగా చేయబడుచుండు వినోదనృత్యములలో నొకదానికిగల పేరు.

కాంభోజి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యమైనయొక భాషాంగ రాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కామ్య :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కామధ్వజిత :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కామరూపి :— 52 వ మేళకర్త యగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

*కామవర్ధని :— 72 మేళకర్తలలో 51వ మేళకర్త రాగమునకు గలపేరు. ఇది 9 వ బ్రహ్మచక్రములోని 3 వ మేళమగును. ఇందు షడ్జపంచములుగాక శు. రిషభ-అం. గాంధార-ప్ర. మధ్యమ— శు. ధైవత-కా. నిషాదస్వరము లుండును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కామవసంత :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ రి మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కామిని :— 2 వ మేళకర్త యగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

కామోదఖడ్గధారిణి :— 33 వ మేళకర్త యగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.

కాయజప్రియ :— 4 వ మేళకర్త యగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

కార్డ్ ఆఫ్ నేచరు :— 'అప్పర్ పార్షల్' లో ఒకటితో నొకటి చేరిపలుకు స్వరములకు ఇంగ్లీషులోని పేరు.

కార్యకలాపములందు పాడు పాటలు :— వివాహాది శుభసమయములలోను, జనన, మరణ సమయములలోను పాడబడునవి. ప్రశంసార్థములయిన బడగ, కూర్గు జాతి పాటలు ఈ రకమునకు చెందినవి.

కారికాతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 లో 98 వ తాళమునకు గల పేరు. దీనికి అంగములు 0 0 0 0 ◡. మాత్రలు $2\frac{1}{4}$. అక్షరకాలములు 9.

క్లారినెట్ ( Clarinet ) :— 3 స్థాయి (ఆక్టేవు) లు గలిగి, శృతి మార్పు చేయ వీలు కలిగి, యూరపియన్ పద్ధతిమీద నిర్మింపబడి నప్పటికి, భారతదేశ సంగీత మునుగూడ అత్యంతశ్రావ్యముగా ప్రదర్శిం చుటకుతగిన వీలుంగలదై విశేషముగా వాడ బడుచున్నటువంటి ఒక యూరపియన్ సంగీత వాద్యమునకు గలపేరు. దీనిని మొదట నేర్చుకొని చిన్న మేళములో ప్రవేశపెట్టినవాడు 'మహాదేవనట్టువనార్'.

కార్ముకవతి :— ఇది 59 వ మేళకర్త యగు "ధర్మవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

కాలతాళము :— "శ్రీరామస్వామి దీక్షితారుని"చే రచింపబడిన 108 రాగతాళ మాలికలో గలయొక తాళము పేరు.

కాలనిర్ణిక :— 63 వ మేళకర్త యగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని ధ స.
అవరోహణము- స ప మ గ రి స.

కాలము :— అనగా సంగీత వేగము. ఒక సంగీత రచనలో నుపయోగించు తాళాంగములు యెంతెంత కాలము పట్టునో తెలియుటకు సహాయపడు దానికి కాలమని పేరు. ఇది తాళదశ ప్రాణములలో నొందటిది.

కాలక్షేప సంగీతము :— "పవిత్ర" సంగీతములోని ఒక ముఖ్యభాగమునకు గల పేరు. ఇది హరికథా కాలక్షేపము లందును, భజన కాలక్షేపములందును ప్రదర్శింపబడునదిగానుండును.

కాలిక :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కావడిచిందు :—"అన్నామలై రెడ్డియార్" చే తమిళములో రచింపబడిన ప్రఖ్యాత జానపదగేయ రచనలకుగల పేరు. ఇవి సంగీత కచ్చేరీలలో చివరభాగమున తేలిక సంగీత రచనలుగా పాడుదురు. వీటిలో కొన్ని పల్లవిసంగీతము లోనికికూడ అమర్చబడి పాడబడుచున్నవి.

క్వావెర్ (Quaver) :— ఇది హిందూదేశ సంగీతములో తాళ సంబంధమగు చతుర్భాగమునకు సరిపోవు యూరపియన్ సంగీత కాలపరిమాణమునకు ఇంగ్లీషు పేరు.

కాశ్యపి :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

*కాశిరామక్రియ :— ఇది 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' రాగమునకు "వేంకటమఖి" పెట్టిన మరియొక పేరు.

కాశ్మీర :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కాహళము :—"శార్ఙ్గదేవుని"చే చెప్పబడిన వేణువులోని 10 రకములలో 6 వ రకము.

కాష్ఠ :— కాలప్రాణ లక్షణానుసారముగా 8 లవములు చేరిన కాలమునకు కాష్టమని పేరు. (దీని పూర్తి వివరములు నేను వ్రాసిన "సంగీతలక్షణసంగ్రహము" అను గ్రంధములోని 35వ పేజీలో కాలము యొక్క వివరణలో చూడదగును.)

కాళింది :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' రాగము యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కాళింది :—22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గా మ ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

కాక్షర :—'భావభట్టుని'చే విరచితమైన "అనూపసంగీత విలాస" మను గ్రంథమునందుగల 22 శ్రుతులకుగల నామములలో రిషభమునకుగల 3 శ్రుతులలో 3 వ దానిని 'కాక్షర' యని చెప్పబడును.

కిన్నరేశప్రియ :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

కిలికించితము :— అనుభావము 4 విధములలో 2వ దైన గాత్రజానుభావములందలి 10 రకములలో 5వ దానికి గలపేరు.

కిరణావళి :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి'కి "వెంకటమఖి" పెట్టిన పేరు.

కిరణావళి :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ప మ గ రి స.

కిరణి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

క్రియ :— ఒక తాళముయొక్క ఆవర్తమునందు కొట్టుట, విసరుట, ఎంచుట మొదలగు పనులచే తాళమునకుగల అంగములను చూపించుట 'క్రియ' అని చెప్పబడును.

క్రియావతి :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి గ స.

క్రియాంగరాగము :— దేశ్యరాగములోని 4 వ విధమునకు గలపేరు. ఇది ఇంద్రియములకు నుత్సాహము కలిగించునదియై, దేవతాస్తుతి, శోక, ఉత్సాహ, యుద్ధ, వీర, పరాక్రమములందుపయోగించునదిగా నుండును. కాని ఇప్పుడీ రాగము వాడుకయందు లేకున్నది.

## కీ

క్రీడతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 లో 51 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 0 0 ∪. మాత్రలు $1\frac{1}{4}$. అక్షరకాలములు 5.

క్రీడాతాళ శ్చండనిస్సారుక తాళము :— 'రత్నాకర గ్రంథము'లోని 120 తాళములలో 45 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 0 ∪ 0 ∪.

*కీరవాణి :— 72 మేళకర్త రాగములలో 21 వ మేళకర్త రాగమునకు గల పేరు. ఇది 4 వ వేదచక్రములోని 3 వ మేళము. ఇందు షడ్జ, పంచమములుగాక చతుశ్శ్రుతి రిషభ, సాధారణగాంధార, శుద్ధమధ్యమ, శుద్ధధైవత, కాకలీని షాదస్వరములుండును. సర్వస్వర గమక వరిక రక్తి రాగము. త్యాగరాజుని 'కలిగియుండినగదా' అనుకృతి యీరాగములోనిదై యున్నది.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కీర్తన :— సంగీత మాధుర్యమును బట్టి చేసిన విభాగములలో రెండవదైన సంగీతరచనకు కీర్తనయని పేరు. ఇందులో సంగీతమున కంతగా ప్రాముఖ్యములేక భక్తిరసప్రధానమై యుండును. శ్రీ భద్రాచల రామదాసుని కీర్తనలు పురందరదాసు కీర్తనలు మొదలగునవి ఈ రకమునకు చెందినవై యున్నవి.

కీర్తనలు :— శ్రీ "టి. లక్ష్మణపిళ్ళె" వ్రాసిన యొక సంగీత గ్రంథమునకు పేరు.

కీర్తన సంగ్రహమ్ :— శ్రీ ప్రొఫెసరు సి. సాంబమూర్తి వ్రాసిన యొక సంగీత గ్రంథమునకగల పేరు.

కీర్తన సాగరము :— శ్రీ ప్రొఫెసరు పి. సాంబమూర్తి వ్రాసిన యొక సంగీత గ్రంథమునకుగల పేరు.

కీర్తితాళము :— "అష్టోత్తరశత" తాళములగు 108 లో 43 వ తాళమునకు గల పేరు. దీనికి అంగములు 8 | 3 8 | 3. మాత్రలు 12. అక్షరకాలములు 48.

కీర్తితాళము :— "రత్నాకర" గ్రంథములోని 120 తాళములలో 48 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు | 3 8 | ...

కీర్తిప్రియ :— 1 వ మేళకర్తయగు "కనకాంగి" యొక్క జన్యరాగము. ఆరోహణము— స రి మ ప ధ స. అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కీర్తిబాను :— 67 వ మేళకర్తయగు "సుచరిత్ర" యొక్క జన్యరాగము. ఆరోహణము— స రి గ మ ప ధ ప స. అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కీర్తివిజయ :— 61 వ మేళకర్తయగు "కాంతామణి" యొక్క జన్యరాగము. ఆరోహణము— స రి గ మ ప ని ధ స. అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కీ-సంజ్ఞ :— హిందూదేశ సంగీత రచనల పైన వాటి రాగము తాళము లివ్వబడినట్లుగా యూరపియన్ సంగీత రచనలకు పైన అది పాడు విధానమును తెలుపునట్టి గుర్తుకు ఇంగ్లీషులో కీ, సంజ్ఞ అనిపేరు.

# కు

కుక్కుటతానము :— 'ఘనమ్' అను తానములోని 8 రకములలో 6 వ రకము తానమునకు గల పేరు.

కుంజరదాన :— శ్రీ 'కోటీశ్వరయ్యర్' తన రచనలందు పెట్టుకొనిన ముద్ర పేరు.

కుట్టికారుడు :— అన్యులచే రచింపబడిన ధాతు (స్వరము) నందు మాతు (సాహిత్యము) ను జేర్చుకొనువాడు "కుట్టికారు" డని చెప్పబడును.

కుట్టిమితము :— గాత్రజాను భావములు 10 లో 7 వది "కుట్టిమితము" అనబడును.

కుటుకక్కతాళము :— "రత్నాకర" గ్రంథ

ములోని 120 తాళములలో 32 వ తాళ మునకు గలపేరు. దీనికి అంగములు 0 0 I I.

కుటుక్కతాళము :— "అష్టోత్తర శత" తాళములగు 108 లో 49 వ తాళమునకు గల పేరు. దీనికి అంగములు 0 0 I I. మాత్రలు 3. అక్షరకాలములు 12.

కుటుంబిని :— 64 వ మేళకర్త యగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కుడిమియమలై శాసనము :— దక్షిణ ఇండియాలో 'పుదుక్కోట' సంస్థానములో రాగరచనలు, రాగరసములు, రాగిణీచిత్రములు మొదలగునవి చిత్రింపబడియున్న యొక 'శాసనము'నకు గలపేరు.

కుడుక్కతాళము :— "భరతనాట్య శాస్త్రము" అను తమిళ గ్రంథము లో పేర్కొనబడిన పంచతాళమునకుగల ఉప తాళముయొక్క పేరు.

కుంతల :— 61 వ మేళకర్త యగు "కాంతామణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

కుంతల :— 16 వ మేళకర్త యగు "చక్రవాకము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ గ మ రి స.

కుంతలకాంభోజి:—13వ మేళకర్త యగు "గాయకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

కుంతలకుసుమావళి :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ప స.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

కుంతలగీర్వాణి :— 68 వ మేళకర్త యగు "జ్యోతిస్వరూపిణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ మ ప మ గ రి స.

కుంతలఘంటాణము :— 70 వ మేళకర్తయగు "నాసికాభూషణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ప స.
అవరోహణము— స ని ప మ రి స.

కుంతలదీపరము :— 48 వ మేళకర్త యగు "దివ్యమణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

కుంతలధన్యాసి :— 47 వ మేళకర్త యగు "సువర్ణాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

కుంతలభవాని :— ఇది 67 వ మేళకర్త యగు "సుచరిత్ర" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ప స.
అవరోహణము— స ని ధ ని ప మ రి స.

కుంతలభోగి :— 41 వ మేళకర్త యగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ప ని స.
అవరోహణము- స ని ధ ని మ గ రి స.

*కుంతలము :— "వెంకటమఖి" 72 మేళకర్తలలో 61 వ మేళకర్తయైన "కాంతామణి"కి పెట్టిన మరియొక పేరు. ఇది 11 వ రుద్రచక్రములోని మొదటిమేళము.

కుంతల రంజని :— 60 వ మేళకర్త యగు "నీతిమతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప ధ ని ప మ గ స.

కుంతలరంజని :— 68 వ మేళకర్త యగు "జ్యోతిస్స్వరూపిణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గరి స.

కుంతలరామ :— 53 వ మేళకర్తయగు "గమనశ్రమ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కుంతలవరాళి :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ స.

కుంతల శ్రీకంఠి :— 65 వ మేళకర్త యగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.

కుంతల స్వరావళి :— 46 వ మేళకర్త యగు "షడ్విధమార్గిణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ని ప మ గ రి స.

కుంతలసింహారవం :— 69 వ మేళకర్తయగు "ధాతువర్ధని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప మ ధ ని స.
అవరోహణము- స ధ ప మ రి స.

కుత్రిమము :— నాదము ముఖమునం దుండునపుడు గలపేరు.

కుతూహలము :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స ధ ప రి మ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కుందర :— "రాగతాళచింతామణి" అను తెలుగు సంగీతగ్రంథములో తదితరులు తెలుపనటువంటివిగా వ్రాయబడిన తాళములలో యొకదానికి గలపేరు.

కుంబతాళము :— "తాళసముత్తిరమ్" అను తమిళ సంగీత గ్రంథమునగల తాళములలో 14 వ తాళమునకు గలపేరు.

కుంభిని :— 2 వ మేళకర్తయగు "రత్నాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.
ఇది ఔడవ - ఔడవ రాగమునకు సరిపోవునదిగానుండును.

కుంభిని :— 41 వ మేళకర్తయగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ – షాడవ రాగమునకు సరిపోవునదిగానుండును.

*కుంభిని :— 72 మేళకర్తలకు వెంకటమఖి పెట్టిన నామములలో 41 వ మేళకర్తయైన "పావని" కి పెట్టినపేరు. ఇది 7 వ ఋషి చక్రములోని 5 వ మేళము.

కుమార :— "శ్యామశాస్త్రి" యొక్క రెండవకుమారుడైన "సుబ్బరాయశాస్త్రి" తన రచనలందు పెట్టుకొనిన ముద్రపేరు.

కుమారప్రియ :— 3 వ మేళకర్తయగు "గానమూర్తి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

కుమార రంజని :—25 వ మేళకర్తయగు "మారరంజని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

కుమారవిలసిత :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము—స మ గ మ ధ ని ప ధ ని స.
అవరోహణము—స ని ధ ప మ ధ మ గ రిస.

కుముదక్రియ :— 51 వ మేళకర్తయగు "కామవర్ధని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

కుముదతాళము :— "రత్నాకర" గ్రంధములో చెలుపబడిన 120 తాళములలో 68 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు । 0 0 । । S.

కుముదతాళము :— "రత్నాకర" గ్రంధస్థమగు 120 తాళములలో 68. A తాళమునకు గలపేరు. దీనికి అంగములు । 0 0 0 0 S.

కుముద్వతీ :— "ద్వావింశతి" శ్రుతులలో 2 వ శ్రుతియగు "ఏకశ్రుతిఋషభము" నకు గలపేరు. ఉ॥ గౌళరాగరిషభము.

కుముదప్రియ :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్కజన్యరాగము.
ఆరోహణము— స రి గా మ ప స.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

కుముదాభరణము :— 38 వ మేళకర్తయగు "జలార్ణవము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

కురంజి :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ని̣ స రి గ మ ప ధ.
అవరోహణము— ధ ప మ గ రి స ని̣ స.
ఇది ధైవతాంత్య రాగమునకొక మంచి వుదాహరణ మగును.

కురంజివిజయ :— 39 వ మేళకర్తయగు "ఝాలవరాళి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ గ రి మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప రి స.

కురందలోచని :— 3 వ మేళకర్తయగు "గానమూర్తి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

కురుచఝుంపె :— యక్షగానములో నుపయోగింపబడు నొక తాళమునకు "కురుచఝుంపె" యని పేరు.

కురుఝుంపె :— ఒక ద్రుతము, ఒక ఖండలఘువు, ఒక త్రిశ్రలఘువుతో కూడిన యొకవిధమగు తాళమునకు గలపేరు. దీనికి అంగములు 0 I I. అక్షరకాలములు 10.

కురుళము :— పంచదశవిధ గమకముల లోని విభాగములగు ఒరిగింపు, ఒరయిక అను ఈ రెంటియొక్క కలయికను "కురుళ" మనబడును. అనగా ఒక స్వరస్థానము నుండి సమీపములోని మరియొక స్వరచ్ఛాయను బిగితో పలికించునట్టి ఒరయికను 'కురుళ' మనబడును. ఉ॥ నీధాపామాయను టకు, నీస–ధాని–పాధ–మా–యని పలికించుట యగును.

కుల :— "ముప్పదిఐదు" తాళములకుగల శ్రీకరాది నామములలో "మిశ్రజాతి రూపకతాళమునకు" గలపేరు. దీనికి అంగములు 0 I. అక్షరకాలములు 9.

కులపవిత్రి :— ఇది 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ధ ప ని స.
అవరోహణము– స ని ప మ రి స.

కులభూషణి :— 21 వ మేళకర్త యగు "కీరవాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ధ ప మ గ రి స.

కులము పాటలు :— దక్షిణ హిందూదేశములో ప్రతిజాతి వారికిని ఆ జాతి యొక్క పుట్టుపూర్వోత్తరములు తెలుపునట్టి పాటలున్నవి. ఆయా కుల పెద్దలను గుఱించియు, ఆ కులమువారియందు సంప్రదాయముగ వచ్చుచున్న వృత్తి విశేషములను గుఱించియు ఆ పాటలలో వివరింపబడియుండును. ఇట్టి పాటలు సంవత్సరాది పండుగవంటి సమయములలో ముఖ్యముగా పాడుదురు.

కువలయానంది :— 16 వ మేళకర్త యగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని ధ ని ప ని స.
అవరోహణము– స ని ధ మ గ స.

కువలయాభరణము :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

కువింపకతాళము :— 'రత్నాకర గ్రంథస్థ'మగు 120 తాళములలో 112 వ తాళమునకుగల పేరు. అంగములు I 0 0 8 8.

కుశారీరము :— శ్రుతిలో చేరనిదియు, రక్తిలేనిదియు, స్వరహీనమైనదియు, మాధుర్యము లేనిదియు, కాకసదృశధ్వని గలదియు, స్థానభ్రష్టమైనదియు కృశించినదియు, కఠినమైనదియునగు శారీరమును 'కుశారీర' మని చెప్పబడును.

కుసుమకల్లోలము :— 32 వ మేళకర్త యగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ రి గ మ ప స.
అవరోహణము— స ధ ప మ గ మ రి స.

కుసుమచంద్రిక :— 32 వ మేళకర్త యగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి స.

కుసుమజ్యోతిష్మతి :— 69 వ మేళకర్త యగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ధ ప మ రి స.

కుసుమధారిణి :— 25వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

కుసుమప్రియ :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గా రి స.

కుసుమభవాని :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
ఆరోహణము— స ని ధ మ ప మ రి స.

కుసుమభ్రమరి :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

కుసుమభోగి :— 50 వ మేళకర్త యగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ధ ని ధ మ గ రి గ స.

కుసుమరంజని :— 37 వ మేళకర్త యగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

కుసుమవిచిత్ర :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— సగరిగమ ప ని ప ధ ని స.
అవరోహణము— స ధ ని ధ మ గ పమరిస.

కుసుమసారంగ :— 56 వ మేళకర్త యగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

*కుసుమాకరము :—72 మేళకర్తలలో 71 వ మేళకర్తయగు 'కోసలము' నకు 'వెంకటమఖి' పెట్టినపేరు. ఇది 12 వ ఆదిత్యచక్రములోని 5 వ మేళము.

కుసుమాంగి :— 16 వ మేళకర్త యగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి స ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కుసుమావళి :— 38 వ మేళకర్త యగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- ని స రి గ మ ప ధ ని
అవరోహణము- ధ ప మ గ రి స ని.

కుసుమావళి :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.

కృతి :— సంగీత మాధుర్యమును బట్టి చేసిన ప్రధానభాగములలో ముఖ్యమైన రచనకు 'కృతి' అని పేరు. ఇందు ముఖ్యముగా సంగీతమునకే యెక్కువ ప్రాముఖ్యము గలిగియుండును. సంగీత త్రిమూర్తులగు శ్రీమత్త్యాగరాజ, ముద్దుస్వామిదీక్షిత, శ్యామశాస్త్రులు ఇట్టి కృతి రచయితలలో నగ్రగణ్యులుగా విలసిల్లిరి.

కృతికర్త :— కృతులు రచించినవారికి గల పేరు.

కృతిభర్త :— కృతి రచయితలు యిచ్చునట్టి రచనలను కృతి పొందువారికి గలపేరు.

కృతిరచయితలు :— త్యాగరాజు, ముద్దుస్వామిదీక్షితార్, శ్యామశాస్త్రి, మైసూరు సదాశివరావు, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, సుబ్బరాయశాస్త్రి, రామ్నాడ్ శ్రీనివాస అయ్యంగార్ మొదలగువారికి గలపేరు.

కృతిసమర్పణము :— కృతి రచయితలు తమ రచనలను ఇతరులకు కృతి సమర్పించుటకు గలపేరు.

కృశము :— గానము చేయుటలో ఇతరులకు వినబడకుండ మిక్కిలి సూక్ష్మముగా పాడుటకు 'కృశ' మనిపేరు.

కృష్ట :— సామవేదమునందు ఒక్కొక్కప్పుడు బలికెడి మధ్యమముతో కలిసి యేర్పడు 7 స్వరములగు "మగరిసనిధప" అను సామస ప్తకములోని హెచ్చైన స్వరమగు తారస్థాయి శుద్ధ మధ్యమమునకు 'కృష్ట' అని పేరు.

కృష్ణ :— దేశ్యక్రియ లోని 8 విధములలో 3 వదైన క్రియకు 'కృష్ణ'అని పేరు. ఇది షడంగములలో 5, 6 అంగములగు ప్లుత, కాకపాదములందు వాడదగినది. ఇది కుడిచేతిని 4 అక్షరకాలము క్రిందికి విడచునదిగా నుండును. ఇదికాక మిగిలిన క్రియలు ధ్రువక, సర్పిణి, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాక, పతిత అనునవి.

కృష్ణవేణి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.

కృష్ణలీలాతరంగిణి :—16 వ శతాబ్దమునకుచెందిన మహనీయుడగు శ్రీ 'నారా

యాణతీర్థ యతీంద్రులవారిచే దైవప్రేరితమున వ్రాయబడిన యొక సంస్కృత గ్రంథమునకుగల పేరు. ఇందు నాయికా, నాయక లక్షణముల ననుసరించి, పల్లవి అనుపల్లవి, చరణములను విభాగములతో తరంగములను రచించి 12 స్కంధలలో పూర్తిచేయబడెను. ఇందులో కొన్ని తరంగములు జతులను గలిగి యుండుటచే వీటికి జతులుగల ప్రబంధములని కూడ పేరు గల. ఈ తరంగములన్నియు నారాయణ తీర్థ ముద్రనుగలిగియుండును. ఇవి భజన కాలక్షేపములందు ముఖ్యముగా ప్రవర్తింపబడును.

---

# కూ

కూటతానము :— తానమునందుగల 2 విధములలో రెండవది కూటతానమన బడును. ఇది రెండు రాగ కళలనో లేక యధిక రాగకళలనో ప్రకాశింపచేయునదిగా నుండును. ఉ॥ కాంభోజి, ఝుంఝూటి మొదలగునవి.(గా. భా. 78 పు.)

కూటమీటు :— వీణలో మీదితంత్రులు నాల్గింటిని చూపుడు, నడిమ, ఉంగరపు వ్రేళ్ళతో రంజనముకై ఒకేసారి మీటుట.

కూర్మవీణ :— పూర్వకాలమునందు యించుమించుగా యిప్పటి వయొలిన్ (ఫిడెల్) కు సరిపోవునటుల కూర్మ (తాబేలు) ఆకారమునుగలిగి యుండునట్లు చేయబడి వాడబడిన నొకరకపు వీణకు 'కూర్మవీణ' యని పేరు.

కూలంకష :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.
ఇది ఔడవ రాగమునకు సరిపోవును.

---

# క్లె

క్లెమెన్స్ :—'ద్వావింశతి' శృతులగురించి విశేషంగా పరిశోధన సల్పినట్టి యొక ప్రాచీన యూరపియన్ పండితునికి గలపేరు.

---

# కే

కేటి :— గానముచేయుటలో స్థానత్రయమును బొందకయే, రసహీనముగ గానము చేయు గాయకునికి 'కేటి' యని పేరు.

కేణి :— గానముచేయుటలో కంఠమ్ము మూయుచు తెఱచుచు అతి కఠినముగ పాడునట్టి గాయకునికి 'కేణి' యని పేరు.

కేతకంకుశ :— 68 వ మేళకర్తయగు 'జ్యోతి స్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ మ గ రి స.

కేతకప్రియ :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కేతనావళి :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని ప ధ స.
అవరోహణము— స ని ధ మ ప మ గ స.

కేతారనాట :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ప స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కేతారమంజరి :— 60 వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కేదార :— వేణువును (పిల్లనగ్రోవి) చేయుటకు నుపయోగించు నొకజాతి కఱ్ఱకుగల పేరు.

కేదార :— 29 వ మేళకర్తయగు 'ధీర శంకరాభరణము' యొక్క జన్యమైన యొకఘనరాగము.
ఆరోహణము— స మ గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ మ ధ ప మ గా రి స.

కేదారగౌళ :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది ఔడవ-సంపూర్ణ రాగమున కు చెందును.

కేప్డాన్సు :— యూరిప్ ఖండములో సామాన్యముగా నుండు వినోద నృత్యము లలో నొకదానికి గల (ఇంగ్లీషు) పేరు.

కేయచారధారిణి :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కేసరనాట :— 27 వ మేళకర్త యగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కేసరావళి :— 17 వ మేళకర్త యగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప గ రి స.

కేసరి :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ప ధ స.
అవరోహణము— స ధ ని ధ ప మ గ రి స.

కేసరిప్రియ :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి మ గ స.

కైకవశి :— 60 వ మేళకర్త యగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కైలాసపతి :— తెలుగు పదములు రచించిన 'ఘటపల్లి' వారు తమ రచనల యందు పెట్టుకొనిన ముద్రకు గలపేరు.

కైవశి :— 58 వ మేళకర్త యగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కైవారప్రబంధము :— ఇదియొక రకమైన సంగీతరచనకు గలపేరు. ఈ ప్రబంధములో మాతుయొక్క పెద్దభాగము జతులతోను, వాద్యములతో కూడిన సంఖ్యాశాస్త్రముతోను కూడినదిగా నుండును.

కైవేణి :— 61 వ మేళకర్త యగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ని ధ మ ప ధ ప మ గ రి స.

కైశిక :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ మ రి స.

కైశికి :— 'సంగీతరత్నాకర' గ్రంథములో పేర్కొనిన 11 వక్రజాతులలో 6 వ దానికి 'కైశికి' అనిపేరు.

కైశికీనిషాదము :— నిషాద స్వరములో ని కోమలజాతి స్వరమునకు గలపేరు. 22 శృతులలో 20 వ శృతియగు 'రమ్యా' అను శృతికి చెందినది. ఈ స్వరము గల రాగమునకు ఒకముఖ్య ఉదాహరణము 'ఖరహరప్రియ' రాగము.

కైశికీపంచమ :— మధ్యమ గ్రామము లోని ఒక శృతి తక్కువగల పంచమము నకు గలపేరు.

# కొ

కొట్టరి :— నవసంధి తాళములలో 8 వ తాళమునకు గలపేరు.

కొండమలహరి :— శ్రీ తాళ్ళపాకం రచయితలలో ఒకడైన 'చిన్నయ్య' రచించిన రచనలందు గల ఒక అరుదైన ప్రాచీనరాగము.

కొనగోలు :— ఇదియొక దేశ్యపదము. భరతనాట్యములో నటుడు కొలిపెంచుటను 'కొనగోలు' యనబడును. ఇదియొక పురాతన పద్ధతి. పరమశివుడు తాండవ మొనర్చిన సమయమున కమలభవుడు కొలిపించినటుల పురాణ ప్రసిద్ధమగుటచే ప్రాచీనులు భరతశాస్త్రమునందలి ప్రాముఖ్యతను గుర్తించి కట్టుదిట్టముతో, చేసి యున్న జతులు మనోహరముగ దనరారు చున్నవి. వీటిశైలిని యనుసరించి నవీన విద్వాంసులు కొందరు కొన్ని జతులను సమ్మేళనము చేసియున్నారు. ఈ కొలిపిం

ప్రకు ధాతువులుగ నుండుశబ్దములు 35. అవి ఈ క్రింది శ్లోకమున గమనింపదగును. శ్లో॥ తాళశ్శబ్దేన జాతాస్తు పంచత్రింశతి వర్ణకాః। తాటతోఢైధ ధిధుధే ఢఢిఢూఢే ఝుఘ్ఘునణే। కగిగూగేరిరూరారేలిలూలేలా మమూయళా। హాహ్వానుస్వార యుక్తంచ భరతశ్చేతిలక్షణం॥ అను శ్లోకానుసారముగ త, ట, తో, ఢై, ధ, ధి, ధు, ధే, ఢ, ఢి, ఢూ, ఢే, ఝు, ఘ్ఘు, న, ణే, క, గి, గు, గె, రి, రు, ర, రె, లి, లు, లె, ల, మ, ము, య, ళ, హ, హ్వ, ం అను 35 శబ్దములును వీని దీర్ఘములును. వీనికి వ్యాకరణ ప్రకారముగ గలుగు అభేదాక్షరములును, తదనుగుణ్యమగు ఒత్తులును, సంధులును, కలిసి, జతిప్రాణములైన శబ్దములగు చున్నవి.

కొంబు :— వ్రేళ్లు ఆనుకునేందుకు రంధ్రములు లేక, ఊపిరి పోయకనే వాయింపబడునొక పొడుగాటి గాలివాద్యమునకు గల పేరు.

కొల్లికావనము :— పురాతన తమిళ సంగీత విభజనలోని 24 పణ్ల (రాగముల) లో నొకదానికిగల పేరు.

---

# కో

కోకిల :— సూళాది సప్తతాళ అలంకారములో 5 వ అలంకారమున కిచ్చినపేరు.

కోకిలకంఠ :— 'మేరుస్వామి' అను ప్రాచీన వాగ్గేయకారకునికి గలబిరుదు.

కోకిలకామవర్ధని :— 11 వ మేళకర్త యగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ని ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ స.

కోకిలగంధర్వము :— 31 వ మేళకర్త యగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి గ స.

కోకిలగీర్వాణి :— 43 వ మేళకర్తయగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని మ గ రి స.

కోకిలదీపకము :— 23 వ మేళకర్త యగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

కోకిలదీపరము :— 43 వ మేళకర్తయగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

కోకిలధ్వని :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

కోకిలనాట :— 36 వ మేళకర్త యగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

కోకిలపంచమము — 39 వ మేళకర్త యగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి స పా ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గా రి స.

కోకిలప్రతాపము :— 26 వ మేళకర్త యగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గ స.

కోకిలప్రియ :— 72 మేళకర్త రాగములలో 11 వ మేళకర్తకుగల పేరు. ఇది 2 వ నేత్రచక్రములోని 5వ మేళమగును.

కోకిలప్రియతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళముల పట్టికలో 39 వ తాళమునకు గలపేరు. దీని అంగములు 8 । 3.

కోకిలప్రియతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 లో 48 వ తాళమునకు గల పేరు. దీనికి అంగములు 8 । 3. మాత్రలు 6. అక్షరకాలములు 24.

కోకిలభాషిణి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ మ రి స.

కోకిలము :— కోకిలధ్వనివలె సుందరము అవ్యక్తమధురమైన గానమును 'కోకిల' మని చెప్పబడును.

కోకిలవరాళి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ధ ని ధ స.
అవరోహణము—స ధ ని ధ ప మ రి గ రి స.

కోకిలస్వరావళి :—41 వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ధ మ గ రి స.

కోకిలానంది :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

కోకిలారవము :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

కోకిలారవము :— 72 మేళకర్తలలో 11 వ మేళకర్త 'కోకిలప్రియ'కు 'వెంకటమఖి' పెట్టిన మరియొక పేరు.

కోమలగాంధారము :— గాంధార స్వరములోని 3 రకములలో 2 వ రకమైన సాధారణ గాంధారమును ఉత్తర భారత దేశములో వాడునట్టి పేరు.

కోమలధైవతము :— ధైవత స్వరములోని 3 రకములలో 1 వ రకమైన శుద్ధ ధైవతమును ఉత్తర భారతములో వాడునట్టి పేరు.

కోమలనిషాదము :— నిషాద స్వరము లోని 3 రకములలో 2 వ దైన 'కైశికీ నిషాదమును' ఉత్తరదేశమున హిందూస్థానీ సంగీతమునందు వాడునట్టి పేరు.

కోమలమధ్యమము :— మధ్యమస్వరము లోని 2 రకములలో 1 వ దైన 'శుద్ధమధ్యమమును' ఉత్తరభారతదేశములో హిందూస్థానీ సంగీతమున వాడునట్టి పేరు.

కోమలరిషభము :— రిషభ స్వరములోని 3 రకములలో 2 వ దైన 'శుద్ధరిషభమును' ఉత్తరభారతదేశమునందు వాడునట్టి పేరు.

కోమలస్వరములు :— 'ద్వాదశ' స్వరములగు 12 స్వరములలో శు-రి, సా-గాం, శు-మ, శు-ధై, కై-నిషాదములు కోమల స్వరములని చెప్పబడును.

కోమలాంగి :— 26 వ మేళకర్త యగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.

కోమలాంగి :— 27 వ మేళకర్త యగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

కోమలి :— 63 వ మేళకర్త యగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ మ ప స.
అవరోహణము- స ధ ని మ గ రి స.

కోలఫణి :— 30 వ మేళకర్త యగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ధ ప ని స.
అవరోహణము- స ధ మ గ రి స.

కోలాహలము :— 29 వ మేళకర్త యగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స ప మ గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కోసల :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కోసల :— 'మార్గదర్శి శేషయ్యంగార్' తన సంగీత రచనలందు పెట్టుకొనిన ముద్ర పేరు.

కోసలము :— 72 మేళకర్త రాగముల లో 71 వ మేళకర్తను "కోసలము" అని చెప్పబడును. ఇది 12 వ ఆదిత్యచక్రము లోని 5 వ మేళకర్త రాగమగును.

క్రోచెట్ (Crotchet) :— తాళమడంగములగు 6 టిలో మొదటిదైన అనుద్రుతమునకు సరిపోవునట్టి యూరపియన్ సంగీతము లోగల ఒక కాలపరిమాణము.

క్రోధము :— స్థాయీ భావములోని 8 విధములలో 8 వ దానికిగల పేరు.

క్రోధి :— 22 శ్రుతులలోగల 9 వ శ్రుతియైన తీవ్రగాంధారము లేక చ్యుతమధ్యమ గాంధార శ్రుతికిగల పేరు. ఇట్టి శ్రుతిగల రాగమునకు నుదాహరణముగా కల్యాణి రాగమును తీసికొనవచ్చును.

కౌమారి :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

కౌమోద :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

కౌవానము :— పురాతన తమిళ సంగీత విభజనలో చెప్పబడిన 24 పణ్ (రాగము) లలో నొకదానికిగల పేరు.

కౌస్తుభప్రియ :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ మ రి స.

---

# ఖ

ఖండ :— భాగము లేక 5 అనిగూడా అర్థమునిచ్చునట్టి దానికి గలపేరు.

ఖండఅట :— ధ్రువాది సప్తతాళములు జాతి సంయోగమువలన యేర్పడిన 35 తాళములలో 20 వ తాళమగు "విదళ"కు గలపేరు. దీని అంగములు । । 0 0. అక్షర కాలములు 5+5+2+2=14.

ఖండఏక :— సూళాది 35 తాళము లలో 21 వ తాళమగు "రత"కు గలపేరు. దీని అంగములు 1. అక్షరకాలములు 5.

ఖండకంకాలతాళము :—'అష్టోత్తరశత' తాళములగు 108 లో 74 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 0 0 8 8. మాత్రలు 5.అక్షరకాలములు 20.

ఖండగతి :— ఏతాళమునైనను వేయు నప్పుడు ఆతాళముయొక్క అక్షరకాల మును వేయుటలో అక్షరకాలము ఒకటికి 5 కళలు వంతున నడచునది "ఖండగతి" యని చెప్పుదురు.

ఖండచాపు :— శాస్త్రీయుక్తమైన 35 తాళములుగాక తదితరముగా వాడుచున్న చాపుతాళములోని 3 విధములలో 2 వది. దీనికి 2 ఘాతలు వుండును. మొదటిఘాత (దెబ్బ)కు 2 అక్షరకాలములును, రెండవ ఘాతకు 3 అక్షర కాలములును గలిగి 2+3=5 అక్షరకాలములు గలిగియుండును.

ఖండజాతి :— తాళాంగములలో 3 వ దైన లఘువు నందుపయోగించు పంచ జాతులలో 3 వ దైన 5 అక్షరకాలములు గలది "ఖండజాతి" యనబడును.

ఖండఝంపె :— సూళాది 35 తాళము లలో 18 వ తాళమైన "చణ" తాళము నకు గలపేరు. దీని అంగములు । ◡ 0. అక్షరకాలములు 8.

ఖండత్రిపుట :— సూళాది 35 తాళము లలో 19 వ తాళమగు "దుష్కర" కు గలపేరు. దీని అంగములు । 0 0. అక్షర కాలములు 9.

ఖండధృవ :— సూళాది 35 తాళములలో 15 వ తాళమగు 'ప్రమాణ' తాళమునకు గలపేరు. దీని అంగములు । 0 । ।. అక్షరకాలములు 17.

ఖండప్రస్తారము :— తాళప్రస్తారములు 14 లో 13 వ దానికిగల పేరు. ఇది అంగములు లోపము లేక స్థానభేదములను మాత్రము కెందునటుల ప్రస్తరించుటకు గలపేరు.

ఖండపూర్ణతాళము :— 'రత్నాకర గ్రంథము'లో చెప్పబడిన 120 తాళములలో 65 A. తాళమునకు గలపేరు. దీనికి అంగములు 0 0 8 8.

ఖండమఠ్య :— 35 తాళముల పట్టికలోని 16 వ తాళమగు 'ఉదయ' తాళమునకు గలపేరు. దీనికి అంగములు । 0 ।. అక్షరకాలములు 12.

ఖండము :— ఖండిక లేక ఆవర్తమునకు గల మరియొకపేరు.

ఖండరూపకము :— సూళాది 35 తాళములలో 17 వ తాళమగు "రాజ" అను తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 ।. అక్షరకాలములు 7.

ఖండలఘువు :— పంచలఘువులగు 5లో ఒక ఘాతవేసి 4 వ్రేళ్ళను లెక్కించు 5 అక్షరకాలములుగల 3 వ లఘువునకు "ఖండలఘు"వని చెప్పబడును.

ఖండవర్ణము :—'రాగతాళచింతామణి' అను గ్రంథములోని 124 తాళములలో ఇతరులు వ్రాయుని తాళములలో 12 వ తాళము.

ఖండిత :—సంకేత కాలము నతిక్రమించి అన్యోపభోగ చిహ్నములతో ప్రాతఃకాలమునందు తన కెదురుగ వచ్చెడి నాయకుని గలది "ఖండిత" యనబడును.

ఖండిత :— అవస్థా నరము లయందు నాయికలలోని 8 భేదములలో 5 వది 'ఖండిత' యనబడును.

ఖండింపు :— ఒక స్వరమునుండి దాని క్రింది స్వరముగాక మరి యొక స్వరమునకు దిగునపుడు నడిమి స్వరమును ఖండించి దిగునట్టి స్వరము ఆ ఖండించిన స్వరచ్ఛాయను కలుగజేయును. దీనినే 'ఖండింపు' అని చెప్పబడును.

ఖడ్గధారిణి :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

ఖడ్గప్రియ :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ధ ప ధ మ గ రి స.

ఖఙ్గా :— మహారాష్ట్ర సంప్రదాయమైన కథాకాలక్షేపములందు పాడునట్టి వొక ప్రత్యేకమైన సంగీత రచనకు గలపేరు.

**ఖద్యోతకాంతి** :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

**ఖద్యోతప్రియ** :— 8 వ మేళకర్త యగు 'హనుమత్తోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

**ఖమాసు** :—28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

మరియు

ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— రి స ని ధ ప మ గ స.

ఇది దేశీయరాగములలో ప్రాముఖ్యమైన రాగము. షుమారు 200 సం॥కుముందు ఉత్తర దేశమునుండి దక్షిణదేశమునకు తేబడినది. కాకలీనిషాద అన్యస్వర భాషాంగ రాగము. మంద్రస్థాయి నిషాదమువరకు సంచరింపదగును. ఇందలి ముఖ్యరచనలు.

సాంబశివ – స్వరజతి – చిన్నికృష్ణదాసు

సుజనజీవన– కృతి – త్యాగరాజు
సీతాపతే – కృతి – త్యాగరాజు

సరససామ – కృతి – స్వాతి తిరునాళ్ మహారాజు

అప్పుడుమనసు – జావళి – పట్నం సుబ్రహ్మణ్యయ్యర్

మరులుకొన్నదిర–జావళి– రామనాథపురం శ్రీనివాసయ్యంగార్

**ఖర** :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో వ్రాయబడిన సంకీర్ణజాతి అటతాళమునకు గలపేరు. దీనికి అంగములు । । 0 0. అక్షరకాలములు 22. ఇది కటపయాది సంఖ్యకు సరిపడునట్టి పేరు.

**ఖరంజని** :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి గ మ ప ధ స ని స.
అవరోహణము— సనిధపమగసనిధనిస.

***ఖరహరప్రియ** :— 72 మేళకర్తలలో 22 వ మేళకర్తకుగల పేరు. ఇది 4 వ "వేద"చక్రములోని 4 వ రాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములు గాక చ. రి– సా. గాం– శు. మ– చ. ధై– కై. నిషాద స్వరములుండును. సర్వస్వరగమకరాగము.

# ఖా

**ఖాహులము** :— శబ్దములోని 4 రకములలో మొదటిది. స్నిగ్ధ మధురమై సౌకుమార్యముతో కూడినదై కఫమువలన బుట్టిన శబ్దమునకు 'ఖాహుల' మని పేరు. అదియే మంద్ర, మధ్యమములందు ప్రౌఢి వహించినచో 'అడిల్లక'మని చెప్పబడును.

ఖిలావళి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గా మ ప స. అవరోహణము- స ని ప మ గ రి స.

# ఖో

ఖోల్ :— ఇదియొక చర్మసంబంధమైన తాళవాద్యము. మహారాష్ట్ర దేశమునందు జనసమూహముచేయు సంప్రదాయ భజనలలో ముఖ్యముగా దీనిని వాయించుదురు. ఇది మన మృదంగముకంటె పొడవుగా నుండును. కుడిఎడమ మూతలు చిన్నవిగా నుండి కరణికూడ చిన్నదిగానుండును. దీని నాదము గంభీరముగానుండి యొక్కువ దూరమునకుగూడ వినపడుచుండును.

---

# గ

గ :— గాంధార స్వరములోని 3 రకములలో మొదటి శుద్ధగాంధారమునకు 'వెంకటముఖి' పెట్టిన సంకేతాక్షరము.

గగనగాంధారి :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గా రి మ ప ని ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

గగనభూపాలము :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

గగనమయూరి :—51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ గ ధ ని స.
అవరోహణము- స ని ధ మ ప మ గ రి స.

గగనమోహిని :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ గ స.

గగనరంజని :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప స.
అవరోహణము- స ధ ని ప మ గ రి స.

గగనసరసీరుహము :—53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ధ ని.
అవరోహణము- ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యమైన వక్రరాగమునకు చెందినదిగా నుండును.

గగనాదరి :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము-స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

గంగాతరంగిణి :— 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

*గంగాతంరగిణి :— 72 మేళకర్తలలో 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' కి "వెంకటమఖి" పెట్టినపేరు.

గజఝంపతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 77 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు S 0 0 0 ◡.

గజతానము :— తానములందలి 8 రకములలో 3 వది 'గజతాన'మని చెప్పబడును.

గజతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 99 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు. I I I I.

గజప్రాస :— 'త్యాగరాజ' రచనలలో తెలుపబడిన ఒకరకమైన ప్రాసకు 'గజప్రాస' అనిపేరు.

గజలీల :— 'ద్విజాతి ప్రబంధము' లోని 6 విధములలో 2 వ దానికి 'గజలీల' అని చెప్పబడును.

గజలీలతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 లో 17 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు. I I I I ◡. అక్షరకాలములు 17.

గజలీలతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 18 వ తాళమునకు గలపేరు. దీని అంగములు I I I I ◡.

గజలీలప్రబంధము :— 'అష్టోత్తరశత' తాళములలోగల "గజలీల" అనుపేరుతో రచింపబడిన ఒక ప్రబంధమునకు గలపేరు.

గజసారి :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ప మ గ రి స.

గజానందిని :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

గణము :— తాళంగములను కనుగొనుటకు యేర్పరచిన సూత్రమునకు గణము అనిపేరు. ఇవి 8 రకములుగలవు. వీటికే "అష్టగణము" లని చెప్పుదురు.

గణితవినోదిని :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గతి :— తాళమునకు ఆధారమై, లీనమై, నిర్ణిత సమయములందు కలుగు ధ్వనివిశేషమునకు పేరు. మరియు తాళమునందు కళలు నడచు విధమునకు కూడ గతి అనిపేరు. ఈ కళలు అక్షరకాలము ఒకటికి 3, 4, 5, 7, 9 యిటుల నడచును. వీటినే త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణగతులని చెప్పుదురు.

గతినోగయంతి :— రెండు స్వరముల వరకు పాడుటకు గలపేరు.

గంధర్వకన్నడ :—31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము—స ని ధ ప మ గ మ రి స.

గంధర్వగానము :— క్రీ. శ. 1844 — 1893 కాలము వాడైన 'మహావైద్యనాథయ్యర్'యొక్క అత్యద్భుతగానప్రదర్శనమునకు సుబ్రహ్మణ్యదేశికారుతన్మయుడై ఆ గానమును స్తుతించుచుతూ పెట్టినపేరు.

గంధర్వనారాయణి :— 24 వ మేళకర్త యగు 'వరుణప్రియ'యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ స.

గంధర్వమనోహరి :— 26 వ మేళకర్త యగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
ఇది స్వరాంతర -షాడవరాగమునకుచెందిన ఒక మంచి వుదాహరణము.

గంధర్వము :— 42 వ మేళకర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— మ ప ధ ని స రి గ.
అవరోహణము— రి స ని ప మ ప ధ ని స.

గంధర్వవేదము :— సంగీతమునుగూర్చి తెలుపు వేదవిద్యాభాగము. లేక సంగీతమునకు గల మరియొకపేరు. ఇది 4 ఉపవేదములలో నొకటి. మిగతవి ఆయుర్వేద, ధనుర్వేద, అర్థశాస్త్రములని చెప్పబడును.

గనమయూరి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మ గ రి స.

గంభీరతానము :— తానములోని 6 విధములలో 5 వ దానికి యివ్వబడినపేరు.

గంభీరనాట :— 36 వ మేళకర్త యగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

గంభీరిణి :— 23 వ మేళకర్త యగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గమకము :— భారతదేశ సంగీతములోని స్వరముల కుపయోగింపబడు కదలికలకు 'గమకము' లనిపేరు. ఈ గమకములు సంకర్నాటక గీతమున కొక ప్రాముఖ్యమైన అంగములనియు, అవి సమయమునకు వచ్చిపోవుచుండు అలంకారము లనియు చెప్పవచ్చును.

గమకము :— 'పార్శ్వదేవు'ని 'సంగీత సమయసారము' లో ఒక స్వరము దాని శృతులకు చెందిన ధ్వనినిగాక ఇతరశృతుల యొక్క ధ్వనినికూడ ప్రదర్శించినచో ఆట్టిది గమకమని చెప్పబడినది.

*గమకక్రియ :—53 వ మేళకర్త యగు 'గమనశ్రమ' కు 'వెంకటమఖి' పెట్టిన మరియొక పేరు.

గమకక్రియ :—53 వ మేళకర్త యగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.

గమకప్రియ :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

గమకసామంతము :—45వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

గమనక్రియ :— 53 వ మేళకర్త యగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.

*గమనశ్రమ :— 72 మేళకర్తలలో 53 వ మేళకర్త రాగమునకు గలపేరు. ఇది 12 మేళచక్రములలో 9 వ బ్రహ్మ చక్రములోని 5 వ మేళకర్త రాగము.
సరిగమపధనిస — సనిధపమగరిస.

గమ్మ :—'గ్రామము' నకు గ్రీకుభాషలో చెప్పబడి నటువంటి పేరు.

గమ్మె :—'గ్రామము' నకు ఫ్రెంచిభాషలో యేర్పరచినట్టి పేరు.

గర్జము :— 17 వ మేళకర్త యగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

గర్భపురి :— 'కరూరు' వాస్తవ్యులగు 'దక్షిణామూర్తిఅయ్యర్' 'దేవుడయ్యర్' రచించిన కృతులయందు గల ముద్రకుపేరు.
ఉ॥ బ్రోవసమయ. గౌరీమనోహరిరాగం.

గర్భపురి :— గర్భపురివారు రచించిన శృంగారరస ప్రధానమైన 'జావళులు' అను రచనలయందు పెట్టిన ముద్రకుపేరు.

గర్వము :— వ్యభిచారీ భావములోగల 33 విధములలో 18 వ దానిని 'గర్వము' అని చెప్పబడును.

గరిగద్య :— 56 వ మేళకర్త యగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- ని స గ మ ప ధ ని.
అవరోహణము- ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు సరిపోవును.

గరుడధ్వని :—29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప గ రి స.
ఇదిసంపూర్ణ-ఔడవరాగమునకు చెందును.

గరుడప్రియ :— 45 వ మేళకర్త యగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ ప ధ ని స.
అవరోహణము- స రి స ని ధ ప మరిగరిస.

గరుడవరాళి :— 59 వ మేళకర్త యగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.
ఇది ఔడవ–షాడవ రాగమునకు చెందును.

*గవాంభోధి :—72 మేళకర్తలలో 43వ మేళకర్తకు గలపేరు. ఇది 8 వ "వసు" చక్రములోని 1 వ మేళకర్త రాగమగును.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి– సా.గాం–ప్ర.మ–శు.ధై–శు.నిషాదస్వరము లుండును.

గ్రహము :— సంగీతరచనలలో తాళమును వ్యపయోగించి సంగీతమును ప్రారంభించు తావునకుగల పేరు. దీనినే తెలుగులో 'ఎత్తుట' అనియు అరవములో 'ఎడుప్పు' అనియు సంస్కృతములో 'గ్రహము' అనియు చెప్పెదరు.

గ్రహము :— ఒక రాగమునుగాని అందు గల సంగతులనుగాని ప్రారంభించు నట్టి మొదటి స్వరమునకు గ్రహమని పేరు.

గ్రహస్వరప్రబంధము :— "గోపాల నాయకుడు" రచించినయొకవిధమైనప్రబంధమునకు 'గ్రహస్వరప్రబంధ' మని పేరు.

గ్రహస్వరము :— ఏస్వరమునుండి రాగము ప్రారంభింప బడునో అట్టిస్వరమును 'గ్రహస్వర' మని చెప్పెదరు. రాగాలాపనలో గ్రహస్వరముచేసి పాడుటనే 'ఠాయము' అని చెప్పబడును. ఈ గ్రహస్వరములు వాది సంవాదులుగా పాడదగినవి.

# గా

*గాంగేయభూషణి :— 72 మేళకర్తలలో 33 వ మేళకర్తకు గలపేరు. ఇది 6వ"ఋతు"చక్రములోని 3 వ మేళకర్త.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక ష.రి– అం.గాం– శు. మ– శు. ధై– కా.నిషాద స్వరములుండును.

గాఢము :— దూరమునందుండినను ఏగానము శ్రావ్యముగా వినపడునో అట్టి గానమును 'గాఢ' మని చెప్పెదరు.

గాత్రజాను భావములు :—భావములు 5 విధములలో రెండవదైన అనుభావములోని 4 విధములలో రెండవదానికి గలపేరు. ఇవి 10 విధములుగా నున్నవి.అవిఏవనగా 1 లీల. 2 విలాసము. 3 విచ్ఛిత్తి. 4 విభ్రమము. 5 కిలికించితము. 6 మొట్టాయితము. 7 కుట్టమితము. 8 బిబ్బోకము. 9 లలితము. 10 విహృతము అనునవి.

గాత్రము :— మనుష్య శరీరమునందుగల మూలాధారాది 6 యోగాధార చక్రములలో నాదము మూలాధారమునుండి బయలువెడలి క్రమేణా గాత్రమగుచున్నదని.

'సంగీతదర్పణము'లో 'శారీర వివేక' ప్రకరణమునందు చెప్పబడినది.

గాంధర్వవిద్యాభూషణః— శ్రీవిజయనగరం మహారాజా సంగీతకళాశాల అధ్యక్షులును, సుప్రసిద్ధ వయొలిన్‌వాద్యకులును, భారత ప్రభుత్వముచే సన్మానమునొందిన వారును అగు సంగీత కళానిధి "శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడు"కు శ్రీ విజయనగరం మహారాజావారు యిచ్చిన ఒక బిరుదు.

గాంధర్వుడు :— మార్గ, దేశీయములగు సంగీతములను చక్కగా నుర్తెరింగిన గాయకునికి 'గాంధర్వు' డని పేరు. వీనినే 'ఉత్తమగాయకు'డని కూడ చెప్పుదురు.

గాంధారగ్రామము :—3+3+3+3+3+3+4=22 శ్రుతులను వరుసగాగల సప్తస్వరములను గలది 'గాంధారగ్రామ' మనబడును. ఇందు రిషభ, గాంధార, పంచమములు వాటినియతశ్రుతులనుండి తొలగుటచే గానయోగ్యము కాదనియు, స్వర్గమునకు పంపబడినదనియు తెలియుచున్నది.

గాంధారపంచమము :— పురాతన తమిళ్ సంగీత విభజనలోని 24 పణ్ (రాగము) లలో నొకదానికి గలపేరు.

గాంధారపంచమి :— 'సంగీతరత్నాకరము'లోని 11 వక్రజాతులలో 9 వ దానికి గలపేరు.

గాంధారము :— సప్త స్వరములలోని మూడవస్వరమునకు గలపేరు.

గాంధారి :— మధ్యమ గ్రామములోని 3 జాతులలో ఒకదానికి గలపేరు.

గాంధారోదిచ్యావ :— 'సంగీతరత్నాకరము'లో చెప్పబడిన 11 వక్రజాతులలో 4 వదానికి గలపేరు.

గాధిక :— అసంపూర్ణములగు షాడవ, ఔడవ, స్వరాంతర, సామిక, గాధిక, ఆర్చిక అను ఆరంటిలో 5 వ దానిపేరు. ఇది రెండుస్వరములు గలది. ఉ॥ స రి.

గానకళాచంద్రిక :— ఆరిపిరాల సత్యనారాయణమూర్తి చే రచింపబడి కీ॥ శే॥ విశ్వదాత, దేశోద్ధారక "శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు"చే ప్రకటింపబడిన ఒక సంగీత లక్ష్య లక్షణగ్రంధము. ఇది జర్మనీలోని బెర్లిన్ యూనివర్సిటీకి గైకొనబడినది.

గానకళాబోధిని:— శ్రీపార్థసారధీ దంపతులచే వ్రాయబడిన ఒక సంగీతగ్రంధము పేరు.

గానకళావిశారద :— కళాప్రపూర్ణ, "శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడు"కు గల ఒక బిరుదు.

గానచక్రవర్తి :— 19 వ శతాబ్దమునకు చెందినవాడును 'త్యాగరాజు'యొక్క ప్రియశిష్యులునుఅగు వాగ్గేయకారుడైన 'వీణ కుప్పయ్యర్'కు గల బిరుదు.

గానప్రియ :— 19 వ మేళకర్త యగు 'ఝుంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

గానభాస్కరము :— సంగీత భరతశాస్త్ర ప్రవీణులగు విద్వాన్, కె. వి. శ్రీనివాస అయ్యంగార్ చే 1934 లో రచింపబడిన ఒక సంగీత లక్ష్య, లక్షణ గ్రంథము.

*గానమూర్తి :— 72 మేళకర్తలలో 3 వ మేళకర్తకు గలపేరు. ఇది 1 వ "ఇందు" చక్రములోని 3 వ మేళ మగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి— శు. గాం— శు. మ—శు. ధై—కా. నిషాదస్వరములుండును.

గానలలిత :— 3 వ మేళకర్త యగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గానవసంతము :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గానవారిధి :— 35 వ మేళకర్త యగు 'శూలిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ రి స.

గానవిద్యాతరంగిణి :— శ్రీ "కాపవరపు నరసింహ్వాము" చే రచింపబడిన ఒక సంగీత గ్రంథమునకుగల పేరు.

గానవిద్యాప్రకాశిని :— శ్రీమాన్ 'పెరుంగళ్ శ్రీనివాసయ్యంగార్' చే రచింపబడిన ఒకసంగీత గ్రంథమునకు గలపేరు.

గానశాస్త్రప్రశ్నోత్తరావళి :— ఈనిఘంటు యొక్క గ్రంథకర్తయగు 'అరిపిరాల సత్యనారాయణమూర్తి' చే రచింపబడిన సుం యొకసంగీతశాస్త్ర గ్రంథమునకు గలపేరు.

*గానసామవరాళి :— 72 మేళకర్తలలో 3 వ మేళకర్త 'గానమూర్తి' కి 'వెంకటమఖి' పెట్టిన ప్రత్యేక నామము.

గ్లాని :— భావములు 5 టి లో 3 వదైన వ్యభిచారి భావమునందలి 33 విధములలో 2 వ దానికి పేరు.

గానేందుశేఖరమ్ :— శ్రీమాన్ 'తచ్చూరు శింగరాచార్యులు' చే వ్రాయబడిన సంగీత గ్రంథములలో ఒకదానికి గలపేరు.

గాంబీర్యమోషిణి :— 52 వ మేళకర్త యగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.

గామట్ :— గ్రామ త్రయములోని ఒక్కొక్క గ్రామమునకుగల ఇంగ్లీషు పేరు.

గ్రామము :— సప్తస్వరముల కొలతకు యివ్వబడినటువంటి పేరు.

గ్రామరాగము :— మార్గరాగ భేదములు 6 టిలో 1 వ దానికి గలపేరు.

గామాక్యం :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— సనిధపమగపమరిగస.

గాయకపారిజాతము :— శ్రీమాన్ 'తచ్ఛూరు శింగరాచార్యులు' చే రచియింపబడిన యొక సంగీత గ్రంథమునకు గలపేరు.

*గాయకప్రియ :— 72 మేళకర్తలలో 13 వ మేళకర్తకు గలపేరు. ఇది 3 వ అగ్నిచక్రములో 1 వ మేళకర్త యగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి— అం. గాం— శు. మ— శు. ధై— శు. నిషాద స్వరము లుండును.

గాయకమందిని :— 25 వ మేళకర్త యగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

గాయకరంజని :— 29 వ మేళకర్త యగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

గాయకలాసిని :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

గాయకలోచనము :— శ్రీమాన్ 'తచ్ఛూరు శింగరాచార్యులు'చే రచియింప బడిన గ్రంథములలో నొకదానికి గలపేరు.

గాయకవర్యుడు :— మంచి శారీరమును, స్ఫుటోచ్చారణము గలిగియును, రాగాంగ, భాషాంగ, క్రియాంగోపాంగముల నెరిగియును, గీత, ప్రబంధాదులయందు ప్రావీణ్యము గలిగియును, ఉచ్చ, నీచస్థాయిలందు గమకముల నెరింగియును, అనాయాసముగ గానము చేయగలిగియును, వివిధ రాగాలాపనము జేయగలిగియును, స్వాధీనమైనకంఠధ్వనిగలిగియును,అవలయ లేకుండా తాళము వేయగలిగియును, సుఖగాయకుడయ్యును (జితశ్రమ) శుద్ధచ్ఛాయాలగ రాగముల నెరింగియును, సమస్త కాకుస్వరవేదికాగలిగియును, త్రిస్థాయిలందు అపారముగ సంచరింప గలిగియును వుండి సమస్త దోషవిదూరుడు, క్రియాపరుడు, వ్యక్తమైన లయగలవాడు, మనోహరముగ ఘటన చేయువాడు, ధారణాయుక్తుడు, మితములేని వేగమున అనాయాసముగా గానముచేయువాడు, ఏకాంతమందు గానము చేసినను మధురముగను, శ్రావ్యముగను, జనానురంజకముగను వుండునట్లు చేయగలిగి, శాస్త్రమర్యాదల నెరింగినవాడై, సహృదయ హృదయంగముగ గానము చేయువానికి "గాయకవర్య" డని పేరు.

గాయకసార్వభౌమ :— విజయవాడ వాస్తవ్యులును, సుప్రసిద్ధ సంగీతవిద్వాంసులునగు "కీ॥ శే॥ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులు"కుగల బిరుదు.

గాయకసిద్ధాంజనము :— శ్రీమాన్ 'తచ్ఛూరిశింగరాచార్యుల'చే రచియింప బడిన గ్రంథములలో నొకదానికి గలపేరు.

గాయకసూత్రములు :— శ్రీ 'కె. రామచంద్రన్' చే రచియింపబడినట్టి యొక గ్రంథమునకు గలపేరు.

గాయనగాయనీజనపారిజాతము :— 'శ్రీ అరుణాచలంశెట్టి' చే ప్రకటింపబడిన యొక సంగీత గ్రంథమునకు గలపేరు.

గాయిన్యులు :— మంచి రూపము, యౌవనము, శ్రేష్టమైన గానముచేయు సమర్థత, అతి మనోహరమైన కంఠధ్వని, చతుర ప్రాగల్భ్యము, చతుర క్రియలందు అతి ప్రేమగలిగిన వారైన సాధ్వీలలామలను 'గాయిన్యు'లని చెప్పుదురు.(గా.భా.)

గారుగితాళము :— 'అష్టోత్తర శత తాళము' లగు 108 లో 87 వ తాళమునకు గలపేరు. దీనికిఅంగములు 0 0 0 0 0 ◡. అక్షరకాలములు 11.

గారుగితాళము :— "సంగీతరత్నాకర" గ్రంథమునందు పేర్కొనబడిన తాళ పద్ధతికలోని 120 తాళములలో 86 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 0 0 0 ◡.

# గి

గి :— గాంధారములోని 3 రకములలో 2 వదైన సాధారణ గాంధారమునకు 'వెంకటమఖి' పెట్టిన సంకేతాక్షరము.

గిప్సీమ్యూజిక్ :— తూర్పు యూరప్ ఖండమందలి దేశములలో మన కర్నాటక సంగీతములోనుండు "మాయామాళవ గౌళ" 'సిమ్హేంద్రమధ్యమము' లకు సరిపోవునటువంటి రాగములలో పాడునటువంటి సంగీత రచనలకుగల పేరు.

గిరికర్ణిక :— 3 వ మేళకర్త యగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గిరికుంతలి :— 72 వ మేళకర్త యగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ గ మపస.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

గిరిధర :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ రి గ మరిస.

గిరీశప్రియ :— 39 వ మేళకర్త యగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.
ఇది షాడవ— షాడవరాగమునకు చెందిన ప్రతి మధ్యమరాగ మగును.

గీతగోవిందము :— ఇది శృంగార రస ప్రధానమైన కావ్యము. దీనిని 12 వశతాబ్దమునకు చెందిన 'జయదేవకవి' 24 అష్టపదులుగా రచించెను. ఈ అష్టపదులకు ఒక్కొక్కదానికి 8 పాదముల వంతున వుండును. గనుకనే వీటికి "అష్టపదులు" అనుపేరు కలిగెను. ఇవి 12 సర్గలలో వ్రాయబడినవి. నాయకానాయకీ సఖులచే పాడబడినట్లు రచింపబడిన యీ అష్టపదులు సంగీత కీర్తనలకే ప్రప్రథమములుగా కనుపడుచున్నవి.

గీతనటని :— 53 వ మేళకర్త యగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

గీతప్రియ :— 13 వ మేళకర్త యగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

*గీతప్రియ :—72 మేళకర్తలలో 63 వ మేళకర్తయగు 'లతాంగి' కి వెంకటమఖి పెట్టిన మరియొక పేరు.

గీతప్రియ :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— సరిగమపధనిసపధస.
అవరోహణము— స ని ధ ప మ రి గ రి స.

గీతము :— పల్లవి, అనుపల్లవి, చరణము అను విభాగములులేని సులభ సంగీత స్వరూపము. సంగీత రచన లన్నిటిలోను చిన్నదియు నిరాడంబర మైనదిగా నుండును. సంగీతలయ సమానముగా నుండును. సంగతులుగాని క్లిష్టపదసమ్మేళనములుగాని కఠిన సంచారములుగాని యుండవు. ధాతులోని ప్రతిస్వరమునకు మాతులో ఒక్కొక్క ప్రత్యయ ముండును. సాహిత్యము దైవస్తోత్రమునకు సంబంధించినదిగా యుండును. కొన్నిటిలో అర్థములేని అయ్యా, తియ్యా, అయ్యాం, వయ్యా వంటి పదములు సాహిత్యమునందు మిళితమై వుండును. ఇవి ముఖ్యముగా రెండు విధములుగా నుండును. 1. సాధారణ గీతములు 2. లక్షణ గీతములు అనునవి.

గీతమూర్తి :— 33 వ మేళకర్త యగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

గీతానుగమము :— సంగీతవాద్యమును, దాని వుపయోగమును బట్టి గాత్రసంగీతమునకు వాయించునపుడు గలుగు పేరు.

గీతాలంబన :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ధ ని స.
అవరోహణము— స ని మ గ రి మ గ స.

గీతికలు :— 'భరతుని' "నాట్యశాస్త్రము"లో చెప్పబడియున్న ఆ కాలమునందు నాట్యములో నుపయోగించు రెండు ప్రధానరచనలలో రెండవదానికిగల పేరు. ఇది 4 విధములు. 1. మాగధి, 2. అర్థమాగధి, 3. సంభావిత, 4. పృథుల అనునవి.

గీర్వాణి :— 43 వ మేళకర్త యగు "గవాంభోధి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- సరిగరిమగమధనిపనిధస.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

*గీర్వాణి :— 72 మేళకర్తలలో 43 వ మేళకర్తయగు "గవాంభోధి"కి "వెంకటమఖి" పెట్టిన మరియొక పేరు. ఆ॥అ॥ములు- స రి గ మ ప ధ ని స. స ని ధ ప మ గ రి స.

# గు

గు :— గాంధార స్వరములోని 3 రకములలో 3 వదైన అంతరగాంధారమునకు "వెంకటమఖి" యిచ్చిన సంకేతాక్షరము.

గుజ్జరి :— 15 వ మేళకర్త యగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ని ధ ప మ గ రి స.

గుడ :— "భావభట్టుని" ద్వావింశతి (22) శృతుల పద్ధతిలో షడ్జ శృతులు 4 టిలో 3 వ దానికి "గుడ" అని పేరు.

గుండక్రియ :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి మ ప ని స.
అవరోహణము- స ని ప ధ ప మ గ రి స.

గుణభూషణి :— 37 వ మేళకర్తయగు "సాలగము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ప మ గ రి స.

గుణములు :— "ఉద్దీపనవిభావము" లోని ముఖ్యమైన 4 విధములలో మొదటి దానికిగల పేరు. మిగతవి చేష్టలు, అలంకృతులు, తటస్థములు అనునవి.

గుప్త :— 35 తాళముల పట్టికలో "త్రిశ్రజాతిఅటతాళము"నకిచ్చిన సంకేత నామము. దీని అంగములు । । 0 0. అక్షరకాలములు 10.

గుమ్మకాంభోజి :—15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

గుమ్మావళి :— 56 వ మేళకర్తయగు "షణ్ముఖప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

గురుగుహ :— సంగీత త్రిమూర్తులలో నొకరగు "శ్రీ ముత్తుస్వామిదీక్షితార్" తన రచనలందు పెట్టుకొనిన ముద్రకు పేరు. దీక్షితులవారియొక్క యిష్టదైవము "శ్రీ సుబ్రహ్మణ్యస్వామి" గనుక ఇది శ్రీసుబ్రహ్మణ్యస్వామి, వారికి చెందిన ముద్రయగునని మనము వూహింపవచ్చును.

గురుగుహగానామృత వర్షిణి :— సంగీత కేసరి, శ్రీ యమ్. వేదాంత భాగవతార్ చే వ్రాయబడిన యొక సంగీతగ్రంథము.

గురుజ్యోతి :— 61 వ మేళకర్త యగు "కాంతామణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ మ గ రి స.

గురుద్రుతము :— షోడశాంగములగు 16 టిలో 10 వ దానికి గల పేరు. దీనికి అంగములు O 8. అక్షరకాలములు 10.

గురుద్రుతవిరామము :— షోడశాంగములగు 16 టిలో 11వ దానికి గల పేరు. దీని అంగములు ◡ O 8. అక్షరకాలములు 11.

గురుప్రియ :— 64 వ మేళకర్త యగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

గురుపురందరవిఠల :— "శ్రీ పురందరదాసు" యొక్క రెండవకుమారుడు రచించిన రచనలలోని ముద్రకుగల పేరు.

గురుమధ్వపతిపురందరవిఠల :— "పురందరదాసు" యొక్క మూడవ కుమారుడు రచించిన రచనలలోని ముద్రకుగల పేరు.

గురుమూర్తి :— 18వ శతాబ్దమునకు చెందినట్టియు తెలుగు మురికినాటి బ్రాహ్మణుడైనట్టియు శ్రీ 'పైడాలగురుమూర్తిశాస్త్రి' తాను రచించిన గీత, లక్షణగీత, ప్రబంధ, కీర్తనాదుల యందు పెట్టుకొనిన ముద్ర పేరు. ఈతడు 1000 గీతములు రచించుటచే "వేయిగీత" అను బిరుదమునుకూడ పొంది యుండెనని తెలియుచున్నది.

గురుమేరువు :— తాళ ప్రస్తారములోని 14 భేదములలో 9 వది గురుమేరువు అని చెప్పబడును. ఇది సమసంఖ్యగల ఒక అంగము ఎన్ని ప్రస్తారములలో వచ్చియున్నది తెలియుటకై గురువును లెక్క చేయుటకు యేర్పడిన పేరు. ఇది పూర్వీకులయొక్క సంప్రదాయముగా తెలియుచున్నది.

గురువిరామము :— 'షోడశాంగము' లగు 16 టిలో 9 వ దానికిగల పేరు. దీనికి అంగములు ◡ 8. అక్షరకాలములు 9.

గురువు :— సంగీత కాలమును లెక్కించుట కుపయోగింపబడు అనుద్రుత, ద్రుత, లఘు, గురు, ప్లుత, కాకపాదములను తాళాంగములు 6 టిలో 4 వ దానికి గల పేరు. దీనికి అక్షరకాలములు 8. ఈ గురువును వేయునపుడు కుడిచేతితో ఒక దెబ్బ కొట్టి 3 వ్రేళ్ళనుయెంచి ఆకుడిచేతిని 4 అక్షర కాలము క్రిందికి దించవలెను.

గురువు :— సంగీతము నభ్యసించు విద్యార్థులు తమకు సంగీత విద్యను బోధించునట్టి సంగీతాధ్యాపకుని సాధారణముగా పిలుచుచుండునట్టి గౌరవనామము.

గుహదాస :— శ్రీ "రామస్వామిశివన్" అను తమిళ సంగీత పండితుడు తాను రచించిన రచనలందు పెట్టుకొనిన ముద్ర పేరు.

గుహప్రియ :— 16 వ మేళకర్త యగు "చక్రవాకము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గా మ స ప మ ధ ని స.
అవరోహణము- స ధ ని ప మ గ స రి స.
ఇది ఉభయవక్ర సంపూర్ణరాగ మగును.

———

# గె

గెత్తు :—తంత్రులమీద పుల్లలతో కొట్టుచూ వాయింపబడు ఒకరకమైన తంత్రీలయ వాద్యమునకు గలపేరు. దీనిని యిప్పుడు దక్షిణభారతదేశములో సంగీత కచ్చేరీల యందు ఒక ప్రధానమైన ప్రక్కవాద్యంగా కూడా యేర్పాటు చేయుచున్నారు.

గెస్, గ, గిస్ (Ges, G, Gis) డెస్, ద, దిస్ (Des, D, Dis) :—సంగీత శాస్త్రముమీద వ్రాయబడిన ముఖ్యసంస్కృత గ్రంథములను జర్మనీ, ఫ్రెంచి భాషలలోనికి తర్జుమా చేయబడినట్టి గ్రంథములకు గల పేరు.

# గే

గేవాన్‌ధస్ :— యూరప్ ఖండములోని "లిప్‌జిగ్" లోగల ప్రపంచప్రఖ్యాతి గాంచిన బ్రహ్మాండమైన సంగీత గృహము నకు గలపేరు. ఇది ధ్వని ప్రాశస్త్యమునకు ప్రసిద్ధి చెందినది. దీనిహాలులో 1600 సీట్లు అమర్చబడి యుండును. మరియు 80 లేక 100 మంది ప్రదర్శకులు కూర్చొని గానముచేయుటకు తగినటువంటి యెత్తైన ఒక స్థలము (ప్లాట్‌ఫారమ్) కూడ గలదు.

గేయనాటకము (Opera) :— ఉత్తమ సంగీతముతోను, ఉత్తమ కవిత్వముతోను కూడినదై నటించుటకు తగినట్లు వ్రాయబడునట్టి ఒక విధమగు రచనకుపేరు. ఇట్టి రచనకు ముఖ్య వుదాహారణము దక్షిణ దేశములో "అరుణాచల కవిరాయర్" వ్రాసిన"రామనాటకము" మొదటిరకపు తమిళ గేయనాటకమగును.

*గేయహెజ్జజ్జి :— 72 మేళకర్తలలో 13 వ మేళకర్తయగు "గాయకప్రియ"కు "వెంకటమఖి" పెట్టిన ప్రత్యేకనామము. ఇది మూడవ'అగ్ని'చక్రములోని మొదటి మేళకర్త రాగమగును.

# గై

గైతార్ (Guitar) లేక గిటార్ (Gitar) వాద్యము :— ఇది వయొలిన్ (ఫిడేలు)ను పోలిన తంత్రీ వాద్యము. దీనికి 6 తంత్రులుండును. వాటిని కుడిచేతి వ్రేళ్ళతో మీటుచూ ఎడమచేతి వ్రేళ్ళతో నొక్కుచూ వాయించుదురు. దీనికి 'గిటార్' అను పేరే సరియైనదిగా కనుపడుచున్నది.

---

# గో

గో :— వెంకటమఖి 72 మేళకర్తలకు విభజించి యేర్పరచిన 12 చక్రములలో ఒక్కొక్క, చక్రములోగల 6 మేళకర్తలకు కల్పించిన సంకేతాక్షరములలో ప్రతి 3వ మేళకర్తకు యిచ్చిన సంకేతాక్షరము. మిగత 5 ను 1 పా 2 శ్రీ 4 భూ 5 మా 6 షా అనునవి. ఇవే ప్రతి మేళచక్రములో గల 6 మేళకర్తలకు వుండును.

గోకులమూర్తి :— 62 వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గోటుమీటు :— వీణావాద్యములో నుప యోగించు వివిధ మీటులలో విడిగాపడు మీటుకు 'గోటుమీటు' అని పేరు.

గోటువాద్యము :— తంత్రులను కుడిచేతి తో మీటుచును, ఎడమ చేతితో ఒక చిన్న గుండ్రని కఱ్ఱపిడితో తంత్రుల నదిమి లాగుచును, ఆయా స్వరస్థానముల నేర్పరచు కొని వాయింపబడు తంత్రీసంబంధమైన ఒక ప్రాముఖ్యమగు సంగీత వాద్యము. ఇది వీణను బోలియుండును. కాని దీనిలో స్వరస్థానముల నిరూపించు మెట్లు మాత్ర ము వుండవు. ఈ వాద్యములో సుప్రసిద్ధ లగువారిలో శ్రీ బూదలూరు కృష్ణమూర్తి శాస్త్రి, శ్రీ గోటునారాయణఅయ్యంగార్ మొదలగువారు ముఖ్యులుగా నున్నారు.

గోత్నారి :— 43 వ మేళకర్త యగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గోత్రారి :— ఆరోహణావరోహణములు రెండును గోత్నారి రాగమువలెనుండు ఒక రాగమునకు గలపేరు. దీనినే కొందరు 'గోత్నారి' యనికూడ చెప్పుదురు. కాని ఇది 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగముగా చెప్పబడినది.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గోదారి :— 37 వ మేళకర్తయగు 'సాల గము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గోపతి :— 42 వ మేళకర్తయగు 'రఘు ప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ప మ రి గ రి స.

గోపాల :— ప్రాచీన పదకవులగు "జట ప్రోలివారు" తెలుగులో తామురచించిన పదములందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

గోపాలకృష్ణ :— "ఇనుపకొనగల వెంకట రామయ్య" అను ఒక ప్రాచీన వాగ్గేయ కారకుడు తన రచనలందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

గోపాలకృష్ణ :— ప్రసిద్ధ వాగ్గేయ కార కుడగు, ఆనతాండవపురం "గోపాలకృష్ణ భారతి" తన రచనలయందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

గోపాలదాస :— "గానచక్రవర్తి" యను బిరుదుగలిగియు, "త్యాగరాజుని" కి ప్రియ శిష్యుడైనట్టియు "వీణ కుప్పయ్యర్" తన రచనలందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

గోపికా కుసుమము :— 15 వ మేళకర్త యగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగమైన షాడవరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

గోపికా తిలకము :— 56వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగమైన షాడవరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

గోపికా భరణము :— 43వ మేళకర్తయగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

గోపికా మనోరంజని :— 67వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

గోపికా వసంతము :— 20వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ని ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

గోప్రియ :— 62వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

గోపుచ్ఛయతి :— ఒక తాళ ఆవర్తములోగల అరిగములు ఆవుతోకవలె మొదట పెరిగి రానురాను తగ్గుచూ పోవునట్టి పాటకి గలపేరు. ఉ॥ 3 8 1 0 ◡.

గోపుచ్ఛయతిపల్లవి :—హిజ్. హైనస్. తిరువాన్కూరు మహారాజగు శ్రీస్వాతితిరునాళ్ " యొక్క గౌరవార్థము ఒక సంగీతపండితునిచే రచింపబడిన కాంభోజి రాగములోని ప్రఖ్యాత పల్లవియగు 'సుగుణానిధిచంద్ర' 'కులశేఖరేంద్ర' వంటి పల్లవికి 'గోపుచ్ఛయతిపల్లవి' అనిపేరు.

గోముఖి :—15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— గ రి స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి గ స.

గోమేధికప్రియ :—20వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

గోవిందధన్యాసి :— 63వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
ఇది ఏకస్వరవర్జరాగమునకు చెందును.

గోవిందనారాయణి :— 52 మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

గోపాలి :— పర్షియా దేశమునందుగల సంగీతముతో ఉత్తర భారతదేశ సంగీతములోని పుత్రరాగ విధానమునకు పరిపోవునట్టిదానికి గలపేరు.

గౌడమల్లారు :— 29 వ మేళకర్త యగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

గౌతమి :— 1 వ మేళకర్త యగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

గౌరి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గౌరిక్రియ :— 60 వ మేళకర్త యగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

గౌరిగాంధారి :— 2 వ మేళకర్త యగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

గౌరీకాలమ్ :— వ్రేళ్ళు అనుకొనుటకు రంధ్రములు లేక ఊపిరిపోయ నవసరము లేకనే వాయింపబడు నొకవాద్యముపేరు.

గౌరీతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 114 తాళమునకు గలపేరు. దీనిఅంగములు ।।।।।.

గౌరీనిషాదము :— 71 వ మేళకర్త యగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

గౌరీపంతు :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ ధ మ గ రి స.

గౌరీబంగాళ :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ధ స రి మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని ధ ప.

*గౌరీమనోహరి :—72 వ మేళకర్తలలో 23 వ మేళకర్త రాగమునకు గలపేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది4వ'వేద'చక్రములో 5వ మేళమగును. ఇందు షడ్జ, పంచమములు గాక చ. రి— సా. గాం— శు. మ— చ. ధై— కా. నిషాద స్వరములుండును. త్యాగరాజు 'గురు లేక యెటువంటి'అను ప్రసిద్ధమైనకృతిని యీ రాగమునందే రచించెను.'వీణకుప్పయ్యర్' కూడా 'పరాకేలజేసేవు' అను ఒక చక్కని కృతిని యీ రాగమునందే రచించెను.

గౌరీమారువ :— 50 వ మేళకర్తయగు 'నామనారాయణి'యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.

గౌరీరాగప్రబంధము :— 18 వ శతాబ్దమునకు చెందిన 'రామానంద యతీంద్రులు' రచించిన యొక గ్రంథముపేరు.

గౌరీవల్లభరాజు :— 'కవికుంజరభారతి' అను ప్రముఖ సంగీత కళాకోవిదుని ఆస్థాన పండితునిగా నియమించి సత్కరించిన 'శివగంగ' రాజుకు గల పేరు.

*గౌరీవేళావళి :—72 మేళకర్తలలో 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి'కి "వెంకటమఖి" పెట్టిన మరియొక పేరు.

గౌరీసీమంతి :— 70 వ మేళకర్తయగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ స.

గౌళ :—15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి గ మ రి స.
ఆరోహణము— స రి గ మ రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ మ రి స.

గౌళచంద్రిక :— 7 వ మేళకర్తయగు 'సేనాపతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

గౌళపంచమము :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

గౌళమాళవి :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ప ని స.
అవరోహణము— స ప ధ ని ప మ గ రి స.

గౌళీపంతు :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యమైన వక్రసంపూర్ణ రాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ధ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

## ఘ

ఘటనామ :— ద్విజాతి ప్రబంధములోని 6 విధములలో 6 వ దానికి పేరు. మిగతవి 1 హయలీల, 2 గజలీల 3 ద్విపది, 4 ద్వితకము, 5 వృత్తము అనునవి. ఈ ప్రబంధములు నేటి కాలములో వాడుకయందు యేమాత్రము కనుపడుటలేదు.

ఘటము :— సంగీత కచ్చేరీలలో ప్రక్క వాద్యముగా వుపయోగింపబడు తాళ సంబంధమైన ఆధారశృతిగల ఒక రకపు కుండ వాద్యము. ఆంధ్ర తమిళ దేశములలో ఈవాద్యమునందు ప్రతిభగలవారు అనేకులు కలరు. కీ॥ శే॥ శ్రీ ఘటం సుందరయ్యర్ యీ వాద్యములో అత్యద్భుత ప్రావీణ్యము సంపాదించి కీర్తి గడించిన వారిలో ముఖ్యులని చెప్పదగును.

ఘంటా :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ నీ.
అవరోహణము— ధ ప మ గ రి స ని ధ ప ని స.

ఘంటాణము :— 57 వ మేళకర్తయగు

'సిమ్హేంద్ర మధ్యమము' యొక్క జన్యమైన ప్రతిమధ్యమ రాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

ఘంటారవము :— 2 వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- i. స రి స గ మ ప ని స.
లేక ii. స గ మ ని ధ ప స ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

ఘటిత :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

ఘన :— సంగీత వాద్య విభజనలోని 4 వ రకమునకుగల పేరు.

ఘనమ్ :— వాగ్గేయకారులై తానము పాడుటలో అతి సమర్థులై పదములు వ్రాయుటలో మిక్కిలి పేరొందిన "ఘనమ్ కృష్ణయ్యర్" ఘనమ్ సీనయ్యలకు గలబిరుదు. ఈబిరుదుతోనే వారు పిలువబడు చుండిరి.

ఘనము :— ద్రుతకాలములో తానము పాడుటను 'ఘనము' అని చెప్పుదురు. దీనిలో సంగీతము త్వరితగతిని వుండును. ఇందు న్యాసము పాడునపుడు మధ్యమకాల, విళంబకాల సంచారములను కూడ వుపయోగింప వచ్చును.

ఘనము :— ఏగానము దూరమునుండి విన్నను శ్రావ్యమై అంతస్స్వరముగలిగి యొప్పారునో అట్టిదానిని 'ఘనము' ని చెప్పబడును.

ఘనజఘన :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ప ని స.
అవరోహణము- స ని ప ధ ని ప మ గ రి స.

ఘననాయకి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ని ధ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

ఘనమత్యము :— "రాగతాళ చింతామణి" అను గ్రంథములోగల 124 తాళములలో ఇతరులచే చెప్పబడని తాళములలో 7 వ దానికి గల పేరు.

ఘనరాగగీతములు :— ఘనరాగములగు నాట, గౌళ, ఆరభి, వరాళి, శ్రీరాగము అందలి గీతములకు గలపేరు. ఉ॥ రేరే శ్రీరామచంద్ర. ఆరభిరాగము. త్రిపుట.

ఘనరాగపంచకము :— నాట, గౌళ, ఆరభి, వరాళి, శ్రీరాగములను కలిపి చెప్పునట్టి పేరు. వీటిలో ముఖ్యారిగా తానములను పాడుటయు వాయించుటయు సంప్రదాయముగా నున్నది.

ఘనరాగపంచరత్నకీర్తనలు :— 'త్యాగరాజు' నిచే రచింపబడిన సాహిత్యప్రధానమైన 5 ఘనరాగములందలి కీర్తనలకు గల పేరు. వాటి రాగతాళము లేవనగా

i. జగదానంద - నాటరాగము - ఆది.
ii. దుడుకుగల - గౌళరాగము - ఆది.
iii. సాధించెనే - ఆరభిరాగము - ఆది.
iv. ఎందరోమహాను- శ్రీరాగము - ఆది.
v. కనకనరుచిరా- వరాళిరాగము- ఆది.

ముఖ్యముగా యీ ఘనరాగపంచరత్నకీర్తనలను దక్షిణదేశమున "తిరువయ్యారు" తదితర ముఖ్యపట్టణములందును ప్రతిసంవత్సరము పుష్యబహుళములు జరుగు త్యాగరాజ వర్ధంతిలో ఆరాధనజరిగిన వెంటనే గాయకులందరు బృందగానముగా పాడుదురు.

ఘనరాగములు :— ఘనమైన నాభిస్థానముచే గానక్రియలను చేయదగినదియును, యుద్ధరంగములో శౌర్య, వీరోత్సాహములుగల మహాయోధునిబోలి గాంభీర్యము జెందినదియునైన రాగమును ఘనరాగమనబడును. సాధారణముగా ఈఘనరాగములు 5 గనే వాడుకలోనున్నను, పూర్వాచార్యులు ఇట్టివి 10 రాగములుగా చెప్పియున్నారు. (1) నాట, (2) గౌళ, (3) వరాళి, (4) ఆరభి, (5) శ్రీ, (6) కేదార, (7) నారాయణగౌళ, (8) రీతిగౌళ, (9) సారంగనాట, (10) బౌళి యనునవి ఘనరాగదశక మనబడును.

ఘనశ్యామల :— 5వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

ఘనసింధు :— 15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యమైన శుద్ధమధ్యమరాగము.
ఆరోహణము– స మ గ మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

ఘనవతి :— 33వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' యొక్క జన్యమైన శుద్ధమధ్యమరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.
ఇది షాడవ – షాడవ రాగమునకు చెందినదిగా నుండును.

---

## ఘా

ఘాత :— అనగా దెబ్బయని అర్థము. తాళమువేయునపుడు మొదట కుడిచేతితో దెబ్బనువేసి తదుపరి వ్రేళ్లు లెక్కించుట గాని ఊపివేయుటగాని చేయుదురు. గనుక సంగీత కాలమానమును లెక్కించుటకు ప్రధానమైన యీదెబ్బనే 'ఘాత' యని చెప్పుదురు. ఉ॥ ధ్రువతాళము. దీనికిగల నాలుగు అంగములగు | 0 | | లను వేయుటకు ముందు ప్రతి అంగమును ఘాతతోనే ప్రారంభింపవలసియుండును. గనుక ధ్రువతాళమునకు గల 4 అంగములలో 4 ఘాతలు వుండునని గ్రహింపదగును.

## ఘృ

ఘృతాచి :— 16వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ రి స.

ఘోషణి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

ఘోషమంజరి :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ని స.
అవరోహణము— సనిపధని ప మ రి గ రి స.

ఘోషాకరి :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

ఘోషావినోదిని :— 34 వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జ్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

ఘోష్వాణి :— 57 వ మేళకర్తయగు 'సిమ్హేంద్రమధ్యమము' యొక్క జన్యమైన ప్రతిమధ్యమ రాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

ఘోరదర్శిని :— 36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
ఇది నిషాదవర్జమైన షాడవరాగమునకు చెందినదిగా నుండును.

---

## జ్ఞా

జ్ఞాతయౌవన :— నాయికలు 3 విధము లలో మొదటిదగు స్వీయ నాయికలోని ముఖ్యభేదములు 5టిలో మొదటి దానిని 'జ్ఞాతయౌవన' అని చెప్పుదురు. మిగతవి అజ్ఞాతయౌవన, నవోఢ, విస్రబ్ధనవోఢ, అతి విస్రబ్ధనవోఢ యనునవి.

జ్ఞానకుమ్మి :— 19 వ శతాబ్దమువాడైన 'గోపాలకృష్ణభారతి' వ్రాసిన సంగీత నాటకములలో నొకగానికిగల పేరు.

జ్ఞానచిందు :— 1811- 1881 ప్రాంతమువాడైన 'గోపాలకృష్ణభారతి' వ్రాసిన సంగీత నాటకములలో నొకదానికిపేరు.

జ్ఞానదాయికి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

జ్ఞానబోధిని :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

జ్ఞానస్వరూపిణి :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప గ రి స.

---

చక్ర :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.

[స్వ. ప్ర. సా.]

ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

చక్ర :— 35 తాళములలో "త్రిశ్రజాతి రూపక తాళము" నకుగల ప్రత్యేక నామము. దీనికి అంగములు 0 I. అక్షరకాలములు 5.

చక్రతానము:—తానమునందుగల 6 భేదములలో మొదటిదాని పేరు. మిగత 5 తానములు 1 వక్రతానము, 2 మిశ్రతానము, 3 మాలికాతానము, 4 గంభీరతానము, 5 విద్యుత్తానము అనునవి. ఇవి ముఖ్యముగా రాగాలాపన భాగమునకు సంబంధించినవిగా నుండును.

చక్రతుల్యము :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

చక్రధారి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

చక్రప్రదీప్తా :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

చక్రబంధమ్ :— వీణా వాద్యములో ఆయా స్వరస్థానములకు తగినట్లు ఎడమ చేతి వేళ్ళను నాలుగు తంత్రులమీదను ఒకేసారి వుంచి కుడిచేతివ్రేళ్లతో వాటిని మీటుచూ ఒకవిచిత్రమైనపద్ధతిలోవాద్యమొనర్చుట. ఇట్లు విజయనగర వాస్తవ్యులగు కీ॥ శే॥ శ్రీ 'వీణ వెంకటరమణదాసు' వీణలో వాయించెడివారని ప్రతీతిగలదు.

చక్రమంజరి :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి స.

*చక్రవాకము :— 72 మేళకర్తలలో 16 వ మేళకర్తకుగల పేరు. ఇది 3 వ "అగ్ని" చక్రములోని 4 వ మేళకర్తయగుసు. సర్వస్వర గమకవరిక రక్తిరాగము. రిషభ, నిషాదస్వరములు జీవస్వరములు రిషభ, పంచములు న్యాసస్వరములు. గ మ రి స, మరియు ప మ ధా, విశేష సంచారములు. స, గ, ప అను స్వరములు ఈ రాగాలాపనలోని ప్రారంభ స్వరములగును. అన్ని సమయములందు పాడదగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి— అం. గాం — శు. మ — చ. ధై — కై. నిషాద స్వరములుండును.

చక్రవాకి :—'బృహద్ధర్మ' పురాణములో చెప్పబడిన ప్రాథమిక రాగమగు 'మల్లార' యొక్క 'దాసి' రాగము.

చక్రసంజ్ఞలు :— 72 మేళకర్తలను సమముగా విభజించి 'వెంకటమఖి' యేర్పరచిన 12 చక్రములగు ఇందు, నేత్ర,

అగ్ని, వేద, బాణ, ఋతు, ఋషి, వసు, బ్రహ్మ, దిశ, రుద్ర, ఆదిత్య అను చక్రములకుగల పేరు.

చచ్చుత్పుటము :— మార్గితాళములు 5 టిలో నొకటిగను,108 తాళములలో మొదటిదిగా నుండు తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 8 I 3. మాత్రలు 8. అక్షరకాలములు 32.

చచ్చరి :— 'సంగీతసుధ'లోను మరికొన్ని యితర గ్రంథములలోను చెప్పబడినట్టి ఒక జాతికిచెందిన ప్రబంధ రచనకు గల పేరు.

చంచుకాంభోజి :— 'చెంచుకాంభోజి' వలెనుండు రాగమునకు గల పేరు.

చట :— 'సంగీతరత్నాకరము' లో చెప్పబడిన ఒకరకమైన చర్మవాద్యము.

చండతాళము :—'సంగీతరత్నాకరము' లో చెప్పబడిన 120 తాళములలో 104వ తాళము. అంగములు 0 0 0 I I.

చండిక :— 20 వ మేళకర్తయగు "నఠభైరవి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

చణ :— 35 తాళముల పట్టికలో 'ఖండజాతి ఝంపెతాళము'నకు యిచ్చిన ప్రత్యేకనామము. దీనికిఅంగములు I ◡ 0. అక్షరకాలములు 8.

చతురకల్లినాథ :— "సంగీతరత్నాకరము" మీద వ్రాయబడిన "కలానిధి" యొక్క వ్యాఖ్యానకర్తకు పేరు. ఇతనికి 'కల్లినాథ' అను పేరుకూడ కలదు.

చతురంగ :— హిందూస్థానీ సంగీతములోని ఒకరకపు సంగీత రచనకుగల పేరు. ఇది 4 అంగములను కలిగియుండును. అవి (1) ఖ్యాల్ (2) తరాన, (3) సర్ గమ్, (4) త్రివత అనునవి.

చతురంగప్రస్తారము :— 4 అంగములతో కూడిన ఒక తాళప్రస్తారము. దీనిలో లఘువు, గురువు, ప్లుతము, కాకపాదములుండును. సంజ్ఞలు I 8 3 +.

చతురంగిణి :—i. 66 వ మేళకర్తయగు "చిత్రాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప ని స.
అవరోహణము–స ని ధ ని ప గ మ గ రి స.
ii. అసంపూర్ణ మేళపద్ధతిలో 66 వ మేళకర్తగాకూడ ఈ పేరు గలదు.

చతురపండిత :— శ్రీ"వి. యన్. భాత్ ఖండే" తాను రచించిన సంగీత రచనలయందు తన పేరుకు బదులుగా పెట్టుకొనిన సంకేతనామము.

చతురంభా :—29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము"యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి గ స.
[సంగీతకౌముది.]

చతురముద్ర ప్రబంధము :— సాహిత్యములో యేర్పరచు ద్వాదశ (12) ముద్ర

లలో యే నాలుగు ముద్రలైనను కలిగి యుండునట్టి సంగీత రచనకుగల పేరు.

చతురశ్ర అట :— 35 తాళముల పట్టికలోని 13 వ తాళమగు "లేఖ"కు గల పేరు. దీనికి అంగములు ।। 0 0. అక్షరకాలములు 10.

చతురశ్ర ఏక :— 35 తాళముల పట్టిక లోని 14 వ తాళమైన "మాన"కు పేరు. దీనికి అంగములు ।. అక్షరకాలములు 4.

చతురశ్రగతి :— తాళము వేయుటలో ప్రతి తాళాక్షరమునకు నాలుగు కళలచొప్పున నడచునది 'చతురశ్రగతి' అని చెప్పబడును.

చతురశ్రజాతి :— ఒక లఘువునకు 4 అక్షరకాలములు చొప్పున వేయుటకు గల పేరు. అనగా 1 దెబ్బకొట్టి 3 వ్రేళ్ళను లెక్కపెట్టుట యగును.

చతురశ్రఝంప :— 35 తాళముల పట్టికలోని 11 వ తాళమగు "మధుర"కు గల పేరు. దీనికి అంగములు । ◡ 0. అక్షర కాలములు 7.

చతురశ్రత్రిపుట :— 35 తాళముల పట్టికలోని 12 వ తాళమగు "ఆది"కి పేరు. దీనికి అంగములు । 0 0. అక్షరకాలములు8.

చతురశ్రధ్రువ :— 35 తాళముల పట్టిక లోని 8 వ తాళమగు "శ్రీకర"కుగల పేరు. దీనికి అంగములు । 0 । ।. అక్షర కాలములు 14.

చతురశ్రమఠ్య :— 35 తాళము పట్టిక లోని 9 వ తాళమగు "సమ"కుగల పేరు. దీనికిఅంగములు। 0 ।. అక్షరకాలములు 10.

చతురశ్రరూపక :— 35 తాళముల పట్టికలోని 10 వ తాళమగు "పత్రి"కిగల పేరు. దీనికి అంగములు 0 ।. అక్షర కాలములు 6.

చతురశ్రలఘువు :— లఘువును వేయునపుడు 4 అక్షరకాలములు యుండునట్లు 1 దెబ్బ (ఘాత) వేసి 3 వ్రేళ్ళను యెంచుట.

చతురశ్రలఘు ప్రస్తారము :— చతురశ్ర లఘువును ప్రస్తరించినచో యీ దిగువ అంగములతో 8 ప్రస్తారములు వచ్చును. (1) । (2) ◡̥ ◡ (3) 0 0 (4) 0 ◡ ◡ (5) ◡ ◡̥ (6) ◡ 0 ◡ (7) ◡ ◡ 0 (8) ◡ ◡ ◡ ◡. [◡̥ = ద్రుతశేఖరము].

చతురశ్ర వర్ణతాళము :— శాస్త్రీయమైన 'అష్టోత్తరశతమను108 తాళములలో 22 వ తాళము నకు పేరు. దీనికి అంగములు 8 8 । 0 0 8. అక్షరకాలములు 32.

చతురశ్ర వర్ణరాజతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమగు 120 తాళములలో 26వ తాళము. దీనికి అంగములు 8 । 0 0 8.

చతుర్దండి ప్రకాశిక :— తంజావూరు 'విజయరాఘవ నాయిక్'రాజు యొక్క ప్రార్థనపై "వెంకటమఖి" క్రీ. శ. 1635 లో వ్రాసినఒక గ్రంథముపేరు. దీనిలోవీణ, శ్రుతి, స్వర, మేళ, రాగ, ఆలాప, ఠాయ,

గీత, ప్రబంధ, తాళములను చర్చించెను. మరియు రాగాంగ, ఉపాంగ, భాషాంగ రాగముల లక్షణములనుబట్టి శ్లోకములను వ్రాయుచూ వాటికి వుదాహరణలుగా అనేక గీతములను రచించెను.

చతుర్దండిప్రకాశిక :— 'మద్రాసు మ్యూజిక్ ఎకడమీ' వారు యిటీవల ప్రచురించిన ఒకగ్రంథమునకు గలపేరు.

చతుర్దశమూర్ఛనలు :— షడ్జ గ్రామ మధ్యమ గ్రామములు రెంటియందుగల 7+7=14 మూర్ఛనలకుగలపేరు. వాటిలో సా గ్రామములోని 7 మూర్ఛనల పేర్లు.

| | |
|---|---|
| 1 ఉత్తరమంద్రము— | (స-ప్రారంభ స్వరము.) |
| 2 రజని— | (ని ,, ) |
| 3 ఉత్తరాయతము— | (ధ ,, ) |
| 4 శుద్ధషడ్జము— | (ప ,, ) |
| 5 మత్సరికృతము— | (మ ,, ) |
| 6 అశ్వక్రాంతము— | (గ ,, ) |
| 7 అభిరుద్గతము— | (రి ,, ) |

మా గ్రామములోని 7 మూర్ఛనల పేర్లు.

| | |
|---|---|
| 1 సౌవీర— | (మ ,, ) |
| 2 హరిణాశ్వము— | (గ ,, ) |
| 3 కలోపనతము— | (రి ,, ) |
| 4 శుద్ధమధ్యము— | (స ,, ) |
| 5 మార్గి— | (ని ,, ) |
| 6 పౌరవి— | (ధ ,, ) |
| 7 హృష్యకము— | (ప ,, ) |

చతుర్థ :— సామగాన కొలతలోని 6 స్వరములగు గా రి సా నీ ధా పా అను స్వరములలో 4 వ స్వరము పేరు. ఇది నిషాదస్వరమునకు సరిపోవును.

చతుర్థకాలము :— సంగీతకాల ప్రమాణములోని 4 వ వేగము. ఇవి 4 ఒకదానికొకటి రెట్టింపు వేగముగానుండును. అనగా ప్రథమ కాలములో వ్రేలికి ఒక అక్షరము వంతున నడచినపుడు పట్టుకాలములోనే ద్వితీయ కాలములో వ్రేలికి రెండు అక్షరములను, తృతీయ కాలములో నాలుగుఅక్షరములను, చతుర్థ కాలములో 8 అక్షరములవంతున నడుపవలెను.

చతుర్థతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 4 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు ।।0.

చతుర్థరాగవర్ధని :— రాగాలాపనయొక్క ముఖ్యభాగములలోని 4 వది. ఈ రాగవర్ధనిచేయు కాలము స్వల్పముగానుండును. ఇది విశేష మూర్ఛనా ప్రస్తారములు లేక సంచారములతో ఆలాపించి 4 వ విదారిచే ముగించి మధ్య షడ్జమునకు వచ్చి నిలుపునట్టి రాగాలాపనకు గలపేరు.

చతుర్థవిదారి :— నాల్గవ రాగవర్ధనిని ముగించు క్రియకు పేరు. దీనినే ముక్తాయి అందురు. [ముక్తాయి = ముగించుట.] [విదారి = చీల్చుగలది.]

చతుర్థసైంధవి :— 'సంగీత రత్నాకరము'లో చెప్పబడిన 'సైంధవి' రాగములోని యొక రకము.

చతుర్లఘువు :— తాళదశాంగములలో 6 వదైన కాకపాదమునకుగల విశేష నామములలో 4 వది. దీనికి గుర్తు +.

చతురాననప్రియ :— 11 వ మేళకర్త యగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

చతుర్ధాతు ప్రబంధము :— ఉద్గ్రాహము, మేళాపకము, ధ్రువము, ఆభోగములుగల ఒకరకమైన ప్రబంధమునకుగల పేరు. ఉ॥ 'అంబరీస్మరణము' అను "ఆనందభైరవి" రాగములోని రచన యిందు కొక ముఖ్యవుదాహరణ యగును.

చతుర్భాగము :— షడంగములగు 6 టిలో మొదటిదైన అనుద్రుతములో సగము కాలమునకు పేరు. ఇది 1/8 వంతు మాత్ర లేక 1/2 అక్షరకాలము కలిగియుండును.

చతుర్వింశతి శ్రుతులు :— 'మేళాధికార లక్షణమ్' అను గ్రంథములో చెప్పబడిన 24 శ్రుతులకు గలపేరు. ఇందు ద్వావింశతి శ్రుతులగు 22 కంటె రెండు శ్రుతులు ఎక్కువగా చేర్చబడినవి. అవి (1) ప్రతి అంతరగాంధారము, (2) ప్రతి కాకలినిషాదము అనునవి. ఈ 2 శ్రుతులు. ఉ॥ స రి గ రి స – ప ధ ని ధ ప మ గ రి స. అను సావేరి రాగమునందుగల సంచారములందు వచ్చును.

చతుర్ముఖ :— శాస్త్రీయమైన "అష్టోత్తరశత" మను 108 తాళములలో 84 వ తాళము పేరు. దీనికిఅంగములు | 8 | 3. మాత్రలు. 7. అక్షరకాలములు 28.

చతుర్ముఖవాద్యము :— 4 తలలు లేక 4 ముఖములతో కూడిన ఒక రకపు చర్మవాద్యమునకు గలపేరు.

చతుచ్ఛిద్రి :— వేణువులోగల ఒక రకమునకు పేరు. దీనిలో ఊదు రంధ్రమునకును మొదటి వ్రేలి రంధ్రమునకును మధ్య 4 అంగుళముల దూరము వుండును. 1 – 7 వ్రేలి రంధ్రములను మూసి ఊదినచో మధ్యస్థాయి పంచమస్వరము పలుకును.

చతుశ్రగతి :— చతురశ్ర గతిని మరి యొకపేరుతో చెప్పబడునది.

చతుశ్రజాతి :— చతురశ్ర జాతిని మరియొక పేరుతో చెప్పబడునది.

చతుశ్శ్రుతిధైవతము :— ధైవత స్వరములోని తీవ్ర లేక హెచ్చు స్వరము. దీని వేపనములసంఖ్య ఒకసెకండుకు 27/16.

చతుశ్శ్రుతిరిషభము :— రిషభ స్వరములోని తీవ్ర లేక హెచ్చుస్వరము. దీని వేపనములసంఖ్య ఒక సెకండుకు 9/8.

చతుశ్శ్రుతివ్యవధి :— దీనియొక్క అంతరము 9/8 వుండును. అనగా శుద్ధమధ్యమము 4/3 కును పంచమము 3/2 కును మధ్యగల చతుశ్శ్రుతి అంతరము 9/8 వుండును.

చతుష్షష్టికళలు :— ప్రాముఖ్యమైన 64 కళలు లేక శాస్త్రములకుగల పేరు. ఇవిగాక 400 ఉపకళలు గూడ కలవు. వీటిలో సంగీతము, నృత్యము మొదలగు కళలుగూడ చేరియున్నవి.

చతుష్కళ :— ప్రతిక్రియకు 4 కళలు వుండునది 'చతుష్కళ' యనబడును. ఈ కళలు చతురశ్రలఘువుకు 16 గను, త్రిశ్రలఘువుకు 12 గను యీవిధముగానుండును.

చతుష్పాది :— నాలుగు పాదములతో కూడిన ఒక పవిత్ర సంగీతరచనాభాగము.

చతుస్స్వరప్రస్తారము :— 'అసంపూర్ణ తానము'లో 'సరిగమ' అనునాలుగు స్వరములతో వచ్చు ప్రస్తారములకు గలపేరు.

చతుస్స్వరవక్రరాగము :— ఆరోహణ అవరోహణములలో 4 వక్ర స్వరములు గలిగియుండునట్టి రాగము.

చతుస్స్వరశృతివాద్యము :— 4 శృతులు లేక 4 స్వరములు పలుకు శృతివాద్యము నకుగలపేరు. ఉ॥ (1) "తంబుర" ఇందుగల 4 తంత్రులు ప్పా, సా, సా, స్పా. అను విధము గా పలుకును. అనగా ఇవి మంద్రపంచమ, మధ్యషడ్జ, మధ్యషడ్జ, మంద్రషడ్జము స్వరములగును. (2) "శృతిహార్మోనియము" ఇందుగల 4 శృతులు స్రా సా పా సా అను విధముగా నుండును. అనగా ఇవి మంద్ర స్థాయి షడ్జము, మధ్యస్థాయి షడ్జము, మధ్యస్థాయి పంచమము, తారస్థాయి షడ్జము అనునట్టిస్వరములగును. పైరెండును చతుస్స్వరశృతి వాద్యములకు మంచి వుదాహరణము లగును.

చతుస్తాళము :— శాస్త్రీయమైన 108 తాళములలో 79 వ తాళము పేరు. దీనికి అంగములు 80 0 0. మాత్రలు 3½. అక్షర కాలములు ఆవర్తమునకు 14.

చంధనగంధి :— 3 వ మేళకర్త యగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

చందనగంధి :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

చంద్రకలా :— హుడుక్క (చర్మ) వాద్యములలోని 13 విధములలో నొకదాని పేరు. ఇది శ్రీసి. ఆర్. శ్రీనివాసయ్యంగారి 'రామాయణనోట్సు'లోపేర్కొనబడినది.

చంద్రకలాతాళము :— 'రత్నాకరము' లోని 120 తాళములలో 105 వ తాళము నకుపేరు. దీనికి అంగములు 8 8 8 3 3 3.

చంద్రకళ :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ మ స.

చంద్రకాంతము :— 65 వ మేళకర్త యగు 'మేచకల్యాణి' యొక్క జన్య రాగము. [గానవిద్యాప్రకాశిని.]
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

చంద్రకాంతి :— 'చంద్రకాంతము' రాగమువలెనుండు రాగమునకు గలపేరు.

చంద్రకిరణి :— 16 వ మేళకర్తయగ 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని స
అవరోహణము— స ని ధ ని ప మ గమరిస

చంద్రకౌశిక :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగమైన వక్రసంపూర్ణ ఔడవరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ స.

చంద్రగాంధారము :—8 వ మేళకర్తయగు 'హనుమత్తోడి' యొక్కజన్యరాగము.
ఆరోహణము— స రి గ మ స.
అవరోహణము— స ని మ గ రి స.
ఇది స్వరాంతర - ఔడవ రాగమునకు చెందిన ఒక ముఖ్య వుదాహరణ మగును.

చంద్రగాంధారి :— 'అరుబత్తునావలన్' యొక్క 'బరతశాస్త్తిరమ్' అను తమిళ గ్రంథములో చెప్పబడిన యొక రాగము.

చంద్రచూడ :—29 వ మేళకర్తయగు'ధీరశంకరాభరణము' యొక్కజన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

చంద్రచూడ ప్రియ :— 18 వ మేళకర్తయగు 'హాటకాంబరి'కి జనించిన జన్యమైన వక్ర షాడవ - ఔడవ రాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ప మ రి స.

చంద్రజ్యోతి :— 41 వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
'త్యాగరాజు'ని 'శశివదన' అను ప్రసిద్ధమైనకృతి యీ రాగములోనిదైయున్నది.

చంద్రధారి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ రి ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది ఛత్రధారి రాగమువలె నుండును.

చంద్రదేశిక :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

చంద్రప్రభా :— 42 వ మేళకర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

చంద్రమండనా :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గ మ రి స.

చంద్రమండలము :— నాగస్వర వాద్య సమ్మేళనములో వుపయోగించు నొక చర్మ వాద్యము. తెలుగులో దీనిని 'చంద్రపిరై' అను వాద్యముగా చెప్పుదురు. 'కాళహస్త్రి' (ద.ఇం.) మొదలగు సుప్రసిద్ధ దేవాలయములందు యీ వాద్యమును వాయించుటయందు ప్రవీణులు గలరు.

చంద్రముఖి :— 'బృహద్ధర్మపురాణము'లో చెప్పబడిన ప్రాథమిక రాగమైన 'మల్లార' యొక్క 'దాసి' రాగములలో నొకదానికి గలపేరు.

చంద్రరేఖ :— 58 మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

చంద్రరేఖ :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి గ ప ని ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

చంద్రరేఖి :— 'చంద్రరేఖ' రాగమును బోలినట్టిదేయగు రాగము.

చంద్రవదన :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణరాగము' యొక్క జన్యమైన ఒక రాగము.
ఆరోహణము— స ని స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

చంద్రశేఖరప్రియ :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

చంద్రశ్రీ :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గా రి స.

చంద్రహసితము :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

చంద్రాంశరాగము :— 'నారదముని' చే 'సంగీత మకరందము'లో చేర్కొనబడిన ఒకతరగతికి చెందిన రాగము. ఆ గ్రంథములో రాగములను సూర్యాంశ రాగము లనియు, చంద్రాంశ రాగములనియు రెండు విధములుగా విభజింపబడెను.

చంద్రాంశరాగము :— ప్రాచీన తమిళ సంగీతముయొక్క 'ఇరివుప్పణ్'కు సరి పోవు రాత్రిపూట పాడదగిన రాగము.

చంద్రిక :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

చంద్రిక :— 18 వ మేళకర్తయగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

చంద్రికం :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

చంద్రికాగౌళ :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

చంద్రికాగౌళ :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య

రాగము. ఇది “చంద్రికాధవళి”వలెనుండు టచే శాస్త్రసమ్మతముగాకయున్నది.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

చంద్రికాధవళి :— 15 వ మేళకర్తయగు ‘మాయామాళవగౌళ’ యొక్క జన్యరాగము. [సంగీతకాముది.]
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

చంద్రికాభైరవి :— 18 వ శతాబ్దమునకు చెందిన ‘నట్టియశాస్త్రిరమ్’ అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన ఒకరాగము. ఈ రాగమునకు ఆరోహణ-అవరోహణ ములుగాని ఇది యే మేళకర్తనుండి జన్యమైనదిగాని యితేవల గ్రంథములందు యెచ్చటను కనుపడుటలేదు.

చంపకమాల :— 17 వ మేళకర్త యగు ‘సూర్యకాంతము’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

చంపకలతా :— 19 వ మేళకర్త యగు ‘ఝంకారధ్వని’యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గ మ రి స.

చంపకవిదారి :— 28 వ మేళకర్తయగు ‘హరికాంభోజి’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— సమగమపనిధమపధనిధస.
అవరోహణము— సనిధనిమధమగరిగస.

చపలత :— వ్యభిచారీభావములోని 33 విధములలో 14 వ దానికిగల పేరు.

చపలా :— ‘నారదుని’ ‘సంగీత మకరంద’ములో చెప్పబడిన 22 శ్రుతుల విధానములో పంచమమునకుగల 4 శ్రుతులలో 2 వది.

చంబౌలని :— 61 వ మేళకర్తయగు ‘కాంతామణి’ యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి మ గ మ ధ ని ప స.
అవరోహణము— స ని ధ గ రి స.

చమ్మరక్రియ :— 15 వ మేళకర్తయగు ‘మాయామాళవగౌళ’యొక్క జన్యమైన ఔడవరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

చరచండిని :— 51 వ మేళకర్తయగు ‘కామవర్ధని’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ప ధ స.
అవరోహణము— స ధ ప గ మ రి స.

చరణము :— కర్నాటక సంగీత రచనలలోని ముఖ్యాంగములగు పల్లవి, అనుపల్లవి, చరణములను వాటిలో మూడవది.

చరణమున మధ్యమకాల సాహిత్యములు గల కృతులు :— సావేరిరాగమునందు గల “శ్రీరాజగోపాల” అనునట్టియు కాంభోజి రాగములోని “కొనియాడిన” అనునటువంటియు కృతులకుగల పేరు.

చరవిభాసితము :— 65 వ మేళకర్తయగు ‘మేచకల్యాణి’ యొక్క జన్యరాగము. (పల్లవి శేషయ్యర్ ప్రాతప్రతి.)
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

చరవిభాసిని :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము. [సంగీతకౌముది.]
ఆరోహణము— స రి మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

చర్చరితాళము :— శాస్త్రీయమైన "అష్టోత్తరశత" మగు 108 తాళములలో 8 వ తాళము. దీనికి అంగములు 0 0 ◡ । 0 0 ◡ । 0 0 ◡ । 0 0 ◡ । 0 0 ◡ । 0 0 ◡ । 0 0 ◡ । 0 0 ◡ ।. మాత్రలు 18. అక్షరకాలము 72.

చర్చరితాళము :— "రత్నాకర" గ్రంధస్థ మగు 120 తాళములలో 15 వ తాళము. దీనికి అంగములు 0 0 ◡ 0 0 ◡ 0 0 ◡ 0 0 ◡ 0 0 ◡ 0 0 ◡ 0 0 ◡ 0 0 ◡.

చర్మజ :— 'నారదుని' 'సంగీత మకరందము'లో పేర్కొనబడిన శారీరజ, నఖజ, వాయుజ, చర్మజ, లోహజ అను అయిదు విధములలో 4 వది. ఇది మృదంగము వంటి చర్మవాద్యములయందు పలుకు ధ్వనులకు గలపేరు.

చర్మవాద్యము :— చర్మసంబంధమైన వాద్యమునకు గలపేరు. ఉ॥ మృదంగము, డోలు, డోలక్, తబలా, కంజిరవంటి వాద్యములు యీరకములో చేరినవగును.

చర్మవాద్యకుడు :— మృదంగమువంటి చర్మసంబంధమైన వాద్యములను వాయించువానికి గలపేరు.

చర్మసాధని :— తాళసంబంధమైన చర్మవాద్యములకు గలపేరు. వీటిలో చాలవరకు కాలమును సూచించుటకు యేర్పడిన వాద్యములుగానేయున్నవి.

చరావళి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

చరిత్రాత్మకపాటలు :— అధిక ప్రాముఖ్యముగల చరిత్రలను కథావస్తువుగాగొని యిద్దరు, లేక ముగ్గురు కలిసి పాడుకొనుటకు తగినట్లు రచింపబడినపాటలు. ఉ॥ బొబ్బిలిపాటలు, రాజాదేవసింగుపాటలు, బ్రిటీషువారు ఇండియాను జయించుటను గూర్చిన పాటలు, పల్నాటిచరిత్రపాటలు, రుద్రమదేవి చరిత్రపాటలు మొదలగునవి.

చలతాళము :— "సారంగధర చరిత్ర" మను కన్నడ యక్షగానములో చెప్పబడిన ఒక అరుదైన తాళము.

చలనవరాళి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

చలనస్వరములు :— స్వరములలో వాటికిగల సహజమైనటువంటి ధ్వనులయందే కంపితమును గలిగియున్న శుద్ధరిషభము, సాధారణ గాంధారము వంటి స్వరములకు 'చలనస్వరము'లని పేరు. వీటికి వ్యతిరేకమైనవి నిశ్చలన స్వరములు.

*చలనాట :—72 మేళకర్తలలో 36 వ మేళకర్తకు గలపేరు. దీనిలో షడ్జ, పంచమములుగాక షట్శ్రుతిరిషభ, అంతర గాంధార, శుద్ధమధ్యమ, షట్శ్రుతిధైవత, కాకలీనిషాద స్వరములుండును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

చలని :— 35 వ మేళకర్తయగు 'శూలిని' యొక్క జన్యరాగము. [సం. కౌ.]
ఆరోహణము- స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

చలవీణ :— స్వరవీణకు వ్యతిరేకమైన 7 తంత్రులుగల వాద్యమునకు గలపేరు.

చల్లగాలి :—19 శ॥మునకు చెందిన తంజావూరు ఆస్థాన విద్వాంసులగు శ్రీ 'చల్లగాలి కృష్ణయ్యర్, చల్లగాలి వీరరాఘవయ్యర్ గార్లకుగల ఒక ప్రత్యేక బిరుదు.

---

# చా

చాకారి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

చాచపుటము :— శాస్త్రీయమైన 108 తాళములలోని మార్గతాళములు 5 టిలో 2 వది. దీనికి అంగములు ऽ।।ऽ. ఆవర్తమునకు మాత్రలు 6. అక్షరకాలములు 24.

చాత్రము :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.

చాంద్రిక్య :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ రి గ రి స.

చాపఘంటారవము :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని.
అవరోహణము- ధ మ గ రి స ని.

చాపరా :— 'భావభట్టుని' 'అనూప సంగీతవిలాసము'లో చెప్పబడిన 22 శ్రుతుల విధానములో 'మధ్యమము' యొక్క రెండవశ్రుతికి గల పేరు.

చాపుతాళము :— శాస్త్రీయమైన 35 తాళములుగాక నేడు వాడుకయందున్న ప్రాచీన సంప్రదాయమైన తాళము పేరు. ఇది ముఖ్యముగా 3 విధములుగానుండును. 1. మిశ్రచాపు. దీనికి 2 ఘాత(దెబ్బ)లుండి 3+4=7 అక్షరకాలములు కలిగి యుండును. 2. ఖండచాపు. దీనికి 2 ఘాతలుండి 2+3=5 అక్షరకాలములు కలిగియుండును. 3. త్రిశ్రచాపు. దీనికి 2ఘాతలుండి1+2=3 అక్షరకాలములు కలిగియుండును. ఇవిగాక 'సంకీర్ణచాపు' అని 2 ఘాతలు కలిగి 4+5=9 అక్షరకాలములు కలిగియుండునట్టి మరియొక తాళముకూడకలదు.

కేనిని పల్లవులందు మాత్రమే అరుదుగా వాడుదురు. శ్రీత్యాగరాజ 'దీక్షిత' శ్యామశాస్త్రులు యీచాపుతాళములో ప్రసిద్ధమైన అనేకకృతులను రచించియుండిరి. సాధారణముగా చాపుతాళమనినచో మిశ్రచాపు తాళముగనే యెంచవలెను.

చామరము :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఈ రాగములో ప ధ ని స, అనునట్టి ఒక విశేషసంచారముకూడా కలదు.

చామరము :— అసంపూర్ణమేళ పద్ధతిలోని 56 వ మేళముగా చెప్పబడినట్టిపేరు.

చాముండి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము. [గా.లో.]
ఆరోహణము— స గ రి మ ప ని ధ స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

చాముండేశ్వరీ శతకీర్తనావళి :— "గాయక శిఖామణి" శ్రీ యల్. ముత్తయ్యభాగవతార్' మైసూరు "చాముండేశ్వరీదేవి"పై రచించిన నూరుకీర్తనలుగల ఒక సంగీతగ్రంథము పేరు.

చార్తాళము :— హిందూస్తానీ సంగీతములో వుపయోగింపబడునట్టి ఒక తాళము.

చారుకర్నాట సారంగ :— 'అరబత్తినావలర్' యొక్క 'బరతశాస్త్తిరమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన ఒక ప్రాచీన రాగము.

చారుకుంతల :— 26 వ మేళకర్తయగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

*చారుకేశి :— 72 మేళకర్తలలో 26 వ మేళకర్త రాగమునకుగల పేరు. ఇది 5 వ "బాణ" చక్రములోని 2 వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక చ. రిషభం. గాంధార — శు. మధ్యమ — శు. ధైవత — కై. నిషాద స్వరములు వుండును. సంపూర్ణస్వరగమక వరకర్తరాగము. అన్నివేళలందు పాడదగును. శ్రీ త్యాగరాజుని ప్రసిద్ధమైన 'ఆడమోడిగలదే' అను కృతి యీ రాగమునందేగలదు. శ్రీస్వాతి తిరునాళ్ మహారాజుయొక్క 'కృపయాపాలయ' అనుకృతికూడ యీ రాగములోని ఒక మంచికృతికి వుదాహరణయగును.

చారురూపిణి :— 'బృహద్ధర్మ పురాణము'లో చెప్పబడిన 'మల్లార' యొక్క రాగిణి రాగమునకుగల పేరు.

చాటులీలావిలాసము :— శ్రీ 'మద్దిచెంగల్వరాయశాస్త్రి'చే తెలుగులో రచింపబడిన ఒక ప్రబంధము. (1810-1900)

చారువర్ధని :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

చాలనిక :— 'సంగీత దామోదరము' అను గ్రంథములో పేర్కొనబడిన 'రిషభము' నందలి మూడవ శృతికి గలపేరు.

చికారి :— ఉత్తర హిందూస్థానములో వాడునట్టి ఒక తంత్రివాద్యము. దీనిలో 3 నరము(Gut) తీగెలు సంగీతమును వాయించుటకు వుపయోగింపబడును. 5 తీగెలు (Wires) ఈ వాద్యమునందు గంభీరతను కలిగించుటకు వుపయోగింపబడును. ఇది కమాను (Bow) తో వాయింపబడును.

చిట్టతానము :— వీణావాద్యము నేర్చుకొనుటకు రచింపబడిన స్వరగీతము పేరు. ఇవి అన్ని ప్రాముఖ్యరాగములలో నుండును. వీణవిద్యార్థులు యొక్క వ పారిభాషిక జ్ఞానము సంపాదించుకొనుటకు వుద్దేశింపబడిన యీ రచనలను పూర్వీకులు 'కటకము'లని చెప్పియుండిరి. ఈ చిట్టతానములు ఘనరాగములగు నాట, గౌళ, ఆరభి, శ్రీరాగములందు కూడ గలవు.

చిట్టస్వరము :— కృతియొక్క అముఖ్యాంగములలో నొకదాని పేరు. అనగా 2 లేక 4 లేక అంతకంటె అధికమగు ఆవర్తములు కల్గియుండు నియమితమగు స్వరసమూహమునకు 'చిట్టస్వర'మని చెప్పుదురు. ఉ॥ (1) శృంగారలహరి. నీలాంబరిరాగం ఆదితాళము. ఈ కృతిలోని చిట్టస్వరము, (2) నీమదిచల్లగ. ఆనందభైరవిరాగము, ఆదితాళము. ఈ కృతిలోని చిట్టస్వరము, (3) బ్రోచేవారెవరురా. ఖమాసురాగము ఆదితాళము. ఈ కృతిలోని చిట్టస్వరము, (4) రఘువంశసుధా. కదనకుతూహల రాగము. ఆదితాళము ఈ కృతిలోని చిట్టస్వరము ప్రఖ్యాత చిట్టస్వరములకు వుదాహరణములగును.

చిట్టిపల్లవి :— వర్ణములోనుండు పల్లవి, అనుపల్లవి, ముక్తాయిస్వరములుగల పూర్వాంగము తరువాతనుండు "చరణమును" "చిట్టిపల్లవి" అనికూడ అందురు.

చింత :— "వ్యభిచారీ భావము"లోని 33 విధములలో 9 వ దానికిగల పేరు.

చింతలా :— మధ్య ఇండియాలో "బున్దేల్‌కండ్" ప్రాంతములో వాయించునట్టి ఒక పెద్ద ఇనుపతాళమునకుగల పేరు.

చిత్తజానుభావములు :— అనుభావములోని 4 విధములలో మొదటిదాని పేరు. ఇవి భావము, హావము, హేల, శోభ, కాంతి, దీప్తి, ప్రాగల్భ్యము, మాధుర్యము, ధైర్యము, ఔదార్యము అను 10 విధములుగా నుండును.

చిత్రద్యుతి :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

చిత్రమోదిని :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

చిత్తరంజని :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ని ధ ప మ గ రి స.
"త్యాగరాజు"యొక్క ప్రసిద్ధమైన కృతియగు 'నాదతనుమనిశం' అను రచన ఈ రాగములోనిదైయున్నది.

చిత్తరంజిల్లిని :— 66వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ప మ రి గ మ రి స.

చిత్ర :— 'తాళదశ ప్రాణముల'లోని మార్గములు 6 టిలో 3వది. దీనిలో ఒక తాళాక్షరమునకు 2మాత్రాకాలములు లేక 8 అక్షరకాలములువుండును. ఇట్టి తాళము పల్లవి పాడునపుడు వేయబడును.

చిత్ర :— సప్తతంత్రులు గలిగిన ఒకరకపు "వీణకు"గల పేరు.

చిత్ర :— "గాంధార గ్రామము"లోని మూర్ఛనలలో ఒకదాని పేరు. ఇది మ, నుండి ప్రారంభింపబడును.

చిత్రచంద్రిక :— 63వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

చిత్రతమ :— తాళదశప్రాణములలోని మార్గములు 6టిలో 5వదానికిపేరు. దీనిలో ఒక తాళాక్షరమునకు ½ మాత్రకాలము లేక 2 అక్షరకాలములు వుండును.
ఉ॥ మనసాఎట్లుమలయమారుతం.రూపకం
ఒకమాట — హరికాంభోజి — రూపకం.
రామాయిక — శహన — రూపకం.
రఘునాయక — హంసధ్వని — ఆది.

చిత్రతర :— తాళదశప్రాణములకు సంబంధించిన 6 మార్గములలో 4 వది. దీనిలో ఒక తాళాక్షరమునకు 1 మాత్రకాలము లేక 4 అక్షరకాలములు వుండును.
ఉ॥ ఎవరిమాట — కాంభోజి — ఆది.
సరోజదళనేత్రి — శంకరాభరణము—ఆది.

చిత్రప్రబంధము :— రంజకమైన ఒక రకపు సంగీత రచనకుగల పేరు. తెలుగులోనున్న రాగమాలికయైన "పన్నగాద్రీశ" అను రచన చిత్రప్రబంధమునకొక మంచి వుదాహరణయగును.

చిత్రపాదిత :— 32వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— సగ రిగమ ధమ పధనిస.
అవరోహణము— స ధ ప మ రి గ రి స.

చిత్రమణి :— 11వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

చిత్రమందిరా :— 15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యమైన షాడవ-సంపూర్ణ రాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

చిత్రమాలికము :— "చిత్రమాలికా" రాగమువలె నుండుదానికి గలపేరు.

చిత్రమాలికా :— 23వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి స.

చిత్రరవము :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

చిత్రరూపి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

చిత్రలఘువు :— సంకీర్ణజాతి లఘువు నకుగల మరియొక పేరు. దీనికి అంగములు 1. అక్షరకాలములు 9.

చిత్రవతి :—"గాంధారగ్రామము"లోని "పంచమము" యొక్క మూర్ఛనకు గల పేరు.

చిత్రవరాళి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ని మ గ రి స.

చిత్రవీణ :— సప్తతంత్రులు గలిగిన ఒక రకపు "వీణ"కు గల పేరు.

చిత్రవేళావళి :— 'అరబత్తనావలర్' యొక్క 'బరతశాస్త్తిరమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన ఒకరాగము.

చిత్రసారంభము :— 30 వ మేళకర్త యగు'నాగానందిని'యొక్కజన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

చిత్స్వరూపి :— 26 వ మేళకర్తయగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

చిత్స్వరూపిణి :— "చిత్స్వరూపి" రాగమునకెలుగుదానికిగల పేరు. [గా.పా.ప్ర]

చిత్తాకర్షిణి :— 7 వ మేళకర్తయగు 'సేనావతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

చిత్రా :— 'సంగీత దామోదరము'లో చెప్పబడిన 'రిషభము'లోని మొదటిశ్రుతి.

*చిత్రాంబరి :— 72 మేళకర్త రాగములలో 66 వ మేళకర్తరాగమునకు గలపేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జము, చతుశ్రుతి రిషభము, అంతరగాంధారము, ప్రతిమధ్యమము, పంచమము, షట్శ్రుతి ధైవతము, కాకలీనిషాద స్వరములుండును.ఇది11వ చక్రములోనిది.

చింతామణి :— i 7 వ మేళకర్తయగు "సేనావతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ స మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.
ii 56 మేళ జన్యము. } స రి ప మ ప ధ ని స. / స ప ధ ప మ గ రి స.

చింతారమణి :— 52 వ మేళకర్తయగు "రామప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ ప గ రి స ని.

చిత్రిణి :— "శృంగార శాస్త్రములో" చెప్పబడిన నాలుగురకములగు స్త్రీలలో ఒక జాని పేరు. మిగతవి పద్మిని, శంఖిని, హస్తిని అనునవి. చిత్రిణి రెండవరకపు స్త్రీ యగును. "రతిమంజరి" అను సంస్కృత గ్రంథములో వీటినిగురించిన వివరములు చక్కగా పేర్కొనబడెను.

చిత్తిరతాళము :— 'బరతశాస్తిరమ్' అను తమిళ గ్రంథములో చెప్పబడిన నవతాళములలో నొకదానికిగల పేరు.

చిదంబరవిలాసమ్ :— "గోపాలకృష్ణభారతి" యొక్క "నందనార్ చరిత్రము" అను తమిళనాటకములోని మూడవభాగము లేక అంకమునకు గలపేరు.

చిదానంది :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము—స ని ధ ని ప మ గ మ రిస.

చిందు :— ఇది బహుళః ఛందస్సు అను సంస్కృతపదమునుండి తీయబడి వుండవచ్చును. చిందు అనునది కొన్ని చరణములతో కూడినపాట. అన్ని చరణములు ఒకేరకము సంగీతములో పాడబడును. యీ చిందులు చాలా వ్యాప్తిలోవున్నవి. వాటి వరుసలు మిక్కిలి ఆకర్షణీయముగా నుండును. ఉ॥ కావడిచిందు, నొండిచిందు, శురుల్ నొండిచిందు, వండిచిందు, వళినడై చిందు మొదలగునవి.

చిన్నత్యాగరాజు :— తెలుగు పదములను చాల చక్కని తేములకు మనోహరమైన నిరూపణములను రచించినట్టి శ్రీ "ముప్పలూరు సభాపతి అయ్యర్" యొక్క అత్యద్భుతమైన తెలివితేటలకు మెచ్చి ఆనాటి ప్రజలు ఆయననుపిలిచెడి గౌరవ నామము.

చిన్నమ్ :— గాలివాద్యములలోని ఒకరకమునకు తమిళములోని పేరు. ఇందులో తిరుచిన్నమ్, నాగచిన్నమ్ (నాగస్వరము) అను రెండురకములుగలవు.

చిన్నమేళము :— పూర్వము భరతనాట్యమువంటి ప్రదర్శనములలో వుపయోగించు ఒకరకమైన "చిన్ననాగస్వరము" వంటి వాద్యమునకు గలపేరు.

చిన్నవర్ణము :— ఆదితాళములోనుండు తానవర్ణములకు గలపేరు. ఉ॥ వనజాక్షీ. కల్యాణిరాగము. ఆదితాళము.

చిన్మయి :— 16 వ మేళకర్తయగు "చక్రవాకము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గా మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గా రి స.

చిప్లా :— హరికథా కాలక్షేపముచేయు భాగవతార్లు కాలక్షేపముచేయుసమయములందు కుడిచేతితో వాయింపబడునట్టి చిరతలకు గలపేరు. వీటికి మధ్యభాగమున గజ్జలుగాని, లోహపు చక్రములుగాని బిగింపబడి యుండును. చిప్లా వాయించునపుడు ఆ గజ్జలు మ్రోగుటచే వినుటకు రంజకముగానుండును.

చిప్లాకట్టై :— చిరతలకు (చిప్లా) తమిళములో చెప్పబడునట్టి పేరు.

చిరంటి :— 7వ మేళకర్తయగు 'సేనాపతి' యొక్క జన్యరాగమునకుగల పేరు. ఆరోహణము- స రి గ ప ధ ని స. అవరోహణము- స ని ధ ప గ రి స.

చిల్లరపాటలు :— హాస్యరసము ప్రధానముగానుండును గందోళిగాడి పాటలును, గూఢార్థయుక్తమైన పాటలును, నృత్యనాట్యములందు పాడునటువంటి పాటలును యీ తరగతిలో చేరినవి. ఇట్టి పాటలు కొంతకాలమే ప్రచారములో యుండి క్రమంగా నశించిపోవును. ఉ॥ శ్రీరామచంద్రర, అండి పెండారము మొదలగునవి యీ రకమునకు చెందును.

# చు

చుక్కా :— "శార్ఙ్గదేవుని"చే "సంగీత రత్నాకర" గ్రంథములో పేర్కొనబడిన వేణు (గాలి) వాద్యములలోని 10 రకములలో 8 వ దానికిగల పేరు.

చ్యుత పంచమము :— మధ్యమ గ్రామములోని పంచమము ఒక శృతి తక్కువగానుండుటచే గలిగిన పేరు. సెకండుకు దీని వేపనముల సంఖ్య 40/27.

చ్యుతపంచమ మధ్యమము :— ఇది చ్యుతపంచమమునకు సరిపోవునది యగును. 'మేళాధికారలక్షణ'మను గ్రంథమందుగల 24 శృతుల పద్ధతిలో 14 శృతికిగల పేరు.

చ్యుత మధ్యమము :— 22 శృతుల పద్ధతిలో అంతరగాంధార, శుద్ధ మధ్యమముల మధ్యనుండు శృతికిగల పేరు. సెకండుకు దీని వేపనముల సంఖ్య 81/64. యీ శృతిగల రాగమునకు 'దేవగాంధారి' ఒక ముఖ్య వుదాహరణ మగును.

చ్యుత మధ్యమ గాంధారము :— ఇది చ్యుత మధ్యమమునకు సరిపోవును. 22 శృతులలో 9 వ శృతికిగల పేరు. సెకండుకు దీని వేపనముల సంఖ్య 81/64.

చ్యుతషడ్జ నిషాదము :— ఇది చ్యుత షడ్జమునకు సరిపోవునట్టి స్వరమగును.

చ్యుతషడ్జము :— కాకలీ నిషాదమునకు, తారషడ్జమునకు మధ్యనుండు శృతికి గలపేరు. సెకండుకు దీని వేపనములసంఖ్య 243/128. ఈ శృతికి 'కురంజిరాగము' ఒక ముఖ్య వుదాహరణమగును.

---

# చూ

చూడామణి :—29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము'యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ధ ని స. అవరోహణము- స ప ని ధ మ గ స.

చూతమంజరి :— 'సంగీత రత్నాకర'ములో పేర్కొనబడిన ఒక రాగము.

చూతావళి :— 56 వ, మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.

ఆరోహణము_ స మ గ మ ప ధ ని స.
అవరోహణము_ స ని ధ ప మ గ రి స.

చూర్ణిక :— ఇది 'దేవగాంధారి' రాగములో పాడబడునట్టి ఒక రచన. నాటక సంబంధమైన రచనగావుండును. త్యాగరాజుని 'ప్రహ్లాద భక్తివిజయము'అను ప్రసిద్ధమైన నాటకమునందుగల 'జయతు జయతు' అనునటువంటి రచన చూర్ణికకు ఒక మంచి వుదాహరణయగును.

చూర్ణికవినోదిని :—60 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స రి గ మ ప ధ ని స.
అవరోహణము_ స ని ధ ని ప మ గ రి స.

## చె

చెంగల్వ :— 'చెయ్యూరు' నివాసియైన 'చెంగల్వరాయశాస్త్రి' తాను రచించిన కృతులందు పెట్టుకొనిన ముద్రపేరు.

చెంచుకాంభోజి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి'యొక్క జన్యము.
ఆరోహణము_ i. స మ గ రి ప మ ధ ని స.
ii. స గ రి గ మ ప మ ధ ని ప ని ధ ని స.
అవరోహణము_ స ని ప ని మ గ రి స.
ఇది ఉభయ వక్రరాగము. 'త్యాగరాజు' 'వరరాగలయజ్ఞులు'అను ప్రసిద్ధమైనకృతిని యీ రాగమునందే రచించెను.

చెండ :— దక్షిణ భారతములో 'మలబారు' ప్రాంతమున వాడబడు ఒకరకమైన చర్మవాద్యము.ఇది"కథాకళి" నృత్యప్రదర్శనములందును తనిగాకూడా వాయింపబడు లయ వాద్యమైయున్నది.

చెంపట:—"కథాకళి"సంగీతములో'ఆది' తాళమునకు బదులుగా వాడునట్టిపేరు.

చెయ్యూరు :— ఇది చెంగల్పట్టు జిల్లాలోని ఒక గ్రామము. 19 వ శతాబ్దములో సంగీత, నృత్యములకు మిక్కిలి ప్రసిద్ధి చెందినదిగా యుండెను. ఇచ్చట దేవాలయమునందు జరుగు సర్వవాద్య (వివిధసంగీత వాద్యముల) ప్రదర్శనము దక్షిణభారతములో విశేష ప్రఖ్యాతినొంది యున్నది.

## చే

చేటి :— ఉపనాయికలలోని 8 రకములలో 4 వ దానికి "చేటి" అని పేరు.

చేటుడు :— ఉపనాయకులలోని 4 రకములలో 3 వ వానికి పేరు. ఇతడు నాయికా, నాయకులకు పరస్పరము సంధి చేయువాడుగా నుండును.

చేతన :— స్వరము లేక ధ్వని. మానవ గాత్రము నుండిగాని లేక సజీవమైన మరి వేరొకదానినుండి గాని ధ్వని వినవచ్చినప్పుడు చెప్పబడునట్టి పేరు.

చేతులావళి :— 65 వ మేళకర్త యగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.

ఆరోహణము_ స రి గ రి గ మ ప ని ధ ని స.
అవరోహణము_ స ని ద ప మ రి గ రి స.
ఇదిఉభయవక్రరాగమునకుఒకముఖ్యవుదాహరణము. [పల్లవి శేషయ్యర్ గ్రంథము.]

చేవాటి :— 'సంగీత రత్నాకరము' లో పేర్కొన బడినటువంటి "టక్క" భాషలలోని యొక రాగమునకుగల పేరు.

చేష్టలు :— "ఉద్దీపనవిభావము" లోగల 4 రకములలో 2వ దానికిగలపేరు. కడకంటి చూపులు మొదలగు యౌవనవ్యాపారములను "చేష్ట" లనబడును.

# చై

చైతన్య :— శ్రీ కృష్ణుని పరముగా రచించిన భక్తరస ప్రధానమైన సుప్రసిద్ధ కీర్తనల రచయితకు గలపేరు. ఈయన జననము బెంగాల్ రాష్ట్రము. 1485_1534 కాలమునకు చెందినవాడు. పవిత్రమైన వీరి కీర్తనలు బెంగాల్, ఒరిస్సా రాష్ట్రములందు నేటికిని మిక్కిలి ప్రచారములో నున్నవి.

చైతిగౌడి :— 'సోమనాథుని' "రాగవిబోధము" నందు పేర్కొనబడిన "మాళవగౌళ" మేళముయొక్క జన్యరాగము.

# చొ

చొక్కనాథస్వామి :— ప్రాచీన వాగ్గేయకారులు రచించిన సంగీత రచనలలో కనుపడునట్టి ఒక ముద్రకు పేరు. "మీనాక్షీ జయకామాక్షీ" అను శ్రీరాగము, ధ్రువతాళములోని ప్రసిద్ధమైన గీతము యిట్టిముద్రగల రచనకు మంచి వుదాహరణమగును.

# చో

చోద్య :— తాళ షడంగములలోని 3 వదైన లఘువునకు గల మరియొక పేరు.

చోపిగాడు :— నృత్యమునకు సంబంధించిన నాటకములలో ప్రారంభమున ప్రవేశించు కోనంగి లేక "చోపుదారి" కి తమిళములో చెప్పబడునటువంటి పేరు.

చోహాలకము :— కంఠస్ఫూర్తిగా హెచ్చుతగ్గులు లేక స్త్రీలుగాని పురుషులుగాని మనోహరముగచేయునట్టి గానమునకు 'చోహాలక' మని పేరు.

# చౌ

చౌకం :— రాగాలాపన చేయుటలో యెక్కువ నిదానముగా రాగముపాడుటను చౌకంగా చేయబడిన రాగాలాపన మనియందురు. ఇట్లు రాగాలాపన చేయుటలో "చౌకమ్ సీనుఅయ్యర్" సుప్రసిద్ధుడుగా చెప్పుదురు.

చౌకకాల కృతి :— 'శ్రీ రాజగోపాల' అను 'సావేరిరాగ' కృతియు, "ఎపరిమాట"

అను "కాంభోజిరాగ" కృతివంటి కృతులు చాలా నిదానముగా పాడదగినట్టి వగుట చే అట్టివాటికి "చౌకకాల కృతు"లని చెప్పుదురు. ఇటుల చౌకకాలముగా రాగ, తాన, కృతులను ప్రదర్శించుటలో పూర్వము శ్రీ చౌకమ్ సీనుఅయ్యర్, మిక్కిలి ప్రతిభగలవాడనియు అందుచే ఆతనికి అదేబిరుదుగలిగినట్లుగా చెప్పుదురు.

చౌకకాలము :— తాళము నడచు వేగము నెమ్మదిగా నుండుదానికి గలపేరు.

చౌకభీరు :—45 వ మేళకర్తయగు 'శుభ పంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ మ గ రి స.

చౌకవర్ణము :—ఇది "పదవర్ణము" నకుగ[ల] మరియొక పేరు. దీనినడక చాల నెమ్మదిగ నుండును. కొన్ని చౌకవర్ణములలో పల్లవి అనుపల్లవి, చరణములకు సాహిత్యము[ం]డును. కాని స్వరములుండవు. మిగ[ి]భాగము తానవర్ణమువలె నుండును.

చౌతార :— 4 తంత్రులుగలిగినట్టి యొ[క] రకపు తంతి వాద్యమునకుగల పేరు.

## ఛ

ఛత్రధరి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ రి ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఛందోధరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ని ప స
అవరోహణము— స ని ధ మ గ రి స.

ఛందోవతి :— 'భరతుని'చే పేర్కొ[న]బడిన 22 శృతుల విధానములో షడ్జమ యొక్క 4 వ శృతికి గలపేరు. ఇది షడ్జమ యొక్క నియతశృతియగును.

## ఛా

ఛాయా :— 'సంగీత రత్నాకరము'లో పేర్కొనబడిన ఒక రాగము. దీనినే 'నారదుని' 'సంగీత మకరందము'లో 'చంద్రాంశ' రాగముగను, 'సంగీతసుధ' లో 20 భాషాంగముల శీర్షికకు చెందినది గను దీనిని పేర్కొనబడినది.

ఛాయా :— 'సంగీతసార సంగ్రహము' విధముగా ఒక స్థాయిలోని 24 శృతులలో 17 వ శృతికిగల పేరు.

ఛాయా :— 20 వ మేళకర్తయగు 'న[ఠ]భైరవి' యొక్క జన్యరాగము. [సం.కా.
ఆరోహణము—స రి గ రి మ ప ని ధ ని స
అవరోహణము— సనిపనిధపమగమరిగస.

ఛాయాకౌశిక :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యమైన వక్రషాడవ సంపూర్ణరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఛాయాగౌడ :—ఇది 'నారదుని' 'సంగీత మకరందము'లో పుల్లింగరాగమునకు చెందినదిగను, 'సంగీత సమయసారము'లో ఉపాంగ సంపూర్ణరాగము యొక్క శీర్షికకు చెందినది గను పేర్కొనబడిన రాగము.

ఛాయాగౌరి :— 7 వ మేళకర్త యగు "సేనాపతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

ఛాయాగౌళ :— 3 వ మేళకర్త యగు "గానమూర్తి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము—స ధ ని ప మ గ స రి స.

ఛాయాగౌళ :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము.[స్వరప్రస్తారసాగరము.]
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స రి స.

ఛాయాతరంగిణి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ని స
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది వక్రషాడవ—సంపూర్ణ రాగము. ఉపాంగరాగము. గాంధార, నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. అన్ని సమయములందు పాడవచ్చును. త్యాగరాజుని "ఇతర దైవములవల్ల," "కృప జూచుటకు వేళరా" అను సంగీత రచనలు ఈ రాగములోగల ప్రసిద్ధమగు కృతులగును.

ఛాయాతోడి :— 'సంగీతసమయ సారము' లో పేర్కొనబడిన ఒక రాగము.

ఛాయాతోడి :— ఇదివల ప్రకటింపబడిన గ్రంథములలో తోడియొక్క ఉపాంగ రాగముగ పేర్కొనబడిన ఒకరాగము.

ఛాయానట్ట :— 'పార్శ్వదేవుని'యొక్క 'సంగీతసమయ సారము'లో ఉపాంగ సంపూర్ణ రాగముల శీర్షికక్రింద చెప్పబడిన రాగము. ఈ రాగమును'సంగీతరత్నాకర' గ్రంథములోకూడా పేర్కొనబడినది.

ఛాయానాట :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ప స.
అవరోహణము— స ని ధ ని ప మ రి స.
ఇది ఏకస్వర వక్రరాగము. ఔడవ—షాడవరాగము. రిషభ, మధ్యమ, ధైవతములు జీవస్వరములు. "ఇది సమయమురా" అను త్యాగరాజుని ప్రసిద్ధమైన కృతి యీ రాగమునందే గలదు. ఇది "రాగతాళ చింతామణి" అను తెలుగు గ్రంథములో కూడ పేర్కొనబడినది.

ఛాయానాటి :—'నారదుని' "సంగీత కరందము'లో పేర్కొనబడినఒకరా

అను "కాంభోజిరాగ" కృతివంటి కృతులు చాలా నిదానముగా పాడదగినట్టి వగుట చే అట్టివాటికి "చౌకకాల కృతు"లని చెప్పుదురు. ఇటుల చౌకకాలముగా రాగ, తాన, కృతులను ప్రదర్శించుటలో పూర్వము శ్రీ చౌకమ్ సీనుఅయ్యర్, మిక్కిలి ప్రతిభగలవాడనియు అందుచే ఆతనికి అదే బిరుదుగలిగినట్లుగా చెప్పుదురు.

చౌకకాలము :— తాళము నడచు వేగము నెమ్మదిగా నుండుదానికి గలపేరు.

చౌకభీరు :—45 వ మేళకర్తయగు 'శుభ పంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ మ గ రి స.

చౌకవర్ణము :—ఇది "పదవర్ణము"నకుగల మరియొక పేరు. దీనినడక చాల నెమ్మదిగా నుండును. కొన్ని చౌకవర్ణములలో పల్లవి, అనుపల్లవి, చరణములకు సాహిత్యముం డును. కాని స్వరములుండవు. మిగత భాగము తానవర్ణమువలె నుండును.

చౌతార :— 4 తంత్రులుగలిగినట్టి యొక రకపు తంతి వాద్యమునకుగల పేరు.

## ఛ

ఛత్రధరి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ రి ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఛందోధరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ని ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

ఛందోవతి :— 'భరతుని'చే పేర్కొన బడిన 22 శ్రుతుల విధానములో షడ్జము యొక్క 4 వ శ్రుతికి గలపేరు. ఇది షడ్జము యొక్క నియతశ్రుతియగును.

## ఛా

ఛాయా :— 'సంగీత రత్నాకరము'లో పేర్కొనబడిన ఒక రాగము. దీనిని 'నారదుని' 'సంగీత మకరందము'లో 'చంద్రాంశ' రాగముగను, 'సంగీతసుధ' లో 20 భాషాంగముల శీర్షికకు చెందినది గను దీనిని పేర్కొనబడినది.

ఛాయా :— 'సంగీతసార సంగ్రహము' అను తెలుగు గ్రంథములో పేర్కొనబడిన విధముగా ఒక స్థాయిలోని 24 శ్రుతులలో 17 వ శ్రుతికిగల పేరు.

ఛాయా :— 20 వ మేళకర్తయగు 'నఠ భైరవి' యొక్క జన్యరాగము. [సం.కా.]
ఆరోహణము—స రి గ రి మ ప ని ధ ని స.
అవరోహణము— సనిపనిధపమగమరిగస.
ఇది ఉభయవక్ర రాగమునకు చెందును.

ఛాయాకౌశిక :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యమైన వక్రషాడవ సంపూర్ణ రాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

ఛాయాగౌడ :—ఇది 'నారదుని' 'సంగీత మకరందము'లో పుల్లింగరాగమునకు చెందినదిగను, 'సంగీత సమయసారము'లో ఉపాంగ సంపూర్ణ రాగము యొక్క శీర్షికకు చెందినది గను పేర్కొనబడిన రాగము.

ఛాయాగౌరి :— 7 వ మేళకర్త యగు "సేనాపతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ మ ప ని ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.

ఛాయాగౌళ :— 3 వ మేళకర్త యగు "గానమూర్తి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము-స ధ ని ప మ గ స రి స.

ఛాయాగౌళ :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము. [స్వరప్రస్తారసాగరము.]
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స రి స.

ఛాయాతరంగిణి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ మ ప ని స
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది వక్రషాడవ-సంపూర్ణ రాగము. ఉపాంగరాగము. గాంధార, నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. అన్ని సమయములందు పాడదగును. త్యాగరాజుని "ఇతర దైవములవల్ల, "కృప జూచుటకు వేళరా" అను సంగీత రచనలు ఈ రాగములోగల ప్రసిద్ధమగు కృతులగును.

ఛాయాతొడ్డి :— 'సంగీతసమయ సారము' లో పేర్కొనబడిన ఒక రాగము.

ఛాయాతొడి :— ఇకేవల ప్రకటింపబడిన గ్రంథములలో తోడియొక్క ఉపాంగ రాగముగ పేర్కొనబడిన ఒకరాగము.

ఛాయానట్టి :— 'పార్శ్వదేవుని'యొక్క 'సంగీతసమయ సారము'లో ఉపాంగ సంపూర్ణ రాగముల శీర్షికక్రింద చెప్పబడిన రాగము. ఈ రాగమును'సంగీతరత్నాకర' గ్రంథములోకూడా పేర్కొనబడినది.

ఛాయానాట :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప మ ప స.
అవరోహణము- స ని ధ ని ప మ రి స.
ఇది ఏకస్వర వక్రరాగము. ఔడవ-షాడవరాగము. రిషభ, మధ్యమ, ధైవతములు జీవస్వరములు. "ఇది సమయమురా" అను త్యాగరాజుని ప్రసిద్ధమైన కృతి యీ రాగమునందే గలదు. ఇది "రాగతాళ చింతామణి" అను తెలుగు గ్రంథములో కూడ పేర్కొనబడినది.

ఛాయానాటి :—'నారదుని' "సంగీత మకరందము"లో పేర్కొనబడినఒకరాగము.

ఛాయానారాయణి :— 6 వ మేళకర్త యగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

ఛాయాగౌళి :— 8 వ మేళకర్త యగు 'హనుమత్తోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ స ప ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

ఛాయామారువ :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ధ ని ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

ఛాయామాళవి :— 7 వ మేళకర్త యగు 'సేనాపతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

ఛాయారుద్ర :— 29 వ మేళకర్త యగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యమైన వీకస్వర వక్రరాగము.
ఆరోహణము— స రి మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

ఛాయాలగతాళము :— ఇది ఒకరకమైన తాళమునకు పేరు. రాగములవలెనే తాళములుకూడా శుద్ధఛాయాలగ తాళము, సంకీర్ణ ఛాయాలగ తాళము అని రెండువిధములు. సంకీర్ణ ఛాయాలగ తాళమునకు "సింహానందన తాళము" వుదాహరణమగును. శుద్ధఛాయాలగ తాళము 1 లేక 2 తాళములతో కూడియుండును. సంకీర్ణ ఛాయాలగ తాళము 2 కంటె ఎక్కువ తాళములతో కూడియుండునదిగా నుండును.

ఛాయాలగరాగము :— ఇతర రాగలక్షణములను, రాగచ్ఛాయలనుపొంది జనమనో రంజకముగ పాడవీలుగల రాగములను ఛాయాలగ రాగములని చెప్పుదురు. ఉ॥ భైరవి, కాంభోజి, సారంగ మొదలగునవి. వీటినే సాలంగరాగ లేక సాలగ రాగములనికూడ చెప్పుదురు.

ఛాయాలగసూడ :— ఇది ఒకరకమైన ప్రబంధరచన. ఈ ప్రబంధములు 3 విధములుగా నుండును. అవి యేవనగా !
1. సూడ ప్రబంధము.
2. ఆలి క్రమ ప్రబంధము.
3. విప్రకీర్ణప్రబంధము అనునవి.
సూడప్రబంధము తిరిగి రెండువిధములుగా యేర్పడు చున్నవి. అవి (1) శుద్ధసూడ, (2) ఛాయాలగసూడ లేక సాలగసూడ అనునవి. ఛాయాలగసూడ ప్రబంధములు సప్తతాళములందుకూడ వున్నవి.

ఛాయావతి :— 17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

*ఛాయావతి :— 17 వ మేళకర్తయగు "సూర్యకాంతము"నకు 'వెంకటమఖి' పెట్టిన ప్రత్యేకనామము. ఇది అసంపూర్ణ మేళపద్ధతిలోనిదిగా నున్నది.

ఛాయావర్ధిని :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

ఛాయావేళ :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము- స ధ ని ప మ గ రి స.

ఛాయావేళావళి :— ఇటీవల ప్రచురింప బడిన గ్రంథములలో 'వేళావళిరాగము' యొక్క ఉపాంగరాగముగా పేర్కొన బడిన ఒక రాగము.

ఛాయాశోభితము :—22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము-స ని ధ ప మ ధ మరిగరిస.
[సం. కా.]

ఛాయాసింధు :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

ఛాయాసైంధవి :—11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము-స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

# జ

జగఝంపతాళము :— శాస్త్రీయమైన 108 తాళములలో 83 వ తాళమునకుగల పేరు. ఈ సంఖ్య చచ్చత్పుటాది పంచ తాళములతో చేరి యేర్పడినది. దీనికి అంగములు 800 ∪. అక్షరకాలములు 13.

జ-గణము :— తాళములయొక్క అంగములను కనుగొను విధానమునందుపయోగపడు అష్టగణములగు 8 గణములలో 3 వది. దీనికి అంగములు ఒక లఘువు ఒక గురువు ఒక లఘువు. గుర్తులు I 8 I.

జగద్వరి :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

జగదీశ్వరి :— 34 వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

జగన్మోహరి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి గ స.

జగన్మాత :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ స.

*జగన్మోహనము :— "వెంకటమఖి" 72 మేళకర్తలలో 38 వ మేళకర్తయగు 'జలార్ణవము'నకు పెట్టిన పేరు.

జగన్మోహనము :— 38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప స స ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

జగన్మోహిని :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యమైన ఔడవ-షాడవరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గా రి స.

జగాంగన :— 42 వ మేళకర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ప మ రి గ మ రి స.

జగాభరణము :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

జంఝూటి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ధ స రి గ మ ప ధ ని.
అవరోహణము— ధపమగరిసని ధ ప ధ స.

జటపల్లిగోపాల :— ప్రాచీన తెలుగుపద రచయితలగు "జటపల్లివారు" రచించిన పదముల యందుగల ముద్రకు పేరు.

జంటస్వరము :—సంగీతమునందలి ప్రథమాభ్యాసమునందు నేర్చుకొను స్వరసంసంబంధమైన రచనలలో సరళీస్వరములు, దాటుస్వరములు, హెచ్చుస్థాయి స్వరములు, తగ్గుస్థాయి స్వరముల తరువాత నేర్చుకొను రచనలు జంటస్వరములగును. వీటిలోని ప్రతిస్వరము జంటగానుండును. గాత్రమునందుగాని వాద్య (యంత్ర)ము నందుగాని యీ జంటస్వరములు త్రికాలమే గాక, షట్కాలముల కూడ సాధకము చేయుట సంగీతకళా ప్రావీణ్యము నొందుటకు యెంతేని అవసరమగును.

జటాధరి :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

జటి :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో "కటపయాది" సంఖ్యతో పేర్కొనబడిన "మిశ్రజాతి అటతాళము" నకు గలపేరు. దీనికి అంగములు ।।00. అక్షరకాలములు 18.

జనకతాళము :— 'రత్నాకర గ్రంథమునందు పేర్కొనబడిన 120 తాళములలో 91 వ తాళమునకుగల పేరు. దీని అంగములు ।।।।888।।8.

జనకతాళము :— శాస్త్రీయమైన "అష్టోత్తరశత" తాళములను 108 తాళములలో 105 వ తాళమునకు పేరు. దీని అంగములు ।।।।88।।8. మాత్రలు 12. అక్షరకాలము 48.

జనకరాగము :— జన్యరాగములకు జనకరాగమైనదియు ఆరోహణ అవరోహణముల సప్తస్వరములు గలిగిన సంపూర్ణమైనదియు, అవక్రమైనదియు హెచ్చు తగ్గులలో ఒకే జాతికిచెందిన స్వరములు

కలదియునైన రాగమునకుగల పేరు. ఇట్టి రాగములు మొత్తము 72 గలవు. వీటికి పూర్వీకులగు 'శ్రీ గోవిందాచార్యులు' కనకాంగి, మొదలగు 72 పేర్లను 'వెంకట మఖి' కనకాంబరి మొదలగు 72 పేర్లను పెట్టియున్నారు.

జనకరాగ కృతిమంజరి :— "శ్రీమంగళంపల్లి బాలమురళీకృష్ణ"చే యిటీవల రచింపబడి ప్రకటింపబడిన 72 జనకరాగములందు కృతులుగల ఒక గ్రంథమునకు పేరు.

*జనతోడి :— 72 మేళకర్తలకు "వెంకటమఖి" యేర్పఱచిన నామములలో 8 వ మేళకర్తకుగల పేరు. ఇది 2 వ "నేత్ర" చక్రములోని 2 వ మేళ మగును.

జనని :— 52 వ మేళకర్త యగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.

జననిక :— 18 వ మేళకర్త యగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

జనరంజని :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యమైన వక్రసంపూర్ణ-ఔడవ రాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ధ ప మ రి స.

జనసమ్మోదిని :—28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

జన్యరాగము :— జనకరాగములగు 72 మేళకర్తలనుండి జనించు రాగములకు గలపేరు. ఇవి ఒక్కొక్క మేళకర్తకు 484 రాగముల వంతున 72 మేళకర్తలకు 72 X 484=34, 848 జన్యరాగము లేర్పడుచున్నవి. వీనినేఉత్పత్తిరాగములని యు, అముఖ్యరాగములనియు చెప్పుదురు.

జన్యరాగవిభజన :— జన్యరాగములను విభజించుటలో జన్యసంపూర్ణములు, వర్జరాగములు, వక్రరాగములు, ఉపాంగ రాగములు, భాషాంగ రాగములు, నిషాదాంత్య రాగములు, ధైవతాంత్య రాగములు, పంచమాంత్య రాగములుగా విభజింపబడిన విభజనకు గలపేరు.

జనాకర్షిణి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప మ ధ ని స.
అవరోహణము—స ని ధ ప మ గ ధ మ గ రి స.

జయంతశ్రీ :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మ గ స.

జయంతసేన :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

జయతాళము :— 'భరతశాస్త్రమ్' అను పురాతన తమిళ్ గ్రంథములో చెప్పబడినట్టి 9తాళములలో 4వ తాళమునకు గలపేరు.

జయతాళము :— శాస్త్రీయమైన 108 తాళముల పట్టికలో 48 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I 8 I I 0 0. మాత్రలు 6. అక్షరకాలములు 24.

జయతాళము :— 'రత్నాకర' గ్రంథములో పేర్కొనిన 120 తాళముల పట్టికలో 28 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I 8 I I 0 0 3.

జయతాళము :— 'పింగళనిగండు' లో చెప్పబడిన 9 తాళములలో 5 వ తాళమునకు గలపేరు.

జయదేవ :— 12 వ శతాబ్దమునకు చెందిన 'బెంగాలు' రాష్ట్రములోని "దిందుబిల్వం" నివాసియగు "జయదేవుడు" తాను రచించిన 'గీతగోవింద' మను శృంగార మహాకావ్యమునందుగల నాయికానాయక లక్షణముతోకూడిన 24 అష్టపదులకు పెట్టుకొనిన 'స్వనామ ముద్ర' కు గలపేరు.

జయదేవకవి :— భక్తి, శృంగారరస మిళితమైన అష్టపదులతో "గీతగోవింద" మను మహాకావ్యమును రచించిన "శ్రీజయదేవు"నికి గలమరియొక పేరు.

జయనారాయణి :—22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గా మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

జయమంగళతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమగు 120 తాళములలో 42 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I I 8 I I 8.

జయమంగళతాళము :— శాస్త్రీయమైన 108 తాళములపట్టికలో 45 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I 8 3 I 8 3. అక్షరకాలములు 48.

జయమనోహరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము. ఇది ఔడవ-ఔడవరాగమగును.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ని ధ మ రి స.

జయముఖతాళము :— 'రాగతాళ చింతామణి' అను తెలుగు గ్రంథములో పేర్కొనిన 124 తాళములలోఇతరులచేచెప్పబడనితాళములలో 4 వ తాళమునకు పేరు.

జయరామతాళము :—'వనపాదచూడామణి' యొక్క 'తాళసముద్రమ్' అను తమిళ గ్రంథములో చెప్పబడిన తాళములలో 19 వ తాళము యొక్క పేరు.

జయవేళావళి :— 43 వ మేళకర్తయగు 'గవాంభోధి' యొక్కజన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

జయశ్రీ :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

జయశ్రీతాళము :—"అష్టోత్తరశత" తాళములగు 108 తాళముల పట్టికలో చెప్పబడిన 38వ తాళమునకు పేరు. దీనికి అంగములు 8 8 I I 8. అక్షరకాలములు 32.

జయశ్రీతాళము :—'రత్నాకర' గ్రంథస్థమగు 120 తాళములలో 46 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8 । 8 । 8.

జయశ్రీభకారమర్త్యతాళము :— "రాగతాళ చింతామణి" అను గ్రంథములో చెప్పబడిన 124 తాళములలో తదితరులచే చెప్పబడని తాళములలో 8 వ తాళము.

జయశుక :— 71 వ మేళకర్త యగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ మ రి స.

*జయశుద్ధమాళవి :—72 మేళకర్తలకు "వెంకటమఖి" కల్పించిన పేర్లలో 18 వ మేళకర్తయగు 'హాటకాంబరి'కి గల పేరు. ఇది 3 వ 'అగ్ని' చక్రములోని 6 మేళమగును.

జయసారంగ :— 57 వ మేళకర్తయగు 'సిమ్హేంద్ర మధ్యమము' యొక్క జన్యమైన వక్ర సంపూర్ణరాగము.
ఆరోహణము—స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప ధమగరిస.

జయసావేరి :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ రి గ మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని స.

జయసింధు :— 2 వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ప ని ధ మ గ రి స.

జయాభరణి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ రి గ మపస.
అవరోహణము— స ని ధా ప మ రి స.

జయాకరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యమైన ఔడవ-వక్రసంపూర్ణ రాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము—స ని ధ ప మ గ రి గ రి స.

జలజముఖి :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ని ప మ రి గ స.

జలజవాసిని :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

జలతరంగిణి :—సంగీత వాద్యములలో తంత్రీవాద్యముల, గాలివాద్యముల రకమునకు చెందని ఒక రకమైన సంగీతవాద్యము. ఇది సంగీతమును నోటితో పాడకనే పూర్తిగా ప్రదర్శించుటకు వీలుకలిగిన వాద్యముగా చెప్పవచ్చును. దీనిని వాయించుటకు స్ఫుటమైనట్టి శ్రావ్యమగు ధ్వనిగల 18 పింగాణీ గిన్నెలను అర్ధచంద్రాకారముగ వరుసగా పెట్టి వాటిలో ఆధారశృతికిని ఆ రాగమునకు తగినట్లుగా ఆయా స్వరముల ననుసరించి నీళ్ళుపోసి ఆ గిన్నెలను 2 పుల్లలతో కొట్టుచూ వాయింతురు. ఈవాద్యము తనిగాను, ఆర్కెస్ట్రాలందును ప్రదర్శింతురు. ఈవాద్య

ముయొక్క ధ్వని వినుటకెంతో హాయి గాను గంభీరముగాను వుండును.

జలసుగంధి :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

*జలార్ణవము :— 72 మేళకర్తలలో 38 వ మేళకర్తకు గలపేరు. ఇది 7 వ "ఋషి" చక్రములోని 2 వ మేళకర్త యగు ప్రతిమధ్యమ రాగమగును.

ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది షడ్జ, పంచమములు గాక శు. రి- శు. గాం- ప్ర. మ- శు. ధై- కై. నిషాద స్వరములను గలిగియుండును.

జలోద్ధతి :—29 వ మేళకర్తయగు 'ధీర శంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము—స ధ ప మ రి గ మ రి స.
ఇది ఔడవ - వక్రషాడమునకు చెందును.

# జా

జాతి :— తాళ షడంగములలో లఘువు నకు సంబంధించినట్టి పదమునకు జాతి అనిపేరు. ఈ జాతులు 5 విధములు. అవి త్రిశ్ర 3. చతురశ్ర 4. ఖండ 5. మిశ్ర 7. సంకీర్ణము 9. ఈ 5 లఘు జాతులును వాటి ప్రక్కనయున్న అక్షరకాలములను గలిగినవై యుండును.

జాతీయరచనలు :— దేశమునకుగాని, దేశ నాయకులకుగాని దేశముయొక్క జాతీయతకుగాని సంబంధించిన రచనలకు గలపేరు. ఉ॥ 'జనగణమన' అను రచనయు 'జయతుజయతు భారతమాతా' అను 'ఖమాసురాగము, ఆదితాళములోని రచనల వంటి రచనలు జాతీయ రచనలకు చక్కని వుదాహరణములగును.

జాతీయరచయితలు :— విజయవంతమైన శ్రీ 'భాన్కరదాసు' వంటి జాతీయ రచనలు రచించు రచయితలకుగల పేరు.

జాతీయసంగీతము :— తమ దేశమునకు సంబంధించినట్టి వివిధ రకములకుచెందిన సంగీతమునకు గలపేరు.

జానుద్వయ :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

జాల్రా :— కేవలము తాళసంబంధమైనట్టి 'లోహజాతి' వాద్యమునకుగల పేరు. దీనిని హరికథా కాలక్షేపములందును భజన కాలక్షేపములందును ముఖ్యముగా వుపయోగింతురు.

జావడ :— సంగీత రచనలలో ఒకరకమునకు చెందిన 'గీతము' అను ఒక పురాతన రచనయొక్క నగభాగమునకు గలపేరు. ఇది దేశీయపదము అగును.

జావళి :—ముఖ్యముగా వినోదముకొఱకు రచింపబడిన సంగీత రచనకు గలపేరు. ఇవిపర్షియన్ ఘజల్సునుండి అభివృద్ధిపరచబడినవి. ఇందుగల సంగీతము తేజోవంత ముగను, ఆకర్షణీయముగను, వేగగమనము గను, శృంగారరస ప్రధానముగను, నాయికా నాయక లక్షణము ననుసరించియు ను వుండును. ఉ॥ 'అప్పుడు మనసు' అను 'ఖమాసు'లోని రచన జావళికి ఒక మంచి వుదాహరణ యగును. శ్రీ ధర్మపురి సుబ్బరాయర్, శ్రీపట్టాభిరామయ్య, శ్రీమాన్ రామనాథపురం శ్రీనివాసఅయ్యంగార్ మొదలగువారు ప్రఖ్యాతిచెందిన జావళీ రచయితలలో ముఖ్యులగుచున్నారు.

# జి

జిక్కిణదరువు :— ప్రాచీనమైన సంగీత రచనలలో ఒకవిధమగు రచనకు గలపేరు.

జింగ్లా :— 20వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధపస.
అవరోహణము—స ని ధ ప మ గ రి స.

జింగ్లాభైరవి :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ స.
అవరోహణము—స ని ధ ప మ గ మ రి స.

జిత :—స్థాయి అలంకారజాతిలో చెప్పబడిన శాస్త్రయుక్తమైన పేర్లలో 7 వది. ఉ॥ స గ రి స, రి మ గ రి, గ ప మ గ మొదలగునట్టివాటికిగల పేరు.

---

# జీ

జీవంతిక :— 17 వ మేళకర్త యగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

జీవంతిని :— 48 వ మేళకర్త యగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ స.

*జీవంతిని :— 48 వ మేళకర్త 'దివ్యమణి'కి 'వెంకటమఖి' పెట్టిన పేరు. ఇది 8 వ 'వసు'చక్రములోని 6 వ మేళమగును.

జీవరంజని :— 2 వ మేళకర్త యగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

జీవరత్నభూషణి :— 38 వ మేళకర్త యగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

జుగుప్స :— భావములు 5 టిలో 5 వదైన స్థాయీ భావమునందుగల 8 విధములలో 7 వదానికి గలపేరు. మిగతవి రతి, ఉత్సాహము, శోకము, విస్మయము, హాస్యము, భయము, క్రోధము అనునవి.

జుజావంతి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి గ స.

జుజాహుళి :— 13 వ మేళకర్తయగు 'గాయక ప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప ధ ని స.
అవరోహణము– స ధ ని ధ ప మ గ స.

జులావు :— 29 వ మేళకర్తయగు 'ధీర శంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– ప ని స రి గ మ ప.
అవరోహణము– ప మ గ రి స ని ప.
ఇది పంచమాంత్యరాగమునకు చెందును.

# జూ

జూశాంగదా :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని ధ స.
అవరోహణము– స ధ మ గ స.

# జే

జ్యేష్ట :— నాయికా లక్షణమునందు జెప్పబడిన విధమున ఒక నాయకునికి యిద్దరు నాయికలుండి అందు నాయకుని ప్రియమును విశేషముగ గలిగియుండునది జ్యేష్ట యనబడును. దీనికి యితరమైనది నాయకుని ప్రియమును తక్కువగా గలిగి యుండు రెండవది 'కనిష్ట' యనబడును.

---

# జై

జైమిని :— "భరతుని, నాట్యశాస్త్రము అనెడి 'భరతమ్' వంటి గ్రంథములను వ్రాసిన బ్రహ్మ, జైమిని, అర్జున అను ముగ్గురిలో రెండవ అతనికిగలపేరు. ఈతని 'భరతము' నకును, భరతునియొక్క 'భరతము' నకు తేడాగలదు. ఈతడు నుతన గ్రంథమునందు తాళమార్గములు 12 గా చెప్పియుండెను.

# జో

జోగివి :— జన్యరాగములలో యొక రకమునకు చెందిన రాగమునకు గలపేరు.

జ్యోతిరంజని :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము—స ని ధ ప మ గ మ రి స.

*జ్యోతిరాగము :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' రాగమునకు 'వెంకటమఖి' పెట్టిన పేరు. ఇది 12 వ 'ఆదిత్య' చక్రములోని 2 వ మేళమగును.

జ్యోతిష్మతి :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము—స ని ధ మ ప మ గ రి స.

*జ్యోతిస్వరూపిణి :—72 మేళకర్తలలో 68 వ మేళకర్తరాగమునకుగల పేరు. ఇది 12 వ 'ఆదిత్య' చక్రములోని 2 వ మేళకర్తరాగమగును. ప్రతిమధ్యమరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది షడ్జ, పంచమములనుగాక ష. రి — అం. గాం — ప్ర. మ — శు. ధై — కై. నిషాద స్వరములను గలిగియుండును.

జ్యోత్స్నాప్రియ :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

జోహన్‌స్ట్రాస్ :— యూరప్‌లో క్రీ. శ. 1825 నుండి 1899 వరకునుగల 'ఆర్కెస్ట్రిల్' సంగీతమునకు మిక్కిలి ప్రసిద్ధిగాంచిన గాయకునికిగల పేరు.

---

# జౌ

జౌడగాంధారి :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

# ఝ

*ఝంకారధ్వని :— 72 మేళకర్తలలో 19 వ మేళకర్తకుగల పేరు. ఇది 4 వ 'వేద' చక్రములోని మొదటిమేళమగును. దీనిలో షడ్జ, పంచమములుగాక చ. రి— సా. గాం— శు. మ— శు. ధై— శు. నిషాద స్వరములుండును. శుద్ధమధ్యమరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

*ఝంకారభ్రమరి :— 72 మేళకర్తలలో 19 వ మేళకర్త 'ఝంకారధ్వని' కి 'వెంకటమఖి' పెట్టిన పేరు. ఇది 4వ 'వేద' చక్రములోని 1 వ మేళమగును.

ఝంకారి :— 19 వ మేళకర్తయగు "ఝంకారధ్వని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

ఝంఝూట :— "రాగతాళచింతామణి" అను తెలుగు గ్రంథములో ఇతరులచే

చెప్పబడని తాళములలో 3 వ తాళమునకు గలపేరు.

ఝణాకారి :— 63 వ మేళకర్తయగు "లతాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని ధ స.
అవరోహణము– స ధ ప మ రి గ రి స.

ఝంపతాళము :— "అష్టోత్తర శత తాళము"లగు 108 తాళములలో 85 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 ∪ ।. మాత్రలు 2¼. అక్షర కాలములు 9.

ఝంపతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 తాళములలో 76 వ తాళముపేరు. దీనికి అంగములు 0 ∪ 0∪.

ఝంపెచాపు :— ప్రాచీనకాలములో వాడుకయందున్న చాపుతాళములలోని రకములలోనొకదానిపేరు. దీనికి అంగములు 0 ∪ 0. అక్షరకాలము 5. ఉ॥ సరి । గ । రిగ ॥ రిగ । మ । గమ ॥ గమ । ప । మప ॥ అను విధముగానుండును. ప్రాచీనులు యీ తాళము వేయు విధమును మొట్టమొదట 1 లయ = 1 ఘాతను,తరువాత 1విరామం =1 ఉనిని తమపరి 2 లయలు =2ఘాతలును,పిమ్మట 1 విరామం = 1 ఉని అనియు చెప్పియున్నారు. కాని ఈ పద్ధతి యిప్పటి విధానములో 1 ద్రుతము 1 అను ద్రుతము 1 ద్రుతమునకు సరిపోవునదిగానుండును.

ఝంపెతాళము :— ధ్రువాది సప్తతాళములగు 7 టిలో 4 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు । ∪ 0. అక్షర కాలములు లఘువుయొక్క జాతినిబట్టిమారుచుండును. త్రిశ్రఝంపె 6. చతుస్రఝంపె 7. ఖండఝంపె 8. మిశ్రఝంపె 10. సంకీర్ణఝంపె 12 అక్షరకాలములను కలిగియుండును.

ఝల్లకతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 తాళములలో 104 వతాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 । ।. మాత్రలు 4. అక్షరకాలములు 16.

# ఝా

*ఝాలవరాళి :— 72 మేళకర్తలలో 39 వ మేళకర్తకుగల పేరు. ఇది 7 వ 'ఋషి' చక్రములోని 3 వ మేళకర్తయైన ప్రతిమధ్యమరాగమగును.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జపంచమములు గాక శు.రి– శు. గాం–ప్రతి.మ–శు. ధై–కా.నిషాద స్వరము లుండును.

# ఝి

ఝిఘావళి :— 39 వ మేళకర్తయగు "ఝాలవరాళి" యొక్క జన్యరాగము.
ఆరోహణము–స గ రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

ఝూంపటాతాళము :— ఆదితాళమునకు ప్రాచీనులు పెట్టినటువంటి మరియొక పేరు.

ఝూంబకుడు :—గానము చేయునప్పుడు గొంతు చుట్టునుగల నరములు బయటికి కనుపడునట్లుగా బిగపట్టి పాడునటువంటి గాయకునికి గలపేరు. ఇది గాయకదోషములు 25 టిలో 13 వ రకమునకు చెందును.

# ట

టక్క :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' జన్యమైన వక్రషాడవ- సంపూర్ణరాగము.

ఆరోహణము- స గ మ ప మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

# టా

టాదినవకము :—72 మేళకర్తలయొక్క సంఖ్యలను సులభముగా తెలుసుకొనుటకు యేర్పఱచిన సూత్రగణితము అగు క, ట, ప, యాది పధకములో 2వ వరుసకు పేరు. ఈ టాదినవకములో ట. మొదలు ధ వఱకుగల 9 అక్షరములు అనగా ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ అనునవి వుండును. ఉ॥ ధేనుకరాగము. ఈ పేరులోగల 'ధే' అను అక్షరము టాదినవకములో 9 వ అక్షరము గనుక 9 వేసి రెండవ 'ను' అనుఅక్షరము నకారముశూన్యమను ప్రమాణమున సున్న (౦) ను ప్రక్క వేయవలెను. అప్పుడు 90 అగును. దానిని త్రిప్పి వేసినచో 09 అగును. అంకెకు ముందుగల సున్నకు విలువలేదు గనుక 'ధేనుకరాగము' 9 వ మేళకర్త యగునని గ్రహింపవలెను. ఈ విధముగా కటపయాది సూత్రముచే 72 మేళకర్తలయొక్క సంఖ్యలను సులభముగా తెలిసికొనుటకు వీలగునని గ్రహింపవచ్చును.

ట్రాన్సిలియెంట్ స్కేలు (Transilient Scale) :— రాగ విభాగములలో నొకటియగు వర్జరాగములకు ఇంగ్లీషులో చెప్పబడినటువంటి పేరు.

# టి

టిట్టిభధ్వని :— 11 వ మేళకర్తయగు "కోకిలప్రియ" యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

# టీ

టీక :— 9 వ మేళకర్తయగు "ధేనుక" యొక్క జన్యమైనవక్రసంపూర్ణ రాగము.

ఆరోహణము- స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి గ స.

# టు

టుమిరి :— హిందూస్థానీ సంగీతములో పాడబడు ఒకరకపు సంగీత రచనకు పేరు.

ట్యూనింగ్ ఫోర్కు (Tuning Fork):- లోహముతో చేయబడి సాధారణముగా నుపయోగించు వివిధశృతులను తెలుపుచుండు ఒక చిన్న సంగీత పరికరము. ఇది సంగీతము ప్రదర్శించు జంత్రగాత్రజ్ఞులు వారికి కావలసిన ఆధారశృతిని దీనివలన తెలుసుకొని వాద్యములందు శృతిని చేసుకొనుటకు వుపయోగకరముగా నుండును.

# టె

టెంపొ (Tempo) :— ఒక సంగీత కచ్చేరి రంజకముగానుండి శ్రోతలకు విసుగులేక మొదటినుండి చివరవఱకు ఆకర్షింప బడినచో ఆ సంగీత కచ్చేరిలో టెంపో బాగున్నదని చెప్పబడుటకు వుపయోగించు ఇంగ్లీషు పేరు.

# టో

టోనిక్‌స్వరము (Tonic Svaram) :— 'ఆధారషడ్జ'మనబడుమధ్యస్థాయియొక్క షడ్జమును ఇంగ్లీషులో చెప్పబడు పేరు.

టోనిక్‌యొక్క మోడల్‌షిఫ్ట్ పద్ధతి :— ఆధారషడ్జమును మరియొక స్వరమునకు లేక స్వరస్థానమునకు మార్చి మొదటి స్వరములనే పాడుట లేక మొదటి స్వరస్థానములందే వాయించుటకుగల ఇంగ్లీషు పేరు. దీనినే గ్రహభేదమనియు, గ్రహస్వర భేదమనియు, శృతి భేదమనియు వేరువేరు విధములుగా చెప్పుదురు. ఈ పద్ధతి శంకరాభరణము, శ్రీరంజని, మోహన వంటి క్రమమైన సామరస్యముగల రాగములందు మాత్రమే అనగా ఆరోహణ అవరోహణములు సమముగా నుండి ఒకేరకపు స్వరములను గలిగిన రాగములందు మాత్రమే ప్రదర్శింపవచ్చును. ఉ॥ శంకరాభరణ రాగము నందు చతుశ్శృతి రిషభమును షడ్జముగచేసి అదే స్వరస్థానములలో రాగము ఆలాపించిన 'ఖరహరప్రియరాగము'గను అంతర గాంధారమును, షడ్జముగజేసి అదే స్వరస్థానములలో రాగము ఆలాపించిన 'తోడి' రాగముగను, శుద్ధ 'మధ్యమమును' షడ్జముగజేసి అదే స్వరస్థానములలో రాగము ఆలాపించిన 'కల్యాణి' రాగముగను వినిపించును. ఈవిధముగా ఆలాపించుట రాగాలాపనలోని ఒక ప్రత్యేక విశేషముగా నెంచబడును.

# తా

తాయప్రబంధము :— గీతమునుబోలిన ఒకవిధమైన రచనకుగలపేరు. ఇందుగల ప్రత్యేకలక్షణ మేమనగా దీనిలో పాటము లేక సోల్కట్టు (జతులు) యుండును. ఇది ముఖ్యముగా అభ్యాసగానమునకు చెందినదిగా యుండును. వీణ విద్యార్థులు

వీణావాద్యమునందు మీటు శాస్త్రమును అభివృద్ధి పఱచుకొనుటకు యీ రచనలు యెంతయు సహకారిగా నుండును.

తాయప్రబంధ రచయితలు :— ప్రాచీన వాగ్గేయకారులగు పురందరదాసు (16 శ.) వెంకటమఖి (17 శ.) మొదలగువారు అనేక 'తాయ' ప్రబంధములను రచించుటచే అట్టి రచయితలకు గల్గినపేరు.

తాయమ్ :— ఇది 'తాయము' నకుగల మరియొక పేరు.

తాయము :— రాగాలాపనలో యేదైన నొక స్వరమును స్థాయిగా నుంచుకొని పాడుటను 'తాయము' అని చెప్పబడును.

అనగా రాగములందు గ్రహస్వరమును వాది, సంవాదులుగా పాడుటనే 'తాయ' మనబడును. ఉ॥ శంకరాభరణ రాగము పాడునపుడు శుద్ధ మధ్యమమును షడ్జముగ జేసుకొని అచ్చటనుండి కల్యాణిరాగము ను పాడినచో ఆధారశృతిలో మొదటి శంకరాభరణరాగము చెడకుండావుండును. ఇటుల రాగాను సారముగ 4 గ్రహస్వరములవరకు యేర్పఱచుకొని ఆరోహణ, అవరోహణములందు సంచరించి అన్య రాగ కళలను జూపుచూ ఆధారశృతికి వచ్చి ప్రధానరాగకళను జూపించి గానము చేయుట 'తాయ' మని చెప్పబడును. ఇది గాత్ర గానమునందు మాత్రమే చేయ దగినదిగా నుండును.

---

# డ

డప్పు :— గుండ్రముగానుండి ఒకవైపు చర్మము మూయబడిన ఒకరకపు వాద్యమునకు గలపేరు. ఇది గ్రామదేవతల వుత్సవములందును పన్నులు వగైరాలు కట్టవలసినపుడును, బాలబాలికలు తప్పిపోయినపుడును ఎట్టివానిచే దండోర వేయించుటకు వుపయోగింతురు. దీని మధ్యకొలత షుమారు 20 అంగుళములు వుండును.

డ్రమ్(drum) :— కొయ్య, లేక కంచుతో చేయబడిన గుల్లకు ఒకవైపు చర్మపు మూతగల 'అవనద్ధ వాద్యము' నకు ఇంగ్లీషులోని పేరు.

డమరు :— 'నటరాజుని' చేతిలో ధరింపబడు చర్మసంబంధమైన ఒక చిన్న రకపు లయవాద్యమునకు గలపేరు.

డమరుకప్రియ :— 31 వ మేళకర్తయగు "యాగప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

డమరుకము :— 'డమరుక' అను చర్మవాద్యము నకుగల మరియొక పేరు.

డమరుయతి :— ఒకతాళ ఆవర్తములో గల అంగములుఉడుక లేక "హుడుక్క" వాద్యమువలె నడుమ కుఱుచగా నుండి రెండు ప్రక్కలను పెరిగియుండు అంగ

ములు గలదానికి 'డమరుయతి' లేక 'వేద మధ్యమయతి' యనికూడ చెప్పుదురు. ఉ॥ 3 8 । 0 ◡ 0 । 8 3. ఈ విధముగా అంగములు వుండును. ఇది తాళదశ ప్రాణములందలి యతిలోని ఒక రకము.

డమారము :— చర్మవాద్యములోని ఒక రకమునకు చెందిన జంట వాద్యము. వీటికి ఒక వైపుననే చర్మపు ఘాతలు వుండును. దక్షిణ ఇండియాలో దేవతా వుత్సవములందు దీనిని వాయించుచుందురు.

డయొటోనిక్ ఇంటర్‌వెల్ :— పూర్ణ ద్విశ్రుతి విశ్రాంతికి గల ఇంగ్లీషు పేరు.

డవసమ్ :— 'అవనద్ధ వాద్యము'లలోని ఒకరకమునకు యివ్వబడినటువంటి పేరు.

---

## డా

డాక్ :— ఢోలు రకమునకు చెందిన చర్మసంబంధమైన వాద్యములలో ఒకపెద్దరకమునకు చెందిన వాద్యముపేరు. దీనిని ఉత్తర హిందూస్థానములో వాడుదురు.

డాక :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

డాన్సుమ్యూజిక్ :— అప్లైడ్ సంగీతములోని ఒక ముఖ్యభాగమునకుగల ఇంగ్లీషు పేరు. ఇందు సాహిత్యము ప్రధానముగను సంగీతము సాహిత్యముయొక్క భావములను బాగుగా ప్రదర్శించుట కుపయోగించు సాధనముగను వుండి నిరాడంబరముగా నుండును. దీనిలో క్లిష్టమైన సంచారములంగాని సంగతులుగాని వుండవు. 1½ స్థాయిలోమాత్రమేవుండును. ముఖ్యముగా యీ నాట్య సంగీతము నృత్యమునకు సంబంధించినస్వరజతులు, పదవర్ణములు, జావళ్ళు, పదములు అష్టపదులు, తిల్లానాలు మొదలగు శృంగారరస ప్రధానముగు రచనలతో కూడి వుండును.

## డి

డిండిమ :— "రామాయణము"లో పేర్కొనబడినఒకచిన్నరకపుచర్మవాద్యము.

డిక్షనరీ ఆఫ్ సౌత్ ఇండియన్ మ్యూజిక్ అండ్ మ్యూజిషియన్స్ :— మద్రాసు విశ్వవిద్యాలయ సంగీత శాఖాధ్యక్షులును, పలువిధములగు కర్నాటక సంగీత గ్రంథములను రచించినట్టి శ్రీ ప్రొఫెసర్ 'పి. సాంబమూర్తి' (B. A; B. L;) చే A నుండి F వరకు ఇంగ్లీషులో వ్రాయబడిన 'సంగీత నిఘంటు' గ్రంథముయొక్క ఒక భాగమునకు ఇంగ్లీషు పేరు.

డెక్ :— ఇది ఒకరకమైన చర్మవాద్యము.

డెబ్బదిరెండు మేళకర్త రాగమాలిక :— సుప్రసిద్ధ వాగ్గేయకారుడైన శ్రీ 'మహా వైద్యనాథయ్యర్' వ్రాసిన 72 మేళకర్తలం దుగల రాగమాలికా రచనకు పేరు. ఇది సంగీత రచనలలోకెల్ల మిగుల పెద్దది యగును. దీనిని ప్రదర్శించుటకు నెక్కువ కాలము పట్టును. 72 మేళకర్తల రాగ సంప్రదాయముల నలవఱచుకొనుటకు కర్ణాటక సంగీతములో యింతకంటె ప్రమాణమగు సంగీత రచనయే లేదని చెప్పవచ్చును.

## డే

డేంకితాళము :— "అష్టోత్తరశత" తాళములగు 108 తాళములపట్టికలో 60 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8 I S. అక్షరకాలములు 20. (గానభాస్కరము.)

డేంగి :— దక్షిణ భారతములో ప్రసిద్ధ దేవాలయములందు జరుగు దేవుని పూజలలో వాయింపబడు "నవసంధి" తాళములలో నొకదానికి గలపేరు.

## డౌ

డౌహరా (దోహరా) :— మహారాష్ట్ర సంప్రదాయము ననుసరించి చేయబడు హరికథా కాలక్షేపములందు పాడబడునట్టి ఒక రకమైన సంగీత రచనలకుగల పేరు.

## డో

డోక :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యమైన ఔడవరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

డ్రోన్ (Drone) :— కీనోటు లేక శ్రుతి వాద్యమునకుగల ఇంగ్లీషు పేరు. అనగా శ్రుతికి నుపయోగింపబడు ఒక సంగీత పరికరము. ఇది సంగీత కచ్చేరీలలో ఆద్యంతములవరకు ఉపయోగింపబడును. ఉ॥ తంబుర, ఏక్తార్, ఒత్తు, హార్మోనియము మొదలగునవి.

డోంబక్రియ :— 'సంగీతసుధ' అను గ్రంథములో పేర్కొనబడిన 20 భాషాంగ రాగములలో నొకదానికి గలపేరు.

డోంభులితాళము :— "అష్టోత్తరశత" తాళములగు 108 తాళముల పట్టికలో 78 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I I ∪. మాత్రలు 2¼. అక్షరకాలములు 9. గా నుండును.

డోంబులీతాళము :— 'రత్నాకర' గ్రం

ధ సమగు 120 తాళములలో 70 వ తాళమునకు పేరు. దీనికి అంగములు । ◡ । ◡.

డోరిక్ (Doric) :— ప్రాచీన కాలములోని గ్రీకులు మనము పాడునటువంటి 'హనుమతోడి' రాగమునకు దాదాపుగా సమానమగు మోడల్ షిఫ్టు పద్ధతిని కని పెట్టినటువంటి దానికిచెప్పబడు పేరు.

డోలక్ :— పాట ననుకరించి వాయింపబడు చర్మ సంబంధమైన లయవాద్యమునకుగల పేరు. దీనిని ఉత్తర దేశమునందు యెక్కువగా వాడుదురు.

డోలము :— స్ఫురితములోని 2 వ దైన "ప్రత్యాఘాతము" నకుగల మరియొక పేరు. ఇది అవరోహణ జంట స్వరములలో రెండవ స్వరమునుకొట్టి మీది స్వర ఛాయను రప్పించుటయగును. ఉ॥ స స, అనునది స రి స, అగునట్లుచేయుట యగును.

డోలు :— నాగస్వర సంగీతమునందు ప్రక్కవాద్యముగా నుపయోగించు చర్మ సంబంధమైన లయవాద్యమునకు 'డోలు' అని పేరు. ఇది దక్షిణభారతములో నాగస్వర వాద్యమునకు సంబంధించినంతవరకు ఒక ప్రాముఖ్యమైన లయవాద్యముగా యెంచబడుచున్నది.

డోలోత్సవము :—ఇది భజనపద్ధతిలోగల రెండవభాగము. దీనిని ప్రారంభించుటకు దివ్యనామ సంకీర్తనలు, నలంగు, పద్యము, లాలి, ఊంజల్ మొదలగునవి పాడుదురు. ఏకాదశి మొదలగు ఇతర ప్రాముఖ్యమైన పవిత్ర దినములందు సనాతనభక్తులు భజనలందు యిట్టి డోలోత్సవము చేయుదురు.

డోలోత్సవపద్ధతి :— వివిధ రకములగు కీర్తనలతో ఒక క్రమమైనవిధానమునందు చేయబడు డోలోత్సవమునకు గలపేరు.

డోవలక్ :— డోలక్ వాద్యములో చేరిన ఒక చిన్నరకము. దీనిని యిప్పుడు దక్షిణ ఇండియాలో సంగీత కచ్చేరీలయందుగూడ నుపయోగించు చున్నారు. యావద్భారతములో ముఖ్యముగా ఫిలిమ్ సంగీతమునందు యీ వాద్యము నేడు ప్రముఖపాత్ర వహించుచున్నదని చెప్పవచ్చును.

## డౌ

డౌమ్య :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి గ మ ప ధ ని ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది వక్రసంపూర్ణరాగము. [స్వ.ప్ర.సా.]

డౌర్గేయణి :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

డౌలిక :—1వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
వక్రసంపూర్ణషాడవము. [సం.స్వ.ప్ర.సా.

ఢ :— ఇది ఒకరకపు చర్మవాద్యము.

ఢక్క :—చర్మవాద్యములలోని ఒక పెద్ద ఎకమునకుగల పేరు.

ఢక్క (టక్క) :— 15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము.
ఆరోహణము-సరిసగమపమగమధనిసధస.
అవరోహణము- సనిధమపమగమరిగస.

ఢంకా :—దేవాలయములందు వాయించు నొకరకపుచర్మ వాద్యము.

ఢంకి :— దక్షిణభారతమున దేవాలయములలో జరుగు సంగీత ప్రదర్శనములలో 'ముఖవీణ'కు ప్రక్కను వాయింపబడు నొకరకపు చర్మ వాద్యమునకు పేరు.

---

## ఢా

ఢాలు :— దశవిధ గమకములను 10 టిలో 3 వది. తక్కినవి ఆరోహణ, అవరోహణ, స్ఫురిత, కంపిత, ఆహత, ప్రత్యాహత, త్రిపుచ్ఛ, ఆందోళన, మూర్ఛన యనునవి. వీటినిగుఱించిన వివరములు 'శోహాళాచార్యులు' 'భరతము' అను తన గ్రంథములో పేర్కొనెను.

---

## ఢె

ఢెక్కితాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములపట్టికలోని 58వ తాళమునకు యివ్వబడిన పేరు. దీనికి అంగములు 8 । 8. = 1 గురువు, 1 లఘువు, 1 గురువుగానుండును. [గా. భా.]

## ఢే

ఢేంకా :— దక్షిణ ఇండియాలో వాడబడునటువంటి 'కిన్నరి' వాద్యమునకు సంబంధించిన మెట్లుగలిగిన ఒక చిన్నరకము వాద్యమునకు పేరు. ఇది రెండు టెంకాయ చిప్పలతో చేయబడినదిగా యుండును.

ఢేంకికతాళము :— శాస్త్రీయమైన 108 తాళములలోని ఒక తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 । 8. మాత్రలు 5. అక్షరకాలములు 20. [డి. ఆ. సౌ. ఇం. మ్యూ.]

## ఢొ

ఢొంక :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ స.

**ఢోల్ :—** దీనినే తెలుగులో ఢోలు అనియు తమిళములో 'తవిల్' అనియు చెప్పుదురు. ఇది నాగస్వర సంగీతమునకు ప్రధానమైన ప్రక్క వాద్యముగా నుపయోగింపబడు చర్మవాద్యము. దీని నాదము మాధుర్యముగను చాల గంభీరముగాను వుండును. దక్షిణ భారతములో ప్రతి శుభకార్యములందును దేవతా వుత్సవములందును నాగస్వరమునకు ఈ ఢోలు వాద్యమును విధిగా నుపయోగింతురు.

**ఢోలక్ :—** భారత దేశములోని అతి ప్రాచీనమైన ఒక చర్మవాద్యము. ఇది చాల నిరాడంబరముగా తయారు చేయబడు వాద్యముగానుండును.

**ఢోల్కి :—** ఢోలులోని ఒక చిన్న రకమునకుగల పేరు. దీనిని 'దక్కను' ప్రాంతములో స్త్రీలు సయితము వాయించుదురు.

**ఢోరిక :—** 'హంస విలాసము' అను గ్రంథములో పేర్కొనబడిన ఒక రాగము.

# త

**త—గణము :—** తాళవిధానములో వుపయోగింపబడు 8 గణములలో 8 వ గణమునకు గలపేరు. దీనికి అంగములు 2 గురువులు 1 లఘువు. అంగసంజ్ఞలు ఽ ఽ I.

**తట :—** సంగీతవాద్య విభజనలోని 1 వ రకమునకు చెందినవాద్యమునకు పేరు.

**తటస్థములు :—** "ఉద్దీపన విభావము" లోని 4 రకములలో 4 వ దానికిగలపేరు. ఉపభోగోద్దీపనములుగ నుండు గృహములు, పొదరిండ్లు, భూరుహములు, చెలువులు, ఏఱులు, కీరకోకిలములునిండియుండు రసాల వృక్ష ప్రదేశములు, హంసములునిండియుండు తటాక తీరములు, మలయ మారుతము, మేఘ నాదము, గానము, క్రీడలు మొదలగునవి తటస్థములుగా చెప్పబడును.

**తట్టు :—** సంగీత కాలమును లెక్కించుటకై వేయబడు ఒక దెబ్బ లేక ఘాతకుపేరు.

**తడమీటు :—** వీణావాద్యములో త్రిశ్ర జాతియందుగల మూడవ అక్షరమును నడిమి వ్రేలితో మీటుటకు గలపేరు.

**తత్వబోధకమగు పాటలు :—** జీవిత మనగా నేమి? ఋషుల ప్రవృత్తిలో జీవిత మెటుల గోచరించును? పెద్దల సుద్దులు యెట్లున్నవి? అను విషయములను బోధించునట్టి కీర్తనలకు గలపేరు.

**తంతి :—** సంగీతవాద్యములలో తంతి వాద్యముల కుపయోగించు తీగెకు తంతి అనిపేరు. ఇది అనేకరకములుగానుండును. ఇది ఉక్కుతోను, యిత్తడితోను, నరముతోను, నరము లేక పట్టుపై చుట్టబడిన జల్తారుతోను తయారు చేయబడును. వీటిని వీణ, వయొలిన్, గోటు, సారంగ్, దిల్రుబ, సితార్, ఎస్రాజ్ మొదలగు తంతి వాద్యములకు ఆయావాద్యములకు తగినట్లుగా వుపయోగింతురు. ఇవిగాక గెత్తు,

తంబుర, ఏక్తార్, వంటి శృతి, లయ వాద్యములకు కూడా వుపయోగింతురు.

తంతివాద్యములు :— తంత్రులు వేయ బడి వాయింపబడు అన్నిరకములగు వాద్యములకు గలపేరు.

తంత్రిలీల :— 40 వ మేళకర్త యగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

తంత్రులుగల శృతులు:—బహిరంగముగ కనుపించు తంత్రులను మీటిగాని, రాపిడి చేసిగాని ప్రయోగింపబడు శృతి వాద్యముల పేరు.

తంత్రీసాధని :— తంత్రులు వుపయోగింపబడి వాద్యమొనర్చు అన్నిరకముల సంగీత, శృతి, లయ వాద్యములకుగల పేరు.

తండెపురందర విఠల :— సంగీతమునకు "ఆదిగురువు" గా చెప్పబడునట్టి "శ్రీ పురందరదాసువిఠలు"ని కుమార్తె రచించిన రచనలందుగల ముద్రకు పేరు.

*తనుకీర్తి :— 72 మేళకర్తలకు 'వెంకటముఖి' కల్పించిన పేర్లలో 6 వ మేళకర్తయగు "తానరూపి"కి గల పేరు. ఇది 1 వ "ఇందు" చక్రములోని 6 వ మేళకర్తరాగమగును.

తనుకీర్తి :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము-స ని ధ ని ప మ గ మరిస.

తప :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములోని కటపయాది సంఖ్యకు సరిపడు 'మిశ్రజాతి మఠ్యతాళము'నకు గల పేరు. దీనికి అంగములు 101. అక్షరకాలములు 16.

తపస్విని :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

తప్పెట :— సాధారణముగా గ్రామములందు జరుగు గ్రామదేవతల ఉత్సవములుగాని, సభలుగాని, ప్రజలకు తెలుపవలసిన ముఖ్యవిషయములుగాని వున్నప్పుడు గ్రామాధికారులు "ఎట్టివాని"చే కొట్టింపబడు ఒక రకపు చర్మవాద్యము. దీనిని ప్రస్తుతము పట్టణములందుకూడా నిత్యజీవితమున కవసరమైన నీరు, దీపములు వగైరాల సప్లయికి భంగము కలిగినప్పుడును, పన్నులు చెల్లింపవలసినప్పుడును, వేలము పాట వేయునప్పుడును, పిల్లలు తప్పిపోయినప్పుడును ప్రజలకు తెలుపుటకు యిట్టి తప్పెటతోనే దండోరా వేయించుట కలదు.

తపోల్లాసిని :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప గ రి స.

త్ర్యంబకప్రియ :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ రి గ మ ప స.
అవరోహణము- స ని స ధ ప మ గ రి స.

**తంబుర** :— తంత్రీ వాద్యములలో చేరి నదై మీటుటతో ధ్వనిని జనింపచేయు ఒక శృతి వాద్యమునకు గలపేరు. ఇది భారత దేశములో ప్రధానమైన సంగీతములగు కర్నాటక, హిందూస్తానీ సంగీతముల రెంటికిని అతి ప్రాముఖ్యంగా వుపయోగింపబడుచున్న శృతి వాద్యము. దీనికి 4 తంత్రులుండును. అవి ప స స స. అను మంద్రపంచమ, మధ్యషడ్జ, మధ్య షడ్జ, మంద్రషడ్జ స్వరముల ధ్వనులు కలిగి యుండును.

**తమిళ రచయితలు**:— ముత్తుతాండవర్, మారిముత్తుపిళ్లై, పాపవినాశ ముదలియార్, అరుణాచల కవిరాయర్, గోపాల కృష్ణభారతి, కవికుంజర భారతి, అచ్యుత దాసర్, ఆనయ్య, రామస్వామిశివన్, ఘనం కృష్ణయ్యర్, అనంతభారతి, చిన్న సామిదాసర్, ముత్తు రామకవిరాయర్, మధురకవి, సుబ్రహ్మణ్య భారతి మొదలగు రచయితలకు గలపేరు.

**తమోమణి** :— 32 వ మేళకర్త యగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

**తరంగము** :— 8 వ మేళకర్త యగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

**తరంగము** :— కృష్ణాజిల్లా వాస్తవ్యుడై 16 వ శతాబ్దమునకు చెందిన 'స్వామినారాయణతీర్థ' యతీంద్రులచే భక్తిశృంగార రసయుతమైన ఉజ్వల రస ప్రధానముగా 12 సర్గలలో రచింపబడిన, శ్రీకృష్ణలీలా తరంగిణి, అను గ్రంథములోని ప్రతి సంగీత రచనకు గలపేరు. ఈ తరంగములు సంప్రదాయ భజనలయందు నేటికిని ముఖ్యముగా పాడుచుందురు.

**తరంగలీల** :— 61 వ మేళకర్త యగు "కాంతామణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— సరిగరిమపధనిధమనిస.
అవరోహణము— స ని మ గ రి స.

**తరంగిణి** :— 26 వ మేళకర్త యగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

***తరంగిణి** :— 72 మేళకర్తలలో 26వ మేళకర్త యగు 'చారుకేశి' కి 'వెంకట మఖి' యేర్పఱచిన పేరు.

**తరణిప్రియ** :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

**తరళము** :— 27 వ మేళకర్త యగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

**తరుణీప్రియ** :— 64 వ మేళకర్తయగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ప మ రి స.

తల్పము :— 49 వ మేళకర్త యగు "ధవళాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

తవముఖారి :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

త్ర్యస్త్రవర్ణతాళము :— శాస్త్రీయమైన 108 తాళముల పట్టికలో 25 వ తాళము. దీనికి అంగములు 100118. అక్షరకాలములు 24.

త్ర్యస్త్రవర్ణరాజతాళము :— 'సంగీతరత్నాకర' గ్రంథస్థమగు 120 తాళముల పట్టికలో 25 వ తాళములోని ఒకరకము. దీనికి అంగములు 11001.

# త్యా

త్యాగరాజ :— 'శ్రీ యమ్. యస్. రామస్వామి అయ్యర్'చే వ్రాయబడిన యొక గ్రంథముపేరు. ఇందు షుమారు 5 లేక 6 వందల త్యాగరాజ కీర్తనములకు మూలమును అర్థతాత్పర్యములును వ్రాయబడి వున్నవి.

త్యాగరాజ అష్టోత్తరశత నామావళి :— 1926 సంIIలో 'పురాణం సూర్యనారాయణ తీర్థులవారి'చే రచింపబడిన త్యాగరాజుని పూజావిధానమున కుపయోగించు 108 విశేషనామములుగల యొకచిన్న నామావళి గ్రంథము.

త్యాగరాజ అష్టోత్తరశత సహస్రనామావళి :— 1952 సంIIలో 'శ్రీ కవికొండల పురుషోత్తమ యోగి'చే రచింపబడిన త్యాగరాజుని పూజావిధానమున కుపయోగించు 108 విశేషనామములు, మరియు సహస్రనామములుగల ఒకచిన్న గ్రంథము.

త్యాగరాజ కీర్తనల సవ్యాఖ్యానము :— శ్రీ 'విస్సా అప్పారావు' యొక్క సంపాదకత్వమున 'శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి'చే రచింపబడి రాజమండ్రి 'గానకళా పరిషత్'వారిచే ప్రకటింపబడిన యొక గ్రంథము పేరు.

త్యాగరాజ కీర్తనలు :— 'ప్రభాత్ పబ్లిషింగ్' వారిచే 1941 సంIIలో ప్రకటింపబడిన ఒక చిన్న పుస్తకము. దీనిలో కొన్ని త్యాగరాజ కీర్తనలకు సాహిత్యము మాత్రమే గలదు.

త్యాగరాజనుత :— 'శ్రీ త్యాగరాజు' తన రచనలలో పెట్టుకొనిన ముద్రలోని భేదములలో ఒకరకము.

త్యాగరాజ పంచరత్నములు:— 'శ్రీత్యాగరాజు' రచించిన సాహిత్య ప్రధానమైన సుదీర్ఘములగు 5 కీర్తనలకు గలపేరు.

1. జగదానంద - నాటరాగము - ఆది.
2. దుడుకుగల - గౌళరాగము - ఆది.
3. సాధించెనే - ఆరభిరాగము - ఆది.
4. ఎందరోమహాను-శ్రీరాగము - ఆది.
5. కనకనరుచిరా- వరాళి - ఆది.

త్యాగరాజవినుత :— శ్రీ 'త్యాగరాజు' తన రచనలలో పెట్టుకొనిన ముద్రలలోని భేదములలో ఒకరకము.

త్యాగరాజసన్నుత :— శ్రీ 'త్యాగరాజు' తన రచనలందు పెట్టుకొనిన స్వనామ ముద్రలోని భేదములలో ఒకరకము.

త్యాగరాజస్వామి :— 'త్యాగయ్యగారు' శ్రీరామచంద్రునిగూర్చి 96 కోట్ల రామ తారకమంత్రము జపించిన 'తిరువారూరు' లోని ఆలయమందలి 'దేవునికి' గలపేరు.

త్యాగరాజస్వామి కీర్తనలు :— 'త్యాగరాజు' రచించిన పలువిధములగు రచనలు గలగ్రంథముపేరు. అనగా శివ, రామ, విష్ణు, త్రిపురసుందరి, గణపతులపై రచించిన కీర్తనలేగాక ప్రహ్లాద భక్తవిజయము, నౌకాచరిత్రము వంటి ప్రబంధ రచనలు కూడ కేవలము సాహిత్యముతో ప్రకటింప బడియున్న 6 భాగముల గ్రంథము.

త్యాగరాజ హృదయము :— శ్రీ మాన్ 'కె. వి. శ్రీనివాసఅయ్యంగారి'చే శ్రీత్యాగరాజు రచనలలోని ప్రాముఖ్యమైన 225 కృతులను స్వర సాహిత్యములతోను, అర్థ తాత్పర్యములతోను, రాగ లక్షణ ములతోను వ్రాయబడి ప్రకటింపబడిన గ్రంథము. ఇది 3 భాగములుగా ప్రకటింప బడినది.

త్యాగరాజాష్టపది :— 'వెంకటమఖి' 'శ్రీ జయదేవు'ని రచనల ననుసరించి 'త్యాగరాజస్వామి దేవుని' స్తుతించుచూ రచింపబడిన 24 అష్టపదులకు గలపేరు.

త్యాగరాజు :— సంగీత త్రిమూర్తులలో నొకరైన శ్రీ త్యాగయ్య ఐహిక సంబంధమైన విషయములందు జేసిన గొప్ప త్యాగమునకు దేశీయులు ఆయనను త్యాగశ్రేష్టునిగా నెంచి పిలువబడిన పేరు.

త్యాగరాజు ఆత్మవిచారము :— 'శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు'చే రచింపబడిన ఒక గ్రంథమునకు పేరు. ఇందు షుమారు 600 త్యాగరాజ కృతులకు భావముమాత్రము వ్రాయబడియున్నది.

త్యాగరాజుని నౌకాచరిత్రము :— ప్రొఫెసరు శ్రీ పి. సాంబమూర్తి B.A., B.L. చే 1939 సంIIలో ప్రకటింపబడిన యొక గ్రంథముపేరు.

త్యాగరాజుని వర్ధంతి :— సుకవి సార్వభౌమ 'శ్రీ త్యాగరాజు' సిద్ధిబొందిన పవిత్ర దినమగు పుష్యబహుళ పంచమి యందు 'తిరువయ్యారు' లోను తదితర అనేకపట్టణములలోను ప్రతిసంవత్సరము జరుపు ఆరాధనోత్సవములకు పేరు.

తాండవప్రియ :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి గ మ ప స.

అవరోహణము— స ప మ గ రి స.

తాండవం :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స గ ప ధ ని స.

అవరోహణము— స ని ధ ప గ స.

తాండవము :— నృత్యములోని 2 విధములలో మొదటిదైన పురుష నృత్యమునకుగల పేరు.

తాండవోల్లాసిని :—35 వ మేళకర్తయగు 'శూలిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

తాన్‌సేన్ :— 'అక్బరు చక్రవర్తి' యొక్క ఆస్థాన గాయకుడైన సుప్రసిద్ధ సంగీత విద్వాంసునికిగల పేరు. ఈతడు అక్బరు ఆస్థానములో 'దీపక్' రాగమును ఆలాపించి చీకటిగానున్న ఆ దర్బారు హాలును దీపకాంతులతో ప్రకాశింపజేసినట్లు ప్రతీతిగల మహనీయుడు.

తాన :— అలంకార విషయమునకు సంబంధించినట్టి ఒక విధమగు గానము. ఇది కొన్ని స్వరములను సంయోగము చేసియు మార్చియు పాడబడును.

తానప్పాచార్యులు :— 'వెంకటమఖి' తన అన్నగారగు 'యజ్ఞనారాయణ దీక్షితారు'ని వద్ద సంగీతాభ్యాసము చేసిన అనంతరము అతనికి సంగీతమును అభివృద్ధి చేసిన గురువు అగు ఉత్తర దేశపు గాయకునికి గల పేరు.

తానమ్ :— రాగాలాపనలోని రెండవ భాగమైన మధ్యమకాల గానమునకు పేరు. దీనినే 'మకరిణి' అనియు 'నర్తని' అనియు చెప్పుదురు.

తానమ్ :— స్వరముల విస్తరింపు లేక గుణించుటకలిగి యున్నను ఒకటికొకటి సంగీత విధానము.

తానము :— దక్షిణాత్య గానపద్ధతిలో 'తెన్నా' అను పదమునుండి స్వీకరింపబడినదై తానమని సంస్కరింపబడి క్రమేణా "అనంతానంతానంతా" అను సర్వేశ్వరుని నామోచ్చారణ సూచకముగ వివరింపబడిన పేరు.

తానరంజని :— 63 వ మేళకర్త యగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప స.
అవరోహణము— సధప నిసధపమగరిస.

*తానరూపి :— 72 మేళకర్తలలో 6 వ మేళకర్తకు గలపేరు. ఇది I వ 'ఇందు' చక్రములోని 6 వ మేళమగును. ఇందు షడ్జపంచమములే గాక, శు. రి–శుం గాం– శు. మ – ష. ధై–కా. నిషాద స్వరములుండును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

తానవర్ణమార్గదర్శి :— సుప్రసిద్ధ వాగ్గేయకారుడై "విరిబోణి" అను భైరవి రాగములోని ప్రసిద్ధ ఆటతాళ తానవర్ణమును రచించిన 'శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్య'కు గల బిరుదు.

తానవర్ణము :— సంగీతాభ్యాసములో కళోపాసకు లందరిచేతను స్వరజతుల పాఠానంతరం అభ్యసింపబడు సంగీత రచనలకు తానవర్ణములని పేరు. వీటికి పల్లవి, అనుపల్లవి, ముక్తాయిస్వరము, చరణము –

ఎత్తుగడస్వరము లుండును. సాధారణముగా వీటిలో పల్లవి, అనుపల్లవి, చరణములకే సాహిత్యముండును. కాని అరుదుగా కొన్నిటిలో వర్ణమంతటికిని సాహిత్యముండును. ఉ॥ శంకరాభరణము, కాంభోజివంటి రాగములలోగల అటతాళములలోని చిన్నవర్ణములకు పల్లవి, అనుపల్లవి, చరణములకే సాహిత్య ముండుటయు అటతాళములోని పెద్దవర్ణములకు పూర్తిగా సాహిత్యమువుండుటయు గమనించదగును.

తానీకరణము :— గీతలక్షణము గాని లేక ప్రబంధ లక్షణముగాని అనుసరించి యుండి యెడనెడ విళంబ, మధ్యలయలు గలదిగానుండు రచనకు పేరు. ఇది త్రికాలములయందును తాళము పాట సమముగాను ఏకకళగాను పాడదగియుండును.

తాపము :— 14 వ మేళకర్త యగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

తాపసప్రియ :— 14 వ మేళకర్త యగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స
అవరోహణము— స ని మ గ రి స.

తామ్రమరంజని :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ స.
ఇది ఉభయ వక్రరాగమునకు చెందును.

తామలకి :— 29 వ మేళకర్త యగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

తారవము :— 15 వ మేళకర్త యగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

తారంజిత :— 52 వ మేళకర్త యగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

తారజ్యోతి :— 43 వ మేళకర్త యగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి స.

తారతమ్య సంగీతశాస్త్రము :— ప్రపంచములోని వివిధసంగీత విధానములను వాటికిగల పోలికలను, భేదములను, సంబంధములను పరిశోధదృష్టితో గమనించి చూచు శాస్త్రమును తారతమ్య సంగీత శాస్త్రమని చెప్పుదురు.

తారము :— రాగదశ లక్షణములలో 4 వది. ఒకరాగముగాని లేక సంగతులంగాని ఉచ్చస్వరముతో పాడుట తారము లేక ఉచ్చస్వర మనబడును. దీనినే తారగతి యనికూడా చెప్పుదురు.

తారషడ్జము :—పంచస్థాయిలగు 5 టిలో 4 వ తారస్థాయిలోని మొదటి స్వరము. దీనిలో సెకండుకు వచ్చు కంపనముల సంఖ్య 480. తిరుగుసెంట్ల విలువ 1200. ఉ॥ నిషాదాంత్య, ధైవతాంత్య, పంచమాంత్య రాగములు కాని మిగత అన్ని రాగములందు తారషడ్జ ముండును. దీనికిగుర్తు స్వరము పైన చుక్క వుండును.

తారసప్తకము :— పంచస్థాయిలగు 5 టిలో 4 వదైన తారస్థాయిలోగల సప్త స్వరములకు తారసప్తకమని పేరు.

తారస్థాయి :— స్థాయిలు 5 టిలో 4 వ స్థాయియైన హెచ్చు స్థాయికి పేరు. అనగా మధ్యస్థాయికి పైనుండు స్థాయికి తారస్థాయి అని చెప్పుదురు. ఇందుగల ద్వాదశ స్వర స్థానములయందు షోడశస్వరములు వుండును.

తారావళీజాతి ప్రబంధము :— ఏకజాతి ప్రబంధములోని 5 జాతులలో 5 వది. ఇది 2 అంగములను గలిగి 22 భేదములను కలిగియుండును. దీనికి జతిస్వరము ఒక మంచి వుదాహరణమగును.

తావి :—3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

తావూజ్ :— ఉత్తర హిందూస్థానములో వాడబడునట్టి విల్లు లేక కమాను (Bow) తో వాయింపబడు నొక రకపు తంత్రీ వాద్యము. దీనినే 'బాలసరస్వతి' అనియు 'మయూరి' అనియు చెప్పుదురు.

త్రాసము :— భావములు 5 లో 4 వదైన వ్యభిచారి భావములలోని 33 విధములలో 32 వది 'త్రాసము' అని చెప్పుదురు.

తాళగణితము :— తాళప్రకరణములో చెప్పబడిన వివిధతాళములు వాటి అంగములు జాతులు, మాత్రలు, అక్షరకాలము లు మొదలగు వివరములను తెలుపు శాస్త్రము లేక గణితమునకు 'తాళగణిత'మని చెప్పుదురు.

తాళదీపిక :— తాళప్రకరణమును గురించి ప్రత్యేకముగ వ్రాయబడిన యొక గ్రంథము.

తాళ్ళపాక రచయితలు :— 15 వ శతాబ్దమునకు చెందిన 'తాళ్ళపాకం అన్నమాచార్యులు, చిన్నయ్యగార్లకుగల పేరు. వీరు తిరుపతి ఏడుకొండల వెంకటరమణునిపై భక్తిశృంగార రసప్రధానమైన భజన, ఉత్సవ సంప్రదాయమగు అనేక కీర్తనలు రచించిన పుణ్యపురుషులు. వీరి రచనలు అనేకము రాగి రేకులపై వ్రాయబడియున్నట్లు యిటీవలనే కనుగొనబడినవి. తిరుపతి దేవస్థానంవారు వీటిని ప్రకటించుచున్నారు. ఇవి యిప్పుడిప్పుడే ప్రచారములోనికి వచ్చుచున్నవి.

తాళ్ళపాకం రచనలు :—'తాళ్ళపాకం అన్నమాచార్యులు, చిన్నయ్యగార్లు 'తిరుపతి ఏడుకొండల వేంకటేశ్వరు' నిపై రచించిన భక్తి, శృంగారరస భూయిష్టమైన సంకీర్తనములకు గలపేరు.

తాళమాలిక :— పల్లవి పాడునపుడు రాగమాలికవలె వివిధ రాగములందును కల్పనస్వరములను గానము చేయునట్లుగా ప్రఖ్యాతగాయకులు పల్లవి పాడునపుడు అసలు తాళమునుండి యితర తాళముల లోనికి పల్లవిని కుదించిగాని లేక పొడిగించిగాని పల్లవిని తాళమాలికగా ప్రదర్శించెదరు. ఇట్లుపాడిన తదుపరి మొదటి తాళమునకు వచ్చి కొంతసేపు ప్రదర్శించి పల్లవిని ముగింతురు. ఇట్లు తాళమాలికగా పల్లవిని పాడుటలో ప్రాచీనులను 'వీణ కుప్పయ్యర్' కుమారుడు 'తిరువత్తూరు త్యాగియ్య' మిగుల సమర్థుడని చెప్పుదురు.

తాళము :— i హస్తద్వయ సంయోగ వియోగములు కలిగి దశ ప్రాణాత్మకమైన కాలమును తాళమని చెప్పబడును.

తాళము :— ii హస్తములయందు లఘువు ఆదిగాగల అంగములను తెలియజేయు సశబ్ద, నిశ్శబ్ద క్రియలయొక్క కాలపరిమితిని 'తాళము' అని చెప్పబడును.

తాళము :— iii సంగీతకాలమును తెలుసుకొనుటకు వుపయోగింపబడునట్టి ఒక కొలతపేరు. తాళము అను శబ్దమునకు అర్థమేమనగా తాండవము అనగా పురుష నృత్యమనియు, లాస్యము అనగా స్త్రీ నృత్యము అనియు యీ రెండింటిని ఆది కాలమున ఈశ్వరుడు, పార్వతి ప్రదర్శించి రనియు యీ పదముల మొదటి అక్షరముల కలయికయే తా + లా = తాళమయ్యెననియు చెప్పుదురు.

తాళముద్ర :— సంగీత రచనలలో నుపయోగింపబడు ద్వాదశముద్రలగు 12 టిలో 3 వ ముద్రకు పేరు. ఉ॥ (1) తాళమాలిక (2) రాగతాళమాలికలు యిట్టి తాళముద్రలుగల రచనల రకమునకు చెందినవగును.

తాళములనుగూర్చి సంపూర్ణముగ వ్రాసిన గ్రంథములు :— శుద్ధానంద ప్రకాశము, రాగతాళ ప్రస్తారము, రాగతాళ చింతామణి వంటి గ్రంథములును, శిలప్పదికారమ్, పురాణనూరువంటి తమిళ్ గ్రంథములు యీ రకమునకు చెందును.

తాళములపేర్లుగల ప్రబంధములు :— చచ్చరీ, హంసలీల, తురగ (హయ) లీల, గజలీలవంటి ప్రబంధములు యీ రకమునకు చెందినవి.

తాళలక్షణగ్రంథములు :— తాళములను గురించి ప్రత్యేకముగా వ్రాయబడిన తాళలక్షణము, తాళవిషయము, తాళవిధానము, తాళసముద్రము, తాళదీపిక, తాళలక్షణసంగ్రహము మొదలగు గ్రంథములకు గలపేరు.

తాళలక్షణము :— తాళములను గురించి ప్రత్యేకముగ వ్రాయబడిన ఒక గ్రంథమునకుగల పేరు.

తాళలక్షణ సంగ్రహము :— తాళములను గురించి ప్రత్యేకముగా వ్రాయబడిన మరియొక గ్రంథము పేరు.

తాళవనేశ :— 'ధర్మపురి సుబ్బారాయర్' పట్టాభిరామయ్యగార్లు రచించిన శృంగార

రసప్రధానమైన రచనలగు 'జావళీ' లందు పెట్టిన ముద్రకు పేరు.

తాళవాద్యకచ్చేరి :— లయవాద్యము లగు మృదంగము, తబలా, డోలక్, కంజీరా, ఘటంవంటి తాళవాద్యములతో ప్రత్యేకముగా జరుపు వాద్య ప్రదర్శనమునకు పేరు. దక్షిణభారతములోగల కొన్ని ఆల్ ఇండియా రేడియో స్టేషనులందుజరుగు కార్యక్రమములలో అప్పుడప్పుడు యిట్టిప్రదర్శనము మీరు వినవచ్చును.

తాళవాద్యకుడు :— సంగీత కచ్చేరీలలో ప్రక్క వాద్యముగా వాయించు చర్మ, లోహ, మృత్తిక సంబంధమైన లయ వాద్యములను వాయించువానికి గలపేరు.

తాళవాద్యములు :—సంగీత కచ్చేరీలలో ప్రధాన గాయకుడగు గాత్రము పాడువానికిగాని జంత్రము వాయించువానికిగాని సహాయకారిగా ప్రక్క వాద్యముగ వాయింపబడు మృదంగము. డోలక్, కంజీరా, ఘటం, గెత్తు, మోర్సింగు వంటి తాళవాద్యములకుగల పేరు.

తాళవిధానము :— తాళములను గురించి ప్రత్యేకముగ వ్రాయబడిన గ్రంథములలో నొకదానికిగలపేరు.

తాళవిషయము :— తాళములనుగురించి వ్రాయబడిన గ్రంథములలో నొకదానికి యివ్వబడిన పేరు.

తాళసముత్తిరమ్ :— 'వనపాదచూడామణి' చే తాళములనుగురించి తమిళములో వ్రాయబడిన యొక గ్రంథముపేరు.

తాళసముద్రము :— తాళప్రకరణము గురించి ప్రత్యేకముగా వ్రాయబడిన గ్రంథములలో నొకదానికి పేరు.

తాళాధ్యాయము :—శార్ఙ్గదేవునిచే 'సంగీత రత్నాకరము' లో చెప్పబడిన 7 అధ్యాయములలో 5 వ దానికి పేరు.

తాళార్ణవము :— తాళములందలి లక్షణమును తెలియజేయుటకు చేయబడిన ఒక ముఖ్యమగు ప్రబంధరచనకు పేరు. ఇది 'శ్రీ గోపాలనాయకుడు' రచించిన ఆధునిక తాళమాలికకు సరిపోవును.

తాళోదాత్తము :— సంగీత రచనలలో తాళఘాతలుపడు స్వరములందుగాని లేక సాహిత్యాక్షరములందుగాని నొక్కిపాడుటకు 'తాళోదాత్త' మని పేరు.

## తి

తిట్ట :—57 వ మేళకర్తయగు 'సిమ్హేంద్ర మధ్యమము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

తిరత్తిరమ్ :— పురాతన తమిళ సంగీతములోని రాగవిభజనలో 'స్వరాంతర' రాగమునకు యిచ్చినటువంటి పేరు.

తిరన్ :— పురాతన తమిళ సంగీతము లోని రాగవిభజనలో షాడవ - ఔడవ రాగములకు తమిళములో యివ్వబడిన పేరు.

తిరమ్ :— పురాతన తమిళ సంగీతము లోని 'వక్రరాగము'నకు గల పేరు.

తిరస్కరణి :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

తిరిమాత్తిరై :— 'బరతసాట్టియ శాస్త్రమ్' అను తమిళ గ్రంథములోని పంచ తాళములకుగల ఒక ఉపతాళము పేరు.

తిరుచిన్నమ్ :— రంధ్రములు లేక ఊపిరి (గాలి) పోయనవసరములేకనే వాయింప బడునొకవాద్యమునకుతమిళములోనిపేరు.

తిరుపము :— వీణావాద్యములో ఒక స్వరస్థానమందు ఒక అక్షరకాలము నిలిచి తంతిని వ్రేళ్ళతో అదిమిలాగుచూ దాని మీది స్వరచ్ఛాయను రాజేయుటకు పేరు.

తిరుప్పుగళ్ :— 'అరుణగిరినాథరు, పట్టినత్తార్ పాదల్' వంటి ప్రసిద్ధ రచయితలు తమిళములో వ్రాసిన పవిత్ర సంగీత రచనలకు పేరు.

తిరువాచకము :— 'మాణిక్యవాచగర్' వ్రాసిన తమిళ సంగీత రచనకుగల పేరు.

తిలకప్రకాశిని :— 6 వ మేళకర్తయగు తానరూపి యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.

తిల్లాన :—దేశీయ రచనయైన 'తిరితిల్లాన' నుండి తీయబడిన ఒక విధమగు రచన. దీని మాతు స్వరసాహిత్యయుతమగు జతులను కలిగినదైయుండును. ఉ|| తధీమ్ ధీమ్ త. అను ఘరజూరాగములోని 'తిల్లాన'యగును.

త్రికాలము :— ప్రథమ, ద్వితీయ, తృతీయ కాలములు లేక విళంబిత, మధ్య, ద్రుతకాలములకు పేరు. ఇది ఒకదాని కొకటి రెట్టింపైన త్రివిధములగు వేగము లను సూచించును.

త్రిదశరంజని :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

త్రిధాతుకప్రబంధము :— ఉద్గ్రాహ, ధృవ, అభోగములను గలిగియుండునట్టి రెండవజాతి ప్రబంధమునకు గలపేరు. ఉ|| సరససామదాన, అను కాపినారాయణి రాగము, ఆదితాళములోని త్యాగరాజకృతి యిట్టి ప్రబంధమునకు ఒక మంచి యుదాహరణ మగును.

త్రినేత్రప్రియ :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

త్రిపదగ :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

త్రిపుటతాళము :— ధృవాది సప్తతాళములలో 5 వ తాళముపేరు. దీనికి అంగములు । 0 0. అక్షరకాలములు ఆయాజాతినిబట్టి త్రిశ్రత్రిపుట 7. చతురశ్ర త్రిపుట 8. ఖండత్రిపుట 9. మిశ్రత్రిపుట 11. సంకీర్ణత్రిపుట 13. యీవిధముగా అక్షరకాలములు వుండును.

త్రిభంగితాళము :— 'రత్నాకర' గ్రంథస్థమగు 120 తాళముల పట్టికలోని 36వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు । । 8 8.

త్రిభంగీతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 తాళపట్టికలోని 52 వ తాళమునకు యిచ్చినపేరు. దీనికి అంగములు । । 8 8 । ।. మాత్రలు 8. అక్షరకాలములు 32.

త్రిభిన్నతాళము :—'రత్నాకర'గ్రంథస్థమైన 120 తాళపట్టికలోని 21 వ తాళమునకు గలపేరు. దీని అంగములు । 8 3.

త్రిభిన్నతాళము :—'అష్టోత్తర శత'తాళములగు 108 తాళముల పట్టికలోని 18 వ తాళము పేరు. దీనికి అంగములు । 8 3. మాత్రలు 6. అక్షరకాలములు 24.

త్రిభిన్నము :— వీణావాద్యములో మీది తంత్రులలో 1_2_3 తంత్రులను ఎడమచేతి వ్రేళ్ళతోనదిమి కుడిచేతి వ్రేళ్ళతో ఒకే సారి రంజనముకై మీటుటను 'త్రిభిన్న' మనబడును.

త్రిమాత్రకము :— తాళ షడంగములగు 6 టిలో 5 వ దైన ప్లుతమునకుగల విశేష నామములు 5 టిలో నొకటి.

త్రిమూర్తి :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

త్రిమూర్తిప్రియ :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గరి స.

త్రియంగము :— తాళ షడంగములగు 6 టిలో 5 వ దైన ప్లుతమునకుగల 5 విశేష నామములలో 4 వ దాని పేరు.

త్రియామ :— 18 వ మేళకర్తయగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

త్రిలోచనప్రియ :—30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

త్రివర్ణ :— పురాతన గ్రంథస్థమైన 'ఆరోహి' అలంకారజాతిలోని శాస్త్రయుక్తమగు పేర్లలో మొందటిది.

ఉ॥ స రి గ గ గ - రి గ మ మ మ - గ మ ప ప ప - మ ప ధ ధ ధ మొదలగునవి యీ రకమునకు చెందును.

త్రివిధ నాట్యములు :— 'శిలప్పదికారమ్' అను తమిళ ప్రాచీన గ్రంథములో చెప్పబడిన త్రివిధనాట్యములగు సమూహ నాట్యము, వ్యక్తి నాట్యము, బృంద నాట్యములకుగల పేరు.

'త్రివిక్రిణి :— 66 వ మేళకర్తయగు చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

త్రివేణి :— 64 వ మేళకర్త యగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

త్రిశ్ర :— మూడు సంఖ్యను తెలియజేయునట్టి దానికిగల పేరు.

త్రిశ్రఅట :— 35 తాళముల పట్టికలోని 6 వ తాళము. దీనికి అంగములు ।। 0 0. అక్షరకాలములు 10.

త్రిశ్రఏక :— 35 తాళముల పట్టికలోని 7 వ తాళమునకు పేరు. దీనికి అంగములు ।. అక్షరకాలములు 3.

త్రిశ్రగతి :— తాళాక్షరము ఒకటింటికి అనగా ప్రేలికి 3 కళలవంతున నడచునది 'త్రిశ్రగతి'యని చెప్పబడును.

త్రిశ్రచాపు :— శాస్త్రీయమైన 35 తాళములందు చెప్పబడనిదై వాడుకయందుగల చాపుతాళములోని ఒక రకము. దీనికి 2 ఘాతలు మాత్రమేవుండును. మొదటి ఘాతకు ఒక అక్షరకాలము రెండవ ఘాతకు రెండు అక్షరకాలములువుండి మొత్తము 1 + 2 = 3 అక్షరకాలములను గలిగియుండును.

త్రిశ్రజాతి :— లఘువునకు సంబంధించిన పంచజాతులలో మొదటిది. దీనికి అక్షరకాలములు 3. ఒక ఘాతవేసి 2 ప్రేళ్ళను యెంచవలెను. సాధారణముగా యే తాళమునకైనను దాని జాతినిబట్టే లఘువు యొక్క అక్షరకాలములు నిర్ణయింపవలసియుండును. గనుక యేదైన ఒక తాళము పేరు చెప్పునప్పుడు దాని లఘుజాతిని కూడ విధిగా తెలుపవలసియుండును.

త్రిశ్రఝంపె :— 35 తాళముల పట్టికలోని 4 వ తాళము. దీనికి అంగములు । ◡ 0. అక్షరకాలములు 6.

త్రిశ్రత్రిపుట :— 35 తాళముల పట్టికలోని 5వ తాళము. దీనికి అంగములు । 0 0. అక్షరకాలములు 7.

త్రిశ్రధృవ :— 35 తాళములపట్టికలోని 1 వ తాళముపేరు. దీనికి అంగములు । 0 । ।. అక్షరకాలములు 11.

త్రిశ్రమఠ్య :— 35 తాళముల పట్టికలోని 2 వ తాళము. దీనికి అంగములు । 0 ।. అక్షరకాలములు 8.

త్రిశ్రరూపకము :— 35 తాళముల పట్టిక యందు చెప్పబడిన 3 వ తాళమునకు గల పేరు. దీనికి అంగములు 0 I. అక్షరకాలములు 5.

త్రిశ్రలఘువు :— లఘువుకు సంబంధించిన పంచజాతులు అనగా త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ జాతులలోని మొదటిదగు త్రిశ్రజాతికి చెందిన లఘువునకు పేరు. దీనికి అంగములు I. అక్షర కాలములు 3.

త్రిశిరగిరి :— ప్రాచీన వాగ్గేయకారుడైన 'కవిమాతృ భూతయ్య' 'శ్రీ సుగంధి కుంతలాంబాంకితము'గా రచించిన తన రచనలందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

త్రిశృతి ధైవతము :— ద్వావింశతి శృతులగు 22 శృతులలో 17 వ శృతియగు 'ఆలాపినీ' అను దానికి పేరు. దీని విశ్రాంతి 5/3. సెకండుకువచ్చు వేపనములసంఖ్య 400. తిరుగుసెంట్ల విలువ 884. ఉ॥ కాంభోజిరాగము యిట్టి త్రిశృతి ధైవతముగల రాగమునకు వుదాహరణము.

త్రిశృతిపంచమము :— మధ్యమగ్రామములోగల ఒక శృతి తక్కువగల పంచమమునకు గలపేరు.

త్రిశృతిరిషభము :— 22 శృతుల పట్టికలో 4 వ శృతియైన 'ఛన్దోవతి' కి గల పేరు. దీని విశ్రాంతి 10/9. సెకండుకు వచ్చు వేపనములసంఖ్య 266.6. తిరుగు సెంట్ల విలువ 182. ఉ॥ కాంభోజి, భైరవి రాగములు యిట్టి త్రిశృతిరిషభముగల రాగములకువుదాహరణము లగును.

త్రిశృతివ్యవధి :— 10/9 (182 సెంట్లు) విలువగలిగిన ఒక చిన్న స్వరమునకు గల పేరు. ఒక త్రిశృతి వ్యవధికిని ఒక ద్విశృతి వ్యవధికిని మధ్య (3 – 2) 25/24 లేక ఒక న్యూనశృతి తేడావుండును.

త్రిస్వరప్రస్తారము :— అసంపూర్ణ తానములోని 3 స్వరములతోవచ్చు ప్రస్తారమునకు పేరు. ఉ॥ స రి గ అను 3 స్వరములతో స రి గ, రి స గ. స గ రి, గ స రి. రి గ స, గ రి స యీవిధముగ నుండును.

త్రిస్థాన :— 'భావభట్టుని' 22 శృతుల విధానములో పంచమమునకుగల 4 శృతులలో 3 వ దానికి గలపేరు.

త్రిస్థానకము :— మూడుస్థానములయందొకే రూపముగను శ్రోత్రపేయముగ నున్నచో నది 'త్రిస్థానక' మనబడును.

---

## తీ

తీవ్రగాంధారము :— ద్వాదశ స్వరములలో 5 వ స్వరమైన 'అంతరగాంధారము' ను హిందూస్థానీ సంగీతములో వాడునట్టి పేరు.

తీవ్రధైవతము :— ద్వాదశ స్వరములలో 10 వ స్వరమైన 'చతుశ్శృతి ధైవతము'ను హిందూస్థానీ సంగీతమునందు వాడునట్టి పేరు.

**తీ్రవనిషాదము** :— ద్వాదశస్వరములగు 12 టిలో 12 వ స్వరమైన 'కాకలీనిషాదము'ను హిందూస్థానీ సంగీతములో చెప్పబడునట్టి పేరు.

**తీ్రవమధ్యమము** :— ద్వాదశస్వరముగు 12 టిలో 7 వ స్వరమైన 'ప్రతిమధ్యమము'ను హిందూస్థానీ సంగీతమునందు చెప్పబడునట్టి పేరు.

**తీ్రవరిషభము** :— ద్వాదశస్వరములగు 12 టిలో 3 వ స్వరమైన 'చతుశ్శృతి రిషభము'నకు హిందూస్థానీ సంగీతమునందు చెప్పబడునట్టి పేరు.

**తీ్రవవాహిని** :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము—స ని ధ ప మ గ రిగమరిస.
ఇది ఉభయవక్ర సంపూర్ణరాగమునకు చెందిన వుదాహరణయగును.

**తీ్రవశుద్ధమధ్యమము** :— 22 శృతుల పట్టికలో 11 వ శృతియగు 'ప్రసారిణి'కి గల పేరు. దీని విశ్రాంతి 27/20, సెకండుకు వచ్చు వేపనముల సంఖ్య 324. తిరుగుసెంట్లు విలువ 520. ఉ॥ బేగడ, గౌళీపంతు రాగములు. ఇవి తీ్రవశుద్ధమధ్యమముగల రాగములకు వుదాహరణములగును.

**తీ్రవస్వరములు** :— ద్వాదశ స్వరములలో చ. రి - అం. గాం - ప్ర. మ - చ. ధై - కా. నిషాదములు తీ్రవస్వరములనబడును.

**తీ్రవా** :— 'ద్వావింశతి శృతు' లనబడు 22 శృతులలో మొదటి శృతియగు షడ్జమునకు గలపేరు. దీని విశ్రాంతి 1. సెకండుకు వచ్చు వేపనముల సంఖ్య 240. ఉ॥ అన్నిరాగములందు వుండును.

---

# తు

**తుంగనాగ** :— 26 వ మేళకర్తయగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి గ మరిస.

**తుండకినీ** :— 'శార్ఙ్గదేవుని'చే చెప్పబడిన 10 గమకములగు కేణువులలో 7 వ దానిని 'తుండకినీ' అని చెప్పబడును.

**తుంతినా** :— ఇది 'ఏక్తార్' వలెనుండు ఒక శృతివాద్యము నకుపేరు.

**తుంబకుడు** :— సంగీతమును పాడునపుడు బుగ్గలు ఉబ్బించి గానముచేయు 'గాయకుని'కి గలపేరు.

**తురంగ** :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో చెప్పబడిన 'త్రిశ్రజాతి త్రిపుట'కు గలపేరు. దీనికి అంగములు I O O. అక్షరకాలములు 7.

**తురంగ** :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములోని 'ఖండజాతి

రూపక' తాళమునకు యిచ్చినపేరు. దీనికి అంగములు 0 ।. అక్షరకాలములు 7.

తురంగలీల :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మ రి గ స.

తురంగలీలతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 33 వ తాళముపేరు. దీనికి అంగములు 0 ◡ 0 ◡ 0 0.

తురంగలీలతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 లో 36 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 0 0 ।. మాత్రలు 2. అక్షరకాలములు 8.

తురగలీలప్రబంధము :— 'అష్టోత్తరశత'తాళములలోని 36వ తాళముపేరుతో రచింపబడిన ఒక విధమగు ప్రబంధరచనకు గలపేరు.

తృటి :—కాలమునందలి 10 విధములలో 5 వ దానికి గలపేరు. ఇది అనుద్రుతము లో 1/4 వంతు కాలము వుండును.

తృతీయ :—'సామగానము'లో సాధారణముగా వచ్చునట్టి 'గా రీ సా నీ ధా పా' అను ఆరుస్వరములలో మూడవది.

తృతీయకాలము :— సంగీతకాలమును సూచించునట్టి ఒకదానికొకటి రెట్టింపగు వేగములలో మూడవది. దీనినే 'ద్రుతకాల' మనికూడ చెప్పుదురు.

తృతీయతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమగు 120 తాళముల పట్టికలోని 3వ తాళము. దీనికి అంగములు 0 0 0 ◡.

తృతీయరాగవర్ధని :— రాగాలాపనలోని మూడవభాగము. దీనిలో రాగము మధ్యస్థాయి పంచమమునుండి తారస్థాయి షడ్జమువరకు, అచ్చటినుండి తారస్థాయి పంచమము వరకును రాగాలాపనజేసి 3 వ రాగవర్ధనిచే రాగమును ముగించి మధ్యస్థాయి షడ్జమునకువచ్చి నిలుపుటకు పేరు.

## తూ

తూణీరధారిణి :—17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స

తూలిక్య :—15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

## తె

తెన్నకము :— 'భాండీరభాష'లో గల తేనశబ్ద వికారము. ప్రబంధములోని 6 అంగములలో 4వ దానికిగలపేరు. ఇది ఓం తత్సత్, తత్వమసి, అనుటవలన యేర్పడును.

**తెన్నా** :—అనగా 'దక్షిణరాష్ట్రాధిపా' అని దీనికి అర్థము. పూర్వము పాండ్యరాజులలోగల ఒకానొకరాజును అప్పటి గాయకులు 'తెన్నా' అని స్తోత్రముగా రాగములందు సంబోధించుచు పాడుచుండిరని తెలియుచున్నది.

**తెలుగు కీర్తన రచయితలు** :— శ్రీ తాళ్ళపాకం అన్నమాచార్యులు, చిన్నయ్య, భద్రాచల రామదాసు, గిరిరాజకవి, వీరభద్రయ్య, మాతృభూతయ్య, రామస్వామి దీక్షితార్, త్యాగరాజు, శ్యామశాస్త్రి, వీణకుప్పయ్యర్, చెయ్యూరు చెంగల్వరాయశాస్త్రి, సుబ్రహ్మణ్యకవి, తిరువత్తూరు త్యాగయ్య, అల్లూరి వెంకటాద్రిస్వామి, వెంకట విఠలదాసు, కామకోటిశాస్త్రివంటి తెలుగు కీర్తన రచయితలకు గలపేరు.

## తే

**తేజోవతి** :— 62 వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

**తేవారమ్** :— అష్టపదులకంటె (12 శ.) పురాతనకాలమునకు చెందిన తిరుజ్ఞాన సంబంధార్, తిరునావుక్కరసు స్వామి మొదలగువారు రచించిన తమిళములోని భక్తిరచనలకు పేరు. వీటికి రాగము లివ్వబడియుండినను తాళములు మాత్రము రచనలుగా నున్నవి.

**తేవారమ్ రచయితలు** :— తేవారములు రచించిన తిరుజ్ఞానసంబంధార్, తిరునావుక్కరసుస్వామి, సుందరమూర్తిస్వామి అను ముగ్గురు ప్రాచీనతమిళ రచయితలకు పేరు.

## తొ

**తొల్కాప్పియమ్** :— శ్రుతులనుగురించి కూడ కడు హృద్యముగ వ్రాయబడిన అతి పురాతనమగు ఒక తమిళగ్రంథమునకు గలపేరు.

## తో

**తోడయమంగళమ్** :— తిరుపతి 'శ్రీ తాళ్ళపాకంచిన్నయ్య' భజనకు ముందుగా పాడుటకు వ్రాయబడిన ఒక పవిత్రమైన తెలుగు రచనకుపేరు. దీనిని శ్రీ త్యాగరాజు సయితము మిగుల అభిమానించి నిత్యము భజనలో పాడెనని తెలియుచున్నది.

**తోడి** :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.
ఇది షాడవరాగమైనను యీ కాలములో పంచమస్వర ప్రయోగముతో సంపూర్ణ రాగముగనే గాయకులు పాడుచున్నారు.

తోడుమీటు :— వీణావాద్యములో చూపుడు వ్రేలును, నడిమివ్రేలును మార్చి మీటుటకు 'తోడుమీటు' అని పేరు.

తోమరధారిణి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

తోమరపాణి :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్స్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

*తోయవేగవాహిని :— 72 మేళకర్తలలో 16వ మేళకర్తయగు 'చక్రవాకము' నకు 'వెంకటమఖి' పెట్టినపేరు. ఇది 3 వ 'అగ్ని' చక్రములో 4 వ మేళమగును.

# ద

దంకామణి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ప మ గ మ రి స.
[సం. కౌ.]

దండకము :— సంగీతానికి సంబంధించిన దైతాళములేని ఒకనిడుపైన సంస్కృత రచనకుగలపేరు. ఉ॥ శ్యామలా దండకము.

దండయాన :— 50 వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ని ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి గ స.
[సం. స్వా. ప్ర. సా.]

దండహస్తము :— ప్రాచీన గ్రంథములలో చెప్పబడిన 12 విధములగు 'పటహ' (చర్మ) వాద్యములలో నొకదానికి గలపేరు.

దండు :— 'పింగలంద్ర' లో పేర్కొనబడిన ఒకరకపు 'వీణ' కు గలపేరు.

దండోర :— గ్రామములందుగాని పట్టణములందుగాని ప్రజలకు యేదైన అత్యవసర విషయములను తెలుపవలసినపుడు అధికారులు ఎట్టివానిచేత 'తప్పెట' కొట్టించుచూ తెలియజేయబడునట్టి విషయమునకు 'దండోర' అని పేరు.

దత్తా :— 'హుడుక్క' (చర్మ) వాద్యములోని 13 రకములలో ఒకదానికి గల పేరు.

దంతిగిరి :— 'కంచి వెంకటాద్రిస్వామి' అనునతడు తన సంగీత రచనలలో వుపయోగించిన పర్యాయ ముద్రలలోనొకటి.

దత్తిల :— 'దత్తిలమ్' అను సంగీత గ్రంథమును రచించిన గ్రంథకర్తకు గల పేరు. ఈయన శ్రుతులను గుణించియు, తాళములను గుణించియు వ్రాసిన విషయములు సంగీత శాస్త్రములో మిక్కిలి ప్రమాణములుగా నున్నవి.

దత్తిలకోహళీయము :— సంస్కృతములో సంగీతమునుగురించి వ్రాయబడిన ప్రశస్తమైన ఒక గ్రంధము.

దత్తిలము :—'దత్తిలముని'చే సంస్కృతములో వ్రాయబడిన ఒక చిన్న గ్రంధము. ఇది 'త్రివేంద్రమ్'లో ప్రకటింపబడినది. ఇందు 22 శృతులు. షడ్జగ్రామ, మధ్యమగ్రామములు, వాది, సంవాది, వివాది, అనువాది స్వరములు, స-గ్రామ, మ-గ్రామ మూర్ఛనలు, తానములు, 18 శుద్ధ, వికృత జాతులు (7+11=18) 10 జాతుల లక్షణములు ఆరోహి, అవరోహి, స్థాయి, సంచారి వర్ణములు, తాళ దశ ప్రాణములు మొదలగు అనేక విషయములను పేర్కొనబడి యున్నవి.

దత్తిలముని :— 'దత్తిల' అను పేరుగల గ్రంథరచయితకు గల పేరు.

దత్తిలాదిమహర్షిప్రోక్త తాళప్రస్తారలక్షణ సంగ్రహము :—తాళశాస్త్రమునుగురించి సంస్కృతములో వ్రాయబడిన ఒక ప్రశస్తమైన గ్రంథము. ఇందు తాళనిష్పత్తి లక్షణము, తాళదశ ప్రాణలక్షణము, తాళ ప్రస్తారము, పాతాళశ్రేణి, అధ్వలక్షణములను గురించి తెలుపబడి యున్నది.

దంతివసంతము :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని'యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము—స ధ ని ధ ప మ గ మ రి స.
[ప. శే. వ్రా. గ్రం.]

దనాశి :— 'ధన్యాసి'రాగమునకు పురాతన కాలములోవాడినటువంటి పేరు.

దనుర్వీణ :— విల్లు (Bow)తో వాయింపబడు ఒక తంత్రీ వాద్యమునకు పేరు.

దంబోళి :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని మ గ రి స.

దంభాకౌశికము :— 65 వ మేళకర్త యగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి మ గ స.

దయరంజని :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

దయావతీ :— భరత, శార్ఙదేవులచే పేర్కొనబడిన శృతుల వివరణలో రిషభమునకుగల శృతులలో మొదటిదానికిపేరు. దీనికి సెకండుకు వేపనముల సంఖ్య 256/243 వుండును.

దయాస్వని :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

దర్దరిక :— 'గోధిక' అను చర్మవాద్యమునకు సరిపోవునట్టి ఒక వాద్యము.

దర్పణతాళము :— శాస్త్రీయమైన 'అష్టోత్తరశత' తాళములగు 108 తాళముల పట్టికలో 7 వ తాళమునకుపేరు. దీనికి

అంగములు 0 0 8. ఆవర్తమునకుమాత్రలు 3. అక్షరకాలములు 12.

దర్పణతాళము :— 'రత్నాకర' గ్రంథ స్థమగు 120 తాళముల పట్టికలోని 7 వ తాళము. దీనికి అంగములు 0 0 8.

దర్పమంజరి :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

దర్భకూలము :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

[సం. స్వ. ప్ర. సా.]

దర్శనఅష్టపది :— 'జయ దేవ కవి' రచించిన 'గీతగోవిందము' అను గ్రంథములోగల అష్టపదులలో 19 వ అష్టపదికిగల పేరు. దీనికి దర్శన అష్టపది అను పేరు వచ్చుటకు కారణమేమనగా 'జయదేవుడు 19 వ అష్టపదిలో రెండుపాదములు వ్రాసి భార్యకిచ్చి బయటికి వెళ్ళెను. ఇంతలో శ్రీకృష్ణుడు జయదేవరూపముగా వచ్చి జయదేవునిభార్య పద్మావతినిపిలిచి తాటియాకును ఘంటమునడిగి తీసికొని 19 వ అష్టపదిలోని మిగత రెండుపాదములు పూర్తిచేశి వెడలిపోయెను. తదుపరి జయదేవుడువచ్చి తాటియాకునందు వ్రాసియున్నదిచూచి జరిగినది తెలిసికొని తన భార్యకు భగవద్దర్శనమైనందుకు చాల సంతోషించెను. గనుక యీ 19 వ అష్టపది 'దర్శన అష్టపదిగా' పేరొందెను.

దరాద్దరి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గరి స.
ఇది మలయమారుతి రాగము యొక్క ఆరోహణావరోహణములకు సరిపోవు 28 వ మేళకర్త జన్యముగా నున్నటుల గమనించవలెను.

దర్బార్ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము-స ని ధ ప మ రి గాగారిస.
ఇది ఉపాంగరాగము. గాంధార, నిషాదములు రాగచ్ఛాయాస్వరములు. గమక వరిక రక్తిరాగము. త్రిస్థాయి రాగము. ఇందుగల రచనలు రిషభ, పంచమ, దైవతములందు ప్రారంభమగును. దీని ముగింపు నాయకి రాగమువలెనుండును. ఈ రాగాలాపనలో మేటియైన శ్రీ శీతారామయ్య దర్బార్ శీతారామయ్య, అని పేరొందెను. త్యాగరాజుని 'యోచన' కృతి యిందు గలదు.

దర్బారికానడ :— హిందూస్థానీ సంగీతములోగల ఒక రాగమునకు పేరు.

దరు :— ఇది కథానాటికలకు నృత్యనాటికలకు సంబంధించిన ఒక సంగీత రచన. ఇందుపల్లవి,అనుపల్లవి, చరణములను విభాగములు కలిగియుండును. కొన్ని దరులకు సాహిత్యము జతులతో కూడియుండును. దరులు 6 విధములుగానుండును. అవి యేవన

1. పాత్ర ప్రవేశ దరు.
2. స్వాగత దరు.
3. వర్ణన దరు.

4. కోలాట్ట దరు.
5. సంవాద దరు.
6. ఉత్తర-ప్రత్యుత్తర దరు వనునవి.

దరుబార :— 'చతుర్దండి ప్రకాశిక' అను గ్రంథములో పేర్కొనబడిన ఒక 'దేశి' రాగమునకు పేరు.

దరుబారు :— 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' అను గ్రంథములో దర్బార్ రాగమునకుబదులుగా చెప్పబడిన రాగము.

దర్దుర :— సంగీత వాద్యములలోని ఒక రకము వాద్యమునకు పేరు.

దవండై :— చర్మ సంబంధమైన వాద్యమునకు చెంది రెండు ముఖములుకలిగిన ఒక వాద్యమునకు పేరు. ఇది 'ఉడుక్కై' వాద్యముకంటె పెద్దదిగానుండును. దీనిని కఱ్ఱతో వాయింతురు. దక్షిణ ఇండియాలో 'మారియమ్మన్' దేవాలయములందు దీనిని ముఖ్యముగా వాయించుదురు.

దవడైతానమ్ :— తానము పాడుటలోని ఒక రకమునకు తమిళములోని పేరు.

దవ్వి :— 13 వ మేళకర్తయగు 'గాయక ప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

దశజాతిమతాంతరలఘువులు :— మరియొక పద్ధతిలో దశజాతిలఘువులు కలవు. అవి మనుష్య, స్వర్గ, హంస, దేశ్య, చిత్ర, దివ్య, సింహ, వర్ణ, వాద్య, కర్నాటక లఘువులగును. అవి వరుసగా 4, 3, 7, 5, 9, 6, 8, 10, 12, 16 అక్షర కాలములు గలవిగా చెప్పబడినవి.

దశజాతిలఘువులు :— లఘువునకు సాధారణముగా వాడు పంచజాతులుగాక మరియొక 5 జాతులుకూడా గలవు. వాటి నన్నిటిని కలిపి (5+5 = 10) దశజాతి లఘువులని చెప్పబడును. అవి 1. త్రిశ్ర జాతి లఘువు 2. చతురశ్రజాతి లఘువు 3. ఖండజాతిలఘువు 4. మిశ్రజాతిలఘువు 5. సంకీర్ణజాతిలఘువు 6. దివ్యసంకీర్ణజాతి లఘువు 7. మిశ్రసంకీర్ణజాతిలఘువు 8. దేశ్య సంకీర్ణజాతిలఘువు 9. మిశ్రదేశ్య సంకీర్ణ జాతిలఘువు 10. దేశ్యశుద్ధ సంకీర్ణజాతి లఘువు అనునవి. ఇవివరుసగా 3, 4, 5, 7, 9, 6, 8, 10, 12, 16 అక్షరకాలములు గలవై యుండును.

దశప్రాణములు :— సంగీత కాలమును తెలుపుట కుపయోగింపబడునట్టి తాళ దశ ప్రాణములకుగల పేరు. అవి 1. కాలము 2. మార్గము 3. క్రియ 4. అంగము 5. గ్రహము 6. జాతి 7. కళ 8. లయ 9. యతి 10. ప్రస్తారము లనునవి.

దశవిధగమకములు :— ఆరోహ, అవరోహ, ఢాలు, స్ఫురిత, కంపిత, ఆహత, ప్రత్యాహత, త్రిపుచ్ఛ, ఆందోళ, మూర్ఛనా గమకములకు పేరు.

దశసహస్రరూప్య సన్మానిత వాగ్గేయకారుడు :— 18 వ శతాబ్దములో 'సుగంధికుంతలాంబాంకిత' మైన కీర్తనల రచియించి తంజావూరు ప్రతాపసింహ మహారాజాచే 10 వేల రూపాయలు సన్మానము వొందిన 'కవి మాతృభూతయ్య' కు గల గౌరవనామము.

దశావతార :— కన్నడములోగల 'యక్ష గానము' లేక 'నృత్యనాటిక'కుగల పేరు.

దశావతార అష్టపది :— శ్రీ 'జయదేవ' కవిచే రచింపబడిన 'గీతగోవిందకావ్యము' లోని అష్టపదులలో మొదటిదానికిగల పేరు.

దశావతార దివ్యనామ కీర్తన :— విష్ణువు యొక్క పది అవతారములను గురించి వర్ణించుచూ 'శ్రీ త్యాగరాజు' రచించిన 'దీనజనావన' అను భూపాలరాగములోని కీర్తనకు పేరు.

దశావతార మంగళము :— 'పురందర దాసు' కల్యాణిరాగము, చాపుతాళములో రచించిన 'మంగళమ్ జయమంగళమ్' అను కీర్తనకుగల పేరు. దీనిలో విష్ణువుయొక్క పది అవతారములగు మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశు రామ, రామ, కృష్ణ, బుద్ధ, కలికి అవ తారములను గురించి వర్ణింపబడినది.

దశావతార రాగమాలిక :— 'తిరువా న్కూరుమహారాజు'యగు శ్రీ 'స్వాతి తిరు నాల్' విష్ణువుయొక్క దశావతారములను వర్ణించుచూ 'కమలజాస్య' అనుసాహిత్య ముతో పది రాగములలో ఆదితాళము నందు వ్రాసిన ఒక సుప్రసిద్ధమైన రాగ మాలికకుగలపేరు. ఈ దశావతారరాగమా లికలో మోహన, బిలహరి, ధన్యాసి, సారంగ, మధ్యమావతి, అఠాణా, నాట కురంజి, దర్బార్, ఆనంద భైరవి, సౌరాష్ట్ర రాగములయందు మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, భార్గవ రామ, (పరశురామ) రామ, బలరామ, కృష్ణ, కలికి అవతారములను వర్ణించెను.

దక్షయాగము :— 'ఇరయిమ్మన్ తంపి'చే రచింపబడిన ఒక 'కథాకళి' నృత్యరచనకు గలపేరు.

దక్షిణ :— తాళదశ ప్రాణములకు సంబం ధించిన షణ్మార్గములలో మొదటిది. దీనికి ప్రతితాళాక్షరమునకు 8 మాత్రలు లేక 32 అక్షరకాలములవంతున లెక్కింప బడును.

దక్షిణగుర్జరి :— 'సంగీత రత్నాకరము' లో పేర్కొనబడిన 'గుర్జరిరాగము'యొక్క ఉపాంగరాగము.

దక్షిణదేశ సంగీతము :— ఈ కాల ములో కర్నాటక సంగీతమని చెప్పబడు చున్నట్టియు, దక్షిణభారతములో ముఖ్య ముగా అమలులోనున్నట్టి సంగీతమునకుగల పేరు.

దక్షిణాది బాణీ :— దక్షిణభారతములో అనగా త్యాగరాజాది సంగీత త్రిమూర్తులు జనించిన కావేరీ మండలములో నివశించు గాయకులు పాడునటువంటి శాస్త్రీయమై, ఆకర్షణీయమైన సంగీత విధానమునకుగల పేరు.

దక్షిణుడు :— తనను ఆశ్రయించిన నాయిక లందరియందును సమమైన ప్రీతి గలవానికిగల పేరు.

ద్వంద్వతాళము :— 'రత్నాకర' గ్రంథ స్థమైన 120 దేశితాళముల పట్టికలోని

110 వ తాళము. దీనికి అంగములు
। । 8 8 8 । 3.

ద్వంద్వోత్పల :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప ధ ప మ గ రి స.
ఇది ఔడవ – వక్ర సంపూర్ణ రాగము.
[సం. కౌ.]

ద్వయానుగమము :— గాత్ర సంగీతము నకును డాన్సు సంగీతమునకును ప్రక్కవాద్యముగా వాయించు వాద్యమునకుగల పేరు. ఉ॥ మృదంగము. సంగీతవాద్యముల నుప యోగించు విధమునుబట్టి 'శార్ఙ్గదేవుడు' తన సంగీతరత్నాకరములో ఈ క్రిందదెలిపిన 4 విధములుగా విభజించెను.

(1) శుష్కము – తనిగా (సోలో) వాయించుటకుపయోగింపబడు సంగీత వాద్యమునకు గలపేరు. ఉదా॥ వీణ.
(2) గీతానుగము – గాత్రసంగీతమునకు ప్రక్కవాద్యముగా వాయింపబడు వాద్యమునకు పేరు. ఉదా॥ యాళ్. (Yazh)
(3) నృత్తానుగము – నాట్యమునకు ప్రక్కవాద్యముగా నుపయోగింపబడు వాద్యమునకు పేరు. ఉదా॥ ఫ్లూట్. (పిల్లనగ్రోవి)
(4) ద్వయానుగము – గాత్ర సంగీతము నకును నాట్యమునకును ప్రక్కవాద్యముగా నుపయోగింపబడు వాద్యమునకుగల పేరు. ఉదా॥ మృదంగము.

ద్రవిడియన్ మ్యూజిక్ :— దక్షిణ ఇండియాలో ప్రాచీన తమిళ సంగీత కళారాధకులచే అనుష్ఠింపబడిన సంగీత విధానమునకు ఇంగ్లీషు పేరు.

---

# దా

దాట్ :— హిందూస్థానీ సంగీతములో జనకరాగమునకు గల పేరు.

దాటిక పంచమము :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప మధనిపస.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
[ప. శే. ప్రా. గ్రం.]

దాటిబలము :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

దాటిమాంజి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ప మ రి స.

దాటుప్రయోగము :— సంగీతము పాటలలో స్వరములను దాటు (వర్జము)గా ప్రయోగించుటకుగల పేరు. తానవర్ణములలోను, కటకములలోను యిట్టి దాటు స్వరప్రయోగములు విశేషించి యుండుట గమనింపదగును.

దాటుస్వరము :— స్వరములలో ఒకటి విడిచి మరియొకటిగాని లేక రెండు విడిచి మరియొకటిగానియుండు స్వర సముదాయమునకు 'దాటు స్వరము' అని పేరు.

దాటుస్వర ప్రయోగము :— దాటు ప్రయోగమునకుగల మరియొక పేరు.

దాటుస్వర వరుసలు :— దాటుస్వరములతో కూడిన వరుసలకు పేరు. సంగీత ప్రథమాభ్యాసములో విద్యార్థులు సరళీ వరుసలు నేర్చినతరువాత యీ దాటుస్వర వరుసలనే ముఖ్యముగా నేర్చుకొందురు. ఈ దాటు స్వరవరుసల నభ్యసించుటవలన స్వరస్థానములు చక్కగా అలవడును. ఉ॥ స రి స గ – రి గ మ గ – స గ రి గ స రి గ మ॥ రి గ రి మ – గ మ ప మ – రి మ గ మ – రి గ మ ప॥ అను దాటు స్వర వరుస యిందుకొక ముఖ్యమైన వుదాహరణమగును.

దాడియమన్ :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగమైన ఒక హిందూస్థానీ రాగమునకుగల పేరు.
ఆరోహణము– స రి గ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇది కర్నాటకసంగీతములో 'కుంతల రామ' అను రాగమునకు సరిపోవును.

ద్వాదశ చక్రములు :— 72 మేళకర్తలను 12 సమాన భాగములుగా యేర్పఱచి ఒక్కొక్క చక్రమునకు 6 మేళకర్తల వంతున విభజింపబడిన 12 చక్రములకుగల పేరు. అవి ఇందు, నేత్ర, అగ్ని, వేద, బాణ, ఋతు, ఋషి, వసు, బ్రహ్మ, దిశి, రుద్ర, ఆదిత్య అనునవి.

ద్వాదశముద్రలు :— రచయితలు తమ సంగీత రచనలలోని సాహిత్యమునంద యేర్పఱచునట్టి 12 రకములైన ముద్రలకు గల పేరు. ఈ ద్వాదశముద్రల యొక్క పూర్తి వివరములు యీ దిగువ నుదహరించుట గమనించునది.

(1) వాగ్గేయకారముద్ర :—రచయిత తన యొక్క అంకితము లేక సంతకమును ముద్రగా వుంచునపుడుగలుగు పేరు. ఇది రెండు విధములు. a. స్వనామముద్ర–రచయిత తన స్వంతపేరు ముద్రగానుంచునపుడుగలుగు పేరు. ఉ॥ త్యాగరాజు, జయదేవుడు, నారాయణతీర్థులు ఇట్టి ముద్రలుగల రచయితలు. b. ఇతరనామముద్ర – రచయిత తన రచనలో ఇతరపేరు ముద్రగా నుంచునపుడు గలుగు పేరు. ఉ॥ ముద్దుస్వామి దీక్షితార్ (గురుగుహ) సుబ్బరాయశాస్త్రి (కుమార) పట్నంసుబ్రహ్మణ్యయ్యర్ (వెంకటేశ్వర).

(2) రాగముద్ర :— రచయిత తన రచనలో రాగమునే ముద్రగా నుంచునపుడు గలుగు పేరు. ఉ॥ పైడాల గురుమూర్తి శాస్త్రియొక్క లక్షణగీతములు, శీతారామ రావుయొక్క నిత్యకల్యాణి, రాగమాలిక యిందుకు ముఖ్యవుదాహరణము లగును.

(3) తాళముద్ర :— రచయిత తన రచనలో తాళమునే ముద్రగానుంచునపుడు గలుగు పేరు. ఉ॥ తాళమాలిక, రాగతాళమాలిక యిందుకు ముఖ్యవుదాహరణము లగును.

(4) ఆచార్యముద్ర :— రచయిత తన రచనలో తన ఆచార్యుని లేక గురువు యొక్క ముద్రనుంచునపుడుగలుగు పేరు.

(5) రాజముద్ర :— రచయిత తన రచనలందు తన రచనలను ప్రోత్సహించునట్టి రాజులయొక్క ముద్రను పెట్టునపుడు గలుగు పేరు. ఉ॥ కొన్ని పదములు, కొన్ని వర్ణములు, కొన్ని తిల్లానాలు యిందుకు వుదాహరణములగును.

(6) ప్రబంధముద్ర :— ఈ పేరు సంగీత రచనలగు కృతి, పదము, రాగమాలిక, తిల్లాన మొదలగువాటికి చెందును.

(7) నాయకముద్ర :—నాయకముద్రలు కలిగియున్న శృంగార రసప్రధానమైన 'పదములు' యిందుకు వుదాహరణము అగును.

(8) స్థలముద్ర లేక క్షేత్రముద్ర :— ఉ॥ తేవారమ్, తిరుప్పుగళ్, క్షేత్ర కృతులు యిట్టి ముద్రగల రచనలకు వుదాహరణములగును.

(9) వంశముద్ర :— రచయిత తన రచనలందు వంశ, కుల, గోత్ర, సూత్ర తల్లిదండ్రులముద్రలను పెట్టునపుడుగలుగు పేరు.

(10) బిరుదముద్ర :— రచయిత తన రచనలందు యేదైన బిరుదమును పెట్టి రచించునపుడుగలుగు పేరు.

(11) లక్షణగ్రంథముద్ర :—లక్షణగ్రంథ ముద్రను రచనలందుంచునపుడుగలుగు పేరు.

(12) ఇతరముద్రలు :— ఛందస్ముద్ర, సంవత్సరముద్ర, భక్తిముద్ర (ఇవి 9 విధములుంటాయి) చక్రముద్ర. ఇవి నవావరణ కీర్తనలందుగలవు.

ద్వాదశ స్వరస్థానములు :— ఒక స్థాయి (ఆక్టేవు)లో గల 12 స్వరస్థానములకు గలపేరు. అవి షడ్జ– శు. రి – చ. రి – సా. గాం – అం. గాం – శు. మ – ప్ర. మ– పంచమ – శు. ధై – చ. ధై – కై. ని – కా. నిషాద స్వరస్థానములగును.

దానమంజరి :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ధ ని ప ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.
[ప. శే. ప్రా. గ్రం.]

దానరక్షన :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ గ ప ని స.
అవరోహణము– స ని ధ గ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

దామ్య :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

దారకవసంత :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ రి మ ప ని స.
అవరోహణము– స ని ప ధ మ గ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

దారి :— 'అరబత్తనావలర్' యొక్క 'నాట్టియశాస్తిరమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనిన ఒక రాగము.

దారువీణా :— కఱ్ఱతో చేయబడునట్టి ఒక రకపు 'వీణకు'గల పేరు. ఇది గాత్రవీణకు వ్యతిరేకమైనదిగానుండును.

దాసకూట :— కర్నాటక రాష్ట్రములో జనించి భక్తిపూరితములైన కన్నడ కీర్తనముల రచించిన శ్రీ పురందరదాసు, కనకదాసు వంటి భక్త శిఖామణుల సమూహమునకుగల పేరు.

దాసరపదగళు :— కర్నాటక దేశములో జనించిన 'శ్రీ పురందరదాసు' వంటి కొందరు రచయితలు కన్నడములో రచించిన భక్తిపూరితములైన పదరచనలకు గలపేరు.

దానరాగము :— 'బృహద్ధర్మ పురాణము'లో పేర్కొనబడిన ఒక రాగము.

దాసి :— ఉపనాయికలయందలి 8 విధములలో 2 వ దానికిగల పేరు.

దాసి :— దేవతోత్సవ సమయములందు నృత్యప్రదర్శనలు జరుపుటకు దేవాలయములలో నౌకరీచేయు కళావంతుల బాలికలకుగల పేరు.

దాసి అట్టమ్ :— భరతనాట్యమునకు తమిళములోని పేరు. దీనికే దక్షిణ భారత శాస్త్రీయ నాట్యమనికూడ పేరుగలదు.

దాసి రాగము :— బృహద్ధర్మ పురాణములో పేర్కొనబడిన ఒక తరగతికి చెందిన రాగము.

దాసుముఖి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

దాక్షాయణి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగముగా 'సంగీతకౌముది'లో పేర్కొనబడిన ఒక రాగము.
ఆరోహణము— స రి గ మ నిధ మ పధనిస.
అవరోహణము— స ని ధ ప మ గ రిస.

దాక్షాయణి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.
[సం. స్వ. ప్ర. సా.]

దాక్షిణాత్య :— 'సంగీత రత్నాకరము'లో భిన్నషడ్జ భాషారాగముగా పేర్కొనబడిన ఒక రాగము.

దాక్షిణాత్యభాషా :— 'సంగీత రత్నాకరము'లో పేర్కొనబడిన ఒక రాగము.

ద్రావతి :— 'నారదుని' 'సంగీత మకరందము'లో పేర్కొనబడిన చంద్రాంశ రాగములలో నొక దానికిపేరు.

ద్రావిడగాన సార్వభౌమ :— తాళ్ళపాక రచయితలలో నొకరైన శ్రీ 'తిరుపతి అన్నమాచార్యుల'కు యివ్వబడిన బిరుదు. ఈ బిరుదుకు అర్థము దక్షిణభారత సంగీత చక్రవర్తి యని చెప్పవచ్చును.

ద్రావిడగుర్జరి :— 'సంగీత సమయసార ము'లోని ఉపాంగ సంపూర్ణ రాగముల శీర్షికలోను, 'సంగీతరత్నాకరము'లోను పేర్కొనబడిన ఒక రాగము.

ద్రావిడగౌడ :— 'సంగీత సమయసార ము'లో పేర్కొనబడిన ఉపాంగ సంపూర్ణముల శీర్షికయందుగల ఒక రాగము.

ద్రావిడపదము :— తమిళములో రచింపబడిన పదమునకు గలపేరు.

ద్రావిడభాష:—'సంగీతరత్నాకరము'లో పేర్కొనబడిన ఒకరాగము.

ద్రావిడవరాళి :— 'సంగీత సమయసార ము'లో ఉపాంగ సంపూర్ణముల శీర్షిక యందుగల ఒక రాగము.

ద్రావిడ సంగీతము :— దక్షిణభారత ములో పురాతనులగు తమిళులలో అమలు నందున్న సంగీతవిధానము.

ద్రావిడభాష :— 'సంగీతరత్నాకరము' నుండి పరిశోధింపబడిన ఒకరాగము.

ద్రావిడీ :— 'సంగీతరత్నాకరము' నుండి పరిశోధింపబడిన ఒక రాగము.

ద్రాక్షరస :— సంగీత రచనలలోగల శైలినిబట్టి నిర్ణయింపబడిన 3 రసములలో మొదటిదానికి పేరు. రెండవది నారికేళరస, మూడవది క్షీర రస మనునవి. ఇవి సంగీత రచనలయందలి రచనాశైలియొక్క విధానమును ఆయారసభావములనుబట్టి నిర్ణయింపబడినవగును. ఉ॥ త్యాగరాజుని రచనలు ద్రాక్షరస పాకముగానుండును. 'ముద్దుస్వామి దీక్షితులు' రచనలు నారికేళ రసపాకము గానుండును. 'శ్యామశాస్త్రి'ల రచనలు కదళీ రస పాకముగానుండును.'

ద్వాత్రింశత్కళలు :— తాళమువేయుట లో ప్రతితాళాక్షరమునకు 32కళలవంతున నడచునట్టిదానికి పేరు.

ద్వావింశతిగమకములు :— 14వ శతాబ్దమునకు చెందిన 'పాల్కురికి సోమనాథ కవి'చే రచింపబడిన 'పండితారాధ్య చరిత్రము'లోని ద్విపద కావ్యములో పేర్కొనబడిన 22 గమకములకు గల పేరు. తదితర సంగీత లక్షణకారులు గమకములు 7, 10, 15, 19 ఇటుల పలురకములుగా పేర్కొనియుండిరి. సోమనాథకవిచే పేర్కొనబడిన 22 గమకముల పేర్లు ఈ దిగువనుండుట గమనించునది.

| | |
|---|---|
| 1. ఆక్షిప్త | 12. దీర్ఘకంపిత |
| 2. ఆదిర్ఘ | 13. దీర్ఘరిక |
| 3. ఆహిత | 14. దీర్ఘోల్లసిత |
| 4. ఉచ్చరిత | 15. ప్రస్తుత |
| 5. ఉల్లసిత | 16. భ్రమిత |
| 6. ఉల్లాసిత | 17. మూర్ఛిత |
| 7. కంపిత | 18. క్షిప్త |
| 8. కుంచిత | 19. లలిత |
| 9. కోమల | 20. లలితోత్తమ |
| 10. గుంఫిత | 21. సమోల్లసిత. |
| 11. దీర్ఘ | 22. సూక్ష్మాంతర. |

అను 22ను 'ద్వావింశతిగమకము' లకు పేర్లు.

ద్వావింశతి శృతులు :— భారతీయ సంగీతములో ఒకస్థాయిలోగల 22 శృతులకు ద్వావింశతి శృతులని పేరు. ఈ క్రింది 22 శృతులపేర్లు భరతునిచేతను శార్ఙ్గదేవుని చేతను సప్తస్వరములకు విభజించి చెప్పబడినవి.

1. తీవ్రా, కుముద్వతి, మందా, ఛందోవతి,
2. దయావతీ, రంజని. రతికా,
3. రౌద్రి, క్రోధా,
4. వజ్రికా, ప్రసారిణి, ప్రీతి, మార్జనీ,
5. క్షితి, రక్తా, సందీపినీ, ఆలాపినీ,
6. మదంతి, రోహిణి, రమ్యా,
7. ఉగ్రా, క్షోభిణి, అనునవి.

ద్వావింశతి శృతుల నవీనపేర్లు :— 22 శృతులకు నవీనముగాయేర్పరచినపేర్లను వాటి వేపనసంఖ్యను యీ క్రిందగమనింపవలెను.

1. షడ్జము....................1
2. ఏకశృతి రిషభము......256/243
3. ద్విశృతి రిషభము........16/15
4. త్రిశృతి రిషభము........10/9
5. చతుశృతి రిషభము........9/8
6. కోమలసాధారణగాంధారం32/27
7. సాధారణ గాంధారము...6/5
8. అంతర గాంధారము......5/4
9. తీవ్ర అంతర గాంధారము81/64
10. శుద్ధ మధ్యమము.........4/3
11. తీవ్రశుద్ధ మధ్యమము...27/20
12. ప్రతిమధ్యమము........45/32
13. తీవ్రప్రతి మధ్యమము లేక చ్యుత పంచమము64/45లేక729/512
14. పంచమము..............3/2
15. ఏకశృతి ధైవతము.....128/81
16. ద్విశృతి ధైవతము.......8/5
17. త్రిశృతి ధైవతము.......5/3
18. చతుశృతి ధైవతము.....27/16
19. కోమల కైశికీనిషాదము...16/9
20. కైశికీనిషాదము.........9/5
21. కాకలీనిషాదము... ...15/8
22. తీవ్రకాకలీనిషాదము లేక చ్యుత షడ్జము.......243/128.

# ది

దిక్ :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో పేర్కొనబడిన 'మిశ్రజాతి ఝంపెతాళము'నకు పేరు. దీనికి అంగములు । ◡ 0. అక్షరకాలములు 10.

దిగ్విజయము :— 17 వ శతాబ్దమునకు చెందిన 'రాగతాళ చింతామణి' అను తెలుగు గ్రంథములో పేర్కొనబడిన 124 తాళములలో 11 వ తాళమునకుగలపేరు.

దిగుజారు :— ఒక స్వరమునుండి దాని క్రింది స్వరములలో యేదైన ఒక స్వరమునకు పోవునపుడు మధ్యనుండు స్వరముల యందు నిలువక అంటి రాచుకొని పోవుటకు 'దిగుజారు' అని పేరు.

దిండి :— సంగీత వాద్యములలోని ఒక రకపు వాద్యమునకు గలపేరు.

దిండి :—మహారాష్ట్ర సంప్రదాయమైన హరికథా కాలక్షేపములలో పాడు నటువంటి ఒకరకమైన సంగీతరచనకుగల పేరు.

దిండిర :— సంగీతవాద్యములలో గల మరియొక రకపు వాద్యమునకు గలపేరు.

దినకరకాంతి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

దినగేయరాగము :— పగటికాలములో పాడదగిన రాగమునకు గలపేరు. దీనికి వ్యతిరేకమైనది రాత్రిగేయ రాగము. అనగా రాత్రియందు పాడదగినది.

దినద్యుతి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ మరిగస.

దిపదై :— 'ద్విపద' అనురచనకు తమిళములో చెప్పబడు పేరు.

దిరా :— 'నారదుని'చే 'సంగీతమకరందము'లో పేర్కొనబడిన 22 శృతుల విధానములో 'మధ్యమము' యొక్క శృతులలో మొదటి శృతికి గలపేరు.

దిరాడమ్ :— తమిళసంగీతమునందు గల పెద్దరాగమగు 'పాలైయాల్', నుండి జనించిన రాగములలో నొకదానిపేరు.

దిల్‌రుబా :— మెట్లును, తంత్రులును వాయించుటకువిల్లుఅనగా కమాను(Bow) గల ఒకరకపు సంగీతవాద్యమునకు పేరు. దీనిని హిందూస్థానీ సంగీత కచ్చేరీలయందును వాద్యసమ్మేళనము అందును ప్రక్క వాద్యముగా నుపయోగింతురు.

దిలీపకము :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యమైన త్రిస్వరవక్ర ఆరోహణసంపూర్ణరాగము.
ఆరోహణము– సరిగరిమపనిధనిపధనిస.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
త్యాగరాజుని 'రామానీయెడ' అను కృతి ఈ రాగమునకు చెందినదిగా చెప్పుదురు.

దివ్యకుంతల :— 48 వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

దివ్యగంధి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి'యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ధ ని గ ప స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఈ రాగముయొక్క ఆరోహణావరోహణ క్రమము మాత్రము 28 వ మేళ జన్యమైన 'కదనకుతూహల రాగము'నకు వలె నుండును.

దివ్యగాంధారము :— 18 వ మేళకర్తయగు, 'హాటకాంబరి' యొక్క జన్యరాగము. [గా. వి. ప్ర]
ఇదివక్రషాడవ-వక్రసంపూర్ణరాగమగును.
ఆరోహణము– స మ రి ప ధ ని స.
అవరోహణము– స ధ ని ప మ గ స రి స.

దివ్యగాంధారి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ప మ గ స.
[సం. కా. మరియు గా. లో.]

దివ్యగాంధారి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
[గా. వి. ప్ర]
ఆరోహణము— స గ రి మ ప ధ స.
అవరోహణము— స ధ ని ధ ప మ గరిగస.

దివ్యతరంగిణి :— 17వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
[సం. కౌ.]

దివ్యతాళము :— శాస్త్రీయమైన 108 తాళములలోలేని తాళములలో ఒకటి.

దివ్యతోరణి :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి గ ప ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

దివ్యధ్వని :— చర్మవాద్యములో కలుగు ఒక ధ్వని విశేషమునకుపేరు.

దివ్యనామకీర్తన :— ఒక పల్లవి, అనేక చరణములుగల ఒక ప్రత్యేక తరగతికి చెందిన సంగీత రచన. దీనిలో సంగీతము సులభశైలిగా నుండును. ఇది సమూహము గాచేయు భజనలయందు పాడుటకు వుపయోగింతురు. చరణము లన్నియు ఒకే ధాతులో నుండును. ఒక్కొక్కప్పుడు పల్లవి చరణములుకూడ ఒకేధాతు (స్వరము)ను కలిగి యుండును. అట్టివాటికి ఏకధాతు దివ్యనామకీర్తనలని పేరు. ఉ॥ శ్రీరామ జయరామఅను యదుకుల కాంభోజిరాగ, ఝంపెతాళములోని త్యాగరాజుని కృతి ఇందుకు మంచివుదాహరణమగును. కొన్నిటిలో పల్లవి, చరణములు వేరు వేరు ధాతు (స్వరము) ను కలిగియుండును. అట్టి వాటికి, ద్విధాతు దివ్యనామకీర్తనలనిపేరు. ఉ॥ పాహిరామ చంద్ర, అను శంకరాభరణరాగము, ఆదితాళములోని త్యాగరాజుని కృతియిందుకు మంచి వుదాహరణమగును. 'త్యాగరాజు' సంస్కృతము, తెలుగులోను 'విజయగోపాలుడు' సంస్కృతములోను యిట్టి దివ్యనామ కీర్తనలు అనేకము రచించి యుండిరి.

దివ్యనామ సంకీర్తన :— డోలోత్సవము ప్రారంభించుటకు ముందుగా భజనపరులు గుండ్రముగా తిరుగుచూ పాడునట్టి భక్తి పూరిత మగు రచనలకుపేరు.

దివ్యపంచమము :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ స ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
[సం. కౌ.]

దివ్యబౌళి :— 15 వ మేళకర్త యగు 'మాయామాళవ గౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ధ ప మ గ రి గ స.

* దివ్యమణి :— 72 మేళకర్తలలో 48 వ మేళకర్తకుగల పేరు. ఇది 8 వ 'వసు' చక్రములోని 6 వ మేళకర్తయగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి. — సా. గాం — ప్ర. మ — షు. ధై — కా. ని స్వరములుండును.

దివ్యమతి :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

దివ్యలఘువు :— దివ్య సంకీర్ణ జాతి లఘువునకుగల మరియొక పేరు. ఒక ఘాత వేసి 8 వ్రేళ్ళను లెక్కపెట్టవలెను. దీనికి అక్షర కాలములు 6.

దివ్య సంకీర్ణలఘువు :— లఘువులలోని ఒకరకము. దీనిని వేయునప్పుడు 1 ఘాత వేసి 5 వ్రేళ్ళను లెక్కించవలెను. దీనికి అక్షర కాలములు 6. ఇది ద్వితీయ లఘుపంచ జాతులలోని ఒక రకమునకు చెందును.

దివ్యసేన :— 58 వ మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి మ గ స.
[ప. శే. వా. గ్రం.]

దివ్యాంబరి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స ప మ ప ధ ని స.
అవరోహణము- స ప ని ధ ప మ గ రి స.
[సం. కౌ.]

దివ్యాంబరి :— 40 వ మేళకర్త యగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ధ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

దివ్యాభరణము :— 21 వ మేళకర్త యగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.
[గా. వి. ప్ర.]

దివికామంతిని :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ధ ప స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

దివిటివాద్యము :— రెండుముఖములు కలిగిన ఒకరకపు చర్మవాద్యము. దీనిని ఆంధ్రదేశములో వుపయోగించుదురు.

దివ్వియవరాటి :— ఇది 'కురింజియాళ్' యొక్క జన్యమై 'పింగలంద్రై'లోని 103 పణ్ (రాగము)లలో కనుగొనిన ఒక రాగమగును.

దిశి :— 72 మేళకర్తలను సమానముగా విభజించి 'వెంకటమఖి' యేర్పఱచిన 12 చక్రములలో 10 వ మేళచక్రమునకు 'దిశి' అని పేరు.

దిశి - గో :— 10 వ మేళచక్రములోని 3 వ మేళమగు 'సిమ్హేంద్రమధ్యమము'నకు 'వెంకటమఖి' యేర్పఱచిన సంకేతనామము. ఇది 57 వ మేళకర్తయగును.

దిశి - పా :— 10 వ మేళచక్రములోని 1 వ మేళమగు 'శ్యామళాంగి'కిగల సంకేతనామము. ఇది 55 వ మేళకర్తయగును.

దిశి - భూ :— 10 వ మేళచక్రములోని 4 వ మేళమగు 'హేమవతికి'గల సంకేత నామము. ఇది 58 వ మేళకర్తయగును.

దిశి - మా :— 10 వ మేళచక్రములోని 5 మేళమగు 'ధర్మవతి'కి గల సంకేత నామము. ఇది 59 వ మేళకర్తయగును.

దిశి - శ్రీ :— 10 వ మేళచక్రములోని 2 వ మేళమగు 'షణ్ముఖప్రియ'కు గల సంకేతనామము. ఇది 56 వ మేళకర్త యగును.

దిశి - షా :— 10 వ మేళచక్రములోని 6 వ మేళమగు 'నీతిమతి' కి గల సంకేత నామము. ఇది 60 వ మేళకర్త యగును.

ద్విఅన్యస్వర భాషాంగ రాగము :— భాషాంగరాగములో రెండు అన్యస్వరములు ప్రయోగింపబడు రాగమునకు గల పేరు. ఉ॥ హిందూస్థానీ బేహాగ్ రాగము. ఇది 29 వ మేళకర్త 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము. ఇందు ప్రతిమధ్యమము కైశికినిషాదములు రెండును అన్య స్వరములగును.

ద్వికళ :— తాళాక్షరమున (క్రియ) కు రెండు కళలవంతున లెక్కించుదానికిపేరు.

ద్వికాలము :— తాళ కాలప్రమాణ మందలి వేగములోని రెండు కాలతేలంవు గలపేరు. ఇవి ఒకదానికొకటి రెట్టింపు వేగము కలిగియుండును. తానవర్ణములు సాధారణముగా రెండు కాలములు సాధకముచేయుదురు. అందు మొదట మధ్యమ కాలమును తరువాత తృతీయకాలమును పాడుదురు. ఇటులపాడుటనే ద్వికాల సాధకమని చెప్పబడును.

ద్విఖండగీతము :— రెండు భాగము లుగా రచింపబడిన గీతమునకుగలపేరు. ఉ॥ 'కమలజదళ' అను కల్యాణిరాగము త్రిపుటతాళములోని గీతము యిందు కొక ముఖ్య వుదాహరణయగును.

ద్విగుణ :— మధ్యషడ్జముకంటె తార షడ్జముయొక్క ధ్వని తీవ్రత రెండురెట్లుండును. అనగా ఒకస్థాయి హెచ్చుగా నుండును. ఇట్లే తార షడ్జము కంటె అతితారషడ్జముయొక్క ధ్వని తీవ్రత రెండురెట్లు వుండును. గనుక వీటి సంబంధము నేద్విగుణ లేక ద్విగుణత్వమనబడును. (1 : 2)

ద్విజాతిప్రబంధము :— ప్రబంధముల లోని రెండు విధములలో రెండవదాని పేరు. ఇది హయలీల, గజలీల, ద్విపది, ద్వితకము, వృత్తము, ఘటసామ అను ఆరు విధములుగా నుండును. పైరెంటిలో మొదటిదానిపేరు ఏకజాతి ప్రబంధము.

ద్విజావంతి :— దీనినే 'జుజావంతి'అని కూడ చెప్పుదురు. 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.

ఇది భాషాంగరాగము. సాధారణ గాంధారము అన్యస్వరము. రి మ గా రి గ రి సా అను సంచారముగలదు. రిషభ, మధ్యమ స్వరములు జీవస్వరములు. దేశ్యరాగము. హిందూస్థానీ సంగీతములో, జయ్ జయ్ వంతి రాగమునకు సరిపోవును. శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి 'చేత శ్రీ బాలక్రిష్ణం భజరే' అను ప్రసిద్ధకృతి ఈ రాగము లోనిదై యున్నది.

ద్వితకము :— ద్విజాతి ప్రబంధము లోని 6 విధములలో 4 వ దానికి పేరు.

ద్వితంత్రి :— 'సంగీత రత్నాకరము' లో పేర్కొనబడిన రెండు తంత్రుల వీణకుగల పేరు.

ద్వితీయ :— సామగాన కాలతలోని గా రి సా నీ ధా పా అను 6 స్వరములలో రెండవస్వరము. అనగా రిషభస్వరమునకు గలపేరు.

ద్వితీయకాలము :— తాళకాలప్రమాణములోని రెండవవేగము.

ద్వితీయకామోద :— 'సంగీత రత్నాకరము'లో చెప్పబడిన 10 ప్రసిద్ధ దేశి రాగములలో నొకటి.

ద్వితీయకేదార :— 'సోమనాథుని'చే 'రాగవిబోధము'లో పేర్కొనబడిన కేదారరాగములోని ఒక రకము. ఆతడు దీనిని సంపూర్ణరాగముగను, నిషాదమును గ్రహ, న్యాస, అంశ స్వరముగను చెప్పెను.

ద్వితీయగౌడి :— 'సంగీతరత్నాకరము' లో పేర్కొనబడిన ఒకరాగము.

ద్వితీయ ఘనపంచకము :— ఘనరాగ పంచకములలోని రెండవదాని పేరు. కేదారము, నారాయణగౌళ, రీతిగౌళ, సారంగనాట, బౌళి అనువటికి 'ద్వితీయ ఘనపంచక'మని పేరు. నాట, గౌళ, ఆరభి, శ్రీరాగ, వరాళిరాగములకు 'ప్రథమ ఘనపంచకమని' పేరు.

ద్వితీయ తాళము:—'అష్టోత్తరశత' మను 108 తాళములలో 41 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 । 0. మాత్రలు 2. అక్షరకాలములు. 8.

ద్వితీయ పంచమము :— 69 వ మేళ కర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్య రాగము. [భరత సంగీత స్వయంబోధిని.]
ఆరోహణము— స రి గ మ ప ని ప స.
అవరోహణము— స ని ధ ప మ రి గ మరిస.

ద్వితీయ బంగాళ :— 'సంగీత రత్నాకరము'లో పేర్కొనబడిన 10 ప్రసిద్ధ దేశిరాగములలో నొకటి.

ద్వితీయరాగవర్ధని :— రాగ ఆలాపన లోని రెండవభాగము. దీనిలో రాగమును సంచరించునపుడు విచిత్ర కల్పనలతో గమక, వర్ణ, అలంకారములు విలసిల్లు నట్లు జేసి ముఖ్యముగా మధ్యస్థాయి లోను తదుపరి తారస్థాయి పంచమము వఱకును సంచరించి మధ్యస్థాయి షడ్జము నకువచ్చి ముగించుటను 'ద్వితీయరాగ వర్ధని'యని చెప్పబడును.

ద్వితీయలలిత :— 'సంగీతరత్నాకరము' లో పేర్కొనిన 'లలిత రాగము' లోని ఒకరకమునకు గల పేరు.

ద్వితీయవిదారి :— ద్వితీయ రాగవర్ధనిని ముగించు భాగమునకుగల పేరు.

ద్వితీయసైంధవి :— 'సంగీతరత్నాకరము'లో పేర్కొనబడిన 'సైంధవిరాగము' లోని ఒకరకమునకు పేరు.

ద్వితీయసౌరాష్ట్ర :— 'సంగీతరత్నాకరము'లో పేర్కొనబడిన సౌరాష్ట్రరాగములోని ఒకరకము.

ద్వితీయాంగము :—మనోధర్మ సంగీతములోని భాగమగు పల్లవిలోని రెండుభాగములలో రెండవభాగము. ఈ రెండుభాగములు సమానముగా గాని లేకగాని వుండవచ్చును. సమానముగా లేనిదానిలో ప్రథమాంగమే పొడవుగానుండును.

ద్వితీయాక్షర ప్రాసను ప్రవేశ పెట్టిన సంస్కృత రచయితలు :— శ్రీ తీర్థ నారాయణస్వామి, శ్రీ మార్గదర్శి శేషయ్యంగార్, శ్రీ ముత్తుస్వామి దీక్షితార్ వంటి సంస్కృత రచయితలకు గలపేరు.

ద్విధాతు కీర్తన :— కీర్తనలలోని ప్రతి భాగమును రెండు వేరురకపు ధాతువులలో పాడగలుగునట్లు రచియింపబడిన కీర్తనలు. ఉ॥ 'రఘునందన' అను 'కేదారగౌళ రాగము'లోని త్యాగరాజకృతి యిందుకు వుదాహరణమగును.

ద్విధాతు దివ్యనామ కీర్తన :— పల్లవి చరణములు వేరువేరు ధాతువు (స్వరము)లను కలిగియుండు సంగీత రచనకుపేరు. ఉ॥ 'శ్రీరామ శ్రీరామ' అను 'సహానరాగము'లోని త్యాగరాజుని దివ్యనామకీర్తన యిందుకు చక్కని వుదాహరణమగును.

ద్విధాతు ప్రబంధము :— సంగీత రచనలలో ఉద్గ్రాహ, ధృవ అను రెండు భాగములుగానుండు రచనకుపేరు. ఉ॥ జయదేవుని అష్టపదులు యిట్టి ద్విధాతుప్రబంధములకు మంచి వుదాహరణమగును.

ద్వినామ తాళములు :— మకరందను, మహానంద అనియు గజలీలను, జగలీల అనియు మట్యాను, వీరమట్య అనియు వర్ధనతాళమును, రత్నతాళమనియు రాజనారాయణను, నారాయణి అనియు మదన తాళమును, మతంగ తాళమనియు విలోకితను, విలోప అనియు చెప్పబడును. గనుక యిటువంటి తాళములకు గలపేరు.

ద్విపద :— రెండేసి పాదములు కలిగిన ఒక విధమగు పద్యరచనకుపేరు. గేయ నాటకములందు యిట్టి ద్విపదలువుండును. 'అరుణాచలకవిరాయర్' రామనాటకములో యిట్టి ద్విపదలు అనేకము గలవు.

ద్విపది :— ద్విజాతి ప్రబంధములోగల 6 విధములలో 3 వ దానిపేరు.

ద్విమాత్రకము :— తాళ షడంగములో 4 వదియైన 'గురువు'నకు గల 6వి శేష నామములలో మొదటిదాని పేరు.

ద్విముఖవాద్యము :— చర్మ వాద్యములలో రెండు ముఖములు కలిగినవాద్యము నకు పేరు. ఉ|| మృదంగము, డోలు (తబిల్) డోలక్ లు యీరకమునకు చెందిన వాద్యములగును.

ద్విముద్రకారులు :— సంగీత రచయితలలో యెవరుతమ రచనలందు రెండురకములైన ముద్రలను యేర్పఱచుదురో వారికిగల పేరు. ఉ||(1)భద్రాచలరామదాసు. ఇతడు తనరచనలలో కొన్ని తావులందురామదాస అనియు, మరికొన్ని తావులందు భద్రశైల అనియు రచించియుండెను. (2) గోపాలకృష్ణభారతి. ఈయన కొన్నిరచనలలో గోపాలకృష్ణ అనియు, మరికొన్ని రచనలలో 'బాలకృష్ణ' అనియు రచించియుండెను. గనుక యిట్టివారికి గలపేరు.

ద్విముద్ర ప్రబంధము :— సంగీత రచనలలో యేర్పరచు ద్వాదశ ముద్రలలో ఏవైన రెండు ముద్రలుగల రచనలకు గల పేరు. ఉ|| నిత్యకల్యాణి రాగమాలిక యిందు (1) వాగ్గేయకార ముద్రయు (2) రాగముద్రయు గలవు.

ద్విరదగామిని :— 66 మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము:— స రి మ ప ధ ని స.
అవరోహణము:— స ని ధ ప మ రి స.

ద్వితీయ అంతరము :— రెండు శృతుల మధ్యనుండు తేడాకుగల పేరు. ఇవి రెండు రకములు. 1. పూర్ణ ద్విశృతి అంతరము. 2. న్యూన ద్విశృతి అంతరము.

ద్విశృతి ధైవతము :— ధైవత స్వరము లోని రెండవరకముశృతికిపేరు. సెకండుకు దీని వేపనసంఖ్య (Frequency) 8/5. ఉ|| తోడిరాగము యిట్టి ధైవతముగల రాగమునకు వుదాహరణమగును.

ద్విశృతి రిషభము :— రిషభ స్వరము లోనిరెండవరకముశృతికిపేరు. సెకండుకు దీని వేపనసంఖ్య (Frequency) 16/15. ఇదియు తోడిరాగమునందే వుపయోగింపబడును.

ద్విశృతి వ్యవధి :— దీనికి 16/15, 135/128 అను రెండు విలువలుగలవు. ఈ ద్విశృతి వ్యవధికి, పూర్ణ ఏకశృతి వ్యవధికి మధ్య (2-1) 81/80 లేక ఒక ప్రమాణ శృతికలదు.

ద్విస్వర ప్రస్తారములు :— అసంపూర్ణ తానములలో రెండు స్వరములతో వచ్చు ప్రస్తారములకు పేరు. ఉ|| స రి, తో స రి - రి స అనునవి మాత్రము వచ్చును.

ద్విస్వర వక్రరాగము :— వక్ర రాగములో ఆరోహణ అవరోహణములందు రెండేసి వక్రస్వరములుండు రాగమునకు గలపేరు.

ద్విస్వర వర్జరాగము :— ఒకరాగము లోని ఆరోహణ అవరోహణములందు రెండేసి స్వరములు వర్జింపబడియుండు రాగమునకు పేరు. అనగా ఔడవ-ఔడవ రాగము. ఉ|| హంసధ్వని రాగము.

ద్విస్వర శ్రుతివాద్యము :— రెండు స్వరములగు శ్రుతులు పలుకు తంత్రీసంబంధమైన శ్రుతివాద్యమునకు పేరు. ఉ॥ దోతార్. ఇందు ఒకటి సారణిగను (షడ్జము) రెండవది అనుసారణి (పంచమము) గను స్వరములు పలుకును. ఇది శ్రుతివాద్యములలోని ఒక రకమునకు చెందును.

---

## దీ

దీపక :— 'బృహద్ధర్మ పురాణము' లో పేర్కొనబడిన ఆరు ప్రాథమిక రాగములలో నొకటి. ఇది 'సంగీత రత్నాకరము' తదితర పురాతన గ్రంథములలో కూడా పేర్కొనబడినది. మరియు 'సంగీతసుధ' లో గల 21 రాగాంగ రాగములలో నొకటిగా పేర్కొనబడినది.

దీపకజ్యోతి :— ఇది ఒక అపూర్వ రాగమునకు పేరు. త్యాగరాజుని చే రచింపబడిన 'దయజూడవయ్య' అను ప్రసిద్ధమైన కృతి యీ రాగములోనిదై యున్నది.

దీపకతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళముల పట్టికలోని 56 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 0 0 । । 8 8.

దీపకతాళము :— శాస్త్రీయమైన 108 తాళములలో 65 తాళమునకు పేరు. దీనికి అంగములు 0 0 । । 8 8. మాత్రలు 7. అక్షరకాలములు 28.

దీపకర్ణ :— "బృహద్ధర్మ పురాణము" లో పేర్కొనబడిన ప్రాథమిక రాగమైన 'దీపకరాగము' యొక్క "దేశి" రాగములలో నొకటి.

దీపకరాగము :— 51 వ మేళకర్తయగు "కామవర్ధని" యొక్క జన్యరాగము. ఆరోహణము- స గ మ ప ధ ప స. అవరోహణము- స ని ధ ని ప మ గ రి స. ఇది ఉభయ వక్రరాగము. దీనిలో 'కలిల నేర్చిన' అను 'త్యాగరాజుని' ప్రసిద్ధమైన కృతి గలదు.

దీపకళిక :— ఇది యొక అపూర్వ రాగము. పూర్వము ఒక మహనీయుడు ఈ రాగము పాడినంతనే దీపము దానంతట అదే వెలిగినట్లుగా తెలియుచున్న ఒక రాగము. ఈ అద్భుతము ఆ గాయకుని వుపాసనా రాగమహిమకు నిదర్శనమగును.

దీపరము :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ధ ని స. అవరోహణము- స ని ధ ని ప మ గ రి స.

దీపరాగము:— పార్శ్వ దేవుని 'సంగీత సమయ సారము' లో పేర్కొనిన ఒక రాగము.

దీపవక్త్రము :— 'బృహద్ధర్మ పురాణము' లో పేర్కొనిన ప్రాథమిక రాగమైన 'దీపక' యొక్క 'దేశి' రాగములలో నొకటి.

దీపవర్ణము :— 'బృహద్ధర్మ పురాణము'లో చెప్పబడిన ప్రాథమిక రాగమైన 'దీపక' యొక్క 'దేశి' రాగములలో నొకదాని పేరు.

దీపహస్తము :— 'బృహద్ధర్మ పురాణము'లో చెప్పబడిన 6 ప్రాథమిక రాగములలో నొకటైన 'దీపక' యొక్క 'దేశి' రాగములలో నొకదాని పేరు.

దీప్త :— శార్ఙ్గదేవునిచే చెప్పబడిన 22 శ్రుతులకుగల పంచజాతులలో మొదటి దాని పేరు. మిగిలిన నాలుగు శ్రుతిజాతులు ఆయత, కరుణ, మృదు, మధ్య అనునవి.

దీప్తము :— షడంగములలో 5 వదైన ప్లుతమునకుగల 5 పేర్లలో 3 వది.

దీపాక్షి :— 'బృహద్ధర్మ పురాణము'లో చెప్పబడిన ప్రాథమిక రాగములలో 'దీపక' యొక్క 'దేశి' రాగములలో నొక దానికి గలపేరు.

దీపిక :— చతుర్దండి ప్రకాశికలో చెప్పబడిన 'దీపకము'ను బోలినటువంటి ఒక రాగము.

దీపికావసంతము :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ధ ప మ రి స.
[సం. కౌ.]

దీపినీజాతిప్రబంధము :— ఏకజాతి ప్రబంధములోని 6 విధములలో 3 వది. ఇది 4 అంగములను 5 భేదములను కల్గి యుండును.

దీప్రమతి :— 'నారదుని'చే ద్వావింశతి శ్రుతివిధానములో చెప్పబడిన 'ఋషభము' యొక్క రెండవశ్రుతికి గలపేరు.

దీర్ఘ :— అనగా పొడవు అని ఒక అర్థము. మరియు దీర్ఘస్వరమునకు గలపేరు. ఇది రెండు హ్రస్వస్వర కాలములను గలిగియుండును. దీర్ఘస్వరమునకు వ్యతిరేకమైనది హ్రస్వస్వరము. ఇది ఒక స్వరకాలమును కలిగియుండును.

దీర్ఘక :— 'దీర్ఘిక' అను రాగమునకు పూర్తిగా సరిపోవునట్టి రాగము.

దీర్ఘకంపితము :— ఒక స్వరమును దీర్ఘముగా కంపితము (గమకము) చేయుటకు గలపేరు. ఉ॥ ఆనందభైరవి రాగములోని 'సాధారణ గాంధారము', యిట్టి దీర్ఘకంపితమునకు వుదాహరణము. దీనికి వ్యతిరేకమైనది హ్రస్వ కంపితమగును.

దీర్ఘకము :— తాళ షడంగములలోని 4 వదైన గురువునకు గల 6 విశేషనామములలో 6 వ దానికి గలపేరు.

దీర్ఘతరంగిణి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గమరిగరిస.

దీర్ఘదర్శి :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి మ ప ధ ని ధ స.
అవరోహణము-స ని ధ ప మ గ మ స.
[ప. శే. ప్రా. గ్రం.]

దీర్ఘనందిని :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- ప ధ ని స గ మ రి మ ప ని.
అవరోహణము- ధ ప మ గ రి స ని ధ ప.
[సం. స్వ. ప్ర. సా]

దీర్ఘ మంగలి :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

దీర్ఘిక :— 7 వ మేళకర్తయగు 'సేనాపతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

దీక్షాంగి :— 46 వ మేళకర్తయగు 'షడ్విధ మార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి స మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స రి స.

దీక్షిత నవావర్ణ కృతులు :— 'శ్రీ ముత్తుస్వామి దీక్షితుల'చే రచింపబడిన ఈ దిగువనున్న 9 కృతులకు గలపేరు.

1. కమలాంబికే.
తోడిరాగము - రూపకతాళము.
2. కమలాంబాంభజరే.
కల్యాణిరాగము - ఆదితాళము.
3. శ్రీ కమలాంబికే.
శంకరాభరణరాగము - ఆదితాళము.
4. శ్రీ కమలాంబికాయై.
కాంభోజిరాగము - అటతాళము
5. శ్రీ కమలాంబాయాం.
భైరవిరాగము - ఝంపెతాళము
6. శ్రీ కమలాంబికాయా.
పున్నాగవరాళిరాగము- ఆదితాళము
7. శ్రీ కమలాంబికేయాం.
సహానరాగము - త్రిపుటతాళము
8. శ్రీ కమలాంబికే.
శ్రీరాగము - ఖండఏకతాళము
9. శ్రీ కమలాంబాజయతి.
ఆహిరిరాగము - త్రిశ్రఏకతాళము

దీక్షిత పంచలింగస్థల కృతులు :—'శ్రీ ముత్తుస్వామి దీక్షితుల'చే 'పంచలింగ క్షేత్రముల'గూర్చిరచింపబడిన యైదు కీర్తనలకుపేరు.

1. చింతయమాం. భైరవి-
చతురశ్ర. రూపకం-పృథివి-కంచీపురము
2. జంబూపతే - యమునకల్యాణి.
త్రిశ్ర. ఏక - అప్పు - తిరువానైకాల్
3. అరుణాచలనాథం - సారంగ.
త్రిశ్ర. ఏక- తేయు- తిరువణ్ణామలై
4. శ్రీ కాళహస్త్రీశ. హుసేని -
మిశ్ర. ఝంపె- వాయు-కాళహస్త్రి.
5. ఆనంద నటనప్రకాశమ్ - కేదారం.
మిశ్ర. ఏక- ఆకాశ- చిదంబరము

దీక్షితార్ :— 1776-1835. కాలమునకు చెందిన శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి గల సంక్షిప్త నామము.

దీక్షితుల రచనలు :— 'శ్రీముత్తుస్వామి దీక్షితుల'చే రచించబడిన వివిధ సంగీత రచనలకు గలపేరు.

దీక్షితుల రచనలు :— 'శ్రీ నటరాజ సుందరంపిళ్ళై'చే వ్రాయబడిన ఒక సంగీత గ్రంథమునకు గలపేరు.

ద్వీపవతి :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము — స రి మ ప ధ ని స.
అవరోహణము — స ని ధ ప మ రి స.
ఇది ఏకస్వరవర్జరాగమునకు చెందును.

---

# దు

దుక్కఘంటారము :—ఇది 'ఘంట' రాగములోని ఒక రకము. దుఃఖపూరితమగు విచారమును సూచించును. ఈరాగమును కథాకళి, నాటికలందు ముఖ్యముగా పాడుదురు.

దుక్కరాగము :— పురాతన తమిళ సంగీతములోని "పాలైయాళ్"కు చెందిన ఒక రాగము.

దుందుభ్యాఘాత :— "దుందుభి" అను చర్మవాద్యమును కొట్టుటవల్లకలుగుధ్వనికి పేరు.

దుందుభి :— "దుందుభిప్రియ" వలెనుండు ఒక రాగము.

దుందుభి :— మామిడికఱ్ఱతో చేయబడు ఒక పెద్ద చర్మవాద్యము.

దుందుభిప్రియ :—48 వ మేళకర్తయగు "దివ్యమణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.
'శ్రీత్యాగరాజుని'చే రచించబడిన "లీలగానుజూచే" అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదై యున్నది.

*దునిభిన్నషడ్జము :—72మేళకర్తలలో 9 వ మేళకర్తయగు "ధేనుక" రాగమునకు "వెంకటమఖి" పెట్టినపేరు. ఇది 2 వ "నేత్ర" చక్రములోని 3 వ మేళమగును.

దురవతాళము :— "పింగళనిగండు"చే పేర్కొనబడిన 9 తాళములలో 9 వ తాళముపేరు.

దుర్బలస్వరము :— బలహీనమైన స్వరమునకు పేరు. కొన్ని రాగములలో ఒకటి లేక రెండు దుర్బలస్వరము లుండును. ఉ॥ ఆరభిరాగములోని 'గాంధారము' దుర్బల స్వరమునకు ఒక మంచి వుదాహరణమగును.

దుర్గా :— శుద్ధసావేరి రాగమునకు సరిపోవు ఉత్తరహిందూస్థానమునందలి సంగీతములోని ఒక రాగమునకు పేరు. ఇది 'శంకరాభరణము' మేళము లేక 'బిలావల్ థాట్' (జనకరాగము) యొక్క జన్యరాగమగును.

ద్రువకీర్ణవము :— 43 వ మేళకర్తయగు "గవాంభోధి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.

ద్రువాణప్రియ :— 'ద్రుహిణప్రియ' రాగమునే మరియొకవిధముగా పిలువబడినట్టి పేరు.

దృశ్యగానపరీక్ష :— దృశ్యగానములో జరుపు పరీక్షకు గలపేరు.

దృశ్యగానము :— నొటేషన్ పద్ధతిలో వ్రాయబడిన స్వరముల వరుసనుచూచి వాటికిగల స్వరములతో పాడుట. (Sight Singing)

ద్రుష్టుడు :— శృంగార నాయకులు 4 గురిలో 3 వ వానికి గలపేరు.

ద్రుహిణప్రియ :— 18 వ మేళకర్తయగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.
ఇది ద్విస్వరవర్జరాగమునకు చెందును.
[సం. స్వ. ప్ర. సా.]

# దూ

దూతి :— ఉపనాయికలలోని 8 విధములలో మొదటిదానికిగల పేరు.

దూర్ధఖ్యాయమ్ :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ప మ రి గ మ రి స.
ఇది షాడవ – వక్రషాడవమునకు చెందును.
దీనిని 'సంగీత స్వరప్రస్తారసాగరము'లో పేర్కొనబడినది.

దూర్వాహి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
[సంగీతకాముద.]
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇదిషాడవ– సంపూర్ణరాగమునకుచెందును.

---

# దె

దెశ :— 'రఘునాథనాయిక్' యొక్క 'సంగీతసుధ'అనుగ్రంథములో పేర్కొనిన 20 శుద్ధరాగములలో నొకటి.

దెహాళి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.
ఇది ద్విస్వరవర్జరాగమునకు చెందును.
[సం. స్వ. ప్ర. సా.]

దేవకాంత :— 58 వ మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ధ ప మ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

దేవక్రి :— 'నారదుని' 'సంగీతమకరంద' మను గ్రంథములో పేర్కొనిన ఒక 'స్త్రీ' రాగము. ఇది సోమనాథుని 'రాగవిబోధ ము' లో కూడా పేర్కొన బడినది.

దేవక్రియ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.
ఇది ఉపాంగరాగము. త్యాగరాజునిచే రచింపబడిన 'నాటిమాట మరచితివో' అను ప్రసిద్ధమైన కృతి ఈరాగములో రచింపబడిన దగును.

దేవక్రియ :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' లో కూడ యిదే పేరుతో నిషాదాంత్యమైన ఒక జన్యరాగము కలదు.
ఆరోహణము— స రి గ మ ని ధ ని.
అవరోహణము— ప ధ మ గ రి స ని.
శ్రీ ముత్తుస్వామి దీక్షితుని సంప్రదాయములో 'శుద్ధసావేరి' రాగము నే 'దేవక్రియ' రాగముగా వాడినట్లు తెలియుచున్నది. ఉ॥ 'శ్రీ గురుగుహతారయాశుమాం' అను కృతిని దేవక్రియ రాగములో రచింపబడినట్లుగా కొందరు చెప్పుదురు.

దేవక్రి :— 'సంగీత రత్నాకరము' లో క్రియాంగరాగముల శీర్షిక క్రింద చెప్పబడిన ఒక రాగము. మిగత రెండును రాము స్త్రీ, గౌడక్రి అనునవి. 'సంగీత సుధ' లో కూడా దీనిని క్రియాంగ రాగముల తరగతి క్రిందనే చెప్పబడెను.

దేవకురంజి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
[సం. కా.]

దేవకుసుమావళి :— 60 వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప స.
అవరోహణము— స ని ప మ గ రి స.
ఇది వక్రస్వరాంతర- షాడవరాగమగును.

దేవనాటము :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి గ రి స.

దేవకేళి :— 'బృహద్ధర్మ పురాణము' లో 'వసంతరాగము' యొక్క రాగిణీ రాగములందు పేర్కొనిన ఒక దాసిరాగము.

దేవకోటి :— 50 వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ని స.
అవరోహణము— స ధ ప మ రి గ స.

దేవగాంధార :— 'నారదుని' సంగీత మకరందము' లో సూర్యాంశ రాగముల తరగతి క్రింద పేర్కొనబడిన ఒక రాగము.

దేవగాంధారి :—29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఔడవ సంపూర్ణము. భాషాంగరాగము. ప ధ ని స, మ ప ధా, ని స రీ అనునవి ఈ రాగమందలి విశేష సంచారములగును. మరియు ప ధ ని ధ, మ ప ధ ప, ప ధ ని ధ పా అను సంచారములందు కైశికీ నిషాద ప్రయోగముగలదు. ప్రాచీనరాగము. వీరరసముగల రాగమునకు చెందును. త్యాగరాజుని 'క్షీరసాగరశయన' అను సుప్రసిద్ధమైన కృతి యీరాగములోనిదై యున్నది.

దేవగిరి :—51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ స రి స.
(ప. శే. ౖవా. ౖగం.)

దేవగిరి :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.
ఇది ఔడవ - వక్ర సంపూర్ణ రాగమునకు చెందును. [సం. స్వ. ప్ర. సా.]

దేవగిరి :— హైదరాబాదు సంస్థానములోని ఉత్తర భాగమునకు చెందిన 'నవీన దౌలతాబాదు' అను పట్టణమునకు పూర్వము పిలువబడునట్టి పేరు. ఇచ్చటనే సంగీత రత్నాకర గ్రంథకర్తయగు శ్రీ శార్ఙ్గదేవుడు క్రీ. శ. 1210 — 1247 వరకు వుండి 'సంగీత రత్నాకరము'ను ఒక సుప్రసిద్ధ లక్షణ గ్రంథమును సంస్కృతములో రచించినట్లు తెలియుచున్నది.

దేవగీర్వాణి :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప స.
అవరోహణము— స ప మ గ రి స.

దేవగుప్తము :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ స.

దేవగుప్తి :— 'దేవగుప్తము'వలె నుండునట్టి రాగము. [సం. కా.]

దేవఘోషప్రియ :—28వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ధ ని స రి గ మ ప ధ.
అవరోహణము— ధ ప మ గ రి స ని ధ.

దేవతాలి :— ప్రాచీన తమిళ సంగీతములోని 16 పెద్ద రాగములలో నొక రాగమునకుగల పేరు.

దేవనాయకి :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

దేవమణి :— 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

దేవమనోహరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ రి స.
ఇది ఉపాంగరాగము. షాడవ - వక్ర షాడవ రాగము. గాంధారమువర్జ్యము. రిషభ, మధ్యమ, నిషాదములు జీవస్వరములు. శ్రీ త్యాగరాజుని, 'కన్నతండ్రి నాపై' అనుకృతియు మైసూరు శ్రీ వాసుదేవాచారియొక్క 'పలుకవదేమిరా' అను కృతియు యీ రాగములోనివగును.

దేవమాలాక :— 43 వ మేళకర్తయగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప ధ ప మ గ రి స.

దేవమాళవి :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ని ధ ప మ గ రి స ని.
ఇది నిషాదాంత్య రాగమునకు ఒక మంచి యుదాహరణమగును.

దేవముఖారి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ పమరిగమరిస.
[సం. కా.]

దేవముఖి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
ఇది ఔడవ-షాడవ రాగమునకుచెందును.
[సం. కా.]

దేవరంజని :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
ఇది ఏకస్వర వక్రసంపూర్ణ - షాడవ రాగమునకు చెందును. [సం. కా.]

దేవరంజని :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
ఇది ఔడవ-షాడవ రాగమునకుచెందును.

దేవరంజి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది షాడవ-సంపూర్ణ రాగమునకుచెందును.
[ప. శే. ప్రా. గ్రం.]

దేవరనామములు :— మహాభక్తులగు శ్రీ పురందరదాసు, కనకదాసు, మొదలగు భక్తకవులు కన్నడ భాషలో రచించిన భక్తిరస ప్రధానమైన సంగీత రచనలకు గల పేరు.

దేవరాష్ట్రము :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

దేవలు :—'ద్వావింశతిశ్రుతులనుగురించి' విశేషముగా పరిశోధన సలిపిన ఒక ప్రాచీన సంగీతపండితునికి గలపేరు.

దేవసాలగము :— 25 వ మేళకర్త యగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

దేవాభరణము :— 49 వ మేళకర్త యగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

దేవామృత వర్షిణి :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ మ ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఉపాంగరాగము. వక్రషాడవ – సంపూర్ణ రాగము. మధ్యమ, ధైవత, నిషాదములు జీవస్వరములు. స మ గ మ, స ధ ని ప అనునవి విశేష ప్రయోగములు. ఉ॥ 'ఎవ రని నిర్ణయించిరిరా' అనెడి త్యాగ రాజుని ప్రసిద్ధకృతి ఈ రాగములోనిది.

దేవామృతవాహిని :— 64 వ మేళకర్త యగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

దేవాక్రమము :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
ఇది 'హంసానందిరాగము' నకుసరిపోవును.

దేవాళి :— 'సంగీతరత్నాకరము' 'సంగీత సుధ' వంటి ప్రమాణ లక్షణ గ్రంథ ములలో పేర్కొనబడిన ఒక ఉపాంగ రాగమునకు పేరు.

దేశకార్ :— హిందూస్థానీ సంగీతములో గల ఒక రాగము పేరు. మరియునిది 'భావ భట్టుని' చే పేర్కొనబడిన 20 ఠాట్ (జనక రాగము) లలో కూడా ఒకటిగా నున్నది.

దేశకారి :— ఇది ఒక స్త్రీరాగమునకు గల పేరు.

దేశఖ :— 'హంసవిలాసము' అను గ్రంథ ములో పేర్కొనబడిన ఒక రాగము.

దేశఖ్య :— 'సంగీత రత్నాకరము, సంగీత సమయసారము' అను గ్రంథములలో పేర్కొనబడిన ఒక రాగము. 'సంగీత సమయసారము అనెడి గ్రంథములో దీనిని 4 రాగాంగషాడవ రాగములలో నొక టిగా పేర్కొన బడినది.

దేశదేశాఖ్య :— నారదుని 'సంగీత మక రందము' లో పేర్కొన బడిన ఒక రాగాంగ రాగము.

దేశముఖారి :— దేశ్యముఖారి రాగము నకు గల మరియొక పేరు.

దేశరంజని :— 31 వ మేళకర్త యగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

దేశల గౌడ :— 'సంగీత సమయసారము' లో పేర్కొనబడిన ఒక ఔడవరాగము.

దేశవరాళి :— 'జయదేవుని' "గీతగోవిందము" అను గ్రంథములోగల 20 వ అష్టపదికి యేర్పఱచిన ఒక రాగము.

[తె. గ్రం.]

దేశవాళ :— 'సంగీత రత్నాకరము' లో పేర్కొనిన 'గౌడరాగమునకు' చెందిన ఒక ఉపాంగరాగము.

దేశ్యఅంధాళి :— 9 వ మేళకర్తయగు "ధేనుక" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

[సం. కా.]

దేశ్యకమాసు :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.
ఈ రాగములో 'స రి గ మ గ రి స' అనునొక విశేష సంచారముకూడ కలదు.

[సం. కా.]

దేశ్యకల్యాణి :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ధ ప మ రి స.
దీనికి 'జడరంజని' కి ప్రతిమధ్యమ భేదము.

దేశ్యకానడ :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ప గా మ రి స.
ఈ రాగములో 'స ని ప ని స' అనునదియు 'ప ధ ని ధ ప గా మ రి స' అనునదియు విశేషసంచారములుగా నున్నవి.

[సం. కా.]

దేశ్యకాపి :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.
ఇది హిందూస్థాని 'కాఫి' రాగమునకు సరిపోవునదిగానుండును.

దేశ్యక్రియ :— దేశి పద్ధతిలోని తాళాంగములకు చెందిన ఒక క్రియకుగల పేరు. ఈ పద్ధతికి వ్యతిరేకమైనది మార్గపద్ధతియగును.

దేశ్యక్రియాష్టకములు :— శబ్దహీనతమైన అభినయముగలిగి తాళాంగములకు చెందిన 8 రకములగు క్రియలకుగల పేరు. అవి యేవనగా

1. ధ్రువక—శబ్దరహితమైనట్టి ఒక క్రియ.
2. సర్పిణి — కుడిచేతిని ఎడమచేతివైపుకు త్రిప్పుట.
3. కృష్య — కుడిచేతిని ఎడమవైపునుంచి కుడివైపుకు త్రిప్పుట.
4. పద్మిని—అరచేతిని నేలవైపువుండునట్లు పెట్టి కుడిచేతిని క్రిందికి దించుట.
5. విసర్జిత—కుడిచేతిని వెలుపలికి చాచుట.
6. విక్షిప్త — కుడిచేతివ్రేళ్ళను లెక్కించునట్లు ముడుచుట.
7. పతాక — కుడిచేతిని అరచేయి క్రిందికి వుండునట్లు పైకిఎత్తుట.
8. పతిత — ఎత్తిన కుడిచేతిని క్రిందికి అదేవిధముగా దించుట.

దేశ్యగానవారిధి :— 60 వ మేళకర్తయగు "నీతిమతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ప స.
అవరోహణము— స ని స ప మ గ రి స.

దేశ్యగౌరి :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.
[సం. కౌ.]

దేశ్యగౌళ :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి స ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప స రి స.

దేశ్యతోడి :— 8 వ మేళకర్తయగు "హనుమత్తోడి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
దీనిలో 'ని ధ ప గా మ ప మ గ రి స' విశేష సంచారం.

దేశ్యనాటకురంజి :— 55 వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ని ప ధ ప మ గ రి స.

దేశ్యనారాయణి :— 6 వ మేళకర్తయగు "తానరూపి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

దేశ్యబంగాళ :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' జన్యరాగము. [సం. కౌ.]
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

దేశ్యబ్యాగ్ :— ఇది హిందూస్థానీ 'బెహాగ్' రాగమువలె నుండు రాగము.

దేశ్యబ్యాగడ :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

దేశ్యబేగడ :— 19 వ మేళకర్తయగు "ఝంకారధ్వని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

దేశ్యమనోహరి :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ప మ గ రి స.

దేశ్యమారువ :— 54 వ మేళకర్తయగు "విశ్వంభరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

దేశ్యముఖారి :— 25 వ మేళకర్తయగు "మారరంజని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి గ మ ని ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప గ రి స.

దేశ్యరాగము :— రాగాంగ, ఉపాంగ, భాషాంగ, క్రియాంగములను 4 విధములు గల రాగమునకు పేరు.

దేశ్యరేగుప్తి :— 'దేశ్యరేవగుప్తి' వలె నుండు రాగమునకు పేరు.

దేశ్యరేవగుప్తి :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము- స ధ ని ధ ప మ గ స.

దేశ్యలఘు :— ఖండజాతి లఘువునకు గలపేరు. దీనికి అంగములు 1. అక్షర కాలములు 5. ఇది వేయునపుడు 1 ఘాత వేసి 4 వ్రేళ్ళను లెక్కింప వలెను.

దేశ్యశ్రీ :— 58 వ మేళకర్త యగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని ధ స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

దేశ్య శుద్ధ సంకీర్ణ లఘువు :— ఇది ఒక రకమునకు చెందిన లఘువు. దీనిని వేయునపుడు 1 ఘాత వేసి 15 వ్రేళ్ళు లెక్కింప వలెను. దీనికి అంగము 1. అక్షర కాలములు 16. ఈరకమైన లఘువును 'కర్ణాటక లఘువు' అనికూడా పిలుతురు.

దేశ్యసంకీర్ణ లఘువు :— లఘువులలోని ఒకరకపుజాతిలఘువుకు పేరు. దీనికిఅంగము 1. అక్షరకాలములు 10. ఇది వేయునపుడు 1 ఘాతవేసి 9 వ్రేళ్లు లెక్కింపవలెను.

దేశ్యసంగీతము — రంజకముగా చేయ బడు గానమునకు గలపేరు.

దేశ్యసురటి :—6వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ రి గ మ ప ధ ని.
అవరోహణము- ప మ గ రి స ని.

[సం. కా.]

దేశ్యాంగరాగము :— భాషాంగరాగము నకుగల మరియొక పేరు.

దేశాదితాళము :—ఇది 35 తాళములలో లేని ఒక రకపుతాళము. ఇది వేయునపుడు ఒక విసర్జితము 3 ఘాతలు వేయవలెను. దీని నడక నెమ్మదిగానుండును. విసర్జితములో ¾ వంతు అక్షరకాలము వ్యవధి అయినతరువాత సంగీతము ప్రారంభించునది గానుండును. ఉ॥ ఘువినిదాసుడ. శ్రీరంజని.

దేశావాళి :—55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని ధ స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

దేశాకరి :—"అరిబత్తనావలర్"చే రచింపబడిన "బరతశాస్త్రిరమ్" అను తమిళ గ్రంధములో పేర్కొనబడిన రాగములలో నొకటి.

దేశాక్షి :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది బిలహరిరాగమునకు కొంతవరకు సరిపోవునదిగానుండును. ఈ తాళములో తారస్థాయియందు మ గ గ రి- స రి గ రి స- స ని ని ధ స మొదలగునవి రంజకప్రయోగములు. కొన్నిసందర్భములలో స ని ధ ప అను ప్రయోగములో కైశికీ నిషాదము పలుకును. ఇదియొక ప్రాచీనరాగము. జయదేవుడు తన అష్టపదులలో 9 వ దైన "స్తనవినిహితమపి" అను అష్టపదిని యీ రాగమునందే రచించెను. మధ్యమము గ్రహస్వరముగా రాగాలాపన చేయవలెను. ఉ॥ మ గ ప ధ. ఈవిధముగా నుండవలెను. నారదుని "సంగీత మకరం

దము”లోను ఇరత గ్రంథములలో కూడ నీరాగము పేర్కొనబడెను.

దేశాక్షిరి :— 35 వ మేళకర్త యగు “శూలిని” యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రిస.
[గా. వి. ప్ర.]

దేశి :— “భరత సిద్ధాంతము” మొదలగు కొన్ని నృత్యగ్రంథములలో పేర్కొన బడిన 3 రకములగు నృత్యములలో నొక దానిపేరు. ఇది మధ్యమతరగతికి చెందిన నృత్యమగును. రెండవది వడుగు. ఇది మిక్కిలి అందమైన నృత్యమగును. మూడ వది శింగళమ్. ఇది శ్రేష్టమైన తరగతికి చెందిన నృత్యమగును.

దేశికగౌరి :— “దేశ్యగౌరి” వలెనుండు రాగమునకుగల పేరు.

దేశికతోడి :— ఇది ఒక జన్యరాగమునకు గలపేరు. ‘పురందరదాసు’ యొక్క ఒక ముఖ్యరచనయగు “ఇడిగ భకుతియు”అను నా సరి ప ద ము యీ రాగములోనిదై యున్నది.

దేశికదేవగాన :— “బరతనాట్టియశాస్తిరమ్” అను (17 వ శతాబ్దమునకు చెందిన) ఒక తమిళ వ్రాతప్రతి గ్రంథము లో పేర్కొనిన ఒక రాగము.

దేశికబంగాళ :— 8 వ మేళకర్తయగు “హనుమతోడి” యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప మ ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

దేశికప్రభావ ప్రకాశిక కీర్తనలు :— (1845—1905) శ్రీ “అనంతభారతి”చే “దేశిక” యొక్క విశిష్టతను నిరూపిం చునట్లు రచింపబడిన కీర్తనలకు పేరు.

దేశికరుద్రి :— 9 వ మేళకర్త యగు “ధేనుక” యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ రి గ మ ప ని స.
అవరోహణము- స ని ప ధ మ గ రి స.

దేశికిన్నరి :— “సంగీత రత్నాకరము” లో పేర్కొనబడిన మెట్లుగల తంత్రీ వాద్యమైన“కిన్నరి” లోని ఒకరకము.

దేశితాళములు :— ధృవాది సప్తతాళ ములకు గల మరియొకపేరు.

దేశినీ :— నారదుని “సంగీత మకరంద” మను గ్రంథములో పేర్కొనిన ఒక స్త్రీ రాగము.

దేశిముఖారి:—‘దేశ్యముఖారి’కిపూర్తిగా సరిపోవునట్టి రాగము.

దేశిశుద్ధము :— చతురశ్రజాతి ధృవ తాళమునకు సరిపోవునట్టి తాళముపేరు. దీనికి అంగములు I O I I. మాత్రలు 3½. ఆవర్తమునకు అక్షరకాలములు 14.

దేశిసాలగము :— ధృవరూపకము వంటి యొక తాళమునకు గలపేరు. దీనికి అంగ ములు I O I I O I. మాత్రలు 5. ఆవర్త మునకు అక్షరకాలములు 20.

దేశీతాళములు :— దేశీ సంగీతమునకు సంబంధించిన తాళకొలతలకు గలపేరు. ఇవి శార్ఙ్గదేవుని 'సంగీతరత్నాకర' గ్రంథములో పేర్కొనబడిన 120 దేశి తాళము లగును.

దేశీప్రబంధము :— దేశీ సంగీతమునకు సంబంధించిన ఒక సంగీతరచనకు పేరు. దీనికి వ్యతిరేక మైనది మార్గప్రబంధము. అది మార్గ సంగీతమునకు సంబంధించిన సంగీతరచన యగును.

దేశీయతోడి :— 'దేశ్యతోడి'కి పూర్తిగా సరిపోవునట్టి రాగము.

దేశీయరాగము :— ఉత్తరదేశమునుండి స్వీకరింపబడి కొన్ని యితరరాగ కళలతో స్ఫురించునట్టి రాగము. ఉ॥ కాపిరాగము.

దేశీరాగము :— దేశీ సంగీతమునకు చెందినట్టి ఒకరాగమునకుగల పేరు.

దేశీసంగీతము :— ఇండియాలోగల వివిధములగు రాష్ట్రీయములకు చెందిన ఆయా సంగీతములకు గలపేరు.

దేశీసింహారవము :— అసంపూర్ణ మేళ పద్ధతిలోని 58 వ మేళమునకు గలపేరు. ఇది 'హేమవతి' రాగమునకు సరిపోవును. 'దేశి' అనుపదము కటపయాది సూత్రము ననుసరించి 58 వ సంఖ్య యగును.

దెష్ :—ప్రాచీన శుద్ధమిశ్ర మేళపద్ధతి నందలి 5184 మేళములలో 2044 వ (ధీర-హరి)మేళముయొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది కేదారగౌళ రాగమునకు సరిపోవు నదిగానున్నను ఆరోహణమునందు కాకలీ నిషాద ప్రయోగము కలిగియుండును.

దేషానమ్ :— ప్రాచీన గ్రంథములలో పేర్కొనబడిన 6 ముఖ్యరాగములలో నొకదానికి గలపేరు.

# దై

దైన్యము :— వ్యభిచారీ భావములలోని 33 విధములలో 8 వ దానికిగల పేరు.

ద్వైత చింతామణి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యమైన షాడవ-వక్ర-సంపూర్ణరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ప ధ మ గ రి స.
[సం. కౌ.]

ద్వైతానంది :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ని ధ ని ప మ రి స.

ద్వైతపరిపూర్తి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ నీ.
అవరోహణము- ధ ప మ రి మ గ స.
[సం. కౌ.]

దొడ్డమీటు:— వీణావాద్యమొనర్చునపుడు గంభీరముగా పలుకునటుల తంతిని గట్టిగా మీటుటకుగల పేరు.

దొంక (ధొంక) :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ స.
ఇది వలజిరాగమును బోలిన ఆరోహణ అవరోహణములను కలిగిన 13 వ మేళకర్త జన్యరాగమగును.

దొంబక్రితి :— 'సంగీతరత్నాకరము'లో పేర్కొనబడిన ఒక రాగము.

దొలన :— 'సోమనాధుని' 'రాగవిబోధము' అను గ్రంధములో పేర్కొనబడిన పనితనముగల ఒక రకమైన వీణావాద్యమునకు గలపేరు.

# దో

దో - తార్ :— ఉత్తర భారతదేశములో వుపయోగించెడి రెండు తంత్రులుగలిగిన శృతివాద్యమునకుగల పేరు. గాయకుని లేక ప్రదర్శకుని ఆధారషడ్జశృతిననుసరించి యీ రెండు తంత్రులు శృతి చేయబడును.

దోంబకి :— "పార్శ్వదేవు"ని 'సంగీతసమయసారము'లో పేర్కొనబడిన రిషభ, పంచమ, వర్జమైన ఒక ఔడవరాగము.

దోంబులీ :— నారదుని 'సంగీత మకరందము'లో పేర్కొనబడిన పురుష రాగములకు చెందిన ఒకరాగము.

దోషరహితరాగము :— రాగములలో యే సమయములందు పాడినను దోషము లేనట్టి రాగమునకుగల పేరు. ఉ॥ మోహన, మధ్యమావతి, సౌరాష్ట్ర రాగములు యిట్టిరాగములకు మంచి వుదాహరణములగును.

దోషరహితస్వరూపిణీ :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- ప మ ప ధ ని స గ.
అవరోహణము- రి స ని ధ ప మ ప.

దోహరా :— మహారాష్ట్ర సంప్రదాయమైన హరికథా కాలక్షేపములందు పాడునట్టి ఒకరకమైన సంగీత రచనకుగల పేరు.

దోహ్య :— 'సంగీత రత్నాకరము'లో టక్కభాషల శీర్షికక్రింద పేర్కొనబడిన ఒక రాగము.

---

# దౌ

దౌరేయణి :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

ధ :— భారతీయ సంగీతమునకు ప్రాముఖ్యమైన సప్తస్వరముల సంకేతములగు స రి గ మ ప ధ ని అను 7 స్వరములలో ఆఱవ స్వరమైన ధైవతమునకుగల సంకేతాక్షరము.

ధ :—ధైవత స్వరములోని 3 భేదములగు శుద్ధధైవత, చతుశ్రృతిధైవత, షట్శ్రుతిధైవతములకు 'వెంకటమఖి' పెట్టిన సంకేతాక్షరములగు ధ, ధి, ధు, లలో మొదటిదానికి గలపేరు. అనగా శుద్ధ ధైవతమునకు గల సంకేతాక్షరము.

ధంకిణి :— 'నటనాదివాద్య రంజనమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన ఒక తాళము. ఇది 'ఢెంకిక' తాళమునకు సరిపోవునదిగా నుండును.

ధతకుంద :—15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ని ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

ధత్తతాళము :—"సంగీత రత్నాకరము" లో పేర్కొనబడిన 120దేశితాళములలో నొక తాళమునకు గలపేరు.

ధ - న (మేళము):— 72 మేళకర్తలుంగల 12 మేళచక్రములలో శుద్ధ ధైవత, శుద్ధ నిషాదములుగల మొదటి మేళములకు వెంకటమఖి పెట్టిన సంకేతనామము. 72 మేళకర్తలలో 1, 7, 13, 19, 25, 31, 37, 43, 49, 55, 61, 67, మేళములు యిట్టి ధ - న మేళములకు చెందును. అనగా యీధ-నమేళములు "పా" తరగతికి చెందిన మేళములగును.

ధనక్రియధాతు :—20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ-షాడవము. [సం. కౌ.]

ధనపాలినీ :—16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ప స.
అవరోహణము— సనిధపమ ధ మ గ రి స.
ఇదివక్రఔడవ-వక్రసంపూర్ణము. [సం.కౌ

ధనశ్రీ :—"నాట్టియశాస్తిరమ్"అను ప్రాచీన తమిళగ్రంథములో"ధన్యాసి" రాగమునకు చెప్పబడిన మఱియొక పేరు.

ధన్యక్రి :—ప్రాచీనగ్రంథములలో చెప్పబడిన 12 క్రియాంగ రాగములలోనొకటి.

ధనాశి :—ధన్యాసి రాగమునకుగల మఱియొక పేరు.

ధనానరి :—"చతుర్దండి ప్రకాశిక" లో పేర్కొనబడిన ఒక దేశిరాగము.

ధనాసి :— ధన్యాసి రాగమువలెనుండు రాగము. ఈధనాసిరాగములో శ్రీ "పురందరదాసు" "గజవదన"అను నొకచక్కని కీర్తన రచించెను.

ధన్నాశి :— ఇది ధన్యాసి రాగమునకు సరిపోవు రాగము. సంగీత రత్నాకర, సం

గీత మకరందము, లనెడి గ్రంథములందు ఈ రాగము పేరు తెలుపబడెను.

ధన్యాసి :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది ఉపాంగరాగము. గాంధార, నిషాదములు రెండును జీవస్వరములును, దీర్ఘస్వరములునుగాక, కంపిత గమకములై యున్నవి. ఇది త్రిస్థాయిలందు పాడదగిన రాగము. రిషభ, మధ్యమ, ధైవతములు న్యాసస్వరములు కావు. మరియు రిషభ, ధైవతములు కంపిత స్వరములును కావు. ప్రాతః కాలమున పాడదగిన రాగము. శ్లోకములు, పద్యములు, సాధారణముగా ఈ రాగములోనే పాడుదురు. మంగళములు ఈ రాగములో రచింతురు. స నీ స ధా ప, అనునది ఈ రాగములోని విశేషసంచారమగును. శ్రీ త్యాగరాజుని 'సంగీతజ్ఞానము, "రామాభిరామా, శ్యామసుందరాంగ, అనునవి ఈ రాగములోని ప్రసిద్ధ కృతులగును.

ధ-ని (మేళము) :— 72 మేళకర్తలుగల 12 చక్రములలో ప్రతిచక్రములోని శుద్ధ ధైవత, కైశికీ నిషాదములుగల 2 వ మేళములకు "వెంకటమఖి" పెట్టిన సంకేత నామము. ఇది "శ్రీ" తరంగతికి చెందును.

ధన్వి :— కమాను (Bow) లేక విల్లు తో వాయింపబడు ఒక తంత్రీవాద్యము.

ధన్విజా :— కమాను (Bow) తో వాయింపబడు ఒకరకపు తంత్రీవాద్యము.

ధ-ను (మేళము) :— 72 మేళకర్తలుగల 12 చక్రములలో ప్రతిచక్రములోని శుద్ధ ధైవత, కాకలీ నిషాదములుగల 3 వ మేళములకుగల సంకేతనామము. ఇవి "గో" తరంగతికి చెందిన రాగములగును.

ధనుప్రియ :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

ధనుర్జ్యా :— ఇది విల్లు యొక్క తంతికి పేరు.

ధనుర్వీణా :— విల్లు (Bow) తో వాయింపబడు నొకరకపు ప్రాచీన తంత్రీ వాద్యమునకు పేరు.

ధరజు :— "పురందరదాసు" పదమగు 'ముళ్లుకొనెయలి' అను ప్రసిద్ధరచనగల ఒక రాగము. ఇది ఉడిపి ప్రచురణలో గలదు.

ధరణిప్రియ :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

ధరణిమనోహరి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ప స.
అవరోహణము— స ని ధ ని ప మ గ మ రి స.

ధరపల్లవము :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి గ రి స.

ధర్భకూలము :— దర్భకూలఅను రాగము నకు సరిపోవురాగము.

ధర్మప్రకాశినీ :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ధ మ గ రి స.
ఈ రాగమును "సంగీతస్వరప్రస్తారసాగరము"లో 22 వ మేళజన్యముగా చెప్పబడినది.

[సం. కా.]

ధర్మపురీశ :— 'ధర్మపురి సుబ్బరాయర్' చే రచింపబడిన ప్రసిద్ధమైన జావళులందు గల అంకితమునకు పేరు.

*ధర్మవతి :— 72 మేళకర్తలలో 59 వ మేళకర్తకు గలపేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఈరాగము 10 వ 'దిశి' చక్రములోని 5 వ మేళము. దీనిలో షడ్జ, పంచమములుగాక చతుశ్శ్రుతి రిషభ, సాధారణ గాంధార, ప్రతిమధ్యమ, చతుశ్శ్రుతిధైవత, కాకలీ నిషాదస్వరములుండును. 'తిరువత్తియూర్ త్యాగయ్యర్' ఈరాగములో 'దాతవునీవే గాక' అను ఒక మంచికృతిని రచించెను.

ధర్మసేన :— ఇది "తేవారిమ్" రచయిత లగు ముగ్గురిలో నొకరైన 'అప్పర్' అను నతనిచే పేర్కొనబడిన పేరు.

ధర్మిణి :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

ధర్మిణి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ప మ ధ మ గ రి స.

ధరువచరితము :— ఇది ఒక "కథకళి నాటకము"నకు గలపేరు. దీనిని 'వలియ కోయిల్ తంపురాన్' "కేరళవర్మ" రచించెను.

ధవళకేసరీ :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ స.

ధవళవాహినీ :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

[సం. కా.]

ధవళసరసీరుహము :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ప ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

ధవళహంసి :— 57 వ మేళకర్తయగు 'సింహేంద్ర మధ్యమము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ధవళా :— "సోమనాథుని"చే "రాగ విబోధము"అను గ్రంథములో శ్రీరాగ మేళమునకు చెందిన జన్యరాగముగ పేర్కొనబడిన ఒక రాగము.

*ధవళాంగము :— 72 మేళకర్తలలో 49 వ మేళకర్తయగు "ధవళాంబరి"కి వెంకటముఖి పెట్టిన పేరు.

ధవళాంగము :—అసంపూర్ణమేళ పద్ధతిలోని 49 వ మేళకర్తకుగల పేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
సంగీతత్రిమూర్తులలో నొకరగు "శ్రీ ముద్దుస్వామి దీక్షితులు" "శృంగారాద"అను ప్రసిద్ధమైన చిన్నకృతిని ఈ రాగములో రచించెను.

ధవళాంగి :—15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము. [సం. కా.]
ఆరోహణము— స రి గ మ ప ధ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

*ధవళాంబరి :— ఈ రాగము 72 వ మేళకర్త రాగములలో 49 వ మేళకర్తకుగల పేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
దీనిలో షడ్జ, పంచమములుగాక శుద్ధరిషభ, అంతరగాంధార, ప్రతిమధ్యమ, శుద్ధ ధైవత, శుద్ధ నిషాద స్వరములుండును.

ధవళహంసి :—ఇది "ధవళహంసి" రాగమువలెనుండునట్టి రాగము.

ధ్వజక్రియా :— 27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స నిప మ గ మ రి గ రి స.
ఇది ఔడవ-వక్రషాడవము. [సం. కా.]

ధ్వజోన్నతము :—29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగము. [ప. శే. వ్రా. గ్రం.]
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ప మ గ రి స.

ధ్వని :— శబ్దమునకుగల పేరు. శ్రుతికి బదులుగా"దత్తిల"అను గ్రంథములో ఈ పదము పేర్కొనబడెను. "దత్తిలుడు" ఒక స్థాయిలోగల 22 శ్రుతులను 22 ధ్వనులుగా చెప్పియుండెను.

ధ్వనియొక్క తీవ్రత :— ఒక పదార్థమునుండి వచ్చు ధ్వనియొక్క కదలికల శక్తికి "ధ్వనియొక్క తీవ్రత" అనబడును. అనగా ఒక ధ్వనియొక్క తీవ్రత గాని, గంభీరతగాని, ఆధ్వని యేర్పడునట్టి పదార్థముయొక్క కదలికల శక్తినిబట్టి యుండును. ఈ ధ్వనియొక్క తీవ్రత మారుటకు 5 కారణములు గలవు. అవి యీక్రింది విధముగానుండును.

I. ధ్వనిపుట్టు పదార్థమునకు వినువారి వీనులకుగల దూరము.
II. ధ్వనినిచ్చు పదార్థమునకుగల కదలిక లనిచ్చు శక్తి.
III. ధ్వని ఉత్పత్తిఅయ్యే తావునందుగల గాలియొక్క బరువు.
IV. గాలివీచికల యొక్క దిక్కులు.
V. చుట్టు పట్టునగల తదితర ధ్వనుల నిచ్చు పదార్థములు కారణములగును.

ధ్వనియొక్క శ్రేష్ఠత :— ఒకే స్థాయిలోను, ఒకే గంభీరతలోను, గల ఒక స్వరము లేక ధ్వని, వివిధములైన గాత్రములందుగాని పలురకములగు సంగీత వాద్యములందుగాని ప్రదర్శించునప్పుడు ఆధ్వని దేనియందు జనించు చెట్టిదని చెరా మనము గుర్తించునప్పుడు వాటిలో మాధుర్యమైన సంగీతధ్వనిని ధ్వనియొక్క శ్రేష్ఠత అనబడును.

# ధా

ధాటిమంజరి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ప మ రి స.

ధాతమనోహరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

ధాత్రి :—63వ మేళకర్తయగు "లతాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

ధాతు :— సంగీత రచనలలో గల రెండు భాగములలో మొదటిదైన స్వర భాగమునకు 'ధాతు' యని చెప్పబడును. రెండవదైన సాహిత్యభాగమునకు 'మాతు' యని చెప్పబడును.

ధాతుపంచమము :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ప స.
అవరోహణము— స ని ధ ప మ రి గ మరిస.

ధాతుప్రియ :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

ధాతుమనోహరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ ప ధ ని స.
అవరోహణము. స ని ప మ గ రి స.
ఇది 'ధాతమనోహరి' రాగమువలెనుండును.

*ధాతువర్ధని :— 72 వ మేళకర్తలలో 69 వ మేళకర్త రాగమునకుగల పేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక, షట్శ్రుతి రిషభ, అంతర గాంధార, ప్రతిమధ్యమ, శుద్ధధైవత, కాకలీనిషాదస్వరములుండును.

ధాత్రేయి :— నాయికాలక్షణములో చెప్పబడిన ఉపనాయికలందలి 8 విధములలో 5 వ రకమునకు చెందిన దానికి పేరు.

ధామరంజని :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని ధ స.
అవరోహణము— స ధ మ ప మ రి గ స.

*ధామవతి :— 72 మేళకర్తలలో 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' రాగమునకు, 'వెంకటమఖి' పెట్టినపేరు. ఇది 10 వ 'దిశి' చక్రములో 5 వ మేళమగును.

ధార :— "శ్రీచిన్నస్వామిమొదలియార్" యొక్క 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంధములో పేర్కొనిన కటపయాది సంఖ్యగల సంకీర్ణజాతి ధ్రువతాళమునకు గల నామాంతరము. దీనికి అంగములు I 0 I I. అక్షరకాలములు 29.

*ధాళివరాళి :— 72 మేళకర్తలలో 39 వ మేళకర్తయగు 'ఝూలవరాళి'కి 'వెంకటమఖి' పెట్టిన పేరు. ఇది 7 వ "ఋషి" చక్రములోని 3 వ మేళమగును.

## ధి

ధి :— సంగీతమునకు సంబంధించిన ఒక భాగమైన తాళ ప్రత్యయములగు త, ధి, థోమ్, నమ్, అనుజతులలో రెండవ దానికిపేరు.

ధి :— ఒకస్థాయిలోగల ద్వాదశ స్వరములలో చతుశ్శృతిధైవతమునకు 'వెంకటమఖి' యేర్పఱచిన సంకేతాక్షరము.

ధి :— ఒకస్థాయిలోగల 22 శృతులలో ధైవతమునకుగల 4 శృతులలో రెండవదైన "ద్విశ్శృతిధైవతము"నకు యేర్పఱచిన సంకేతాక్షరము. దీనివేపనసంఖ్య ఒక సెకండుకు 8/5 గా నుండును. మిగత 3 శృతుల సంకేతములు ధ. ధు. ధై. అనునవి.

ధి-ని :— 72 మేళకర్తలలో ప్రతి చక్రములోని చతుశ్శృతి ధైవత - కైశికీ నిషాదములుగల 4 వ మేళమునకు వెంకటమఖి యేర్పఱచిన సంకేతనామము. ఇవి "భూ" మేళములకు సరిపోవును.

ధి-ను :— 72 మేళకర్తలుగల 12 చక్రములలో ప్రతి చక్రములోని చతుశ్శృతి ధైవత - కాకలీ నిషాదములుగల 5 వ మేళమునకు సంకేతనామము. ఇది 'వెంకటమఖి' యేర్పఱచిన మరియొక సంకేతమైన "మా" మేళమగును.

---

## ధీ

ధీకరుణి :— 52 వ మేళకర్త యగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— సరిమరిమగమధపనిధనిస.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ధీమతాళము :— హిందూస్థానీ సంగీతములో వుపయోగింపబడు ఒక తాళము. ఇది 4, 4, 4, 4, అక్షరకాలములుగా వేయబడును. గనుక దీనిని ఆదితాళముగా చెప్పవచ్చు.

ధీర :— సూళాది 35 తాళములలో 34 వ తాళమైన "సంకీర్ణజాతి అటతాళ

ము” నకు గల పేరు. దీనికిఅంగములు ।।00 మాత్రలు 5½. ఆవర్తమునకు అక్షరకాలములు 22.

ధీరకళా :— 22 వ మేళకర్తయగు ‘ఖరహరప్రియ’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
[సం. కౌ.]

ధీరకుంతళి :— 59 వ మేళకర్తయగు ‘ధర్మవతి’యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ధీరతాళము:—‘సంకీర్ణజాతిఅటతాళము’ నకు గల మరియొక పేరు. దీనికి అంగములు ।। 0 0. అక్షరకాలములు 22.

ధీరమతి :— (i) 13 వ మేళకర్తయగు ‘గాయకప్రియ’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ మ రి గ రి స.
[సం. కౌ.]

(ii) 29 వ ధీరశంకరాభరణ జన్యము.
స గ రి గ మ ప మ ని ధ స.
స ని ప ధ స ప మ గ రి స. [గా. లో.]

* ధీరశంకరాభరణము :— 72 మేళకర్తలలో 29వమేళకర్త రాగమునకుపేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక, చతుశ్శ్రుతి రిషభ, అంతరగాంధార, శుద్ధమధ్యమ చతుశ్శ్రుతిధైవత,కాకలీనిషాదస్వరములుండును.

ధీరస్వరూపి :— 49 వ మేళకర్తయగు ‘ధవళాంబరి’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ధ ప మ గ స.
[గా. లో.]

ధీరస్వరూపిణి :— ఇది ‘ధీరస్వరూపి’ రాగమునకు సరిపోవునట్టి రాగము.
[గా. వి. ప్ర.]

ధీరసావేరి :— 69 వ మేళకర్తయగు ‘ధాతువర్ధని’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
[గా. లో.]

ధీరాకారి :— 59 వ మేళకర్తయగు ‘ధర్మవతి’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

దివ్యక్రియ :— 49 వ మేళకర్తయగు ‘ధవళాంబరి’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ధీషణారతి :— 15 వ మేళకర్తయగు ‘మాయామాళవగౌళ’ యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— సనిధపధమరిసనిధనిస.

---

ధు :— ధైవతస్వరములోగల 3 వ రకమునకు చెందిన "షట్శ్రుతి ధైవతము"నకు 'వెంకటమఖి'యేర్పఱచినసంకేతాక్షరము.

ధున్ :— హిందూస్తానీ సంగీతములో సాధారణముగా పాడుకొనునట్టి ఒకకీర్తన.

ధునిభిన్నషడ్జము :— అసంపూర్ణ మేళపద్ధతిలోని 9 వ మేళమునకు గలపేరు.

ధు-ను :— (మేళము) 72 మేళకర్తలు గల 12 చక్రములలో ప్రతి చక్రములో గల 6 వ మేళమునకు గలపేరు. అనగా ప్రతిచక్రములోని షట్శ్రుతి ధైవతము, కాకలీనిషాదములుగల 6 వ మేళమునకు గుర్తుగా ధు-ను, అక్షరములను 'వెంకటమఖి' యేర్పఱచి యుండెను.

ధృతరూప :— 34 వ మేళకర్తయగు "వాగధీశ్వరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ప మ గ మ రి గ స.

ధృతి :— వ్యభిచారీ భావములోని 33 విధములలో 11వ దానికి "ధృతి" యని చెప్పబడును.

ధృతివర్ధని :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరా భరణము" యొక్క జన్యరాగము. [సం. కా.]
ఆరోహణము– స గ మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ రి గ రి స.

ధ్రుపద్ :— ఇది "ధ్రువపద"మునకుగల మరియొకపేరు. హిందూస్తానీ సంగీతములో దీనిని చౌక కాలములో పాడుదురు.

ధృవ :— భరతుని 'నాట్యశాస్త్రము'లో పేర్కొనబడిన ఒక సంగీత రచన.

ధృవ :—మార్గక్రియాష్టకములగు 8 టిలో నొకదానికిగల పేరు. ఇది మార్గపద్ధతిలోని 8 తాళాంగములలో నొకటియైన సశబ్దక్రియగానున్నది.

ధృవ :— ప్రబంధములయొక్క ముగింపును ధృవములనబడును. ప్రాచీన ప్రబంధములలోని 4ధాతులలోనిదియొకటి. మిగిలినవి ఉద్గ్రాహ, మేళాపక,ఆభోగలగును.

ధృవక :— ఎడమచేతిమీద కుడిచేతితో కొట్టుటకుగల పేరు. ఇది దేశ్యక్రియాష్టకములగురిటిలోనొకటి. ఇదిసశబ్దక్రియగానుండును.

ధృవక్రియ :—శబ్దరూపమైన ఘాత లేక చిటికకు గలపేరు.

ధృవకీర్తవము :— 43 వ మేళకర్తయగు "గవాంభోది"యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ని ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి గ స.

ధృవచరితము :— వలియ కోయిల్ తంపురాన్ శ్రీ "కేరళవర్మ"చే రచింపబడిన ఒక "కథకళి" నాట్యము.

ధృవచాపు :—ప్రాచీనకాలములో వాడునట్టి చాపుతాళములోని యొకరకము. దీనికి అంగములు । 3 । 4. అక్షరకాలములు 7. దీనినే పూర్వీకులు మరియొక విధముగా వాడినారు. ఎటులనగా మొద

ట ఒక లయ (ఘాత) తరువాత రెండు గురువులు (2 వ్రేళ్లు లెక్కించుట) = 1 త్రిశ్ర లఘువు, తదుపరి ఒక లయ(ఘాత) వెంటనే మూడు గురువులు (3 వ్రేళ్లులెక్కించుట) = 1 చతురశ్ర లఘువుగా చెప్పియున్నారు. ఉ॥ స రి గ । రి స రి గ ॥ రి గ మ । గ రి గ మ॥ ఈవిధముగా నుండును.

ధ్రువతాళము :— ప్రాముఖ్యమైన సూళాది సప్తతాళములలో మొదటిదానికి గలపేరు. దీనికి అంగములు । 0 । ।. అనగా । లఘువు । ద్రుతము । లఘువు । లఘువు. అక్షరకాలము జాతినిబట్టి మారును.

ధ్రువపద :— (ధ్రుపద్) హిందూస్థానీ సంగీతములోని ఒక రకమునకు చెందినట్టి కీర్తనకు పేరు. దీనినడక నెమ్మదిగానుండును. ఇది నాలుగు భాగములుగా నుండును. స్థాయి, అంతరా, సంచారి, ఆభోగ్ అనునవి.

ధ్రువరూపకము :—గీతములకు సంబంధించినదిగా స్థిరీకరింపబడిన ఒక తాళకాల ప్రమాణమునకు 'ధ్రువరూపక' మనిపేరు. ఇట్టి గీతములు సాధారణముగా రెండు ఖండికలు (భాగములు) గా నుండును. ఈ గీతములు 'ధ్రువరూపకము' లో పాడునపుడు మొదట 1 సారి రెండుద్రుతములు, రెండు లఘువులు వరుసగావేసి తదుపరి మామూలు రూపకతాళమువలె 1 ద్రుతము 1 లఘువుగా వేయుచూ మొదటి ఖండికను పూర్తిచేయవలెను, తరువాత రెండవఖండిక ప్రారంభించునపుడుకూడ మొదట 2 ద్రుతములు 2 లఘువులతోనే ప్రారంభించి తదుపరి రెండవఖండిక చివరవరకు మామూలు రూపకతాళమువలె 1 ద్రుతము 1 లఘువు వేయుచునే రెండవ ఖండికను ముగించవలెను. ఒక్కొక్కప్పుడు 1 ద్రుతము 1 లఘువుకు బదులు 2 ఘాతలు 1 విసర్జితము వేయుటకూడ కలదని తెలియుచున్నది. కొందరు దీనినే ధ్రువ+రూపక మందురు. ఉ॥ అరెయానక, అను నాట రాగ గీతము.

ధ్రువలు :— భరతుని 'నాట్యశాస్త్రము' లో చెప్పబడి ఆకాలములో నాట్యములో నుపయోగించిన ప్రధానమైన రెండు విధములగు రచనలలో మొదటిది.

ధ్రువవీణ :— శార్ఙ్గదేవుడు, 22 శ్రుతులను నిశ్చయించుటకై ఒకేపే కొలతగల రెండు వీణలు చేసికొని వీణ ఒకటికి 22 తంత్రులువేసి ఒక శ్రుతిలో ఒక స్థాయిలో ఒకటికంటె నొకటి ఉత్తరోత్తరము తీవ్రమైన 22 శ్రుతులను చేసికొనుచూ యీ శ్రుతులమధ్య మరియొక శ్రుతిలేకుండ చేయటానికి పరిశోధనగా వుపయోగించిన రెండు వీణలలో మొదటివీణకుగల పేరు. రెండవది చలవీణయగును.

ధ్రువాగానము :— ప్రాచీనకాలములో నాటకములలో నుపయోగించెడి కీర్తనలు లేక ధ్రువలతో పాడబడునట్టి సంగీతము. ఈ ధ్రువాగానములో 'గాంధారోదీచ్యవ' అను ప్రాచీన రాగము వుపయోగింపబడెను.

ధూడీమల్లార్ :— హిందూస్థానీ సంగీతములో పాడునట్టి ఒకరాగము.

ధూతిరాగము:— ప్రాచీనగ్రంథములలో రాగవిభాగమునందలి రాగ - రాగిణీ - పరివార పద్ధతిలో చెప్పబడిన స్త్రీరాగము.

ధున్ :— హిందూస్థానీ సంగీతములో ఒక రాగము.

ధూన :— "తులసీదాసు" అనుభక్తుని యొక్క 'అంజనికుమార' అనుకీర్తనకు యేర్పఱచియున్న రాగము.

ధూమాల :— 42 వ మేళకర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని.
అవరోహణము- ప మ రి గ రి స.

ధూర్జటిప్రియ :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

ధూర్వాంకి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ని ప ధ ప మ గ రి స.
[గా. లో.]

ధూసరవర్ణి :— 19 వ మేళకర్తయగు 'ఝుంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప రి స.
ఇది ద్విస్వర వర్జరాగమునకు చెందును.

## ధే

*ధేనుక :— 72 మేళకర్తలలో 9 వ మేళకర్తకుగల పేరు. ఇది 2 వ "నేత్ర" చక్రములోని 3 వ "గో" మేళమగును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఈ రాగమున షడ్జ, పంచమములుగాక శుద్ధరిషభ, సాధారణగాంధార, శుద్ధ మధ్యమ, శుద్ధధైవత, కాకలీ నిషాద స్వరములుండును. ఇది సర్వస్వర గమక, వరిక, రక్తి రాగము. గాంధార, నిషాదములు జీవస్వరములు. దీర్ఘ గాంధారము. ప్రాతఃకాలమున పాడదగినది. త్యాగరాజుని ప్రసిద్ధ రచనయగు 'తెలియలేరు రామ' అను కృతి ఈ 'ధేనుక' రాగములోనిదై యున్నది.

---

## ధై

ధైర్యకరి :— "శ్రీ చిట్టిబాబునాయుడు" వ్రాయబడిన 'కీ టు హిందూమ్యూజిక్' అను గ్రంథములో పేర్కొనబడిన ఒక జన్యరాగము.

ధైర్యముఖి :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ప మ ప రి గ.

ధైర్యోదరీ :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ధ ప మ రి గ రి స.

ధైవతద్వయ బాషాంగరాగము :— ఇది రెండు ధైవతములుగల భైరవిరాగముపేరు.

ధైవతభూషిత :— 'సంగీతసుధ' అను గ్రంథములో పేర్కొనబడిన ఒకరాగము.

ధైవతము :—భారతీయ సంగీతములోగల సప్తస్వరములో 6 వ స్వరమునకుపేరు.

ధైవతాంత్యరాగము :— ఒక రాగము లో హెచ్చైన స్వరము మధ్యస్థాయిలోని ధైవతముగానుండునని 'ధైవతాంత్యరాగ'మని చెప్పుదురు. ఉ॥ కురంజి రాగము.

ధైవతి :— మధ్య గ్రామమునకుచెందిన 7 శుద్ధ జాతులలో నొకటి. ఇది శంకరాభరణము యొక్క నిషాదమూర్ఛనకు రిషభమి పరిపోవును. ఇది వికృత పంచమ మేళములలో నొకటియగును.

# ధౌ

*ధౌతపంచమము :— అసంపూర్ణ మేళపద్ధతిలోని 69 వ మేళమునకుగల పేరు.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి గా స.
ఈరాగమున మ ప ధ సా, ని ప ని సా, స ని ప మ ప, ధ ప మ ప, రి గ సా అనెడి ప్రత్యేక సంచారములు గలవు. శ్రీ 'ముత్తుస్వామిదీక్షితార్' యొక్క 'మాతంగీ మరకతాంగి' అను ప్రసిద్ధమైన కృతి ఈ రాగములోనిదై యున్నది.

*ధౌతపంచమము :— ఇది 72 మేళకర్తలలో 69 వ మేళకర్తకు "వెంకటమఖి" మొదట పెట్టినపేరు.

ధౌమ్యరాగము :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది 'కాంభోజి'ని పోలియుండును.
[గా. లో.]

ధౌరేయణి :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
[ప. శే. ప్రా. గ్రం.]

ధౌలికా :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
[సం. కౌ.]

ధౌలికాగౌళ :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' జన్యరాగము. [స. కౌ.]
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ని ప గ మ రి స.

ధ్వాఖంకరము :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగమునకు గలపేరు.
[ప. శే. గ్రం.]
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

న :— "నిషాదస్వరము"లోగల 3 రకములలో మొదటిదైన "శుద్ధనిషాదము"నకు 'వెంకటమఖి' యేర్పఱచిన సంకేతాక్షరము.

నక్కారా :— భారతదేశపు 'నగారా' అను చర్మవాద్యమునకు పర్ష్యాదేశములో వాడునట్టి పేరు.

నఖజ :— గోటితోమీటు సంగీత వాద్యమునుండి పలుకు స్వరములకుపేరు.

నఖప్రకాశిని :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని ధ ప స.
అవరోహణము– స ధ ని ప మ గ రి స.

న–గణము :—తాళ అంతర్గత అంగముల కేర్పఱచిన 8 గణములలో 5 వ గణము నకుగలపేరు. దీనికి అంగములు l l l. అనగా 3 లఘువులు.

నగారా :— భారతదేశములో దేవతా వుత్సవములు, పూజలు, నైవేద్యములు జరుపు సమయములందు వుపయోగించునట్టి ఒకరకపు చర్మవాద్యము.

నచరం :— 23వ మేళకర్తయగు 'గౌరీ మనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ రి గ మ ని ధ ని స.
అవరోహణము– స ని ధ మ ప మ రి గ స.
[సం. స్వ. ప్ర. సా.]

నట :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో పేర్కొనిన కటపయాది సంఖ్యకుసరిపోవునట్టి 'చతురశ్రజాతిమఠ్య తాళము'నకు గల నామాంతరము. దీనికి అంగములు l 0 l. అక్షరకాలములు 10.

నట :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో కటపయాది సంఖ్యకు సరి పడునట్లేర్పఱచిన 'త్రిశ్రజాతిఅటతాళము' నకు గలపేరు. దీనికి అంగములు l l 0 0. అక్షరకాలములు 10.

నటనదీపరము :— 41వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని మ గ రి గ స.

నటనవేళావళి :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము– స రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

నటనారాయణి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము– స రి గ స రి మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ రి స.

నటాభరణము :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ మ రిస.

* నటాభరణము :— 72 మేళకర్తలలో 10వ మేళకర్తయగు 'నాటకప్రియ'కు 'వెంకటమఖి' మొదటపెట్టినపేరు.

* నరభైరవి :— 72 మేళకర్తలలో 20వ మేళకర్తకుగలపేరు. ఇది 4వ 'వేద' చక్రములోని 2 వ మేళమగును. దీనిలో షడ్జ, పంచమములుగాక చ. రి - సా. గాం - శు. మ - శు. ధై - కై. ని షాద స్వరము లుండును.

నంద :— స్థాయి అలంకార జాతిలోని శాస్త్రీయుక్తమగు పేర్లలో 6 వ దానికిగల పేరు. ఉ॥ స స రి రి స స - రి రి గ గ రి రి మొదలగునవి.

నందన :—భావభట్టుని, "అనూప సంగీత విలాస"మను గ్రంథములోని 22 శృతుల పేర్లలో షడ్జమునకుగల 4 శృతులలో 1 వ దానికిగల పేరు.

నందనతాళము :— శాస్త్రీయ మైన "అష్టోత్తరశత తాళము" లగు 108 లో 57 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I 0 0 3. మాత్రలు 5. అక్షరకాలములు 20.

నన్దనతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 తాళములలో 54 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I 003.

నందయతి :— "రత్నాకరము" లోని 11 వక్రజాతులలో 11 వ దానికిగలపేరు.

నందవసుధ :— 30 వ మేళకర్తయగు "నాగానందిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ రి గ మ స.

నందాలక :—26 వ మేళకర్తయగు "చారుకేశి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి మ గ స.

నంహాల్య :—25 వ మేళకర్తయగు "మారరంజని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

నందిచిందు :—"గోపాలకృష్ణ భారతి" పునరుద్ధరించిన సంగీత లక్షణ విషయము.

నందితాళము :— "అష్టోత్తరశత" తాళములగు 108 లో 68 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I 0 0 I I 8. మాత్రలు 6. అక్షరకాలములు 24.

నందిని :— 14 వ మేళకర్తయగు "వకుళాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

నందిని :—28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ధ మ గ స.
[సం. స్వ. ప్ర. సా.]

నందిని :— 30 వ మేళకర్తయగు "నాగానందిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

నందిముఖి :— 43 వ మేళకర్తయగు "గవాంభోధి" యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- సనిధనిపధమగరిమరిస.

నపుంసకరాగము :— నారదునిచే "సంగీత మకరందము"లో పేర్కొనబడిన రాగ విభజనలోని 3 రకములలో 3 వది.

*నభోమణి :— 72 మేళకర్తలలో 40 వ మేళకర్తయగు "నవనీతము"నకు "వెంకటమఖి" మొదటపెట్టినపేరు. ఇది 7వ 'ఋషి' చక్రములోని 4వ మేళమగును.

నభోమార్గిణి :— 16 వ మేళకర్తయగు "చక్రవాకము" యొక్క జన్యరాగము.
ఆరోహణము - స గ మ ప ధ ని స.
అవరోహణము- స ధా ప మ గ రి స.

నయనభాషిణి :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము- స ని ధ ని ప గ మ గ స.

నయనరంజని — 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము- స ని ప ని ధ మ గ రి స.

నయమతి :— 60 వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

నయరాగము :— కోమలములై, హృదయరంజకములైన ఫలితములనిచ్చు రాగము లను 'నయ' రాగములని చెప్పుదురు. ఉ॥ భైరవి, ముఖారి, కాంభోజి మొదలగునవి యీ రకమునకు చెందును.

నర :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో చెప్పబడిన 'కటపయాది' సంఖ్యగల 'సంకీర్ణజాతిమఠ్యతాళము'నకు గల పేరు. దీనికి అంగములు 101. అక్షర కాలములు 20.

నర్తకి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

నర్తననిర్ణయ :— 'పుండరీక విఠలు'నిచే వ్రాయబడినయొక నాట్యగ్రంథమునకుగల పేరు.

నర్మద :— 50 వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ ప మ గ రి స.

నలినకుసుమావళి :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప మ ప స.
అవరోహణము- స ని ధ ని ప మ రి స.

నలినభ్రమరి :— 58 వ మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ని ప మ రి స.

నలినసుఖి :— 34 వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.

నలినహంసి :— 35 వ మేళకర్తయగు 'శూలిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

నవ :—నవసంధి తాళములగు 9 టిలో 6 వ తాళమునకుగల పేరు.

నవగ్రహములు :— 'సంగీత కౌముది' అను సంగీత లక్షణ గ్రంథములో 22 వ పేజీలోని తాళప్రకరణములో గ్రహ లక్షణమందుజెప్పబడిన 9 గ్రహములకుగల పేరు. అవి 1. సమము. 2. అనాగతము. 3. విషమము. 4. అతీతము. 5. అనుద్యమము. 6. అనూదనము. 7. సనాదము. 8. సాభినందనము. 9. సునాదము అనునవి నవగ్రహములని చెప్పబడును.

నవతాళములు :— 'బరతశాస్తిరమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనిన 1. అరితాళము, 2. అరుమతాళము, 3. సమతాళము, 4. జయతాళము, 5. చిత్తిరతాళము, 6. దురువతాళము, 7. నివిర్తతాళము, 8. పడిమతాళము, 9. విదతాళము అను 9 తాళములకుగల పేరు.

నవతాళములు :— 'పింగళనిగండు' చే పేర్కొనబడిన 1 సమతాళము 2 అరుమతాళము, 3 అటతాళము, 4 పడిమతాళము, 5 జయతాళము, 6 మట్టిమతాళము, 7 విదతాళము, 8 నివిర్తతాళము, 9 దురువతాళము అను 9 తాళములకు గలపేరు.

నవనీత పంచమం :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ రి స.

*నవనీతము :— 72 మేళకర్తలలో 40 వ మేళకర్తకు గలపేరు. ఇది 7 వ 'ఋషి' చక్రములోని 4 వ మేళమగును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములే గాక శు. రిషభ- శు. గాంధార- ప్ర. మధ్యమ- చ. ధై- కై. నిషాదస్వరము లుండును.

నవపల్లవి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని పధపస.
అవరోహణము- స ని ధ ప ధ మ గ స.

నవబత్ :— మధ్యయుగమునందుగల ప్రజలు రాత్రింబగళ్ళయందు కాలమును తెలిసికొనుటకు నిర్ణీత గంటలలో వాయించెడి ఒకవిధమగు చర్మవాద్యమునకుపేరు.

నవమాలి :— 'రాగతాళ చింతామణి' అను తెలుగుసంగీతగ్రంథములో పేర్కొనబడిన యితరులు చెప్పనటువంటి తాళములలో నొకదానిపేరు.

నవరత్నభూషణి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

నవరత్నమాలిక :— తంజావూరు 'ప్రతాపసింహ మహారాజు' మహారాష్ట్రి

భాషలో రచించిన 'రాగతాళమాలిక'కు 'నవరత్నమాలిక' అని కూడ చెప్పుదురు.

నవరత్నమాలిక :— శ్రీ బి. సుబ్బారావుచే వ్రాయబడిన యొక సంగీతగ్రంథముపేరు.

నవరత్నమాలికా కీర్తనలు :— 'స్వాతి తిరునాల్ మహారాజు'చే రచింపబడిన 9 రకములగు భక్తికీర్తనలకు గలపేరు. వాటి వివరములు ఈక్రింద గమనించునది.

భక్తి — కీర్తన — రాగము — తాళము

శ్రవణమ్– భవదీయకథా– భైరవి– ఆది.

కీర్తనమ్–తావకనామాని–కేదారగౌళ–ఝంప.

స్మరణమ్–సతతంసంస్మరోణిహ–నీలాంబరి– అట.

పాదసేవనమ్–పంకజాక్ష–తోడి– రూపకం

అర్చనమ్–ఆరాధయామి– బిలహరి– అట.

వందనమ్–వందేదేవదేవ– బేగడ– ఝంప.

దాస్యమ్– పరమపురుష– ఆహిరి– అట.

సఖ్యమ్– భవతివిశ్వాసో– ముఖారి– అట.

ఆత్మనివేదనమ్–దేవదేవకల్పయామి–నాదనామక్రియ–రూపకము.

పై దెలుపబడిన 9 కీర్తనలు భజనకొరకై ప్రత్యేకింప బడినటుల తెలియుచున్నది. వీటికే 'నవరత్నమాలికా కీర్తన'లనిపేరు.

నవరత్నవిలాసము :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క–జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ప స.
అవరోహణము– స ధ ప మ గ మ రి స.

నవరస :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యమైన వక్రషాడవ – ఔడవరాగము.
ఆరోహణము– స రి గ మ ని ధ ని స.
అవరోహణము– స ని ప మ రి స.

నవరస ఆంధాళి :— 49 వ మేళకర్త యగు 'ధవళాంబరి'యొక్క–జన్యరాగము.
ఆరోహణము– స గ రి గ మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ రి గ స.

నవరసకన్నడ :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప స.
అవరోహణము– స ని ధ మా గ రి స.
ఇది స్వరాంతర – షాడవరాగమగును.

నవరసకళానిధి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యమైన వక్రఔడవ – సంపూర్ణరాగము.
ఆరోహణము– స రి మ ప స ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

నవరసకుంతలి :— 40 వ మేళకర్త యగు 'నవనీతము' యొక్క–జన్యరాగము.
ఆరోహణము– స మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప ధ మ గ రి స.

నవరసగాంధారి :— 50 వ మేళకర్త యగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

నవరసచంద్రిక :— 13 వ మేళకర్త యగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప మ ధ స.
అవరోహణము– స ధ ప మ గ రి స.

నవరసచంద్రిక :— 49 వ మేళకర్త యగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ధ ప గ రి స.

నవరసబంగాళ :— 47 వ మేళకర్త యగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

నవరోజు :— 29 వ మేళకర్తయగు 'ధీర శంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- ప ధ ని స రి గ మ ప.
అవరోహణము- మ గ రి స ని ధ ప.
ఇది పంచమాంత్యరాగమునకు చెందును.

నవవిధభక్తులు :—శ్రీ 'స్వాతితిరునాల్' మహారాజుచే రచింపబడిన నవరత్న మాలికా కీర్తనలుగల 9రకములైన భక్తులు. అవి 1. శ్రవణమ్, 2. కీర్తనమ్, 3. స్మరణమ్, 4. పాదసేవనమ్, 5. అర్చనమ్, 6. వందనమ్. 7. దాస్యమ్ 8. సఖ్యమ్. 9. ఆత్మనివేదనమ్ అనునీ 9 టికి నవవిధ భక్తులని పేరు.

నవసంధి తాళములు :— ప్రాచీన తమిళ గ్రంథములో పేర్కొనిన యొక రకమునకుచెందిన 9 తాళములకు గలపేరు. ఉ॥ శోత్రబము, సమ, మట్టావన, పిరంగని, మనవ, నవ, బొలి, కొట్టారి, డేంగి అనునవి నవసంధితాళములని చెప్పబడును.

నవసూతిక :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

నవాభరణం :— 'రాగతాళ చింతామణి' అను గ్రంథములోని 124 తాళములలో ఇతరులు చెప్పనటువంటి తాళములలో 15 వ దానికి పేరు.

నవీనభోజుడు :— కళావేత్తయు అనేక పదములు రచించినట్టి శ్రీ 'యువరంగ భూపతి'కి గల బిరుదు.

నవీనసంగీతజనకుడు :— పాశ్చాత్య సంగీతములో మొట్టమొదట స్వరసంప్రదాయ పద్ధతిని కనిపెట్టిన 'క్లాడ్ మాన్టివర్డి' అను పాశ్చాత్య సంగీత పండితునికి గల బిరుదు. (Father of Modern Music).

నవోఢ :— నాయికా లక్షణమందు చెప్పబడిన స్వీయనాయికలలోని 5 రకములలో 3 వది 'నవోఢ'యని చెప్పబడును.

నష్ట :— కూటతానముయొక్క ఆకారమును నిర్ణయించు పద్ధతికి 'నష్ట'యని పేరు.

నష్టకళలు :— ఒక తాళాక్షరమునకు 4, 3, 2, 1 ఈవిధముగా కళలు తగ్గుచూ వచ్చినచో 'నష్టకళ'లని చెప్పబడును.

నష్టము :— తాళ ప్రస్తారములు 14 టిలో మొదటిదానికిగల పేరు.

ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ మ గ స.

నాగదీపరము :— 38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము—స ని ధ ని మ గ రి గ స.

నాగధ్వని :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య రాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి స మ గ మ ప ని ధ మ ప ని ధ ని స.
అవరోహణము—స ని ధ ని ప మ గ స.

నాగనీలాంబరి :— 36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

నాగపంచమం :—23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ని ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

నాగప్రభావళి :— 55 వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

నాగభాషిణి :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ప మ రి స.

నాగభూపాళము :—23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని మ గ రి స.

నాగభూషణి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి స.

నాగభోగి :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు సరిపోవును.

నాగమణి :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

నాగమణి :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

నాగరాజము :— 12 వ మేళకర్తయగు 'రూపవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

నాగరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

నాగవరాళి :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్య రాగమునకు చెందును.

నాగవల్లి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

నాగవాహిని :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప మ ధా ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

నాగవేళావళి :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

నాగశిఖరిత :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— సనిధనిపమధమరిగరిస.

నాగసరసీరుహము :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప స.
అవరోహణము— స ని ధ ని ప మ రి స.

నాగస్వరావళి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.
ఇదిఔడవ - ఔడవరాగమునకుచెందును. ఇది హంసధ్వనిరాగములో పంచమమును షడ్జమునగజేసికొని అదేస్వరములను పాడి లేక వాయించినచో యేర్పడురాగము.

నాగసామంతము :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి ప మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

నాగహిందోళము :— 33 వ మేళకర్తయగు 'గాంగేయ భూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ రి స.
ఇది స్వరాంతర - షాడవ రాగమునకు చెందును. [సం. స్వ. ప్ర. సా.]

*నాగానందిని :— 72 మేళకర్తలలో 30 వ మేళకర్తకు గలపేరు. ఇది 5 వ 'బాణ' చక్రములోని 6 వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక చ. రిషభము. అం. గాంధార- శు. మధ్యమ- ష. ధైవత- కా. నిషాద స్వరములుండును.

నాగాభరణము :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ప మ గ మ రి స.

*నాగాభరణము :— 72 మేళకర్తలలో 30 వ మేళకర్తయగు 'నాగానందిని' కి 'వెంకటముఖి' మొదట పెట్టినపేరు.

నాగాభరణి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప మ రి మ ప స.
అవరోహణము- స ధా ప మ గ రి స.

నాగునురప్పించిన గాయకుడు :— 18-19 శతాబ్దములకు చెందిన శ్రీ ముద్దుస్వామి దీక్షితారుని సోదరుడగు చిన్నస్వామి దీక్షితార్ ఒకనాడు 'నాగవరాళి' రాగమును ఆలాపించగనే నాగుపాము వచ్చి ఆ రాగము ముగిసిన వెంటనే వెడలిపోయెనని ప్రఖ్యాతినొందిన 'శ్రీ చిన్నస్వామి దీక్షితారు' నికిగల విశేషనామము.

నాట :— 36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యమగు ఘనరాగము. సంపూర్ణ-ఔడవము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ రి స.

నాటకతోడి :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

*నాటకప్రియ :— 72 మేళకర్తలలో 10 వ మేళకర్తకు గలపేరు. ఇది 2 వ 'నేత్ర' చక్రములోని 4 వ మేళమగును.
ఆరోహణము- స రి గ మ ప ధి ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రిషభ- సా. గాంధార- శు. మధ్యమ- చ. ధైవత- కై. నిషాద స్వరములుండును.

నాటకురంజి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

నాటరాగము :— పురాతన తమిళ సంగీత విభజనలోని ఒకపణ్ (రాగము)కుగలపేరు.

నాట్యగానము :— అభినయ గానమునకు గల మరియొకపేరు. అనగా గాయకుడు వాద్యసహాయముతో పదములను పాడుచు వాటి భావమును హస్తవిన్యాసాదులచే నభినయించుచూ నృత్యము చేయునట్టి గానమునకుగల పేరు.

నాట్యధర్మి :— నాట్యములోని రెండు విధములలో రెండవదానికి గలపేరు.

నాట్యప్రవీణులగు రచయితలు :— శ్రీ సూర్యనారాయణశాస్త్రి, మహాదేవఅన్నావి, కృష్ణశాస్త్రి, మెరట్టూరు వెంకట్రామశాస్త్రి, నిడామంగళమ్ సరస్వతీ తిరువెంకటాచారి, మువ్వలూరు సభాపతి అయ్యర్ మొదలగువారికి గలపేరు.

నాట్యము :— విభావాను భావాదుల కాశ్రయమైన 'యభినయాత్మక' మును నాట్యమని చెప్పుదురు.

నాట్యములో నుపయోగించు సంగీత రచనలు :— 1. ఆలారిప్పు, 2. జతిస్వరము, 3. శబ్దము, 4. పదవర్ణము, 5. పదము, 6. జావళి, 7. తిల్లాన, 8. శ్లోకము, 9. అష్టపది, 10. తరంగము, 11. దరువు, 12. కీర్తనలు మొదలగునవి యీ రకమునకు చెందిన రచనలగును.

నాట్యశాస్త్రము :— 'భరతుని' చే నాట్యమును గురించి వ్రాయబడిన యొక అతి ప్రాచీన లక్షణ గ్రంథమునకు గలపేరు.

నాట్టియశాస్తిరమ్ :— మద్రాసు యూనివర్సిటీకి చెందియున్నదై తమిళములో 17వ శతాబ్దములో వ్రాయబడిన ఒక వ్రాతప్రతిగ్రంథమునకు గలపేరు.

నాట్యాదరణము :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ సं.
అవరోహణము– సं ని ధ ప మ రి స.

నాట్యోమ :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని సं.
అవరోహణము– సं ని ధ మ రి గ మ రి స.

నాడిక :— 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని సं.
అవరోహణము– సं ని మ గ రి స.

నాదగుప్తి :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ రి గ ప ధ ని సं.
అవరోహణము– సं ధ ని ధ ప మ గ రి స.

నాదతరంగిణి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని సं.
అవరోహణము– సं ని ధ ప మ గ రి స.

నాదనామక్రియ :—15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము– ని̣ స రి గ మ ప ధ ని.
అవరోహణము– ని ధ ప మ గ రి స ని̣.
శ్రీ అనయ్యారచించిన 'ఇంతపరాకా' అను ప్రసిద్ధకృతి యీ రాగమునందే గలదు.

నాదప్రియ :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గా మ ప ధ ని సं.
అవరోహణము– సं ని ప మ గ స.

నాదబ్రహ్మము :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స ప మ ప ధ ని సं.
అవరోహణము– సं ని ధ ప మ గ స.

నాదభ్రమరి :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ రి గ మ ప ధ ని.
అవరోహణము– ధ ప మ గ రి స ని̣ స.

నాదము :— శరీరమందలి ఆత్మ మనస్సును ప్రేరేపింపగా, మనస్సు దేహమందుగల వహ్నిని కొట్టగా, వహ్ని వాయువును ప్రేరేపింపగా ఆ వాయువు బ్రహ్మగ్రంథియను మూలాధారమునుండి యూర్ధ్వముగా నాభి, హృదయ, కంఠ, శిరస్సు, ముఖములనుండి క్రమేణా చరించునపుడు ఆవిర్భవించునట్టి ధ్వనిని 'నాదము' అని చెప్పబడును.

నాదము :— స్పందనములవల్ల యేర్పడు సంగీతధ్వని లేక సంగీతము, లేక సంగీతపరికరముయొక్క స్వరమునకుగల పేరు.

దీనినే ఒక వీణానాదము మరియొక వీణా నాదముకంటె శ్రేష్టమని చెప్పబడు చుండును.

నాదమూర్తి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ప మ రి గ స.

నాదరూపి :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

నాదవరాంగిణి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ రి గ రి స.
అవరోహణము— స ప ని ధ ప మ గరిగస.

నాదవినోదిని :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధా నిస.
అవరోహణము— స ని స ధ ప మ గ రీ స.

నాదస్వరూపి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధా ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రీ స.

నాదినీమంజూష :—(Rasonent box) ధ్వనిని గంభీరముచేయు నొకరకపు యంత్రమునకు గలపేరు.

నాదినీస్పందనములు :— సహానుకంపన ములకు గలమరియొకపేరు.



నాందీరతాళము :— 'రత్నాకర' గ్రంథ ములో పేర్కొనిన 120 దేశితాళములలో 63 వ తాళమునకు గలపేరు. దీనికి అంగ ములు । 0 0 । । 8 8.

నాధనాళి :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

నాభి :— పంచమస్వర జన్మస్థానములగు పంచ (5) స్థానములలో మొదటి స్థాన మునకు 'నాభి' అనిపేరు.

*నామదేశి :— 72 మేళకర్తలలో 50 వ మేళకర్తయగు 'నామనారాయణి' కి 'వెంకటమఖి' పెట్టిన మరియొక పేరు.

*నామనారాయణి :— 72 మేళకర్తల లో 50 వ మేళకర్తకుగల పేరు. ఇది 9వ బ్రహ్మచక్రములోని 2 వ మేళము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రిషభ — అం. గాంధార-ప్ర.మధ్యమ- శు. ధైవత- కై. నిషాద స్వరములుండును.

నామభిన్నతాళములు :— తాళములలో రెండు పేర్లను గలిగియున్న తాళములకుగల పేరు. ఉ॥ 'వనమాలి'నివర్ణమాలికఅందురు.

నామావళి :— సులభముగను, సమూహ ముగ పాడుటకును తగినట్లు 1 లేక 2 లేక 4 ఆవర్తములలో రాగస్వరూపమును చిత్రించిసంపూర్ణ భక్తిభావముకూడ నిష్ప

ష్టముచేయబడునట్లు రచించిన యొకరకపు పవిత్ర రచనకుపేరు. ఇవి భజన సమాజము లోనివారిచే మరల మరల పాడబడును. భజనలోని నాయకుడు దీని పౌండరీకము పాడగా మిగిలినవారు మరల దానిని పాడుదురు. సంస్కృతములోను, అందును ఆది తాళములోను యివియెక్కువగా వున్నవి.

నామితము :— పంచదశ గమకములోని 14 వ గమకమునకు 'నామిత'మని పేరు. అనగా నాదము తగ్గించి సూక్ష్మధ్వనితో పాడుటవలన గలుగు స్వరముల కదలింపుకు 'నామిత' మని చెప్పబడును.

నాయకత్రయము :— నాయకులలో పతి, ఉపపతి, వైశికుడు అను మూడు విధములగు నాయకులకుగల పేరు.

నాయకముద్ర :— సంగీత రచనలందు గల 'ద్వాదశ' ముద్రలగు 12 టిలో 7వ దానికి పేరు. ఉ॥ పదములు యిట్టి ముద్రకు వుదాహరణమగును.

నాయకి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ నీ ధ ప స.
అవరోహణము– స నీ ధ ప మ గా రి స.
శ్రీ త్యాగరాజుని 'కనుగొనుసౌఖ్యము' అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదై యున్నది.

నాయికానాయక భావలక్షణము :— 'అభినయ పారసంపుటము' అను తమిళ నాట్యశాస్త్ర గ్రంథములోని 6 విభాగములలో 2 వ దానికి గలపేరు.

నారటము :— త్రిస్థానములయందును లీనమైయుండు గంభీరధ్వని పిత్తమువలన బుట్టిన 'నారటము'- అని చెప్పబడును.

నారదముఖారి :— 11 వ మేళకర్తయగు "కోకిలప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

నారదశిక్ష :— "భరతుని" నాట్యశాస్త్రమునకు ముందే రచింపబడి "స రి గ మ ప ధ ని" అను సంఖ్యామానము 2000 సంవత్సరములకు ముందునుండే అమలులో నున్నట్టి విషయమునుగూర్చి వ్రాయబడిన ఒక అతిప్రాచీన గ్రంథము.

నారదుడు :— "సంగీత మకరంద"మను గ్రంథమువ్రాసిన ప్రాచీన సంగీత గ్రంథకర్తకు గలపేరు.

నారని :— ప్రాచీనులగు శ్రీ "తాళ్ళపాక చిన్నయ్య"చే రచింపబడిన రచనలందుగల ఒక అరుదైన రాగము.

నారనము :— 18 వ మేళకర్తయగు "హాటకాంబరి"యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ స.
అవరోహణము– స ధ మ గ రి స.

నారాచి :— 32 వ మేళకర్తయగు "రాగవర్ధని" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని స.
అవరోహణము– స ని మ గ రి స.

నారాయణగౌళ :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ రిస.
ఇది 'శ్రీ వీణకుప్పయ్యర్'కు యీరాగా లాపనలోగల అద్భుత నైపుణ్యమునకు బిరుదుగా నొసంగినరాగము.

నారాయణతీర్థులు :— 16 వ శతాబ్దము నకు చెందిన "శ్రీ కృష్ణలీలాతరంగిణి" అను గ్రంథమును 12 స్వర్గలలో తరంగములుగా రచించి తరించిన మహానుభావునికిగల పేరు. ఇతడు తంజావూరు జిల్లాలోని 'వరాహ పురి' వద్ద దైవసాక్షాత్కారము నొందెను. ఈతని సమాధి నేటికికూడ అచ్చటగలదు.

నారాయణదేశాది :— 20 వ మేళకర్త యగు "నఠభైరవి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి స గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

నారాయణదేశాక్షి :— 29 వ మేళకర్త యగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ రి గ మ పధనిస.
అవరోహణము— స ని ధ ప మ గ రి సధస.

నారాయణమనోహరి :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

నారాయణి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

నారాయణి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

నారాయణి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి మ గ ప ధ స.
అవరోహణము— సనిపానిధపమగరిగస.

* నారీరతిగౌళ :— 72 మేళకర్తలలో 20 వ మేళకర్తయగు 'నఠభైరవి'కి 'వెంకటమఖి' పెట్టినపేరు.

నాలాయిార దివ్యప్రబంధము :— వైష్ణవ సమయాచార్యులువ్రాసిన తమిళములోని సంగీత పవిత్ర రచనకు గలపేరు.

నావభాసుర :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ని ధ మ గ రి మ గ స.
ఇది ఔడవ - వక్రషాడవ రాగమునకు చెందును. [సం. స్వ. ప్ర. పా.]

* నాసామణి :— 72 మేళకర్తలలో 70వ మేళకర్తయగు "నాసికాభూషణి"కి "వెంకటమఖి" పెట్టినపేరు.

నాసావది :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని ప స.
అవరోహణము— స ని ధ ప మ ప గ మ స.

నాళీకము :— 16 వ మేళకర్తయగు "చక్రవాకము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

న్యాసము :— రాగాలాపనలో యేస్వరముతో రాగము ముగింపబడునో ఆస్వరమును "న్యాసము" లేక 'న్యాసస్వర' మని చెప్పుదురు.

—

# ని

ని :— సప్తస్వర సంకేతములగు 'స రి గ మ ప ధ ని' లో 7 దానికి గలపేరు.

ని :— నిషాద స్వరములోని 3 రకములలో రెండవదైన 'కైశికీ నిషాదము'నకు 'వెంకటముఖి'యేర్పఱచిన సంకేతాక్షరము.

నిగమసంచారి :—70 వ మేళకర్తయగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ రి స.

నిగమానన :— 48 వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ రి గ మ రి స.

నిటలప్రకాశిని :—14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ రి గ స.

నిద్ర :— 'వ్యభిచారీభావము'లోని 33 విధములలో 21 వ దానికిగల పేరు.

నిందాస్తుతి కీర్తనలు:—'త్యాగరాజుని' చే నిందాస్తుతి గలిగియుండునట్లుగా రచింపబడిన కీర్తనలకుగల పేరు.

నిధి :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో పేర్కొనబడిన 'ఖండజాతి త్రిపుట తాళము'నకుగల పేరు. దీనికి అంగములు 100. అక్షరకాలములు 9.

నిధి :— "ఓరియంటల్ మ్యూజిక్" అను గ్రంథములో పేర్కొనబడిన "సంకీర్ణజాతి ఏకతాళము"నకు గలపేరు. దీనికి అంగము 1. అక్షరకాలములు 9.

నిబద్ధము :— సంగీతములోని రెండు రకములలో మొదటిదానికి గలపేరు. ఇది తాళబద్ధమై ధాతు, మాతువులను కలిగియుండును.

నిమిషము :—తాళకాలప్రాణలక్షణములో చెప్పబడినవిధముగా 8 కాష్ఠలు కలిసిన కాలమునకు "నిమిషము" అని చెప్పబడును.

నియతశ్రుతులు :— "ద్వావింశతి" శ్రుతులనబడు 22శ్రుతులలో 4, 7, 9, 13, 17, 20, 22 యీ శ్రుతులందు యేర్పడిన సప్తస్వరములకు "నియతశ్రుతు"లని పేరు.

నియతశ్రుతులు :— ఒక రాగమునకు యేర్పఱచియున్న స్వరములను నియతశ్రుతులు లేక నియతస్వరములందురు.

నిరంజని :— 10 వ మేళకర్తయగు "నాటకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

నిరంజని :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

నిరవల్ :— సంగీతములో ముఖ్యభాగములగు ధాతు, మాతులలో మాతుయగు సాహిత్యమును ప్రస్తరించుటను తమిళములో "నిరవల్" అని చెప్పుదురు. ఈ నిరవల్ కృతులయందు సాధారణముగాను, పల్లవియందు విశేషముగాను పాడుదురు.

నిర్ఝరిణి :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

నిర్మలాంగి :— 30 వ మేళకర్తయగు "నాగానందిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

నిర్వాణి :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

నిర్ఝారి :— 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

నిర్వ్యరి :— "సంగీత మకరందము"లో పేర్కొనిన 22 శ్రుతులలో 'గాంధారము' నకు గల 2 శ్రుతులలో 2 వ దాని పేరు.

నిర్యుక్త ప్రబంధము :— ఛందస్సును రాగమును కలిగియుండు ప్రబంధములోని మొదటిరకమునకు పేరు. ఇది సూత్రము ననుబట్టి వ్రాయబడినదిగా నుండును.

నిరూపణము :— ఆకర్షణీయమైన స్వరములతో అమర్చబడిన సులభసాహిత్యము గల ఒక చిన్న సంగీతరచనకు పేరు. ఇది కాలక్షేపముచేయు కథకు సంబంధించిన చిన్న కథను తెలుపునదిగా నుండును. శ్రీ మువ్వలూరి సభాపతిఅయ్యర్ (చిన్న త్యాగరాజు) శ్రీ మెరట్టూరు వెంకట్రామ శాస్త్రియు చాలా కథలకు తెలుగులో నిరూపణములు వ్రాసిరి. వీరు తెలుగుపద రచయితలుగా కూడ ప్రఖ్యాతి నొందిరి.

నిర్వేదము :— వ్యభిచారి భావములోని 33 విధములలో మొదటిదానికి పేరు.

నిర్దోష :— సూళాది సప్తతాళ అలంకారములలో 3 వ దానికి గల పేరు.

నివారము :— 41 వ మేళకర్తయగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

నివిర్తతాళము :— "బరత శాస్త్రిరమ్" అను తమిళ గ్రంధములో పేర్కొనిన 9 తాళములలో 7 వ దానికి గలపేరు.

నివిర్తతాళము :— "పింగళనిగందు" చే చెప్పబడిన 9 తాళములలో 8 వ దానికి గలపేరు.

నిశ్శంక :— సంశయములు లేనివాడగుటచే 'శార్ఙ్గదేవు'నకు యివ్వబడిన బిరుదు.

నిశ్శంకతాళము :— "రత్నాకర" గ్రంథస్థమగు 120 దేశితాళములలో 119 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు । 8 8 3 8 8 8 ।.

నిశ్శంకలీలతాళము :— 'రత్నాకరము' లో పేర్కొనబడిన 120 తాళములలో 6 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 3 3 8 8 ।.

నిశ్శంకుడు :— 'సంగీతరత్నాకర' గ్రంథ రచయితయగు శ్రీ శార్ఙ్గదేవునికి 'నిశ్శంకుడ'ను పేరుకూడ కలదు.

నిశ్శబ్దక్రియలు :— తాళము వేయుటలో వ్రేళ్ళను ఎంచుట, కుడిచేతిని క్రిందికి దించుట, విసరుట, చుట్టుట మొదలగు శబ్దరహితములగు క్రియలకుగల పేరు.

నిశ్శబ్దచతుర్లఘువు :— షడంగములలో 6 వ దైన కాకపాదమునకుగల మరియొక పేరు. ఇందు 4 + 4 + 4 + 4 = 16 అక్షర కాలములు ఘాత లేక వేయుండును.

నిశ్శబ్దము :— షడంగములలో 6 వదైన కాకపాదమునకుగల ఒక విశేషనామము.

*నిషధము :— 60 వ మేళకర్తయగు "నీతిమతి" కి "వెంకటమఖి" పెట్టిన మరియొక పేరు.

నిషాదాంత్యరాగము :— ఒక రాగములో హెచ్చైన స్వరము మధ్యస్థాయి యొక్క నిషాదస్వరమైనచో నట్టిరాగమునకుగల పేరు. ఉ॥ నాదనామక్రియ.

నిషాదప్రియ :— 40 వ మేళకర్తయగు "నవనీతము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ప మ గ రి స.

నిషాదము :— 60 వ మేళకర్తయగు "నీతిమతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప స.
అవరోహణము— సనిధనిపని ప మ గ రి స.

నిషాదము :— సప్తస్వరములలోని 7 వ స్వరమునకుగల పేరు. షడ్జాది ధైవత స్వరము వరకుగల 6 స్వరములను మ్రింగుచు స్థానముననున్నది గనుక దీనిని నిషాదమని చెప్పబడినది.

నిషాది :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

నిషాది :— షడ్జగ్రామములోని 4 జాతులలో 2వ దానికిగల పేరు. మిగత 3 షడ్జి, ధైవతి, ఆర్షభి అనునవి.

నిష్క్రమక్రియ :— మార్గ నిశ్శబ్దక్రియలు 4 టిలో 2వ దానికిగల పేరు. ఇది ముడిచిన హస్తముయొక్క వ్రేళ్ళను విప్పునదిగానుండును.

నిష్క్రామము :— పైకెత్తిన చేతిలోని ముడిచియున్న నాలుగు వ్రేళ్ళను క్రమముగా విప్పుటకుగల పేరు.

నిష్కల :— "భావభట్టుని"చే విరచితమైన 'అనూప సంగీతవిలాసగ్రంధము'లో పేర్కొనిన 22 శృతుల పట్టికలోని షడ్జమునకుగల 4 శృతులలో 2 వది.

నిస్సారము :— ఆముదపు కొయ్యవలె నిస్సారమైన'ధ్వని'కి"నిస్సార"మని పేరు.

నిస్సారుకతాళము :— "అష్టోత్తరశత" తాళములగు 108లో 50వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I 8 8. మాత్రలు 5. అక్షర కాలములు 20.

నిస్సారుకతాళము :— "రత్నాకర" గ్రంధస్థమగు 120 తాళములలో 40వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I ∪ I ∪.

నిహారము :— 51 వ మేళకర్తయగు "కామవర్ధని"యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

నిహారాద్రి :— 2వ మేళకర్తయగు "రత్నాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

---

# నీ

నీచస్థాయి :— పంచస్థాయిలగు అనుమంద్ర, మంద్ర, మధ్య, తార, అతితార స్థాయిలలో తగ్గుస్థాయియగు అనుమంద్ర స్థాయికి గలపేరు.

నీడక్కడలు :— జావాలోని గాయకులకు గల ప్రక్కవాద్యముపేరు.

నీతికుంతలి :— 70వ మేళకర్తయగు "నాసికాభూషణి"యొక్కజన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ గ స.

నీతిదాయకమగు పాటలు :— మనుష్యుల నడవడిని తీర్చిదిద్దుకొనుటకు తగిన నీతులను, తదితర ధర్మపద్ధతులను బోధించునట్టి పాటలకుపేరు.

నీతిమంజరి :— 60 వ మేళకర్తయగు "నీతిమతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ మ పనిపమగరిస.

* నీతిమతి :— 72 మేళకర్తలలో 60వ

మేళకర్తకు గల పేరు. ఇది 10 వ 'దిశి' చక్రములోని 6 వ మేళకర్తయగును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమస్వరములుగాక చ.రి— సా. గాం — ప్ర. మ — ష. ధై — కా. నిషాదస్వరములుండును.

నీరుద్రగిరి :— 38 వ మేళకర్తయగు "జలార్ణవము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

నీలకంఠప్రియ :— 34 వ మేళకర్తయగు "వాగధీశ్వరి" యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

నీలమణి :— 27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

నీలవేణి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

నీలమూరి :— 42 వ మేళకర్తయగు "రఘుప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

నీలాంగి :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

నీలాంబరి :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగమైన షాడవ - వక్ర సంపూర్ణమగును.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- సనిపధనిపమగరిగస.
భాషాంగరాగము. ఇందు ప ధ ని ధ ని ప, ప ని ధ ని అను ప్రయోగములందు కైశికీ నిషాదముపలుకును. త్యాగరాజుని "ఎన్నగ మనసుకురాని" అనుకృతియు, లింగరాజ ఉర్స్ని "శృంగారలహరి" అను కృతియు ఈ రాగములోని ప్రసిద్ధ కృతులుగా నున్నవి. ఈ రాగములో మంద్రనిషాదము క్రింద సంచారములేదు. కొన్ని గ్రంథములలో ఈ రాగ ఆరోహణ అవరోహణములు స రి గ మ ప ధ ప ని స - స ని ప మ గ రి గ స. గా నున్నవి.

నీలి :— 53 వ మేళకర్తయగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

నీళ :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

---

# ను

ను :— నిషాదస్వరములోని 3 రకములలో 3 వదైన "కాకలీనిషాదము"నకు "వెంకటమఖి" పెట్టిన సంకేతాక్షరము.

నృత్యము :— గాత్ర విక్షేప మార్గంబై సర్వాభినయ వర్జితంబై యాంగిక ప్రకారము నటించునది 'నృత్య'మనబడును.

నృత్యము :— అభినయము లేక నృత్యము చేయుటకుగల పేరు. ఇది రెండు విధములు. 1 తాండవము, 2 లాస్యము.

నృత్యసంగీత గ్రంథములు :— "భరతుని" నాట్యశాస్త్రము, "శార్ఙ్గదేవుని" "సంగీతరత్నాకరము" నృత్యసంగీతములను గురించి విపులముగా వ్రాసిన గ్రంథములలో ప్రాముఖ్యమైనవగును.

నృత్తానుగమము :— నృత్యసంగీతమునకు వాయింపబడు సంగీత వాద్యమునకు పేరు.

నృత్యాధ్యాయము :— 'సంగీత రత్నాకరము'లోని 7అధ్యాయములలో 7 వ దానికి గలపేరు. మిగతవి 1. స్వరగతాధ్యాయము, 2. రాగవివేకాధ్యాయము, 3. ప్రకీర్ణకాధ్యాయము, 4. ప్రబంధాధ్యాయము, 5. తాళాధ్యాయము, 6. వాద్యాధ్యాయములనునవి.

---

# నూ

నూటయెనిమిది రాగతాళమాలిక :— 18–19 శతాబ్దములకు చెందిన శ్రీ "రామస్వామి దీక్షితుల"చే రచింపబడిన యొక 'రాగతాళమాలిక'కుగల పేరు.

నూతనచంద్రిక :— 60 వ మేళకర్తయగు "నీతిమతి" యొక్క జన్యరాగము. ఆరోహణము– స రి గ మ ప ధ ని స. అవరోహణము– స ని ప ధ ని ప మ గ స.

న్యూనశ్రుతి :— పూర్ణశ్రుతికంటె కొంచెము తక్కువైన శ్రుతికిగల పేరు. ఇది త్రిశ్రుతికము $\div$ ద్విశ్రుతికము అనగా $\frac{10}{9} \div \frac{16}{15} = \frac{25}{24}$ విలువ గలదియగును. అనగా 70 సెంట్లకు సమానము.

న్యూనద్విశ్రుతివ్యవధి :— సెకండుకు వేపనసంఖ్య 135/128 విలువ (92 సెంట్లు) గలిగిన అర్ధస్వరముకంటె తక్కువగల అంతరమునకు పేరు.

---

# నె

నెట్టమట్టమ్ :— "వనపాదచూడామణి"చే రచింపబడిన "తాళసముద్రమ్" అను తమిళములోని వ్రాతప్రతి గ్రంథములో పేర్కొనిన 20తాళములలో 8వ తాళము పేరు. దీనికి అంగములు 8 । । 8 8 +.

---

నే త్ర —72 మేళకర్తలుగల 12 చక్రములలో 2 వ చక్రమునకు గల పేరు. ఇందు 7 నుండి 12 వరకు మేళకర్తలుందును.

నేత్ర-గో :— 12 మేళచక్రములలో 2 వ దైన 'నేత్ర' చక్రములోని 3 వ మేళమగు "ధేనుక"కు 'వెంకటమఖి' కల్పించిన సంకేత నామము. ఇది 9 వ మేళకర్తయగును.

నేత్ర-పా :— 12 మేళచక్రములలో 2 వ దైన 'నేత్ర' చక్రములోని 1 వ మేళమగు "సేనావతి" కి 'వెంకటమఖి' కల్పించిన సంకేతనామము. ఇది 7 వ మేళకర్తయగును.

నేత్ర-భూ :— 12 మేళచక్రములలో 2 వ దైన 'నేత్ర' చక్రములోని 4వ మేళమగు "నాటకప్రియ" కు వెంకటమఖి కల్పించినసంకేతనామము. ఇది10 మేళకర్తయగును.

నేత్ర-మా :— 12 మేళచక్రములలో 2 వ దైన 'నేత్ర' చక్రములోని 5వ మేళమగు "కోకిలప్రియ" కు వెంకటమఖి కల్పించినసంకేతనామము. ఇది 11వ మేళకర్తయగును.

నేత్ర-శ్రీ :— 12 మేళచక్రములలో 2 వ దైన 'నేత్ర' చక్రములోని 2 వ మేళమగు "హనుమతోడి"కి వెంకటమఖి కల్పించిన సంకేతనామము. ఇది 8 వ మేళకర్తయగును.

నేత్ర-షా :— 12 మేళచక్రములలో 2 వ దైన 'నేత్ర' చక్రములోని 6 వ మేళమగు "రూపవతి"కి వెంకటమఖి కల్పించిన సంకేతనామము. ఇది 12 వ మేళకర్తయగును.

నేపాళగౌళ :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగమైన షాడవరాగమగును.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

# నై

నైపాళి :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

నైమప్రియ :— 63 వ మేళకర్తయగు "లతాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ధ ప ధ స.
అవరోహణము—స ని ధ ప మ గప మ గ రి స.

# నొ

నొటేషన్ :—తాళాంగములతో స్వరలిపిని వ్రాయుటకు ఇంగ్లీషులోని పేరు. భారత దేశములో 'స రి గ మ నొటేషన్'యనూ, పాశ్చాత్యదేశములలో 'స్టాఫ్ నొటేషన్' యనూ వాడుకలో యున్నవి.

—

నౌకాచరిత్రమ్ :— ప్రొఫెసరు శ్రీ పి. సాంబమూర్తి (బి. ఎ; బి. యల్;) చే ఇంగ్లీషులో వ్రాయబడిన యొక గ్రంధమునకు గల పేరు.

నౌకాచరిత్రము :— ఇది శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన ఒక గ్రంధము. దీనిలో నిక శ్రీకృష్ణుడు గోపికలతో నౌకాయానము చేయుచున్నట్లుగా యుండును. ఇది చరిత్రరూపముగా వర్ణింపబడినది. ఇందలి రసము భక్తిపూరితమైన శృంగారము. దీనిచే ఉజ్వలరసమని చెప్పవచ్చు. గేయములతో నిండి భక్తి, శృంగార శోభితమైన యీ గ్రంధము సంస్కృతములో 'జయదేవుడు' వ్రాసిన "గీతగోవిందము" గ్రంధమును బోలియుండును.

# ప

ప :— సప్తస్వరముల సంకేతాక్షరములగు స రి గ మ ప ధ ని, అను 7 టిలో 5 వ దానికి పేరు.

ప :— సప్తస్వరములలో 5 వ దైన పంచమ స్వరమునకు 'వెంకటమఖి' యేర్పఱచిన సంకేతాక్షరము.

పగలుపణ్ (రాగము)లు :— ఆయా రాగములు పాడుటకు తగిన కాలమునుబట్టి పురాతన తమిళ సంగీత విభజనలో పేర్కొనబడిన పగటివేళ పాడతగిన రాగములకు తమిళములోని పేరు.

పంచచామరము :— సంగీతమునకు సంఖ్యా శాస్త్రము అంతగా అవసరములేని ఆరోజులలో శృతులకు ప్రత్యేకమైన పేర్లు యిచ్చి జ్ఞప్తియందుంచుకొనుటకు తగినట్లు రచింపబడిన యొక సంస్కృత గ్రంధమునకు గల పేరు.

పంచజాతులు :— 22 శృతులకు యేర్పఱచిన దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్య అను 5 జాతులకుగల పేరు.

పంచతాళ - ఉపతాళములు :— అద్వి, పార్వతీలోచనము, కుదుక్క, సింగనందన, తిరిమాత్తిరెయి అనువాటికిగల పేరు.

పంచతాళములు :— 'అష్టోత్తరశత, తాళములగు 108 టిలో మొదటి 5 తాళములగు చచ్చత్పుట, చాచపుట, షట్పితాపుత్రక, సంపద్వేష్టక, ఉద్ఘట్టములకుగల పేరు. ఇవి 'సంగీత సమయసారము, 'సంగీత మకరంద' గ్రంధములలోని 101 తాళముల పట్టికయందుకూడ గలవు.

పంచతాళేశ్వరము :— తాళమునందు గల విశేషములను తెలియజేయుటకు రచింపబడిన యొక ప్రబంధమునకుగల పేరు. ఇందుగల 5 భాగములు 5 మార్గతాళములలో నుండునట్టి తాళమాలికలగును. ఇది తంజావూరు 'సరస్వతీ మహల్' లైబ్రరీ యందుకలదు.

పంచదశ గమకములు :— ఈ క్రింది 15 గమకములకు పంచదశ గమకములని పేరు 1 కంపితము. 2 లీనము. 3 ఆందోళితము 4 ప్లావితము. 5 స్ఫురితము. 6 తిరుపము

7 ఆహతము. 8 వళి. 9 ఉల్లసితము. 10 హుంపితము. 11 కురుళము. 12 త్రిభిన్నము. 13 ముద్రితము. 14 నామితము. 15 మిశ్రితము అనునవి.

పంచపది :— మహారాష్ట్ర సంప్రదాయమైన హరికథా కాలక్షేపములందు భాగవతార్‌లు కాలక్షేపమును ప్రారంభించుటకు ముందు ప్రార్థనగా పాడునట్టి 5 కీర్తనలకుగల పేరు. ఉ॥ (1) హిమగిరితనయా (2) తాండవ నృత్యకరీ (3) శ్రీరామా జయరామా (4) బలభీమా (5) గోవింద నామాహరే అనునవి.

పంచభంగి :— రెండు రాగములును రెండు తాళములును గలిగిన యొక విధమగు ప్రబంధ రచనకుగల పేరు.

పంచమ :— మధ్యమ గ్రామములోని 3 జాతులలో 3 వ దానికి పేరు.

పంచమ :— 'మేళాధికార లక్షణము' అను గ్రంథమందు పేర్కొనిన 24 శృతులలో ఉత్తరాంగ శృతులలో చేరిన 15 వ శృతికిగల పేరు.

పంచమ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము. { స రి మ ధ ప ని స.
{ స రి ధ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది వక్ర ఔడవ - సంపూర్ణ రాగమునకు చెందును.

పంచమనాట :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

పంచమతాళము :— 'గత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 5వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు O O.

పంచమము :— సప్తస్వరములగు 7 టిలో 5 వ స్వరమునకు గలపేరు. ఇది 5 వ స్వరస్థానమందుండుటచే పంచమమని చెప్పబడెను.

పంచమము :— పురాతన తమిళ సంగీత విభజనలోని పణ్ (రాగము) లలో నొకదానికి గలపేరు.

పంచమము :— 22 శృతుల పట్టికలో 14 వ శృతి 'క్షితీ' అనుదానికి పేరు.

పంచమశృతి :— షడ్జ, పంచమ, షడ్జములను ఒకేసారి ధ్వనింపజేయు సంకలిత ధ్వనికి పంచమశృతి అని పేరు. ఇది సాధారణముగా పురుషులు వుపయోగించు శృతిగానుండును. వాద్యములందు పంచమ శృతి ఈ క్రిందివిధముగా నుండును. 1. తంబురలో — మంద్రపంచమ, మధ్యషడ్జ, మధ్యషడ్జ, మంద్రషడ్జములు అనగా పా సా సా సా లుగను, 2. వయొలిన్ లో మధ్యపంచమ, మధ్యషడ్జ, మంద్రపంచమ, మంద్రషడ్జములు అనగా పా సా పా సా లుగను, 3. వీణలో—మధ్యషడ్జ, మంద్రపంచమ, మంద్రషడ్జ, అనుమంద్ర పంచమములు అనగా సా పా సా పా లుగను 4. హార్మోనియములో — మధ్యషడ్జ, మధ్యపంచమ, తారషడ్జములుగను అనగా సా పా సా లుగను శృతిచేయుదురు.

**పంచమాంత్యరాగము :—** ఒక రాగము లోని హెచ్చైన స్వరము మధ్యస్థాయి లోని పంచమస్వరమైనచో అట్టి రాగమును పంచమాంత్యరాగమని చెప్పుదురు. ఉ॥ నవరోజు – ప ధ ని స రి గ మ ప– మ గ రి స ని ధ ప. ఈవిధముగనుండును.

**పంచమూర్తి :—** 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని.
అవరోహణము– ధ ప మ ప గ రి స ని స.

**పంచరూపి :—** 70 వ మేళకర్తయగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇది ఔడవ–సంపూర్ణ రాగమునకు చెందును.

**పంచలఘు అంగసంజ్ఞలు :—** త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణలఘువులకు గలగుర్తులకు పేరు. అవి ఈ క్రింది విధముగనుండుట గమనించునది.

1. త్రిశ్రలఘువు – సంజ్ఞలు $I_3$ లేక ర
2. చతురశ్రలఘువు– ,, $I_4$ లేక ।
3. ఖండలఘువు – ,, $I_5$ లేక ◡
4. మిశ్రలఘువు – ,, $I_7$ లేక ర
5. సంకీర్ణలఘువు – ,, $I_9$ లేక 8

పై తెలిపిన గుర్తులకుపంచలఘు అంగసంజ్ఞలని పేరు.

**పంచలఘుజాతులు :—** చతురశ్ర (బ్రాహ్మణ) త్రిశ్ర (క్షత్రియ) మిశ్ర (వైశ్య) ఖండ (శూద్ర) సంకీర్ణ (సంకర) జాతులను గలిగిన 5 లఘువులకు పేరు.

**పంచలఘునామాంతరములు :—**
1. త్రిశ్రలఘువుకు – స్వర్గలఘువనియు,
2. చతురశ్రలఘువుకు – మనుష్యలఘువనియు,
3. ఖండలఘువుకు – దేశ్యలఘువనియు,
4. మిశ్రలఘువుకు – హంసలఘువనియు,
5. సంకీర్ణలఘువుకు – చిత్రలఘువనియు

మరియొక పేర్లుగలవు.

**పంచశ్రుతిధైవతము :—** వర్తమానకాలములో చెప్పబడు చతుశ్ర్శుతి ధైవతమునకు పూర్వులు యిచ్చినపేరు. అనగా శుద్ధధైవతము తన మూడుశ్రుతులతో తన పైనిగల శుద్ధనిషాదములోని రెండుశ్రుతులను ఆక్రయించి 3+2=5 శ్రుతులుగా యేర్పడి 'పంచశ్రుతి ధైవత'మని పిలువబడెను.

**పంచశ్రుతిరిషభము :—** వర్తమానకాలములోవాడు చతుశ్ర్శుతిరిషభమునకుపూర్వులు పెట్టినపేరు. అనగా శుద్ధరిషభము తన 3 శ్రుతులతో తనపైగల శుద్ధగాంధారిము లోని రెండుశ్రుతులను ఆశ్రయించి 3+2=5 శ్రుతులతోయేర్పడి పంచశ్రుతి రిషభమని పిలువబడెను.

**పంచశ్రుతివ్యవధి :—** 294 సెంట్లకును, 32/27 రేషియో విలువకు సమానముగా శ్రుతి అంతరమునకు గలపేరు.

**పంచస్వరప్రస్తారములు :—** అసంపూర్ణతానమునందు స రి గ మ ప, అను 5స్వరములతోవచ్చు ప్రస్తారములకు గలపేరు. ఇట్టివి 24×5=120 ప్రస్తారములుండును.

**పంచస్థాయిల వాద్యము :—** వీణా, గోటు, మొదలగునట్టి తంత్రీవాద్యము

లందు అనుమంద్ర పంచమమునుండి అతి తారషడ్జమువరకు పలుకుటచే గలిగినపేరు.

పంచస్థాయిలు :— అనుమంద్ర, మంద్ర, మధ్య, తార, అతితారస్థాయిలకు గలపేరు.

పంచానన :— రెండు రాగములును, రెండు తాళములునుగల యొకరకపు ప్రబంధమునకు గలపేరు.

పంజరము :— పురాతన తమిళ సంగీత విభజనలోని పణ్ (రాగము) లలో యొక దానికిగలపేరు. ఈపేర్లుసంస్కృతమునుండి పుట్టినవని తెలియుచున్నది.

పట్టుప్పాట్టు :— సంగీతగ్రంథము కాక పోయినను తాళములనుగురించి మాత్రము వ్రాయబడిన యొక తమిళగ్రంథమునకు గలపేరు.

పటోలిక :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

పణ్ :— పురాతన తమిళ సంగీత విభజనలోగల రెండువిధములలో నొకదానికి గలపేరు. పణ్ అనగా రాగమునకుగల సాధారణ నామము. ఈ పణ్ లలో కొన్ని సంపూర్ణములుగాను, మరికొన్ని అసంపూర్ణ రాగములుగాను వుండును. ప్రతి దానిలో కొన్ని జన్యరాగములుండును.

పణవనారాచ :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని ప ధ ప స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

పణ్ణియత్తిరమ్ :— పురాతన తమిళ సంగీత విభజనలోని షాడవరాగమునకు గలపేరు.

పతాక :— దేశ్యక్రియలు 8 విధములలో 7 వ దానికి గలపేరు. ఇది కుడిచేతిని 4 అక్షరకాలములుమీదికియెత్తుట గానుండును.

పతాక :— 48 వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

పతాక :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

పతి :— నాయికా, నాయక లక్షణము ననుసరించి అగ్నిసాక్షిగా నాయికను పాణిగ్రహణము చేసికొనిన వానిని 'పతి'యని చెప్పబడును.

పత్తి :— 35 తాళముల పట్టికలోగల 'శ్రీకరాది 35 నామములలో 'చతురశ్రజాతి రూపకతాళము'నకు గలపేరు. దీనికి అంగములు 0 I. అక్షరకాలములు 6.

పతిత :— దేశ్య క్రియలలోని 8 విధములలో 8 వ దానికి గలపేరు. అనగా మీదికి యెత్తబడిన కుడిచేతిని 4 అక్షరకాలములు క్రిందికి దించుట యగును.

పంతు :— 29 వ మేళకర్తయగు 'ధీర శంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ రి మ ప స.
అవరోహణము– సనిధ ప ని ధ మ గ రి స.

పంతువరాళి :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములు గాక, శు. రి– సా. గాం– ప్ర. మ– శు. ధై– కా. నిషాదస్వరము లుండును. కాని వర్తమాన కాలములో ఈ 'పంతువరాళి' రాగమును 51 వ మేళకర్తయగు కామవర్ధని రాగము గానే అంతరగాంధార ప్రయోగముచేసి పాడుచున్నారు.

పదకవితాపితామహ :— క్రీ. శ. 1423–1502 కాలమునకు చెందిన తిరుపతి తాళ్ళపాక రచయితలలో నొకరగు శ్రీ అన్నమాచార్యునికిగల బిరుదు పేరు. ఇతడు వాగ్గేయకారులలో ప్రప్రథముడుగా చెప్పబడుచున్నాడు. ఇతని స్వగ్రామము కడప జిల్లా, రాజంపేట తాలూకా, తాళ్ళపాక అని తెలియుచున్నది. ఈతనికి 'సంకీర్తనాచార్యుడ'ను మరియొక బిరుదుకూడగలదు.

పద్ధతి :— ఒక సంగీత రచననుగాని, రాగమునుగాని, స్వరమునుగాని, సాహిత్య ప్రస్తారమునుగాని రాగతాళ నియమము లతో పాడునట్టి విధానమునకుగల పేరు.

పద్మ :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

పద్మకాంతి :— 62 వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

పద్మనాభ :— పూర్వము తిరువాన్కూరు సంస్థానాధీశ్వరులుగా నుండిన శ్రీ 'కులశేఖర పెరుమాళ్ మహారాజు' యొక్క సంగీత రచనలయందలి ముద్రకుగల పేరు.

పద్మభవాని :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మ ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

పదము :— నాయికా, నాయక లక్షణము కలిగి శృంగారరస ప్రధానమైనట్టి సంగీత రచనలకు పదములని పేరు. ఇందు పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములు గలిగియుండును. దీనిలోని సంగీతముయొక్క నడక నెమ్మదిగను ఆకర్షణీయముగనుండును. సాహిత్యము పాండితీ ప్రతిభ గలిగి గంభీరమైన వేదాంతార్థము యిమిడియుండును. పదములు రచించినవారిలో ముఖ్యుడు క్షేత్రయ్య. ఉ॥ మంచిదినము నేడే. ఇతడు 2000 పదములవరకు రచించినట్లుగా ప్రతీతిగల మహానుభావుడు.

పదము :— క్రియాకారక క్రియలచే ధైర్యశౌర్యాదులను చెప్పబడునట్టి ప్రబంధములోని 6 అంగములలో 3 వ దానికి గలపేరు.

పద్మముఖి :— 57 వ మేళకర్తయగు 'సిష్మేంద్ర మధ్యమము' యొక్క జన్య రాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ స.

పదరచయితలు :— శ్రీ ఘనం సీనయ్య, పెద్ద దాసరి, పరిమళ రంగుడు, సారంగపాణి, గోవిందసామయ్య, కస్తూరి రంగి మొదలగువారు పదరచయితలను పేరుతో ప్రసిద్ధినొందుటచే గలిగిన పేరు.

పదవర్ణము :— భరతనాట్యములకును, భోగము మేళములకును వుపయోగపడునట్లు ప్రత్యేకముగా నుద్దేశింపబడిన సంగీత రచనలకు గలపేరు. ఇందుగల అన్ని భాగములకును సాహిత్యముగలిగి భావము విపులీకరించుటకు పూర్తి అవకాశమును గలిగియుండును. దీని నడచువేగము నెమ్మదిగాను మధ్యమధ్య ద్రుతలయగాను వుండి జతులుగల్గి వుండును. ఉ॥ 'నిన్నునమ్మినాను' అను ఆనందభైరవి రాగములోని పదవర్ణము యిందుకు ముఖ్య వుదాహరణ మగును.

పదిమతాళము :— 'బరతశాస్తిరమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనిన 9 తాళములలో 8 వ తాళము.

పదిమతాళము :— 'పింగళనిగండు' చెప్పిన 9 తాళములలో 4 వ దానికిగలపేరు.

పద్మిని :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

పధి :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో పేర్కొనిన 35 తాళముల పట్టికలోని 'చతురశ్రజాతిరూపక తాళము' నకు గలపేరు. దీనికి అంగములు 0 I. అక్షరకాలములు 6.

పయస్విని :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

పయింగళ :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ధ మ గ రి స.

పరకీయ :— నాయికలందలి 3 రకములలో 2 వది. అనగా పరపురుషునియందు తనకుగల ఇచ్ఛా వ్యాపారములను మఱుగు పఱచుటలో దత్తమానసియగు నాయికకుగల పేరు.

పరకీయకన్య :— పరకీయ నాయికలోని 2 విధములలో 1 వ దాని పేరు.

పరకీయపరోఢ :— పరకీయ నాయికలోని 2 విధములలో 2 వ దానికిగలపేరు.

పరజు (ఫరజు) :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగమైన షాడవ - సంపూర్ణము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
'తధీమ్ధీమ్‌త' అను ప్రసిద్ధమైన తిల్లాన ఈ రాగములోనిదైయున్నది.

పరభృతవాణి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప రి స.

పరమహంస :—'శ్రీ సదాశివబ్రహ్మేంద్రము'చే రచింపబడిన సంస్కృతములోని సంగీత రచనలందుగల ముద్రకు పేరు. ఉ|| మానస సంచరరే, అను కీర్తనలో యిట్టి ముద్రను చూడవచ్చును.

పరమేష్టి :— 43 వ మేళకర్తయగు 'గవాంభోది' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ మ గ రి స.

పరమేష్టి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

పర్వ్యావది :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

పరానము :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గపమరిస.

పరావర్తము :— ధ్వని యొక్క తరంగములు కొంతదూరములోగల వస్తువుల ఆవరణను తాకుటవలన వెనుకకు మరలును. దీనినే పరావర్త మందురు.

పరిక్రమతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 15 వ తాళము పేరు. దీనికి అంగములు । । । 8 8. మాత్రలు 7. అక్షరకాలములు 28.

పరిధి :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

పరిమళరంగ :— 19 వ శతాబ్దమునకు చెందినట్టియు ప్రాసయమకములతో తెలుగునందు అనేక పదములు రచించినట్టి 'పరిమళరంగడు' తన రచనలందు పెట్టుకొనిన ముద్రకుపేరు.

పరిమళానంది :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి'యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప మ ధ ని స.
అవరోహణము- స ని ప మ గ స.

పరిమిత రహిత సంగీతము :— రాగాలాపన యిట్టి రకమునకుచెందిన సంగీతమునకు ముఖ్య వుదాహరణ మగును.

పరిమిత సంగీతము :—ఏదైన ఒకకృతి యొక్క పల్లవిలోగాని లేక మరియొక భాగములోగాని జాగాచేసి పాడెడి సాహిత్య ప్రస్తారము లేక కల్పనస్వరములకు 'పరిమితసంగీత' మని చెప్పబడును.

పరివర్తనము :— తాళపాదభాగాదులు మరల మరల తిరుగుటకు గలపేరు.

పరివార :— హిందుస్థానీ సంగీత విభజనలో పుత్రరాగ, పుత్రునిభార్య రాగమను

నది కలిసియేర్పడినపేరు. ఇది మొత్తము 48+48=96 రాగములుగా నున్నది.

పరిశుద్ధము :— 43 వ మేళకర్తయగు 'గవాంభోది'యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

పరోధ :— 29 వ మేళకర్తయగు 'ధీర శంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

పల్లవం :— 23 వ మేళకర్త యగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ మ ప మ గ రి స.

పల్లవి :— పల్లవి గోపాలయ్యర్, పల్లవి శేషయ్య వంటి ప్రాచీన ప్రసిద్ధ సంగీత విద్వాంసులు పల్లవి పాడుటలో వారికి గల అద్భుత నైపుణ్యమునకు మెచ్చి వారికి యివ్వబడిన బిరుదు.

పల్లవి :— పదము, లయము, విన్యాసము అను యీ మూడు పదముల మొదటి అక్షరముల సంయోగమునకు 'పల్లవి'అని పేరు.

పల్లవి :— కర్నాటక సంగీత రచనలలోని మాధుర్యములలో మొదటి భాగము. ప్రాచీన విద్వాంసులు యీ మొదటి భాగమును చక్కగా విస్తరించి పాడుట వలన గలిగిన పేరు.

పల్లవి :—కర్నాట సంగీత రచనలలోగల ముఖ్యమైన 3 అంగములలో మొదటిదాని పేరు. ఇది కృతి, కీర్తన, పదము, జావళి రాగమాలిక, తిల్లానలయందును, సర్వజతి, జతిస్వర, వర్ణము మొదలగు సంగీత రచనలయందుగల మొదటి భాగము లేక అంగమగును.

పల్లవి, అనుపల్లవి, చరణములు సమానముగనుండు రచనలు :— సంగీత రచనలలో శ్యామశాస్త్రియొక్క "సరోజదళ నేత్రి" అను శంకరాభరణరాగ కృతియు, త్యాగరాజుయొక్క "ఎంతరానితన కెంత"అను హరికాంభోజిరాగ కృతివంటి రచనలకు గలపేరు.

పల్లవి ఆలాపన :— పల్లవిని పాడునపుడు ఆ పల్లవిలోని సాహిత్యము (మాతు)ను శాస్త్రీయమైన రాగ, తాళములతో ప్రస్తరించి ప్రదర్శించుటకుగల పేరు.

పల్లవిక్రమము :— (1) పల్లవిని ప్రారంభించుట లేక సాహిత్యాక్షరములను తాళగ్రహమునందు చూపుట. (2) సంగతులు పాడుట. (3) నిరవల్ లేక సాహిత్యమును ప్రస్తరించుట. (4) అనులోమ ప్రతిలోమములు చూపుట. (5) కల్పన స్వరములు పాడుటకు "పల్లవి"క్రమమని పేరు.

పల్లవికాలము లేక వ్యానము :— ఒక సంగీత కచ్చేరిలో పాడునటువంటి పల్లవిలోని ఆయా భాగములను వాటికి తగిన కాలనిర్ణయముతో పాడుటకుగల పేరు. అనగా ఒకగంటలో పల్లవిని పాడునపుడు ఈ క్రిందివిధముగా విభజించి పాడవలెను.

i సంగతులతోకూడిన పల్లవి ప్రారంభం 5 నిమిషములు

ii నిరవల్ లేక సాహిత్య ప్రస్తారము 10 నిమిషములు

iii అనులోమ, ప్రతిలోమములు 5 నిమిషములు

iv కల్పన స్వరములు 15 నిమిషములు

v రాగమాలిక మరియు తాళమాలిక 20 నిమిషములు

vi త్వరితగతినిపాడుట లేక నడకభేదము 5 నిమిషములు

మొత్తము 60 నిమిషములు

పై విధముగా పల్లవిని విభజించి పాడుటకు పల్లవి కాలమని పేరు.

పల్లవికిరెట్టింపు పాదమైన అనుపల్లవిగల రచనలు :— 'నేనెందు వెదకుదురా' అను కర్నాటక బ్యాగ్ రాగములోని త్యాగరాజుని రచనలోనున్న అనుపల్లవులవంటివిగల రచనలకు పేరు.

పల్లవి, చరణములు మాత్రమే గల రచనలు :— త్యాగరాజునిచే రచింపబడిన 'దివ్యనామ సంకీర్తన'లవంటి సంగీత రచనలకుగల పేరు.

పల్లవి పాడుటలో శాస్త్రయుక్తమైన పద్ధతిని కనిపెట్టిన వాగ్గేయకారుడు :— 18 వ శతాబ్దమునకు చెందిన "శ్రీ పచ్చిమిరియము ఆదిఅప్పయ్య", పల్లవి ఆలాపనను శాస్త్రయుక్తమైన ఒక పద్ధతిలో కనిపెట్టిన ప్రఖ్యాత పురుషుడుగా కీర్తినొందుటచే గలిగిన పేరు.

పల్లవి పారిజాతము :— "సంగీత కేసరి శ్రీ యమ్. వేదాంత భాగవతార్"చే రచింపబడిన ఒక గ్రంథముపేరు.

పల్లవి బిరుదుగల వాగ్గేయకారులు :— పల్లవిపాడుటలో అత్యద్భుతమైన ప్రాశిణ్యముగల శ్రీ పల్లవి గోపాలయ్యర్, శ్రీ పల్లవి శేషయ్య మొ॥వారు యిట్టిప్రఖ్యాత గౌరవ బిరుదుల నొందినవారగుటచే గలిగినపేరు. ఇదేవిధముగా ఘనమ్ (తానమ్) పాడుటలోమేటియైన శ్రీ ఘనమ్ శీనయ్య, ఘనం కృష్ణయ్యర్ లు కూడ ఘనమనే బిరుదులను పొందియుండిరి.

పల్లవియంతపాదమైన అనుపల్లవిగల రచనలు :— ఒక సంగీత రచనలోని అనుపల్లవి, పల్లవితో సమానమగు పాదము కలిగియున్నచో అట్టి రచనలకు గలపేరు. ఉ॥ 'నిన్నువినాగమరి' అను 'పూర్వీకల్యాణి' రాగములోని శ్యామశాస్త్రి కృతి యిందుకు వుదాహరణ మగును.

పల్లవియందువాడు తాళమార్గములు:— దక్షిణ(ఎనిమిదిమాత్రలు) వార్తిక(4మాత్రలు) చిత్ర(2 మాత్రలు) అను మార్గములను మూటిని పల్లవులలోమాత్రమే వాడుదురు.

పల్లవిలోని రెండు ఆవర్తములందును ప్రాసయతిగల రచనలు :—ఒక సంగీత రచనలోని పల్లవిలోగల రెండు ఆవర్తములలోను రెండవయక్షరములు ఒకటిగా నుండువాటికి గలపేరు. ఉదాహరణము.

ప॥ (1) ఎంతవేడుకొందురాఘవ
పంతమేలరా ఓరాఘవ

త్యాగరాజకృతి – సరస్వతిమనోహరి రాగము. దేశాదితాళము.

ప॥ (2) రామభక్తి సామ్రాజ్య
మేమానవులకబ్బెనోమనసా

త్యాగరాజకృతి – శుద్ధబంగాళరాగము.

పల్లవిలోని రెండు అవర్తములందును యతిగల రచనలు :— 'త్యాగరాజుని' చే విరచితమైన 'మనసా శ్రీరామచంద్రుని– మరవకే యేమరికే ఓ॥ అను ఈశమనోహరి రాగములోని కృతిలోను, 'శ్రీ ముత్తుస్వామి దీక్షితార్' చే విరచితమైన వాతాపి గణపతింభజేహం – వారణాశ్యం వరప్రదం॥ అను 'హంసధ్వని' రాగములోని కృతిలోను, పల్లవిలోని రెండుపాదముల మొదటిఅక్షరములు ఒకే అక్షరములుగా యుండుటచేనట్టి వాటికిగలపేరు.

పల్లవిలో మధ్యమకాల సాహిత్యముపాడు రచనలు :— 'ముత్తుస్వామి దీక్షితార్' చే రచింపబడిన 'శ్రీ సరస్వతీనమోస్తుతే' అను ఆరభిరాగ కృతిలోని అనుపల్లవిలో గల 'శ్రీపతిగౌరీపతి' వంటి మధ్యమకాల సాహిత్యమునుపాడు రచనలకు పేరు.

పల్లవిలో నగముపాడవు అనుపల్లవిగల రచనలు :— 'త్యాగరాజుని' చే రచింపబడిన 'హెచ్చరిక గారారా' అను 'యదుకులకాంభోజి' రాగములోని కీర్తనలవంటి రచనలకు గలపేరు.

పల్లవినంగతులు :— పల్లవి పాడునపుడు సంగతులు లేక హెచ్చుతగ్గులతో పాడు భాగములకు గలపేరు. పల్లవిలో రెండవ భాగమైన యీ సంగతులు పల్లవి అంతటికిని యుండనట్లుగా తెలియదగును.

పల్లవి స్వరకల్పవల్లి :— "శ్రీ వీణకుప్పయ్యర్" కొడుకు "త్యాగయ్యర్" చే రచింపబడిన యొక సంగీతగ్రంథమునకుగలపేరు.

పవిత్రసంగీతము :— అనగా వైదికగానము లేక అప్లైడ్ సంగీతముయొక్క ఒకరకమునకు 'పవిత్రసంగీత' మని చెప్పబడును. అప్లైడ్ సంగీతమనగా సాహిత్యము ప్రధానముగను అందలి సంగీతము ఆ సాహిత్యముయొక్క భావమును బాగుగా ప్రదర్శించుటకు వుపయోగించు సాధనముగాను వుండు అన్ని రచనలకు వర్తించును. దీనిలోని ముఖ్యభాగములు (1) పవిత్ర సంగీతము. (2) నాట్యసంగీతము. (3) కాలక్షేప సంగీతము. (4) నాటక సంగీతము. (5) యక్షగానసంగీతము మొదలగునవి.

పవిత్ర సంగీతమునకుచెందిన పురాణ పురుషులు :— శ్రీఅంజనేయ, అర్జున, నారద,తుంబురు, రావణాదులకు గలపేరు.

పవిత్ర సంగీతమునకు చెందిన యితర సంగీత రచనలు :— అష్టపదులు, తరంగములు, కీర్తనలు, దివ్యనామ సంకీర్తనలు, ఉత్సవసంప్రదాయ కీర్తనలు, వసంతోత్సవ సంప్రదాయ కీర్తనలు, నామావళి మొదలగు రచనలకు గలపేరు.

పవిత్రి :— 52వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– ప̣ మ̣ ప̣ ధ̣ ని̣ స రి గ మ ప.
అవరోహణము– ప మ గ రి స ని̣ ధ̣ ప̣.

పస్సావ్ (Passau) :— 'బవేరియా' దేశములో ప్రపంచములోకెల్ల పెద్దదైనటువంటి ఒక సంగీతవాద్యమునకు గల పేరు. దీనికి 16,000 గొట్టములుకలవని తెలియుచున్నది.

ప్రక్కవాద్యకారన్ :— గాత్రమునగాని జంత్రమునగాని సంగీతమును ప్రదర్శించు ప్రధాన గాయకునికి లేక వాద్యకునికి ప్రక్కవాద్యము వాయించునట్టి వానికి తమిళములో గలపేరు.

ప్రక్కవాద్యము :— ఒక గానసభలో గాత్రమునపాడునట్టి గాయకునికి గాని, జంత్రము వాయించునట్టివాద్యకునికిగాని సహాయకరముగా వాయింపబడునట్టి ఫిడేల్, సారంగ్, సితార్, దిల్‌రూబ, మృదంగము, తబలావంటి వాద్యములకుగలపేరు.

ప్రకార రంజని :— 15 వ మేళకర్త యగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ప్రకాశమట్టమ్ :— 'తాళసముత్తిరమ్' అను తమిళ వ్రాతప్రతి గ్రంథములో పేర్కొనబడిన 20 తాళములలో 9 వ తాళమునకు పేరు.

ప్రకీర్ణకాధ్యాయము :— 'సంగీత రత్నాకరము'లోని 7 అధ్యాయములలో 3 వ దానికిపేరు. మిగలినవి (1) స్వరగతాధ్యాయము. (2) రాగవివేకాధ్యాయము. (4) ప్రబంధాధ్యాయము. (5) తాళాధ్యాయము. (6) వాద్యాధ్యాయము. (7) నృత్యాధ్యాయమనునవి.

ప్రకీర్తి :— 'రాగతాళచింతామణి' అను తెలుగు గ్రంథములోని 124 తాళములలో ఇతరులు చెప్పనటువంటి తాళములలో 9 వ తాళము.

ప్రకృతిస్వరము :— శుద్ధస్వరము లేక స్వతస్సిద్ధమైన స్వరమునకు గలపేరు. అట్టి పేవనగా షడ్జ — శు. రి — శు. గాం— శు. మ — పంచమ — శు. ధై — శు. నిషాద స్వరములగును.

ప్రగల్భ :— స్వీయనాయికలోని ప్రసిద్ధమైన 3 భేదములలో 3 వ దానికిగల పేరు. సంపూర్ణయౌవనముగలదిగను, అనంగ వ్యాపారపారంగతురాలుగను, సమస్త్యాది చతురతగలదిగను వుండునాయికకు గలపేరు.

ప్రగల్భధీర :— ప్రగల్భ నాయికకు మానమను కోపవ్యాపారముచేతను జ్యేష్ఠ కనిష్టత్వములచేతను కలిగిన అవస్థలచే యేర్పడిన 3 భేదములలో 3 వది. ఇది అపరాధియగు నాయకుని కపటముతో విషయాంతరమునందు ఉపేక్షాభావముతో నుండునదియగును. వీటిలో మిగతవి (1) ప్రగల్భాధీర, (2) ప్రగల్భధీరాధీర అనునవి.

ప్రగల్భాధీర :— అపరాధియగు నాయకుని బెదరించి తాడనముచేయునట్టి నాయికకు గలపేరు.

ప్రగల్భధీరాధీర :— పైదెలుపబడిన ధీరాధీర వ్యాపారములన్నియును చేయు నాయికకు గలపేరు.

ప్రగుణి :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి గ మ ప మ ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

ప్రజ్ఞావతి :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ రి స.

ప్రచురము :— హెచ్చు స్వరముతో చేయు గానమును 'ప్రచుర' మని చెప్పబడును.

ప్రణయమానము :— శృంగార రసమునకు సంబంధించిన 'మానము' లోని 2 విధములలో మొదటి దానికి గలపేరు. రెండవది ఈర్ష్యమానమని చెప్పబడును.

ప్రణవాకారి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– ప ని ధ ని స రి గ మ.
అవరోహణము– ప మ గ రి స ని ధ ని ప.

ప్రత్యంగతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 16 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8 8 8 । ।.

ప్రత్యంగతాళము :— శాస్త్రీయమైన 'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 16 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8 8 8 । ।. మాత్రలు 8. అక్షరకాలములు 32.

ప్రత్యాఘాతము :— అవరోహణ జంట స్వరములలో రెండవ స్వరమును కొట్టి దానికి మీది సమీపస్వరము యొక్క ఛాయను రప్పించుటను 'ప్రత్యాఘాత' మనబడును. ఉ॥ స స, ను 'స రి స' అగునట్లు వాయించుటకు పేరు.

ప్రతాప :— 50 వ మేళకర్త యగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ స రి స.

ప్రతాపకోకిలము :— 30 వ మేళకర్త యగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స ప మ ప ధ ని స.
అవరోహణము– స ని ప మ గ స.

ప్రతాపచింతామణి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము– స గ మ ప మ ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ మ రి స.

ప్రతాపనాట :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

ప్రతాపనాట :— మిశ్ర రాగమునకు చెందినట్టి యొక జన్యరాగమునకుగల పేరు.

ప్రతాపము :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స ప మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

ప్రతాపరామ :— శ్రీ 'వీరభద్రయ్య' రచనలలోని ముద్రకు పేరు. [18వ శతాబ్దము]

ప్రతాపరుద్రి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ మ రి స.

ప్రతాపవరాళి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప స.
ఆరోహణము— స ధ ప మ గ రి స.
ఇది స్వరాంతర - షాడవ రాగమునకు చెందును. [సం. స్వ ప్ర. సా.]

ప్రతాపవసంతము :— 12 వ మేళకర్త యగు 'రూపవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము స మ రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి స.

ప్రతాపశేఖరతాళము :— 'రత్నాకర గ్రంథస్థమైన 120 దేశితాళములలో 75 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 3 0 0 ◡.

ప్రతాపశేఖరతాళము :—'అష్టోత్తరశత' తాళములగు 108 లో 82 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 3 0 0 ◡. మాత్రలు 4¼. అక్షరకాలములు 17.

ప్రతాపసారంగ :— 71 వ మేళకర్త యగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

ప్రతాపసింధు :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స ని స.
అవరోహణము— స ని ప మ రి గ రి స.

ప్రతాపహంస :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

ప్రతిఅంతరగాంధారము :— ''మేళాధికారలక్షణ' మను గ్రంథమందలి 24 శృతుల విధానములో పూర్వాంగములోని 14 శృతులలో 8వ శృతికిగల మొదటిపేరు.

ప్రతిఅంతరరిషభము :— 'మేళాధికార లక్షణ'మను వ్రాత ప్రతిగ్రంథమందలి 24 శృతులలో పూర్వాంగమునకు చెందిన 14 శృతులలో 8 వ శృతికిగల రెండవపేరు.

ప్రతికాకలీధైవతము :— 'మేళాధికార లక్షణము' అను గ్రంథమందు పేర్కొనబడిన 24 శృతులలో ఉత్తరాంగ శృతులలో చేరిన 22 వ శృతికిగల రెండవ పేరు.

ప్రతికాకలీనిషాదము :— 'మేళాధికార లక్షణ'మను గ్రంథమందుగల 24 శృతులలో చేరిన 22 వ శృతికిగల మొదటిపేరు.

ప్రతికైశికీనిషాదము :— 'మేళాధికార లక్షణ'మను గ్రంథమందలి 24 శృతుల పద్ధతిలో ఉత్తరాంగ శృతులలో చేరిన 20 వ శృతికిగల మొదటిపేరు.

ప్రతిచతుశ్శృతిధైవతము :— 'మేళాధికారలక్షణ'మను గ్రంథమందుగల 24 శృతుల పద్ధతిలో ఉత్తరాంగ శృతులలో చేరిన 18 వ శృతికిగల మొదటిపేరు.

ప్రతిచతుశ్శృతిరిషభము :— 'మేళాధి

కార లక్షణ' మను వ్రాత ప్రతిగ్రంథ మందుగల 24 శ్రుతుల పద్ధతిలో పూర్వాంగ శ్రుతులగు 14 టిలో 4 వ శ్రుతికిగల మొదటిపేరు.

ప్రతితాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 40 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు । 0 0. మాత్రలు 2. అక్షరకాలములు 8.

ప్రతిధ్వని (Echo) :— పరావర్తము వలనకలుగు మరియొక ధ్వనిని ప్రతిధ్వని యందురు. దీనినే ఇంగ్లీషులో 'ఎకో' అందురు.

ప్రతిబింబ :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ప ని ధ స.
అవరోహణము— స ధ ప గ రి స.
ఇది వక్రషాడవ - ఔడవ రాగమునకు చెందును. [సం. స్వ. ప్ర. సా.]

ప్రతిమత్యతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 86 వ తాళము నకుగల పేరు. దీనికి అంగములు ।।88।।. మాత్రలు 8. అక్షరకాలములు 32.

ప్రతిమంఠికతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 80 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు ।।88।।.

ప్రతిమధ్యమము :— 'ద్వావింశతిశ్రుతు' లగు 22 శ్రుతులలో 12 వ శ్రుతియగు "ప్రీతి" అనుదానికి గలపేరు. దీనివిశ్రాంతి 45/32. సెకంజుకువచ్చు వేపనములసంఖ్య 337.5. తిరుగు సెంట్లవిలువ 590. ఈ శ్రుతికి ఉ॥ కల్యాణిరాగము.

ప్రతిమధ్యమము :— "మేళాధికార లక్షణ" మను గ్రంథమందలి 24 శ్రుతుల పద్ధతిలో 13 వ శ్రుతికి గలపేరు.

ప్రతిమధ్యమము :— మధ్యమస్వరము లోని "తీవ్రజాతిస్వరము"నకు గలపేరు.

ప్రతిమధ్యమ మేళకర్తలు :— 72 మేళ కర్తలలో 37 నుండి 72 వరకు అనగా "సాలగము" నుండి "రసికప్రియ"వరకు గల 36 మేళకర్తలకు యివ్వబడినపేరు.

ప్రతిలోమపల్లవి :— పల్లవి పాడుటలో ఒకేనడకతో పాడుచూ తాళమును రెండు లేక నాలుగురెట్లు వేగముతో వేయుటకు గలపేరు. దీనికి వ్యతిరేకమైనది అనులోమ పల్లవి. అనగా తాళము ఒకేవిధముగా నడపుచూ పల్లవి రెండు లేక నాలుగురెట్లు వేగముగా పాడుటకు పేరు.

ప్రతిశుద్ధ గాంధారము:—"మేళాధికార లక్షణ"మను వ్రాతప్రతి గ్రంథములో పేర్కొనబడిన 24 శ్రుతుల విధానములో పూర్వాంగ శ్రుతులగు 14 టిలో 4 వ శ్రుతియగు "ప్రతిచతుశ్రుతిరిషభము" నకు గల రెండవపేరు.

ప్రతిశుద్ధ ధైవతము :— "మేళాధికార లక్షణ" మను గ్రంథములోని 24 శ్రుతుల విధానములో ఉత్తరాంగ శ్రుతులలో చేరి నట్టి 16 వ శ్రుతికి గలపేరు.

ప్రతిశుద్ధనిషాదము :— 'మేళాధికార లక్షణ'మను గ్రంథమందలి 24 శృతుల పట్టికలోని ఉత్తరాంగములో చేరినట్టి 18 వ శృతికిగల 2 వ పేరు

ప్రతిశుద్ధరిషభము :— 'తంజావూరు' 'సరస్వతీమహల్' గ్రంథాలయము లోనున్న "మేళాధికారలక్షణ"మను గ్రంథమందు పేర్కొనబడిన 24 శృతులవిధానము లోని పూర్వాంగ శృతులలో 2 వ శృతికి గల పేరు.

ప్రతిషట్శృతి రిషభము :— 'మేళాధికారలక్షణ'మను వ్రాత ప్రతి సంగీత గ్రంథములోని 24 శృతులలో పూర్వాంగ శృతులగు 14 టిలో 6 వ శృతియగు ప్రతి సాధారణగాంధారమునకు గల రెండవ పేరు.

ప్రతిసాధారణగాంధారము :— "మేళాధికారలక్షణ"మను గ్రంథములోని 24 శృతులలో పూర్వాంగ శృతులగు 14 టిలో 6 వ శృతికి గలపేరు.

ప్రతిహారి :— 46 వ మేళకర్తయగు "షడ్విధమార్గిణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

ప్రతీచి :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

ప్రతీతి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

ప్రతీతి :— 35 వ మేళకర్తయగు 'శూలిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

ప్రథమ :— సామగానములో పలుకు 'గా రీ సా నీ ధా పా' అనెడి ఆరు స్వరములలో మొదటి స్వరమునకుగల పేరు.

ప్రథమకాలము :— సంగీతము నడుచు క్రమబద్ధమైన వేగములలోని మొదటి రకము లేక డిగ్రీకిగల పేరు.

ప్రథమతాళము :— ధృవాది సప్తతాళములలో ధృవతాళమునకుగల పేరు.

ప్రథమరాగము :— ప్రతి మేళకర్తరాగమునకుగల పేరు.

ప్రథమరాగవర్ధని :— రాగాలాపనలో ఆక్షిప్తికానంతరముచేయు రాగాలాపన (గానక్రియ)ను 'ప్రథమరాగవర్ధని' యని చెప్పుదురు.

ప్రథమవిదారి :— ఈ ప్రథమ విదారికే 'ముక్తాయి' అను పేరుకూడ కలదు. రాగాలాపనలో తారస్థాయి షడ్జము వరకు సంచరించి తదుపరి అచటనుండి దిల్చుకొని క్రమముగా మధ్యస్థాయి షడ్జమునకు చేరుటకుగల పేరు.

ప్రథమాంగము :— ఒక రచనలోని పల్లవియందుగల రెండు భాగములలో మొదటి భాగమునకుగల పేరు.

ప్రథమాభ్యాసము :—'ఎట్టయపురం' సంస్థాన సంగీత సాహిత్య విద్వాంసుడగు శ్రీ 'సుబ్బరామ దీక్షితుల' చే ప్రాథమిక సంగీతాభ్యాసమునకు వుపయోగమగునట్లు 1905లో రచింపబడిన యొక గ్రంథము పేరు'

ప్రధానగాయకుడు :—ఒక సంగీత కచ్చేరిలో ప్రధానముగా మొదట సంగీతమును ప్రారంభించునట్టి గాత్రజ్ఞునికిగల పేరు.

ప్రపంచములోకెల్ల పొడవైన రచనలు:— మహా వైద్యనాథయ్యర్ రచించిన 72 మేళకర్తల రాగమాలికయు, శ్రీరామస్వామి దీక్షితారుయొక్క 108 రాగతాళమాలికయు ఇట్టి రచనలకు ముఖ్యవుదాహరణము లగును. ఇవి ప్రదర్శించుటకు కనీసము 2 గంటల కాలముపట్టును. ఇవిగాక 'బీథోవెన్' అను పాశ్చాత్య సంగీతపండితుడు రచించిన 9 వ పెద్దకారల్ సింఫనీకి 80 నిమిషములును, 3 వ ఇరాయిక సింఫనీకి 52 నిమిషములును, 6 వ పాస్టరల్ సింఫనీకి 40 నిమిషములును ప్రదర్శించుటకు పట్టును. గనుక పై తెలిపిన రచనలవంటివి ప్రపంచములోకెల్ల మిక్కిలి పెద్దరచనలని చెప్పవచ్చును.

ప్రపంచాశ్రయ :— 42 వ మేళకర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్య రాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

ప్రబంధ గానమునందు వాడుతాళమార్గములు :— చిత్రతర(ప్రేలికి1మాత్ర)చిత్రతమ (½ మాత్ర) అతిచిత్రతమ (¼మాత్ర) మార్గములకుగల పేరు. అనగాయివితాళాక్షరము ఒకటింటికి 4, 2, 1 అక్షరముల వంతున నడచునవిగా యుండును.

[ఒక మాత్ర = 4 అక్షరకాలములు.]

ప్రబంధము :— స్వరాది తాళాంత్యముగా గల ఆరు అంగములును, నాలుగు ధాతువులును, గలిగి స్వరసందర్భముగ జేర్చబడిన యొకవిధమైన సంగీతరచనకు 'ప్రబంధము' అని పేరు.

ప్రబంధము :— సంగీతరచనలకుగల మరి యొక సాధారణమగు పేరు.

ప్రబంధముద్ర :— సంగీతరచనలయందు వుపయోగించు ద్వాదశముద్రలగు 12 టిలో 6 వ ముద్రకు గలపేరు. ఉ॥ కృతి, పదము, రాగమాలిక, తిల్లాన మొదలగు రచనలు యిట్టి రకమునకు చెందినవై యున్నవి.

ప్రబంధములందుగల ఆవర్తములు :— ఇవి రెండు విధములుగా విభజించబడినవి.

1. తాళావర్తము— తాళముయొక్క పూర్తి అంగములతో ముగించుటకు గలపేరు.
2. గీతావర్తము— సాహిత్యము తాళమునందు యెచ్చట మొదలిడునో తిరిగి అచ్చటికే వచ్చిచేరుటకు గలపేరు.

ప్రబంధరచయితలు :— అనేక ప్రబంధములను రచియించిన శ్రీ 'భూలోకమల్లుడు'కును, గ్రహస్వర ప్రబంధము, తాళా

ర్ణవము, రాగకదంబమువంటి ప్రసిద్ధమగు ప్రబంధములను రచించిన శ్రీ 'గోపాల నాయకుడు' వంటి రచయితలకు గలపేరు.

ప్రబంధాధ్యాయము :— 'శార్ఙ్గదేవుని' 'సంగీతరత్నాకరము'లో పేర్కొన బడిన 7 అధ్యాయములలో 4 వ దానికి గలపేరు.

ప్రభావ :— 50 మేళకర్తయగు 'నామ నారాయణి'యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప మ ధ ని స.
అవరోహణము– స ని ధ ప గ రి స.

ప్రభావతి :— 41 వ మేళకర్తయగు 'పావని'యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ ని స.
అవరోహణము– సనిధమ ప మ రి గ రి స.

ప్రభా... :— 48 వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి గ స.

ప్రమాణ :—సూళాది 35 తాళములకు గల శ్రీకరాది నామములలో 'ఖండ జాతి ధ్రువతాళము'నకు గలపేరు. దీనికి అంగములు । 0 । ।. అక్షరకాలములు 17.

ప్రమాణశ్రుతి :— అనగా చతుశ్శ్రుతికము ÷ త్రిశ్రుతికము = ప్రమాణశ్రుతియగును. అనగా $= \frac{9}{8} \div \frac{10}{9} = \frac{81}{80}$. ప్రమాణ శ్రుతియగును. ఇది 22 సెంట్లు విలువ గలిగినదిగాయుండును.

ప్రముదితవదన :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము'యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ని ప మ రి స.

ప్రమేయ :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము– స రి గ ప ధ స.
అవరోహణము– స ని స ధ మ గ రి స.

ప్రయోగము :—సంచారము లేక సమ్మేళనము. ఒక రాగములో యేదైన ఒక స్వరమునుచేర్చి పాడుటకు గలపేరు.

ప్రవాసము :— భావశాస్త్రములోని శృంగార రసమందలి 2 వ రికమైన 'విప్రలంబ శృంగారము'లోని 5 విధములలో 4 వ దానికి గలపేరు. మిగతవి 4 అయోగము, విరహము, మానము, శాపము అనునవి.

ప్రవాళశోధి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ని ప మ గ స.

ప్రవృత్తి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

ప్రవృత్తి :— బుధ్యారంభానుభావములు 3 టిలో 3వ దానికిపేరు. మిగతవి 1.రతి, 2. వృత్తి అనునవి.

ప్రవేశకము :— తాళ షడంగములలో చెప్పబడిన నిశ్శబ్దక్రియలలో కుడిపార్శ్వ మునసున్న కుడిహస్తమును అప్రదక్షిణ ముగ క్రిందుగా ముందునకు రానిచ్చుటకు గల పేరు.

ప్రవేశక్రియ :— మార్గనిశ్శబ్దక్రియలు 4 టిలో 4 వ దానికి గలపేరు. ఇది కుడి హస్తమును దిగుముఖముగా చుట్టివచ్చుట యగును.

ప్రశాంతి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య రాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము-స గ మ గ రి స ప ని ధ స.
అవరోహణము- స ధపరిపమగరిగరిమగస.

ప్రసన్న :— 'భావభట్టుని'చే పేర్కొన బడిన 22 శృతులకుగల పేర్లలో నిషాద శృతులు 2 టిలో 1 వ దైన 'వ్యాపక'కు గల మరియొక పేరు.

ప్రసన్నమధ్య :— స్థాయి అలంకార జాతిలోని శాస్త్రయుక్తమగు పేర్లలో 4 వ దానికి గలపేరు. ఉ॥ సా సా సా,

ప్రసన్నాంత :— స్థాయి అలంకారజాతి లోని శాస్త్రయుక్తమైన పేర్లలో 2 వ దానికి గలపేరు. ఉ॥ సా సా సా.

ప్రసన్నాద్యంత :— స్థాయి అలంకార జాతిలోని శాస్త్రయుక్తమైన పేర్లలో 3 వ దానికి గలపేరు. ఉ॥ సా సా సా.

ప్రసన్నాది :— పురాతన గ్రంథస్థమైన స్థాయి అలంకారజాతిలోని శాస్త్రయుక్త మైన పేర్లలో 1 వ దానికి గలపేరు. ఉ॥ సా సా సా.

ప్రసారిణీ :— 'ద్వావింశతి' శృతులగు 22 శృతులలో 11 వ శృతియగు 'తీవ్ర మధ్యమము'నకుగల పేరు. ఉ॥ బేగడ మధ్యమం.

ప్రస్తావన :— 38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

ప్రస్తారము :— ఒక తాళములోని అవ యవముల యొక్క అక్షరకాలములను గొని అనేకవిధముల ప్రస్తరించి తాళభేద ముల గల్పించి పాడుటకుగల పేరు.

ప్రసిద్ధచిట్టస్వరకృతులు :— ఆనంద భైరవి రాగములోని 'నీమదిచల్లగ' అను కృతిలోని "ప ధ ప సా స"అనునదియు, నీలాంబరిరాగములోని 'శృంగారలహరి' అను కృతిలోని సా ; ; రి స ని ప-స ని ప మ గ మ పా, వంటిశాస్త్రయుక్తమైన చిట్ట స్వరములుగల కృతులకుగల పేరు.

ప్రసూన :— 'నారదుని' 'సంగీత మక రంద'మను గ్రంథమందుగల 22శృతులలో నిషాద శృతులగు 2 టిలో 2 వ దానికిగల పేరు.

ప్రహరణకలిత :—29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య రాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

ప్రహ్లాదభక్తివిజయము :- శ్రీ'త్యాగరాజు' నిచే 5 అంకముల నాటకరూపముగా రచింపబడిన యొక ప్రబంధమునకుగల పేరు.

ప్రళయము :— 'సాత్త్వికభావము'లలో 8 విధములలో 8వ దానికి 'ప్రళయ' మని చెప్పబడును.

# పా

పా :— వెంకటమఖి కల్పించిన 12 మేళ చక్రములలో ప్రతి చక్రములోని మొదటి మేళకర్తకు యేర్పరచిన సంకేతాక్షరము.

పాకశాసనప్రియ :— 70వ మేళకర్తయగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

పాచనారాయణి :—64వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

పాంచాలి :— 15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

పాంచాలిక :— 2వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ స.

పాటము :— ప్రబంధములోని స్వరాది తాళాంత్యముగల 6 అంగములలో 5వ దానికిగల పేరు. [పాటము=శబ్దము.]

పాటలాధరి :— 48వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ మ గ రి స.

పాటలాంబరి :— 52వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ మ గ రి స.

పాడి :—15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప ధ ప మ రి స.
ఇది ఔడవ - వక్రషాడవ రాగమునకు చెందును. ఇదియొక ప్రాచీనరాగము.

పాతాళము :— తాళప్రస్తారములు 14 టిలో 3వ దానికి, 'పాతాళ'మని పేరు.

పాదము :— ఒక సంగీత రచనలోని సంపూర్ణమైన అవర్తము లేక ఒక పంక్తికిగల పేరు.

పాదమునకు ఒకే అవర్తముగల రచనలు :—శ్రీ త్యాగరాజునిచే 'శంకరాభరణరాగము, ఆదితాళములో రచించబడిన 'మరియాదగాదురా' వంటి రచనలకుగల పేరు.

పాదమునకు నాల్గు ఆవర్తములుగల రచనలు :— శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన 'జయమనోహరి' రాగము, రూపక తాళములోని 'సీభక్తిభాగ్యసుధా' అనురచనయు, తోడిరాగము, త్రిపుటతాళములోని "ఎందుకుదయరాదురా" వంటి రచనలకు గల పేరు.

పాదమునకు రెండు ఆవర్తములుగలరచనలు :— శ్రీ త్యాగరాజుని రచనయగు కాంభోజిరాగము, ఆదితాళములోని "మాజానకిచెట్టబట్టగా" వంటి రచనలకు గలపేరు.

పాదిపంచకము :— 72 మేళకర్తల సంఖ్యలను సులభముగా కనుగొనుటకేర్పఱచిన 'కటపయాది' చక్రములోని 4 భాగములగు కాదినవ, టాదినవ, పాదిపంచక, యాద్యష్టమను 4 టిలో 3 వ దాని పేరు. ఇది ప, ఫ, బ, భ, మ అను 5 అక్షరములవరుసకు పేరు.

పానిని :— సంగీతము గుఱించి వ్రాసిన యొక ప్రాచీన ప్రసిద్ధపండితునికిగలపేరు.

పాపనాశ :— దక్షిణ దేశమున "పాపనాశ శివన్" అను తమిళకవి రచించిన సంగీత రచనలలో యేర్పఱచినటువంటి ముద్రకు పేరు.

పాపవినాశ :— 18 వ శతాబ్దమునకు చెందిన "పాపవినాశముదలియార్" ద్రావిడ భాషలో నిందాస్తుతిగా రచించిన బహుపదములలోగల ముద్రకు పేరు.

పార్వతి :— 72 వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

పార్వతిలోచనము :— భరతుని 'నాట్యశాస్త్రము' అను గ్రంథములోని పంచతాళములకు గల ఉపతాళము పేరు.

పార్వతీలోచనతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 81 వ తాళము పేరు. దీనికి అంగములు 8 8 8 । 3 8 8 0 0.

పార్వతీలోచనతాళము :— శాస్త్రీయమైన అష్టోత్తరశత తాళములగు 108టిలో 99 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 0 0 । 0 0 8 8 । । । । 8 । ।. మాత్రలు 15. అక్షరకాలములు 60.

పార్శ్వదేవుని రాగవిభజన :— క్రీ. శ. 1163–1230 మధ్యకాలమునకు చెందిన పార్శ్వదేవుడు, తన 'సంగీతసమయసార' మను గ్రంథములో పేర్కొనిన రాగాంగ సంపూర్ణములు, రాగాంగ షాడవములు, రాగాంగ ఔడవములును, ఉపాంగ సంపూర్ణములు, ఉపాంగ షాడవములు, ఉపాంగ ఔడవములును, క్రియాంగ సంపూర్ణములు, క్రియాంగ షాడవములు, క్రియాంగ ఔడవములను పద్ధతిలోచేసిన విభజనకుగల పేరు.

పాలిని :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

పాలిఫొని (Poliphony) :— ఇది ఒక విధమగు సంగీత పద్ధతికి ఇంగ్లీషులోని పేరు. అనగా సమానమగు ప్రాముఖ్యము కలిగినట్టియు, దేనికది ప్రత్యేకవ్యక్తిత్వము కలిగినట్టియు, అన్నిరచనలను యేక కాలమందు పాడబడునట్టి వివిధ మధుర గానములుగల సంగీతమగును.

పావనకరి :— 41 వ మేళకర్తయగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

* పావని :— 72 మేళకర్తలలో 41 వ మేళకర్తకు గలపేరు.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందువద్ద, పంచమములుగాక, షు. రి- షు. గాం - ప్ర. మ - చ. ధై - కా. నిషాదస్వరములుండును.

పావము :— శార్ఙ్గదేవునిచే పేర్కొన బడిన వేణువు (పిల్లనగ్రోవి) లోని 10 రకములలో 2 దానికి గలపేరు.

పావికా :— శార్ఙ్గదేవునిచే 'రత్నాకరము' లో పేర్కొనబడినవేణువులోని 10రకము లలో 3 వ దానికిగలపేరు.

పాశ్చాత్య సంగీతశాస్త్ర సంపర్కముచే గలిగిన ప్రయోజనము :— భారతీయ సంగీతములో నుపయోగింపబడు శృతులకు ఒకసెకండునకు యిన్ని వేపనములనియు,తిరుగుసెంట్ల విలువ యింతనియు కనిపెట్టుటకు ముఖ్యముగా నుపకరించినది.

పాళిక :— 23 వ మేళకర్తయగు 'గౌరీ మనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

ప్రాక్దేశ సంగీతము :— శ్రీ ఏ.యమ్. చిన్నస్వామి ముదలియార్'చే రచింపబడిన ఒక సంగీత గ్రంథమునకుగల తెలుగు పేరు.

ప్రాగల్భ్యము :— భావశాస్త్రమందు చెప్పబడిన 'చిత్తజానుభావములు' 10విధములలో 7 వ దానికి గలపేరు.

ప్రాచీన తమిళ సంగీతములోని రాగవిభజన :— ప్రాచీన తమిళసంగీతమును పణ్, తిరమ్ అను రెండువిధములగు పద్ధతిలో విభజింపబడినదానికి పేరు.

ప్రాచీనవాగ్గేయకారులగమకనిర్ణయము:- శ్రీ నాన్యదేవుడును, పార్శ్వదేవుడును, హరిపాలుడును 7 గమకముల గుఱించియు, నారదుడు 19 గమకములను గుఱించియు, శార్ఙ్గదేవుడును,గోవిందదీక్షితులును, వెంకటమఖియు 15 గమకముల గుఱించియు, అహోబలుడు 17 గమకముల గుఱించియు తరువాత కొందరు దశవిధ గమకముల గుఱించియు వ్రాసిన నిర్ణయమునకుపేరు.

ప్రాచీన వాగ్గేయకారులు కల్పించిన తాళములు:—రఘునాధనాయకుడుకల్పించిన"రామానందతాళము" శ్యామశాస్త్రి కల్పించిన"శరభానందన తాళము"లవంటి అతిక్లిష్టమైన తాళములు యీ రకమునకు చెందినవగును.

ప్రాచీన సంగీతశాస్త్ర గ్రంథములు :— భరతుని నాట్యశాస్త్రము, దత్తిలుని దత్తిలము, మతంగుని బృహద్దేశి, నారదుని సంగీత మకరందము, పార్శ్వదేవుని సంగీత సమయసారము, శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరము మొదలగు గ్రంథములకు పేరు.

ప్రాచీనహిందుస్థానిసంగీత రాగవిభజన:- రాగ, రాగిణి, పరివార అను త్రివిధము లగు విభజనకు పేరు. ఈ విభజనయందు పురుషరాగములు 6 గను, ప్రతి పురుష రాగమునకు రాగిణి (భార్య) రాగములు 5 గను, ప్రతి పురుషరాగమునకు పుత్ర రాగములు 8 గను, ప్రతి పుత్రరాగమునకు భార్యారాగము 1 గను మొత్తము 6+30+48+48=132 రాగములుగా పేర్కొన బడియున్నది.

ప్రాణాగ్నులు :—ధ్వనింపజేసెడి వస్తువు, ధ్వనికలిగించెడి శక్తికి గలపేరు.

ప్రాతివేశిని :— ఉపనాయికలలోని 8 రకములలో 6 వ దానికి గలపేరు.

ప్రాముఖ్యరాగములు :— రాగముల కెల్ల మిక్కిలి ప్రాముఖ్యమైన 72 మేళ కర్తరాగములకు గలపేరు.

ప్రాస :— ఒక సంగీతరచనలోని 2 పాదములలోను, రెండవఅక్షరముసమానముగా నుండుదానికి గలపేరు. ఉ॥ బహుదారి రాగము, ఆదితాళములో త్యాగరాజు వ్రాసిన యీ క్రిందిరచనలోచూడదగును.

ప॥ బ్రోవభారమా - రఘురామ॥
భువనమెల్ల నీవైనన్నొకని॥

అను కృతిలోని 2 పాదములు యిందుకొక ముఖ్యవుదాహరణమగును.

ప్రాసయతి :— సంగీత రచనలలో గాని సీసపద్యములలోగాని వచ్చు ఒకరకమైన రచనావిశేషమునకు పేరు. అనగా ఒక రచనలో విరామము తరువాతగాని లేక యతిస్థానమందుగాని వచ్చిన రెండవ అక్షరము, పాదముయొక్క రెండవఅక్షర ముతో సమానముగ నున్నప్పుడు దానిని "ప్రాసయతి" యందురు. అప్పుడు పాద మందలి రెండుభాగములు రెండు ప్రత్యేక పదములుగా కనపడును. ఎటులనగా ఉ॥ త్యాగరాజు వ్రాసిన ఫలమంజరిరాగము దేశాదితాళములోని యీ క్రింది రచన చూడదగును.

ప॥ సనాతన - పరమపావన॥
ఘనాఘనవర్ణ - కమలనయన॥

పై రెండు ఆవర్తములలో ప్రాసాక్షరము "నా" అగుటచే ఇది ప్రాసయతియగును. అయితే ఇట్టి రచనలలో యతివుండుట అంత ముఖ్యముగాదు.

ప్రాసాక్షరము :—ఒకసంగీతరచనలోగాని లేకతదితర రచనలలోగాని పాదములలోని రెండవ అక్షరము సమానముగా నుండు దానికి గలపేరు.

ప్లావితము :—ఇది కంపితములోని యొక రకమైన గమకము. వీణాది తంత్రీ వాద్యములలో ఒక స్వరస్థానమందు 12 అక్షరకాలములు తంతిని కదలించి దానికి సమీపమగు మీది స్వరచ్ఛాయను పలికించుటకుగల పేరు.

[ప్లావితము = తేలుట.]

పిక :— శ్రీ ఏ. యమ్. చిన్నస్వామి ముదలియార్ చే రచింపబడిన "ఓరియంటల్ మ్యూజిక్" అను గ్రంథములోని కటపయాది సంఖ్యగల 35 తాళముల నామాంతరములలో "త్రిశ్రజాతి ధృవ తాళము"నకుగల పేరు. దీనికి అంగములు ।0।।. అక్షరకాలములు 11.

పికధ్వని :— 30 వ మేళకర్తయగు "నాగానందిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

పిచ్ (Pitch) :— ధ్వని లేక శృతికి ఇంగ్లీషులోని పేరు.

పిడిప్పు :— ఒక రాగముయొక్క స్వరూపమునుగాని, పోలికనుగాని ప్రస్ఫురింపజేయుట కుపయోగించు ప్రాముఖ్యమైన సంచారమునకు తమిళ భాషలోని పేరు.

పిన్‌పాట్టుకారన్ :— హరికథా కాలక్షేపములుచేయు భాగవతారులు కాలక్షేపముచేయునపుడు వారికి ప్రక్క పాట పాడునట్టివానికిగల తమిళములోని పేరు. వీనినే తెలుగులో సహకార గాయకుడని చెప్పుదురు.

పినాకి :— అతి ప్రాచీన మైనట్టియు, తంత్రీవాద్యమైనట్టియు, కమాను (Bow) తో వాయింపబడు నొక వాద్యమునకు గలపేరు. దీనిని మొదట శంకరుడు నిర్మించి వాయించుచుండెనని ఒక ప్రతీతి గలదు.

పినాకిని :— 18 వ మేళకర్తయగు "హాటకాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

పిపీలికయతి :— ఒక తాళములోని అంగములు చీమలవలె ఒకేరీతి వరుసగా పోవునపుడు గలుగు పేరు.

పిరంగని :— నవసంధి తాళములనబడు 9 తాళములలో 4 వ తాళమునకు పేరు.

పిళ్లారిగీతములు :— శ్రీ పురందరదాసు విఘ్నేశ్వరుడు, మహేశ్వరుడు, విష్ణువు మొదలగు దైవములను స్తోత్రము చేయుచూ రచించిన ఉపోద్ఘాత గీతములకుగల పేరు. ఉ॥ మలహరిరాగములోని శ్రీగణనాథ, కుందగౌరవంటి 4 గీతములు యీరకమునకు చెందును.

ప్రిన్సిపల్ ఆఫ్ రాగమ్ :— శ్రీ కె. రామచంద్రన్, వ్రాసిన ఇంగ్లీషులోని ఒక సంగీత గ్రంథమునకుగల పేరు.

ప్రియదర్శిని :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

ప్రియంవద :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యమైన వక్రసంపూర్ణ – షాడవరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ప స.
అవరోహణము— స ని ప మ గ రి స.

పీఠమర్దనుడు :—నాయకాలక్షణములో పేర్కొనబడిన ఉపనాయకులలోని 4 రకములలో మొదటివానికి గలపేరు. ఇతడు నాయకునికి కొంచెము తక్కువైనవాడుగా నుండును.

పీతాంబరి :— 41 వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

పీతాంబరి :— 43 వ మేళకర్తయగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ రి స.

ప్రీతితాళము :— 'రత్నాకర' గ్రంథస్తమైన 120 దేశితాళములలో 50 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I 0 0.

ప్రీతివరళి :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ రి మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ మ ప మ గ రి స.

ప్రీతి :— ద్వావింశతి శృతులగు 22 శృతులలో 12 వ శృతియగు ప్రతిమధ్యమమునకు గలపేరు. ఈశృతికి 'పూర్వీకల్యాణిరాగము' ఒకవుదాహరణయగును.

---

# పు

పుండరీకవిఠలుడు :—'షడ్రాగచంద్రోదయము' 'రాగమాల' 'రాగమంజరి' 'నర్తన నిర్ణయ'మొదలగు ప్రాచీన సంగీత గ్రంథములకు గ్రంథకర్తయైన మహానుభావుడు. ఇతడు అక్బరుకాలమునాటివాడు. 'బర్హాన్‌ఖాన్' యొక్క ఆస్థానగాయకుడు. హిందుస్థానీ సంగీతములో రాగ, రాగిణీ, పుత్రములను రాగవిభజన చేసి నటువంటి ఘనుడు.

పుష్పతిక :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ధ ని స.
అవరోహణము– స ని ధ గ రి స.
ఇది ఉభయ ఔడవరాగమునకు చెందును.

పున్నాగవరాళి :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క మిశ్రరాగమగు నొకజన్యరాగము.
ఆరోహణము– ని స రి గ మ ప ధ ని.
అవరోహణము– ని ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు చెందును. సందర్భానుసారముగ దీనిలో కొన్నితావులందు 'రి3' ను వుపయోగింతురు.

పురందరదాసు:—15-16వశతాబ్దములకు చెందినట్టియు, మహాభక్తుడు, ధార్మికుడైనట్టియు, కన్నడములో షుమారు 4 లక్షల 75 వేలవరకు దేవరనామములు రచించినట్లు ప్రతీతిగల మహనీయునికి గలపేరు. మరియు నితడు కర్నాటక సంగీతమును బోధనకు వీలుగా స్వరావళి, అలంకార గీత, తాయ, సూళాది ప్రబంధములను రచించిన మహనీయు డగుటచే 'కర్నా

టకసంగీత పితామహ, ఆదిగురువు' అను ప్రఖ్యాత బిరుదముల నొందెను.

పురందరవిఠల :— "పురందరదాసు" యొక్క రచనలందలి ముద్రకు పేరు.

పురసూయ :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ గ రి మ ప నిధనిస.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

పురాణనూరు :— సంగీతమును గురించి వ్రాయబడకయున్నను తాళములను గురించిమాత్రము చక్కగా వ్రాయబడిన యితర సారస్వతమునకు చెందినట్టి యొక గ్రంథమునకు పేరు.

పురాతనగ్రంథస్థమైన అలంకారములు:–

స్థాయి అలంకారము.

| శాస్త్రయుక్తమైన పేర్లు. | ఉదాహరణములు. |
|---|---|
| ప్రసన్నాది | – సా సా సా |
| ప్రసన్నాంత | – సా సా సా |
| ప్రసన్నాద్యంత | – సా సా సా |
| ప్రసన్నమధ్య | – సా సా సా |
| భద్ర | – స రి స–రి గ రి–గ మ గ |
| నంద | – స స రి రి స స–రిరిగగరిరి |
| జిత | –సగరిస, రిమగరి, గపమగ |

ఆరోహి అలంకారము.

| శాస్త్రయుక్తమైన పేర్లు. | ఉదాహరణములు. |
|---|---|
| బిందు | – స స స రి, రి రి రి గ, గ గ గ మ, |
| త్రివర్ణ | – స రి గ గ గ, రి గ మ మ మ, గ మ ప ప ప, మ ప ధ ధ ధ, |
| అక్షిప్త | – స స గ గ, రి రి మ మ గ గ ప ప, మ మ ధ ధ, |
| హాసిత | – స, రి రి, గ గ గ, మ మ మ మ ప ప ప ప ప, మొదలగునవి. |

పై ఆరోహిఅలంకారములను అవరోహణ క్రమములోనికి మార్చినచో అవరోహి అలంకార వుదాహరణములు వచ్చును.

సంచారి అలంకారము.

| శాస్త్రయుక్తమైన పేర్లు. | ఉదాహరణములు. |
|---|---|
| ఉద్వాహిత | – స రి గ రి, రి గ మ గ, గ మ ప మ, మ ప ధ ప, |
| హ్లాదమాన | – స గ రి స, రి మ గ రి గ ప మ గ మ ధ ప మ, |
| ఉద్ఘాటిత | – స రీ ప మ గ రీ, రి గా ధ ప మ గా, మొదలగునవి. |

పురాతన తమిళ సంగీత విభజన :— పురాతన తమిళసంగీతములో చేయబడిన పణ్, తిరమ్ అనునట్టి రాగవిభజనకు గలపేరు. పణ్ అనగా రాగమునకుగల సాధారణనామము. ఇది జనక, జన్య రాగములకు గూడవర్తించును. ఇది ఎల్లప్పుడు సంపూర్ణ – సంపూర్ణములుగానే వుండనక్కరలేదు. వీటిలోకొన్ని 'వెంకటమఖి' యొక్క అసంపూర్ణ మేళములుగా నున్నవి. ప్రతి పణ్‌లోను కొన్ని జన్య రాగములుండును. 'తిరమ్' అనగా వర్జ్య రాగమునకుచెందిన ఔడవరాగము. 'పణ్ణియత్రిరమ్' అనగా షాడవరాగము. తిరత్తిరమ్ అనగా స్వరాంతరరాగము. ఈపణ్‌లను అవిపాడదగిన కాలములనుబట్టి 3విధములుగా విభజింపబడినవి. అవియేవనగా

1. పగలుంపణ్‌లు–అనగా పగటివేళ పాడదగినరాగములు. ఇవి 12.
2. ఇరవుప్పణ్‌లు–అనగా రాత్రివేళపాడదగినరాగములు. ఇవి 9.
3. పొదుప్పణ్‌లు– అనగా ఎల్లప్పుడును పాడదగినరాగములు. ఇవి 3.

మె త్తము 12+9+3=24 పణ్ లుగా చెప్పబడెను. వీటికి ఉదాహరణము :— గాంధార పంచమము, పంజరము, మాళవ కాశికము, నట్టరాగము, కొవానము, కొల్లి కావనము మొదలగునవి. ఇవి సంస్కృతము నుండి పుట్టినవగుచున్నవి.

పురాతన సంగీతరచన :— సంగీతము నకు అతిపురాతనమై ప్రధానమైనట్టి 'సామ వేదము' నకు గలపేరు. ఇది 3,000 సంవత్స రములనుండియు ఒకేవిధముగా పాడబడు చున్నది.

పురుషరాగము :— నారదునిచే 'సంగీత మకరందము'లో రాగనామములబట్టిచేసిన రాగవిభజనలోని 3 రకములలో మొదటి దానికి గలపేరు.

పురుషరాగములు :— శ్రీరాగము, వసం త, భైరవ, పంచమ, మేఘ, బృహన్నాట అను 6 రాగములకు గలపేరు.

పుష్టము :— నాదము హృదయమునుండి ఊర్ధ్వముగా బయలు వెడలుటలో కంఠ మందుండు నపుడు 'పుష్టము' అని చెప్ప బడును.

పుష్పమణి :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ రి మ ప ధ స. అవరోహణము- స ని ధ ప మ గ రి స. ఇది వక్రషాడవ - సంపూర్ణ రాగమునకు చెందును.

పుష్పలతిక :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ని స. అవరోహణము- స ని ప మ గ రి స. ఈ రాగములో శ్రీ 'తిరుపతి నారాయణ స్వామి' ఇకనైన నామురివినరాద, అను ప్రసిద్ధకృతిని రచించెను.

పుష్పవసంతము :— 2 వ మేళకర్త యగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ ప మ ధ ని స. అవరోహణము- స ధ ని ప మ గ రి స.

పృథ్వీ పద్మక :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి మ ప ధ ని స. అవరోహణము- స ని ధ ప మ గ రి స. ఇది షాడవ - సంపూర్ణమునకు చెందును.

పృథుల :— భరతుని 'నాట్యశాస్త్రము' లో పేర్కొనబడి ఆ కాలములో నాట్య ములో నుపయోగించు ప్రధాన రచనలగు 4 గీతికలలో 4 వ దానికిగలపేరు. ఇవి యీకాలమునందు వాడుకలో నున్నట్లు కనుపడుటలేదు.

ప్లుతద్రుతము :— తాళషోడశాంగములగు 16 టి లో 14 వ దానికి గలపేరు. దీనికి అంగములు 0 3. అక్షరకాలములు 14.

ప్లుతద్రుత విరామము :— షోడశాంగము లగు 16 టి లో 15 వ దానికి పేరు. దీనికి అంగములు ◡ 0 3. అక్షరకాల ములు 15.

ప్లుతము :— సంగీత కాలమునులెక్కించు ట కుపయోగించు తాళషడంగములలో 5 వది. దీనికి గుర్తు 3. అక్షరకాలములు

12. అనగా 1 చతురశ్రలఘువువేసి 4 అక్షర కాలము ఎడమవైపుకు (కృష్య) 4 అక్షర కాలము కుడివైపుకు (సర్పిణి) విసరుట.

ప్లుతమేరువు :— తాళప్రస్తారభేదములగు 14 టిలో 10 వ ప్రస్తారమునకు గలపేరు.

ప్లుతవిరామము :— తాళ షోడశాంగము లగు 16 టిలో 13 వ దానికిపేరు. దీనికి అంగములు ◡ 3. అక్షరకాలములు 13.

## పూ

పూచిఅయ్యంగార్ :— ప్రఖ్యాత కర్ణాటక సంగీత విద్వాంసుడగు సంగీత కళానిధి, శ్రీ అరియకుడి రామానుజయ్యంగారి గురువగు కీ॥ శే॥ శ్రీ రామనాధపురం శ్రీనివాస అయ్యంగారికిగల ప్రత్యేకనామము. వీరు అనేక వర్ణములు, కృతులు జావళ్లు రచించిన ప్రఖ్యాత వాగ్గేయకారులు. ఉ॥ సరగునపాలింప, పరమపావన అనునవి వీరి ప్రసిద్ధరచనలగును.

పూర్ణ :— 35 తాళముల పట్టికలో 22వ తాళమగు 'మిశ్రజాతి ధృవతాళము' నకు గలపేరు. దీనికి అంగములు । O । ।. అక్షర కాలములు 23.

పూర్ణ :— 'భావభట్టుని' 22 శృతుల విధానములోపేర్కొనిన మధ్యమ శృతులు 4 టిలో 3 వ శృతికి పేరు.

పూర్ణకంకాలతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 తాళముల పట్టికలోని 73 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 0 0 8 ।. మాత్రలు 5. అక్షర కాలములు 20.

పూర్ణకళానిధి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

పూర్ణకాంభోజి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

పూర్ణకుంభతాళము :— 'తాళసముద్రమ్' అను తమిళ గ్రంథమునందుగల 15 వ తాళమునకుగల పేరు.

పూర్ణగాంధారి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ప ధ ని ధ స రి గ మ ప ధా.
అవరోహణము— ప మ గ రి స ని ధ ని ప.
ఇది ధైవతాంత్యరాగమునకు చెందును.

పూర్ణగౌళ :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

పూర్ణచంద్రిక :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప స.
అవరోహణము— స ని ప ధ ప మ గమరిస.

ఇది వక్రషాడవ - వక్రసంపూర్ణరాగ మగును. త్యాగరాజుని ప్రసిద్ధకృతియగు 'తెలిసిరామచింతన' ఈ రాగములోనిదై యున్నది.

పూర్ణతాళము :— 'రత్నాకర' గ్రంథ మునందుగల 120 దేశితాళములలో 65 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 00008ı.

పూర్ణద్విశ్రుతివ్యవధి :—16/15 రేషియో విలువకును 112 సెంట్లకును సమానమగు డయాటోనిక్ అర్ధస్వరమునకుగల పేరు.

పూర్ణనిషాదము :—63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ప ధ ని ధ స రి గ మ.
అవరోహణము—ప మ గ రి స రి స ని ధ ప.
ఇది పంచమాంత్యరాగమునకు చెందును.

పూర్ణపంచమము :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

పూర్ణలలిత :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది ఔడవ - సంపూర్ణరాగమునకు చెందినదగును.

పూర్ణలక్షణరాగమాలిక :— లక్షణము నకు సంబంధించిన అన్నివిషయములుగల ఒకరకమైన రాగమాలికకు గలపేరు. దీనికి వ్యతిరేకమైనది 'అపూర్ణలక్షణ రాగమాలిక' యగును. దీనిలో 2 లేక 3 లక్షణ విషయములు లేక యుండును.

పూర్ణశ్రుతి :— ద్విశ్రుతికము ÷ ప్రమాణ శ్రుతి = పూర్ణశ్రుతి యగును. అనగా $\frac{16}{15} \div \frac{81}{80} = \frac{256}{243}$ విలువగలది. ఇది 90 సెంట్లకు సమానము.

పూర్ణషడ్జము :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ ప ధ ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
ఇది వక్రస్వరాంతర - షాడవరాగమగును.

పూర్ణస్వరావళి :— 12 వ మేళకర్తయగు 'రూపవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ రి గ స.

పూర్ణనుపుర :— 62 వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప ధ ప మ రి స.

పూర్ణహార్మొని :— ఒక స్వరమునకు మరి యొక స్వరమునకుగల అంతరము సరీగా ఒకస్థాయి వుండినచో అట్టిది 'పూర్ణ హార్మొని' యందురు. ఉ॥ స - స.

పూర్వకన్నడ :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ప స.
అవరోహణము— స ధ ని ధ ప మ గ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

పూర్వకల్యాణి :— 53 వ మేళకర్తయగు "గమనశ్రమ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని పధపస.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ – సంపూర్ణరాగమగును.
త్యాగరాజుని "జ్ఞానమొసగరాదా" కృతియు, దీక్షితుల 'మీనాక్షీమేముదం దేహి' కృతియు, శ్యామశాస్త్రిల "నిన్నువినాగామరి" కృతియు, శ్రీనివాస అయ్యంగారి "పరమపావనా" కృతియు యీ రాగములోని ప్రసిద్ధ కృతులుగా నున్నవి.

పూర్వగౌళ :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము– స రి మ గ రి మ ప నిధనిస.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ– సంపూర్ణ రాగమగును.

పూర్వదర్శి :— 14 వ మేళకర్తయగు "వకుళాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి ప గ మ ప ధ ని.
అవరోహణము– ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు చెందును.

పూర్వఫరుజు :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

పూర్వభైరవి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

పూర్వముఖారి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ప మ గ రి స.

పూర్వము నాట్యమునందుపయోగించు వాద్యములు :— పురాతన కాలములో పిల్లనగ్రోవి, ముఖవీణ వంటి గాలివాద్యములను సాధారణముగా నాట్యమునందు వుపయోగించినట్లు చెప్పుదురు.

పూర్వమేళకర్తలు :— 72 మేళకర్తలలో 1 నుండి 36 వరకుగల శుద్ధ మధ్యమ మేళకర్తలకుగల పేరు. వీటి తరువాత నుండు 37 నుండి 72 వరకుగల 36 ప్రతి మధ్యమ మేళకర్తలకు ఉత్తర మేళకర్త అని పేరు.

పూర్వరామక్రియ :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము– స ని ప ధ మ గ రి స.

పూర్వరౌళిక :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప మ ని ధ స.
అవరోహణము– స ని ప మ గ రిసనిధనిస.

పూర్వవరాళి :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ స.
అవరోహణము– సనిధపమగరిసనిధనిస.

పూర్వసాళవి :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ రి స.

పూర్వసింధు :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స ని స.
అవరోహణము- స ధ ప మ ధ మ గ రి స.

పూర్వాంగము :— ఇది తగుస్థాయి లేక మొదటి భాగమునకు వర్తించును. అనగా సప్తస్వరములుగల ఒక స్థాయిలోని 'స రి గ మ' అను మొదటి భాగమునకును మరియు వర్ణములోని పల్లవి, అనుపల్లవి, ముక్తాయిలుగల మొదటి భాగమునకు కూడ 'పూర్వాంగమని' చెప్పబడును.

పూరికల్యాణి :— 'పూర్వకల్యాణి'కిగల మరియొక పేరు.

పూర్వి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని ప స.
అవరోహణము- స ని ధ ప ధ మ గ రి స.
ఇది ఉభయ వక్రసంపూర్ణరాగమునకు చెందును.

పూషాకల్యాణి :— 54 వ మేళకర్తయగు "విశ్వంభరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.
ఇది సంపూర్ణ-షాడవరాగమునకు చెందును.

## పె

పెద్దకారల్ సింఫనీ :— సుప్రసిద్ధ పాశ్చాత్య సంగీతపండితుడగు 'బీథోవెన్' రచించిన 9 వ సింఫనీకి గలపేరు. దీనిని ప్రదర్శించుటకు 1 గంట 20 నిమిషముల కాలము పట్టునని తెలియుచున్నది.

పెద్దాభరణమ్ :— 'శ్రీ వనపాదచూడామణి' చే రచింపబడిన "తాళసముత్తిరమ్" అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన తాళములలో 11 వ దానికి గలపేరు.

పెన్నవర్థిని :— 27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ ప గమరిస.

పెన్నా :— అస్సాము సరిహద్దులోని 'మణిపుర' ప్రాంతమునందు వాడు ఒకే తంతినిగలిగి కమాను (Bow)తో వాయింపబడు నొకరకపు వాద్యమునకు గలపేరు. ఇది పురాతన కాలమునకు చెందిన "పినాకి"వాద్యముగా కొందరు చెప్పుదురు.

పెరియనిరుచ్చి :— "తాళసముత్తిరమ్" అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన తాళములలో 6 వ తాళమునకు గలపేరు.

## ప్రే

ప్రేయసి :— 18 వ మేళకర్తయగు "హాటకాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

ప్రేయసి :— 61 వ మేళకర్తయగు "కాంతామణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

ప్రేరితస్పందనములు :— స్పందించెడి యొకవస్తువుకు యితర శక్తిని ప్రయోగించి నపుడు అసలుదానియొక్క సహజస్పందనములు అణచబడి ప్రయోగింపబడిన స్పందనములతో బలవంతముగా స్పందింపబడునట్టివాటికి ప్రేరితస్పందనములని పేరు.

## పై

పైథాగొరస్ (పిథాగొరస్) :— సంగీతములో తనకుగల విజ్ఞానమును ఇండియానుండి సంపాదించినట్టి ఒక ప్రాచీన పాశ్చాత్య సంగీత పండితునికిగలపేరు. ఇతను క్రీ.పూ. 500 లో ఇండియాలో సంచారముచేసినట్లు తెలియుచున్నది.

ప్రైమరీరాగము :— మేళకర్తరాగమునకుగల ఇంగ్లీషులోని పేరు.

## పా

పాడుప్పణ్ :— పురాతన తమిళ సంగీత విభజనలో పేర్కొనబడినట్టియు, అన్ని వేళలయందును పాడదగినట్టి రాగమునకు తమిళములో చెప్పబడునట్టి పేరు.

## పో

ప్రోషితభర్తృక :— నాయికా లక్షణములో పేర్కొనబడిన అష్టవిధనాయికలలో 7వ దానికిగలపేరు. ఈ నాయిక నాథుడు దేశాంతరగతుడై యుండునపుడు ఖేదపడునదియగుటచే ప్రోషితభర్తృకయనబడును.

## పౌ

పౌరవి :— చతుర్దశ మూర్ఛనలగు 14 టిలో 13 వ మూర్ఛనకుగల పేరు. ఈ మూర్ఛన ధైవత స్వరముతో ప్రారంభింపబడునదిగా నుండును.

## ఫ

ఫండమెంటల్ రాగము(Fundamental Raga) :— మేళకర్తరాగము లేక జనకరాగమునకు గల ఇంగ్లీషులోని పేరు. ఈరాగములు మొత్తము 72 కలవు.

ఫరజ్ :— 15 వ మేళకర్త జన్యమైన ఫరజు రాగమునకుగల మరియొక పేరు.

ఫరుజు :— 15 వ మేళకర్త జన్యమైన ఫరజు రాగమునకు గల మరియొక పేరు. దీనినే ఫరజు అనియు, ఫరజ్ అనియు, ఫరుజు అనియు వాడినను రాగముమాత్రము ఒకటేయని గ్రహింపదగును.

ఫలదాయకి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ ప మ ధ ని స.
అవరోహణము– స ధ ని ప గ మ గ రి స.

ఫలనాదని :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

ఫలమంజరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము. దీనినే 'పలమంజరి' యనికూడ చెప్పుదురు.
ఆరోహణము– స గ మ ధ స.
అవరోహణము– స ని ధ ప మ గా మరిస.
త్యాగరాజుని ప్రసిద్ధకృతి "సనాతన పరమపావన" ఈ రాగములోకలదు.

ఫలమంజరి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య రాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము– స గ మ ధ స.
అవరోహణము– స ని ధ మ ప మ గ రి స.

## ఫా

ఫాస్టరల్ సింఫనీ:—పూర్వమువియన్నా లోనిసుప్రసిద్ధపాశ్చాత్యగాయకుడును కవి యునగు, 'బీథోవెన్' (Beethoven) రచియించిన 6 వ సింఫనీకి గలపేరు. దీనిని ప్రదర్శించుటకు 40 నిమిషముల కాలము పట్టునని తెలియుచున్నది.

## ఫి

ఫింగర్టెక్నిక్ :— (Finger Tecnic) తంత్రీవాద్యములకుచెందినసంగీతవాద్యము లను వాయించునపుడు తంత్రులపై వ్రేళ్ళ నుపయోగించెడి సాంకేతిక శాస్త్ర విధానమునకు ఇంగ్లీషులోని పేరు.

ఫింగర్ బోర్డ్ (Finger - Board):— వయొలిన్ వంటి తంతివాద్యములందు వ్రేళ్ళు ఆనుకొనేందుకు అమర్చబడిన నునుపైన నల్లని గట్టిచెక్కకు ఇంగ్లీషు లోని పేరు. ఈ ఫింగర్ బోర్డ్ పైభాగ మున వేయబడిన తంత్రులమీద ఆయా రాగ స్వర స్థానముల ననుసరించి ఎడమ చేతివ్రేళ్ళను అదుముచూ కమానుతో వాయించెదరు. వీణ, గోటు, వంటి వాద్యములలో "దండి" అనబడు భాగ మునే "ఫింగర్ బోర్డ్" అని చెప్పుదురు.

ఫింగర్ హెూల్స్ (Finger - Holes):- గాలివాద్యములగు పిల్లనగ్రోవి (ఫ్లూట్)

నాగస్వరమువంటి వాద్యములలో ఫ్రేళ్ళు అనుకొనే తావులందు యేర్పఱచియుండు రంధ్రములకు ఇంగ్లీషులోని పేరు.

ఫిడల్ (Fiddle) :— వయొలిన్ వాద్యమును తెలుగుదేశమునందు వాడుపేరు. ఇది మొదట పాశ్చాత్య వాద్యమైనను నేడు కర్నాటక సంగీతమును వివిధగమకముల తో తనిగాను, ప్రక్కవాద్యముగాను ప్రదర్శించుటేగాక గంభీరముగను, సున్నితముగను, మాధుర్యముగను ప్రదర్శించుటకు తగిన వాద్యముగా పరిగణింపబడుచున్నది. వర్తమానకాలములో దక్షిణభారతమున సుప్రసిద్ధవయొలిన్ వాద్యకులెందరోగలరు. అట్టివారిలో సంగీతకళానిధి, శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడు, సంగీత కళానిధి శ్రీ కుంభకోణం రాజమాణిక్యంపిళ్లె, సంగీతరత్న శ్రీ మైసూరు చౌడయ్యవంటి వారలు ప్రసిద్ధు లగుచున్నారు.

ఫిల్లగోవి (Fillagovi) :— మురళీ, లేక వేణువాద్యమునకుగల మరియొక పేరు.

## ఫ్రీ

ఫ్రీక్వెన్సి (Frequency) :— శృతులను నిర్ణయించుటలో ఒకశృతికి సెకండుకు యెన్ని స్పందనములు గలవో చెప్పుటకు ఇంగ్లీషులో గలపేరు. దీనినే తెలుగులో వేపనసంఖ్యఅనియు, లేక తరచు తనము అనియు చెప్పుదురు.

## ఫ్లూ

ఫ్లూట్ (Flute) :— మురళీ, లేక వేణువు అని చెప్పబడు గాలివాద్యమునకు ఇంగ్లీషులోని పేరు. భారతీయ సంగీతములో ప్రధానమైన పురాతన సంగీత వాద్యములగు 3 టిలో రెండవది. మిగతవి వీణ, మృదంగము లనునవి. మన పురాణములందు శ్రీకృష్ణుడు మురళిని వాయించునటుల చెప్పబడుటచే పవిత్రమైన యీ వాద్యమునకుగల విశిష్టతయు ప్రాచీనతయుకూడా స్పష్టమగుచున్నది. ఈ వాద్యమును తనిగాను, వాద్యసమ్మేళనమునందును, నాట్య ప్రదర్శనములందును ప్రదర్శింతురు. దక్షిణ ఇండియాలో ఈ వాద్యమునందు యెందరో ప్రసిద్ధులగువారు గలరు. అట్టి వారిలో శ్రీ పల్లడం సంజీవరావు, శ్రీ టి. యస్. స్వామినాథపిళ్లె, శ్రీ టి.ఆర్.మహాలింగం వంటి వారలు ముఖ్యులగుచున్నారు.

## ఫ్రె

ఫ్రెట్స్ (Frets) :— వీణ, సితార్ వంటి తంత్రీవాద్యములలో 'దండి' అన బడు ఫ్రేళ్ళు అనుకొనే పొడుగాటి చెక్కపైన అమర్చబడునట్టి మెట్లకు ఇం

...షులోని పేరు. ఈమెట్లు ఉక్కు లేక ఇత్తడి లేక వెండితో చేయబడినవిగా నుండును. ఇది స్వరస్థానముల నిరూపించుట కేర్పఱచబడినవగును.

## ఫే

ఫేనద్యుతి :—72 మేళకర్తరాగములలో 2 వ మేళకర్తయగు 'రత్నాంగి'కి 'వెంకటమఖి' మొదటపెట్టిన పేరు. ఇది 1వ 'ఇందు' చక్రములోని 2 వ మేళమగును.

## ఫై

ఫైన్ఆర్ట్సు (Fine arts) :—ఇది అయిదు రకములగు లలితకళలను కలిపిచెప్పునట్టి ఇంగ్లీషులోని పేరు. ఆ 5 యేవనగా

1. సంగీతము– (Music)
2. పద్యరచన– (Poetry)
3. రంగులువేయుట– (Painting)
4. శిల్పము– (Sculpture)
5. భవననిర్మాణము–(Architecture)

వీటిలో మొదటిదైన సంగీతము సర్వజనానురంజకమైనదగుటయేగాక ఇహ, పర సాధనకు మార్గమగు నుత్తమకళయగును.

## ఫో

ఫోనోగ్రామ్‌ఆర్కైవ్స్ :— జర్మనీదేశములోని బెర్లిన్ నగరములో నెలకొల్పబడిన అద్భుతమైన ఒక సంగీతసంస్థకు గలపేరు. దానిలో ప్రపంచములోగల అన్ని దేశముల యొక్క సంగీతమును కలిగియున్న సంఘములు కలవని తెలియుచున్నది.

ఫ్లోక్‌మ్యూజిక్ (Flok Music) :—ఇది సాధారణముగా పల్లెటూరి ప్రజలు ప్రదర్శించు సంగీతమునకుగల ఇగ్లీషుపేరు. దీనినే తమిళములో నాట్టుప్పాట్టు, నాడోడిప్పాట్టు అనియు తెలుగులో పల్లెపాటలు, పామరజనగానమ్, గ్రామ్యగానము, జానపదగీతము లనియు, హిందీలో 'లోకగీత్' అనియు వాడుదురు. ఇండియాలోని గ్రామీణులు వారి విశ్రాంతి సమయములందును, పండుగ సమయములందును, పనిపాటలుచేయు సమయములందును వివిధరకములగుపాటలతోకూడిన యిట్టి సంగీతమును పాడుచుందురు.

## బ

బకవధమ్ :— 'శ్రీ కార్తికతిరునాళ్ రామవర్మ మహారాజు'చే రచింపబడిన ఒక 'కథకళి'నాట్యమునకు గలపేరు.

బకుర :— ఋగ్వేదములో పేర్కొనబడిన ఒక రకపు గాలివాద్యము. దీనినే 'బాకుర' అనికూడ చెప్పుదురు.

బంగతాళము :— 17 వ శతాబ్దమునకు చెందిన 'బరతనాట్టియ శాస్తిరమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన ఒక తాళమునకుగల పేరు.

బంగారుకామాక్షి :— తంజావూరు దేవాలయమునందు శ్రీశ్యామశాస్త్రిచే పూజింపబడిన 'కామాక్షిదేవి'కిగల పేరు. ఈ దేవికి విలువగల అనేక బంగారుఆభరణములుండుటచే బంగారుకామాక్షి అనియు, స్వర్ణకామాక్షిఅనియు, తంగ (తమిళములో బంగారు) కామాక్షి అనియు పిలుతురు. శ్రీ శ్యామశాస్త్రులు యీ కామాక్షిదేవిని వుపాసించి యీమెఅనుగ్రహమువల్లనే యనేకకృతులను రచించగలిగెనని చెప్పుదురు.

బంగాళ :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము'యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ రి ప స.
అవరోహణము— స ని ప మ రి గ రి స.
ఈ రాగములో ప మ గ మ రి, విశేష సంచారమగును. ప, రి, జీవస్వరములు ప, న్యాసస్వరముయగును. అన్నిసమయములందు పాడదగినది. ఈ రాగమునకు అధిదేవత గణేశుడు. గనుకనే త్యాగరాజు 'గిరిరాజసుత'అను రచనను గణపతి ప్రార్థనగా బంగాళరాగములోనే రచించుటకు కారణమయ్యెను. మరియు 'మునుపే తెలియక బోయెనా' 'సాక్షి లేదనుచు' వంటి త్యాగరాజకృతులును 'రా రా రామా' అను గర్భపురి కృతియు యీ రాగములోని ప్రసిద్ధ కృతులగును. ఇది యొక ప్రాచీనరాగమునకు చెందును.

బంగాళగౌళ :— 55 వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

బంగాళయోసిత :— నారదుని 'సంగీతమకరంద' మను గ్రంథములో పేర్కొనబడిన యొకరాగము.

బంగాళవరాళ :— శ్రీ జయదేవుని చే విరచితమగు 21 వ అష్టపదికి యేర్పఱచిన యొకరాగము.

బట్టాబీన్ :— హిందుస్థాని సంగీతములో నుపయోగించు ఒకరకపు తంతివాద్యము. ఇది రుద్రవీణకు సరిపోవునదిగా నున్నను మెట్లులేనందు వలన గోటు వాద్యమువలె వాయింపబడును. దీనినేవిచిత్రవీణ అనియు హిందుస్థాని గోటువాద్యమనియు చెప్పుదురు.

బర్త- ఆర్. యల్ :— హిందుస్థాని సంగీతమును గుఱించి ఇంగ్లీషులో 'ఆర్ట్ అండ్ సైన్సు ఆఫ్ ఇండియన్ మ్యూజిక్' అను నొక ప్రశస్తమైన గ్రంథమును రచించిన గ్రంథకర్తకు గలపేరు.

బదరి :— 26 వ మేళకర్తయగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప ని ప మ గ రి స.

బదరిక :— 51వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ని ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.
ఇది వక్రసంపూర్ణ – ఔడవరాగమగును.

బయలాట :— కన్నడ భాషలో గల యొక యక్షగానమునకు పేరు.

బరతచూడామణి :— తాళపద్ధతిపై 'తాళసముత్తిరమ్' అను గ్రంథమును తమిళములో వ్రాసిన ఒక ప్రాచీన గ్రంథకర్తకు గల గౌరవనామము.

బరతనాట్టియశాస్తిరమ్ :— మదరాసు యూనివర్సిటీలో తమిళశాఖ యందుగల 17 వ శతాబ్దమునకు చెందిన ఒక తమిళ వ్రాతప్రతి గ్రంథమునకు గలపేరు.

బరతసేనాపతీయము :— 'ఆదివాయిలార్' చే నృత్య, అభినయములమీద రచింపబడిన ఒక పురాతనతమిళగ్రంథము. యీవిషయమును అడియార్కునల్లార్ వ్రాసిన'శిలప్పదికారమ్'అనుగ్రంథముయొక్క వ్యాఖ్యానములో కనుగొనబడెను.

బర్బరా :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

బర్బరి :— 'బర్బరా' రాగమువలె నుండుదానికి గలపేరు.

బర్హిధ్వజ :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ధ ని స.
అవరోహణము– స ని ధ గ రి స.

బర్గీత్ :— అస్సామ్ రాష్ట్రము (1449–1568) నకు చెందిన 'శంకరదేవ్'చే రచింపబడిన ప్రసిద్ధరచనకు గలపేరు.

బలచరిత్ర :— 60 వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము–స రి గ రి మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ని ప మ గ రి స.

బలబి :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ధ ని ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇది షాడవ–సంపూర్ణము. [ప. శే. గ్రం.]

బలహరి :— బిలహరి రాగమునకుగల మరియొకపేరు.

బలహంస :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ స.
అవరోహణము–స ని ధ ప మ రి మ గ స.
ఇది ఉపాంగరాగము. పురాతనరాగము. శ్రీ త్యాగరాజు, మైసూరు సదాశివరావు, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ లు యీ రాగములో ప్రసిద్ధమైన కృతులను రచించి యుండిరి.

బలావలు :— 'వెంకటమఖి' యొక్క 'చతుర్దండి ప్రకాశిక'అను గ్రంథములో పేర్కొనబడిన ఒక దేశీయరాగము.

బల్లాతి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ప మ రి గ మ రి స.

బలివలము :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ని ప మ రి స.
దీనినే 'స్వరప్రస్తారసాగరము'లో 'బలి బళం'అని పేర్కొనబడినది.

బసంత్ :— వసంత రాగమునకుగల మరియొక పేరు.

బనమాన :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ని పమరిగమగస.

బసవి :— దేవాలయములందు నాట్యము చేయు నర్తకునికి గలపేరు.

బసూలి :— నేపాల్ దేశములో వివాహ సమయములందు జరుగు నాట్యములకు వుపయోగించునట్టి ఒకరకమైన మురళీ (Flute) వాద్యమునకు పేరు.

బహలి :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి గ ప ని ధ స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

బహార్ :— హిందుస్థాని సంగీతములోని కాపి (దాట్) రాగమునకు చెందిన ఒక జన్యరాగము.

బహార్ కన్నడ :— హిందుస్థాని సంగీతములోని కాపిదాట్ కు చెందిన మరియొక జన్యరాగము.

బహుత్వము :— రాగములకు పేర్కొనబడిన త్రయోదశ (13) లక్షణములలో నొకదానిపేరు. అనగా ఒకరాగమునందు ఒకేస్వరమును మాటిమాటికి గ్రహించి పాడుట 'బహుత్వ' మనబడును. ఇది రెండువిధములు 1. అభ్యాసము. 2. అలంఘనము. అభ్యాసమనగా ఒక స్వరము మాటికి మాటికి వుచ్చరించుట. అలంఘనమనగా ఒక స్వరమును స్వల్పముగా ప్రయోగించకుండునది.

బహుదామని :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

బహుదారి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ గ స.
మరియు స గ మ ధ ప ధ ని స - స ని ప మ గ స. అను విధముగా కొన్ని గ్రంథములందు గలదు. ఉపాంగరాగము. షాడవ ఔడవరాగము. త్యాగరాజుని రచనయగు 'బ్రోవభారమా' అనునది యీ రాగములోని ఒక ప్రసిద్ధరచన యగును.

బహుపురాతన సంగీతశాస్త్ర గ్రంథము :— 'భరతముని'చే వ్రాయబడిన 'నాట్యశాస్త్రము' అన్నిటికంటె అతిపురాతన సంగీతలక్షణగ్రంథమగును.దీనిలోసంగీతముకంటె నాట్యమును గురించిన విషయములే విశేషముగా పేర్కొనబడి యున్నవి.

బహుమారిణి :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము, ఆరోహణము— స రి గ మ ధ ని స. అవరోహణము— స ని ధ మ గ రి స.

బహుముద్రకారుడు :— సంగీతరచనలను ఒకటికంటెయెక్కువముద్రలతోరచియించు రచయితకుగలపేరు. ఉ॥ భద్రాచల రామదాసు యిట్టి బహుముద్రకారునికి ముఖ్య ఉదాహరణయగును. ఇతడుతనరచనలందు రామదాస, భద్రాచల, భద్రాద్రి, భద్రశైల, భద్రగిరి మొదలగు ముద్రలను వుపయోగించెను. బహుముద్రకారునికివ్యతిరేక నామము ఏకముద్రకారుడు. అనగా ఒక ముద్రతో రచించువాడు.

బహుముద్ర ప్రబంధము :— సంగీత రచనలలో నుపయోగించు ద్వాదశ ముద్రలలో రెండు లేక అంతకంటె యెక్కువ ముద్రలను గలిగిన ప్రబంధమునకుగలపేరు. (1)ఉ॥నిత్యకల్యాణి, అనురాగ మాలికలో రెండుముద్రలు గలవు. i రాగముద్ర, ii వాగ్గేయకారముద్ర.(2)ఉ॥చింతయమా అనుకృతిలో మూడు ముద్రలు గలవు. i రాగముద్ర, ii వాగ్గేయకారముద్ర, iii క్షేత్రముద్రగలవు. గనుక యిట్టిరచనలు పైరకమునకు చెందును.

బహులి :— గౌళిరాగమువలె నుండు రాగమునకు గలపేరు.

బహువిద్యయము :—నారదుని 'సంగీత మకరంద' మను గ్రంథములో పేర్కొనిన పూర్వాంశ రాగములలో వొకదానికి గల పేరు.

బహువిధ పంచరత్న కీర్తనలరచయిత:— పంచరత్నకీర్తనలను విశేషముగా రచించిన శ్రీ త్యాగరాజునకు గలపేరు. ఇతడు (I) తిరువొత్తియూర్ శ్రీ త్రిపురసుందరి దేవిపై i కన్నతల్లి, ii సుందరి నిను వర్ణింప, iii సుందరి నన్నిందరిలో, iv దారిని తెలుసుకొంటి, v సుందరి నీదివ్య రూపమున అను పంచరత్న కీర్తనలును, (2) కోవూరు సుందరేశ్వరునిపై i శంభో మహాదేవ, ii ఈవసుధనీవంటి, iii నమ్మి వచ్చిన, iv కోరిసేవింపరారె, v సుందరేశ్వరునిఅనుపంచరత్నకీర్తనలును. (3)ఘన రాగ పంచకముగా i జగదానంద, (నాట) ii దుడుకుగల(గౌళ)iii సాధించెనే(ఆరభి) iv ఎందరో మహానుభావులు (శ్రీరాగము) v కనకనరుచిరా (వరాళి) వంటిపంచరత్న కీర్తనలను రచియించుటచే గలిగినపేరు.

బహువిధ భాషాకీర్తనల రచయిత :— శ్రీ స్వాతి తిరునాళ్ మహారాజా (తిరువాన్కూరు) సంస్కృతము, తమిళము, తెలుగు, మలయాళము, మణిప్రవాళ(హిందుస్థాని మరాటి) మువంటి భాషలలో కీర్తనలురచయించుటచే గలిగినపేరు.

బహుళ ప్రయోగము :— ఏదైన ఒక రాగములో ఒకస్వరభాగమును లేక స్వర సంచారమును యెక్కువ పర్యాయములు వుపయోగించునపుడు గలుగుపేరు. దీనికి వ్యతిరేకమైనది 'క్వచిత్ ప్రయోగము'. అనగా ఒక రాగములో ఒక స్వరభాగమును అరుదుగా ప్రయోగించునదిగా యుండును.

బ్రమాతరంగిణి :— 51 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము. ఆరోహణము– స రి గ మ ప ధ ని స. అవరోహణము– స ప ధ ని పమరిగమరిస.
[ప. శే. బ్రా. గ్రం.]

బ్రహ్మ :— పురాతన సంగీత శాస్త్రము నకు సంబంధించిన ప్రామాణికులలో నొకరుగా ప్రాచీన గ్రంథకర్తలచే పేర్కొనిన ఒక లక్షణకారుడు.

బ్రహ్మ :— త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో నొకరికిగల పేరు. ఈ బ్రహ్మయే సామవేదమునుండి సంగీతమును గ్రహించి లోకోపకారార్థమై భరతాది యితర వాగ్గేయకారకులచే వెల్లడిచేయ గలిగినట్లు తెలియబడుచున్నది.

బ్రహ్మ :— 72 మేళకర్తలుగల 12 మేళ చక్రములలో 9 వ చక్రమునకుగల పేరు. ఇందు 49—54 వరకుగల ఆరు మేళకర్త లుండును.

బ్రహ్మ - గో :— 9 వ మేళచక్రములోని 3 వ మేళమగు 'కామవర్ధని'కి వెంకట మఖి పెట్టిన సంకేతనామము. ఇది 51వ మేళకర్తయగును.

బ్రహ్మ - పా :— 9 వ మేళచక్రములోని 1 వ మేళమగు 'ధవళాంబరి'కి వెంకట మఖి పెట్టిన సంకేతనామము. ఇది 49వ మేళకర్తయగును.

బ్రహ్మ - భూ :— 9 వ మేళచక్రములోని 4 వ మేళమగు 'రామప్రియ'కు వెంకట మఖి పెట్టిన సంకేతనామము. ఇది 52వ మేళకర్తయగును.

బ్రహ్మ - మా :— 9 వ మేళచక్రములోని 5 వ మేళమగు 'గమనశ్రమ'కు 'వెంకటమఖి' పెట్టిన సంకేతనామము. ఇది 53వ మేళకర్తయగును.

బ్రహ్మ - శ్రీ :— 9 వ మేళచక్రములోని 2 వ మేళమగు 'నామనారాయణి'కి వెంకటమఖి పెట్టిన సంకేతనామము. ఇది 50 వ మేళకర్తయగును.

బ్రహ్మ - షా :— 9 వ మేళచక్రములోని 6 వ మేళమగు 'విశ్వంభరి'కి వెంకటమఖి పెట్టిన సంకేతనామము. ఇది 54 వ మేళకర్తయగును.

బ్రహ్మగ్రంథి :— యోగాధారము లు ఆరింటిలో మొదటిదైన మూలాధారము యొక్క స్థానమునందుగల చతుర్దశదళ చక్రమునకుగల పేరు.

బ్రహ్మతాళము :— భజనలయందు సాధారణముగా నుపయోగించు తాళములకంటె పెద్దవిగానుండి లోహముతో చేయబడు నట్టి తాళమునకు పేరు. వీటిని దేవతోత్సవములందు వాయించుదురు.

బ్రహ్మభరతము :— నాట్యమును గురించి వ్రాయబడిన యొక ప్రాచీన లక్షణ గ్రంథమునకుగల పేరు.

బ్రహ్మలీలా :— 15 వ మేళకర్తయగు

'మాయామాళవగౌళ' యొక్క జన్యమైన షాడవ-సంపూర్ణరాగమునకు గలపేరు.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

బ్రహ్మవీణా :— ఉత్తర భారత దేశము లో నుపయోగించెడి యొక విధ మగు 'తంబుర' వాద్యమునకు గలపేరు.

బ్రహ్మవీణా :— ఇది యొకరకపు వీణా వాద్యమునకుగలపేరయగునట్లు యీాదిగువ గ్రంథములలో పేర్కొనబడినది.
1. నారదుని 'సంగీతమకరందము'
2. హరిపాలుని 'సంగీత సుధాకరము'
3. అహోబలుని 'సంగీత పారిజాతము'
4. మద్రాసు సంగీతవిద్వత్సభవారిచే ప్రకటింపబడిన 'సంగీతసార సంగ్రహము' లందు పేర్కొనబడినది.

# బా

బాంకా :— దేవాలయములలో జరుగు దేవతా వుత్సవములందు వుపయోగించు నొక గాలి వాద్యమునకుగలపేరు.

బాకుర లేక బకుర :— ఋగ్వేదములో పేర్కొనబడిన ఒక గాలివాద్యమునకు గలపేరు.

బాంగాలి :— 'సంగీతరత్నాకర' సంగీత మకరంద' గ్రంథములలో పేర్కొనబడిన యొకరాగము.

బాగెశ్రి :— శ్రీరంజని రాగమునకు సరి పోవునట్టి హిందుస్థాని సంగీతములోని యొకరాగము.

బాగేశ్వరి కన్నడ :— ఖరహరప్రియ మేళమునకు సరిపోవునట్టి హిందుస్థాని సం గీతములోని కాఫీథాట్ నుండి జనించిన యొక జన్యరాగము.

బాగేసరి బహార్ :— 9వ మేళకర్తయగు 'ధేనుక' నుండిజనించినట్టి హిందుస్థానిసంగీతములోని ఒకజన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స రి స ని ప మ గ రి స.
[కీ టు హిందు మ్యూజిక్ బుక్.]

బాణ :— మడంగములలో నొకటైన లఘువునకుగల మరియొకపేరు.

బాణ :— ఇది సంగీతశాస్త్రమునకు సంబంధించినంతవరకు 5 అను అంకెను తెలుపును. మరియు స్వరార్ణవము, అను గ్రంథములో అంతరగాంధారమునకు సరిపోవు పంచమ స్వరస్థానముగా కూడ పేర్కొనబడినది.

బాణ :— 72 మేళకర్తలను విభజించి యేర్పఱచిన 12 మేళచక్రములలో 5 వ మేళచక్రమునకుగలపేరు. ఇందు 25 నుండి 30 వరకు మేళకర్తలుండును.

బాణ - గో :— 5 వ మేళచక్రములోని 3 వ మేళమగు 'సరసాంగి' కి వెంకట మఖి పెట్టిన సంకేతనామము. ఇది 27 వ మేళకర్తయగును.

బాణ - పా :— 5 వ మేళచక్రములోని 1 వ మేళమగు 'మారరంజని'కి వెంకట మఖి పెట్టిన సంకేతనామము. ఇది 25 వ మేళకర్తయగును.

బాణ - భూ :— 5 వ మేళచక్రములోని 4 వ మేళమగు 'హరికాంభోజి'కి వెంకడమఖి పెట్టిన సంకేతనామము. ఇది 28వ మేళకర్తయగును.

బాణ - మా :— 5 వ మేళచక్రములోని 5 వ మేళమగు 'ధీర శంకరాభరణము' నకు వెంకటమఖి పెట్టిన సంకేతనామము. ఇది 29 వ మేళకర్త యగును.

బాణ - శ్రీ :— 5 వ మేళచక్రములోని 2 వ మేళమగు 'చారుకేశి'కి వెంకటమఖి యేర్పఱచిన సంకేతనామము. ఇది 26 వ మేళకర్తయగును.

బాణ - షా :— 5 వ మేళచక్రములోని 6 వ మేళమగు 'నాగానందిని'కి వెంకట మఖి యేర్పఱచిన సంకేతనామము. ఇది 30 వ మేళకర్తయగును.

బాణి :— గాత్ర సంగీతము లేక వాద్య సంగీతమును ప్రదర్శించుటలో గల మాధుర్యము లేక ఆకర్షణీయమైన పద్ధతిని 'బాణి' యందురు. ఉ॥ కర్ణాటక సంగీతములో దక్షిణదేశపు బాణీ మిగుల ప్రసిద్ధమైనదే గాక రంజకముగాకూడనుండును.

బాన :— లఘువునకుగల పర్యాయపద ములలోనొకటైన బాణ్, కు బాన, యని కూడ చెప్పటగలదు.

బాన్సురి :— ఉత్తర భారత దేశమునకు చెందిన యొక రకమైన మురళీ (ఫ్లూట్) వాద్యమునకు పేరు.

బాయా :— హిందుస్థాని సంగీత కచ్చేరిలందు సాధారణముగా నుపయోగించు తబల, యొక్క ఎడమ భాగమునకు పేరు. ఇది దక్షిణ దేశపు మృదంగములోని ఎడమ భాగము (ముఖము)నకు సరిపోవునదిగా నుండును. దీనిడొల్ల కఱ్ఱతోగాని, లేక లోహముతోగాని చేయుదురు. దీనిలో మధ్య భాగమున ఒకచిన్న 'కరణి'ని గుండ్రముగా వేయబడును.

బారువ :— ఆంధ్ర దేశములో వేడుక పెండ్లి పాటలను రచింపబడునట్టి యొక రాగమునకుగల పేరు.

బారి :— దక్షిణ దేశపు నాగస్వరము లోని ఒక పొడుగాటి రకమునకుగల పేరు. దీనికి వ్యతిరేకమైనది నాగస్వరములోని చిన్నరకమైన తిమిరి. 'బారి' యొక్క ధ్వని తిమిరి, ధ్వనికంటె తక్కువగా నుండును. దీనినే యిప్పుడు విశేషముగా దక్షిణదేశములో వాడుచున్నారు.

బాలకృష్ణ :— 1811 — 1881 కాలము వాడగు 'శ్రీగోపాలకృష్ణభారతి' తన తమిళ రచనలందు యేర్పఱచిన ముద్ర పేరు. ఈతడు తనరచనలందు 'గోపాలకృష్ణ' యను మరియొక అంకితమునుగూడ నుపయోగించెను. ఉ॥ శివలోకనాధనై, అను తమిళ కీర్తన వీరి రచనలకు, ముద్రకు ఒక వుదాహరణమగును.

బాలకోకిల:— శ్రీ 'యస్. యస్. అరుణాచల అయ్యర్'చే యిటీవల నూతనముగా కనిపెట్టబడి అమలులోనికి తేబడిన యొక విధమగు తంతివాద్యమునకుగల పేరు. దీని యందు ఉత్తమతరంగతికిచెందిన శాస్త్రీయ సంగీతమునుకూడా ప్రదర్శింపవచ్చును.

బాలగంభీర్య :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

బాలఘోషి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప మ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

బాలఘోషిణి :—'బాలఘోషి' రాగము వలెనే యుండునట్టి రాగమునకుపేరు.

బాలచంద్ర :— ప్రసిద్ధ జావళీల రచయితయగు బెంగుళూరు 'శ్రీ చంద్రశేఖర శాస్త్రి' తన రచనలందు తనపేరుకు బదులుగా వుపయోగించినట్టి ముద్ర లేక అంకితమునకు పేరు.

బాలచంద్రిక :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

బాలరామభరతము :— క్రీ॥ శ॥ 1724–1798 కాలమువాడైన 'తిరువాన్కూరు' మహారాజు 'శ్రీ బాలరామవర్మ' చే [illegible] నాట్యముమీద వ్రాయబడిన ఒక గ్రంథము.

బాలశిక్షణ :— క్రియకు ఒకటి, రెండు, నాలుగు అక్షరములవంతున త్రికాలము తాళమువేయుచూ పాడునట్టి సంగీత మొదటి భాగమైన ప్రారంభ సంగీతము.

బాలసరస్వతి :— ఉత్తరభారతదేశమునకు చెంది తంత్రులును మెట్లుగలిగి విల్లు (Bow) తో వాయింపబడు నొకవాద్యమునకు గలపేరు. దీనినే మయూరి, నెమలి–సితార్, నెమలి–ఫిడల్, తావుజ్ అనికూడా చెప్పుదురు. ఇందులో ధ్వనిని పెంపొందించుటకు మరికొన్ని తంత్రులు గూడ యుండును. ఈవాద్య ప్రదర్శనములో తంజావూరు "శ్రీ జగన్నాథభట్ గోస్వామి" అను దాక్షిణాత్యుడు మిక్కిలి ప్రసిద్ధుడుగా నుండెనని తెలియుచున్నది.

బాలసావుందరి :— "బరతనాట్టియశాస్తిరమ్" అను ప్రాచీనతమిళగ్రంథములో పేర్కొనిన ఒక రాగమునకు గలపేరు.

బాలా :— "నారదుని" "సంగీతమకరందము"లో పేర్కొనబడిన 22 శృతులలోని పంచమమునకుగల 4 శృతులలో 3 వ శృతికి గలపేరు. ఇది సంగీతరత్నాకరములోకూడ పేర్కొనబడినది.

బాలికావసంతము :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.
[సం. శా.]

బాహత్తరమేళకర్తా :—తంజావూరులోని సుప్రసిద్ధ రచయితయగు శ్రీ "[illegible]

వెంకటరావు"చే మరాట్టి భాషలో సాహిత్యము రచింపబడిన 72 మేళకర్తల సాహిత్యగ్రంథము. దీనిలో రాగముద్రలు గలవు. ఇందు కనకాంగి, రత్నాంగి మొదలగునవి వుపయోగింప బడినవి.

బాహ్యాషాడవ :— "సంగీతరత్నాకరము" లో పేర్కొనబడిన ఒకరాగము. ఈ రాగము వేసరషాడవ విభాషా రాగ శీర్షిక క్రింద 202 వ రాగముగా యిదే గ్రంథమున పేర్కొనబడినది.

బాహ్య :— హిందుస్థాని సంగీత కచ్చేరీలందు వుపయోగింపబడు ఒక చిన్నరకపు చర్మవాద్యమునకు గలపేరు.

బ్యాగ్ :— కర్నాటకబ్యాగ్ రాగము వలెనుండు రాగముపేరు. ఇది 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యము
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప ధ మ గ రి గ స.
ఉపాంగరాగము. ఇందు మ, ని జీవస్వరము లు. గమకవరిక రక్తిరాగము. ఎల్లప్పుడును పాడదగినది. "త్యాగరాజు ని" "నేనెందు వెతకుదురా" అనుకృతి యీ రాగములోని ఒక ప్రసిద్ధ రచనయగును.

బ్యాగడ :— బేగడరాగమునకు సరిపోవు నట్టిరాగమునకు గలపేరు.

బ్యాగడై :— బేగడరాగమునకు తమిళములో చెప్పబడునట్టి పేరు.

బ్రాస్ - విండ్ ఇన్‌స్ట్రుమెంట్స్ :— ఎక్కాలమ్, గౌరీకాలమ్, తిరుచిన్నమ్ వంటి ఇత్తడి (Brass)తో చేయబడిన గాలివాద్యములకుఇంగ్లీషులోని పేరు. వీటికి యితరమైనవి కఱ్ఱతో చేయబడునట్టి నాగస్వరమ్, ముఖవీణ, సన్నాయివంటి గాలివాద్యము లగును.

బ్రాహ్మి :— 46 వ మేళకర్తయగు "షడ్విధమార్గిణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.
ఇది "అభోగిరాగము"నకు నుండు ఆరోహణ అవరోహణములను కలిగియున్నను 46 వ మేళకర్త జన్యరాగమగును.

# బి

బికనీర్ :— ఉత్తర భారతములో పూర్వ కాలమునుండియు సంగీతమునకు తగు రీతిపోషణ కలిగిన ఒక గొప్పసంస్థానము. ఈ సంస్థానమును పరిపాలించిన వారిలో క్రీ. శ. 1674—1701 కాలమునందుగల శ్రీ "రాజాఅనూప్‌సింగు" యీ సంగీత కళకుఅత్యధికప్రోత్సాహమిచ్చెను. 'భావభట్టుడు' అను పండితుడు తన మూడు గ్రంథములను యిచ్చటనే రచించెను. ఇచ్చటి గ్రంథాలయములో ప్రాముఖ్యమైన అనేక సంగీత గ్రంథముల వ్రాతప్రతులుగలవు. ఇచ్చట ఒకసారి యావద్భారత సంగీత మహాసభకూడ జరిగియుండెనని తెలియుచున్నది.

బింకావతి :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

బిటకి :— ఇది ఒక స్త్రీ రాగమునకుగల పేరు. దీనిని శ్రీమాన్ సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారి యొక్క 'రామాయణ నోట్సు' లో పేర్కొనబడినది.

బిడాజప్రియ :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.
ఇది ఉభయ ఔడవ రాగమునకు చెందును.

బిందు :— షడంగములలో నొకటైన ద్రుతమునకుగల మరియొక పేరు.

బిందు :— సంకీర్ణజాతి రూపక తాళమునకుగల పేరు. దీనికి అంగములు 01. అక్షరకాలములు 9.

బిందు :— స్థాయి అలంకార జాతిలోని శాస్త్రయుక్తమగునట్టి పేర్లలో రివది. దీనికి ఉ॥ స స స - రి రి రి - గ గ గ-మ మ మ మొదలగునది.

బిందుకము :— షడంగములలో రెండవదైన ద్రుతమునకుగల విశేషనామములలో 4 వ దానికిగల పేరు.

బిందుకలింగ :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ గ మ రి గ రి స.

బిందుమాలి :— శాస్త్రయుక్తమగు 108 తాళములలో 55 వ తాళము పేరు. దీనికి అంగములు 800008. ఆవర్తమునకు మాత్రలు 6. అక్షరకాలములు 24.

బిందుమాలిని :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశి తాళములలో 52 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 800008.

బిందుమాలిని :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ని స.
అవరోహణము- స ని స ధ ప గ రి స.
ఇది ఉభయ వక్రషాడ రాగము. ఉపాంగరాగము - గాంధార నిషాదములు రాగచ్ఛాయాస్వరములు. త్యాగరాజుని "ఎంతముద్దో ఎంతసొగసో" అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదైయున్నది.

బిందురాజ :— శ్రీమాన్ సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారియొక్క 'రామాయణనోట్సు'లో పేర్కొనినట్టి పురాతన సంగీత ప్రామాణికములలో నొకటి.

బిందుహేరాళి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగమగు వక్రసంపూర్ణ - సంపూర్ణము.
ఆరోహణము- సరిగరిగమపధమపధనిస.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

బిన్ :— ఉత్తరభారతములో వుపయోగించెడి ఒక రకమైన వీణావాద్యము. దక్షిణదేశపు వీణలోవలె దీనిలో కూడ మెట్లు బిగింపబడి యుండి వాటిపైన తం

త్ర్యలు వుండును. ఈ తంత్ర్యలు మెుత్తము7. ఈ బిన్ వాద్యములో విలంబిత కాలములో రాగాలాపన సులభముగా చేయవచ్చును. తానములు 'సితార్'లో పలుకును.

బిన్ - సితార్ :— ఇదియు 'బిన్' రకమునకు చెందిన వాద్యమగును. కాని దీనిలోని మెట్లు కదలించుటకు తగినట్లుగావుండును.

బిపంచివీణా :— 'విపంచివీణ'కు సరిపోవునట్టి వాద్యమునకు గలపేరు.

బిబాస్ :— హిందుస్థాని సంగీతమునకు చెందిన ఒకరాగము. శ్రీ స్వాతి తిరునాళ్ మహారాజుచే విరచితమైన 'కుచేలోపాఖ్యాన' మను గ్రంథములో నున్నట్టి "మాధవాలాకవనమ్" అను కీర్తన ఈ రాగములోనే మనకు కనిపించును.

బిబాస :— "పంచమరాగము" నకుచెందిన స్త్రీ రాగములు 6 టిలో నొకదానిపేరు.

బిబాసు :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యమై, భూపాలరాగమునకు సరిపోవునట్టిరాగము.
ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ధ ప గ రి స.
పైచెప్పిన బిబాస్, బిబాస, బిబాసు, మరియు బేబస్ అనుపేర్లు అన్నియు ఒకే రాగమునకు చెందిన వివిధములగు పేర్లుగా తెలియదగును.

బిర్కా :— గాత్రసంగీతము లేక వాద్యసంగీతములో రాగాలాపన చేయునపుడు రంజకముకొఱకు కొన్ని సంగతులను పై కాలములో ప్రదర్శింతురు. వీటికే బిర్కాలని పేరు. ఇట్టి సంగతులవు వేయుట మంచి వదునుబడిగలగాత్రజ్ఞులకును, విశేషసాధకముగలవాద్యకులకుమాత్రమే సాధ్యమగును.

బిరడై :— తంత్రీ వాద్యములగు వీణ, గోటు, తంబుర, వయొలిన్ వంటి తంత్రీ వాద్యములలో తంత్ర్యలనుబిగించుట కేప్పు అబెడి 'బిరడాలు'కు తమిళములోని పేరు. వీటిలో చిన్నరకమును వయొలిన్, కును వయోలా, కును వుపయోగింతురు.

బిరుద :— ప్రాచీన ప్రబంధములందు గల ఆరు అంగములలో నొకదానిపేరు.

బిరుదపత్ర :— సంగీత విద్వాంసులగు గాత్రజ్ఞులకుగాని, వాద్యకులకుగాని, రచయితలకుగాని వారియొక్క కళా ప్రావీణ్యమునకుమెచ్చి రాగిరేకులపైగాని కాగితములమీదగాని వారి కళానైపుణ్యమును పొగడుచు ప్రచురించి యివ్వబడు యోగ్యతాపత్రములకు గలపేరు.

బిరుదముద్ర :— సంగీత రచనలలో వుపయోగింపబడు ద్వాదశ (12) ముద్రలలో నొకదానికిగల పేరు. అనగా ఒక రచయిత తనకుగల బిరుదమును తన రచనలో ముద్రగా పెట్టుకొనుటయగును.

బిరుదవాద్య :— సంగీతములో గాని, నాట్యములోగాని ప్రవీణులగువారికి పూర్వము మహారాజులు సంగీత వాద్యములను బిరుదములకు బదులుగా బహూకరించి యుండుటచే గలిగిన పేరు. ఈవిధముగా ఉ॥ పూర్వము 'చంద్రరేఖ' అను ప్రసిద్ధ

వద్దకికి శ్రీ వీరవెంకటరాయలు అనువా రు యిట్టి బీనువాద్యమును బహూకరిం చినట్లు ప్రతీతిగలదు. 1931 లో సంగీత కళానిధి శ్రీ "ద్వారం వెంకటస్వామి నాయుడు"కు కూడా యిట్టి బీనువాద్యము (వయొలిన్) ను శ్రీ యస్. రాధాకృష్ణన్ గారు బహూకరించినట్లు తెలియుచున్నది.

బిలమ్బిత్కాల :— విలంబిత (చౌక) కాలమునకు 'హిందుస్థాని' సంగీతము నందు చెప్పబడునట్టి పేరు.

బిలహరి :— 29 వ మేళకర్తయగు 'ధీర శంకరాభరణము' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ ప ధ స. అవరోహణము- స ని ధ ప మ గ రి స. భాషాంగరాగము. ఔడవ సంపూర్ణము. ఏక అన్యస్వరరాగము. కైశికీ నిషాదము అన్యస్వరముగా ప ధ ని స ప, ప ధ ని ప, ప ని ధ ప మొదలగు సంచారములలో ప్రయోగింపబడును. రిషభ, ధైవత, నిషాదములు జీవస్వరములు. ప్రాతఃకాల రాగము. శ్రీ 'త్యాగరాజు'ని కనుగొంటిని' ఇంతకన్న ఆనంద, తొలిజన్మ మున అనుకృతులును, పట్నం సుబ్రహ్మ ణ్యయ్యర్ యొక్క 'పరిధానమిచ్చితే' అను కృతియు యీ రాగములోగల కొన్ని ప్రసిద్ధమగు కృతులగును.

బిలకిణితోడి :— హిందుస్థాని సంగీతము నకు చెందిన ఒక రాగము. ఇది దక్షిణ ఇండియాలోని కర్ణాటక సంగీతమునందు గల శుద్ధతోడి రాగమునకు సరిపోవునదిగా యుండును.

బిలావల్ - దాట్ :— కర్ణాటక సంగీతములోని 29 వ మేళమగు 'ధీరశంకరా భరణము'నకు సరిపోవుస్వరములుగల హిందుస్థాని సంగీతములోని ఒక రాగము.

బిలాహరి :—ఇది బిలహరి రాగమునకుగల మరియొక పేరుగా తెలియదగును.

బిలాహురి :— ఇదియు బిలహరి రాగమునకుగల మరియొక పేరుగా తెలియదగును.

---

## బీ

బీంకార్ :— 'బిన్' అను వాద్యమును వాయించునట్టి 'వాద్యకునికి' గల పేరు.

బీటాల్ :— 29 వ మేళకర్తయగు 'ధీర శంకరాభరణము' యొక్క జన్యరాగము. ఆరోహణము- స గ రి మ ప ని ధ ప ని స. అవరోహణము- స ని ధ ప మ గ రి స. ఇది వక్రసంపూర్ణ - సంపూర్ణము.

[సం. కా.]

బీథోవెన్ :— పూర్వము వియన్నానగరము (ఆస్ట్రియా)లోనుండెడి సుప్రసిద్ధ పాశ్చాత్య సంగీత రచయితకుగల పేరు.

బీభత్స :— సంగీత రచనలకు ప్రధానమైన శృంగారాది నవరసములలో 7 వ దానికి బీభత్స అని పేరు. దీనికి స్థాయి భావము 'జుగుప్స'యగును.

బుక్తిప్రియ :— 58 వ మేళకర్తయగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇది 'కేదారగౌళ'కువలె ఆరోహణ, అవరోహణములున్నను 'హేమవతి' మేళకర్త యొక్క జన్యరాగ మగును.

బుధమనోహరి :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యము.
ఆరోహణము– స రి గ మ గ ప స.
అవరోహణము– స ప మ గ రి స.

బుద్ధవాహిని :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ ని స.
అవరోహణము– స ప మ గ రి స.

బుధ్యారంభానుభావములు :— భావశాస్త్రమందుగల "అనుభావము"లోని 4 రకములలో 4 వ దానికి గలపేరు. దీనిలో రీతి, వృత్తి, ప్రవృత్తి అనునవి గలవు.

బుఱ్ఱ :—వీణయొక్క చివఱ క్రిందిభాగమున అమర్చబడు గుండ్రని సొరకాయ లేక జర్మన్‌సిల్వర్ వంటి రేకుతో చేయబడునట్టి వస్తువునకు గలపేరు. ఇది వీణావాద్యములో నాదమును పెంపొందించుటకు వుపకరించును.

బుఱ్ఱ :— బుఱ్ఱకథలు చెప్పునప్పుడు వాయింపబడు మట్టితో చేయబడునట్టి ఒక వైపుమాత్రగల చిన్న చర్మవాద్యము.

బుఱ్ఱకథలు :— బుఱ్ఱలను వాయించుచూ యిద్దరు లేక ముగ్గురు కలసి పాడునట్టి బొబ్బిలి,పల్నాటి కథలవంటి వాటికిపేరు.

బుల్‌బుల్‌తారా :— తంత్రీవాద్యములో చేరినట్టి "టైపురైటరు" వంటి కీబోర్డుగల మీటువాద్యమునకు పేరు. ఇది జపానులో మొదట తయారుచేయబడెను. లౌకిక సంగీతమును ప్రదర్శించుట కుపయోగింపబడు వాద్యములలో నిదియొకటి యగును.

బ్రుదూవక :— 24 వ మేళకర్తయగు "వరుణప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ప మ రి స.

బృందకుడు :— జనసమూహముతో చేరి గానము (భజన) చేయు వానికి గలపేరు.

బృందగానము :— గాయకులు అనగా గాత్రజ్ఞులు, వాద్యకులును సమూహముగా చేరి చేయు సంగీతప్రదర్శనమునకు గల పేరు. ఈ బృందగానము 3 రకములుగా విభజింపబడినది. (1) ఉత్తమ, (2) మధ్యమ, (3) కనిష్ఠ అనునవి. అవి యేవనగా

1. ఉత్తమ– ఇందు గాయకులు, ఉపగాయకులు, మురళీవాద్యకులు, మృదంగ వాద్యకులు చేరి గానముచేయుట.
2. మధ్యమ– ఇందు ఉత్తమలోని సగము మంది ప్రదర్శకులు చేరిగానము చేయుట.
3. కనిష్ఠ– ఇందు ప్రదర్శకులు మధ్యమకంటెను తక్కువగా నుండుట.

ఈ బృందగానములో పాల్గొను, తంత్రీవాద్యకులు, చర్మవాద్యకులు, నర్తకులు చేయు ప్రదర్శనములను తతకుతప, అవనద్ధకుతప, నృత్యకుతప అని చెప్పబడును.

బృంకనాట్యము :— 'శిలప్పదికారమ్' అను ప్రాచీన తమిళ గ్రంథములో పేర్కొనబడిన 11 విధములగు నృత్యములలో 3 వ దానికి గల పేరు.

బృందపురి :— శ్రీ త్యాగరాజుని గురు వగు శ్రీ 'శొంఠి వెంకటరమణయ్య' యొక్క రచనలందుగల ముద్ర పేరు.

బృందావన కన్నడ :— 69 వ మేళకర్త యగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము - స గ మ ప ధ స.
అవరోహణము - స ధ ప మ గ రి స.

బృందావనదేశాక్షి :— 62 వ మేళకర్త యగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము - స రి గ మ ప మ ధ స.
అవరోహణము - స ధ ప మ గ రి స.

బృందావనసారంగ :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్యము.
ఆరోహణము - స రి మ ప ని స.
అవరోహణము - స ని ప మ రి గ స.
కొన్ని గ్రంథములలో దీని ఆరోహణము స గ రి మ ప ని స అని పేర్కొనబడినది. అయితే ప్రసిద్ధమైన కృతులగు 'కమలాప్తకుల' (త్యాగరాజు) 'సరసీరుహానన శ్రీరామా' (పట్నం సుబ్రహ్మణ్య య్యర్) అను కృతులు ఆరోహణములో స రి మ ప ని స గానే రచింపబడినవి. ఇది ఔడవ - వక్రషాడవరాగము. ఇందు మధ్యమ, నిషాదస్వరములు జీవస్వరములు.

బృందావని :— 'బృందావనసారంగ' రాగమునకు సరిపోవునట్టి రాగము.

బృహత్తాళము :— ఇది ఒక ఘనవాద్యము. దేవాలయములందు వుపయోగించు తాళ ములలోని ఒక పెద్దరకమునకు పేరు.

బృహతి :— 'కిన్నరి' యొక్క రకము నకు చెందిన ఒక పెద్ద తంతివాద్యము. దీనిలో 3 తంత్రులును, 14 స్వరస్థానము లను నిరూపించునట్టి 14 మెట్లును వుం డును. దీనిలో చిన్నరకమునకు చెందిన కిన్నరిని 'లఘ్వి' యని చెప్పుదురు.

బృహద్ఘంటా :— దేవాలయములందు వుపయోగింపబడు ఒక రకమునకుచెందిన పెద్ద గంటకు గలపేరు. వీటిలో చిన్న రకమునకు చెందినదానిని మధ్యఘంటా, అనియు లేక 'లఘుఘంటా' యనియు చెప్ప బడును.

బృహద్దాక్షిణాత్య :— ఇది భాషాంగతరగతికి చెందిన ఒక సంపూర్ణరాగము. దీనిని 'పార్శ్వదేవుని' 'సంగీతసమయసారము' లో పేర్కొనబడినది.

బృహద్దేశి :— 5 వ శతాబ్దమునకు చెందిన 'మతంగముని' చే సంస్కృతములో సంగీత శాస్త్రముపై వ్రాయబడిన ఒక ప్రాముఖ్య మైన గ్రంధమునకు గలపేరు. ఈ మతం గునివల్లనే రాగములకు ఒక స్వరూపము యేర్పడినట్లు చెప్పుదురు. ఈతని గ్రంథము లో వాయు, జంత్రములను గూర్చి వర్ణింప బడెను. ఇది "సంగీతరత్నాకరము" నకు పూర్వగ్రంథమని తెలియుచున్నది.

బృహద్ధర్మపురాణము :— ఇది రాగిణీ, రాగములను గురించి వ్రాయబడిన యొక పురాతన గ్రంథమునకుగల పేరు.

బృహన్నాయకి :— "శ్రీ పొన్నయ్య పిళ్ళై"చే రచింపబడిన సంగీత రచనలయందుగల ముద్రికు పేరు.

బృహస్పతి :— సంగీతమును గురించిన ఒక ప్రాచీన ప్రామాణికునికి గల పేరు.

# బూ

బూర :— పాములను ఆడించునట్టి ఒక జాతివారు వుపయోగించు సొరకాయ బుఱ్ఱతో చేయబడు ఒక చిన్న గాలివాద్యమునకు పేరు. దీనినే ఆంధ్రదేశములో నాగస్వర మని కూడ చెప్పుదురు.

బూరగ :— "బూర" అను వాద్యమువలె నుండు నొక గాలివాద్యమునకు పేరు.

బూరా :— ప్రాక్ దేశములన్నింటిలోను పూర్వకాలమునుండి నేటివఱకు నుపయోగింపబడుచున్నటువంటి ఒక పొడుగాటి గాలి వాద్యమునకు పేరు.

బ్రూరవి :— 20 వ మేళకర్త యగు "నఠభైరవి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
వక్రషాడవ-సంపూర్ణము. [గా. వి. ప్ర.]

# బె

బెల్ (Bell) :— ధ్వనించుటకు వుపయోగించెడి లోహపుగంటకు ఇంగ్లీషులోని పేరు. ఇవి అనేకరకములుగానుండును. వీటి ధ్వని గంభీరముగా నుండును. ఇందులో చిన్నవి గృహములందు చేయు దేవతాపూజ లందును, పెద్దవి క్రైస్తవ చర్చీలందును, రైల్వే స్టేషనులందును, కళాశాలలందును, ఉన్నత పాఠశాల లందును కాలమును సూచించుటకు వుపయోగింతురు.

బెల్లోస్ (Bellows) :— ఆర్గన్, హార్మోనియము వంటి గాలి వాద్యములలో గాలిని ఎడతెగకుండా రీడ్సులకు అందించుటకు తగినట్లు కాగితపుఅట్టలతో చేయబడు గాలి తిత్తులకుగల పేరు.

బెహగ్ (Behag) :— దీనిని దక్షిణ ఇండియాలో హిందుస్థాని బెహాగ్ అని చెప్పుదురు. దేశ్యరాగములలో యెక్కువ రంజకమైన వాటిలో నొకటియగును. ఇది 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" యొక్క జన్యరాగమగును.
ఆరోహణము— స గ మ ప ని ధ ని స.
అవరోహణము—స ని ధ ప మ గా రి స.
ఇది ద్వి అన్యస్వర భాషాంగ రాగము. ప్రతి మధ్యమ కైశికీ నిషాదములు అన్యస్వరములుగా నుండును. ప మ మ గా, ప మ పా మ గా అనుసంచారములలోగల మధ్యమములలో మొదటిది ప్రతి మధ్యమముగను, రెండవది శుద్ధమధ్యమముగను వుండును. దక్షిణ భారతములో శ్రీ స్వాతి

తిరునాళ్, శ్రీ గోపాలకృష్ణ భారతి చక్కని కీర్తనలను జావళీలను రచించి మొదలగువారు ఈ బెహాగ్ రాగములో రచించియున్నారు.

# బే

బేగడ :— 29వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స గ రి గ మ ప ధ ప స. / స గ రి గ మ ప ధ నీ ధ ప స.

అవరోహణము— స నీ ధ ప మా గ రి స.

ఇది ఉపాంగరాగము. వక్రషాడవ-సంపూర్ణముగ కొందరును, వక్రసంపూర్ణ-సంపూర్ణముగ కొందరును చెప్పుచున్నారు. ఈ రెండును విశేషముగానే ప్రయోగింపబడుచున్నవి. ఇందుగల ధ ప మా, అను సంచారములో మధ్యమము దీర్ఘగమకముగా శుద్ధ మధ్యమము కంటె కొంచెము ఎక్కువగా పలుకును. అటులనే, ప ధ నీ ధ పా, మరియు రి స నీ ధ పా, అను సంచారములందలి నిషాదము కాకలీ నిషాదము కంటె కొంచెము తక్కువగా దీర్ఘ గమకముతో పలుకును. గనుకనే వీటికి బేగడ మధ్యమ, బేగడ నిషాదములని ప్రత్యేకించుటకు కారణమైనది. ఈ రాగములో మ, ధ, ని రాగచ్ఛాయా స్వరములు. 'స ని ధ ని సా' అను రంజక ప్రయోగము అరుదుగా వచ్చును. ఎల్లప్పుడును పాడదగిన రాగమైనను మధ్యాహ్నకాలమున పాడదగినదిగా చెప్పుదురు. రి, ధ లు న్యాస స్వరములు కావు. అయితే ప, మరియు తేలికగా నుండు మ, జీవస్వరము అగును. ఇది ప్రాచీన రాగము కాదు. దీనినే బ్యాగడె అనికూడా చెప్పుదురు. కొన్ని తమిళ గ్రంథములలో '[illegible]' అనికూడా చెప్పబడినది.

శ్రీపట్నం సుబ్రహ్మణ్యయ్యర్ కు ఈ రాగాలాపనలో గల అద్భుత నైపుణ్యముచే 'బేగడ సుబ్రహ్మణ్యయ్యర్' అని పిలువబడెను. ఈ రాగములో ఇంత చలము అను వర్ణము (వీణకుప్పయ్యర్) నాదోపాసన, నీపదపంకజ, సుందరి, అను కృతులు (త్యాగరాజు) త్యాగరాజాయ, అను కృతి (దీక్షితులు) శంకరినీవని, కృతి (సుబ్బరాయశాస్త్రి) అభిమాన, మనసువనెటు, అను కృతులు (పట్నం సుబ్రహ్మణ్యయ్యర్) ఇదినీకు, అను జావళి (ధర్మపురి సుబ్బరాయర్) వంటి ప్రసిద్ధ రచనలు గలవు.

బేగడ నిషాదము :— బేగడ రాగములో ప్రయోగించు లలితమగు గమకముగల 'కాకలీ నిషాదము'నకుగల పేరు.

బేగడ మధ్యమము :— బేగడ రాగములో ప్రయోగించు దీర్ఘగమకముగల "శుద్ధ మధ్యమము"నకుగల పేరు.

బేబూ :— ఒరిస్సా రాష్ట్రములో ప్రయోగించు ఒక రకమైన గాలి వాద్యము.

బేబస్ :— 'బిబాసు' రాగమునకుగల మరియొక పేరు.

బేష్ :— దక్షిణ భారతములో సంగీతకచ్చేరీలందు రాగాలాపన, లేక స్వరసంచారములందు ప్రదర్శించు ప్రావీణ్యమైన

సంగతులుగాని, వివిధములగు స్వరప్రయోగములుగాని, భావపూరితమైన సాహిత్య ప్రస్తారములుగాని వచ్చినపుడు శ్రోతలు వారి సంతృప్తిని ప్రదర్శకునికి వెల్లడించుటకు "శేష" అని చెప్పెదరు.

---

## బొ

బొగిని :—41వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

బొబ్బిలి :—19వ శతాబ్దములో ఆంధ్ర దేశములో సంగీతమునకు ఒక ముఖ్యస్థానముగానున్న ఒక సంస్థానము. ఇచ్చట మంచివీణెలుతయారుచేయుదురు. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులగు కీ॥ శే॥ బొబ్బిలి కేశవయ్య, నందిగాన వెంకయ్యగార్లు యీ ఆస్థాన విద్వాంసులుగా యుండిరి.

బొలి :— నవసంధి తాళములలో నొక దానికిగల పేరు. ఇది దేవాలయములందు వాయించుటకు వుపయోగింతురు.

## బో

బోట్టరాగము :—'సంగీత రత్నాకరము'లో రాగాంగరాగ శీర్షిక క్రిందను 'సంగీత సుధ'లో, వేసరరాగ శీర్షిక క్రిందను పేర్కొనబడిన ఒక రాగము.

బోధేంద్రసద్గురుస్వామి :— పురాతన ప్రసిద్ధ సంగీతపండితుడగు నొకయతీంద్రుని పేరు. వీరినిగూర్చి వీరి శిష్యులైన ఇనుమశనగల వెంకట్రామయ్య 'పతమని' అను కీర్తనను తోడిరాగములో రచించెను.

బోల్ :— హిందుస్థానిసంగీతములో నుపయోగించు త, ధిమ్, గిణ, తోమ్ వంటి తాళప్రత్యయము (జతు)లకు పేరు. దీనినే తెలుగులో 'జతి' అనియు, తమిళములో 'సోల్ కట్టుస్వర' మనియు చెప్పెదరు.

## బౌ

బౌ (Bow) :—వయొలిన్, సారంగ్ వంటి తంత్రీవాద్యములను వాయించుటకు వుపయోగించు ఒక పొడుగైన సుంద్రనికఱ్ఱకు గుఱ్ఱపువెంట్రుకలను బిగింపబడుదానికిగల ఇంగ్లీషులోని పేరు. దీనినే తెలుగులో కమాను అనియు, తమిళములో విల్ అనియు చెప్పెదరు. దీనినే పురాతన సంగీతచరిత్రలో రావణాస్త్రముగా చెప్పబడినది. సంస్కృతములో దీనినే "ధను" లేక "ధన్వి" అని చెప్పబడినది.

బౌరి :— 'పింగలందై'లో పేర్కొనబడినట్టి పురాతన తమిళ సంగీతమునకు

చెందిన 16 పెద్దరాగములలో నొకదానికి గలపేరు.

బౌల్ :— 'బెంగాలురాష్ట్రము' లో సాధారణముగా పాడబడునట్టి జానపద గీతములకు గలపేరు.

బౌవ్డ్ ఇన్‌స్ట్రుమెంట్స్ (Bowed Instruments) :— కమాను లేక విల్లుతో వాయింపబడు వయొలిన్ (ఫిడేలు) సారంగ్, దిల్‌రుబ వంటి తంత్రీవాద్యములకుగల ఇంగ్లీషులోని పేరు.

బౌళ :— 'భరతనాట్టియశాస్తిరమ్' అను పురాతన తమిళ్ గ్రంథములో పేర్కొనబడిన 'బౌళి' రాగమునకుగలమరియొక పేరు.

బౌళాముఖి :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
[ప. శే. ప్రా. గ్రం.]

బౌళి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ని ధ ప గ రి స.
ఉపాంగరాగము, ద్వితీయ ఘనరాగపంచకమునకు చెందిన రాగము. కొన్నితావులందు ఆరోహణమున అల్పముగా నిషాదము వినపడును. రి, గ, ధ, జీవస్వరములు. గాంధార, పంచమములు న్యాసస్వరములు. గమక, వరిక రాగము. సూర్యోదయమునకు ముందు పాడదగినది.

బౌళిగూగ్రి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగముగా పేర్కొనబడిన ఒకరాగము.
[కీ. టు. హిం. మ్యూ.]

బౌళిరామక్రియ :— తాళ్ళపాక వారిరచనలగు 'అధ్యాత్మ సంకీర్తనము'ల యందు కనుగొనబడిన ఒకరాగము.

బౌళీవసంతము :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ధ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ మ స.
ఇది వక్రసంపూర్ణ – వక్రషాడవ రాగమునకు చెందును.

## భ

భక్తమంజరి :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ని ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.
ఇది వక్రషాడవ రాగమునకు చెందును.

భక్తవంద :— కర్నాటక రాష్ట్రములోని 'దాసకూట' అను తరగతికి చెందిన రచయితలవలె ఉత్తర భారతములో 'భక్తి రచనలు' రచించువారికి గలపేరు.

భక్తప్రియ :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.

ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము–స ని ధ ప మ రి గ మ గ స.

భక్తిమంజరి :— తిరువాన్కూరు సంస్థానాధిపతియగు 'శ్రీ స్వాతి తిరునాళ్' మహారాజుచే రచింపబడిన యొక గ్రంథము.

భక్తిముద్రలు :— శ్రవణమ్, కీర్తనమ్, స్మరణమ్, పాదసేవనమ్, అర్చనమ్, వందనమ్ దాస్యమ్, సఖ్యమ్, ఆత్మనివేదనమ్ అను నవవిధభక్తులను ముద్రలుగా నుపయోగించుటకు పేరు. ఉ॥ శ్రీ స్వాతి తిరునాళ్, మహారాజు యొక్క 'నవరత్నమాలికా కీర్తనలు' యిట్టి భక్తిముద్రలుగల రచనలకు మంచి వుదాహరణములగును.

భక్తిరస :— నవరసములలో నొకదాని పేరు. ఇది ఆధ్యాత్మిక చింతవలన యేర్పడు రసము. కొన్ని సాహిత్య రచనలేగాక భైరవి, కేదారగౌళ, యదుకుల కాంభోజి వంటి కొన్ని రాగములుకూడ యీ భక్తి రసమునకు చెందినవగును.

భక్తిరసరచనలు :— దైవప్రార్థన సమయములందు భక్తితో భగవంతునిగూర్చి పాడబడునట్టి రచనలకుగల పేరు. ఉ॥ 'రామాని న్నే నమ్మిన' అను మోహనరాగములోని కీర్తన యిందుకు వుదాహరణమగును.

భ - గణము :— తాళ అంతర్గత అంగముల చేర్పుచేచిన 8 గణములలో 2 వ దానికిగల పేరు. దీనికి అంగములు 8 I I.

భగతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 116 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 0000 I I I ◡

భగవత్సారామృతము:—క్రీ॥ శ॥ 1916 లో 'శ్రీ తచ్చూరు శింగరాచార్యుల'చే తెలుగులో వ్రాయబడిన భక్తిపూరితమైన కీర్తనలుగల యొక చిన్న గ్రంథము.

భగవత్పూజనపద్ధతి :— 1913 లో శ్రీ 'టి. పి. కోదండరామయ్యర్'చే వ్రాయబడిన గ్రంథమునకు పేరు. దీనిలో భద్రాచల రామదాసుని వంశీయుడగు ఆదినారాయణదాసుల విరచితమైన కీర్తనలు రెండుగలవు.

భగవన్నామసంకీర్తన ప్రచారకుడు :— ఎల్లప్పుడును భగవన్నామ సంకీర్తనలనే బోధించునట్టి కామకోటి పీఠాధిపతియైన శ్రీ బోధేంద్ర సద్గురుస్వామికిగల గౌరవ నామము.

భగవతి :— 26 వ మేళకర్తయగునట్టి 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని స.
అవరోహణము– స ని మ గ రి స.

భగవత్ప్రియ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము–స రి గా మ రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ రి స.

భగ్నము :— గాడిద, ఒంటె మొదలగు నటువంటి జంతువులధ్వనితో సమానమగు ధ్వనితో చేయబడు 'గానము'నకు పేరు.

భజగోవిందస్తోత్రము :— శ్రీ 'శంకరాచార్యులు'చే భగవంతుడగు గోవిందునిపై స్తోత్రముగా రచింపబడినరచనలకుగల పేరు. సాధారణముగా మాండ్ రాగము, ఆది తాళములో పాడుదురు.

భజన్ :— ఉత్తరభారతదేశములో భక్తులు చేయునట్టి భజనకు పేరు. మీరాబాయి, తులసీదాసు వంటి మహాభక్తులు చేయబడిన భజనలు యీరకమునకు చెందును.

భజన :— దక్షిణభారతములో భక్తులు సమూహముగాచేయునట్టి ప్రార్థనకు పేరు. అనగా శ్రీరాముడు, శ్రీకృష్ణులవంటి దైవవిగ్రహములను గృహములందు నెలకొల్పి తంబుర, ఫిడల్, మృదంగము, తాళములవంటి సంగీతవాద్యములతో భక్తిరసకీర్తనలను గానముచేయుటకు పేరు.

భజనగోష్టి :— భజనపరులు, భాగవతారులు, గాయకులు, వాద్యకులు కలిసి సమిష్టిగాచేయునట్టి భజనకు గలపేరు.

భజనపద్ధతి :— భజనచేయుటలోగల ఒక క్రమమైన విధానమునకు పేరు.

భజనమఠము :— భక్తులు భజనచేయునట్టి ఒక నిర్ణీతమైన పవిత్రప్రదేశము.

భజనమందిరము :— భజన కాలక్షేపము చేయునట్టి సువిశాలమగు భవనము.

భజనావళి :— భజనకొఱకు ఒక క్రమమైనవిధానములో రచింపబడిన పవిత్ర గ్రంథమునకు పేరు.

భజనోత్సవపద్ధతి :— ఉత్సవసంప్రదాయముగా క్రమమైన విధానముతో జరుపు భజనకొరకై రచింపబడిన యొక కీర్తనల గ్రంథమునకు పేరు.

భద్ర :— స్థాయి అలంకారజాతిలోని శాస్త్రయుక్తమైన పేర్లలో నొకటియగును. ఉ॥ స రి స - రి గ రి - గ మ గ మొదలగునవి యిందుకు వుదాహరణ మగును.

భద్ర :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి మధపధపధనిస.
అవరోహణము- స ని ధ మ గ రి స.

భద్రకర :— 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ని ప మ రి గస.

భద్రకాళిపాట్టు :— మలబారుప్రాంతములో 'దైత్యభద్రకాళి'పై దేవాలయములందు పాడబడునట్టి కీర్తనలకు పేరు.

భద్రగాంధారి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము. ఔడవ - వక్రషాడవము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ధ మ రి గ స.

భద్రగిరి :— శ్రీరామక్షేత్రమైన భద్రాచలమునకుగల మరియొక పేరు.

భద్రగిరి :— 'రామదాసుని కీర్తనలందు' గల ముద్రలలో నొకదాని పేరు.

భద్రగిరి :— రామచంద్ర యతీంద్రులు తన యొక్క రచనలందు తన అంకితము నకుబదులుగాయేర్పఱచుకొనినముద్ర పేరు.

భద్రబాణము :— 17 వ శతాబ్దమునకు చెందిన 'రాగతాళ చింతామణి' అను తెలుగు గ్రంథములో పేర్కొనిన ఒక తాళమునకు పేరు.

భద్రశ్రీ :— 17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

భద్రశైల :— శ్రీ 'భద్రాచల రామదాసు'ని రచనలందుగల నొక ముద్రకుపేరు.

భద్రసారంగలీల :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము. [సం. కా.]
ఆరోహణము- స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము- స ధ ప మ రి స.

భద్రాచల :— శ్రీ రామదాసు, తన కీర్తన రచనలందు పెట్టుకొనిన ముద్రలలో నొక దాని పేరు.

భద్రాచలము :— సుప్రసిద్ధ కీర్తన రచయితయగు 'రామదాసుని' నివాసస్థానము. దక్షిణ ఇండియాలో ఆంధ్ర రాష్ట్రమున గల ఒక గొప్ప పుణ్యక్షేత్రము. ఇది విజయవాడకు ఉత్తరమున 60 మైళ్ళ దూరములోనున్నది. గోదావరి తీరమునగలదు. శ్రీరామనవమికి అచ్చట కల్యాణమహోత్సవము కడు వైభవముగా జరుగును.

భద్రాచల రామదాసు :— 17 వ శతాబ్దమునకు చెందినట్టియు, గొప్ప రామభక్తుడైనట్టియు, కీర్తన రచయితయగునట్టి రామదాసునికిగల పేరు. ఇతడు మొదట హైదరాబాదు తానీషాచే భద్రాచలము తహశీలుదారుగా నియమింపబడియున్న కాలములో సర్కారుధనము ఆరులక్షల రూపాయలు శ్రీరామ కైంకర్యమునకు వినియోగించినందున తానీషాచే 12 సంవత్సరములు కఠినశిక్షను పొందెను. ఆ కాలములో ఇతడు పడిన బాధలు వర్ణనాతీతములు. ఆ బాధలకు తాళలేక శ్రీరామచంద్రుని అనేక విధముల కీర్తించెను. ఆ కీర్తనములు మిగుల భక్తిపూరితములు, హృదయ రంజకములగును.దీనిఫలితముగా శ్రీరామునకు అనుగ్రహము కలిగి రామదాసుని బంధవిముక్తునిజేయ చిరకాలము శ్రీరామ సేవచేయుచూ తుదకు ముక్తిబొందెను.

భద్రాద్రి :— 'రామదాసు'రచించిన కీర్తనలలో పెట్టుకొనిన ముద్రలలో నొకదానికిగల పేరు.

భద్రాద్రి :— 'భద్రాచలము'నకు గల మరియొక పేరు.

భద్రాద్రివాస :— దివ్యనామ కీర్తనలను భద్రాద్రి అంకితముతో రచించిన సుప్రసిద్ధ రచయిత 'రామదాసు'కు చెందునట్టిపేరు.

భమ్మాణపంచమ :— 'సంగీత రత్నాకరము'లో పేర్కొనబడిన ఒక రాగము.

భమ్మాణి :— 'సంగీత రత్నాకరము'లో పేర్కొనబడిన ఒక రాగమునకుగల పేరు

దీనిని 'సంగీత సమయసారము' అను గ్రంథములో భాషాంగషాడవరాగ శీర్షిక క్రింద పేర్కొనబడినది.

**భయము** :— స్థాయీ భావములోని 8 విధములలో 6 వ దానికిగల పేరు.

**భయానక** :— రాగ నవరసములగు 9 టిలో 6 వ రసమునకుగల పేరు.

**భరత** :— క్రీస్తుకు పూర్వము 4 వ శతాబ్దమునకుచెందినట్టియు "నాట్యశాస్త్రము" అను ప్రామాణికమగు లక్షణ గ్రంథము రచించిన భరతుడను రచయితకుగల పేరు.

**భరత** :— ఇది సాధారణముగా నర్తకునికి చెందునట్టిపేరు. మరియునిది గుజరాత్‌లో గాయకునికిచెప్పబడుపేరుగాను, మలబారులో దాదాపు సరిపోవునట్టి 'భాగవతార్' కు చెప్పబడు పేరుగాను వుండును.

**భరతకల్పలతామంజరి** :—దక్షిణ ఇండియాలో మైసూరునందుగల 'ఓరియంటల్ లైబ్రరీ'లోనుండు నాట్యముపై వ్రాయబడిన ఒకగ్రంథమునకు పేరు.

**భరతకీర్తనై** :— 'భరత నాటకము'నకు గల మరియొక పేరు.

**భరతచంద్రికా** :—తంజావూరు సరస్వతీ మహాల్ లైబ్రరీలోని 'భరతార్ణవము' అను గ్రంథములో కనుగొనబడిన ఒక భాగము.

**భరతచూడామణి** :— తాళముల ను గూర్చి 'తాళసముద్రమ్' అను గ్రంథమును తమిళములో వ్రాసిన శ్రీ "వనపాదచూడామణి"కి వర్తించునట్టి పేరు.

**భరతజాతి** :—నాట్యము చేయుటయే ప్రధానవృత్తిగా కలవారి కులమునకుగల పేరు.

**భరతనాటకము** :— శ్రీ 'అరుణాచల కవిరాయర్' యొక్క 'రామనాటక' పద్ధతి ననుసరించి శ్రీ 'ముత్తురామకవిరాయర్' శ్రీ వెల్లూరు సుబ్బరాయ ముదలియార్‌లచే తమిళములో నాటక రూపముగా రచింపబడిన మహాభారతకథా భాగమునకు పేరు. దీనినే శ్రీమహాభారత నాటకమనియు, శ్రీ మహాభారత కీర్తనై అనియు చెప్పబడును.

**భరతనాట్యము** :— భారత దేశములో నున్న శాస్త్రీయమైన నాట్యమునకుగల పేరు. దక్షిణ భారతములో యిట్టి నాట్యమును శాస్త్రయుక్తమైన పద్ధతిలో తంజావూరు నాట్యకళాశాలయందు నేర్పబడుచున్నది. ఇది పురాతన శాస్త్రీయ భరత నాట్య శిక్షణకు పేరుపొందిన ఒకసంస్థగా పరిగణింపబడు చున్నది.

**భరతనాట్య శాస్త్రము** :— 11 వ శతాబ్దమునకు చెందిన కాశ్మీరబ్రాహ్మణుడగు 'అభినవగుప్తుడు' రచించిన గ్రంథమునకు పేరు.

**భరతనాట్యశాస్త్రవ్యాఖ్యానము**:— 'నాన్యదేవు' (మిధిలరాజు)నిచే భరతుని నాట్యశాస్త్రముపై వ్రాయబడిన వ్యాఖ్యాన గ్రంథమునకు గలపేరు.

భరతపృత్త :— నాట్యమే ప్రధానవృత్తిగా గలవాని కుమారునికి చెందునట్టి పేరు.

భరతపుత్రక :— ఒక నర్తకునికి చెందునట్టి పేరు.

భరతభాష్య :— 12 వ శతాబ్దమునకు చెందిన 'నాన్యదేవుని'చే వ్రాయబడిన భరతనాట్యశాస్త్ర వ్యాఖ్యానమునకు గల పేరు. మరియు దీనికే i సరస్వతి హృదయాలంకార, ii సరస్వతి హృదయాభూషణ, iii భరతవార్తిక అను పేర్లుగలవు.

భరతమ్ :— భావ, రాగ, తాళములు మూటియొక్క ప్రథమ వర్ణత్రయంబులతో కూడుకొన్నది 'భరత' మని పేరు.

భరతమ్ :— అనగా నాట్య, అభినయములను కలిపి చెప్పునట్టి పేరు.

భరతమ్ :— నాట్య, అభినయకళలపై తమిళములో వ్రాయబడిన ఒక గ్రంథమునకు పేరు.

భరతమత :— భరతునిచే స్థాపింపబడిన సంగీత విద్యాలయమునకు పేరు.

భరతముని :— 'నాట్యశాస్త్ర' మను గ్రంథమును వ్రాసిన రచయితకు పేరు.

భరతమోహిని :— తన నాట్యప్రదర్శనముచే యితరులను ఆకర్షింపజేసిన ప్రతిభావంతురాలగు నొక 'నర్తకి' యొక్క పేరు.

భరతరసప్రకరణము :— సుప్రసిద్ధ తెలుగుపద రచయితయగు శ్రీ 'ముష్టూలూరి సభాపతి అయ్యర్' (19 వ శ.) చే సంస్కృత శ్లోకములతోను తెలుగు అర్థములతోను నాట్యముపై రచింపబడిన యొక గ్రంథము పేరు.

భరతలక్షణము :— తంజావూరు 'సరస్వతీ మహల్' గ్రంథాలయములోనున్న 'నాట్యశాస్త్రము'పై వ్రాయబడిన ఒక వ్రాతప్రతిగానున్న గ్రంథము పేరు.

భరతవాక్యము :— భరతనాటక ప్రదర్శనము జరిగిన తదనంతరము భరతుని యందుగల గౌరవ సూచకముగా చెప్పబడునట్టి స్వస్తివాచకమునకు పేరు.

భరతవార్తిక :— 'భరతభాష్య' అను వ్యాఖ్యానమునకుగల మరియొక పేరు. దీనిని 'నాన్యభూపాలుడు' రచించెను.

భరతశాస్త్రగ్రంథము :— 'పూనా' వాస్తవ్యులగు శ్రీ లక్ష్మీధర్ (16 వ శ.) చే రచింపబడిన యొక గ్రంథమునకు పేరు.

భరతశాస్త్రమ్ :— నాట్యముపై వ్రాయబడిన ఒక శాస్త్రగ్రంథమునకు పేరు.

భరతశాస్త్రమ్ :— నాట్యముపై శ్రీ 'రఘునాథుని'చే వ్రాయబడి తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయమందుగల ఒక గ్రంథము పేరు. దీనిలోని మిగత భాగములు యిదే పేరుతో తంజావూరు శ్రీ తుళజాధిపుడు రచించెను.

**భరతశాస్త్రరమ్ :—** 'అరబత్తనావలర్'చే తమిళములో నాట్యకళపై వ్రాయబడిన యొక గ్రంథమునకు గలపేరు.

**భరత సంగీత స్వయంబోధిని :—** ఇది శ్రీ 'టి. సి. ఆర్. జోహాన్నెస్' (Johannes) చే తమిళములో వ్రాయబడిన యొక గ్రంథము.

**భరతసర్వార్థసంగ్రహమ్ :—** నాట్యమును గురించి భరత, నందికేశ్వర, నారద, బృహస్పతులసంప్రదాయముతో శ్రీవత్స గోత్రచే వ్రాయబడిన ఒక గ్రంథము.

**భరతసారసంగ్రహ :—** నాట్యముపై వ్రాయబడిన ఒక గ్రంథము. ఇది మైసూరులోని 'ఓరియంటల్ లైబ్రరీ'లోగలదు.

**భరత సిద్ధాంతము :—** సంగీత, నాట్యములగు గురించి తమిళములో వ్రాయబడిన ఒక వ్రాతప్రతి గ్రంథమునకుగల పేరు. ఇది మదరాసు గవర్నమెంటుకు చెందిన 'ఓరియంటల్ మానిస్క్రిప్టు లైబ్రరీ'లో గలదు.

**భరతసూత్రము :—** 'భరతుని'చే 'నాట్యశాస్త్రము' నకు పూర్వము వ్రాయబడిన ఒక గ్రంథము పేరు.

**భరతసేనాపతీయము :—** 'శ్రీ ఆదివాయిలార్' అను తమిళరచయితచే రచింపబడిన ఒక పురాతనతమిళనృత్యగ్రంథము.

**భరతా :—** 'రాగవిబోధ' మను గ్రంథములో పేర్కొనబడినట్టి వీణావాద్యములోపలికించు ఒక విశేషమునకు పేరు. అనగా వీణలో షడ్జస్వరస్థానములోనే తంతిని వ్రేలితో లాగి, రిషభస్వరమును కూడ పలికించుట యగును.

**భరతాచార్య :—** నాట్యమును బోధించునట్టి ప్రవీణుడైన వుపాధ్యాయునికి గల గౌరవనామము.

**భరతాచార్యులు :—** 'నాట్యశాస్త్ర' మను ప్రాచీన గ్రంథమును రచియించిన గ్రంథకర్తకు గలపేరు. ఈతనిని గురించి మహాకవి 'కాళిదాసు' కూడ తన గ్రంథములో పేర్కొనెను.

**భరతార్ణవము :—** భరతకళను గురించి 4,000 శ్లోకములతో వ్రాయబడిన ఒక పెద్ద గ్రంథమునకు పేరు. ఇది నందికేశ్వరుని 'అభినయదర్పణ' గ్రంథములో పేర్కొనబడినది.

**భరతార్ణవసంగ్రహ :—** తంజావూరు 'సరస్వతీమహల్ లైబ్రరీ'లోని తెలుగువ్యాఖ్యానముతోగల ఒక వ్రాతప్రతిగ్రంథము.

**భరతార్ణవాది భరతశాస్త్రసంగ్రహము :—** ఇది నాట్యమును గురించి వ్రాయబడిన ఒక గ్రంథము. ఇది మైసూరులోని 'ఓరియంటల్ లైబ్రరీ'లో గలదు.

**భరతార్థకల్పవల్లీ :—** 'నాట్యము' ను గురించి వ్రాసి ప్రకటింపబడిన యొక గ్రంథమునకు గలపేరు.

**భరతార్థచంద్రిక :—** నాట్యమునుగూర్చి వ్రాయబడిన యొక వ్రాతప్రతి గ్రంథము.

ఇది మద్రాసుగవర్నమెంటు 'ఓరియంటల్ మానిస్క్రిప్టు లైబ్రరీ'లో గలదు.

భర్మాంగి :— 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

భర్మాంబరి :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

*భవప్రియ :—72 మేళకర్తలలో 44 వ మేళకర్త రాగమునకు గలపేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి- సా. గాం- ప్ర. మ- శు. ధై- కై. నిషాద స్వరములుండును. త్యాగరాజునిచే రచింపబడిన 'శ్రీకాంతనీయెడ' అను ప్రసిద్ధమైన కృతి యీ రాగములోనిదగును.

భవమనోహరి :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ప ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ మ రి స.

భవ్యలీలా :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.
[సం. కా.]

భవాని :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధా ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
[సం. కా.]
ఈ రాగమునకుమరియొకవిధముగా 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'లోగలదు.
ఆరోహణము— స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గా రి స.

భవాని :— దీనినే అసంపూర్ణ మేళపద్ధతిలో 44 వ మేళముగా చెప్పబడినది.

భవాభరణము :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగమైన షాడవరాగమగును.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

భవాళి :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ని ధ ప మగరిస.
ఇది ఔడవ-వక్రసంపూర్ణ రాగమునను చెందును.

భ్రగజాతి :— 'భావభట్టుని' 'అనూపసంగీత విలాసము'లో పేర్కొనబడిన 'గాంధారము'లోని మొదటి శృతికి పేరు.

భ్రమర :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
ఇది షాడవరాగమగును.

భ్రమర :—హస్తము యొక్క ఒకరకము.

భ్రమరకుసుమము :— 56 వ మేళకర్త యగు 'షణ్ముఖప్రియ' జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
[గా. లో.]

భ్రమరకేతనము :—8 వ మేళకర్తయగు 'హనుమత్తోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.
[సం. కా.]

భ్రమరకోకిలము :— 57 వ మేళకర్త యగు 'సిమ్హేంద్రమధ్యమము' యొక్క జన్యరాగము. [గా. లో.]
ఆరోహణము– స రి మ ప ని ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ రి స.

భ్రమరధ్వని :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ధ ని స.
అవరోహణము– స ధ ని ప మ గ రి స.

భ్రమరనారాయణి :— 54 వ మేళకర్త యగు 'విశ్వంభరి'యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము– స ని మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ — ఔడవరాగమునకు చెందును. [గా. లో.]

భ్రమరపుత్తరి :— 58 వ మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ధ ప మ రి స.
[గా. లో.]

భ్రమరభోగి :— 44 వ మేళకర్తయగు "భవప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– మ ప ధ ని స రి గ.
అవరోహణము– మ గ రి స ని ధ ప.
ఇది మధ్యమాంత్యరాగమునకు చెందును.
[గా. లో.]

భ్రమరవర్ధని :— 10 వ మేళకర్తయగు "నాటకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ రి స.
[సం. కా.]

భ్రమరసారంగ :—56 వ మేళకర్తయగు "షణ్ముఖప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము– స ధ ప మ గ రి స.

భ్రమరసుఖి :— 57 వ మేళకర్తయగు "సిమ్హేంద్రమధ్యమము"యొక్క జన్యము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ధ ప మ గ రి స.

భ్రమరహంసి :— 57 వ మేళకర్తయగు "సిమ్హేంద్రమధ్యమము"యొక్క జన్యము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

భ్రమరికము :—నృత్యప్రదర్శనములోని రకములలో ఒకరకమైన ఈశానసంధి నాట్యమునకు పేరు. ఇది దేవాలయములందలి నవసంధి పూజలలో చేయుదురు.

భ్రమరికామంజరి :— 22 వ మేళకర్త యగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగమైన వక్రషాడవ–వక్రసంపూర్ణము.
ఆరోహణము– స గ మ ధ ప ని స.
అవరోహణము– స ని ధ ప ధ మ గ రిస.

—

# భా

భాగవతగోష్టి :— దైవ సంబంధమైన కీర్తనలనుగానముచేయునట్టి భక్తులయొక్క సమూహమునకు గలపేరు.

భాగవత దశమస్కంద నాటకమ్ :— 1845 – 1905 కాలమునకు చెందిన 'అనంత భారతి' తమిళములో నాటకరూపముగా వ్రాసిన ఒక గ్రంథముపేరు. ఈయన రామాయణముయొక్క ఉత్తరకాండను కూడా నాటకశైలిలో రచించియుండెను.

భాగవతనటనమ్ :— భాగవతులు సమూహముగాచేరి చేయునట్టి భక్తిపూరితమైన నాట్యము.

భాగవత భజనపద్ధతి :— శ్రీ "టి. పి. కోదండరామయ్యర్"(మద్రాసు)చే తెలుగులో ప్రకటింపబడిన భజనపద్ధతిగలభక్తి కీర్తనల గ్రంథమునకుపేరు.

భాగవత మేళనాటకము :— దేవాలయములందు జరుగు వార్షికోత్సవములలో దేవునియెదుట ప్రదర్శింపబడు నాట్యనాటకములకు పేరు. ఇట్టి ప్రదర్శనములిచ్చువారు తమిళదేశములో మెలట్టూరు, శూలమంగలమ్, శాలియమంగలమ్, నల్లూరు, (తంజావూరుజిల్లా) ఆంధ్రదేశములో కూచిపూడి (కృష్ణాజిల్లా) మొదలగు ప్రదేశములందుగలరు.

భాగవత మేళము :— భాగవతారులతో కూడిన నాట్యసమాజములకుగల పేరు. దీనికి అన్యమైనది 'నట్టువమేళమ్' అగును. ఈ మేళములు నాట్యమే ప్రధానవృత్తిగా గలవారితో కూడియుండును.

భాగవత సంప్రదాయము :— దీనికి వేరొకపేరు హరికథాకాలక్షేపముఅగును.

భాగ్యరంజని :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ప మ గ రి స.
[సం. శా.]

భాగీరథి :— 20 వ మేళకర్తయగు "నఠభైరవి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ధ ని స.
అవరోహణము– స ని ధ గ రి స.

భాండి :— "సంగీత సర్వార్థసార సంగ్రహ"మను తెలుగుగ్రంథములో పేర్కొనబడిన భైరవిరాగముయొక్క భార్యరాగమునకు గలపేరు.
ఆరోహణము– స రి ప ధ స.
అవరోహణము– ప మ గ రి స ని ధ ప.
దీనినే సి. ఆర్. యస్. రామాయణము నోట్సులో పురాతన సంగీతమునకుచెందిన శుద్ధరాగముగ పేర్కొనబడినది.

భాండీరభాష :— ఒకరకమైన ప్రాకృత భాషకు పేరు. ఇది సంస్కృతభాషకు చెందినదిగా నుండును. కొన్ని ప్రాచీన గీతములందలి సాహిత్యము యీ భాండీర భాషలోనే రచింపబడి యున్నవి.

భాత్ ఖండె :— 1860 - 1936 కాలమునకు చెందినట్టియు హిందుస్థాని సంగీతములో మిక్కిలి కృషిచేసినట్టి ఒక మహారాష్ట్ర పండితునికి గలపేరు. ఇతడు బ్రాహ్మణుడు. ఇతని పూర్తిపేరు విష్ణు నారాయణ భాత్ ఖండె. ఇతడు హిందుస్థాని సంగీతములో అనేక గ్రంధములు రచించెను. వాటిలో కర్నాటక సంగీతములోని మేళకర్తలకు సరిపోవునట్టి 10 ఠాట్ (రాగము)లను పేర్కొనెను. వాటిని ఈ క్రింద పేర్కొనుట గమనించునది.

ఠాట్ పేరు - మేళసంఖ్య - మేళకర్తపేరు.
భైరవి - 8 - హనుమతోడి.
భైరవ - 15 - మాయామాళవగౌళ.
ఆసావరి - 20 - నఠభైరవి.
కాఫి - 22 - ఖరహరప్రియ.
ఖమాజ్ - 28 - హరికాంభోజి.
బిలావల్ - 29 - ధీరశంకరాభరణము.
తోడి - 45 - శుభపంతువరాళి.
పూర్వి - 51 - కామవర్ధని.
మార్వా - 53 - గమనశ్రమ.
యమన్ - 65 - మేచకల్యాణి.

భావవి :— "సంగీతసుధ" అను గ్రంథములో పేర్కొనబడిన టక్క జన్యవిభాషాసమూహమునకు చెందిన 4రాగములలో నొకదానికి గలపేరు.

భానుకాంతి :— 25 వ మేళకర్తయగు "మారరంజని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

భానుకిరణి :—27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది ఔడవ - సంపూర్ణరాగమునకు చెందును. [సం. కౌ.]

భానుక్రియ :— 30 వ మేళకర్తయగు "నాగానందిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది వక్రషాడవ - సంపూర్ణమగును.

భానుకోకిల :— 12 వ మేళకర్తయగు "రూపవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ ప ధ ని స.
అవరోహణము- స ధ ని ప మ గ స.

భానుగీర్వాణి :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

భానుగౌళ :— 7 వ మేళకర్తయగు 'సేనాపతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- ధ స రి గ మ ప ధ ని.
అవరోహణము- ధ ప మ గ రి స ని ధ ప.
ఇది నిషాదాంత్యరాగమునకు చెందును.

భానుచంద్రికా :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యమైనట్టి స్వరాంతర - ఔడవరాగము. [సం. కౌ.]
ఆరోహణము- స మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

భానుచూడామణి :— 18 వ మేళకర్తయగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము. [సం. కౌ.]
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ని ధ ని ప మ గ రి స.

భానుజ్యోతిష్మతి :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.
ఇది ఉభయ వక్రసంపూర్ణరాగమగును.

భానుత :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

భానుతీవ్రా :— 34 వ మేళకర్తయగు "వాగధీశ్వరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ రి గ మ ప స.
అవరోహణము-స ని ధ ప మ రి గ మ గ స.

భానుదీపకము :— 24 వ మేళకర్తయగు "వరుణప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ రి స.
ఇది సంపూర్ణ - ఔడవము. [సం. కౌ.]

భానుదీపరము :— 34 వ మేళకర్తయగు "వాగధీశ్వరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ రి గ మ ప స.
అవరోహణము- స ధ ప మ గ మ రి స.
[సం. స్వ. ప్ర. సా]

భానుధన్యాసి :— 45 వ మేళకర్తయగు "శుభపంతువరాళి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని ధ ని.
అవరోహణము- ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు చెందును.

భానుప్రతాపము :—25వ మేళకర్తయగు "మారరంజని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

భానుప్రియ :— 1 వ మేళకర్తయగు "కనకాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ప మ గ రి స.

భానుప్రియ :—ఈ పేరుతో 21 వ మేళకర్తయగు "కీరవాణి" యొక్క జన్యముగా మరియొక రాగముకూడ గలదు.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

భానుమంజరి :— 34 వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ రి గ రి స.

భానుమతి :— (i) 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి మ ప స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

(ii) ఈపేరు అసంపూర్ణ మేళపద్ధతిలో ౻ వ మేళముగా చెప్పబడినది.

భామకలాపము :— ఆంధ్ర దేశములో కృష్ణాజిల్లాలోని కూచిపూడి గ్రామమందలి భాగవతులచే ఆడబడునటువంటి నాట్యముతోకూడిన తెలుగు నాటకమునకు పేరు.

భామామణి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స మ రి గ మ ధ ని స.
అవరోహణము— స ధ ప గ రి స.

భామామణి :— ఈ పేరుతో 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగముకూడ ఒకటికలదు.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

భారతసంగీతన్వయంబోధిని :— శ్రీ 'టి. సి. ఆర్. జోహానెస్' (Johannes)చే తమిళములో వ్రాయబడిన ఒక గ్రంథము.

భారతి :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

భారతి :— బ్రహ్మపత్నియగు'సరస్వతి' కిగల మరియొకపేరు. సంగీతోపాసనకు ఈమె యధిష్టాన దేవతయగును.

భారతి :— 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ప మ గ రి స.

భారతి :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప ధ ప మ గ రిస.

భారతీయనాట్యశాస్త్రము:— 'భరతముని'చే రచింపబడిన నాట్యశాస్త్రమునకుగలపేరు. ఈ గ్రంథము రెండు సార్లు ప్రకటింపబడినది. అందు ఒకటి బొంబాయిలో నిర్ణయసాగర ప్రెస్‌లోను, రెండవది బెనారస్‌లోని కాశీసంస్కృత సీరియస్‌లోను ప్రకటింపబడినది.

భారతీయ శృతి-స్వర-రాగ-శాస్త్రము :— శ్రీ పండిట్ ఫిరోజ్ ఫ్రాంజి (Firoze Framgee) చే 1935 లో హిందీలో వ్రాయబడిన ఒక సంగీత గ్రంథము.

భారతీయసంగీతము :— శ్రీ కె. జి. ములయ్ (Mulay) (బొంబాయి) 1941 లో మహారాష్ట్రములో వ్రాయబడిన ఒక సంగీత గ్రంథము.

భారతీయసంగీతశాస్త్రము :— భారతీయ సంగీతశాస్త్రముపై వ్రాయబడిన ఒక ప్రమాణ గ్రంథము.

భారవీ :— శ్రీ 'పార్శ్వదేవుని' 'సంగీతసమయసారము' అను గ్రంథములో పేర్కొనబడిన సంపూర్ణ తరగతికి చెందిన ఒక ఉపాంగరాగము.

భార్గప్రియ :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ధ ని స.
అవరోహణము– స ని ధ గ రి స.

భార్గవి :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

భార్గవి :— ఈ పేరుతో 37 వ మేళకర్త యగు 'సాలగము' లోకూడ ఒక జన్య రాగము కలదు.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

భార్యరాగ :— 'రాగిణి' రాగమునకుగల మరియొక పేరు. హిందుస్థాని సంగీతము లోని రాగవిభజనలో రాగములు, రాగిణి రాగములు పుత్రరాగములు మొదలగునవి గలవు. ప్రాముఖ్యమైన 6 పురుషరాగము లకు ఒక్కొక్కదానికి 5 భార్యరాగముల వంతున6X5=30భార్యరాగములుగలవు.

భావక్రీ :— పురాతన సంగీతమునకు చెం దిన ఒక క్రియాంగ రాగము.

భావజప్రియ :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

భావనాపంచమ :— 'సంగీతసుధ' అను గ్రంథములో పేర్కొనబడిన 8 ఉపరాగ ములలో నొకదానికి గలపేరు. దీనిని సం గీత రత్నాకరము' అను గ్రంథములోకూడా పేర్కొనబడినది.

భావనీ :— 'మాళవ పంచమము'నకు చెం దిన రెండు విభాష రాగములలో నొక దానికి గలపేరు.

భావప్రకాశనము :— శ్రీ 'శారదా తనయ'చే నాట్యముపై వ్రాయబడిన ఒక వ్యాఖ్యాన గ్రంథము.

భావప్రధానగానము :— తన్మయత్వము నొందించగల ఉత్తమ తరగతికి చెందిన సంగీత ప్రదర్శనమునకు గలపేరు.

భావప్రధాన సంగీతము :— భావమే ప్రధానముగాగల సంగీతమునకు గలపేరు.

భావపుష్టి :— సంగీతమునందు ప్రదర్శించు భావము, బలము లేక పుష్టిగానున్నచో చెప్పబడునట్టి పేరు.

భావభట్టుని ద్వావింశతిశ్రుతులు:—భావ భట్టుని 'అనూప సంగీతవిలాస' గ్రంథమున గల22శ్రుతులకుగలపేర్లు. ఆశ్రుతులపేర్లను, స్వరములను యీ క్రింద గమనించునది.
ష– నందనా, నిష్కళా, గూడా, సకలా,
రి– మధుర, లలిత, కాక్షరా,
గాం– భగజాతి, హ్రాస్వగీతి,
మ–రంజికా,చాపరా,పూర్ణా,అలంకారిణి,
పం– వైణికా,వలితా,త్రిస్థానా,సుస్వరా,
ధై– సౌమ్యా, భాషాంగికా, వార్తికా,
ని– వ్యాపకా లేక ప్రసన్నా, శుభగా-

భావము :— అభినయమునకుగల మరి యొక పేరు. ఇది 4 విధములు. 1 ఆంగిక. 2 వాచిక. 3 ఆహార్య. 4 సాత్వికమనునవి.

భావహంస :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము. ఔడవ - వక్రషాడవము.
ఆరోహణము- స గ ప ధ ని స.
అవరోహణము- స ని ప రి మ గ స.

భావిని :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము. స ని ధ ప మ గ స.
దీనిని శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరములో మాళవపంచమము యొక్క సమూహము క్రింద పేర్కొన బడినది.
[సం. స్వ. ప్ర. సా.]

భావినీజాతిప్రబంధము :— ఏక జాతి ప్రబంధములోని 5 జాతులలో 4 వ జాతికి గల పేరు. ఇది 3 అంగములుగలిగి 17 భేదములనుగలదిగా నుండును.

భావుకదాయిని :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

భావుకుడు :— వాగ్గేయ కారకులలోని 5 రకములలో చివఱవానికి పేరు. ఇతడు గానమును మిక్కిలి అతిశయముగా ప్రదర్శించువాడుగా నుండును.

భాషా :— 'సంగీత రత్నాకరము' లో పేర్కొనిన పురాతన సంగీతము యొక్క 6 రకములగు మార్గరాగములలో నొకటి.

భాషాంగ ఔడవ :— భాషాంగ తరగతికి చెందిన ఒక ఔడవరాగము. పార్శ్వదేవుని 'సంగీతసమయ సారములో' దీనిని గుఱించి పేర్కొనబడినది.

భాషాంగఖండ :— రాగాంగ రాగ లక్షణ గీతములలోని 3 వ భాగమునకు గల పేరు.

భాషాంగరాగము :— దేశీరాగములలోని 4 రకములలో నొకదానికి గలపేరు. ఈ దేశీరాగములు ఇండియాలోని వివిధ భాగములయందు వుపయోగింతురు. శార్ఙ్గదేవుని కాలములో వీటిని రాగాంగ, ఉపాంగ. భాషాంగ, క్రియాంగ రాగములుగా విభజింప బడెను. భాషాంగరాగములకు భైరవి, కాంభోజి, బిలహరి మొదలగునవి ఉదాహరణము లగును.

భాషాంగరాగము :— జన్యరాగములలో ఒకటి లేక రెండు లేక మూడు అన్యరాగస్వరములను రంజకముకొఱకు కొన్ని సంచారములలో మాత్రమే అరుదుగా ప్రయోగించబడు రాగమునకు గలపేరు. ఇవిమూడు విధములుగా నుండును.

(1) ఏక అన్యస్వర భాషాంగరాగములు.
ఉ॥ భైరవి, బిలహరి, కాంభోజి మొ॥
(2) ద్వి అన్యస్వర భాషాంగరాగములు.
ఉ॥ అఠాణా మొదలగురాగములు.
(3) త్రి అన్యస్వర భాషాంగరాగములు.
ఉ॥ హిందుస్థాని కాఫీవంటిరాగములు.

భాషాంగ షాడవము :— భాషాంగ తరగతికిచెందిన షాడవరాగమునకు గలపేరు.

భాషాంగ సంపూర్ణము :— భాషాంగ తరగతికిచెందిన సంపూర్ణరాగమునకుపేరు. ఇదిపార్శ్వదేవుని 'సంగీతసమయసారము' లో పేర్కొనబడినది,

భాషాంగికా :— 'భావభట్టుని' చే 'అనూప సంగీతవిలాస' గ్రంథమున పేర్కొన బడిన ధైవతస్వరముయొక్క రెండవశృతికి పేరు. ఈయన ఈగ్రంథము నేగాక, అనూపసంగీత రత్నాకర, అనూపసంగీతాంకుశ అను 3 సంస్కృత గ్రంథములుకూడ వ్రాసెను. అనూప సంగీతవిలాసగ్రంథములో నాద, శృతి, స్వర, రాగములనుగూర్చి వ్యాఖ్యానించెను. మిగతరెంటిలో ఆకాలమునందలి అనేకరాగములను చర్చించెను. ఈయనకు 'అనుష్టుపచక్రవర్తి' 'సంగీతరాజ' అను బిరుదులుకూడ యివ్వబడెను.

భాషారాగమాలిక :— ఒకవిధమైన రాగమాలికా రచనకుగలపేరు. ఈ రాగమాలికలోని ప్రతిభాగముయొక్క సాహిత్యము వేరువేరు భాషలలో వుండును.

భాషారాగము :— 'రత్నాకర' గ్రంథస్థమై పురాతన సంగీత రకమునకు చెందిన మార్గి రాగములు ఆరింటిలో నొకదానికిపేరు.

భాషిణి :— 56 మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

భాస :— 'సంగీతసుధాలో' పేర్కొనిన 20 శుద్ధరాగములలో నొకదానిపేరు.

భాసవలితా :— 'సంగీతసుధా' లో పేర్కొనిన అంతర భాషాసమూహమునకు చెందిన 4 రాగములలో నొకదానికిపేరు.

భాస్కరప్రియ :— 36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

## భి

భిన్న :— ఒకరకమైన రాగమునకుపేరు.

భిన్నకైశిక :— సంగీతరత్నాకరములో పేర్కొనబడిన ఒకరాగము.

భిన్నకైశికమధ్యమ :— 'రత్నాకర' గ్రంథములో పేర్కొనిన ఒక రాగము.

భిన్నగాంధారి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ మ రి స.
సంపూర్ణ-వక్రషాడవరాగము. [సం.కా.]

భిన్నచతుర్ముఖము :— 'రాగతాళచింతామణి' అను తెలుగు గ్రంథములో పేర్కొనిన ఒకతాళమునకు గలపేరు.

భిన్నతానము :— 'సంగీత రత్నాకర' 'సంగీతసుధ' అను గ్రంథములలో పేర్కొనబడిన ఒక రాగము.

భిన్ననిషాదము :— (i) 63 వ మేళ కర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ప మ గ రి స ని̣.

భిన్ననిషాదము :— (ii) 6 వ మేళ కర్తయగు 'తానరూపి' యొక్క జన్య రాగము. ఔడవరాగమునకు చెందును.
ఆరోహణము— స రి గ మ ధ సఁ.
అవరోహణము— సఁ ధ మ గ రి స
[సం. స్వ. ప్ర. సా.]

భిన్నపంచమము :— 3 వ మేళకర్త యగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని సఁ.
అవరోహణము— సఁ ని ధ ప మ గ రి స.
దీనిని 'సంగీతరత్నాకరము' చతుర్దండి ప్రకాశిక గ్రంథములలో పేర్కొనబడెను.

భిన్నపంచమి :— "రత్నాకరము" లో పేర్కొనిన 'కకుభ' యొక్క భాషావలె నుండునట్టి ఒక రాగము.

భిన్నపౌరాళి :— సంగీతరత్నాకరములో పేర్కొనిన హిందోళయొక్క భాషావలె నుండు ఒక రాగము. దీనినే 'సంగీతసమ యసారము'లో భాషాంగ సంపూర్ణ రాగ ముగా పేర్కొనబడెను.

భిన్నరాగములు :— "సంగీతసుధ"లో పేర్కొనిన భిన్నకైశిక మధ్యమ, భిన్న షడ్జ, భిన్నతాన, భిన్నకైశిక, భిన్నపంచమ వంటి రాగములకు పేరు.

భిన్నవరాళి :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని ధ సఁ.
అవరోహణము— సఁ ని ధ ప మ స.

భిన్నవలితా :— "సంగీతరత్నాకరము" లో టక్కకైశిక భాషారాగశీర్షిక క్రింద పేర్కొనిన ఒక రాగము.

భిన్నవిక్రమ :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరా గము. [ప. శే. ప్రా. గ్రం.]
ఆరోహణము— స రి గ మ ధ సఁ.
అవరోహణము— సఁ ని ధ ప రి స.

భిన్నవిక్రియ :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ సఁ.
అవరోహణము— సఁ ధ ప మ రి స.
[సం. కా.]

భిన్నషడ్జము :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి ప మ ప ని సఁ.
అవరోహణము— సఁ ధ ప మ గ రి స.
దీనినే అసంపూర్ణ మేళపద్ధతిలోని 9 వ మేళమును ధునిభిన్నషడ్జముగా చెప్పబడె ను. 'రఘునాథనాయక్' యొక్క "సంగీత సుధా"లో 5 రకములగు భిన్నరాగములు పేర్కొనబడెను. అవి భిన్నకైశికమధ్యమ, భిన్నషడ్జ, భిన్నతాన, భిన్నకైశిక, భిన్న పంచమ మనునవి. త్యాగరాజు ఈ రాగ

ములో 'సరివారిలోన' అను ప్రసిద్ధమైన ఒక కృతిని రచించె.

భిన్నషడ్జవిభాషా:— "సంగీతరత్నాకరము"లో పేర్కొనబడిన 4 భిన్నషడ్జ విభాషారాగములకుగల పేరు. వాటిలో 'దేవారవర్ధని' రాగము ఒకటియగును.

భిన్నహేరాళి :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

# భీ

భీకరఘోషిణి :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మ గ రి స.

భీమ్‌పలాసి :— ఉత్తర భారత సంగీతమునకుచెందిన ఒక రాగము. ఇది కర్నాటక సంగీతములో "ఆభేరిరాగనము"నకు సరిపోవునదిగా నుండును.

భీమనేత్ర :— 'బృహద్ధర్మ పురాణము' అను గ్రంథములో పేర్కొనిన ఒక 'దేశి' రాగమునకుపేరు.

భీష్మావళీ :— 8 వ మేళకర్తయగు 'హనుమత్తోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ధ ప ని ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ-షాడవము. [సం. కా.]

# భు

భుంచీ :— 'సంగీత రత్నాకరము'లో పరిశోధింపబడిన ఒక రాగము. దీనినే 'సంగీతసుధా'లో వేళావళి ఉపాంగరాగములయొక్క సమూహముక్రింద పేర్కొనబడెను.

భుజంకాంచితమ్ :— దేవాలయములందు జరుగు నవసంధి పూజలలో ఇంద్రసంధి (తూర్పు) లోని నాట్య (నృత్యం) ప్రదర్శనములలోని ఒకరకము.

భుజగచింతామణి :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

భుజగమణి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని గ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
దీని ఆరోహణావరోహణ పద్ధతి "కదన కుతూహలము" రాగమునకుసరిపోవునదిగా నుండును. [సం. కా.]

భుజంగచింతామణి :— ఇది "భుజగ చింతామణి"రాగమునకుగలమరియొక పేరు.

భుజంగత్రాసమ్:— దేవాలయములందు జరుగు నవసంధి పూజలలో నిరుతిసంధి (దక్షిణ-పడమర) లో ఒకరకపు నాట్య (నృత్త) ప్రదర్శనమునకు పేరు.

భుజంగలలితనృత్యము :— దేవాలయములలోజరుగు నవసంధిపూజలలో చేయు ఒకరకమైన నృత్య ప్రదర్శనము.

భుజంగలలితము:—దేవాలయములందు చేయు నవసంధి పూజలలో వాయుసంధి (ఉత్తర-పడమర)నృత్య ప్రదర్శనములోని ఒకరకమునకు పేరు.

భుజంగస్వరము :— ఇది ఒక గాలి వాద్యము. దీనినిపాముమంత్రము వేయువారు వుపయోగించుదురు. దీనినితమిళములో 'మగుడి'అని చెప్పుదురు.

భుజంగి :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని మ గ రి స.
[సం. స్వ. ప్ర. సా.]

భుజంగిణి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి స మ గ మ ని ధ నిస.
అవరోహణము— స ని ధ మ గ రి స.
ఇది వక్రషాడవ - షాడవ రాగమునకు చెందును.

భుజగేశ్వరీ :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

భువన :— సంకీర్ణజాతి ధృవతాళమునకు గలపేరు. దీనికి అంగములు । 0 । ।. అక్షరకాలములు 29. ఇది సూళాది 35 తాళములలో పెద్దతాళమగును.

భువనకుంతలి :— 68 వ మేళకర్త 'జ్యోతిస్స్వరూపిణి' యొక్క జన్యరాగము. షాడవ - ఔడవము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

భువనగాంధారి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.
శ్రీ 'మైసూరుకృష్ణ'చే సదాశివబ్రహ్మేంద్రస్తుతిగా రచింపబడిన 'పరమాత్మనీపదసారస' అను కీర్తనయు, శ్రీ వాసుదేవాచార్యులురచించిన "లలితాంబే"అను కృతియు ఈరాగములోని ప్రసిద్ధ రచనలగును.

భువనమోహిని :— 16 వ మేళకర్త "చక్రవాకము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ని ధ స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

భువనరంజని :— 14 వ మేళకర్త "వకుళాభరణము"యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

భువనసుందరి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము. ఔడవ - సంపూర్ణము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

భువనేశ్వరి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

భృంగధ్వని :— 62 వ మేళకర్తయగు "రిషభప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

భృంగమోహి :— 47 వ మేళకర్తయగు "సువర్ణాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

భృంగవిలసితా :— 20 వ మేళకర్త యగు "నఠభైరవి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ధ ని స.
అవరోహణము- స ధ ప మ రి స.

భృంగి :— సంగీతమునుపాసించినపురాతన ప్రామాణికులలో నొకరికి గలపేరు. శ్రీ "త్యాగరాజు" ధన్యాసి రాగము, ఆది తాళములోని "సంగీతజ్ఞానము" అను కృతి లోగల అనుపల్లవిలో భృంగి, అనుపేరును వుదహరించుట గమనింపదగును.

భృంగుకుంగ :— 24 వ మేళకర్తయగు "వరుణప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది వక్రషాడవ - సంపూర్ణమగును.

# భూ

భూ :— 72 మేళకర్తలుంగల 12 మేళ చక్రములలోను ప్రతిమేళచక్రమునందుగల 6 మేళములలో 4 వ మేళకర్తకు "వెంకటమఖి" పెట్టిన సంకేతాక్షరనామము.

భూతనర్తన :— భూత నాట్యమునకు గలపేరు. ఈ భూతనాట్యమును దక్షిణదేశములో తంజావూరు 'బృహదీశ్వరాలయము' వంటి గొప్ప గొప్ప దేవాలయములందు ప్రదర్శించు చుందురు.

భూతసంఖ్య :— పేర్లను బట్టియే వాటిసంఖ్యలను గుర్తించుటకు తగిన వీలు గలిగినట్టి ఒకసూత్రమునకు పేరు. వాటిని యీ క్రింద నుదహరించుట గమనించునది.

| పేర్లు. | సంఖ్యలు. |
|---|---|
| ఇందు, లేక సోమ (చంద్రుడు) ... | 1 |
| నేత్ర, లేక దృక్ (కన్నులు) ... | 2 |
| అగ్ని, లేక అనల (త్రేతాగ్నులు)... | 3 |
| వేద, (చతుర్వేద) లేక యుగ (చతుర్యుగ) లేక అబ్ధి (చతుస్సముద్ర) ... | 4 |
| బాణ, (మన్మథునిపంచబాణములు లేక శర) | 5 |
| ఋతు (6 కాలములు) లేక రస (6 రుచులు) . | 6 |
| ఋషి, (సప్తఋషులు) లేక సప్తమరుత్ | 7 |
| వసు, మాతంగ (ఏనుగ) లేక అష్టదిగ్గజ. . | 8 |
| నిధి, (నవనిధులు) మరియు అంకమ్ ... | 9 |
| దిశ లేక దిక్ (దశదిశలు), అనగా... | 10 |

(తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము, ఈశాన్య, ఆగ్నేయ, నైఋతి

వాయవ్య, ఆకాశ, పాతాళమను వాటికి గలపేరు.)
రుద్ర, లేక హర, లేక ఈశ(ఏకాదశ రుద్రులు) ... ... ... 11
ఆదిత్య, లేక రవి (ద్వాదశాదిత్యులు) 12
విశ్వ ... ... ... ... 13
ముఖ్యముగా ఈ భూతసంఖ్యను గణితశాస్త్రములోనుపయోగింతురు. అయితేసంగీతశాస్త్రములో కూడ 12 మేళచక్రము అందును, 35 తాళములందును, 12 స్వరస్థానములందును, వేణువులోని రకముల యందును వుపయోగించినటుల 'స్వరార్ణవ' మను గ్రంథములోపేర్కొనబడినది.

**భూతేశప్రియ** :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

**భూప్** :— హిందుస్థాని సంగీతములోని భూపాళి, రాగమునకుగల మరియొకపేరు. ఇదికర్ణాటక సంగీతములోని మోహన రాగమునకు సరిపోవునదిగానుండును.

**భూపకల్యాణి** :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

**భూపతి** :— 'హంసవిలాస' గ్రంథమున పేర్కొనిన ప్రధానరాగమైనట్టి'దెశాఖా' కు సంబంధించిన రాగములలో నొక దానికి గలపేరు.

**భూపతిరాజపురము** :— ఇది తంజావూరు జిల్లాలోని ఒకచిన్న గ్రామము. దీనినే వరహూరు' అనియు, వరాహాపురి అనియు చెప్పుదురు. శ్రీ 'నారాయణతీర్థుల' వారికి కనుపించిన వరాహము(పంది)యిచ్చటనే అదృశ్యమైనందున అప్పటినుండి దీనికీపేర్లు వచ్చెనని తెలియుచున్నది.

**భూపయోసిత** :— నారదుని 'సంగీతమకరందము'లో పేర్కొనబడిన స్త్రీరాగములలో నొకటి.

**భూపాలు** :— భోపాలు సంస్థానములో జనించియుండునట్లుగా తెలుపు రాగమునకు యిదిఒక వుదాహరణమగును.

**భూపావలి** :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

**భూపాళచింతామణి** :— 2 వ మేళకర్త 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ధ ని ధ ప మ రి స.
[గా. లో.]

**భూపాళతరంగిణి** :— 18 వ మేళకర్త 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గమరిస.

**భూపాళపంచమము** :— 39 వ మేళకర్త 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము. వక్రషాడవ — వక్రఔడవమగును.
ఆరోహణము— స గ రి గ ప మ ధ స.
అవరోహణము— స ప ధ మ స రి స.

భూపాళమనోహరి :— 5వ మేళకర్త 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

భూపాళము :— 15వ మేళకర్త 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప గ రి స.
దీనికే 'బిబాసు' అను పేరుకూడకలదు. ఇది ఒక పురాతనమైన ప్రసిద్ధరాగము. సాధారణముగా దీనిని 'ఉదయరాగ'మనికూడా చెప్పుదురు. దీనికి గాంధార, పంచమములు జీవస్వరములు. 'దీనజనావన' అను త్యాగరాజ కృతియు, జయదేవుని 7 వ అష్టపదియు ఈ రాగములో ప్రసిద్ధమైనవి. నవీన సంగీతగ్రంథములలో యిదే ఆరోహణ అవరోహణములతో 8వ మేళజన్యముగ 1 భూపాలరాగము, 15వ మేళజన్యముగ 1 రేవగుప్తిరాగమును గలవు.

భూపాళరంజని :— 33వ మేళకర్త 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

భూపాళిక :— 16వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.
ఇది ఔడవ - షాడవమగును. [సం. కౌ.]

భూపాళీ :— హిందుస్థాని సంగీతములోని ఒక రాగము. ఇది కర్నాటక సంగీతములోని మోహన రాగమునకు సరిపోవును. దీనికి గాంధారము అంశస్వరము.

భూమిదుందుభి :— సంహితలు, బ్రాహ్మణములయందు కనగొనబడినట్టి మహావ్రతతిథులయందువుపయోగింపబడుగొప్ప భూచర్మ వాద్యమునకుపేరు. దీనిని ముఖ్యముగా ఆఫ్రికాలో నివశించు నీగ్రోలు వుత్సవసమయములలో వాయించుదురు.

భూయోమణి :— 22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

భూరంజని :— 65వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
[ప. శే. వ్రా. ప్ర.]

భూరి :— దేవాలయములందు వుపయోగించు యిత్తడిగొట్టముగానుండువాద్యము.

భూరికల్యాణి :— పూరికల్యాణి లేక పూర్వకల్యాణి అనుసరియైన పేరుగలరాగమునకు యిదిసాధారణంగాచెప్పబడుపేరు.

భూలోకగాంధర్వ :— ప్రపంచప్రఖ్యాత గాయకునికి చెందుపేరు. ఉ॥ త్యాగరాజు. ప్రపంచములోకెల్ల గొప్పసంగీతపాటకుడును, గొప్ప రచయిత యగుటచే ఆయనకు గల సార్థకమైన బిరుదుయగును.

భూలోకచాపచుట్టి :— 'శ్రీ బొబ్బిలి కేశ

వయ్య' అను ప్రఖ్యాత పురుషుడైన ఆంధ్ర గాయకునికి ఆకాలములోగల బిరుదు.

భూలోకమల్లుడు :— మధ్య కాలము నకుచెంది సంగీతములో గొప్పశాస్త్రగ్రంథ మునురచించిన రచయితకుపేరు. ఈతడు 'లలిత' అను నొకనవీనమగు ప్రబంధమును పేర్కొనెను. అంతేగాక అనేక ప్రబంధ ములను కూడ రచించెను.

భూపకల్యాణి :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.
[గా. వి. ప్ర.]

భూషణధారిణి :—35 వ మేళకర్తయగు "శూలిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

భూషణి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
[గా. వి. ప్ర.]

భూషావతి :—ఇది అసంపూర్ణ మేళపద్ధతి లోని 64 వ మేళమునకు గలపేరయగును. కాని దీని ఆరోహణ అవరోహణములు సంపూర్ణముగనే యున్నవి. అయితే సంచా రములందు మాత్రము స రి గ స, స రి ప మ ప ధ స, స ధ ప, ధ ని ప గ రీ సా, అనువిధముగా నుండును.

భూషావళి :— 64 వ మేళకర్తయగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
త్యాగరాజుని "తనమీదనే" అను ప్రసిద్ధ రచన యీ రాగములోని దగును.

# భే

భేదము :—మార్పు లేక వ్యత్యాసమునకు గల పేరు. ఉ॥ లఘువుయొక్క జాతి భేదమువలన తాళముయొక్క అక్షర కాల ములం మారుచుండును.

భేంద్రధూలా :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ప మ గ రి స.

భేరి :—ఇండియాలోని ఒక రకపు చర్మ వాద్యమునకు పేరు. ఇది 'రామాయణము' లోను తదితర ముఖ్య గ్రంథములలోను పేర్కొనబడిన ఒక వాద్యమగును.

భేరికర్ణికా :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

భేరికై :— 'భేరి' అను నొకవిధమైన వాద్యమునకు తమిళములోని పేరు.

భేరీభాష :— 'భేరీ' అను వాద్యముపేరు గల ఒకరకమైన భాషను పేరు. ఇది ఆఫ్రికా ఖండములోని ఒక జాతివారు మాట్లాడుదురని తెలియుచున్నది.

## భై

భైరవ :— హిందుస్థాని సంగీతములోని ఒక మేళమునకుపేరు. ఇది కర్ణాటక సంగీతములోని "మాయామాళవగౌళ" మేళమునకు సరిపోవునదిగా నుండును.

భైరవధ్వని :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ని ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

భైరవము :— 17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధా ప మ గ రి స.
ఉపాంగరాగము. రిషభ, మధ్యమ, నిషాదములు జీవస్వరములు. శ్రీత్యాగరాజుని 'మరియాదగాదయ్యా' అను ప్రసిద్ధకృతి ఈ రాగములోనిదైయున్నది.

భైరవి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
భాషాంగరాగము. చతుశ్రృతి ధైవతము అన్యస్వరముగల సంచారములు పధనిసా. ప ధ ని ధ ని సా, స ని ధ ని సా మొదలగునవి యగును. రి, గ, మ, ని స్వరములు జీవస్వరములగును. రి, మ,ప, ని, చతుశ్రృతి ధైవతములు న్యాసస్వరములగును. గ, మ, ని కంపిత స్వరములు. రి మ గా రి స. పా ధ మా, ప ధ ని ధ మా, మొదలగునవి విశేషప్రయోగములగును. ని, రి, ధ2 ఈ రాగములో ప్రారంభ స్వరములు. ని గ రి గ స రి ని రి స రి ని స. ప రి స ని ధ ప. మ ని ధ ప, మ ప గా రి స మొదలగునవి దాటుస్వరప్రయోగములగును. త్రిస్థాయి రాగము. సర్వస్వర గమక వరిక రక్తి రాగము. పెద్దరాగము. సంగీతత్రిమూర్తుల యొక్క అనేక సుప్రసిద్ధ రచనలుగల రాగము. శ్రీఆదిఅప్పయ్యయొక్క ప్రసిద్ధమైన 'విరిబోణి' అను అటతాళవర్ణము, శ్రీశ్యామశాస్త్రి యొక్క 'కామాక్షి' అను స్వరజతియు, నీరాగములోనివై యున్నవి. హిందుస్థాని సంగీతములోని యిదే భైరవి రాగము కర్ణాటక సంగీతములోని తోడి రాగమునకు సరిపోవును.

## భో

భోగ :— 35 తాళములలో 'సంకీర్ణజాతి త్రిపుట' తాళమునకు గలపేరు. దీనికి అంగములు 100. అవర్తమునకు అక్షర కాలములు 13. మాత్రలు 3¼.

భోగకన్నడ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ప ని స.
అవరోహణము— స ధ ని ప ధ మ గ రిగస.

భోగచ్ఛాయానాట :— ఈపేరు అసంపూర్ణ మేళపద్ధతిలోని 34 వ మేళము. 'ఛ్ఛాయానాట' అను పేరుగల ఈరాగమునకు "భోగ" అనునది కటపయాది సూత్రము ననుసరించి చేర్చబడినగును.

భోగచింతామణి :— 7 వ మేళకర్తయగు "సేనావతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

భోగచింతామణి :— 'సంగీత కౌముది'లో దీనిని 1 వ మేళకర్తయగు "కనకాంగి" యొక్క జన్యరాగముగా చెప్పబడినది.
ఆరోహణము- స రి ప మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి గ రి స.

భోగధన్యాసి :— 48 వ మేళకర్తయగు "దివ్యమణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ప ధ ని ప మ గ రిస.

భోగధ్వజా :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ రి స.
[సం. కౌ.]

భోగధ్వజి :— 47 వ మేళకర్తయగు "సువర్ణాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ రి స.

భోగమేళమ్ :— ఆంధ్ర దేశములో శుభ సమయములందు నాట్యప్రదర్శన చేయు కళావంతులకు చెందిన నాట్యస్త్రీలును, వారి ప్రక్క వాద్యకులతో కూడిన ఒక సమూహామునకు గలపేరు.

భోగరంజని :— 7 వ మేళకర్తయగు "సేనావతి" యొక్క జన్యరాగము. ఇది ఔడవ సంపూర్ణరాగము. [సం. కౌ.]
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది 'పల్లవి శేషయ్యర్' యొక్క వ్రాత ప్రతిలో 'భోగచింతామణి'గా చెప్పబడినది.

భోగరసావళి :— ఇది "భోగరసాళి" రాగమునకుగల మరియొక పేరు.

భోగరసాళి :— 38 వ మేళకర్తయగు "జలార్ణవము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ప ని స.
అవరోహణము- స ని ధ ని ప మ గ రిస.

భోగలీలా :— 27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

భోగవతి :— 12 వ మేళకర్తయగు "రూపవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ మ గ రి స.

భోగవతి :— ఇది 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

భోగవర్ధని :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

భోగవరాళి :— 12 వ మేళకర్తయగు 'రూపవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

భోగవసంతము :— 51 వ మేళకర్త 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
[గా. లో.]

భోగశిఖామణి :— 7 వ మేళకర్తయగు 'సేనావతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
వక్రఔడవ—సంపూర్ణము. [స్వ. ప్ర. సా.]

భోగసామంతము :— 51 వ మేళకర్త 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ప స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

భోగసావేరి :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని.
ఇది నిషాదాంత్య రాగమునకు చెందును.

భోగి :— 7 వ మేళకర్తయగు 'సేనావతి' యొక్క జన్యరాగము. [సం. కా.]
ఆరోహణము— స గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

భోగిభైరవి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి గ రి స.

భోగిసింధు :— 48 వ మేళకర్త 'దివ్యమణి' యొక్క జన్యరాగము. [గా. లో.]
ఆరోహణము— స ప మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ స.

భోగీశ్వరి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
వక్రషాడవ—సంపూర్ణము. [ప. శే. గ్రం.]

భోగేశ్వరి :— ఇది 'భోగీశ్వరి' అను రాగమునకుగల మరియొక పేరు.

---

# మ

మ :— 'వెంకటమఖి' శుద్ధ మధ్యమమున కేర్పఱచిన సంకేతాక్షరనామము.

మ :— సప్తస్వరములలోని 4 వ రక్షమైన మధ్యమమునకుగల సంకేతాక్షరము.

మకరందతాళము :— "అష్టోత్తరశత" మగు 108 తాళములలో 42 వ తాళము నకు పేరు. దీనికి అంగములు 0 0 I I I 8. మాత్రలు 6. అక్షరకాలములు 24.

మకరన్దతాళము :—"రత్నాకర" గ్రంథ స్థమైన 120 దేశితాళములలో 47 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 0 0 I I I.

మకరిణి :— రాగాలాపనలో రంజక మైన యొక జీవస్వరమును స్థాయిగా జేసు కొని అచ్చట అల్పముగా సంచరించి యే దైన ఒక స్వరమున ముగించవలెను. తిరిగి ఆలాపించుటలో మొదటి స్థాయిస్వర మును జూపుచూ 3 సార్లు ఆలాపించి 4 వ సారి మంద్ర, తారస్థాయిల వఱకు సంచరించి మధ్య షడ్జమునందు ముగించు టను, భరతాచార్యులు "మకరిణి" అని చెప్పియుండెను.

మకుటధారిణి :— ఇది 22 వ మేళకర్త "ఖరహరప్రియ" యొక్క-జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

మ-గణము :— తాళఅంతర్గత అంగము లకు గల 8గణములలో మొదటిగణమునకు పేరు. దీనికి అంగములు 8 8 8. అనగా 3 గురువులు.

మంగళకరి :— 64 వ మేళకర్తయగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప స రి స.

మంగళక్రియ :— 53 వ మేళకర్తయగు "గమనశ్రమ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

మంగళగౌరి :— 3 వ మేళకర్తయగు "గానమూర్తి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

మంగళచంద్రిక :— 72 వ మేళకర్త యగు "రసికప్రియ" యొక్క-జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము—స ని ధ ప మ ధ మ గ రి స.

మంగళదేశిక :— 5 వ మేళకర్తయగు "మానవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

మంగళధన్యాసి :—10వ మేళకర్తయగు "నాటకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

మంగళధ్వని :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

మంగళనాయకి :—63వ మేళకర్తయగు "లతాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

మంగళప్రద :— 48 వ మేళకర్తయగు "దివ్యమణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

మంగళభూషణి :— 5 వ మేళకర్తయగు "మానవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ధ స ని స రి గ మ ప.
అవరోహణము— మ గ రి స ని ధ ప.

మంగళము :— కీర్తనపద్ధతి ననుసరించియు, పల్లవి, అనేక చరణములు గలిగియు ఆచరణము లన్నియు ఒకే ధాతుశైలిలో నుండు పవిత్రరచనకు గలపేరు. ఇదిదక్షిణ భారతములో ప్రతి సంగీతకచ్చేరిలోను, భజనలోను, హరికథా కాలక్షేపములోను చివర పాడి ముగింతురు. ఇది సంస్కృతములోనేగాక దక్షిణఇండియాలోని తదితర ముఖ్య భాషలందు గూడ గలవు. త్యాగరాజుని "నీ నామరూపములకు"అను మంగళము (సౌరాష్ట్రి-ఆది) యిందుకు ఒక ముఖ్యవుదాహరణయగును.

మగుడి :— పాములవాండ్రు పాములను పట్టుకొనునప్పుడుగాని, ఆడించునప్పుడుగాని వాయింపబడు నొకచిన్న సంగీత వాద్యమునకు తమిళములోని పేరు. దీనినే తెలుగుదేశములోనాగస్వరమనిచెప్పుదురు.

మఘోని :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

మంజరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
'త్యాగరాజు'ని 'పట్టివిడువరాదు' అను ప్రసిద్ధకృతి యీరాగములోని దగును.

మంజుళ :— 27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— ప స ని స రి గ మ ప.
అవరోహణము— మ గ రి స ని ధ ప.
ఇది పంచమాంత్య రాగమునకు చెందును.

మంజుళ :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది సంపూర్ణ జన్యరాగమునకు చెందును.

మట్టావన :— నవసంధి తాళములలోని 3 వ తాళమునకు గలపేరు.

మట్టికతాళము :—'అష్టోత్తరశత' తాళములగు 108 తాళములలో 59వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8 0 3. అక్షర కాలములు 22.

మంఠతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 38 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I I 8 +.

మంఠతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 38— B తాళమునకు పేరు. దీనికి అంగములు 8 I I (2) +.

మంతతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 38-D తాళమునకు పేరు. దీనికి అంగములు । । । । 8 । ।.

మర్త్యతాళము :— సప్తతాళములలో రెండవతాళమునకు గలపేరు. దీనికి అంగములు । 0 ।. ఇందుగల లఘువులు జాతినిబట్టిమారుచుండును. గనుక లఘువు త్రిశ్రాది పంచజాతులందు మారినప్పుడు 5 మర్త్యతాళములు వరుసగా 8, 10, 12, 16, 20 అక్షరకాలములను గలిగి యుండును.

మతిమచాపు :— పురాతనకాలములో వాడుకలోనున్న 'చాపుతాళము'లోని యొక రకమునకు పేరు. దీనికి అక్షరకాలములు 5. ఇది ఇప్పటి త్రిశ్రజాతి రూపకమునకు సరిపోవును. దీనికి అంగములు 0 ।. అనగా 1 ద్రుతము 1 త్రిశ్రలఘువు యగును. ఉ॥ స రి । స రి గ ॥ రి గ । రి గ మ ॥ వలెనుండును. దీనినే పూర్వీకులు 1 లయ(దెబ్బ) 1 విరామం(ఉసి) 1 లయ (దెబ్బ) 2 గురువులు (2 వ్రేళ్ళు)అని చెప్పియుండిరి. అనగా 1+1+1+2=5 అక్షరకాలములను గలిగి యుండును.

మతిమతాళము :— "పింగళనిగందు"చే పేర్కొనిన 9 తాళములలో 6వ తాళము.

మండమారి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ని స ధ ప మ రి గ స.
ఇది ఔడవ - వక్రసంపూర్ణ రాగమగును.

మండలాగ్రపాణి :— 17 వ మేళకర్త 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప రి స.

మండూకతానమ్ :— 'ఘనమ్' అను తానములోని 8 రకములలో 7 వ దానికిపేరు.

మణి :— 35 తాళములకుగల శ్రీకరాది నామములలో 'త్రిశ్రజాతి ధృవతాళము'నకుపేరు. దీనికి అంగములు । 0 । ।. అక్షరకాలములు 11.

మణిప్రవాళకీర్తన :— కైవార ప్రబంధము వంటి వివిధ రాష్ట్రభాషలలో సాహిత్యముగలయొకరకమైనరచనకుపేరు. ఇందు రెండులేక అంతకుమించిన భాషలలో సాహిత్యము రచింపబడియుండును. 'శ్రీ స్వాతి తిరునాళ్' 'శ్రీ ముద్దుస్వామి దీక్షితుల'వంటి ప్రఖ్యాత రచయితలు యిట్టి మణిప్రవాళకీర్తనలు రచించియుండిరి. ఉ॥ దీక్షితులవారి 'వేంకటాచలపతే' అను కర్నాటకకాఫిరాగము, ఆదితాళములోని రచన యిందుకు వుదాహరణమగును. దీనిలో తెలుగు, సంస్కృతము, తమిళము అనుమూడుభాషలుగలవు.

మణిమంజరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి గ మ గ స.

మణిమయ :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స ని స రి గ మ ప ధా.
అవరోహణము- ప మ గ రి స ని స.
ఇది ధైవతాంత్యరాగమునకు చెందును.

మణిరంగు :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.
ఈ రాగములో శ్రీ 'ముద్దుస్వామిదీక్షితుల' 'మామవ పట్టాభిరామ' త్యాగరాజుని 'రానిదిరాదు' అను ప్రసిద్ధ కృతులుగలవు.

మణ్ఠికతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 55 వ తాళమునకుగలపేరు. దీనికి అంగములు 8 0 3.

మణ్ఠికతాళము:—'సంగీతరత్నాకరము' లో పేర్కొనబడిన 120 దేశి తాళము లలో 55 - A తాళమునకు గలపేరు. దీనికి అంగములు 0 ◡ 0.

మతంగుడు :— 'బృహద్దేశి' అను ప్రాముఖ్యమైన సంగీత లక్షణ గ్రంథమును రచియించిన గ్రంథకర్తకుపేరు. ఈ గ్రంథమునందు వాయు, జంత్రములనుగూర్చియు, దేశీయరాగములను గూర్చియు వర్ణింపబడినది. ఇతడు శార్ఙ్గదేవునికంటె ముందువాడుగా తెలియుచున్నది.

మత్తకాశిని :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ధ ని స.
అవరోహణము- స ని ధ గ రి స.

మత్తకోకిల :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి ప ధ స.
అవరోహణము- స ధ ప రి స.
ఇది ఉభయ స్వరాంతర రాగమునకు చెందిన ముఖ్యవుదాహరణ మగును.

మత్తకోకిల :— సంగీతమునకు సంబంధించిన శాస్త్రము అంతగా అవసరములేని రోజులలో శృతులకు ప్రత్యేకమైన పేర్లుయిచ్చి జ్ఞప్తియందుంచుకొనుటకు తగినట్లు రచింపబడిన యొక సంస్కృత రచనకు పేరు.

మత్తగాంధారి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము- స గ మ ప ని ధ స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

మత్సరికృత :— షడ్జ గ్రామములోని 7 మూర్ఛనలలో 5 వ మూర్ఛనకుపేరు. దీనికి 'మ' ప్రారంభస్వరమగును.

మతి :— భావశాస్త్రములో చెప్పబడిన 'వ్యభిచారీభావము' లోగల 33 విధములలో 28 వ దానికి గలపేరు.

మదనతాళము :—శాస్త్రీయమైన అష్టోత్తరశత తాళములగు 108 టిలో 97 వ తాళమునకుపేరు. దీనికి అంగములు 0 0 3. మాత్రలు 4. అక్షరకాలములు 16.

మదనతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 79 వ తాళమునకుపేరు. దీనికి అంగములు 0 0 8.

మదనభూతి :— 32వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ రి ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

మదన్తి :— ద్వావింశతి శృతులగు 22 టిలో 18వ శృతియగు చతుశ్శృతి ధైవతమునకు పేరు. ఈశృతికి 'కల్యాణి రాగము' ముఖ్యవుదాహరణ మగును.

మదము :— వ్యభిచారీ భావములో గల 33 విధములలో 5వ దానికిగల పేరు.

మందహాసిని :— 52వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ మ రి స.

మంద్ర :— సామగాన స్వరములగు 'గా రీ సా నీ ధా పా' అను ఆఱుస్వరములలో 5వ స్వరమునకు పేరు. ఇది చతుశ్శృతి ధైవతమునకు సరిపోవును.

మంద్రము :—ఒక రాగము లేక అందు గల సంగతులను మధ్యస్థాయి క్రిందిస్వరములతో ఆలాపించునది మంద్రము లేక మంద్రస్థాయి ఆలాపనయని చెప్పబడును.

మంద్రము :— నాదము శరీరములో నుండి బయలువెడలుటలో హృదయము నందుండునపుడు 'మంద్రము' అని పేరు.

మంద్రస్థాయి :— పంచస్థాయిలలో 2వ దిగను, త్రిస్థాయిలలో మొదటిదిగను యుండు స్థాయికిగల పేరు. ఇది మధ్యస్థాయి క్రిందనుండును. దీనికి గుర్తుగా స్వరముల క్రింద చుక్క (.) వుండును.
ఉ॥ స రి గ మ ప ధ ని.

మంద్రస్థాయి స్వరస్పందనముల సంఖ్యలు :— మంద్రస్థాయిలోగల సప్తస్వరములకుగల స్పందనములకుపేరు. ఇవి వరుసగా ఒక సెకండుకు స–120. రి–128. గ–150. మ–160. ప–180. ధ–192. ని–225 స్పందనములను గలిగియుండును.

మందాకిని :—1వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని స.
అవరోహణము– స ని మ గ రి స.

మందారి :— 50వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.
ఇది షాడవరాగమునకు చెందును. త్యాగరాజుని 'పరలోక భయము' అను ప్రసిద్ధ మైనకృతి యీరాగములోగలదు.

మధ్య :— స్వీయనాయికలలోగల 3 భేదములలో 2వ దానికి పేరు. ఇది సమాన లజ్జకలదిగను, వృద్ధిజెందిన యౌవనముకలదిగను, సురతయోగ్యత కలదియై, నాయకుని యపేక్షించునదిగనుయుండును. మిగత రెండుభేదములు ముగ్ధ, ప్రగల్భయనునవి.

మధ్య :— ద్వావింశతి శృతులకు గల 5 జాతులలో 5వ దానిపేరు. మిగత 4 దీప్త, ఆయుత, కరుణ, మృదు యగును.

మధ్యక :— 'రాగతాళ చింతామణి' అను తెలుగు ప్రాచీన సంగీత లక్షణ గ్రంథములోగల 124 తాళములలో యితరులచే చెప్పబడని తాళములలో 10 వ తాళమునకు గలపేరు.

మధ్యతాళము :— శాస్త్రీయమైన 'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 47 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I I 8 I I I I. మాత్రలు 8. ఆవర్తమునకు అక్షరకాలములు 32.

మధ్యధీర :— 'మధ్య' అను నాయికలో గలుగు అవస్థాభేదములు 3 టిలో 1 వ దానికిగల పేరు. మిగత రెండును మధ్యాధీర, మధ్యధీరాధీర అనునవి.

మధ్యధీరాధీర :— మధ్య, అను నాయికలోగలుగు అవస్థాభేదములు 3 టిలో 3 వ దానికిగల పేరు. ఈమె అపరాధియగు నాయకుని కన్నీరొలుకునటుల వక్రోక్తులాడునదిగా నుండును.

మధ్యమ :— మధ్యమ గ్రామములోని 3 జాతులలో 2 వ దానికిగల పేరు.

మధ్యమకాలగానప్రవీణుడు :— గొప్ప తమిళ పద రచయితయగు 'శ్రీ ఘనం కృష్ణయ్యర్'కుగల గౌరవనామము. ఇతడు 'తానము' అత్యద్భుతముగా ప్రదర్శించుటచే గల్గినపేరని తెలియుచున్నది.

మధ్యమకాలము :— సంగీతమును నడుపు వేగములలో 2 వ వేగము లేక ద్వితీయగును.

మధ్యమకాల లేక తానమ్ :— ఊహాశక్తి చేత విస్తరింపజేయు మనోధర్మ సంగీతములోని ఒక భాగమునకుగల పేరు. దీనినే ఘనమ్, అనికూడ చెప్పుదురు. దీనిలోని రాగాభివృద్ధి, స్పష్టమైన ఆవర్తముల ద్వారా కాకపోయినను ఒక విధముగా కొలుచుటకు తగినట్లుండును. సాధారణముగా రాగాలాపనలో వుచ్చరించు త, ద, రి, న వంటి అక్షరముల మాదిరిగా యీ తానమ్ పాడుటలో 'అనంతా' అను భగవన్నామము వుచ్చరించుచూ త్రికాలము తానము పాడుదురు.

మధ్యమకాలసాహిత్యము :— కృతులలో నుండు రెండవ కాలముగల సాహిత్యమునకుపేరు. దీనిలో ధాతు, మాతులు రెండును మధ్యమకాలములో నుండును. సంగీతము ధారాళముగాను, కీవిగాను యుండును. కృతికి యీ మధ్యమకాల సాహిత్యము ప్రాణసమాన భాగమైనప్పటికిని అముఖ్యాంగముగనే పరిగణింపబడును. అంటే యిది లేనంతమాత్రమున కృతియని చెప్పుటకు యెట్టి అభ్యంతరము వుండదు. సంగీత రచనలయొక్క పారిభాషిక సౌందర్యమును పెంపొందించుటకు యేర్పడిన యీ మధ్యమకాల సాహిత్యము రచయిత యొక్క హృదయపూర్వకమైన ప్రయత్నా ఫలితమని చెప్పవచ్చును. ఇట్టి కృతులు రచించినవారిలో ముఖ్యులు శ్రీ సుబ్బరాయశాస్త్రి మొదలగువారు.

మధ్యమగ్రామజాతులు :— కచ్చేరిలందు వుపయోగింపబడు 7 జాతులలో షడ్జ గ్రామమునందలి 4 జాతులుగాక మిగత జాతులగు గాంధార, మధ్యమ, పంచమ అను 3 జాతులకు గలపేరు.

మధ్యమగ్రామమండలము :— మూర్ఛనయు వాని భేదములవలన గలుగు మేళములు అవిసంభవించుటకు హేతువైన స్వరసముదాయముయొక్క చేరికచే యేర్పడిన షడ్జ,మధ్యమ,గాంధారగ్రామమండలములు 3 టిలో 2వ దానికి గలపేరు. దానిని యీ ప్రక్క చూపుటను గమనించునది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మ | ప | ధ | ని | స | రి | గ |
| గ | మ | ప | ధ | ని | స | రి |
| రి | గ | మ | ప | ధ | ని | స |
| స | రి | గ | మ | ప | ధ | ని |
| ని | స | రి | గ | మ | ప | ధ |
| ధ | ని | స | రి | గ | మ | ప |
| ప | ధ | ని | స | రి | గ | మ |

మధ్యమగ్రామము :—అవరోహణ క్రమములో నుండు సామగాన స్వరములగు 'మ గ రి స ని ధ ప' అను 7 టికి పేరు.

మధ్యమగ్రామము :— 4+3+2+4+3+4+2=22. శృతులను కలిగిన స్వరసప్తకమునకు పేరు.

మధ్యమగ్రామ మూర్ఛనలు స్వరములు శృతులు రేషియోభిన్నములు :—

శృతులు— 3 4 2 4 3 2 4
సౌవీర—మ - ప - ధ - ని- స - రి - గ - మ
1- 10/9 - 5/4 - 4/3 - 3/2 - 5/3 - 16/9 - 2/1
4 3 4 2 4 3 2
హరిణాశ్వ—గ మ ప ధ ని స రి గ
1 9/8 - 5/4 - 45/32 - 3/2 - 27/16 - 15/8 - 2/1
2 4 3 4 2 4 3
కలోపనత—రి గ మ ప ధ ని స రి
1-16/15 - 6/5 - 4/3 - 3/2 - 8/5 - 9/5 - 2/1
3 2 4 3 4 2 4
శుద్ధమధ్య- స రి గ మ ప ధ ని స
1- 10/9 - 32/27 - 4/3 - 40/27 - 5/3 - 16/9 - 2/1
4 3 2 4 3 4 2
మార్గి- ని స రి గ మ ప ధ ని
1 - 9/8 - 5/4 - 4/3 - 3/2 - 5/3 - 15/8 - 2/1
2 4 3 2 4 3 4
పౌరవి—ధ ని స రి గ మ ప ధ
1 - 16/15 - 6/5 - 4/3 - 64/45 - 8/5 - 16/9 - 2/1
4 2 4 3 2 4 3
హృష్యక- ప ధ ని స రి గ మ ప
1- 9/8 - 6/5 - 27/20 - 3/2 - 8/5 - 9/5 - 2/1

మధ్యమము :— సప్తస్వరములగు 7టిలో మధ్యనుండు 4 వ స్వరమునకు గలపేరు. ఇది ముఖ్యముగా 2విధములు. 1శుద్ధమధ్యమము, 2 ప్రతిమధ్యమ మనునవి.

మధ్యమరాగము :— గీత, ప్రబంధ, ఠాయ, ఆలాపములు చేయుటకు యోగ్యముగా నుండియు అధిక ప్రచారములో లేని రాగమునకు గలపేరు.

మధ్యమశ్రుతి :— షడ్జ, మధ్యమ, పై షడ్జములయొక్క సంకలితధ్వనికి గలపేరు. సాధారణముగా ఇట్టిశ్రుతిని పంచమాంత్య, ధైవతాంత్య, నిషాదాంత్యమైన రాగము లనుగాని, రచనలనుగాని పాడునపుడు లేక వాయించునపుడు చేయుదురు.

మధ్యమశ్రుతిచేయువిధానము :—వయొలిన్‌లో పంచమశ్రుతిలోనుండు 'స్పా, ప్సా, సా, పా' స్వరములు పలుకు 4 తంత్రులలో2, 4తంత్రులగు మంద్రపంచమ, మధ్య పంచమములను 1 పూర్ణస్వరము తగ్గించి శుద్ధమధ్యమములుగా చేసినచో ప్మా, సా, మా, సా అను స్వరములుగా మారును. దీనినే మధ్యమశ్రుతి యందురు. ఇట్లే తంబురలో పా సా సా సా అనెడి స్వరములుపలుకు 4 తంత్రులలో మొదటిమంద్ర పంచమ తంతిని మంద్ర మధ్యమముగా ఒకపూర్ణస్వరము తగ్గించినచో మధ్యమ శ్రుతి యగును.

మధ్యమావతి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి స.
ఇదిఔడవరాగము. సురాగము. ఉపాంగ రాగము. త్యాగరాజుని కృతులగు వినాయకుని, వెంకటేశ, అలకలల్లలాడ, అనునవియు, శ్యామశాస్త్రుల 'పాలించు కామాక్షీ' కృతియు, దీక్షితుని 'ధర్మసంవర్ధనీ' అను కృతియు ఈ రాగములోని సుప్రసిద్ధ రచనలగును. ఈరాగము మోహనరాగము లోని చతుశ్శ్రుతి రిషభమును షడ్జముగ జేసికొని అదే స్వరస్థానములందు వాయించిన యేర్పడును. కచ్చేరీఅంత్యమునపాడుదురు.

మధ్యము :— నాదము కంఠమందుండు నపుడు హృదయమందుకంటె రెట్టింపుగా నుండుటచే గలుగుపేరు.

మధ్యలయ :— తాళమునకేర్పడియున్న అక్షరకాలములతో విళంబలయకురెట్టింపు వేగము గలిగి సమగతిగా పాడుటను'మధ్యలయ' అనబడును. దీనినే ఇంగ్లీషులో మీడియమ్‌టెంపో(Mediam Tempo) అని చెప్పుదురు.

మధ్యలయ భేదములు :— ఇవిమూడు విధములుగా నుండును. i మధ్యవిలంబిత. ii మధ్య మధ్య. iii మధ్య ద్రుతలయ అనునవి. వీటికి రెట్టింపు వేగములోనుండునవి ద్రుతలయ భేదములగును. అవి 3 విధములు. ద్రుతవిలంబిత, ద్రుతమధ్య, ద్రుత ద్రుతలయ అనునవి.

మధ్యషడ్జస్థాయి ఆలాపన :— రాగాలాపనలో మధ్యస్థాయిషడ్జములో ప్రారంభించి పైస్వరములను తాకకనే మంద్రస్థాయిలో సంచరించుచూ మంద్రషడ్జము వఱకుపోయి తిరిగి మధ్యషడ్జమునకు వచ్చి

ముగించుటకు గలపేరు. దీనినే 'ఆరోహణ స్థాయి సంచార' మనిచెప్పుదురు.

మధ్యసంగ్రహ మూర్ఛనలు :— తార స్థాయిలో సంచారములేని నిషాదాంత్య, ధైవతాంత్య,పంచమాంత్య రాగమూర్ఛన లకు గలపేరు.

మధ్యసప్తకము :— త్రిస్థాయిలగు 3 టి లో మధ్యనుండు సప్తస్వరములుగల భాగ మునకుగలపేరు. వీటికి గుర్తుయేమివుండదు.

మధ్యస్థాయి :— మంద్ర, తారస్థాయిల మధ్యనుండు సప్త లేక ద్వాదశ స్వర ములుగల ఒక భాగమునకు పేరు.

మధ్యస్థాయి స్వర స్పందనములు :— మధ్యస్థాయిలో నుండు సప్తస్వరములకు 1సెకండుకు యేర్పడు స్పందనముల వివర మునకుపేరు. వీటికి ఒకసెకండుకు స_240. రి_256. గ_300. మ_320. ప_360. ధ_384. ని_450 స్పందనములను గలిగి యుండును.

మధ్యాది తాళము :— ఒక విసర్జితము (ఊపి) మూడుఘాతలు (3 దెబ్బలు) గల దియు, నడచు వేగము అంతనెమ్మదిగా నుండక మొదటివిసర్జితములో ½ అక్షర కాలము వ్యవధిఅయిన వెంటనే సంగీత మును ప్రారంభించు తాళమునకుపేరు.

మధ్యాధీర :— మధ్యనాయికలలోగలుగు అవస్థాభేదములు 3టిలో 2వ దానికిపేరు.

మధుకరి :— 50 వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము. ఆరోహణము_ స రి గ మ ప ధ ని స. అవరోహణము_ స ని ధ ప మ గ రి స. ఇది జన్యసంపూర్ణ రాగమునకు చెందునట్టి ఒక రాగమగును.

మధుకరీ :—శార్ఙ్గదేవునిచే సంగీతరత్నా కరము'లో పేర్కొనబడిన 10 రకములగు వేణువులలో 5 వ రకము వేణువునకుపేరు.

మధురుఝంకారి :— 65 వ మేళకర్త 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము. ఆరోహణము_ స రి గ మ గ ప ని ధ ని స. అవరోహణము_ స ని ప మ గ రి స.

మధుర :— 35 తాళములకుగల శ్రీక రాదినామములలో'చతురశ్రజాతిఝంపె' తాళమునకు గల పేరు. దీనికి అంగములు I ∪ 0. అక్షరకాలములు 7.

మధుర :— 'భావభట్టుని' 22 శృతుల విధానములో రిషభమునకుగల 3 శృతుల లో మొదటిదానికి పేరు.

మధుర ప్రధానములు :— సంగీత, సాహిత్యములు రెండును సమాన ప్రాము ఖ్యముగలిగి,ఒక్కొక్కప్పుడుసాహిత్యము సౌందర్యమగు భావములను, గంభీరమగు ఆలోచనలను కలిగించునదిగా యుండు దానికి పేరు.

మధురము :— తారస్థాయిలో ప్రౌఢ ముగా ప్రదర్శించు గానమునకు పేరు.

మధురాలాప :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము. ఆరోహణము_ స రి గ ధ ని స. అవరోహణము_ స ని ధ గ రి స.

మధూళిక :— 26 వ మేళకర్తయగు 'చారుకేసి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

మధూళిక :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని మ గ రి స.

మనసిజప్రియ :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— సరిగమపధనిధపమధనిస.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

మనన :— నవసంధి తాళములలో 5 వ తాళమునకుగల పేరు.

మన్య :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

మన్ద :— 22 శృతులలో 3 వశృతియైన 'ద్విశృతి రిషభము'నకుగల పేరు. ఈశృతికి ఉ॥ మాయామాళవగౌళ రాగమగును.

మన్నారురంగ :— 17 వ శతాబ్దములో తెలుగులో అనేక కీర్తనములు, పదములు రచించిన 'శ్రీ ఘనమ్ శీనయ్య' యొక్క రచనలందలి 'ముద్ర'కు పేరు.

మనుష్యలఘువు :— 4 అక్షరకాలములు గల 'చతురశ్రజాతిలఘువు'నకుగల మరియొక పేరు.

మనోధర్మసంగీతము :— ఊహాశక్తినిబట్టి విస్తరింపజేయు సంగీతము నకుగల పేరు. అనగా ప్రదర్శకుడు తన ఊహా శక్తినిబట్టి అప్పటికప్పుడు స్వయముగా సృష్టించగలిగిన సంగీతము. ఇది 5 విధములుగానుండును. 1. రాగాలాపన. 2. తానమ్. 3. పల్లవి. 4. సాహిత్యప్రస్తారము లేక నిరవల్. 5. స్వరప్రస్తారము అనునవి. దీనికి యితరమైనది కల్పిత సంగీతమగును. అనగా యితరులచే రచింపబడిన సంగీత రచనలను కంఠస్థముచేసి ప్రదర్శించునట్టి సంగీతమునకు పేరు.

మనోధర్మసంగీతముగలవిదేశములు :— పర్షియా, అరేబియా, యూరప్ వంటి దేశములందుకూడ మనోధర్మ సంగీతము ప్రదర్శింపబడుటచే అట్టిదేశములకు పేరు. ఉ॥ యూరప్‌నందుగలజిప్సీలలోనిఆర్కెస్ట్రాలోనుండు గాయకులును, సీనియర్ వయొలినిస్టులును కలిసి 'మనోధర్మసంగీతము'ను 15 నుండి 20 నిమిషముల వఱకు ప్రదర్శించుచుందురని తెలియుచున్నది.

మనోరంజని :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

మనోరంజని :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప ధ మ గ రి స.

మనోహరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము,

ఆరోహణము- స గ రి గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

మయూరతానము :— ఘనమ్, అను తానములోని 8 విధములలో 5 వ రకము నకు చెందిన తానమునకు పేరు.

మయూరధ్వని :—44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ని ధ ప మ పగరిస.

మయూరధ్వని :—45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

మయూరమౌళి :—32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ రి స.

మయూరి :— సంగీత వాద్యములలో తంత్రీ సంబంధమైన యొక రకపు వాద్యమునకు పేరు. దీనిని 'నెమలి ఫిడేలు' అని చెప్పుదురు. ఈవాద్యము భారతదేశ స్త్రీలకు యెక్కువ యిష్టమైనదిగానుండును.

మరకతభూషణి :— 38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

మరణము :— వ్యభిచారీభావములోగల 33 విధములలో 31 వ దానికి 'మరణమని' చెప్పబడును.

మర్కటతానము :— 'ఘనమ్' అని చెప్పబడు తానములోని 8 రకములలో 4 వ దానికిగల పేరు.

మర్మక :—'రాగతాళచింతామణి' అను ప్రాచీన తెలుగు గ్రంథమునందు పేర్కొనబడిన 124 తాళములలో యితరులచే చెప్పబడని తాళములలో 5వ దానికి పేరు.

మరాళగామిని :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

మరాళధ్వని :— 2 వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

మర్లా :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది ఔడవ - సంపూర్ణరాగమునకు చెందును. [సం. స్వ. ప్ర. సా.]

మరీచిక :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

మరుత్తి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

మలయజలేపిని :— 7 వ మేళకర్తయగు 'సేనాపతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

మలయమారుతము :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.
ఇది షాడవరాగము. ఏకస్వరవర్జరాగము. త్యాగరాజుని 'మనసా ఎటులోర్తునే' అను ప్రసిద్ధ కృతి ఈ రాగములోనిదైయున్నది.

మలహారం :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స ని స గ రి మ ప ని ధనిస.
అవరోహణము- స ని ధ పమగరిసనిధనిస.

మల్లతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 64 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు
। । । । ◡ 0 0.

మల్లతాళము :— 'అష్టోత్తర శతతాళము' లగు 108 టిలో 64 వ తాళమునకుగల పేరు.
దీనికి అంగములు । । । । 0 0 ◡.
మాత్రలు 5¼. అక్షరకాలములు 21.

మల్లారు :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ మ ప ధ ప స.
అవరోహణము- స ధ ప మ రి స.
ఇది వక్రషాడవ — ఔడవరాగమునకు చెందును. [సం. స్వ. ప్ర. సా.]

మల్లికామోదతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 43 వ తాళము పేరు. దీనికి అంగములు
। । 0 0 0 0.

మల్లికామోదతాళము :— 'అష్టోత్తర శతతాళము' లగు 108 టిలో 33 వ తాళమునకు పేరు. దీనికి అంగములు । । 0 0 0 0.
మాత్రలు 4. అక్షరకాలములు 16.

మల్లికామోది :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

మల్లిఖార్జున :— తెలుగులో శృంగార రసపదకవియగు 'శ్రీ మల్లిఖార్జునుడు' తన రచనలందుయేర్పఱచుకొనిన ముద్రకు పేరు.

మహతీవీణ :— మహామునియైన 'నారదుడు' వాయించినట్లుగా చెప్పబడుచున్న పవిత్రమగు నొక 'వీణ' కుగల పేరు.

మహదేవనట్టువనార్ :— యూరపియన్ వాద్యమైన 'క్లారినెట్'ను మొట్టమొదట నేర్చుకొని చిన్న మేళములో ప్రవేశపెట్టి భారతీయ సంగీతమును కడు నేర్పుతో ప్రదర్శించినట్టి 19వ శ. మునకుచెందిన యొక దాక్షిణాత్య గాయకునికిగల పేరు.

మహా :— 1844-1893 కాలమునకు చెందిన 'శ్రీ వైద్యనాథయ్యార్' 12 వ యేటనే ప్రదర్శించిన అద్భుత గానకళాకౌసల్యమునకును, హరికథా కాలక్షేపమునకును 'శ్రీ సుబ్రహ్మణ్య దేశికారు' యిచ్చెరువొంది

రొసగిన బిరుదు. అప్పటినుండి యితడు మహా వైద్యనాథయ్యర్ అని పిలువబడెను. మరియు నితడు 72 మేళకర్తలతో గొప్ప మాలికను రచించి చిరకీర్తినొందెను.

మహానందతాళము:—'అష్టోత్తరశతతాళము'లగు 108 టిలో 42వ తాళమగు'మకరంద తాళము'నకుగల రెండవపేరు. దీనికి అంగములు 0 0 I I I 8. మాత్రలు 6. అక్షరకాలములు 24.

మహాపాతాళము :— తాళప్రస్తారములు 14 టిలో 4వ దానికిగల పేరు.

మహామహేశ్వరాచార్య :— నారదుని 'సంగీతమకరందము'లో పేర్కొనిన భరతుని నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించినట్టి 'అభినవగుప్తుని'కి యివ్వబడిన గౌరవ నామము.

మహావ్రజ :— మార్గాదిసప్త తాళ అలంకారములలో 2వ దానికిగల పేరు.

మహిళ :— 6వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

# మా

మా :—వెంకటమఖి కల్పించిన 12 మేళచక్రములలో ప్రతి మేళచక్రమునందుగల 6 మేళములలో 5వ మేళకర్తకుగల సంకేతాక్షరనామము. ఇట్టివి72మేళకర్తలలో 5, 11, 17, 23, 29, 35, 41, 47, 53, 59, 65, 71 సంఖ్యలుగల మేళకర్తలగును. వీటిని 'మా' మేళకర్తలందురు.

మాగతరంగిణి :—65వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ రి గ రి స.
ఇది షాడవ - వక్రసంపూర్ణ రాగమగును.

మాగధశ్రీ :— 10వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి మ ప ధ స.
అవరోహణము- స ని ప గ స.
ఇది వక్రషాడవ - స్వరాంతరరాగమగును.

మాగధి :— 'భరతుడు' 'నాట్యశాస్త్రము'లో పేర్కొనిన 'నాట్యము'నందుపయోగించు 4 విధములగు గీతికలలో మొదటి దానికిగల పేరు.

మాగధి :—34వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

మాంజి :— 20వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ ప గ రి స.
ఈరాగమును 'గానభాస్కరము'లో ఇదే మేళకర్తలో స గ రి గ మ ని ధ ని స — స ని ధ ప మ ప గ రి స అని పేర్కొనబడినది. కాని యిది తదితర గ్రంథములకు విరుద్ధముగనున్నది. శ్రీ శ్యామశాస్త్రి యొక్క

'బ్రోవవమ్మ తామసమేలేదేవి' అను ప్రసిద్ధరచన యీ రాగములోనిదైయున్నది.

మాండొలిన్ (Mandoline) :— తంత్రీవాద్యములలోని 3 విధములలో రెండవ రకమునకు చెందిన సంగీత వాద్యము పేరు. ఇది తంత్రులను ప్రేళ్ళతోమీటి ధ్వని జనింపజేయు వాద్యముగానుండును.

మాతంగ :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో పేర్కొనబడిన 'చతురశ్రజాతి త్రిపుటతాళము'నకుగల పేరు. దీనికి అంగములు । 0 0. అక్షరకాలములు 8.

మాతంగగామిని :— 10వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స గ మ ప ధ ని స. అవరోహణము- స ని ధ ప మ గ స.

మాతంగతాళము :— అష్టోత్తరశతమను 108 తాళములలో 97వ మదనతాళమునకు గల రెండవ పేరు. దీనికి అంగములు 0 0 3. మాత్రలు 4. అక్షరకాలములు 16.

మాత్ర :— షడంగములలో 3వదైన లఘువునకుగల 4 విశేషనామములలో మొదటిదాని పేరు.

మాత్ర :— సంగీతకాలమును తెలిసికొను ఒక యూనిట్ లేక నిర్ణీతమైన కాలపరిమాణమునకు పేరు. దీనికి అక్షరకాలములు 4.

మాతు :— సంగీత రచనలందలి పదములు లేక సాహిత్యభాగమునకుగల పేరు.

మాతురంజని :— 3వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ ప ధ ని స. అవరోహణము- స ని ధ ప మ గ రి స. ఇది షాడవ-సంపూర్ణరాగమునకు చెందును.

మాతృకపదము :— గీతములందుగల సాహిత్యములో కనుపడు అఇయ్యా, తిఇయ్యా, అఇయ్యాం, వఇయ్యా అనునటువంటి పదజాలమునకుగల పేరు. ఉ॥ "మీనాక్షీజయకామాక్షీ" అను శ్రీరాగములోని గీతముయిందుకొక ముఖ్యవుదాహరణమగును.

మాధవకల్యాణి :— 10వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ ప ధ స. అవరోహణము- స ని ధ ప మ గ రి స. ఇది ఔడవ-సంపూర్ణరాగమునకు చెందును.

మాధవకల్యాణి :— 65వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ధ స. అవరోహణము- స ని ధ ప మ గ రి స.

మాధవప్రియ :— 12వ మేళకర్తయగు 'రూపవతి' యొక్క జన్యరాగము. ఆరోహణము- స గ మ ప ధ ని స. అవరోహణము- స ని ధ ప మ గ స.

మాధవమనోహరి :— 22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.

ఆరోహణము_ స గ రి గ మ ని ధ ని స.
అవరోహణము_ స ని ధ మ ప ధ మగరిస.
దీక్షితులవారి 'మహాలక్ష్మీకరుణారస' అను నది ఈ రాగములోని ప్రసిద్ధకృతియగును.

మాధవమనోహరి :— 57 వ మేళకర్త యగు 'సిమ్హేంద్రమధ్యమము' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము_ స గ రి గ మ ప ని ధ ని స.
అవరోహణము_ స ని ధ మ గ రి స.

మాధవశ్రీ :— 9 వ మేళకర్త యగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స గ రి గ మ ధ ని ధ స.
అవరోహణము_ స ని ధ ప మ గ రి స.
ఇది వక్రషాడవ - సంపూర్ణ రాగమగును.

మాధవి :— 21 వ మేళకర్త యగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ స మ గ మ ప ధ ని స.
అవరోహణము_స ని ధ ప మ స మగరిస.

మాధుర్య :— 27 వ మేళకర్త యగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_ ప ని స రి గ మ ప.
అవరోహణము_ మ గ స ని ధ ప.
ఇది పంచమాంత్యరాగమునకు చెందును.

మాన :— 35 తాళముల పట్టికలోని 14 వ తాళమగు "చతురశ్రజాతి ఏకతాళ ము"నకుగల పేరు. దీనికి అంగములు 1. అక్షరకాలములు 4.

మానరూపి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము_ స రి గ మ ధ ని ప ని స.
అవరోహణము_ స ని ధ మ గ స.
ఇది వక్రసంపూర్ణ - ఔడవరాగమునకు చెందును.

మానవగాత్రస్థాయిలు :—సాధారణముగా మానవుల గాత్రములందుబలుకు త్రిస్థాయి లగుమంద్ర, మధ్య, తారస్థాయిలకుగల పేరు.

*మానవతి :—72 వ మేళకర్తలలో 5 వ మేళకర్తకుగల పేరు. ఇది 1 వ 'ఇందు' చక్రములోని 5 వ మేళమగును.
ఆరోహణము_ స రి గ మ ప ధ ని స.
అవరోహణము_ స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి - శు. గాం - శు. మ - చ. ధై - కా. నిషాద స్వరములుండును.

మానసపూజకీర్తన :—శ్రీ త్యాగరాజుని ప్రియ శిష్యుడైన 'శ్రీ వీణకుప్పయ్యర్' చే రచింపబడిన యొక మనోహరమైన సంగీత రచనకుగల పేరు.

మానసేకగామిని :— 16 వ మేళకర్త యగు 'చక్రవాకము' యొక్క జన్యమైన ఔడవరాగము. ద్విస్వరవర్జము.
ఆరోహణము_ స రి గ మ ని స.
అవరోహణము_ స ని మ గ రి స.

మానహేరాళి :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము_స రి మ ప ధ మ ని ధ ని స.
అవరోహణము_ స ని ధ ప మ గ రి స.

మానాభరణి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప మ ధా ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

మానిని :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

మానిని :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

మాయాతరంగిణి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి మ గ ప మ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

*మాయామాళవగౌళ :— 72 మేళకర్తలలో 15 వ మేళకర్తరాగమునకుగల పేరు. ఇది 3 వ 'అగ్నిచక్రము'లోని 3వ 'గో' మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి — అం. గాం — శు. మ — శు. ధై — కా. నిషాదస్వరములుండును. ప్రారంభ సంగీత విద్యాభ్యాసకులకు స్వరావళ్యాది అలంకారములవఱకు ఈరాగములోనే నేర్పుదురు. 'త్యాగరాజు'ని "మేరుసమానధీర" "తులసీదళములచే" 'దేవీ శ్రీ తులశమ్మ' అను రచనలును, శ్రీ 'పొన్నయ్యపిళ్ళై' యొక్క 'మాయాతీతస్వరూపిణి' అను రచనయు యీరాగములోని ప్రసిద్ధకృతులు అగును.

మాయావినోదిని :— 34 వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

మాయాస్వరూపిణి :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

మారతరంగిణి :—72 వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని ప ని స.
అవరోహణము— స ప మ గ రి స.
ఇది వక్రషాడవ-ఔడవమునకు చెందును.

మారనారాయణి :— 50 వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము. వక్రషాడవ—రాగమునకుచెందును.
ఆరోహణము— స గ రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి గ స.

*మారరంజని :—72 మేళకర్తలలో 25 వ మేళకర్త రాగమునకుగల పేరు. ఇది 5 వ 'బాణ' చక్రములోని మొదటి 'పా' మేళమగును. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక చ. రి—అం. గాం — శు. మ — శు. ధై — శు. నిషాద స్వరములుండును. త్యాగరాజుచే రచింప

బడిన 'మనసాశ్రీరాముని' అను ప్రసిద్ధ కృతి యీరాగములోనిదైయున్నది.

మార్గక్రియలలోనినిశ్శబ్దక్రియలు :—ఆవాపము, విక్షేపము, నిష్క్రామము, ప్రవేశము అను 4 టికిగల పేరు.

మార్గక్రియలలోని సశబ్దక్రియలు :—ధృవము, శమ్యము, తాళము, సన్నిపాతము అను 4 టికిగల పేరు.

మార్గతాళకళలు :— ఏకకళ, ద్వికళ, చతష్కళ, అను మూడింటికిగల పేరు.

మార్గతాళములు :— చచ్చత్పుట, చాచపుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్టక, ఉద్ఘట్ట, అను 5 తాళములకుగల పేరు. ఇవి అష్టోత్తర శతతాళములగు 108 టిలో మొదటి పంచతాళములగును.

మార్గదర్శి :— ప్రాచీన వాగ్గేయకారులలో నొకడైన శ్రీ 'శేషయ్యంగారి'కి గల ప్రఖ్యాత బిరుదుయొక్క పేరు. ఈయన 'కోసల' ముద్రతో సంస్కృతములో అనేక కీర్తనముల రచించెను. ఉ॥ 'ఇక నన్నుబ్రోవకున్న' అను భైరవి రాగము ఆదితాళములోని కృతి వీరి ప్రసిద్ధరచనలకు ఒక ముఖ్యవుదాహరణమగును.

మార్గదేశి :— ఇది 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ మ ప గ రి స.
ఇది ఔడవ — వక్రషాడవ రాగమునకు చెందును.

మార్గనృత్యము :— ఆంగికాభినయము, యేకోనపంచాశద్భావ సహితంబైన నటనమును 'మార్గనృత్య'మని చెప్పుదురు.

మార్గభద్ర :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ధ ప గ రి స.

మార్గము :— ఒక తాళమునందు సంగీతమును నడుపుటలోగల క్రమమునకు పేరు.

మార్గము :— తాళదశ ప్రాణములగు 10 టిలో 2 వ దానికి పేరు. ఇది ఒకటికొకటి ద్విగుణీకృతములైన కాల ప్రమాణములతో పాడుటకుగల పేరు. ఇది మూడు విధములు. 1. దక్షిణము 2. వార్తికము 3. చిత్రము అనునవి. వీటినే ప్రథమ, ద్వితీయ, తృతీయ కాలములు లేక త్రికాలమనియు లేక విళంబ, మధ్య, ద్రుత కాలములనియు చెప్పుదురు. వీటినే శార్ఙ్గదేవుడు 4 విధములుగను, కల్లినాథుడు 9 విధములుగాను, మరికొన్ని గ్రంథములలో 6 విధములుగాను చెప్పబడియున్నది.

మార్గరాగము :— శార్ఙ్గదేవునిచే పేర్కొనబడిన రాగవిభజనలోని 2 విధములలో 1 వ దాని పేరు. ఇది ఆఱు విధములుగానుండును. i గ్రామరాగము. ii ఉపరాగము. iii శుద్ధరాగము. iv భాషారాగము. v విభాషరాగము. vi అంతరభాషారాగములనునవి. వీనికి అన్యమైనవి దేశరాగములగును. అవి i రాగాంగ ii ఉపాంగ iii భాషాంగ iv క్రియాంగ రాగములగును.

మార్గశుద్ధము :— చచ్చుత్పుటవంటి తాళములకుగల పేరు. దీనికి అంగములు 88।3. ఇది పంచతాళములలో మొదటిదగును.

మార్గసంకీర్ణతాళములు :— రెంటికంటె యెక్కువతాళములు కలిసి యేర్పడు తాళములకుగలపేరు. ఉ॥ మార్గతాళము, సంకీర్ణ తాళములు కలిసి యేర్పడునట్టిది ఉద్ఘట్ట తాళమగును. ఆదితాళము, అభంగతాళము, వాయువిక్రమ తాళము కలిసి యేర్పడునట్టిది 'వినాయక' తాళమగును.

మార్గసంకీర్ణము :— సింహానందన తాళము వంటి వివిధతాళముల మిశ్రమముగల తాళములకుగల పేరు. దీనికి అంగములు 88।3।80088।3।38।।+. అక్షరకాలములు 128.

మార్గసంగీతము :— బ్రహ్మసంకల్పముచే గలిగినదియు, పరమశివుని సముఖమున భరతమునిచే చెప్పబడినదియు, మోక్షప్రదంబైనదియునైన సంగీతమును మార్గసంగీమని చెప్పుదురు. ఇది దేవలోకమున దేవతలవల్లను తదుపరి భరతాదులవల్లను యభ్యసింపబడి వెలయుచున్నది.

[రాగవిబోధము]

మార్గసంగీతము :— ప్రాచీన సంగీత లక్షణకారులచే యేర్పాటుచబడిన లక్ష్యలక్షణ సమన్వితమైన రాగములను, రచనలను, గానముచేయుట 'మార్గసంగీతము' మని చెప్పబడును.

మార్గసాలగము :— రెండేసి తాళములు కూడి యేర్పడు తాళములకు పేరు. ఉ॥ కీర్తితాళము. దీనికి అంగములు 8।3813. అక్షరకాలములు 4౹. ఇది రెండు 'కోకిలప్రియ తాళములు' చేరి యేర్పడినదగును.

మార్గహిందోళము :— 20వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము. ఆరోహణము— స రి గ మ ప ధ ని స. అవరోహణము— స ని ధ ప మ గ స. త్యాగరాజుని 'చలమేలరా' అను ప్రసిద్ధ కృతి యీ రాగములోనిదగును.

మార్జనీ :— ద్వావింశతి శృతులగు 22 శృతులలో 13వ శృతియగు 'చ్యుతపంచమము'నకుగల పేరు. వరాళి, రామప్రియ మొదలగు రాగములు యిట్టి శృతి గల రాగములకు వుదాహరణములగును.

మార్దంగికుడు :— లయవాద్యములలో ముఖ్యమగు చర్మవాద్యములకు సంబంధించిన మృదంగ వాద్యమును వాయించువానికిగల పేరు.

మార్దవము :— ఉద్దీపన విభావములలో నొక భాగమైన గుణములందలి 7 విధములలో 6వ దానికిగల పేరు.

మార్తాండప్రియ :— 42వ మేళకర్త యగు 'రఘుప్రియ' యొక్కజన్యరాగము. ఆరోహణము— స గ మ ప ధ ని స. అవరోహణము— స ని ధ ప మ గ స.

మార్గి :— మధ్యమగ్రామములోని 7 మూర్ఛనలలో 5వ మూర్ఛనకుగల పేరు. ఇది నిషాదస్వరముతో ప్రారంభమగును.

రాగిణి :— హిందుస్థాని సంగీత విభజన లోని స్త్రీ రాగము లేక పురుషుని యొక్క భార్య రాగమునకు గల పేరు. ఇవి 6X5=30 రాగిణి రాగములుగా చెప్ప బడినవి.

రాజ :— 35 తాళములలో 'ఖండజాతి రూపకతాళము'నకు పేరు. దీనికి అంగములు 0 ।. మాత్రలు $1\frac{3}{4}$. అక్షరకాలములు 7.

రాజకంధి :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

రాజచింతామణి :— 8 వ మేళకర్తయగు 'హనుమత్తోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

రాజచూడామణితాళము :—అష్టోత్తరశత తాళములగు 108 టిలో 23 వ తాళము పేరు. దీనికి అంగములు 0 0 । । 0 0 । 8. మాత్రలు 8. అక్షరకాలములు 32.

రాజచూడామణితాళము :—'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 22 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 । । 0 0 । 8.

రాజతాళము :— అష్టోత్తరశత తాళము లగు 108 టిలో 24 వ తాళము పేరు. దీనికి అంగములు 8 3 0 0 8 । 3. మాత్ర లు 12. అక్షరకాలములు 48.

రాజతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 25 వ తాళము పేరు. దీనికి అంగములు 83008 । 3.

రాజతిలకము :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ప మ గ రి స.

రాజనారాయణతాళము :—'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 96 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 । 8 । 8. మాత్రలు 7. అక్షరకాలములు 28.

రాజనారాయణతాళము :— తురంగలీల, ఢేంకి, అను తాళములు రెండును కలిసి యేర్పడుమార్గసాలగ తాళమునకుగల పేరు.

రాజమార్తాండతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 118 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8 । 0.

రాజముద్రరచయిత :—'శ్రీతంజావూరు వీరభద్రయ్య' ప్రతాపసింహ మహారాజ అంకితముగా అనేక కీర్తనలు రచించుటచే నట్టివారికి గలిగిన పేరు.

రాజమృగాంకతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 117 వ తాళము పేరు. దీనికి అంగములు 0 0 । 8.

రాజరంజని :— 7 వ మేళకర్తయగు 'సేనావతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ని ప గ రి స.

రాజవిద్యాధరతాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 46 వ తాళము నకుగల పేరు. దీనికి అంగములు I 8 O O. మాత్రలు 4. అక్షరకాలములు 16.

రాజవిద్యాధరతాళము :— 'రత్నాకర' గ్రంథములో పేర్కొనబడిన 120 దేశి తాళములలో 41 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I 8 O O.

రాజసారంగ :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి గమరిస.

రాజసుందరి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ని స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

రాజాసెర్ఫోజి :— ఇతడు జర్మనీ మిష నరియగు 'స్క్వార్జ్' (Schwartz) అనువాని యొద్ద యూరపియన్ సంగీతము నేర్చుకొని దాని సహాయముతో ప్రఖ్యాతిగాంచిన తంజావూరు బ్యాండును నిర్మించిన మహనీయుడు.

రామ :— శ్రీ శ్యామశాస్త్రి శిష్యులైన 'శేషాచలభాగవతులు' తెలుగులో రచించిన కృతులలో పెట్టుకొనినముద్ర పేరు.

రామకలి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. వక్రషాడవ - సంపూర్ణము.
ఆరోహణము— స రి గ మ గ రి గ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

రామక్రియ :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ ధ మగరిస.

రామకుంతలి :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు చెందును.

రామకుసుమావళి :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము. వక్రషాడవ - సంపూర్ణము.
ఆరోహణము— స గ మ ప ని ధ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

రామగిరి :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ధ ప మ గ రి స.

రామచూడామణి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

రామదాసు :— 16 వ శతాబ్దమునందు భద్రాచలము తహశీలుదారుగానుండిన

గోపన్న శ్రీరామభక్తుడగుటచే గల్గిన గౌరవ నామము. ఇతడు నైజామ్ సర్కారువారి 6 లక్షల ధనము ఖర్చుచేసి శ్రీరామచంద్రునికి గుళ్ళు, గోపురములు కట్టించి వస్త్ర వాహనములు ఆభరణములు చేయించినందున తానీషాచే 12 సంవత్సరములు బందిఖానలో నుంచబడినపుడు ఆబాధలకు తాళలేక శ్రీరామచంద్రుని అనేకవిధములుగా భక్తిపూరితములైన కీర్తనలతో ప్రార్థించి విముక్తినొందిన మహనీయుడు.

రామనాటకము :— (1711 — 1778) కాలమువాడగు శ్రీ 'అరుణాచలకవిరాయర్' చే తమిళమునందు కీర్తనలుగా వ్రాయబడిన ఒకనవీన నాటకగ్రంథమునకు పేరు. ఈగ్రంథకర్త కనకాభిషేకమందెను.

రామనాథపురము శ్రీనివాసఅయ్యంగార్ :- సుప్రసిద్ధ వాగ్గేయకారుడును అనేక వర్ణములు, కృతులు, జావళీలు, తిల్లానాలు రచించిన కీ|| శే|| శ్రీ పూచిఅయ్యంగార్ అనబడువారియొక్క అసలుపేరు. ఈయన నేటి ప్రఖ్యాత సంగీత విద్వాంసుడగు శ్రీ ఆరియకుడి రామానుజయ్యంగారి యొక్క గురువు యగును.

*రామప్రియ :— 52 వ మేళకర్తరాగమునకుగల పేరు. ఇది 9 వ 'బ్రహ్మ' చక్రములోని 4 వ మేళమగును.

ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఇందు షడ్జ — పంచమములుగాక శు. రి — అం. గాం — ప్ర. మ — చ. ధై — కై. నిషాదస్వరములుండును. త్యాగరాజుని 'సందేహమును' అను కృతియు పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ యొక్క 'కోరినవరముసగుమయ్యా' అను కృతియు యీ రాగములోని ప్రసిద్ధకృతులు యగును.

రామపురము :— తెలుగుపద కవులగు శ్రీ శివరామపురమువారి పదరచనలందుగల ముద్రకు పేరు.

రామమనోహరి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స రి స.

త్యాగరాజుని 'సీతామనోహర' అను కృతి యీ రాగములోని ప్రసిద్ధరచన యగును.

రామమూర్తి :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది ఔడవ — సంపూర్ణరాగమగును.

రామవరాళి :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

రామానందతాళము :— శ్రీ రఘునాథనాయకుని'చే కల్పించబడిన ఒక క్లిష్టమైన తాళమునకు గలపేరు.

రామామాత్యుడు :— 16 వ శతాబ్దమునకు చెందినట్టి 'స్వరమేళ కళానిధి' అను సంగీత గ్రంథకర్తకు గలపేరు. ఇతడు ఆంధ్రుడు. గుంటూరుజిల్లా కొండవీడు గ్రామము. విజయనగరరాజగు శ్రీ 'రామ

దేవరాజు' కోరికపై ఇతడీగ్రంథము వ్రాసినట్లు చెప్పుదురు. దీనిలో జనక, జన్యరాగపద్ధతియును, ఉత్తమ, మధ్యమ, అధమ రాగవిభాగమును చేసెను. ఇప్పటి 4తీగల వీణ ఈతనికాలములోనే వెలువడి నట్లు ప్రతీతిగలదు. ఇతనికి 'అభినవ భరతాచార్య' అను ప్రసిద్ధ బిరుదు కలదు.

రామాష్టపది :— 'శ్రీజయదేవకవి' రచించిన అష్టపదిరచనల ననుసరించి 'రామకవి' రచించిన అష్టపదుల గ్రంథమునకు గలపేరు.

రాయువంకోలతాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 80 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8।800. మాత్రలు 6. అక్షరకాలములు 24.

రాయువంగోలతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 72వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8।800.

రావణహస్తము :— ఇప్పటి వయొలిన్ (ఫిడల్) వాద్యమునకు సరిపోవునదిగా పూర్వము రావణునిచే నిర్మింపబడినట్లు చెప్పబడు వాద్యమునకు పేరు. ఈ రావణ హస్తమునే తదుపరి తగు మార్పులుచేసి నేటి వయొలిన్ వాద్యముగా అభివృద్ధి చేయబడెనని ప్రతీతి గలదు.

# రి

రి :— రిషభములోని 3 రకములలో 2వ దైన "చతుశ్ర్శుతి రిషభము" నకు వెంకటమఖి పెట్టిన సంకేతాక్షర నామము.

రిపు :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములోని కటపయాది సంఖ్యగల "ఖండజాతి మఠ్యతాళము"నకు గలపేరు. దీనికిఅంగములు ।0।. అక్షరకాలములు12.

*రిషభప్రియ :— 62 వ మేళకర్తరాగమునకు గలపేరు. ఇది 11వ"రుద్ర" చక్రములోని 2 వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక చ. రి — అం. గాం — ప్ర. మ — శు. ధై — కై. నిషాద స్వరములుండును.

రిషభము :— సప్తస్వరములలో రెండవ స్వరమునకు గలపేరు. ఇది మూడువిధములుగా నుండును. 1. శుద్ధరిషభము, 2. చతుశ్ర్శుతి రిషభము, 3. షట్శ్రుతి రిషభము అనునవి.

రిషభవాహిని :— 42 వ మేళకర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

రిషభాంగి :— 2 వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స

రింకారి :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ రి స.

రీతిగౌళ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ని ధ మనినిస.
అవరోహణము- స ని ధ మ గమపమగరిస.
ఈరాగమున శ్రీవీణకుప్పయ్యర్ యొక్క 'వనజాక్ష' అను అటతాళవర్ణమును, శ్రీ త్యాగరాజుని ద్వైతము సుఖమా, నన్ను విడచికదలకురా, రాగరత్నమాలికచే అను కృతులును, శ్రీసుబ్బరాయశాస్త్రి యొక్క జననీనిన్నువినా, అను కృతియును మిగుల ప్రసిద్ధ రచనలగును. ఇది ఉభయ వక్ర షాడవ - సంపూర్ణమగును.

రీతిచంద్రిక :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

రీతిమల్లారు :— 72 వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ని ప ధ ని ప మ గస.

# రు

రు :— సప్తస్వరములలో రెండవదైన రిషభస్వరములోని 3 రకములలో 3వదైన 'షట్ శృతి రిషభము' నకు 'వేంకటమఖి' పెట్టిన సంకేతాక్షరనామము.

రుక్మాంగి :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ని స.
అవరోహణము- స ని ప గ రి స.

రుక్మాంబరి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ని స.
అవరోహణము- స ని ప గ రి స.

రుగ్మసంధిని :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము. వక్రసంపూర్ణ - షాడవము.
ఆరోహణము- స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

రుచిరమణి :— 62 వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ధ ప మ గ రి స.
ఇది వక్రషాడవ - షాడవమగును.

రుచిరాంగి :— 36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ రి స.
ఇది ద్విస్వర వర్జరాగమగును.

రుద్ర :—ఇదియొక మేళచక్రమునకు పేరు.

రుద్ర :— 72 మేళకర్తలకు వేంకటమఖి యేర్పఱచిన 12 చక్రములలో 11 వ చక్రమునకు గలపేరు. ఇందు 61 నుండి 66 వరకు ప్రతి మధ్యమ మేళకర్తలు వుండును.

రుద్ర - గో :—11వ 'రుద్ర' చక్రములోని 3 వ మేళమగు 'లతాంగి'కి గల సంకేత నామము. ఇది 63 వ మేళకర్తయగును.

రుద్ర - పా :—11 వ "రుద్ర" చక్రము లోని మొదటిమేళమగు 'కాంతామణి' కి వెంకటమఖి పెట్టిన సంకేతనామము. ఇది 61 వ మేళకర్తయగును.

రుద్ర - భూ :— 11 వ 'రుద్ర' చక్రము లోని 4 వ మేళమగు 'వాచస్పతి'కి గల సంకేతనామము. ఇది 64 వ మేళకర్త యగును.

రుద్ర - మా :—11 వ "రుద్ర" చక్రము లోని5 వ మేళమగు 'మేచకల్యాణి'కి వెంకట పెట్టిన సంకేతనామము. ఇది 65 వ మేళకర్తయగును.

రుద్ర - శ్రీ :— 11 వ "రుద్ర" చక్రము లోని2 వ మేళమగు 'రిషభప్రియ'కు 'వెంకటమఖి' పెట్టిన సంకేతనామము. ఇది 62 వ మేళకర్తయగును.

రుద్ర - షా :— 11 వ "రుద్ర" చక్రము లోని 6 వ మేళమగు 'చిత్రాంబరి'కి వెంకటమఖి పెట్టిన సంకేతనామము. ఇది 66 వ మేళకర్తయగును.

రుద్రదేశిక :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము. సంపూర్ణ - వక్రఔడవము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ స రి స.

రుద్రపంచమము :— 16 వ మేళకర్త యగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ని ధ స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

రుద్రప్రియ :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని ప మ గా రి స.
ఇది ఔడవ - షాడవరాగమగును.

రుద్రవీణ :— వీణలలోని రకములలో ఒక రకము "వీణ"కుగల పేరు.

# రూ

రూట్ రాగము :— జనకరాగ లేక మేళ కర్త రాగమునకు గల ఇంగ్లీషు పేరు.

రూపకచాపు :— ప్రాచీన కాలములో వాడుకలో నున్నటువంటి చాపుతాళము లోని ఒకరకపు తాళమునకు పేరు. దీనికి 3 అక్షరకాలములు. అనగా ఒక త్రిశ్ర లఘువుగా వుండును. ఉ|| స రి గ|| రి గ మ|| గ మ ప|| ఈవిధముగా నుండును. దీనినే పూర్వులు 1 లయ (ఘాత) 2 గురువులు (ప్రేళ్ళు) అని చెప్పియుండిరి.

రూపకతాళము :— సప్తతాళములలో 1 ద్రుతము 1 లఘువుగల తాళమునకు పేరు.

రూపకధృవము :— త్రిఖండ గీతంబులు గానుండువాటిలో అంతరమందు ఘూడు ఘాతలు ఒక విసర్జితము ఒక ఘాత ఒక

విసర్జితము తదుపరి 2 ఘాతలు వేయు దానికిగల పేరు. ఆభోగఖండముపాడి పైన జెప్పినట్లే తాళమువేసికొనివచ్చి అంతరము పాడుదురు. [సం. సం. ప్ర.]

రూపకాలప్తి :— పల్లవియొక్క తొలి స్వరూపమునకుగల పేరు. అనగా రూపకముతో ఒక రాగములో ఉపయోగింప బడినట్టియు తాళమునకు సరిపోవునట్టి 'ఆలప్తి'ని 'రూపకాలప్తి' యనబడును. ఇదే వికసించి క్రమముగా పల్లవి అయ్యెను.

రూపము :— ఉద్దీపన విభావములోని 4 విధములలో 1 వ దగు గుణములందలి 7 విధములలో 2 వ దానికి గల పేరు.

*రూపవతి :— 72 మేళకర్తలలో 12వ మేళకర్తకు గలపేరు. ఇది రెండవ 'నేత్ర' చక్రములోని 6 వ మేళమగును.

ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

ఇందు షడ్జ, పంచమములు గాక శు. రి- సా. గాం- శు. మ- ష. ధై- కా. నిషాద స్వరములుండును. త్యాగరాజుని 'నేముఖ జెట్టితే' అను ప్రసిద్ధకృతి యిందుగలదు.

రూక్షము :— శబ్దదోషములు 8 టిలో మొదటిదాని పేరు. అనగా గానము చేయుటలో మనోహరముగ నుండని ధ్వనికి 'రూక్షము' అని చెప్పబడును.

# రె

రె :— రిషభస్వరమునకు సంకేతాక్షరమైన "రి" అను స్వరమును హిందుస్థాని సంగీతమునందు గాయకులు 'రె' అని పాడుదురు. ఇట్లుపాడుటకు అన్యదేశ సాంకర్యమే ముఖ్యకారణమగును.

రెంకతోడి :— 8 వ మేళకర్త యగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

రెండు పేర్లుగల రాగములు :— ఆండోలిక 'కు 'మయూరధ్వని' అనియు 'సింధు ధన్యాసి'కి 'ఉదయరవిచంద్రిక' అనియు 'రామమనోహరి'కి 'రమామనోహరి' అనియు పేర్లుగలవు గనుక నీరాగములగును.

# రే

రేఖాకారసాంకేతికపద్ధతి :— పాశ్చాత్య సంగీతమునందుపయోగించునట్టి అయిదు సమానాంతర రేఖల (Paralell lines) పైనను, మధ్యను స్వరములను గుర్తించునట్టి పద్ధతికి తెలుగులోని పేరు. దీనినే ఆంగ్లభాషలో స్టాఫ్ నోటేషన్ (Staff Notation) అనిచెప్పుదురు.

రేఖావతి :— 12 వ మేళకర్త యగు 'రూపవతి' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

రేవ :—36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము. ఔడవరాగము.
ఆరోహణము— స రి గ ధ ని స.
అవరోహణము— స ని ధ గ రి స.

రేవగుప్తి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. ఔడవ – ఔడవరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప గ రి స.
త్యాగరాజుని 'గ్రహబలమేమి' స్వాతి తిరునాళ్ యొక్క 'గోపాలక' అను ప్రసిద్ధ కృతులు యీ రాగములోని వగును.

రేవతి :—2వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము. ఔడవము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి స.

రేవనాట :— 70 వ మేళకర్తయగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని ధ స.
అవరోహణము— స ధ ప గ రి మ గ స.
ఇది ఉభయ వక్రషాడవమునకు చెందును.

రేషియో :— రెండు స్వరములకుగల సంబంధము లేక అంతరమును ఇంగ్లీషు భాషలో 'రేషియో' అనిచెప్పుదురు.

# రో

రోజన్ :— వయొలిన్ వాద్యమెనర్పుట కుపయోగించు కమాను లేక విల్లు (Bow) యొక్క వెంట్రుకలను గట్టిగ చేయుటకు వుపయోగించు ఒక పదార్థమునకు పేరు.

రోదావళి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మ రి గ స.

రోమాంచము :— భావశాస్త్రమందుగల సాత్వికభావములోని 8 విధములలో 3వ దానికి 'రోమాంచము' అని పేరు.

రోలంభధ్వని :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

రోహణకల్యాణి :—44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

రోహిణి :— గాంధారగ్రామములోని 7 మూర్ఛనలలో 5 వ మూర్ఛనకు గలపేరు. దీనికి ప్రారంభస్వరము "ధ" యగును. అనగా ధ ని స రి గ మ ప ధ గానుండును.

రోహిణి :— 22 శృతులలో 19 వ శృతికి గలపేరు. ఇది 'శుద్ధనిషాదము' నకు సరిపోవును. ఉ॥ కాంభోజి, భైరవిరాగములు ఈశృతిగల రాగములకు ముఖ్యవుదాహరణములగును.

రౌద్ర :— రాగ నవరసములలో 8 వ రసమునకు గలపేరు. శృంగారాది ఈ నవరసములు రాగములకే గాక సంగీత రచనలకు, వేదములకు, శాస్త్రములకు, పురాణములకు, ఇతిహాసములకు, వచనములకు గూడ ముఖ్యమైనవి యగునని తెలియదగును.

రౌద్రి :— 22 శృతులలో 8 వ శృతికి గలపేరు. ఇది అంతర గాంధారమునకు సరిపోవును. ఉ॥ కాంభోజి, శంకరాభరణ రాగములు ఈ శృతిగలవి యగును.

రౌప్యనగము :— 12 వ మేళకర్తయగు 'రూపవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ ప ధ ని స.
అవరోహణము- స ధ ని ప మ గ రి స.

# ల

లంఘనము :— రాగాలాపనలో ఒక స్వరమును యేమాత్రము నుచ్చరింపక మీది స్వరమునుదాటుటకు 'లంఘన' మనిపేరు.

ల, గ ప, ధ :— లఘు, గురు, ప్లుత, ద్రుతములను 4 తాళాంగములను ఒక్కొక్కప్పుడు వాటి ప్రధానాక్షరములతో ల, గ, ప, ధ, యని చెప్పుదురు.

లఘుక్రియ :— ఒక ఘాత (దెబ్బ) కొట్టి చిటికెనవ్రేలు మొదలుగా 3 వ్రేళ్ళను యెంచుటకు గలపేరు.

లఘుదశజాతులు :— 1. త్రిశ్రలఘువు (3.అక్షరములు) 2. చతురశ్రలఘువు (4.అ.) 3. ఖండలఘువు (5. అ.) 4. మిశ్రలఘువు (7. అ.) 5. సంకీర్ణలఘువు (9. అ.) 6. దివ్యసంకీర్ణ లఘువు (6. అ.) 7. మిశ్రసంకీర్ణలఘువు (8. అ.) 8. దేశ్యసంకీర్ణ లఘువు (10. అ.) 9. మిశ్రదేశ్య సంకీర్ణ లఘువు (12. అ.) 10. దేశ్యశుద్ధసంకీర్ణ లఘువు (16. అ.) లకు గలపేరు.

లఘుద్రుతము :— షోడశాంగములగు 16 టిలో 6 వ దానికిగలపేరు. దీనికి అంగములు । ద్రుతము । చతురశ్ర లఘువు యుండును. అక్షరకాలములు 6.

లఘుద్రుతవిరామము :— షోడశాంగములగు 16 టిలో 7 వ దానికి గలపేరు. దీనికి అంగములు ◡ 0 $I_4$ వుండును. అక్షరకాలములు 7.

లఘుపంచకము :— యీ క్రింద దెలిపిన 5లఘువులకు గలపేరు. వాటి మాత్రలు ఘాతలు, వ్రేళ్ళు, అక్షరకాలములను వరుసగా ఆయాలఘువులందు చూచుకొనునది.

| పేర్లు | మాత్రలు-ఘాతలు-వ్రేళ్లు-అ.కా॥ |
|---|---|
| i దివ్యసంకీర్ణ లఘువు | 1½-1-5 -6 |
| ii మిశ్రసంకీర్ణ లఘువు | 2 -1-7 -8 |
| iii దేశ్యసంకీర్ణ లఘువు | 2½-1-9 -10 |
| iv మిశ్రదేశ్యసంకీర్ణలఘువు | 3 -1-11-12 |
| v. దేశ్యశుద్ధసంకీర్ణ లఘువు | 4 -1-15-16 |

లఘుపంచకమునకుగల ప్రత్యేక నామములు :— దివ్యసంకీర్ణలఘువుకు - దివ్యలఘువనియు, మిశ్రసంకీర్ణ లఘువుకు - సింహ్వాలఘువనియు, దేశ్యసంకీర్ణ లఘువుకు - వర్ణలఘువనియు, మిశ్రదేశ్య సంకీర్ణ లఘువుకు - వాద్యలఘు వనియు, దేశ్యశుద్ధ సంకీర్ణ లఘువుకు - కర్నాటక లఘువనియు వేరు నామములుగలవు.

లఘుపంచమము :— మధ్యమ గ్రామములోనుండు ఒక శృతి తక్కువగల "పంచమము"నకు గలపేరు.

లఘుప్రస్తారములు :— ఒక చతురశ్ర లఘువును ప్రస్తరించిన యేర్పడు 8 ప్రస్తారములకు గలపేరు. అవియీక్రిందజూచునది.
(1) ।. (2) 8 ∪. (3) 0 0. (4) 0 ∪ ∪.
(5) ∪ 8. (6) ∪ 0 ∪. (7) ∪ ∪ 0.
(8) ∪ ∪ ∪ ∪.

లఘుమేరువు :— తాళ ప్రస్తార భేదములు 14 టిలో 8 వ దానికి గలపేరు.

లఘురహితతాళములు :— అష్టోత్తర శతతాళములగు 108 టిలో యీక్రింది సంఖ్యలుగల తాళములకు గలపేరు.

తాళములపేర్లు - అంగములు.

51 క్రీడతాళము - 0 0 ∪.
55 బిందుమాలితాళము - 8 0 0 0 0 8.
59 మట్టికతాళము - 8 0 3.
63 అంతరక్రీడతాళము - 0 0 0 ∪.
67 విషమతాళము - 0 0 0 0∪0000∪
71 ఏకతాళము - 0.
74 ఖండకంకాలతాళము - 0 0 8 8.
77 చతుస్తాలము - 8 0 0 0.
82 ప్రతాపశేఖరతాళము - 3 0 0 ∪.
83 జగఝంపతాళము - 8 0 0 0 ∪.
87 గారుగీతాళము - 0 0 0 0 0 ∪.
91 కర్ణయతితాళము - 0 0 0 0.
93 షట్తాళము - 0 0 0 0 0 0.
97 మదనతాళము - 0 0 3.

లఘువిరామము :— షోడశాంగములగు 16 టిలో 5 వ దానికి గలపేరు. దీనికి అంగములు ∪ ।. అక్షరకాలములు 5.

లఘువు :— సంగీత కాలమును లెక్కించుట కుపయోగించు ఆఱు అంగములలో 3 వ దానిపేరు. ఇదవేయునపుడు 1 ఘాత వేసి ఆయాజాతినిబట్టి వ్రేళ్ళు లెక్కింపవలెను. మరియు 2 ద్రుతముల కాలము ఒక చతురశ్ర లఘువగును.

లఘుశేఖరతాళము :— అష్టోత్తర శత తాళములగు 108 టిలో 81 వ తాళమునకు పేరు. దీనికి అంగములు । ∪. మాత్రలు $1\frac{1}{4}$. అక్షరకాలములు 5.

లఘుశేఖరతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమగు 120 దేశితాళములలో 74 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు । ∪.

లఘుశేఖరము :— 6 అక్షరకాలములు గల ఒక ఘాతకు పేరు. అనగా వైణికులు చతురశ్రజాతి ధృవతాళమును వేయునపుడు ఆ తాళ ఆవర్తమునకుగల 4 అంగములలో మొదటి లఘువును, ద్రుతమును కలిపి ఒకే ఘాతగా ప్రక్కనుండు తాళ

తంత్రులను చిటికెన వ్రేలుతో మీటుదురు. ఈమీటుకే లఘుశేఖరమని చెప్పుదురు.

లఘుస్వరము :— దీనినే ప్రాచీనులు త్రిశృతికమని చెప్పుదురు. అనగా $\frac{10}{9}$ అంతరమునకు 'లఘుస్వరము' అని పేరు. ఇంగ్లీషులో దీనినే మైనర్ టోన్ (Mynortone) అందురు. ఇది చ. రిష భము, అం. గాంధారమునకును, చ. ధైవ తము - కా. నిషాదములకును మధ్యనుండు అంతరమగును.

*లతాంగి :— 72 మేళకర్తలలో 63 వ మేళకర్తకుగల పేరు. ఇది 11 వ 'రుద్ర' చక్రములోని 3 వ మేళమగును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచములుగాక చ. రి - అం. గాం - ప్ర. మ - శు. ధై - కా. నిషాద స్వరములుండును. శ్రీ త్యాగరాజుని, ఈ దినమే సుదినము, కంటజూడుమీ, అను కృతులును, శ్రీ పట్నం సుబ్రహ్మణ్య య్యర్ 'అపరాధముల' అను కృతియు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

లతాంతప్రియ :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ రి స.

లతాతన్వి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్య రాగము. వక్రషాడవ - ఔడవము.
ఆరోహణము- స గ మ గ ప ధ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

లతామంజరి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

లతామణి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.
ఇది సంపూర్ణ - షాడవ రాగమగును.

లతికాంతి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ పమగరిస.

లయ :— గానముతోచేరి హెచ్చుతగ్గు లేక నడచుటకుగల పేరు. దీనినే సంగీత కాలము లేక సామరస్యము అనికూడ చెప్పుదురు. ఇది సంగీతమునకు ఒక స్థిరత్వ మును, ఆకారము నిచ్చును. ఇది 3 విధ ములు. 1. విళంబలయ, 2. మధ్యలయ, 3. ద్రుతలయ అనునవి. ఇవి ఒకదానికొకటి రెట్టింపు వేగముగలిగిన త్రివిధములగు లయ లగును. ఈ లయనే ఇంగ్లీషులో టెంపో (Tempo) అని చెప్పుదురు.

లయ :— క్రియానంతర విశ్రాంతినికూడ లయ,యని చెప్పుదురు. పూర్వము అదిమ నివాసులు ఆనందాతిరేకమున నాట్యము చేసినప్పుడు లయ అనునది కనిపెట్టబడిన దని చెప్పుదురు.

లయతాళము :— "రత్నాకర" గ్రంథస్థ మైన 120 దేశితాళములలో 106 వ

తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8।33383000.

లయవాద్యములు :— తాళమునకు సంబంధించిన అన్ని వాద్యములకు గలపేరు. ఉ|| మృదంగము, తబల, ఘటం, కంజిరా, మోర్సింగ్, డోలక్, డోలు, గెత్తు, జాల్‌రా, చిప్లామొదలగునవి యీరకమునకు చెందును.

లర :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములోని కటపయాది సంఖ్యగల "మిశ్రజాతి ధృవతాళము"నకు గలపేరు. దీనికి అంగములు । 0 । ।. అక్షరకాలములు 23.

లలిత :— భావభట్టుని "అనూప సంగీత విలాస" మను గ్రంథములోని 22 శృతులలో "రిషభము"నకుగల 3 శృతులలో 2 వ దానిపేరు.

లలిత :— ఇది 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగమైనను చతుశ్శృతిధైవతమునే వాడుదురు.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.
నిన్నుకోరి, అను వర్ణము, శ్రీత్యాగరాజుని 'సీతమ్మ మాయమ్మ' అనుప్రసిద్ధకృతియు యీ రాగములోని ప్రసిద్ధరచనలగును.

లలితక్రియ :— 15 వ మేళకర్తయగు "మాయామాళగౌళ" యొక్క జన్యరాగము. వక్రసంపూర్ణ - షాడవము.
ఆరోహణము-స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

లలితకోసలి :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని ధస.
అవరోహణము- స ని ధ ప మ గ మ రి స.

లలితగంధర్వము :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము. సంపూర్ణ - ఔడవము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప గ రి స.

లలితగాంధారి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గా మ ప ని స.
అవరోహణము- స ని ప మ గా మ రి స.

లలితగౌరి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. సంపూర్ణ - ఔడవము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప గ రి స.

లలితతాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 89 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 । 8. మాత్రలు 4. అక్షరకాలములు 16.

లలితతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 85 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 । 8.

లలితతాళము :— దర్పణతాళము, ఆదితాళము కలసి యేర్పడినట్టి మార్గసాలగతాళమునకుగల పేరు.

లలితతోడి :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

లలితదీపరము :— 42 వ మేళకర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

లలితపంచమము :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. షాడవ – వక్రసంపూర్ణము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మ గ రి స.

లలితప్రియతాళము .— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 103 వ తాళము నకుగల పేరు. దీనికి అంగములు ।।8।।. మాత్రలు 6. అక్షరకాలములు 24.

లలితప్రియతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 89 వ తాళము పేరు. దీనికి అంగములు ।।8।8.

లలితప్రియతాళము :— ఉద్వీక్షణ తాళము, రతితాళముకలసి యేర్పడినట్టి 'మార్గసాలగతాళము' నకుగల పేరు.

లలితమనోహరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

లలితమారువ :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

లలితశ్రీకంఠి :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ ధ మగరిస.

లలితసింహారవము :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ప మ గ రి స.

లలితాంగి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

లవము :— కాలనిర్ణయము చేయుటలో పేర్కొనబడిన విధముగా 8 క్షణములు కలిసిన ఒక "లవ" మగును.

లవింతిక :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి స.

లక్షణగ్రంథముద్ర :— సంగీత రచనలందుపయోగించు ద్వాదశముద్ర లనెడి 12 ముద్రలలో 11 వ ముద్రకు గల పేరు. దీనిలో లక్షణగ్రంథముయొక్క పేరునే ముద్రగానుంచబడును.

లక్షణగీతము :— గీతమునందుగల సాహిత్యము దైవము నుద్దేశించినదేగాక ఆరాగ

లక్షణమును గూర్చికూడ తెలుపు గీతముల జాతికి చెందిన ఒకవిధమైన రచనకు గల పేరు. ఉ॥ కంసాసుర, శహానరాగము, చ. మఠ్యతాళము.

లక్షణతాళము :— శ్రీ రామస్వామి దీక్షితారుని 108 రాగతాళ మాలికలో వచ్చునట్టి ఒక నూతన తాళమునకు గలపేరు.

లక్షణము :— ఒక రాగమునకుగాని, తాళమునకు గాని, రచనకుగాని స్పష్టమైన గుణగతముల నుద్దేశించి చెప్పబడునది "లక్షణ"మనబడును.

లక్ష్యగీతము :— లక్షణగీతము వంటిది గాక సాహిత్యము మాత్రమేగల సాధరణ గీతమువంటి రచనకు గలపేరు.

లక్ష్మీతాళము :— 'వనపాదచూడామణి' వ్రాసిన 'తాళసముద్రమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనిన తాళములలో నొకదానికి గలపేరు.

లక్ష్మీతాళము :— తురంగలీల, అభంగ తాళములు రెండునుకలిసి యేర్పడిన మార్గసాలగ తాళమునకు గలపేరు.

లక్ష్మీశతాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 106 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 । । 3. మాత్రలు 6. అక్షరకాలములు 24.

లక్ష్మీశతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 88 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 0 ∪ । 8.

## లా

లాలితాళము :— శ్రీరామస్వామి దీక్షితారునిచే విరచితమైన 108 రాగతాళ మాలికలోగల నొక తాళమునకు పేరు.

లాలిపాటలు :— కేవలము పసిపిల్లలను ఆడించుటకు రచియింపబడిన జోలపాటలకుగల పేరు. దక్షిణ భారత దేశములో ప్రతి భాషలోను యీ రకపు పాటలు విశేషముగా వ్యాప్తిలోనున్నవి. కాని సాధారణముగా యివి నీలాంబరి, ఆనంద భైరవి రాగములలోనుండును. ఉ॥లాలిమా యమ్మలాలి. అను రచన యిందుకు ఒక ముఖ్య వుదాహరణయగును.

లావణ్యము :— ఉద్దీపనవిభావములోని 4 విధములలో 1 వదైన గుణములందలి 7 విధములలో 3 వ దానికి గలపేరు.

లావణ్యవతి :— 12 వ మేళకర్తయగు 'రూపవతి' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ధ ని స. అవరోహణము- స ని ధ మ గ రి స.

లావని :— మహారాష్ట్ర సంప్రదాయము ననుసరించి చేయబడు హరికథాకాలక్షేపములలో పాడునట్టి ఒక ప్రత్యేకమైన సంగీత రచనకుగల పేరు.

**లాసకి** :— 14 వ మేళకర్తయగు ‘వకుళాభరణము’ యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ని స.
అవరోహణము- స ని ప గ రి స.

**లాస్యప్రియ** :— 43 వ మేళకర్తయగు ‘గవాంభోది’ యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ప మ గ రి స.

**లాస్యము** :— నృత్యములోని 2 విధములలో 2 వదైన స్త్రీ నృత్యమునకుగలపేరు. మొదటిదానికి తాండవము అని పేరు. తాండవములోని ‘తా’ అను అక్షరము, లాస్యములోని ‘లా’ అను అక్షరము కలసి “తాల” అను పదము యేర్పడెను. అదే క్రమంగా తాళముగా మార్పుజెంది నేడు తాళమని పిలువబడుచున్నది.



**లింగరాజ** :— ప్రాచీన వాగ్గేయకారుడై అనేక కృతులను చిట్టస్వరములతో రచియించిన శ్రీ “మైసూరులింగరాజు అర్సు” తన రచనలందు పెట్టుకొనిన ముద్రకుగలపేరు. ఉ|| “శృంగారలహరి” అను నీలాంబరి రాగములోని కృతి, ఇట్టి ముద్రగల రచనకు వుదాహరణ యగును.

**లింగిని** :— ఉపనాయికలందలి 8 రకములలో 7 వ. దానికిగల పేరు.

**లిచిశలక** :— 36 వ మేళకర్తయగు “చలనాట” యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ మ ధ ని ప స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

**లిడిక్ (Lydic)** :— మన “ధీరశంకరాభరణ రాగము”నకు సరిపోవు టోనిక్ మోడల్ షిఫ్టు పద్ధతిలో గ్రీకులు కనిపెట్టిన ఒక సంగీత విధానమునకుగల పేరు.

**లిపిసాంకేతికపద్ధతి** :— భారతీయ సంగీతమునందుపయోగించు స్వర అక్షరముల పద్ధతికిగల పేరు. దీనినే ఆంగ్లభాషలో స్క్రిప్టు నొటేషన్ (Script notation) అని చెప్పుదురు.



**లీనము** :— వీణావాద్యములో ఒక స్వరస్థానమందే రెండక్షరకాలములు తంతిని కదలించి దానిమీది స్వరచ్ఛాయను రప్పించి లయింపజేయుటకుగల పేరు. లీనము అనగా లయింపు అని అర్థము.

**లీల** :— 35 తాళములలో 26 వ తాళమగు “మిశ్రజాతి త్రిపుటతాళము”నకుగల పేరు. దీనికి అంగములు । 0 0. మాత్రలు 2¾. అక్షరకాలములు 11.

**లీలాతాళము** :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 101 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 0 । 3. మాత్రలు 4½. అక్షరకాలములు 18.

లీలాతాళము :— "రత్నాకర" గ్రంథ స్థమైన 120 దేశితాళములలో 83 వ తాళము పేరు. దీనికి అంగములు 0 I 3.

లీలారంజని :— 4 వ మేళకర్తయగు "వనస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

లీలావతి :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ప మ గ రి స.

లీలావినోదిని :— 63 వ మేళకర్తయగు "లతాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ - సంపూర్ణరాగమునకు చెందును.

# లే

లేఖ :— 35 తాళములలో 13 వ తాళమగు "చతురశ్రజాతి అటతాళము"నకు గలపేరు. దీనికి అంగములు I I 0 0. మాత్రలు 3. అక్షరకాలములు 12.

# లో

లోకదీపరము :— 46 వ మేళకర్తయగు "షడ్విధమార్గిణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మ గ రి స.

లోకధర్మి :—నాట్యమునందుగల 2 విధములలో మొదటిదానికిగల పేరు.

లోకప్రియ :— 13 వ మేళకర్తయగు "గాయకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

లోకరంజని :— 52 వ మేళకర్తయగు "రామప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గా రి స.

లోచనకవి :— 16 వ శతాబ్దమునకు చెంది ఉత్తరదేశ సంగీతమునుగూర్చి "రాగతరంగిణి"అను గ్రంథమును వ్రాసిన రచయితకు పేరు. ఈ గ్రంథములో 12 మేళములు వాటి జన్యరాగములుగలవు.

లోమీటు :— వీణావాద్యములో చూపుడువ్రేలితో మీదినుండి తంత్రులను మీటి క్రిందికిపోవుటకు "లోమీటు"అని పేరు.

లోయ :— సూళాది 35 తాళములలో 27 వ తాళమగు "మిశ్రజాతి అటతాళము"నకుగల పేరు. దీనికి అంగములు I I 0 0. మాత్రలు4½ అక్షరకాలములు18.

లోలాక్షి :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ధ ప గ రి స.

లోహజ :— తాళవాద్యములగు లోహ సంబంధమైన వాద్యములనుండి వచ్చు ధ్వని విశేషమునకు యేర్పడిన పేరు.

లోహసాధని :— లోహ సంబంధమైన వాద్యమునకుగల పేరు. ఇది కేవలము కాలమును సూచించునదిగానుండును.

# లౌ

లౌకికగానము :— షడ్జ, మధ్యమగ్రామములు ప్రధానముగానుండు సంగీత పద్ధతికి గలపేరు. ఈరెండు గ్రామములనుండి జాతులుద్భవించినవి. నేటిరాగములకు యీ జాతులు మాత్రుకలని చెప్పవచ్చును.

లౌకికసభాగానప్రబంధము :— ప్రబంధముయొక్క "ధాతు" సప్తజాతులుగను, 'మాతు' సరళి అజంత సంస్కృతభాషగను, 'ఇతివృత్తము' శ్రీరామచరిత్రముగనుండు దానికి పేరు. ఉ॥ వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణము. ఇది సంగీతరీత్యా ఆదిలక్ష్య ప్రబంధముగను, సాహిత్యరీత్యా ఆదికావ్యముగను చెప్పవచ్చును.

# వ

వంశము :— 'శార్ఙ్గదేవుని'చే పేర్కొనబడిన వేణువునందుగల 10 రకములలో మొదటిదానికి గలపేరు.

వంశముద్ర :— సంగీత రచనలలో నుపయోగింపబడు ద్వాదశముద్రలలో 9వ ముద్రకు గలపేరు. దీనిలో కుల, గోత్ర, సూత్రములుండును.

వంశవతి :— 72 మేళకర్తలలో 54వ మేళకర్తకు "వెంకటమఖి" పెట్టిన పేరు.

వంశికము :— 49వ మేళకర్తయగు "ధవళాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ స.

వక్రఔడవము :— ఒక రాగములో ఆరోహణ, అవరోహణములు రెంటియందును గల 5 స్వరములును వరుసగానుండక వక్రముగానుండు రాగమునకు గలపేరు. ఉ॥ భోగిసింధు, ఇది 48వ మేళజన్యము. స ప మ ప ధ ని స - స ని ధ ని ప మ స.

వక్రతానము :— తానములోని 6 రకములలో 2వ రకము తానమునకుగలపేరు.

వక్రము :— తాళషడంగములగు 6 టిలో 4వదైన 'గురువు'నకుగల విశేషనామములలో 3వ దానికి గలపేరు.

వక్రరాగము :— జన్యరాగములలో ఆరోహణము లేక అవరోహణము లేక రెంటియందును 1 లేక 2 స్వరములు ముందు వెనుకలు గలిగి వంకరగానుండు రాగమునకు గలపేరు. ఉ॥ i. శ్రీరాగము, ఇది22వ మేళమగు 'ఖరహరప్రియ' జన్యము. సరిమపనిస - సనిపధనిపమరిగరిస.

i. బేగడరాగము. 29 వ మేళజన్యము.
ఆరో :—స గ రి గ మ ప ధ నీ ధ ప స
అవరో :—స నీ ధ ప మా గ రి స.

వక్రషాడవము :— ఆరోహణ లేక అవరోహణ లేక రెంటియందుగల ఆరేసి స్వరములు వరుసగానుండక వక్రముగానుండు రాగమునకు గలపేరు. ఉ|| రవిచంద్రిక రాగము. 28 వ హరికాంభోజి మేళజన్యము. స రి గ మ ధ ని ధ స — స ని ధ మ గ రి స.

వక్రసంచారము :— వక్రస్వర సమ్మేళనము గలిగిన సంగీత పదజాలము లేక రాగమునకు గలపేరు.

వక్రసంపూర్ణము :— ఆరోహణ లేక అవరోహణ లేక రెంటియందునుండు సప్తస్వరములు వరుసగానుండక వక్రముగానుండు రాగమునకు పేరు. ఉ|| సహన. స రి గ మ ప మ ధా ని స — స ని ధ ప మ గా మ రీ గ రి స. ఇది ఉభయవక్రరాగము.

వకుళశ్రీ :— 40 వ మేళకర్తయగు "నవనీతము" యొక్క జన్యరాగము.
ఆరోహణము—స రి గ మ ధ ని మ ప ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ-షాడవ రాగ రకమునకు చెందును.

*వకుళాభరణము :— 14 వ మేళకర్త రాగమునకుగల పేరు. ఇది 3 వ 'అగ్ని' చక్రములోని 2 వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఇందు షడ్జ, పంచమములుగాక, శు.రి- అం. గాం - శు. మ - శు. ధై - కై. నిషాదస్వరములుండును. వాద్యమునందు కీరవాణి రాగములో పంచమమును షడ్జముగచేసి అదే స్వరస్థానములందు వాయించిన యీరాగమేర్పడును. 'త్యాగరాజు'వి ఏ రాముని నమ్మితినో, అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదైయున్నది.

వక్రుడు :— గొంతును వట్రువుగ జేసి గానముచేయు గాయకునికిగల పేరు. ఇది గాయక దోషములలో నొకటియగును.

వజ్రకాంతి :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధా ప మ గ రి స.

వజ్రహసితము :— 8 వ మేళకర్తయగు "హనుమత్తోడి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

వజ్రికా :— ద్వావింశతి శ్రుతులగు 22టిలో 10వ శ్రుతికి గలపేరు. ఇది 'శుద్ధ మధ్యమము'నకు సరిపోవునదిగా నుండును.

వట్టప్పాలై :— "తొల్ కాప్పియమ్" "శిలప్పదికారమ్" వంటి పురాతన తమిళ గ్రంథములలో పేర్కొనబడిన 24 శ్రుతుల పద్ధతికి తమిళములోని పేరు.

వటి :— శ్రీ పి. యమ్. చిన్నస్వామి ముదలియార్ 'చే రచింపబడిన "ఓరియంటల్ మ్యూజిక్" అను గ్రంథములోని

కటపయాది సంఖ్యకు సరిపడునట్టి "చతుశ్ర జాతి ధ్రువతాళము"నకుగల పేరు. దీనికి అంగములు I 0 I I. మాత్రలు 3½. అక్షరకాలములు 14.

వటి :— "ఓరియంటల్ మ్యూజిక్" అను గ్రంథములో కటపయాది సంఖ్యకు సరిపడు "ఖండజాతి అటతాళము" నకు గలపేరు. దీనికి అంగములు I I 0 0. మాత్రలు 3½. అక్షరకాలములు 14.

వంతనధారిణి :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

వత్స :— 9 వ మేళకర్తయగు "ధేనుక" యొక్క జన్యమైన యొకరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

వనకుంబతాళము :— శ్రీ "వనపాదచూడామణి" యొక్క "తాళసముత్తిరమ్" అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన తాళములలో 17 వ తాళమునకు పేరు.

వనజముఖి :— 38 వ మేళకర్తయగు "జలార్ణవము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని మ గ రి స.

వనజారిణి :— 68 వ మేళకర్తయగు "జ్యోతిస్వరూపిణి" యొక్క జన్యరాగము. వక్రషాడవ — షాడవము.
ఆరోహణము— స రి గ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ప మ గ రి స.

వనదాయకి :— 51 వ మేళకర్తయగు "కామవర్ధని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ మ గ రి స.
ఇది సంపూర్ణ — ఔడవమునను చెందును.

వనపాదచూడామణి :— "తాళసముత్తిరమ్" అను తమిళ గ్రంథమును రచించిన రచయితకుగల పేరు. ఈయన గ్రంథములో వర్మతాళము మొదలు రవిమట్టెయము వరకుగల యిరువదితాళములను పేర్కొనెను.

వనమతాళము :— "తాళసముత్తిరమ్" అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన 13 వ తాళమునకు గలపేరు.

వనమాలీతాళము :— అష్టోత్తరశత తాళములగు 108 తాళములలో 26 వ తాళము పేరు. దీనికిఅంగములు 0 0 0 0 I 0 0 8. మాత్రలు 6. అక్షరకాలములు 24.

వనమాలీతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 29వ తాళము పేరు. దీనికి అంగములు 0 0 0 0 I 0 0 8.

*వనస్పతి :— 72 మేళకర్తలలో 4 వ మేళకర్త రాగమునకుగల పేరు. ఇది 'ఇందు' చక్రములోని 4 వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

ఇందు, షడ్జ, పంచమములుగాక శు. రి – శు. గాం – శు. మ – చ. ధై. – కై. నిషాదస్వరములుండును. త్యా గ రా జు ని 'పరియాచకమా' అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదగును.

వనాళి :—"రసాళి"అను రాగమునకుగల మరియొక పేరు.

వయొలిన్ :— ఫిడల్ లేక వాయులీన వాద్యమునకు ఇంగ్లీషులోని పేరు.

వయొలిన్ :—శ్రీ కె. వి. యస్. యమ్. 'గిర్మాజీరావు'చే ఫిడల్ లేక వాయులీన మును గురించి ఇంగ్లీషులో వ్రాయబడిన ఒక గ్రంథమునకు పేరు.

వయొలిన్‌లోని అపూర్వలక్షణములు :— 1. మనోహరమైన గంభీరధ్వనియు, 2. చేతిలో యిముడు ఆకారమును, 3. సున్ని తములగు గమకములన్నిటిని సులువుగా వాయింపవీలగు సమతలముగల్గినట్టి వ్రేళ్లచే నదుమబడు బల్ల (ఫింగర్ బోర్డు)ను, 4. వివిధములగు తానములను స్వర, సాహి త్యప్రస్తారములను చక్కగా ప్రదర్శించు టకనువగు పొడవైన విల్లు (కమాను)ను, 5. స్త్రీ, పురుష గాత్రములకు సరిపోవు గంభీరధ్వనియును వయొలిన్‌కుగల అపూర్వ విశేష లక్షణములగును.

వయొలిన్ వాద్యమును కర్ణాటక సంగీ తమునందు ప్రవేశపెట్టిన మేధావులు:— ఎట్టయపురము సంస్థాన విద్వాంసులగు శ్రీ బాలస్వామి దీక్షితార్ (1786–1858 శ్రీ ముద్దుస్వామి దీక్షితుల సోదరుడు) మొదటివాడు అగును. తరువాత వడివేల్లు, పొన్నుస్వామి, సుబ్బరాయర్, షియ్యాలి నారాయణస్వామి పిళ్లె, మలబార్ మహా దేవ భాగవతర్, పుదుక్కోట నారా యణస్వామి అయ్యర్, తిరుక్కొడి కా వల్ కృష్ణయ్యర్, గోవిందస్వామి పిళ్ళె యును, వర్తమానకాలములో శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు, కుంభకోణం రాజమాణిక్యంపిళ్ళె, మైసూరు చౌడయ్య మొదలగువారును ముఖ్యులగుచున్నారు.

వయొలిన్‌సోలో :— వయొలిన్ (ఫిడల్) వాద్యమును తనిగావాయించుటకుగలపేరు.

వయొలినిస్టు :— ఫి డ ల్ వాద్యమును వాయించునట్టి వాద్యకునికి ఇంగ్లీషుపేరు.

వయోలా :— వయొలిన్ వాద్యములోని ఒక పెద్ద రకమునకుగల పేరు. దీని ధ్వని మిక్కిలి గంభీరముగానుండును.

వరట :—59వ మేళకర్తయగు'ధర్మవతి' యొక్క జన్యరాగము. ఔడవరాగము.

ఆరోహణము– స రి మ ప ని స.

అవరోహణము– స ని ప మ రి స.

వరదపురందరవిఠల :—శ్రీపురందర విఠ లుని మొదటి కుమారుని యొక్క రచన లందుగల ముద్రకు గలపేరు.

వరదవేంకట :— 18 – 19 శతాబ్దము లకుచెందిన శ్రీ శరభోజి, శ్యామశాస్త్రిల కాలములోనున్న 'శ్రీ కుప్పుసామయ్య' తన రచనలందు పెట్టుకొనిన ముద్రకుపేరు.

వరదారి :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము- స ని ప మ రి గ రి స.

వరము :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

వరవర్నని :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

వరవర్ణిని :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ స.

వర్జరాగము :— జన్యరాగములలో ఆరోహణలోగాని, అవరోహణలోగాని లేక రెండిటిలోగాని 1 లేక 2 లేక 3 స్వరములను వదలియుండు రాగమునకుగల పేరు. ఉ॥ శ్రీరంజని, మోహన, నవరస కన్నడ మొదలగునవి.

వర్ణకారిణి :— 36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప మ రి స.

వర్ణభిన్నతాళము :— అష్టోత్తరశత తాళములగు 108టిలో 21వ తాళమునకు పేరు. దీనికి అంగములు 0 0 । 8. మాత్రలు 4. అక్షరకాలములు 16.

వర్ణభిన్నతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 20 వ తాళము పేరు. దీనికి అంగములు 0 0 । 8.

వర్ణమట్టకతాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 61 వ తాళము పేరు. దీనికి అంగములు 0 0 । 0 0. మాత్రలు 3. అక్షరకాలములు 12.

వర్ణమణ్ఠికాతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 60వ తాళము పేరు.దీనికిఅంగములు। । 0 0 । 0 0.

వర్ణమాలిక :— శ్రీ కె. రామచంద్రన్, 1934 సంవత్సరములో తెలుగులో వ్రాసిన యొక సంగీత గ్రంథమునకుగల పేరు.

వర్ణము :— సంగీతమునకు విశేషప్రాముఖ్యముగలిగి రాగభావసమన్వితమై పాండితీ ప్రతిభగల రచనకుగల పేరు. దీనిలో సాహిత్యము కొంచెముగానుండి భక్తిలేక శృంగార రసములకు సంబంధించియుండును. దీనిలో రెండు అంగములుండును. 1. పూర్వాంగము. దీనిలో పల్లవి అనుపల్లవి, ముక్తాయి స్వరము లుండును. 2. ఉత్తరాంగము. దీనిలో చరణము, ఎత్తుగడ స్వరములుండును.

వర్ణము :—మరియొక పద్ధతిలో గానము యొక్క క్రియ అనిగూడ చెప్పబడును. ఇది 4 విధములు. 1. స్థాయివర్ణము. 2.

ఆరోహివర్ణము. 3. అవరోహివర్ణము. 4. సంచారివర్ణము అనునవి.

వర్ణము :— మధ్యయుగమునందలి రచనలలో వర్ణమనగా వర్ణతాళములోనున్న రచనగా అర్థము చెప్పబడినది.

వర్ణయతితాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 95 వ తాళము పేరు. దీనికి అంగములు ।।3 3. మాత్రలు 8. అక్షరకాలములు 32.

వర్ణయతితాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 100 వ తాళమునకు పేరు. దీనికి అంగములు ।।0 0.

వర్ణరూపిణి :—18 వ మేళకర్తయగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ధ స.
అవరోహణము– స ధ ప గ రి స.

వర్ణలఘువు :— 10 అక్షరకాలములుగల ఒక జాతి లఘువునకుగల పేరు. ఇది దేశ్య సంకీర్ణ లఘువునకుగల మరియొక పేరు.

వర్తని :— రాగాలాపనలోని మూడవ భాగమైన 'మకరిణి'కిగల మరియొక పేరు.

వర్తమానకళలు :— ఒక తాళాక్షరమునకు 1, 2, 3, 4 కళల చొప్పున పెరుగుచూ వచ్చునట్టి కళలకు పేరు. దీనికి వ్యతిరేకమైనవి నష్టకళలు. అనగా ఇవి పై విధమున తగ్గుచూవచ్చిన కళలగును.

వర్ధనతాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 94 తాళమునకు గల పేరు. దీనికి అంగములు 0 0 । 3. మాత్రలు 5. అక్షరకాలములు 20.

వర్ధనతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 92వ తాళమునకు పేరు. దీనికి అంగములు 0 0 । 3.

వర్ధని :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ప ధ ప మ గ స.

వర్ధని :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

వర్మతాళము :— శ్రీ 'వనపాదచూడామణి' వ్రాసిన 'తాళసముద్రమ్' అను తమిళ వ్రాత ప్రతి గ్రంథములో పేర్కొనబడిన తాళములలో మొదటిదాని పేరు.

వరాళి :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
శ్రీ త్యాగరాజుని పంచరత్న కీర్తనముల లోని 'కనకనరుచిరా, మరకతమణి' దీక్షితులవారి 'మామవ మీనాక్షి, శ్యామశాస్త్రిలవారి 'కామాక్షి' అను ప్రసిద్ధ రచనలు యీ రాగములోనివైయున్నవి.

వరాళీతిలకము :—39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

వరితె :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము. [సం.స్వ.ప్ర.సా.]
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

వరితె :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

వర్తిక :— 'భావభట్టుని' 'అనూపసంగీత విలాస'మను గ్రంథములోని 22 శ్రుతుల పట్టికలో ధైవతమునకుగల 3 శ్రుతులలో 3 వ శ్రుతికిగల పేరు.

*వరుణప్రియ :—72 మేళకర్తలలో 24 వ మేళకర్తకుగల పేరు.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జపంచమములుగాక చ. రి – సా. గాం – శు. మ – వ. ధై – కా. నిషాదస్వరములుండును. ఇది 4 వ 'వేద చక్రములోని 6 వ మేళమగును. శ్రీ కోటీశ్వరయ్యర్ యొక్క 'సింగారకుమార' అను ప్రసిద్ధరచన యీరాగములో గలదు.

వరుణాత్మజ :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

వరూథం :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

వలజి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.
శ్రీ ముత్తయ్యభాగవతర్, యొక్క 'జాలంధర' అను కృతి యీరాగములోనిదగును.

వలయము :— షడంగములలో నొకటైన ద్రుతమునకుగల విశేషనామములు 5 టిలో 5 వ దానిపేరు.

వల్లకి :— వీణకుగల మరియొక పేరు.

వల్లిక :—4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము. ఔడవము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ని ప గ రి స.

వల్లిశాఖిల :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ ధ మగరిస.

వసంత :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము. ఔడవ – షాడవము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
ఇది 15వ మేళకర్తజన్యమైనను కొందరు దీనిని 17 మేళజన్యముగా లెక్కించి చతుశ్శ్రుతి ధైవతమును వాడుచున్నారు. 'నిన్నుకోరి'అనువర్ణము, శ్రీ దీక్షితులవారి హరిహరపుత్రం,రామచంద్రభావయామి' శ్రీత్యాగరాజుని,ఎట్లాదొరికితివో',శ్రీస్వాతి తిరునాళ్ యొక్క 'పరమపురుష' అను

కృతులు యీ రాగములోని ప్రసిద్ధమైన రచనలైయున్నవి.

వసంత :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

వసంతకన్నడ :—10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని.
అవరోహణము— ధ మ ప గ రి స ని.

వసంతగీర్వాణి :—59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

వసంతఘంట :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప నిధనిస.
అవరోహణము— స ని ధ మ గ రి గ స.

వసంతఘోషి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము. ఉభయ ఔడవము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

వసంతతాళము :—'అష్టోత్తరశత' తాళము లగు 108 టిలో 88 వ తాళముపేరు. దీనికి అంగములు । । । 8 8 8. మాత్రలు 9. అక్షరకాలములు 36.

వసంతతాళము :—'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 73 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు । । । 8 8 8.

వసంతనారాయణి :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

వసంతప్రియ :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్యరాగము. వక్రసంపూర్ణ – ఔడవము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప నిస.
అవరోహణము— స ని ప మ రి స.

వసంతభూపాలము :— 2 వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ ధ మగరిస.

వసంతభైరవి :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మగరిస.
శ్రీ త్యాగరాజుని 'రమారమణ' 'నీదయ రాదా' అను ప్రసిద్ధకృతులు యీ రాగములోనివై యున్నవి.

వసంతమనోహరి :—2 వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

వసంతమారువ :—51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ధ ప మ గ స.

వసంతముఖారి :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

వసంతలీల :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ రి స.

వసంతవరాళి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని.
అవరోహణము- { ని ధా ప గ రి స ని. / ని ధ ప మ గ రి స ని. }
శ్రీ త్యాగరాజుని 'పాహిరామదూత' అను ప్రసిద్ధకృతి యీరాగములో గలదు.

వసంతోత్సవసంప్రదాయ కీర్తనలు :— శ్రీ త్యాగరాజు భజనపద్ధతిలో వసంతోత్సవమునకు సంబంధించునట్లుగా రచింపబడిన కొన్నికీర్తనలకుగల పేరు. ఇవి దివ్యనామసంకీర్తనల ననుసరించి వ్రాయబడిన రచనలగును. తాళ్ళపాక చిన్నయ్యకూడ నిట్టివి వ్రాసెను.

వసవళంకానవాళ్ :— 'తాళసముత్తిరమ్' అను తమిళ్ వ్రాత ప్రతి గ్రంథములో పేర్కొనబడినతాళములలో నొకదానిపేరు.

వసు :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో పేర్కొనబడిన 'ఖండజాతి ఝంపె' తాళమునకుగల పేరు. దీనికి అంగములు । ◡ 0. అక్షరకాలములు 8.

వసు :— శాస్త్రీయమైన 35 తాళములలో 'సంకీర్ణజాతి ఏకతాళము'నకుగల మరియొక పేరు. దీనికి అంగము ।. అక్షరకాలములు 9.

వసుకరి :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ స.

వసుగర్భ :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

వసు - చక్రము :— 72 మేళకర్తలుంగల 12 మేళచక్రములలో 8 వ చక్రమునకు గలపేరు. దీనిలో 43 - 48 వఱకు మేళకర్తలుండును.

వసు - గో :— 8 వ మేళచక్రమగు 'వసు' చక్రములోని 3 వ మేళమగు 'శుభపంతువరాళి'కి వేంకటమఖి పెట్టిన సంకేతనామము. ఇది 45 వ మేళకర్తయగును.

వసు - పా :— 8 వ మేళచక్రమగు 'వసు' చక్రములోని 1 వ మేళమగు "గవాంభోది"కి వేంకటమఖి పెట్టిన సంకేతనామము. ఇది 43వ మేళకర్తయగును.

వసు - భూ :— 8 వ "వసు" చక్రములోని 4 వ మేళమగు "షడ్విధమార్గిణి"కి

'వేంకటమఖి' పెట్టిన సంకేతనామము. ఇది 46 వ మేళకర్తయగును.

వసు - మా :— 8 వ 'వసు' చక్రములోని 5 వ మేళమగు "సువర్ణాంగి"కి 'వేంకటమఖి' పెట్టిన సంకేతనామము. ఇది 47 వ మేళకర్తయగును.

వసు - శ్రీ :— 8 వ 'వసు' చక్రములోని 2 వ మేళమగు "భవప్రియ"కు 'వేంకటమఖి' పెట్టిన సంకేతనామము. ఇది 44 వ మేళకర్తయగును.

వసు - షా :— 8 వ "వసు" చక్రములోని 6 వ మేళమగు "దివ్యమణి"కి 'వేంకటమఖి' పెట్టిన సంకేతనామము. ఇది 48 వ మేళకర్తయగును.

వసుమతి :— 21 వ మేళకర్తయగు "కీరవాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

వళి :—వీణాదివాద్యములలో ఒక స్వరస్థానములో తంతిని నొక్కిలాగి దానిమీది స్వరములచ్ఛాయను రాజేయుటకుగల పేరు.

వ్యంజనము :—తాళ షడంగములగు 6 టిలో మొదటిదగు 'అనుద్రుతము'నకుగల విశేషనామములలో 3 వ దానికి గలపేరు.

వ్యక్తినాట్యము :— "శిలప్పదికారమ్" అను ప్రాచీన తమిళ గ్రంథములో పేర్కొనబడిన 3 రకముల నృత్యములలో రెండవదానికి గలపేరు.

వ్యభిచారీభావము :— భావశాస్త్రమందు పేర్కొనబడిన భావములు 5 టిలో 4 వ దానిపేరు. దీనినే సంచారీభావమనికూడ చెప్పుదురు. ఇది 33 విధములుగానుండును.

వ్యవసాయదారుల పాటలు :— వర్షము నాకాంక్షించునప్పుడును, ఆయా ఋతువులయందు విత్తనములు చల్లునప్పుడును, మొక్కలు నాటునప్పుడును, కోతలుకోయునప్పుడును, కుప్పలునూర్చునప్పుడును వ్యవసాయదారులు పాడునటువంటి పాటలకు గలపేరు.

## వా

వాక్కు :— వ్యభిచారీభావము యేర్పడుటకు ముఖ్యమైనవగు వాక్కు, అంగము, సత్వము అను మూడింటిలో మొదటి దానికిగల పేరు.

*వాగధీశ్వరి :— 72 మేళకర్తలలో 34 వ మేళకర్తకుగల పేరు. ఇది 6 వ 'ఋతు' చక్రములోని 4 వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక ష. రి — అం. గాం — శు. మ — చ. ధై — కై. నిషాదస్వరములుండును. శ్రీ త్యాగరాజుని 'పరమాత్ముడు' అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదైయున్నది.

వాగ్వముఖి :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

వాగారంభానుభావములు :— అను భావములోని 4 రకములలో 3 వ దానికి పేరు. ఇది ఆలాపము, విలాసము, సల్లాపము, ప్రలాపము, అనులాపము, అపలాపము, సందేహము, అతిదేశకము, నిర్దేశకము, అపదేశకము, ఉపదేశకము అను 11 విధములుగా నుండును.

వాగ్వాదిత్య :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. ఔడవ - సంపూర్ణము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

వాగీశ్వరి :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

వాగ్గేయకారకప్రథముడు :— ప్రాచీనులైన తిరుపతి వాస్తవ్యులగు శ్రీతాళ్ళపాక అన్నమాచార్యునికిగల నొక బిరుదుపేరు. ఈయన తోడయమంగళమువంటి భజన కీర్తనలుకూడ రచించిన మహనీయుడు.

వాగ్గేయకారకరత్న :— కృష్ణాజిల్లా బందరు వాస్తవ్యులును, న్యాయవాదులును, సంగీత సాహిత్యవేత్తలును, రచయితలును, సుప్రసిద్ధ జంత్రగాత్ర విద్వాంసులునగు 'శ్రీ హరినాగభూషణము' (బి. ఏ;) నకు గల ప్రసిద్ధమైన బిరుదుపేరు.

వాగ్గేయకారకుడు :— 'మాతు' యనబడు శబ్దరూపమైన సాహిత్యమును 'ధాతు' యనబడు స్వరరూపమైన వర్ణమెట్టును ఈ రెంటియందును నేర్పుగలిగి గానము చేయు గాయకునికిగల పేరు.

*వాచస్పతి :—72 మేళకర్తలలో 64 వ మేళకర్తకు గలపేరు. ఇది 11 వ 'రుద్ర' చక్రములోని 4 వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక చ. రి - అం. గాం - ప్ర. మ - చ. ధై - కై. నిషాదస్వరములుండును. శ్రీ త్యాగరాజుని 'కంటజూడుమీ' అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదైయున్నది.

వాచికాభినయము :— స్వగీత, ఉపగీత, స్వశబ్ద, ఉపశబ్ద, మనుభేదంబులు గలిగియున్న 'అభినయము'నకు గలపేరు.

వాచికాభినయము :— అభినయములోని 4 రకములలో 2 వ దానికిగల పేరు. అనగా భావ, ఉచ్చారణ, స్థాయిభేదములు కలిగి, భావయుక్తముగా నుండునట్టి అభినయమునకు పేరు.

*వాటివసంతభైరవి :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము'నకు శ్రీ వేంకటమఖి యేర్పఱచినటువంటి మరియొక పేరు.

వాణిని :—68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము. ఇది

ఔడవ - ఔడవ రాగమునకు చెందును.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

వాణిపంచమము :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము. ఇది ఉభయ వక్రసంపూర్ణ రాగమునకు చెందును. [సం. స్వ. ప్ర. సా.]
ఆరోహణము- స రి గ మ రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ ప మ రి స.

వాద్యము :— సంగీతము, లేక శ్రుతి, లేక లయకు సంబంధించిన ధ్వని విశేషమును పలికింపబడునట్టి సాధనము లేక పనిముట్టునకుగల పేరు. ఇది ముఖ్యంగా 4 విధములు గా నుండును. 1. తంత్రీవాద్యములు, 2. రంధ్ర లేక గాలి వాద్యములు, 3. చర్మవాద్యములు, 4. లోహవాద్యములనునవి.

వాద్యములనేబిరుదులుగానొందినసంగీత కళాకోవిదులు :—శ్రీ గోటువాద్యం శ్రీనివాసరావు, వీణ వేంకటరమణదాసు, వీణ కుప్పయ్యర్, వీణ శేషన్న, వీణ పెరుమాళయ్య, ఫిడల్ అంబాయిరమ్, దాసవాద్యం కృష్ణయ్యర్, బాలసరస్వతి జగన్నాథభట్ గోస్వామి, స్వరబల్ కృష్ణయ్యర్, ఫ్లూట్ శరభశాస్త్రిగళ్, జలతరంగం సుబ్బయ్యర్, జలతరంగం రమణయ్యశెట్టి, మృదంగం నారాయణప్ప, డోలక్ నన్నుమే, ఘటం కృష్ణయ్యర్, ఘటం సుందరమయ్యర్, మోర్సింగ్ శీతారామయ్యర్ మొదలగువారీరకమునకు చెందుదురు. వర్తమాన కాలములో శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుకు 'ఫిడల్ నాయుడు' అను ప్రఖ్యాతమగు వాద్యబిరుదు కలదు.

వాద్యలఘువు :—మిశ్రదేశ్య సంకీర్ణజాతి లఘువునకుగల మరియొక పేరు. ఇది 12 అక్షరకాలములు గలిగియుండును.

వాద్యసమ్మేళనము :—వివిధములగు సంగీత, లయ, శ్రుతివాద్యముల చేరికతో ప్రదర్శించుఆర్కెస్ట్రాకు తెలుగులోని పేరు.

వాద్యాధ్యాయము :—'శార్ఙ్గదేవుని' చే రచింపబడిన 'సంగీతరత్నాకరము'లోగల 7 అధ్యాయములలో 6 వ దానికిగల పేరు. మిగత 6 టికిని స్వరగతాధ్యాయము, రాగవివేకాధ్యాయము, ప్రకీర్ణకాధ్యాయము, ప్రబంధాధ్యాయము, తాళాధ్యాయము, నృత్యాధ్యాయములని పేరుగలదు.

వాది :— అనగా ధ్వనినిచ్చు స్వరము. ఒక రాగములో ముఖ్యమైనట్టిగాని, సుస్పష్టమైనట్టిగాని, జీవస్వరముపలె నుండునట్టి దానికి 'వాది' యని పేరు. ఇది రాగములో అనేకసార్లు ధ్వనింపజేయుదురు. ఈ వాది స్వరము రాజుతో పోల్చదగినదిగానుండును.

వాదిత్యవినోదిని :—33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప రి స.

వామలోచన :— 1 వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప మ రి స.

వామాశుకిరణి :— 55 వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.

ఆరోహణము– స రి మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ రి స.

వాయుజ :— వాయువు లేక గాలిచే ఊదబడు వేణువు, (ఫ్లూట్) నాగస్వరము వంటి వాద్యములనుండి వచ్చు ధ్వని లేక స్వరములకుగల పేరు.

వారిణి :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప రి స.

వారిదరంజని :— 72 వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ని స.
అవరోహణము– స ని ప మ రి స.

వార్తికము :— నాలుగు మాత్రలను ఒక కళగా గైకొనునది వార్తికమనబడును. కాని కొన్ని గ్రంథములలో ఒక దీర్ఘాక్షర ప్రమాణము గలదియే వార్తికమార్గమని చెప్పియుండిరి.

వాలిత :— 'భావభట్టుని' 22 శృతుల విధానములో పంచమమునకుగల 4 శృతులలో 2 వ శృతికి గలపేరు.

వాసంతి :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ధ స.
అవరోహణము– స ధ ప గ రి స.

వాసవసజ్జిక :— నాయికలలోని 8 విధములలో 2 వ దానికి గలపేరు. ఈమె ప్రియుడువచ్చెడి సమయమునందు తానలంకరించుకొని, కేళీగృహము నలంకరించి ప్రియునిరాకకు యెదురుచూచునదిగా నుండును.

వాసుదేవ :— మైసూరు సంస్థాన సంగీత సాహిత్య విద్వాంసులగు సంగీతకళానిధి 'శ్రీ కె. వాసుదేవాచారి' తన రచనలందు పెట్టుకొనిన ముద్రకుపేరు.

వాహిని :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ధ స.
అవరోహణము– స ధ ప గ రి స.

వ్యాధి :— వ్యభిచారిభావములోని 33 విధములలో 29 వ దానికిగల పేరు.

వ్యాపక :— 'భావభట్టుని' 22 శృతుల విధానములో నిషాదమునకుగల శృతులు 2 టిలో మొదటి శృతికిపేరు.

# వి

వికట :— నృత్యములోని భేదములు 2 టిలో 2 వ దానికి గలపేరు.

వికలుడు :— సంగీతము ప్రదర్శించుటలో హెచ్చుతక్కువలైన స్వరములతో గానముచేయు గాయకునికి గలపేరు.

వికాలిని :— నారదుని 'సంగీతమకరం

దము'లో పేర్కొనిన ద్వావింశతి శ్రుతులలోని ధైవతశ్రుతులు 3 టిలో 2 వ దానికి గల పేరు.

వికృతశ్రుతులు :— ద్వావింశతి శ్రుతులగు 22 టిలో 1, 2, 3, 5, 6, 8, 10, 11, 12, 14, 15, 16, 18, 19, 21 యీ శ్రుతులను 'వికృత శ్రుతు'లని చెప్పుదురు.

వికృతస్వరములు :— షోడశ స్వరములగు 16 టిలో శుద్ధస్వరములు 7 గాక మిగిలిన 9 స్వరములకు వికృతస్వరములని పేరు. ఉ॥ చ. రి – మ. రి – సా. గాం – అం. గాం – ప్ర. మ – చ. షై – మ. ధై – కై. ని – కా. నిషాదములను వికృతస్వరములని చెప్పబడును.

వికృతస్వరములు:–పైవాటినే ప్రాచీనులు మరియొక పద్ధతిలో జెప్పిరి. అవి చ్యుతషడ్జ – అచ్యుతషడ్జ – సాధారణ ఋషభ – సాధారణగాంధార – అంతరగాంధార – చ్యుతమధ్యమ – అచ్యుతమధ్యమ – త్రిశ్రుతి పంచమ – కైశికీపంచమ – చతుశ్శ్రుతిధైవత – కైశికీనిషాద – కాకలీనిషాదములనునవి. ఈ 12 టినే వికృత స్వరములుగా జెప్పిరి.

విఖ్యాతనాయకులపాటలు :— పేరుబడిన పెద్దపెద్ద గ్రామములకు ఒక్కొక్క విఖ్యాతి నాయకు డుండును. ఆ గ్రామవాసులు ఆ నాయకుని ప్రస్తుతించుచూ పాడబడునట్టి పాటలకుగల పేరు.

విష్ఫురంజిత :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ గ మ ప ధ స.
అవరోహణము– స ధ మ గ రి స.

విచిత్ర :— గాంధార గ్రామములోని 7 మూర్ఛనలలో 4 వ దానికిగల పేరు. దీనినే 'చిత్రము' అనికూడ చెప్పుదురు. ఇది 'ని' తో ప్రారంభమగును. అనగా ని స రి గ మ ప ధ ని యగును.

విచిత్రప్రబంధము :— వివిధ రాష్ట్రభాషలలో సాహిత్యము రచింపబడు ప్రబంధమునకుగల పేరు. ఇది పాటమ్ము, తెన్నకమ్ము, తాళములచే అలంకరింపబడియుండును.

విచిత్రాంబరి :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

విచ్చు :— ఉనికి లేక విసర్జితమునకు పేరు. అనగా తాళము వేయుటలో అధోముఖముగానున్న కుడిచేతిని పైకి విసరుటయగును.

విజయకోసల :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మ ప స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

విజయగోశ్రీరి :— 62 వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

విజయగోపాల :— సంస్కృతాంధ్ర సంగీతములందు సమర్థుడగు 17వ శతాబ్దమునకు చెందిన శ్రీ విజయగోపాలుడను మధుర మీనాక్షీదేవి యనుగ్రహ మొందిన

శ్రీ శ్రీనివాసులును తమ రచనలందు పెట్టుకొనిన ముద్రకు పేరు. వీరు గొప్ప పండితులు, భక్తులునగుదురు. వీరి కీర్తనలు దక్షిణభారతములో నేటికిని భజనలందు విశేషముగా పాడబడుచున్నవి.

విజయగోపాలుడు :— సుప్రసిద్ధ భజన కీర్తనల రచయితకు గలపేరు.

విజయతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 44 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 8 8 8 । 8. మాత్రలు 9. అక్షరకాలములు 36.

విజయతాళము :— 'రత్నాకర' గ్రంధస్థమైన 120 దేశితాళములలో 51 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 3 8 3.

విజయదీపిక :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని ధ స.
అవరోహణము– స ధ ని ప మ గ రి స.

విజయనగరము:—దక్షిణ ఇండియాలో ఆంధ్రరాష్ట్రములోని విశాఖపట్టణము జిల్లాకుచెందినట్టియు, పూర్వకాలమునుండి నేటివఱకు సంగీతకళాపోషణకును, సంగీత శిక్షణకును విశేష ప్రఖ్యాతిచెందిన ఒక గొప్ప సంస్థానము. ఇచ్చట నేటికిని మహారాజావారి సంగీత కళాశాల యొకటి కలదు. ఈ కళాశాల యావద్భారత ప్రఖ్యాతి గడించిన వయొలిన్ వాద్యకులగు సంగీతకళానిధి శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు యొక్క ఆధ్వర్యమున దినదినాభివృద్ధి చెందుచూ అనేకమంది విద్యార్థులను గానకళయందు తీర్ణులుగా జేయుట కుపకరించుచున్నది. ఈ కళాశాల ఇటీవలనే రజితోత్సవముకూడ జరుపుకొనుట యెంతయు విశేషమగును.

విజయనాగరి :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ రి స.
ఈరాగములో శ్రీగాయకశిఖామణి ముత్తయ్యభాగవతర్ యొక్క 'విజయాంబికే' అను ప్రసిద్ధ కృతి గలదు.

విజయప్రద :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ స.
అవరోహణము– స ధ మ గ రి స.

విజయభూషావళి :— 43 వ మేళకర్తయగు "గవాంభోది" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మ ప స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

విజయరత్నాకరి :—60వ మేళకర్తయగు "నీతిమతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ప మ గ స.

విజయరాఘవ పంచరత్నములు :— తంజావూరుమహారాజగు శ్రీవిజయరాఘవ నాయకుని కోర్కెపై శ్రీ క్షేత్రజ్ఞుడు వ్రాసిన 5 సుప్రసిద్ధ సంగీత పదరచనలకు "విజయరాఘవ పంచరత్నము"లని పేరు. ఈ 5 పదములను రాజాంకితముగానే క్షేత్రయ్య రచించియుండెను.

విజయరామ :— ప్రాచీన తెలుగుపద కవులగు "వినుకొండ" వారు తమ పదము లందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

విజయవసంతము :— 54 వ మేళకర్త యగు "విశ్వంభరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ స.

విజయశ్రీ :— 41 వ మేళకర్త యగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.
శ్రీత్యాగరాజుని "వరనారద" అను ప్రసిద్ధమైనకృతి యీ రాగములో గలదు.

విజయశ్రీకంఠి :— 59 వ మేళకర్తయగు "ధర్మవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

విజయసరస్వతి :— 57 వ మేళకర్త యగు "సిమ్హేంద్రమధ్యమము" యొక్క జన్యరాగము. ఉభయ - షాడవము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

విజయసామంతము :—58 వ మేళకర్త యగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

విజయసారంగ :—58వ మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

విజయానందతాళము :— "అష్టోత్తరశత" తాళములగు 108 టిలో 39 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు । । 8 8 S. మాత్రలు 8. అక్షరకాలములు 32.

విజయానన్దతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 44వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు । । 8 8 S.

విజయాభరణి :—64 వ మేళకర్తయగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

విజయాభీరు :— 46 వ మేళకర్తయగు "షడ్విధమార్గిణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

విజయోల్లాసిని :— 14 వ మేళకర్తయగు "వకుళాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

విజికలిత :— 28 వ మేళకర్త యగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ గ రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స రి స.

విజృంభిణి :— 64 వ మేళకర్త యగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

విటపి :— 4 వ మేళకర్తయగు "వనస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

విటపి :— 37 వ మేళకర్తయగు "సాలగము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

విటుడు :— ఉపనాయకులలోని 4 రకములలో 2 వ రకమునకు చెందినవాడు. ఇతడు మారశాస్త్ర ప్రవీణుడుగా యుండును.

విడిమీటు :— వీణావాద్యములో మీది తంత్రులగు మధ్యషడ్జ, మంద్రపంచమ, తంత్రులను, కొన్ని కొన్ని సందర్భములలో రంజనముకై "విడిగామీటుట"కుగల పేరు.

వితర్కము :— వ్యభిచారీభావములో పేర్కొనబడిన 33 విధములలో 33 వ దానికి "వితర్క" మని పేరు.

వితాలుడు :— తాళమును విడచి గానము చేయునట్టి గాయకునికి గలుగు పేరు.

వితానశంకి :— 33 వ మేళకర్తయగు "గాంగేయభూషణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ ప గ రి స.

విదతాళము :— 'భరతశాస్త్రమ్' అను తమిళ గ్రంథములోగల 9 లేక నవ తాళములలో 9 వ తాళమునకుగల పేరు. మిగిలిన 8 తాళములు అర్కి, అర్ధము, సమ, జయ, చిత్ర, దురువ, నివిర్త, పదిను తాళములగును.

విదతాళము :— 'పింగళ నిగండు'చే పేర్కొనబడిన 9 లేక నవ తాళములలో 7 వ తాళమునకుగల పేరు.

విదళ :— 35 తాళములలో 20 వ తాళముగు 'ఖండజాతి అటతాళము' నకుగల పేరు. దీనికి అంగములు । । 0 0. మాత్రలు $3\frac{1}{2}$. అక్షరకాలములు 14.

విద్యాశిక్షణ :— సంగీత కళాభ్యాసమునందుగల రచనలలో స్వరజతులు మొదలుకొని తదుపరి యభ్యసించు అన్ని రచనలు అనగా వ్రేలికి ఒకటింటికి మొదటి కాలమునందే 4 అక్షరకాలములు వేయునట్టి వివిధ సంగీత రచనలయొక్క శిక్షణకు ప్రాచీన వాగ్గేయకారులు 'విద్యాశిక్షణ' యని చెప్పియుండిరి.

విదారి :— రాగవర్ధనులను ముగించు క్రియలకు 'విదారు'లని పేరు.

విద్యుతానము :— తానములోని 6 విధములలో 6 వ దానికిగల పేరు.

విదూషకుడు :— ఉపనాయకులు 4 గురిలో 4 వ రకమునకు చెందిన హాస్యము చేయువానికిగల పేరు.

వినయమృగి :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

వినాయకతాళము :— యక్షగానములో నుపయోగించెడి ఒక రకపు తాళముపేరు. దీనికి అంగములు 888।।38।।3. మాత్రలు 18. అక్షరకాలములు 72.

విన్యాసము :— రాగాలాపనలో రాగమును పలు ఖండములుగాచేసి ఆ ఖండములలో రాగకళలను జూపుటకై మాటిమాటికి ప్రయోగించు స్వరమునకు పేరు.

వినిమిలకుడు :— నేత్రములను మూసికొని గానముచేయు నటువంటి గాయకునికి గలపేరు.

విప్రకీర్ణప్రబంధము :— శార్ఙ్గదేవాదులచే విభజింపబడిన 3 విధములగు ప్రబంధములలో 3 వ రకమునకుగల పేరు.

విప్రలబ్ధ :— సంకేత స్థానమందు నాథునిచే వంచింపబడిన 'స్మరపీడితురాలగు నాయిక'కు గలపేరు.

విపుల :— 32 వ మేళకర్త యగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప గ రి స.

విఫణి :— 6 వ మేళకర్త యగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

విబోధము :— వ్యభిచారీ భావములోని 33 విధములలో 24 వ దానికిగల పేరు.

విభంగతాళము :— 'భరత శాస్త్రమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనిన యొక తాళమునకు పేరు.

విభావతి :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము :— స ధ ప గ రి స.

విభావము :— భావశాస్త్రమందు పేర్కొనబడిన భావములు 5 టిలో మొదటిదానికి 'విభావ'మని పేరు. స్థాయీభావములు దేనిచే భావింపబడుచున్నవో అద్దానిని విభావమందురు. ఇది రెండు విధములు. 1. ఆలంబన విభావము, 2. ఉద్దీపన విభావము అనునవి.

విభావరి :— 6 వ మేళకర్త యగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

విభాషరాగము :— మార్గరాగములోని 6 భేదములలో 5 వ దానికిగల పేరు.

విభూతి :— నారదుని 'సంగీత మకరందము'లోని 22 శ్రుతులకుగల పేర్లలో మధ్యమమునకుగల 4 శ్రుతులలో 4 వ శ్రుతికిగల పేరు.

విమలి :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

విరజాంధత :— 61 వ మేళకర్త యగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

**విరటి :—** 55 వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ మ ని ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

**విరసుడు :—** విరసమగు ముఖచేష్టలు కలిగి గానముచేయు గాయకునికిగల పేరు.

**విరహోత్కంఠిత :—** అష్టవిధ నాయికలలో 3 వ దాని పేరు. ప్రియుడు, తాను చేయునట్టి యపరాధము నొక్కింతయు మనసునందు లేనివాడై, నేదియో కార్యంబులంజిక్కి తనగృహంబునకు రా నాలస్యమగుచుండ ఆ యాలస్యమునకు ఓర్వలేక ఖిన్నురాలై, తమి నాపుకొనజాలక నాథునికై యెదురు జూచునది 'విరహోత్కంఠిత' యని చెప్పబడును.

**విరామము :—** షడంగములలో మొదటిదైన 'అనుద్రుతము' నకుగల విశేషనామములలో 6 వదాని పేరు.

**విరారణి :—** 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ రి గ రి స.

**విరుత్తమ్ :—** సామరస్యములేని అభినయమునందు ప్రదర్శింపబడు సంగీతరచనకు [illegible] శ్లో[illegible]ములు తమగాని సంగీత [illegible].

**విరుత్తమ్ :—** మహారాష్ట్ర పద్ధతికిచెందిన కథాకాలక్షేపములలో పాడబడునట్టి యొక ప్రత్యేక సంగీత రచనకుగల పేరు.

**విర్పురము :—** 'తాళసముద్రిరమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనిన తాళములలో 12 వ తాళమునకుగల పేరు.

**విలంబితకాలము :—** మందగమనములేక చౌక కాలమునకుగల పేరు. దీనినే ఇంగ్లీషులో స్లోటెంపో (Slow Tempo) అందురు.

**విలంబితలయలోని భేదములు :—** 'విలంబిత' విలంబిత మధ్య, విలంబిత ద్రుత యను మూడు భేదములకు గలపేరు.

**విలక్షణ :—** 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

**విలాంభూరి :—** 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ని ధ ని ప మ ప గ రి స.

**విలాసము :—** దీనికే 'విశాల' అను పేరు కూడగలదు. ఇది 21 మూర్ఛనలలో 16వ మూర్ఛనకుగల పేరు. దీనికి రి షభము ప్రారంభ స్వరము.

**విలాసవతి :—** 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

విలోకితతాళము :— రతితాళము, మదన తాళముగూడి యేర్పడిన 'మార్గసాలగ' తాళమునకుగల పేరు.

విలోకితతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 102 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I 8003. మాత్రలు 7. అక్షరకాలములు 28.

విలోకితతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 98 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 0 0 3. [గానభాస్కరము]

విలోమక్రమచిట్టస్వరకృతి :— శ్రీముద్దుస్వామి దీక్షితర్, కల్యాణి రాగము, ఆదితాళములో రచించిన 'కమలాంబాం భజరే' వంటి కృతికిగల పేరు.

విలోమము :— స్వరములను పాడునపుడుగాని వీణ, గోటు, వయొలిన్ వంటి వాద్యములందు మీటునపుడుగాని లేక విల్లు (Bow) తో వాయించునపుడుగాని ప్రథమ కాలముగా స్వరముల నడుపుచూ, తాళాక్షరకాలములను త్రికాలముగాగాని, షట్కాలముగాగాని నడుపుటను 'విలోమము' అని చెప్పుదురు.

వివర్ధని :— 29 వ మేళకర్తయగు, 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స రి మ ప స.

అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శ్రీ త్యాగరాజుని 'అభిమానమెన్నడు' అను ప్రసిద్ధకృతి యీ రాగములోగలదు.

వివాది :— అనగా రెండు స్వరముల నడుమ నొక శ్రుతియుండిన యెడల అట్టి రెండు స్వరములు పరస్పరము వివాదులగును. ఈ వివాది శత్రువునకు సదృశమైనదియగును. వాదికిని వివాదికిని సంయోగము వుండదు. మరియునీ వివాది స్వరములు క్రమముగా యెప్పుడును రావు.

వివాదిమేళములు :— 72 మేళకర్తలలో శుద్ధగాంధార, శుద్ధనిషాద, షట్శ్రుతి ధైవతములలో ఏదైన ఒకటి లేక రెండు స్వరములను తీసికొనునట్టి 40 మేళకర్తలను 'వివాదిమేళము' లందురు. అనగా 12 మేళచక్రములలో శుద్ధగాంధారముగల 1, 7 చక్రములందలి 12 మేళములును, షట్శ్రుతి రిషభముగల 6, 12 చక్రములందలి 12 మేళములును కలసి మొత్తం 12 + 12 = 24 మేళములగును. పై నాలుగు చక్రములుగాక మిగత 8 చక్రములలో ఒక్కొక్క చక్రములో శుద్ధనిషాదముగల మొదటి మేళమును, షట్శ్రుతి ధైవతముగల ఆఱవ మేళమును కలసి చక్రము ఒకటికి 2 మేళముల వంతున 8 చక్రములకు 8 × 2 = 16 మేళములగును ఈవిధముగా మొత్తము 24 + 16 = 40 వివాది మేళములగుచున్నవి.

వివిధములగు పేర్లుగల రాగములు :— ప్రాచీన గ్రంథములలో పేర్కొనిన ధన్యాసి, యదుకులకాంభోజి వంటి రాగములకుగలపేరు. ఎటులనగా ధన్యాసిని — ధన్నాశి, ధనాశి, ధనాసి, ధనాశ్రీ, ధనాసరి అనియు, యదుకులకాంభోజిని — ఎదుకులకాంభోజి, జదుకులకాంభోజి, ఎదు

కులకాంభోది అనియు పేర్లుండుటచే నిట్టి రాగములు యీరకమునకు చెందిన వగును.

వివేకప్రకాశబోధము :— 'అభినయసార సంపుటము' అను తమిళములో వ్రాయబడిన "నాట్యశాస్త్ర" మను గ్రంథము నందుగల 6 భాగములలో 1 వ భాగము యొక్క పేరు. దీనిలో బోధకులు, బోధనా పద్ధతులు శిష్యులయొక్క అర్హతలు, ఉపయోగములు, మొదలగునవి పేర్కొనబడి యుండును.

విశ్వ :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో 'సంకీర్ణజాతి త్రిపుటతాళ ము'నకు చెప్పబడినపేరు. దీనికి అంగములు 1 0 0. అక్షరకాలములు 13.

*విశ్వంభరి :— 72 మేళకర్తలలో 54 వ మేళకర్తకు గలపేరు. ఇది 9 వ "బ్రహ్మ"చక్రములోని 6వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక, శు. రి - అం. గాం- ప్ర. మ- ష. ధై- కా. నిషాద స్వరములుండును.

విశ్వధాత్రి :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

విశ్వాంకిణి :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప ధ మ గ రి గ రి స.

విశారద :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి స.

విశారిణి :— "సంగీత మకరందము"లో పేర్కొనిన 22 శృతులలో నిషాదశృతులు 2 టిలో 1 వ శృతికిపేరు.

విశాల :— గాంధార గ్రామములోని 7 మూర్ఛనలలో 2 వ దానికి గలపేరు. ఇది 'రి' నుండి ప్రారంభమగును. అనగా "రి గ మ ప ధ ని స రి" యగును.

విశ్రాంతి :— దీనినే ఇంగ్లీషులో ఇంటెర వల్ (Interval) అని చెప్పుదురు. ఒక హెచ్చుస్వరము ఒక తగ్గుస్వరమున్నచో, తగ్గుస్వరముకంటె హెచ్చుస్వరము ఎన్ని సార్లు ఎంతెంతకాలమునకు వచ్చినదో తెలుపు పరస్పర సంబంధమునకు గలపేరు.

విశేషలఘువులు :— ఈ క్రిందను తెలుపబడిన 5 విధములగు లఘువులకు పేరు.

| లఘువులపేర్లు. | ఘాతలు. | వ్రేళ్లు. | అ॥ కా॥ |
|---|---|---|---|
| దివ్యసంకీర్ణలఘువు | 1 ... | 5 ... | 6 |
| మిశ్రసంకీర్ణలఘువు | 1 ... | 7 ... | 8 |
| దేశ్యసంకీర్ణలఘువు | 1 ... | 9 ... | 10 |
| మిశ్రదేశ్యసం॥ ల॥ | 1 ... | 11 ... | 12 |
| దేశ్యశుద్ధ సం॥ ల॥ | 1 ... | 15 ... | 16 |

వింశోత్తరశతతాళములు :— 'సంగీత రత్నాకరము'లో గల 120 దేశితాళములకు గలపేరు. పూర్వులు తాళములను గుఱించి ఒక్కొక్క గ్రంథములో ఒక్కొక్క

రీతిగా చెప్పియున్నారు. ఉ॥ 'రాగతాళ చింతామణి' అను తెలుగు గ్రంథములో చతుర్వింశోత్తరశత తాళములను 124 తాళములను, 'సంగీతమకరంద' 'సంగీత సమయసార' అను గ్రంథములలో ఏకోత్తర శత తాళములను 101 తాళములను పేర్కొనబడి యున్నను నేడు 35 తాళము లనే విశేషముగా వాడుచున్నారు.

విషమ :— నృత్యములోని భేదములగు 2 టిలో మొదటి దానికి గలపేరు.

విషమకంకాలతాళము :— 'అష్టోత్తర శత తాళము'లగు 108 టిలో 76 వ తాళ మునకు గలపేరు. దీనికి అంగములు । 8 8. మాత్రలు 5. అక్షరకాలములు 20.

విషమతాళము :— 'అష్టోత్తరశత తాళ ము'లగు 108 టిలో 67 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 0000◡0000◡. మాత్రలు 4½. అక్షరకాలములు 18.

విషమతాళము :— 'రత్నాకర' గ్రంథ స్థమైన 120 తాళములలో 59 వ తాళము పేరు. దీనికి అంగములు 0000◡0000◡.

విషమపూర్ణతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 65 వ తాళముపేరు. దీనికి అంగములు । 8 8.

విషమము :— 'సంగీత కాముది' అను గ్రంథములో పేర్కొనిన తాళసంబంధ మగు గ్రహలక్షణలోని 9 గ్రహములలో 3 వ దానికి గలపేరు.

విషమము :— సంగీతరచనలలో యే రచనయైనను తాళము, పాట సమముగా ప్రారంభించక ముందుగాని వెనుకగాని ప్రారంభించుటను విషమము లేక విషమ గ్రహమని చెప్పుదురు.

విషమయతి :— ఒక తాళావర్తములో నుండు అంగములు కురుచబడియు, పెరిగియు పలువిధములుగా యుండునది 'విషమ యతి' యనబడును. ఉ॥ ।08◡3।8.

విషయనారాయణి :— 23 వ మేళకర్త 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము. ఆరోహణము— స రి గ మ ప ధ ని స. అవరోహణము— స ధ ప మ గ రి స.

విషుపది :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము— స రి మ ధ ని స. అవరోహణము— స ని ధ మ రి స.

విష్ణుకీర్తనలు :— శ్రీ త్యాగరాజస్వామి రచించిన విష్ణుసంబంధమైన కీర్తనలకుగల పేరు. శ్రీ నరసింహభాగవతులు ప్రకటించిన "త్యాగరాజస్వామి కీర్తనలు" అను పేరుగల ఆఱు భాగములుగల తెలుగు గ్రంథములో 1 మొదలు 158 పేజీల వరకు శ్రీ త్యాగరాజు రచించిన విష్ణు సంబంధమైన కీర్తనలును, 158 మొదలు 178 పేజీలవరకు శివసంబంధమైన కీర్తన లును, 179 మొదలు 229 పేజీలవరకు దివ్యనామ సంకీర్తనలును, 230 మొదలు 241 పేజీలవరకు ఉత్సవ సంప్రదాయ కీర్తనలును, 242 మొదలు 291 పేజీల వరకు ప్రహ్లాదభక్త విజయ నాటకమును,

292 మొదలు 310 పేజీలవరకు నాకా చరిత్రమును ప్రకటింపబడి యుండుట గమనించునది.

విసర్జితము :— సంగీత కాలమును లెక్కించుటకుగల ఒక విధానము. దీనినే "ఉసి" అనికూడ అందురు. అనగా కుడి చేతిని పైకి విసరుట యగును.

విస్మయము :— స్థాయీ భావములోని 8 విధములలో 4 వ దానికిగల పేరు.

విస్రబ్ధనవోఢ :— స్వీయ నాయికలలోని 5 విధములలో 4 వదానిని 'విస్రబ్ధనవోఢ' యని చెప్పబడును.

విహంగిక :— 34 వ మేళకర్తయగు "వాగధీశ్వరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి స.

విళంబలయ :— తాళమునకేర్పడి యున్న అక్షరకాలములతో మందగతిగా తాళము వేయుటకు 'విళంబలయ' అని పేరు.

విళంబిని :— 50 వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ మ స.

వికిప్త :— అధోముఖమైయున్న కుడి చేతి యొక్క వ్రేళ్ళను ముడుచుటకు గల పేరు. ఇది నిశ్శబ్దక్రియ యగును.

విక్షేపక్రియ :— మార్గ నిశ్శబ్దక్రియలు 4 టిలో 3 వ దానికిగల పేరు. ఇది కుడి చేతియొక్క వ్రేళ్ళను కుడి పార్శ్వమునకు కదలించుటయగును.

విక్షేపము :— ఊర్ధ్వముగ పైకెత్తబడిన పతాక (కుడి) హస్తమును వెలుపల కుడి పార్శ్వమునకు కదలించుటకుగల పేరు. ఇది విక్షేపక్రియకు చెప్పబడిన మరియొక పేరగును.

## వీ

వీటిక :— 7 వ మేళకర్తయగు 'సేనాపతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

వీణ :— తంత్రీ వాద్యములలో అతి ప్రశస్తమైనదియు, పురాతనమైనదియు, పవిత్రమగు సంగీత వాద్యమునకుగల పేరు. [illegible] మొత్తం 4+3 = 7 తంత్రులుండి [illegible] మెట్లుం డును. ఈ ఏడు తంత్రులలో మీది నాలుగు తంత్రులను వాద్యమొనర్చుటకును, ప్రక్కనుండు మూడు తంత్రులను తాళము వేయుటకును వుపయోగింతురు.

వీణకుప్పయ్యర్ :— 19 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ వాగ్గేయకారుని పేరు. ఈయన త్యాగరాజుని ప్రియ శిష్యుడు. ఫిడల్ వాద్యమునందు గొప్ప

ప్రజ్ఞ కలవాడు. సంగీత రత్నావళి, పల్లవి స్వరకల్పవల్లి గ్రంథముల రచించెను.

వీణరహస్య ప్రకాశిక :— ఇది విజయనగర సంస్థాన విద్వాంసులగు "శ్రీ వీణ వేంకట రమణ దాసు" రచించిన గ్రంథము పేరు. ఇందు సంస్కృత శ్లోకములును, వాటికి తెలుగు అర్థములతో వీణ అభ్యాసము లును, బంధతానము (మచ్ఛతానము, నాగ బంధము) ను గురించి వివరించియున్నారు.

వీణశాస్త్రి :— పిఠాపురం వాస్తవ్యులగు శ్రీ తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారికిగల గౌరవనామము. ఈయన వీణావాద్యము నకు విశ్వకవి "శ్రీరవీంద్రనాథ ఠాగూర్" మిక్కిలి ప్రశంసించుటయేగాక విదేశము లకు రమ్మనికూడ ఆహ్వానించెను.

వీణాధరి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గా రి స.

వీణాధారములు :— వీణావాద్యములో కుండలి, మొదలు తలవరకు విభజింపబడిన 6 విధములగు ఆధారములకుగల పేరు. (1) మూలాధార, (2) స్వాధిష్ఠాన, (3) మణిపుర, (4) అనాహత, (5) విశుద్ధ (6) అజనాయ అనువాటికిగల పేరు.

వీణావాదిని :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ని స.
అవరోహణము– స ని ప గ రి స.

వీరప్రతాప :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స ని ధ స రి గ మ ప ధ ని.
అవరోహణము– ధ ప మ గ రి స ని ధ స.

వీరమేఘము :— 70 వ మేళకర్తయగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని ధ ని స.
అవరోహణము– స ధ ప గ రి మ గ స.

వీరరస :— రాగములకు సంబంధించిన నవరసములలో 2 వ దానికి 'వీరరస' మని పేరు.

వీరవసంతము :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ రి మ ప స.
అవరోహణము– స ని ధ ని ప మ గరిగరిస.
శ్రీ త్యాగరాజుని "ఏమని పొగడుదురా" అను ప్రసిద్ధ కృతి యీ రాగమునందు గలదు. [సం. స్వ. ప్ర. సా.]

*వీరవసంతము :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ'కు 'వేంకటమఖి' పెట్టిన మరియొక పేరు.

వీరవాహిని :— 41 వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

వీరవిక్రమ :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ప ధ మ గ రి స.

వీరవిక్రమతాళము :— అష్టోత్తర శత తాళములగు 108 టిలో 19 వ తాళము నకుగల పేరు. దీనికి అంగములు I 0 0 8. మాత్రలు 4. అక్షరకాలములు 16.

వీరవిక్రమతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 12వ తాళము పేరు. దీనికి అంగములు I 0 0 8.

వీరాదివసంతము :— 25 వ మేళకర్త యగు 'మారరంజని' యొక్క జన్య రాగము. వక్ర ఔడవ-వక్ర సంపూర్ణము. ఆరోహణము— స గ రి మ ప స. అవరోహణము— స ని ధ ప మ గరిగరిస.

వ్రీడ :— వ్యభిచారీ భావములోని 33 విధములలో 13 వ దానికిగల పేరు.

# వృ

వృజినహారిణి :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము. ఆరోహణము— స గ మ ప ని స. అవరోహణము— స ని ప మ గ స.

వృత్తము :— ద్విజాతి ప్రబంధములోని 8 విధములలో 5 వ దానికిగల పేరు.

వృత్రాసుముఖి :— 34 వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము. ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స. అవరోహణము— స ధ ని ప మ గ రి స.

వృత్తిపాటలు :—ఆయావృత్తులు(పనులు) చేయువారు వారికిగల వృత్తుల ననుసరించి కొన్నిపాటలు పాడుకొనుచుందురు. అట్లు పాడెడి పాటలకు వృత్తిపాటలు అనిపేరు. ఉ॥ గొల్లభామ పాటలు, బండి లాగువారి పాటలు, ఏతము తోలెడివారి పాటలు, తిరుపతి కొండనెక్కెడి డోలీలవారి పాటలు, పడవలాగువారి పాటలు మొదలగునవి యీ రకమునకు చెందును. ఈ పాటలయందు మోటు పదములు గలిగి యుండి పురాతన సంప్రదాయములు గోచరించును.

# వె

వెలిమీటు :— వీణావాద్యమును వాయించునపుడు కుడిచేతితో తంత్రులను క్రిందినుండిమీటి మీదికిపోవుటకు "వెలిమీటు" అని చెప్పబడును.

# వే

వేంకట :— తంజావూరు శరభోజి మహారాజు ఆస్థాన విద్వాంసుడున్ను, వాగ్గేయకారుడైన శ్రీ పల్లవి గోపాలయ్యర్ తన [illegible] పేరు. ఉ॥ అంబినాదువిన్నపము, అనెడి తోడి రాగములోని కృతియందు ఇట్టి ముద్ర యుండుట కనుగొనవచ్చును. మరియు నితడు తోడిరాగములో 'కనకాంగి' అను

అటతాళవర్ణమును, కల్యాణి రాగములో 'వనజాక్షి' అను అటతాళవర్ణమును రచించిన మహానుభావుడు.

వేంకటకృష్ణ :— శ్రీ ముద్దుస్వామి దీక్షితుల తండ్రియును, ప్రాచీన వాగ్గేయకారుడైన "శ్రీ రామస్వామి దీక్షితులు" తన రచనలందు యేర్పఱచుకొనినముద్రకు పేరు.

వేంకటమఖి :—"చతుర్దండి ప్రకాశిక" అను సుప్రసిద్ధమైన ప్రమాణ లక్షణగ్రంథమును రచించిన గ్రంథకర్తకు గల పేరు.

వేంకటవైద్యనాథుడు :— శ్రీ 'వేంకటమఖి' యొక్క దగ్గర వంశస్థుడైన ప్రసిద్ధ సంగీతరచయిత రచించిన గీతములందుగల ముద్రకు పేరు.

వేంకటేశ :— ప్రాచీన తెలుగు వాగ్గేయకారుడైన "శ్రీ మానంబుచావడి వేంకటసుబ్బయ్య" తన రచనలందు యేర్పఱచుకొనిన ముద్రకు పేరు.

వేంకటేశపంచరత్నములు:—శ్రీ త్యాగరాజుని ప్రియశిష్యుడగు "శ్రీ వీణ కుప్పయ్యర్" రచించిన ప్రసిద్ధమైన "పంచరత్న కీర్తన"లకుగల పేరు. అవి, యీ దిగువను పేర్కొనుట గమనించునది.

(1) మమ్ము బ్రోవుము. సిమ్హేంద్రమధ్యమ. ఆది
(2) నన్ను బ్రోవ ... ముఖారి ... ఆది
(3) సరోజాక్ష ... సావేరి ... ఆది
(4) నీవేదిక్కని ... దర్బారు ... ఆది
(5) బాగుమీర. శంకరాభరణం. రూపకం

వేంకటేశ్వర :—సుప్రసిద్ధ వాగ్గేయకారుడైన "శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్" తన రచనలందు పెట్టుకొనిన ముద్రపేరు.

వేగదాయి :— పురాతన తమిళ గ్రంథములలో యిప్పటి 'బేగడరాగము'నకు యిచ్చినటువంటి పేరు.

వేగమాలిని :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ ధమరిగరిస.

వేగవాహిని :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
శ్రీ దీక్షితుని 'వీణాపుస్తకపాణి' యు, శ్రీ త్యాగరాజుని 'చల్లగానాతో' అను ప్రసిద్ధ కృతులు యీ రాగములోనివైయున్నవి.

వేణంగి :— తెలుగులో శృంగార రస పదకవులగు 'వేణంగి' వారు రచియించిన రచనలందుగల ముద్రకు పేరు.

వేణుగోపాల :— ప్రాచీన వాగ్గేయకారుడైన 'సారంగపాణి' తాను రచించిన పదములయందు నేర్పఱచుకొనిన ముద్రకు పేరు.

వేద (చక్రము) :— వేంకటమఖి 72 మేళకర్తలను విభజించి యేర్పఱచిన 12 చక్రములలో 4 వ చక్రమునకు 'వేద' చక్రమని పేరు. ఇందు 19 - 24 వఱకు మేళకర్తలుండును.

వేద - గో :— 4 వ 'వేద' చక్రములో 3వ మేళమగు 'కీరవాణి'కి "వేంకటమఖి"

పెట్టిన సంకేతనామము. ఇది 21 వ మేళకర్తయగును.

వేద - పా :— 4 వ "వేద" చక్రములోని 1 వ మేళమగు 'ఝుంకారధ్వని'కి 'వేంకటమఖి' పెట్టిన సంకేతనామము. ఇది 19 వ మేళకర్తయగును.

వేద - భూ :— 4 వ 'వేద' చక్రములోని 4 వ మేళమగు 'ఖరహరప్రియ'కు 'వేంకటమఖి' పెట్టిన సంకేతనామము. ఇది 22 వ మేళకర్తయగును.

వేద - మా :— 4 వ "వేద" చక్రములోని 5వ మేళమగు 'గౌరీమనోహరి'కి "వేంకటమఖి" పెట్టిన సంకేతనామము. ఇది 23 వ మేళకర్తయగును.

వేద - శ్రీ :— 4 వ "వేద" చక్రములోని 2వ మేళమగు 'నఠభైరవి'కి "వేంకటమఖి" పెట్టినసంకేతనామము. ఇది 20వ మేళకర్తయగును.

వేద - షా :— 4 వ "వేద" చక్రములోని 6 వ మేళమగు 'వరుణప్రియ'కు "వేంకటమఖి" పెట్టిన సంకేతనామము. ఇది 24 వ మేళకర్తయగును.

వేదండగమన :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

వేదఘోషప్రియ :— 28 వ మేళకర్త [illegible] 'హరికాంభోజి' జన్యరాగము.

ఆరోహణము— ని ధ ని స రి గ మ.
అవరోహణము— ప మ గ రి స ని ధ ని ప.

వేదదాయి :— 48 వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ధ ని ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

వేదనాయక :— శ్రీ 'వేదనాయకంపిళ్లె' తనరచనలందుయేర్పఱచుకొనినముద్ర పేరు.

వేదవల్లి :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

వేదస్వరూపి :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ప స.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

వేదిక :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని మ గ రి స.
ఇది ద్విస్వరవర్జ రాగమునకు చెందును.

వేదిమధ్యయతి :— ఒక తాళావర్తములోగల అంగములు 'ఉడుక' లేక 'హుడుక్క' వాద్యమువలె నడుమ కుఱుచగానుండి యిరుప్రక్కలను పెరిగియుండునది "వేదిమధ్యయతి"యని చెప్పబడును.
ఉ॥ 3 8 1 0 ◡ 0 1 8 3.

వేపథువు :— సాత్త్విక భావములోని 8 రకములలో 5 వ దానికిగల పేరు.

వేయిగీత :— "గురుమూర్తి" ముద్రతో 1000 గీతములు రచించుటచే శ్రీ పైడాల గురుమూర్తిశాస్త్రికి గల్గిన బిరుదు పేరు.

వేరు(రూట్)రాగము :— రాగములకు మూలమైన లేక ప్రధానమైన జనకరాగములకు వేరురాగములని పేరు. 72 మేళకర్తలు యీ రకమునకు చెందును.

వేళావళి :— 23 వ మేళకర్త యగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

# వై

వైకుంఠ :— చోళ దేశీయుడును, వాగ్గేయకారులలో శ్రేష్టుడును అగు 'శ్రీ వైకుంఠశాస్త్రిలు' తన రచనలందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

వైజయంతి :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప గ రి స.

వైణిక :— 'భావభట్టుని'చే పేర్కొన బడిన 22 శృతుల పద్ధతిలో పంచమమునకుగల 4 శృతులలో 1 వ శృతికిగల పేరు.

వైదికగానము :— పవిత్ర సంగీతమునకు గల మరియొక పేరు. ఇది పూర్తిగా దైవస్తుతిగానుండు గానమునకు చెందును.

వైనవతాళము :—"వనపాదచూడామణి" వ్రాసిన 'తాళసముద్రమ్' అను తమిళ గ్రంథములోగల 18 వ తాళమునకు పేరు.

వైవర్ణ్యము :— సాత్విక భావములలోని 8 విధములలో 6 వ దానికిగల పేరు.

వైశాఖము :— 54 వ మేళకర్త యగు "విశ్వంభరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మగమరిస.

వైశికుడు :—నాయకులలోని 3రకములలో 3 వ రకమునకు చెందినవాడు. ఇతడు వేశ్యాగృహములకేగి తద్భోగార్థమై ధనమును వ్యయము జేయువాడుగానుండును.

వైశ్యకి :— 54 వ మేళకర్త యగు "విశ్వంభరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

వైష్ణవి :— 50 వ మేళకర్త యగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

# వ్యో

వ్యోమము :— తాళషడంగములలో 2 వ దైన ద్రుతమునకు గల విశేష నామములలో 3 వ దానికి "వ్యోమము" అని చెప్పబడును.

# శ

శంక :— వ్యభిచారీ భావములలోని 33 విధములలో 3 వ దానికి 'శంక' అని పేరు.

శంకరప్రియ :— 49 వ మేళకర్తయగు 'ధవళాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

శంకరాభరణము :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్య సంపూర్ణరాగము. ప్రసిద్ధరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
శ్రీ త్యాగరాజుని 'ఎదుటనిలచితే' 'మనసుస్వాధీన' 'మరియాద గాదుర' 'స్వరరాగసుధారస' వంటి కృతులును శ్రీ దీక్షితుని 'అక్షయలింగవిభో' 'సదాశివం' వంటి కృతులును, శ్రీ శ్యామశాస్త్రిల 'సరోజదళనేత్రి' వంటి కృతియును, శ్రీ ముత్తయ్య భాగవతర్ యొక్క 'సహజ గుణరామ' వంటి కృతులును యీ రాగములోని ప్రసిద్ధ కృతులగును.

శంకరాభరణములో గ్రహస్వరభేదముచే యేర్పడురాగములు :— ఈరాగములో రిషభమును- షడ్జము చేసినచో ఖరహరప్రియయు, గాంధారమును- షడ్జము చేసినచో తోడియు, మధ్యమమును- షడ్జము చేసినచో కల్యాణియు, పంచమమును- షడ్జము చేసినచో హరికాంభోజియు, ధైవతమును- షడ్జముగ చేసినచో "నఠభైరవి" యు నినపడును.

శంకరి :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ధ మ ని స.
[illegible]

శంకితుడు :— గానము చేయుటలో సందేహము గలిగి గానముచేయు గుణ దోషముగల గాయకునికి పేరు.

శంఖ :— సూళాది 35 తాళములలో 5వ దైన "త్రిశ్రజాతి త్రిపుటతాళము" నకుగల పేరు. దీనికి అంగములు I O O. అక్షరకాలములు 7.

శంఖము :— శార్ఙ్గదేవునిచే "సంగీత రత్నాకరము" నందు చెప్పబడిన 10 రకములగు వేణువులలో 10 వ దానికిగల పేరు.

శంభుక్రియ :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము- స గ రి మ ప ని స.
అవరోహణము- స ని ప ని మ గ రి స.

శంభూద్యుతి :— 69 వ మేళకర్తయగు "ధాతువర్ధని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శకల :— "భావభట్టుని" "అనూపసంగీత విలాస" మను గ్రంథములోని 22 శృతుల పద్ధతియందు చెప్పబడిన షడ్జమునకుగల 4 శృతులలో 4 వ దానికిగల పేరు.

శఠుడు :— శృంగార నాయకులలోగల 4 రకములలో 4 వ వానికిగల పేరు. ఇతడు తనయందు ప్రేమగలిగియుండు నాయికను గూఢముగ అహితముచేయువాడుగా నుండును.

శతకిరత్నస్వరావళి :— శ్రీ పి. యస్. కృష్ణస్వామి అయ్యర్, రచించిన యొక సంగీత గ్రంథమునకుగల పేరు.

శతరాగరత్నమాలిక :— శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన నూఱు రాగములలోని సంగీత రచనలకు గలపేరు.

శతరాగరత్నమాలిక :— వీణాచార్య, శ్రీ టి. యస్. సి. వేంకటనారాయణాచార్యులచే, రచింపబడిన యొక సంగీత గ్రంథమునకుగల పేరు. దీనికి పూర్తి పేరు జాతిభేద సప్తతాళసహిత శతరాగ రత్నమాలిక యని గలదు.

శబ్దము :— జతులతోకూడిన రచనకుగల పేరు. ఈ రచనలో నృత్యము, అభినయము అను రెండు విషయములుండును. మరియు నిది తాళము, పాట, సాహిత్యములతో బంధింపబడినదైయుండును. నృత్యములకుపయోగకరమైన వగుటచే వీటిని యిప్పటి కాలములో భరతనాట్యములందుపయోగించు చున్నారు. నాట్యము చేయువారు సాహిత్యములోని భావములను సమయోచితముగా అభినయించుట ద్వారా తెలుపుదురు.

శమ్యము :— కుడిహస్తమునందు ఎడమచేతితో ఘాత(దెబ్బ) వేయుటకుగలపేరు.

శర :— "ఓరియంటల్ మ్యూజిక్" అను గ్రంథములో పేర్కొనిన "ఖండజాతి ఏకతాళము" నకుగల పేరు.

శరదిందుముఖి :— 64 వ మేళకర్తయగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని ధ ని ప స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శరద్యుతి :— 25 వ మేళకర్తయగు "మారరంజని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శరభఖండిత :— 54 వ మేళకర్తయగు "విశ్వంభరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధా ని ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శరభలీలతాళము :— అష్టోత్తరశతతాళములకు 108 టిలో 34 వ తాళము పేరు. దీనికి అంగములు I I 0 0 0 I I. మాత్రలు 5½. అక్షరకాలములు 22.

శరభలీలతాళము :—"రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 34వ తాళమునకు పేరు. దీనికిఅంగములు I I 0 0 0 0 I I.

శరభలీలప్రబంధము :— 8 రాగములతోను 8 తాళములతోను రచింపబడు యొకరకమైన ప్రబంధ రచనకు గలపేరు.

శరభానందనతాళము :— "శ్రీ శ్యామశాస్త్రి"చే కల్పింపబడినయొక క్లిష్టమైన తాళమునకుగల పేరు.

శర్వరి :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

*శరావతి :— 72 మేళకర్తలలో 25వ మేళకర్త "మారరంజని"కి వేంకటమఖి పెట్టినపేరు. ఇది 5వ "బాణ" చక్రములోని మొదటి మేళమగును.

**శశాంకకిరణి** :— 12 వ మేళకర్తయగు "రూపవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ధ స.
అవరోహణము– స ధ ప గ రి స.

**శశిప్రకాశి** :— 16 వ మేళకర్తయగు "చక్రవాకము" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప గా రి స.

**శశిప్రియ** :— 69 వ మేళకర్తయగు "ధాతువర్ధని" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని స.
అవరోహణము– స ని మ గ రి స.

**శశివదన** :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" యొక్క జన్య రాగము. వక్రసంపూర్ణ – ఔడవము.
ఆరోహణము– స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము– స ని ప మ గ స.

**శహన** :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మ ధా ని స.
అవరోహణము– స నీ ధ పమ గామరీగరిస.
ఇది ఉభయ వక్రసంపూర్ణరాగము. ఈ రాగములో పైడాల గురుమూర్తిశాస్త్రి యొక్క "కంసాసుర"అను లక్షణగీతము, తిరువొత్తియూర్ త్యాగయ్య యొక్క "కరుణింప" అను తానవర్ణము, త్యాగ రాజుని "గిరిపై నెలకొన్న" "ఈ వసుధ నీవంటి" "వందనము రఘునందన" అను కృతులును, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ యొక్క "రామాయికనన్నుబ్రోవ" అను కృతియును, క్షేత్రయ్యయొక్క "మేర గాదు"అను పదమును ప్రసిద్ధములైనవి.

**శ్రమము** :— వ్యభిచారి భావములోని 33 విధములలో 6 వ దానికిగల పేరు.

**శ్రమాహర** :— 35 వ మేళకర్తయగు "శూలిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ధ మ ప ధ ప గ రిస.

**శ్లక్ష్ణము** :— తైలధారవలె అవిచ్ఛిన్న పరంపరగలదై విద్వాంసులచే కొనియాడ బడు ధ్వని విశేషమునకుగల పేరు.

## శా

**శాంత** :— నారదుని "సంగీత మకరంద ము"లో పేర్కొనిన 22 శ్రుతుల పేర్లలో ధైవత శ్రుతులు 3 టిలో 1 వ దానిపేరు.

***శాంతకల్యాణి** :—65 వ మేళకర్తయగు "మేచకల్యాణి"కి శ్రీ వేంకటమఖి పెట్టిన పేరు. ఇది 11 వ "రుద్ర" చక్రములోని 5 వ మేళమగును.

**శాంతమూర్తి** :— 49 వ మేళకర్తయగు "ధవళాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ స.
అవరోహణము– స ధ మ గ రి స.

**శాంతరస** :— రాగములకు సంబంధించిన శృంగారాది నవరసములగు 9 టిలో నొక దానికి గలపేరు.

శాంతరిన్ :— భారత దేశములోగల "శత తంత్రిని" అను సంగీత వాద్యమునకు సరి పోవునట్టి పర్షియాదేశములో వాడునట్టి ఒక వాద్యమునకుగల పేరు.

శాంతస్వరూపి :— 16 వ మేళకర్తయగు "చక్రవాకము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రీ మ ప ధ ని.
అవరోహణము— స ని ధ ని ప మ రి స.

శాంబవి :— 67 వ మేళకర్తయగు "సుచరిత్ర" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని మ గ రి స.

శాకాంత :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శారదాభరణము :— 34 వ మేళకర్తయగు "వాగధీశ్వరి" యొక్క జన్యరాగము. ఉభయ వక్రషాడవము.
ఆరోహణము— స మ గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ ప మ రి స.

శార్ఙదేవతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 120వ తాళము పేరు. దీనికి అంగములు 008388ı.

శార్ఙదేవుడు :— 13 వ శతాబ్దమునకు చెందినట్టియు, "సంగీత రత్నాకర"మను అపూర్వమైన సంగీత లక్షణ గ్రంథమును సంస్కృతములో రచించినట్టి గొప్ప పండితునికి గల పేరు.

శారిక :— 5 వ మేళకర్తయగు "మానవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ని ప గ రి స.

శారీరజ :— నారదుని "సంగీత మకరందము"అనుగ్రంథములో పేర్కొనబడినట్టి గాత్రమునుండి పలుకు ధ్వనికిగల పేరు.

శాల్మలి :—9వ మేళకర్తయగు "ధేనుక" యొక్క జన్యరాగము. ఉభయషాడవము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ని ప గ రి స.

శాలీరస :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము— స మ గ రి గ మ ని ధ ని స.
అవరోహణము— సనిధనిపధమగమరిగరిస.

శాస్త్రయుక్తమగు పల్లవి ఆలాపన మార్గదర్శి :— 18 వ శతాబ్దమునకు చెందిన "శ్రీ పచ్చిమిరియం ఆదియప్పయ్య" శాస్త్రీయమైన పల్లవి ఆలాపన అను పద్ధతిని కనిపెట్టిన గొప్ప విద్వాంసుడగుటచే ఆయనకు లభించిన గౌరవనామము.

శాస్త్రార్థిని :— 51 వ మేళకర్తయగు "కామవర్ధని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ ప ధ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శ్యామ :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి స.

శ్యామం :— 14 వ మేళకర్తయగు "వకుళాభరణము" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ స.

శ్యామకల్యాణి :— 12 వ మేళకర్తయగు "రూపవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ప ధ ని ప మ గరిస.

శ్యామకల్యాణి :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ని ప ధ ప మ గ రి స.

శ్యామకృష్ణ :— సంగీత త్రిమూర్తులలో నొకరగు శ్రీ "శ్యామశాస్త్రిలు" తన రచనలయందు పెట్టుకొనిన ముద్రకుపేరు.

శ్యామచింతామణి :— 14 వ మేళకర్తయగు "వకుళాభరణము" యొక్క జన్యరాగము. ఔడవ - వక్రసంపూర్ణము.
ఆరోహణము– స రి మ ప ధ స.
అవరోహణము– స ని ప ధ మ గ రి స.

శ్యామనీలాంబరి :— 41 వ మేళకర్తయగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ధ ని ధ మ గ రి స.

*శ్యామలాంగి :— 72 మేళకర్తలలో 55 వ మేళకర్తకు గలపేరు. ఇది 10 వ "దిశి" చక్రములోని 1 వ మేళమగును.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

ఇందు షడ్జ, పంచమములు గాక చ. రి– సా. గాం– ప్ర. మ– షు. ధై– షు. నిషాద స్వరములుండును.

శ్యామశాస్త్ర్యాదివాగ్గేయకారులచరిత్ర:— మద్రాసు యూనివర్సిటీ సంగీతశాఖాధ్యక్షులగు ప్రొఫెసరు శ్రీ పి. సాంబమూర్తి (బి. ఏ; బి. యల్;)చే ఇంగ్లీషులో వ్రాయబడిన యొక గ్రంథముపేరు.

శ్యామశాస్త్రి :— సంగీత త్రిమూర్తులలో నొకరును, గాయకశిఖామణియునగు గొప్ప సంగీత కృతికర్తకు గలపేరు.

శ్యామళ :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

*శ్యామళ :—55వ మేళకర్తయగు "శ్యామలాంగి"కి "వేంకటమఖి" పెట్టిన పేరు.

శ్యామళవర్ణి :— 67 వ మేళకర్తయగు "సుచరిత్ర" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప స.
అవరోహణము– స ప మ గ రి స.

*శ్యామళాంగి :— 55 వ మేళకర్త "శ్యామలాంగి"కి కొన్ని గ్రంథములలో పేర్కొనబడిన పేరు.

శ్రావ్యధ్వనులు :—ఇంపైన సంగీత ధ్వనులకుగల మరియొక పేరు.

శింగరనుత :— తెలుగు వాగ్గేయకారు డైన "శ్రీమాన్ తచ్చూరు శింగరా చార్యుల" యొక్క సంగీత రచనలందుగల ముద్రకు పేరు.

శింజిని :— 19 వ మేళకర్తయగు "ఝుంకారధ్వని" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ని స.
అవరోహణము– స ని ప గ రి స.

శింహ్వచందన :—51 వ మేళకర్తయగు "కామవర్ధని"యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ధ ప మ రి గ మ రిస.

శిఖండిరుత :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప ధ మ రిమగస.

శిఖి :— నారదుని "సంగీత మకరందము" లో పేర్కొనిన 22 శ్రుతుల పేర్లలో 'రిష భము'నకుగల 3 శ్రుతులలో మొదటిదానికి గల పేరు.

శిఖరిణి :— 31 వ మేళకర్తయగు "యాగప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ని స.
అవరోహణము– స ని ప మ రి స.

శిబిక :— 21 వ మేళకర్తయగు "కీరవాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని స.
అవరోహణము– స ని ప గ రి స.

శిరోధి :— 53 వ మేళకర్తయగు "గమనశ్రమ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ రి స.

శిలప్పదికారమ్ :— శ్రీ "అడియార్కు నల్లార్"చే సంగీత గ్రంథము కాకపోయి నను తాళములనుగురించి వ్రాయబడియున్న అతి పురాతనమగు తమిళ గ్రంథమునకు పేరు.

శిల్పిని :— ఉపనాయికలు 8 విధము లలో 8 వ రకపు ఉపనాయికకుగల పేరు.

శివకాంభోజి :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

శివకీర్తనలు :— శ్రీ త్యాగరాజస్వామి కీర్తనలు అను తెలుగు గ్రంథములో 158 – 178 పేజీలవరకుగల రెండవభాగ ములో ప్రకటింపబడిన త్యాగయ్య రచిం చిన శివసంబంధమైన కీర్తనలకు పేరు.

శివగీతిమాల :— శ్రీ కామకోటి పీఠాధి పతియగు "చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి"వారిచే రచింపబడిన నొక గ్రంథ మునకుగల పేరు.

శివతత్వరత్నాకరము :—11వ శతాబ్దము నకు చెందినట్టియు మైసూరుసంస్థానములోని చిత్రదుర్గ జిల్లా "కెళది" గ్రామ వాస్త వ్యులగు "శ్రీ శివప్పనాయకుని"చే కన్న డములో వ్రాయబడిన ఒక గ్రంథము పేరు. ఇందు పురాతనరాగములను, శ్రీ రాగము

లను, పుత్రరాగములను, మిత్రరాగములను గుణించి చక్కగా పేర్కొనబడెను.

శివనాయకి :— 62 వ మేళకర్తయగు "రిషభప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

*శివపంతువరాళి :— 45 వ మేళకర్తయగు "శుభపంతువరాళి"కి వేంకటమఖి పెట్టిన పేరు. ఇది 8 వ "వసు" చక్రములోని 3 వ మేళమగును.

శివప్రియ :— 44 వ మేళకర్తయగు "భవప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

శివమనోహరి :— 72 వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ధ ప మ రి మ గ స.

శివమూర్తి :— 9 వ మేళకర్తయగు 'ధేనుక' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శివరామపురము :— ప్రాచీన తెలుగు పదకవులగు 'శివరామపురము' వారు రచించిన పదములందుగల ముద్రకు పేరు.

శివానంది :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు సరిపోవును.

శివాష్టపది :— 18 వ శతాబ్దమునకు చెందిన 'శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి'చే రచింపబడిన 'అష్టపదుల' గ్రంథమునకు పేరు.

శిక్షకుడు :—వాగ్గేయకారులలోని 5 రకములలో 1 వ వానికిగల పేరు. ఇతడు అన్యులకు సంగీత శిక్షణయిచ్చువాడగును.

శ్రీంకామోల :— 45 వ మేళకర్తయగు "శుభపంతువరాళి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

## శీ

శీతకిరణి :— 55 వ మేళకర్తయగు 'శ్యామలాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ధ ప మ గ స.

శ్రీ :—శ్రీ వేంకటమఖి కల్పించిన 12 మేళ చక్రములలో ప్రతి చక్రములోని 6 మేళములకుగల సంజ్ఞలలో 2 వ దానికి 'శ్రీ' అని పేరు. వీటిలో మిగత 5 సంజ్ఞలు పా, గో, భూ, మా, షా అనునవి.

శ్రీకంఠి :— 46వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

శ్రీకర :— 35 తాళములలో 'చతురశ్ర జాతి ధృవతాళము'నకుగల పేరు.

శ్రీకరి :— 52వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ధ ని స.
అవరోహణము– స ని ధా ప మ గ స.

శ్రీ కీర్తితాళము :— అష్టోత్తరశత తాళములను 108 టిలో 54 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 8 8 । ।. మాత్రలు 6. అక్షరకాలములు 24.

శ్రీకీర్తితాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 49 వ తాళమునకు పేరు. దీనికి అంగములు । । 8 8.

శ్రీకుంజరి :— 24వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

శ్రీఖండలిలేపిని :— 54వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ రి స.

శ్రీగురుమంగళాష్టకము :— శ్రీ వాలాజపేట వేంకటరమణ భాగవతులచే శ్రీ త్యాగరాజసద్గురునిపై రచింపబడిన మంగళాష్టకమునకుగల పేరు.

శ్రీగురుస్తోత్రపంచరత్నములు :— శ్రీ వాలాజపేట వేంకటరమణ భాగవతులచే శ్రీ త్యాగరాజ సద్గురునిపై రచింపబడిన 5 పద్యరత్నములకు గల పేరు.

శ్రీగురుస్తోత్రాష్టకములు :— శ్రీ త్యాగరాజస్వామినిగురించి వారిముఖ్యశిష్యులగు వాలాజనగర కుప్పయా వేంకటరమణ భాగవతులచే గురుస్తోత్రముగా రచింపబడిన 8 శ్లోకములకు గలపేరు.

శ్రీతాళము :— 'శ్రీ రామస్వామి దీక్షితారుని'చే రచింపబడిన 108 రాగతాళ మాలికలోని ఒక నూతన తాళమునకు గల పేరు.

శ్రీత్యాగరాజహృదయము :— శ్రీమాన్ కె. వి. శ్రీనివాస అయ్యంగారిచే స్వర సాహిత్య, అర్థతాత్పర్యములతో 1922 లో ప్రకటింపబడిన 3 భాగములుగల త్యాగరాజ కృతుల గ్రంథమునకు పేరు.

శ్రీనందన :— 63 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ ధమగరిస.

శ్రీనందనతాళము :— 'అష్టోత్తరశత' తాళములకు 108 టిలో 100 వ తాళమునకుగలపేరు. దీనికి అంగములు 8 । । 3. మాత్రలు 7. అక్షరకాలములు 28.

శ్రీనందనతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 90 వ తాళముపేరు. దీనికి అంగములు 8 । । 3.

శ్రీనివాస :— సుప్రసిద్ధ వాగ్గేయకారులైన శ్రీ 'రామనాథపురము శ్రీనివాస అయ్యంగార్' తన సంగీత రచనలయందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

శ్రీపురందరవిఠల :—'శ్రీపురందరదాసు' యొక్క భార్య, రచించిన కీర్తన రచనలందు పెట్టుకొనిన ముద్రకు పేరు.

శ్రీమణి :— 2వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ని ధ ప గ రి స.
శ్రీ త్యాగరాజుని 'ఏమందునే విచిత్రము' అను ప్రసిద్ధకృతి యీరాగములోనిదగును.

శ్రీమతి :— 2వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శ్రీమత్క్రితాళము :— శ్రీ రామస్వామి దీక్షితారుని' చే విరచితమైన 108 రాగతాళమాలికలోని ఒక నూతనమగు తాళమునకు గలపేరు.

శ్రీమల్లాక్ష్యసంగీతము :—'శ్రీ వి.యన్. భాత్ ఖండే' అను ప్రసిద్ధరచయిత రచించిన ఒక సంగీత గ్రంథమునకు గలపేరు.

శ్రీమాళవి :— 6వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ ని ప స.
స ని ధ మ గ రి స.

శ్రీరంగతాళము :— 'అష్టోత్తరశత' తాళములగు 108 టిలో 12వ తాళముపేరు. దీనికి అంగములు I I 8 I 3. మాత్రలు 8. అక్షరకాలములు 32.

శ్రీరంగతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 14వ తాళముపేరు. దీనికి అంగములు I I 8 I 3.

శ్రీరంగప్రబంధము :— 4 రాగములు, 4 తాళములు గలిగిన ఒక రాగతాళమాలికా రచనకు గలపేరు.

శ్రీరంజని :— 22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.
ఇదిపాడవరాగము. శ్రీత్యాగరాజుని 'మారుబల్కకున్నావేమి, బ్రోచేవారెవరు, భువిని దాసుడ' వంటి కృతులును, శ్రీదీక్షితుల 'పర్వత రాజకుమారి' వంటికృతులు యీ రాగములోని ప్రసిద్ధ కృతులగును.

శ్రీరాగము :— 22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప ధ నిపమరిగారిస.
ఇది ఔడవ - వక్రసంపూర్ణ రాగము. సంగీత కచ్చేరీల అంత్యమున శ్రీరాగము పాడి ముగింతురు. శ్రీ దీక్షితులవారి 'శ్రీ మూలాధార' అను కృతియు, శ్రీ త్యాగరాజుని 'ఎందరో మహానుభావులు' అను పంచరత్నకీర్తనయు, శ్రీసుబ్బరాయశాస్త్రి యొక్క 'వనజాసనసుత' అను కృతియు యీరాగములోని సుప్రసిద్ధమైన వాగ్గేయ రచనలు యగును.

శ్రీరాగమునకుభార్యలు :— మాలశ్రీ, త్రివణీ, గౌరీ, కేదారీ, మధుమాధవీ, పాహాటీ, అను 6 రాగములును శ్రీరాగమునకుగల భార్యల పేర్లయగును.

శ్రీవిలాసము :—5 రాగములును, 5 తాళములును కలిగిన ఒక రాగతాళమాలికా రచనకుగల పేరు.

శ్రీవేంకటరమణ :— 18-19 శతాబ్దములకు చెందినట్టి ప్రాచీన వాగ్గేయకారులైన శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్యగారి యొక్క రచనలందుగల ముద్రకన్నేర్లు. ఇతడు భైరవిరాగములో సుప్రసిద్ధమైన "విరిబోణి" అను అటతాళవర్ణము రచించి కీర్తినొందిన మహనీయుడు.

శ్రీశ్యామశాస్త్రికృతితరంగిణి :— శ్రీ టి. పార్థసారథి (టి. టి. యస్.)చే 1950 లో వ్రాయబడి ప్రకటింపబడిన శ్యామశాస్త్రి కృతులుగల ఒక చిన్న గ్రంథము.

---

# శు

శుకపాణి :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ని స.
అవరోహణము- స ని ప గ రి స.

శుకమందర :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శుకలత :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ని ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శుక్రకాంతము :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ధ ని స.
అవరోహణము- స ని ప మ గ రి గ స.

శుక్రజ్యోతి :— 26 వ మేళకర్తయగు 'చారుకేసి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప ధ మ గ రి స.

శుక్తిప్రియ :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ స.

శుద్ధ :— 57 వ మేళకర్తయగు 'సిమ్హేంద్ర మధ్యమము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ స.

శుద్ధౌడవము :— ఆరోహణ, అవరోహణముల రెంటియందును ఒకే రకమునకుచెందిన రెండు స్వరములు వర్జింపబడియుండు రాగమునకుగల పేరు. ఉ॥ మధ్యమావతిరాగము. 22వ మేళజన్యము.

శుద్ధకన్నడ :— 18 వ మేళకర్తయగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ గ స.

శుద్ధకళానిధి :— 63వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ ప ధ ని ధ.
అవరోహణము— ప మ గ రి స ని స.

శుద్ధక్రియ :— 15వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' జన్యరాగము.
ఆరోహణము— స రి ప మ, ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

శుద్ధకైవశ :— 67వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రిగస.

శుద్ధకోసల :— 65వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
ఇది స్వరాంతర - షాడవరాగమగును.

శుద్ధగాంధారము :— సప్తస్వరములలో 3వ దైన గాంధారస్వరమునందలి 3 రకములలో మొదటిదానికిగల పేరు. దీనినే కోమలగాంధారమనియు, చతుశ్రుతి రిషభమనియు కూడ చెప్పుదురు.

శుద్ధగాంధారి :— 48వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము—స ని ధ ని స ని ప మ రి స.

శుద్ధగానము :— శాస్త్రీయమైన స్వర, రాగ, తాళముల సంయోగముతో చేయు నట్టి గానమునకుగల పేరు.

శుద్ధగీర్వాణి :— 41వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

శుద్ధగౌరిక్రియ :— 60వ మేళకర్తయగు 'నీతిమతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

శుద్ధఘంటాణము :— 34వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

శుద్ధజింగ్ల :— 33వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' జన్యరాగము.
ఆరోహణము— స గ ప మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గ స.

శుద్ధజ్యోతిష్మతి :—61వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శుద్ధతరంగిణి :— 20వ మేళకర్తయగు 'నటభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

శుద్ధతానము :— తానములోని 2 రకములలో 1వదాని పేరు. అనగా ఒక క్రమమైన విధమున స్వరములు అభివృద్ధి చెందుచూ, లేక తగ్గుచూ ఒక్క రాగమునే ప్రకాశించు నటుల జూపింపు దానికిగల పేరు. ఇట్టివి

ఇక కలవు. రెండవది కూటతానము. ఇందు అక్రమమైన విధమున స్వరములు వచ్చును. ఈ కూటతానముయొక్క ఆకారము నిర్ణయించు పద్ధతిని 'నష్ట' అనియు, క్రమ సంఖ్యను కనుగొనుపద్ధతిని 'ఉద్దిష్ట' అనియు చెప్పుదురు.

శుద్ధతాళము :— 'భరతనాట్యశాస్త్రమ్' అను తమిళ గ్రంథములో పేర్కొనబడిన యొక తాళమునకుగల పేరు.

శుద్ధదేశి :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శుద్ధదేశి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప ధ మ గ రి స.
శ్రీ త్యాగరాజుని "ఎందుకాగలింతు" అను ప్రసిద్ధకృతి యీ రాగమునందేగలదు.

శుద్ధధన్యాసి :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ప స.
అవరోహణము— స ని ప మ గ స.

శుద్ధధన్యాసి :— కొందరుదీనినే 'ఉదయరవిచంద్రిక' యనికూడ చెప్పుదురు. గనుక యిది 20 వ మేళకర్తయగు "నఠభైరవి" యొక్క జన్యరాగముగ నెంచదగును.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.
'శ్రీదీక్షితునిసుబ్రహ్మణ్యేన, శ్రీ త్యాగరాజుని "ఎంతనేర్చిన" అను ప్రసిద్ధ కృతులు యీ రాగమునందు గలవు.

శుద్ధధైవతము :— 'ధైవత స్వరములోని' 3 రకములలో మొదటిదానికిగల పేరు.

శుద్ధనవనీతము :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

శుద్ధనాట :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శుద్ధనిర్మద :— 66 వ మేళకర్తయగు "చిత్రాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ప స.
అవరోహణము— స ని ప మ గ స.

శుద్ధనిషాదము :— నిషాదస్వరములోని 3 రకములలో మొదటి రకమునకుచెందిన స్వరమునకుపేరు. ఇది శాస్త్రరీత్యా చతుశ్శ్రుతి ధైవతమునకు సరిపోవును. మరియు ఆధునిక సంగీతములోని 22 శ్రుతులలో 19 వ శ్రుతి రోహిణియగును. ఉ॥ భైరవి రాగము యీ శ్రుతిగల రాగమునకు వుదాహరణ యగును.

శుద్ధనీలాంబరి :— 35 వ మేళకర్తయగు "శూలిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ రి గ మ ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

శుద్ధప్రబంధము :— స్వరార్థలోని రెండు రకములలో మొదటిదానికిగల పేరు. ఈ రచన అంతయు స్వరాక్షరములతో కూడి నదిగా యుండును.

శుద్ధబంగాళ :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి గ రి స.
శ్రీ త్యాగరాజుని 'రామభక్తిసామ్రాజ్య' 'గ్రాలినేజేసిన పూజాఫలమో' అను ప్రసిద్ధ కృతులు యీ రాగములోనివగును.

శుద్ధబిల్హారి :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

శుద్ధభైరవి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ని ధ స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
వక్రఔడవ—షాడవము. [సం. స్వ. ప్ర. సా.

శుద్ధభోగి :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

శుద్ధమంజరి :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

శుద్ధమధ్యమము :— మధ్యమ గ్రామము లోనున్న మూర్ఛనలలో 3 వ మూర్ఛనకుగల పేరు.

శుద్ధమధ్యమము :— సప్తస్వరములలో 4 వ దైన మధ్యమస్వరములోని 2 రకము లలో మొదటిదానికిగల పేరు.

శుద్ధమనోహరి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ప మ రి గ స.

శుద్ధమలహరి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప మ ధ స.
అవరోహణము— స ధ ప గ రి స.

శుద్ధమారువ :— 8 వ మేళకర్తయగు "హనుమతోడి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి గ రి స.

శుద్ధమాళవి :— 18 వ మేళకర్తయగు "హాటకాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము—స గ రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

శుద్ధము :— సంగీత శాస్త్రమునందు చెప్పబడినటువంటి రాగలక్షణములను కలిగియుండు రాగములకు గలపేరు.
ఉ॥ మాయామాళవగౌళ, శ్రీరంజని మొదలగునవి యీ రకమునకు చెందును.

శుద్ధము :— స్వచ్ఛమైనదియు, తొలుత పుట్టినటువంటి రాగములకుగల పేరు.

**శుద్ధముఖారి** :— 1 వ మేళకర్తయగు "కనకాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ రి మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ మ ప మ గ రి స.

**శుద్ధమోహిని** :— 37 వ మేళకర్తయగు "సాలగము" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము– స ధ ప మ గ రి గ స.

**శుద్ధరత్నభాను** :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

**శుద్ధరసాళి** :— 53 వ మేళకర్తయగు "గమనశ్రమ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ రి స.

**శుద్ధరాగము** :— అన్యస్వరములను తీసుకొనకుండా శాస్త్రీయమైన స్వరసమ్మేళనముతో ఆరోహణ, అవరోహణములు గల రాగమునకు పేరు. ఉ|| కల్యాణి, మోహన, మధ్యమావతి, మాయామాళవగౌళ మొదలగునవి యీరకమునకు చెందును.

**శుద్ధరాగము** :— మార్గరాగములలోని 6 భేదములలో 3 వ దానికి గలపేరు.

**శుద్ధరిషభము** :— సప్తస్వరములలో 2వ దైన "రిషభస్వరము"లోని 3 రకములలో మొదటిదానికిగల పేరు.

**శుద్ధలలిత** :— 11 వ మేళకర్తయగు "కోకిలప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స ప మ ధ ని స.
అవరోహణము– స ని స ధ ప మ గ రి స.

**శుద్ధవరాళి** :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ ని ప మ గ స.

**శుద్ధవసంత** :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని స.
అవరోహణము– స ధ ని ప మ గ రి స.

**శుద్ధవుత్తరి** :— 62 వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స ని స రి గ మ ప ధ.
అవరోహణము– ధ ప మ గ రి స ని స.
ఇది ధైవతాంత్యరాగమునకు చెందును.

**శుద్ధవేళావళి** :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– [illegible] [illegible] [illegible] ప ని స.
అవరోహణము– స ని ధ ని ప మ గ రి స.

**శుద్ధశ్యామళ** :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

**శుద్ధశిఖామణి** :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ధ ని ప మ రి గ రి స.

శుద్ధశ్రుతిరంజని :— 68వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

శుద్ధషడ్జము :— షడ్జ గ్రామములోని 7 మూర్ఛనలలో 4వ మూర్ఛనకుగల పేరు. దీనికి 'ప' ప్రారంభ స్వరమగును.

శుద్ధషాడవము :— ఆరోహణ, అవరోహణముల రెంటిలోను ఒకే రకమునకు చెందిన ఒక స్వరము వర్జింపబడియుండు రాగమునకుగల పేరు. ఉ॥ శ్రీరంజని రాగము. 22 మేళజన్యము.

శుద్ధసత్వ :— 1వ మేళకర్తయగు 'కనకాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

శుద్ధస్వరము :— నియతశ్రుతులతో కూడుకొనిన స్వరమునకుగల పేరు. 22 శ్రుతులలో 4, 7, 9, 13, 17, 20, 22 శ్రుతులగు 7 టిని 'శుద్ధస్వరము' లని చెప్పుదురు. వీనినే ప్రకృతిస్వరములందురు.

శుద్ధస్వరావళి :— 45వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

శుద్ధసామంతము :— 8వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ధ స రి మ ప ధ.
అవరోహణము— ధ ప మ గ రి స ధ స.

శుద్ధసారంగ :— 62వ మేళకర్తయగు 'రిషభప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

శుద్ధసావేరి :— 29వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.
ఇది మోహనరాగము యొక్క పంచమమును షడ్జముగజేసి అదే స్వరస్థానములందు వాయించిన ఏర్పడురాగము. శ్రీత్యాగరాజుని 'కాలహరణమేలరా' 'దారిని తెలిసికొంటి' అనుకృతులును, శ్రీ దీక్షితుల 'శ్రీ గురుగుహతారయాశు' అను కృతియును యీ రాగములోని ప్రాముఖ్యమైన కృతులరకమునకు చెందును.

శుద్ధసాళవి :— 20వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ రి స.

శుద్ధసింహారవము :— 67వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ధ ప మ రి స.

శుద్ధసీమంతిని :— 8వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.
శ్రీత్యాగరాజుని 'జానకీరమణ' అను ప్రసిద్ధ కృతి యీ రాగమునందే గలదు.

శుద్ధసూడప్రబంధము :— సూడ ప్రబంధములోని రెండురకములలో మొదటి దానికి గల పేరు. దీనినే 'ఛాయాలగ సూడ ప్రబంధము' అని చెప్పుదురు.

శుద్ధానందప్రకాశము :— తాళవిషయములను గురించి సంపూర్ణముగ వ్రాయబడిన ఒక ప్రాచీన లక్షణగ్రంథమునకు గల పేరు.

శుభకరి :— 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ రి స.

శుభిక :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ రి స.

శుభగ :— 'భావభట్టుని' 'అనూపసంగీత విలాసము' అను గ్రంథములో పేర్కొనబడిన 22 శృతులలో నిషాదశృతికి గల 2 పేర్లలో 2 వ దానిపేరు.

*శుభపంతువరాళి :—72 మేళకర్తలలో 45 వ మేళకర్తరాగమునకు గలపేరు.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి- సా. గాం- ప్ర. మ- శు. ధై- కా నిషాద స్వరములుండును. శ్రీ ముద్దుస్వామి దీక్షితులవారి 'శ్రీ సత్యనారాయణం' అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదగును.

శుభ్రవర్షి :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ రి స.

శుభవీణ :— నూతనముగా అనులులోనికి తేబడినటువంటి తంతివాద్యమైన యొకరకపు వీణకు గల పేరు.

శుభాంగి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ రి గ మ ప ధ ని.
అవరోహణము- ధ ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్య రాగమునకు చెందును.

శుభావతి :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ రి స.
ఇది సంపూర్ణ - ఔడవమునకు చెందును.

శుభాళి :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

శృంగము :— 'శార్ఙ్గదేవుని'చే 'రత్నాకరము'లో పేర్కొనబడిన 10 రకములగు వేణువులలో 9 వ దానికిగల పేరు.

శృంగారనాయకులు :— అనుకూలుడు, దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు అను నాల్గు రకములగు నాయకులకుగల పేరు.

శృంగారమూర్తి :—65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శృంగారరసమంజరి :— "శ్రీ విస్సా అప్పారావుపంతులు"చే అనేక ముఖ్య విషయములతో కూర్చబడిన క్షేత్రీయ పదములుగల ఒక గ్రంథమునకు పేరు.

శృంగారరసము :— రాగనవరసములగు 9 టిలో మొదటి రసమునకుగల పేరు.

శృంగారిణి :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శ్రుతి :— స్పష్టముగా శ్రవణమునకు వినపడునంత చిన్న ధ్వనికి శ్రుతి అని పేరు.

శ్రుతి :— అనగా స్పందన తరచుతనమని కూడ అర్థముగలదు.

శ్రుతిజ్ఞానము :— తంతి వాద్యములను పంచమ శ్రుతికిగాని, మధ్యమశ్రుతికిగాని శుద్ధముగా శ్రుతిచేయగలిగిన జ్ఞానమునకు శ్రుతిజ్ఞానమని చెప్పుట కలదు.

శ్రుతిజాతులు :— ద్వావింశతి శ్రుతులకు గల జాతులగు దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్య అను 5 జాతులను శ్రుతి జాతులని పేరు.

శ్రుతిప్రకాశిని :— 62 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

శ్రుతిభేదము :— గ్రహభేదము లేక గ్రహస్వరభేదమునకుగల మరియొక పేరు. దీనినే ఇంగ్లీషులో 'మోడల్ షిఫ్టు ఆఫ్ టోనిక్' అందురు. అనగా ఒక రాగములోని అధార షడ్జమును మరియొక స్వరమునకుమార్చి అదే ఆధార షడ్జముగాజేసికొని మొదటి రాగస్వర స్థానములందే వాయించినచో మరియొక రాగముగ వినుపించును. ఈ గ్రహస్వర భేదపద్ధతిని శంకరాభరణము, శ్రీరంజని, మోహనవంటి క్రమమైన ఆరోహణావరోహణములుగల రాగములందే ప్రదర్శింప వచ్చును.

శ్రుతిభేదించుటకుగల కారణములు :— తంతియొక్క పొడవులోని హెచ్చుతగ్గులును, తంతియొక్క లావు (వ్యాసము)ను, తంతియొక్క బిగింపును, తంతిని చేయుటకు గల పదార్థముల భేదములును శ్రుతి భేదించుటకు కారణములగును.

శ్రుతిరంజని :— 36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ప మ గ స.
ఇది షాడవ - స్వరాంతర రాగమునకు చెందిన ముఖ్య వుదాహరణయగును.

శ్రుతిరంజని :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని.
అవరోహణము— ని ధ ప మ గ స రి స.
శ్రీత్యాగరాజుని 'ఏదారి సంచరింతు' అను ప్రసిద్ధ కృతి ఈ రాగములో గలదు.

శ్రుతివాద్యములు :— గాత్రమునగాని వాద్యమునగాని సంగీతమును ప్రదర్శించునపుడు కేవలము శ్రుతికొరకు వుపయోగింపబడు

తంతి వాద్యములు లేక గాలివాద్యములకు గల పేరు ఉ॥ తంబుర, ఏక్తార్, తుంతిన, ఒత్తు, శ్రుతిహార్మోనియము మొదలగునవి.

శ్రుతిస్వరజ్ఞానోపాయనవీణ :— 'సోమ నాథుని' చే రచింపబడిన 'రాగవిబోధము' అను గ్రంథములో మొదటి వివేకములోగల 18, 19, 20, 21, 22 ఆర్యలలో పేర్కొనబడిన ఒకరకపు వీణకుగల పేరు.

శ్రుతులనుగుఱించి విశేషముగ పరిశోధనలునల్పిన విదేశీయశాస్త్రజ్ఞులు :- మిష్టర్ ఇ. క్లెమెన్స్, మిష్టర్ పైతాకరస్సు, మిష్టర్ వాట్సన్, ప్రొఫెసర్ హెమోల్టసు, మిష్టర్ బెసాన్క్ మొదలగువారు యీరకమునకు చెందుదురు.

## శూ

శూర్వకం :— 26 వ మేళకర్తయగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- సరిగమగరిమపనిధనిపస.
అవరోహణము- స ని ధ మ ప గ రి స.
ఇది ఉభయవక్రసంపూర్ణమునకు చెందును.

శూలధారిణి :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ మ గ రి స.

శూలరేఖ :— 35 వ మేళకర్తయగు 'శూలిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ రి గ స.

*శూలిని :— 72 మేళకర్తలలో 35 వ మేళకర్తకుగల పేరు. ఇది 6 వ 'ఋతు' చక్రములోని 5 వ మేళకర్తయగును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక మ. రి - అం. గాం - శు. మ - చ. ధై. కా. నిషాదస్వరములుండును. శ్రీ త్యాగరాజుని రచనయగు 'ప్రాణనాథబిరాన' అను ప్రసిద్ధకృతి యీ రాగములోగలదు.

## శె

శెంపటతాళము :— 'కథాకళి' వాఙ్మయములో వాడు ఆదితాళమగుఝంపటతాళమును "శెంపటతాళ"మని చెప్పుదురు. మరియు అట, త్రిపుట, రూపక తాళములనుకూడ వరుసగా అటంత, ముఱియటంత, పాంచారి తాళములు గావాడుదురు.

## శే

శేఖరచంద్రిక :— 45 వ మేళకర్తయగు 'శుభపంతువరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

శేఖరి :— 35 వ మేళకర్తయగు 'శూలిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ని ప మ రి గ స.

శేష :— ప్రాచీన వాగ్గేయ కారుడైన సెయ్‌కొ్కారప్పట్టి శ్రీ పల్లవి శేషయ్యార్ తన సంగీత రచనలయందు పెట్టుకొనిన ముద్రకుగల పేరు.

శేషనాదము :— 57 వ మేళకర్తయగు 'సిమ్హేంద్ర మధ్యమము' జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శ్రేయోదాయిని :—68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ రి స.
ఇది ఔడవరాగమునకు చెందును.

శ్వేతపద్మ :— 38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ రి ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

శ్వేతాంబరి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము- స ని ప మ గ రి స.

## శై

*శైలదేశాక్షి :— 72 మేళకర్తలలో 35 వ మేళకర్తయగు 'శూలిని'కి వేంకట మఖి పెట్టినపేరు. ఈ రాగమునందు శ్రీ పొన్నయ్యాపిళ్ళై రచించిన 'సార్థసాక్షి' అను ఒక ప్రసిద్ధకృతిగలదు.

శైలపాణి :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

శైవలిని :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

## శో

శోకబింబ :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని ధ స.
అవరోహణము- స ని ప మ గ రి గ స.

శోకము :— స్థాయీభావములోని 8 విధములలో 3 వ దానికి 'శోక' మనిపేరు.

శోకవరాళి :— 9 వ మేళకర్తయగు "ధేనుక" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ని ధ.
అవరోహణము- ప మ గ రి స.
ఇది వక్రఔడవ - స్వరాంతరరాగమునకు చెందునట్టి ముఖ్య వుదాహరణయగును.

శోణాంకరి :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ధ ప గ రి స.

శోభనగిరి :— శృంగారరస పదకర్తలగు శోభనగిరి వారు తెలుగులో రచించిన పదములందు పెట్టిన ముద్రకుపేరు.

శోభాంబిక :— 72 వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ధ ప మ రి గ స.

శోభావతి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

శ్లోకము :— రాగనిర్ణయము లేనట్టి సంస్కృతములోని ఒక పవిత్ర రచనకు పేరు.

# ష

షట్పదధ్వని :— 70 వ మేళకర్తయగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ రి స.

షట్స్వరప్రస్తారము :— అసంపూర్ణతానమునందు స, రి, గ, మ, ప, ధ అను 6 స్వరములతో ప్రస్తరించునట్టి ప్రస్తారమునకు పేరు. ఇట్టి ప్రస్తారములు మొత్తము $120 \times 6 = 720$ గలవు.

షట్కాల :— ప్రాచీన సంగీత విద్వాంసులును, పల్లవిని ఆరు కాలములందు అత్యద్భుతముగా పాడగలిగిన శ్రీ గోవింద మారార్, కును, శ్రీ నరసయ్య, కును గల ప్రఖ్యాతమైన బిరుదుల పేరు. అనగా వీరిని షట్కాల గోవిందమారార్, అనియు షట్కాల నరసయ్య అనియు ఆకాలములో పిలుచుచుండిరి.

షట్కాలగోవిందమారార్ :— పల్లవిని ఆరుకాలములు పాడగలిగిన సుప్రసిద్ధప్రాచీన విద్వాంసుడు. ఇతడు త్యాగరాజును దర్శించి ఆయన ఆశీస్సులను పొందెను.

షట్కాలచక్రవర్తి :— ప్రాచీన సుప్రసిద్ధ వైణికులును, విజయనగర సంస్థానములో శ్రీ ఆనందగజపతి మహారాజులవారి ఆస్థాన వైణిక విద్వాంసులుగనుండిన శ్రీ 'వీణ వేంకటరమణదాసు' వీణలో షట్కాలములను సునాయాసముగా వాయింపగలిగిన అఖండప్రజ్ఞ గలవాడగుటచే ఆయనకు యివ్వబడిన బిరుదు.

షట్కాలపల్లవి :— పల్లవులను ఒకదానికొకటి రెట్టింపు వేగముగల ఆరు కాలములలో పల్లవిని పాడగలుగు విధానమునకుగల పేరు. పూర్వము ప్రఖ్యాత విద్వాంసులగు శ్రీ షట్కాల గోవింద మారార్, శ్రీ షట్కాల నరసయ్యలు యిట్టి పల్లవులను అద్భుతముగా పాడగలిగిన తరగతికి చెందినవారని చెప్పుదురు.

షట్కాలము :— సంగీతము నడచు వేగమును దెలుపుటకుగల ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షట్ కాలములను, 'షట్కాల' మని చెప్పుదురు. ఇది తాళాక్షరము ఒకటింటికి వరుసగా 1, 2,

4, 8, 16, 32 అక్షరకాలముల వంతున నడపబడును. అనగా ఆఱవ కాలములో తాళాక్షరము ఒకటింటికి 32 అక్షరముల వంతున నడచునని అర్థము.

షట్కాలసంజ్ఞలు :— సంగీత రచనలను వ్రాయునపుడు వాటికి క్రిందగాని పైన గాని అవి యేకాలములలో పాడదగునో తెలుపుటకు వుపయోగించెడిగుర్తులకు పేరు. అనగా స్వరముల క్రిందగాని లేక పైనగాని గీతలేనిచో ప్రథమ కాలమనియు, ఒక గీతవున్నచో రెండవ కాలమనియు, రెండు గీతలున్నచో మూడవ కాలమనియు, మూడుగీతలున్నచో నాల్గవ కాలమనియు, నాలుగు గీతలున్నచో ఐదవకాలమనియు, ఐదు గీతలున్నచో ఆఱవ కాలమనియు గ్రహించి పాడుకొనవలెను. వీటినే షట్కాల సంజ్ఞలు అని చెప్పబడును.

షట్తాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 93 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 000000. మాత్రలు 3. అక్షరకాలములు 12. ఇది లఘురహిత తాళమునకు చెందిన వుదాహరణయగును.

షట్తాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 94 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 000000.

షట్తాళములు :— అంగ, ఉపాంగ, బంగ, [illegible]బాంగ, శుద్ధ అను తాళములకుగల పేరు.

[illegible]పకుడు :— 'శ్రీ త్యాగ[illegible] [illegible] యింటికి [illegible] దేవగాం

ధారిరాగమును అత్యద్భుతముగా నాలాపించిన మహనీయుడగుటచే గలిగినపేరు.

షట్ప్రితాపుత్రకతాళము :— ఈశ్వరుని పంచముఖములలో 3 వదైన అఘోరముఖమునందు పుట్టిన తాళమునకుగల పేరు.

షట్పితాపుత్రికము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో మొదటనుండు మార్గ తాళములు 5 టిలో 3 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 3 । 8 8 । 3.

షట్ఛ్రుతికము :— $\frac{9}{8}$ చతుఃశ్రుతికము $+ \frac{16}{15}$ ద్విశ్రుతికము = షట్ఛ్రుతికము. అనగా $\frac{9}{8} \times \frac{16}{15} = \frac{6}{5}$ ను షట్ఛ్రుతికమని చెప్పబడును.

షట్ఛ్రుతిధైవతము :— ధైవత స్వరములో గల మూడవ రకమునకు పేరు. శాస్త్రరీత్యా యిది కైశికీ నిషాద స్వరస్థానమున పలుకును. నాటరాగము యిట్టి శ్రుతిగల రాగమునకు వుదాహరణయగును.

షట్ఛ్రుతిధైవతము :— 'మేళాధికార లక్షణ'మను గ్రంథమునందుగల 24 శ్రుతులలో 21 వ శ్రుతికిగలపేరు అనగా కైశికీ నిషాదమునకుగల రెండవ పేరు.

షట్ఛ్రుతిరిషభము :— రిషభ స్వరములోని 3 వ రకమునకు గలపేరు. ఇది చతుశ్రుతి రిషభమునకు పైన వుండును. శాస్త్రరీత్యా సాధారణగాంధార స్వరస్థానమున పలుకును. నాటరాగము యిట్టి శ్రుతిగల రాగమునకు వుదాహరణ మగును.

**షట్ఛ్రుతిరిషభము** :— 'మేళాధికారలక్షణ'మను గ్రంథమునందుగల 24 శ్రుతులలో 7 వ శ్రుతియగు సాధారణ గాంధారమునకు గల రెండవపేరు.

**షట్ఛ్రుతివ్యవధి** :— అంతరగాంధారమునకును పంచమమునకు మధ్యనుండు అంతరము వంటి వ్యవధికి షట్ఛ్రుతివ్యవధి అందురు. అనగా $\frac{5}{4}\times\frac{6}{5}=\frac{6}{4}=\frac{3}{2}$ కు గలపేరు.

**షడంగప్రతినామములు** :— తాళాంగములగు అనుద్రుతాది 6 అంగములకు గల ప్రత్యేకనామములకు పేరు. అవి యేవనగా

1. అనుద్రుతమునకు— అర్ధచంద్రము, వ్యంజనము, అనునాసికము, అవ్యక్తము, విరామము అనియు,
2. ద్రుతమునకు— అర్ధమాత్ర, వ్యోమము, బిందుకము, వలయము, అనియు,
3. లఘువునకు— మాత్ర, సరళము, హ్రస్వము, కళ, చోద్య, బాణ, సార అనియు,
4. గురువునకు— ద్విమాత్రకము, వక్రము, కాణము, యమళము, దీర్ఘకము అనియు,
5. ప్లుతమునకు— సమోద్భవము, దీప్తము, త్రియంగము, త్రిమాత్రకము అనియు,
6. కాకపాదమునకు— హంసపాదము, నిశ్శబ్దము, చతుర్లఘువు, అనియు షడంగములకు ప్రతినామములు గలవు.

**షడంగప్రస్తారము** :— ఒక ప్రస్తారములో ఆ ఆ అంగములు అనగా ∪ 0 । 8 3 + అను వుపయోగించుచూ ప్రస్తరించునట్టిదానికి పేరు.

**షడంగములకు వేరొకప్రతినామములు**:- మరియొకవిధముగా తాళాంగములగు ఆరింటికిని వేరొక ప్రతినామములు గలవు. అవి యేవనగా

1. అనుద్రుతమునకు— అర్ధచంద్ర, విరామ
2. ద్రుతమునకు — బిందు, వక్ర,
3. లఘువునకు — చోద్య, బాణ, సార
4. గురువునకు — యమళ, వక్ర, కాణ
5 ప్లుతమునకు — త్రిపుర, దీప, వాద్య
6. కాకపాదమునకు— నిశ్శబ్ద, హంసపాదము

లనునవి షడంగములకు యితరగ్రంథములలో పేర్కొనిన ప్రతినామములగును.

**షడంగములు** :— సంగీత కాలమును లెక్కించుటకు తాళమునందేర్పరచిన ఆరు అంగములగు అనుద్రుత, ద్రుత, లఘు, గురు, ప్లుత, కాకపాదములకు గల పేరు. ఇవి 6 ను వరుసగా 1, 2, 4 (చతురశ్రజాతి) 8, 12, 16 అక్షరకాలములను గలిగియుండును. లఘువుకు మాత్రము ఆయాజాతినిబట్టి త్రిశ్ర 3. చతురశ్ర 4. ఖండ 5. మిశ్ర 7. సంకీర్ణ 9. అక్షరకాలములను గలిగియుండును.

**షడ్జకైశికి** :— 'సంగీత రత్నాకరము'లో పేర్కొనిన 11 వికృతజాతులలో మొదటి దానికి గలపేరు.

**షడ్జగ్రహము** :— ఒక రాగము లేక సంగతులను షడ్జస్వరముచే ప్రారంభింపబడినచో నట్టిదానిని షడ్జగ్రహమని చెప్పుదురు.

**షడ్జగ్రామజాతులు** :— కచ్చేరీలలో వుపయోగింపబడు 7 జాతులలో షడ్జి, నిషాది, ధైవతి, ఆర్షభి అను 4 జాతులకు గలపేరు.

**షడ్జగ్రామమండలము** :— మూర్ఛనయు మూర్ఛనాభేదముల వలన కలుగు మేళములు సంభవించుటకు హేతువైన స్వరసముదాయముల చేరికయు గ్రామమగును.

ఆట్టి 3 టింలో మొదటిగ్రామ మూర్ఛనా పఢకము నీక్రింద నుండుట గమనించునది.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని | స |
| ని | స | రి | గ | మ | ప | ధ | ని |
| ధ | ని | ప | రి | గ | మ | ప | ధ |
| ప | ధ | ని | స | రి | గ | మ | ప |
| మ | ప | ధ | ని | స | రి | గ | మ |
| గ | మ | స | ధ | ని | స | రి | గ |
| రి | గ | మ | ప | ధ | ని | స | రి |

షడ్జగ్రామము :— సామగానస్వరములగు మ గ రి స ని ధ ప లోని ని ధ ప, ను మ గ రి స ముందు చేర్చగా ని ధ ప మ గ రి స యగును. వీటిని వాద్యములందు పరిశోధించు టచేనివి ఆరోహణముగనుండిన శక్తివంత ముగానుండునని గ్రహించి ఆరోహణముగ మూర్ఛగా స రి గ మ ప ధ ని, అను సప్త స్వరములయ్యెను. ఇదే షడ్జగ్రామమగును.

షడ్జగ్రామ మూర్ఛనలయొక్క పేర్లు, శృతులు, వాటి భిన్నములు :—

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | 3 | 2 | 4 | 4 | 3 | 2 | 4 |
| 1. ఉత్తరమంద్ర | స | రి | గ | మ | ప | ధ | ని | స |
| | 1 | 10/9 | 32/27 | 4/3 | 3/2 | 5/3 | 16/9 | 2/1 |
| | | 4 | 3 | 2 | 4 | 4 | 3 | 2 |
| 2. రజని | ని | స | రి | గ | మ | ప | ధ | ని |
| | 1 | 9/8 | 5/4 | 4/3 | 3/2 | 27/16 | 15/8 | 2/1 |
| | | 2 | 4 | 3 | 2 | 4 | 4 | 3 |
| 3 ఉత్తరాయత | ధ | ని | స | రి | గ | మ | ప | ధ |
| | 1 | 16/15 | 6/5 | 4/3 | 64/45 | 8/5 | 9/5 | 2/1 |
| | | 3 | 2 | 4 | 3 | 2 | 4 | 4 |
| 4. శుద్ధషడ్జ | ప | ధ | ని | స | రి | గ | మ | ప |
| | 1 | 10/9 | 32/27 | 4/3 | 40/27 | 128/81 | 16/9 | 2/1 |
| | | 4 | 3 | 2 | 4 | 3 | 2 | 4 |
| 5. మత్సరీకృత | మ | ప | ధ | ని | స | రి | గ | మ |
| | 1 | 9/8 | 5/4 | 4/3 | 3/2 | 5/3 | 16/9 | 2/1 |
| | | 4 | 4 | 3 | 2 | 4 | 3 | 2 |
| 6. అశ్వక్రాంత | గ | మ | ప | ధ | ని | స | రి | గ |
| | 1 | 9/8 | 81/64 | 45/32 | 3/2 | 27/16 | 15/8 | 2/1 |
| | | 2 | 4 | 4 | 3 | 2 | 4 | 3 |
| 7. అభిరుద్గత | రి | గ | మ | ప | ధ | ని | స | రి |
| | 1 | 16/15 | 6/5 | 27/20 | 3/2 | 8/5 | 9/5 | 2/1 |

పై దెలిపిన 7 మూర్ఛనలకు స్వరములపై నున్న అంకెలు ఆ స్వరములకుగల శ్రుతులును, క్రిందనున్న భిన్నములు ఆయా మూర్ఛనల మొదటి స్వరమును ఒకటి

గా యనుకొనినచో మిగత స్వరములు దానికి ఎంతెంత సంబంధమును గలిగియున్నవో దానిని తెలియచేయును.

షడ్జగ్రామసంవాదులు:—షడ్జపంచమములు రెండును పరస్పరము సంవాదులగుటచే నట్టి వాటికి గలిగిన పేరు.

షడ్జపంచమభావము :— ఆరోహణముగా లెక్కచేయదగిన ఒక రకమైన ప్రస్తారమునకు గలపేరు. షడ్జపంచమములు సమగ్రమైన హార్మొనిగల స్వరములగుటచే షడ్జపంచమభావమువల్ల యేర్పడు స్వరములన్నియు సంపూర్ణ ఐకమత్యము గలిగి గాన యోగ్యములగును. షడ్జపంచమములకు మధ్య ౮ లేక 12 శృతులుండి పరస్పరము సంవాదిస్వరములగును. ఇటుల వాది సంవాదిగా 22 శృతులను ప్రస్తరించునపుడు ఆధార షడ్జమునకు సరియైన పంచమము కనిపెట్టి దానినే తిరిగి షడ్జముగా తలచి దానికి మరల పంచమము కనిపెట్టుచూ ప్రస్తరించగా 13 స్థాయిలలో ప్రస్తారము ముగిసి 22 శృతులు లభ్యమగును.

షడ్జ-పంచమభావమునగలుగుశృతులు:- షడ్జ పంచమభావమున యేర్పడు 12 శృతులు వాటి శేషియో భిన్నము లేర్పడు విధము నీక్రింద దెలుపుట గ్రహించునది.

స లేక షడ్జము ...... 1 అనుకొన్నచో

ప లేక పంచమము $1\times\frac{3}{2}=\frac{3}{2}$ అగును.

రి$_4$ లేక చ.రి. ......... $\frac{3}{2}\times\frac{3}{2}\times\frac{1}{2}=\frac{9}{8}$

ధ$_4$ లేక చ. ధై. ......... $\frac{9}{8}\times\frac{3}{2}=\frac{27}{16}$

గ$_4$ లేక తీ.అం.గాం. లేక చ్యు. మ. గాం. $\frac{27}{16}\times\frac{3}{2}\times\frac{1}{2}=\frac{81}{64}$

ని$_4$ లేక తీ.కా.ని. లేక చ్యు. ష. ని. ... $\frac{81}{64}\times\frac{3}{2}=\frac{243}{128}$

మ$_4$ లేక తీ. ప్ర. మ. లేక చ్యు. పం.

$$\frac{243}{128}\times\frac{3}{2}\times\frac{1}{2}=\frac{729}{512}\doteqdot\frac{64}{45}$$

రి$_2$ లేక ద్వి.రి. ....... $\frac{64}{45}\times\frac{3}{2}\times\frac{1}{2}=\frac{16}{15}$

ధ$_2$ లేక ద్వి.ధై. .......... $\frac{16}{15}\times\frac{3}{2}=\frac{8}{5}$

గ$_2$ లేక సా. గాం. ....... $\frac{8}{5}\times\frac{3}{2}\times\frac{1}{2}=\frac{6}{5}$

ని$_2$ లేక కై. ని. ............ $\frac{6}{5}\times\frac{3}{2}=\frac{9}{5}$

మ$_2$ లేక తీ. శు.మ. .... $\frac{9}{5}\times\frac{3}{2}\times\frac{1}{2}=\frac{27}{20}$

షడ్జ-మధ్యమభావమునగలుగుశృతులు:- షడ్జ-మధ్యమభావమున యేర్పడు 12 శృతులు వాటి శేషియో భిన్నములేర్పడు విధమునదిగువను దెలుపుట గ్రహించునది.

స లేక షడ్జము....... 1 అనుకొన్నచో

మ$_1$ లేక శు. మ. $1\times\frac{4}{3}=\frac{4}{3}$ అగును.

ని$_1$ లేక కో. కై. ని ... $\frac{4}{3}\times\frac{4}{3}=\frac{16}{9}$

గ$_1$ లేక కో. సా. గా. } ... $\frac{16}{9}\times\frac{4}{3}\times\frac{1}{2}=\frac{32}{27}$

ధ$_1$ లేక ఏ. ధై. ...... $\frac{32}{27}\times\frac{4}{3}=\frac{128}{81}$

రి$_1$ లేక ఏ. రి ... $\frac{128}{81}\times\frac{4}{3}\times\frac{1}{2}=\frac{256}{243}$

మ$_3$ లేక ప్ర. మ. } $\frac{256}{243}\times\frac{4}{3}=\frac{1024}{729}\cdot\frac{45}{32}$

ని$_3$ లేక కా. ని. ...... $\frac{45}{32}\times\frac{4}{3}=\frac{15}{8}$

గ$_3$ లేక అం. గాం. } ...... $\frac{15}{8}\times\frac{4}{3}\times\frac{1}{2}=\frac{5}{4}$

ధ$_3$ లేక త్రి. ధై. ......... $\frac{5}{4}\times\frac{4}{3}=\frac{5}{3}$

రి$_3$ లేక త్రి. రి ...... $\frac{5}{3}\times\frac{4}{3}\times\frac{1}{2}=\frac{10}{9}$

పై విధముగా షడ్జపంచమ - షడ్జమధ్యమ భావమున యేర్పడిన 22 శ్రుతుల పేర్లను తెలుసుకొనునపుడు యీ క్రింది సంకేతాక్షరముల అర్థమునుబట్టి, స్వరముల పేర్ల వరుసను చూచుకొని 22 శ్రుతుల స్థానములను గ్రహించుకొనవలెను.

| | |
|---|---|
| స = షడ్జము | చ. = చతుశ్శ్రుతి |
| రి = రిషభము | చ్యు = చ్యుత |
| సా = సాధారణము | త్రి = త్రిశ్రుతి |
| మ = మధ్యమము | తీ = తీవ్ర |
| ప = పంచమము | ద్వి = ద్విశ్రుతి |
| ధై = ధైవతము | ప్ర = ప్రతి |
| ని = నిషాదము | శు = శుద్ధ |
| అం = అంతర | సా = సాధారణ |
| ఏ = ఏకశ్రుతి | కా = కాకలీ |
| కై = కైశికీ | కో = కోమల |

అను విధముగా ఆయా సంకేతాక్షరములు గలశ్రుతులయొక్క పూర్తిపేర్లను వరుసగా చూచుకొని గ్రహించుకొనవలెను.

షడ్జమ్ :— అనగా షట్ + జమ్ = షడ్జ మని పేరు కలిగెను. షట్ అనగా నాసిక, కంఠము, ఉరస్సు, తాలువు, జిహ్వ, దంతములు అనెడి ఆరు స్థానములయందు జమ్ అనగా పుట్టిన ధ్వనికి షడ్జమని పేరు కలిగెను.

షడ్జమ్ :— సప్తస్వరములలో రిషభాది ఆరు స్వరములను షడ్జము ఆధారముగా జనించుటచే యేర్పడిన పేరు.

షడ్జమధ్యమ :— 'సంగీతరత్నాకరము'లో పేర్కొనబడిన 11 వికృత జాతులలో 3 వ దానికి గలపేరు.

షడ్జమధ్యమభావము :— ఆవరోహణ క్రమముగా లెక్కింపదగిన ఒక ప్రస్తార విధానమునకు గల పేరు. అనగా శుద్ధ మధ్యమమును షడ్జముగా జేసికొనిన దాని క్రింద షడ్జము దానికి శుద్ధమధ్యమమగును. ఈ రెంటికి మధ్యను 8 శ్రుతులుండి పరస్పరము సంవాదులగును. ఈరీతిముగా ఆశుద్ధ మధ్యమమును షడ్జముగాచేసినచో దాని క్రిందిషడ్జము శుద్ధమధ్యమమగును. దానిని

తీసిని షడ్జముచేసినచో దానిక్రింది షడ్జము శుద్ధమధ్యమమగును. ఈరీతిగా ప్రస్తరించు చూ పోయినచో 9 స్థాయిలలో ప్రస్తారము ముగిసి 22 శ్రుతులు యేర్పడును.

షడ్జము :— సప్తస్వరములగు 7 స్వరములలో మొదటి స్వరమునకు గల పేరు.

షడాననప్రియ :—15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" జన్యరాగము.
ఆరోహణము- స రి మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ ప మ గ రి స.

షడాననప్రియ :—51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

షడాక్షరి :— 46 వ మేళకర్తయగు "షడ్విధమార్గిణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

షద్రాగచంద్రోదయము :— 'బరహాన్ ఖాన్' ఆస్థాన గాయకుడగు శ్రీ 'పుండరీక విఠలుని'చే రచింపబడిన యొక సంగీత లక్షణ గ్రంథమునకు గల పేరు.

షడ్జి :—షడ్జగ్రామ జాతులలోని 4టిలో మొదటిదానికి గల పేరు.

షడ్విధభాషాకృతిరచయిత :— (1829-1847) తిరువాన్కూరు మహారాజగు శ్రీ స్వాతితిరునాళ్, తమిళము, తెలుగు, సంస్కృతము, మళయాళము(మణిప్రవాళము) హిందుస్థాని, మహారాష్ట్రి భాషలందు అనేక కీర్తనలు రచించుటచే గలిగిన పేరు.

*షడ్విధమార్గిణి :— 46 వ మేళకర్త రాగమునకు గల పేరు. ఇది 8 వ "వసు" చక్రములోని 4 వ మేళకర్తయగును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి- సా. గాం- ప్ర. మ- చ. ధై- కై. నిషాద స్వరములుండును. శ్రీ త్యాగరాజు విరచిత 'జ్ఞానముసగ' అను ప్రసిద్ధకృతి యీ రాగములోగలదు.

షడ్విధస్వరూపి :—63 వ మేళకర్తయగు "లతాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

షడ్విధసాధారిణీసంగ్రహమూర్ఛనలు :— స్వరాంతరములు సంపూర్ణ, షాడవ, ఔడవ, ప్రస్తారములచే గలుగు 6 రకముల మూర్ఛనలకు పేరు. (1) స్వరాంతర - సంపూర్ణ, (2) సంపూర్ణ-స్వరాంతర, (3) స్వరాంతర - షాడవ, (4) షాడవ - స్వరాంతర, (5) స్వరాంతర- ఔడవ, (6) ఔడవ - స్వరాంతరములను వాటికిగల పేరు.

షడ్జోదీచ్యావ :— "సంగీతరత్నాకరము" లో పేర్కొనబడిన 11 వికృతజాతులలో 2 వ దానికి గల పేరు.

షణ్మార్గములు :— తాళమునందు సంగీతము నడచువిధములోని 6 రకములకు

మార్గములకు గలపేరు. అవి 1. దక్షిణ, 2. వార్తిక, 3. చిత్ర, 4. చిత్రతర, 5. చిత్రతమ, 6. అతిచిత్రతమ అనునవి. ఈ 6 తాళమార్గములును వరుసగా తాళాక్షరము (వ్రేలికి) ఒకటికి దక్షిణకు 8 మాత్రలు = 32 అక్షరములు, వార్తికకు 4 మాత్రలు = 16 అక్షరములు, చిత్రకు 2 మాత్రలు = 8 అక్షరములు, చిత్రతరకు 1 మాత్ర = 4 అక్షరములు, చిత్రతమకు ½ మాత్ర = 2 అక్షరములు, అతిచిత్రతమకు ¼ మాత్ర = 1 అక్షరమునంతున నడచును. ఇందు మొదటి మూడు తాళమార్గములును పల్లవులందును, రెండవ మూడు తాళమార్గములును సంగీత రచనలందును వేయుచూ పాడుదురు.

షణ్ముఖప్రియ :— 72 మేళకర్తలలో 56 వ మేళకర్తకు గలపేరు. ఇది 10 వ 'దిశి' చక్రములోని 2 వ మేళమగును. ఆరోహణము– స రి గ మ ప ధ ని స. అవరోహణము– స ని ధ ప మ గ రి స. ఇందు షడ్జ, పంచమములు గాక చ. రి– సా. గాం– ప్ర. మ– శు. ధై– కై. నిషాద స్వరములుండును. శ్రీ త్యాగరాజుని 'వద్దనేవారు' కృతియు, శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ 'మరివేరె దిక్కెవ రయ్యా రామ' కృతియు, శ్రీ దీక్షితుల 'మహాసురం' 'సిద్ధివినాయక' అను కృతులును, శ్రీ స్వాతితిరునాళ్ 'మామవ కరుణా' కృతియు, శ్రీ ముత్తయ్యభాగవతర్ 'వల్లీనాయక' అను కృతియు, ఈ రాగములోని ప్రసిద్ధమగు రచనలగును.

షణ్ముఖి :— 56 వ మేళకర్తయగు "షణ్ముఖప్రియ" యొక్క జన్యరాగము. ఆరోహణము– స రి గ మ ధ ని స. అవరోహణము– స ని ధ మ గ రి స.

# షా

షా :— 72 మేళకర్తలుగల 12 చక్రము అలో ప్రతి మేళచక్రములోని 6 మేళకర్తలలో 6 వ మేళకర్తకు 'వేంకటమఖి' పెట్టిన సంకేతాక్షరనామము.

షాడవ :— ఆరు స్వరములుగల కొలతకు షాడవమని పేరు.

షాడవ - ఔడవ :— ఆరోహణలో 6 స్వరములును అవరోహణలో 5 స్వరములును గల రాగమునకు పేరు. ఉదా॥ హంసగిర్వాణిరాగము. 55వ మేళజన్యం. స రి గ మ ప ధ స – స ధ ప మ గ స.

షాడవము :— ఆరు స్వరములుగలది షాడవమని చెప్పబడును.

షాడవరాగము :— ఆరోహణ, అవరోహణముల రెంటిలోనుఒక్కొక్క స్వరము వర్జమై 6 స్వరములను కలిగియుండు రాగమునకుపేరు. ఉ॥ శ్రీరంజని రాగము. ఇది 22వ మేళజన్యము. ఆరోహణావరోహణములు స రి గ మ ధ ని స–స ని ధ మ గ రి స.

షాడవ - వక్రఔడవము :— ఆరోహణములోని 6 స్వరములు క్రమముగానుండి అవ

రోహణములోని 5 స్వరములు వక్రముగా నుండు రాగమునకు గలపేరు.

షాడవ - వక్రషాడవము :— ఆరోహణలోని ఆరు స్వరములు వరుసగానుండి అవరోహణలోని ఆరు స్వరములు వక్రముగానుండు రాగమునకు గలపేరు.

షాడవ - వక్రసంపూర్ణము :— ఆరోహణలోని 6 స్వరములు క్రమముగానుండి అవరోహణలోని 7 స్వరములు వక్రముగానుండు రాగమునకు పేరు. ఉ॥ కమల నారాయణి. 55వ మేళజన్యము. స రి మ ప ధ ని స — స ని ధ ప మ గ మ రి స.

షాడవ - షాడవరాగము :— ఆరోహణ అవరోహణముల రెంటిలోను 1 స్వరము వర్జ్యమై 6 స్వరములుండు రాగము. ఉ॥ మలయమారుతము. 16వ మేళజన్యము. స రి గ ప ధ ని స — స ని ధ ప గ రి స.

షాడవ - సంపూర్ణరాగము :— ఆరోహణలో 6 స్వరములును, అవరోహణలో 7 స్వరములును గల రాగమునకు పేరు. ఉ॥ కాంభోజిరాగము. 28వ మేళజన్యము. స రి గ మ ప ధ స — స ని ధ ప మ గ రి స.

## షి

షికారి :— 56వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' యొక్క జన్యరాగము. ఆరోహణము— స గ రి గ మ ప ధ ని ధ స. అవరోహణము— స ని ధ మ గ రి స.

షిద్రాక్షీ :— 46వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము. ఆరోహణము— స రి మ గ రి మ ప ధ ని స. అవరోహణము— స ని ప ధ ప మ గ రి స.

## షో

షోడశకళలు :— ప్రతితాళాక్షరమునకు 16 స్వరముల వంతున నడుచువాటికిగల పేరు.

షోడశస్వరములు :— ఒక స్థాయిలో గల 16 స్వరములకు పేరు. అవి ఏవనగా షడ్జ— శు.రి — చ.రి — శు.గాం — ష.రి — సా. గాం — అం. గాం — శు. మ — ప్ర. మ — పంచమ — శు. ధై. — చ. ధై. — శు. ని — ష. ధై — కై. ని — కా. నిషాధస్వరములు. ఇవి 12 స్వరస్థానములందు పుట్టును.

షోడశస్వర సంకేతాక్షరములు :— షోడశస్వరములగు 16 టికిని వరుసగా వేంకటమఖి యేర్పఱచిన సంకేతాక్షరములగు స, ర, రి, రు, గ, గి, గు, మ, మి, ప, ధ, ధి, ధు, న, ని, ను, అనువాటికిగల పేరు.

షోడశాంగప్రస్తారము :— అనుద్రుతము నుండి కాకపాదము వరకు గల 16 తాళాంగములతో కూడిన ప్రస్తారమునకు పేరు.

షోడశాంగములు :— సంగీత కాలమును లెక్కించుట కుపయోగపడు తాళమునందు గల 16 అంగములకు షోడశాంగములని పేరు. అవి 1. అనుద్రుత, 2. ద్రుత, 3. ద్రుతవిరామ, 4. లఘు (చతురశ్ర)

5. లఘువిరామ, 6. లఘుద్రుత, 7. లఘుద్రుతవిరామ, 8. గురు, 9. గురువిరామ, 10. గురుద్రుత, 11. గురుద్రుతవిరామ, 12. ప్లుత, 13. ప్లుతవిరామ, 14. ప్లుతద్రుత, 15. ప్లుతద్రుతవిరామ, 16. కాకపాదములను అంగములకు పేరు.

# స

స :— సప్తస్వర సంకేతములగు 'సరిగమపధని'లో మొదటి స్వరమునకు పేరు.

స :— సప్తస్వరములగు షడ్జ, రిషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదస్వరములలో మొదటి షడ్జమునకు 'వేంకటమఖి' పెట్టిన సంకేతనామము.

సంకరరాగములు :— మేఘరంజి, మలహరి, మందారి, ఘూర్జరి, ఘంటారవము, లలిత, గౌళ, సావేరి మొదలగు రాగములకు సంకర రాగములని పేరు.

సంక్రందనప్రియ :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" జన్యరాగము. ఆరోహణము- స రి గ ప ధ స. అవరోహణము- స ధ ప గ రి స.

సంకీర్ణఅట :— సూళాది 35 తాళములలో 34 వ తాళమునకు గల పేరు. దీనికి అంగములు I I 0 0. మాత్రలు 5½. అక్షర కాలములు 22.

సంకీర్ణఏక :— సూళాది 35 తాళములలో 35 వ తాళము పేరు. దీనికి అంగములు I. మాత్రలు 2¼. అక్షరకాలములు 9.

సంకీర్ణఔడవము :— ఆరోహణ, అవరోహణముల రెంటియందును వర్జింపబడు రెండుస్వరములును వేరువేరు రకములకు చెందిన విధానమందు రాగమునకు పేరు. ఉ|| ఆందోళికరాగము. 28వ మేళజన్యము. స రి మ ప ని స - స ని ధ మ రి స.

సంకీర్ణగతి :— అనగా తాళము వేయునపుడు వ్రేలికి 9 కళలుండునట్లు నడచునది సంకీర్ణగతి అని పేరు. 'సంగీతకాముధి' గ్రంథకర్త్యా దీనికి తాళాక్షర ముక్తిటింటికి సమము, అనాగతము, విషము, అతీతము, అనుద్యమము, అనూదనము, సనాదము, సాభినందనము, సునాదములని 9 గ్రహములుండునని తెలియబడుచున్నది.

సంకీర్ణజాతి :— తాళలఘువును వేయునపుడు ఒక దెబ్బవేసి 8 వ్రేళ్ళను లెక్కించునట్టి మొత్తము 9 అక్షరకాలములుగల దానికి సంకీర్ణజాతి అని పేరు.

సంకీర్ణఝంప :— 35 తాళములలో 32 వ తాళమునకు పేరు. దీనికి అంగములు I ∪ 0. మాత్రలు 3. అక్షరకాలములు 12.

సంకీర్ణతాళము :— అనేక తాళములు కలిసియుండు తాళమునకుగల పేరు. ఉ|| సింహనందన తాళము. దీనిలో చచ్చత్పుట, రతి, దర్పణ, కోకిలప్రియ, అభంగ, ముద్రితమంత తాళములు గలవు.

సంకీర్ణత్రిపుట :— 35 తాళములలో 33 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I O O. మాత్రలు $3\frac{1}{4}$. అక్షరకాలములు 13.

సంకీర్ణధ్రువ :— సూళాది 35 తాళములలో 29 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I O I I. మాత్రలు $7\frac{1}{4}$. అక్షరకాలములు 29.

సంకీర్ణమఠ్య :— సూళాది 35 తాళములలో 30 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I O I. మాత్రలు 5. అక్షరకాలములు 20.

సంకీర్ణము :— అనేక తాళములు కూడియుండి భేదము తెలియకయుండునట్టి తాళమునకుగల పేరు.

సంకీర్ణము :— అనగా మిశ్రమమనియు లేక సంకీర్ణరాగమనియు పేరు. మరియు 9 అను అర్థముకూడ నిచ్చును

సంకీర్ణము :— శుద్ధము, ఛాయాలగము లేక సాలగ లక్షణములను కలిగి జనరంజకమైన రాగమునకుగల పేరు. ఉ॥ దేశ్య కాఫి, సౌరాష్ట్రము మొదలగునవి.

సంకీర్ణరాగము :—సంకీర్ణ లేక సంక్రమ లేక మిశ్రమరాగమునకుగల పేరు. అనగా రి, గ, మ, ధ, ని వీటియొక్క శుద్ధ, వికృతిస్వరముల రెంటిని ప్రవేశపెట్టుటకు వీలు కలిగిన రాగము. ఉ॥ అహీరరాగము. 8 వ మేళకర్త హనుమత్తోడి జన్యము. ఆరోహణ అవరోహణములు సరిసగ మపధనిస-సనిధాపమగరిస.

సంకీర్ణరూపకము :— సూళాది 35 తాళములలో 31 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు O I. మాత్రలు $2\frac{3}{4}$. అక్షరకాలములు 11.

సంకీర్ణలఘువు :— ఒక తాళఘాతవేసి 8 అక్షరములు యెంచునట్టి ఒక జాతి లఘువునకుగల పేరు. దీనికి అంగములు I. మాత్రలు $2\frac{1}{4}$ అక్షరకాలములు 9.

సంకీర్ణషాడవము :— ఆరోహణ, అవరోహణముల రెంటియందును వర్జింపబడియుండు ఒక్కొక్క స్వరము వేరువేరు రకములకు చెందిన స్వరములు గానుండు రాగమునకు పేరు. ఉ॥ కన్నడ గౌళ రాగము. 22 వ మేళజన్యము. సరిగ మపనిస - సనిధపమగస.

సంకీర్తనరత్నావళి :— ప్రాచీనవాగ్గేయకారుడైన తిరువొత్తియూర్ శ్రీ వీణ కృష్ణయ్యర్ కిమారుడు శ్రీ త్యాగియ్యర్, చే 1907 లో తెలుగున రచింపబడిన యొక సంగీతగ్రంథమునకు పేరు.

సంకీర్తనలక్షణము :— తిరుపతి శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యునిచే రచింపబడిన యొక గ్రంథమునకు పేరు.

సంకీర్తనాచార్య :— ప్రాచీన తెలుగు వాగ్గేయకారుడైన తిరుపతి శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యునికి గల ప్రఖ్యాతమగు బిరుదుపేరు.

సంకీర్తనావళి :— గాయకశిఖామణి శ్రీ యల్. ముత్తయ్య భాగవతర్ చే 1936లో

క్షేత్రాదములలో రచింపబడిన యొక గ్రంథము. దీనియొక్క పూర్తి పేరు శ్రీ చాముండాంబాష్టోత్తర శతనామ సంకీర్తనావళియగును.

సంకేతము :— అనగా గుర్తు అని అర్థము. ఉ॥ సప్తస్వరములగు షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములకు వరుసగా 'స రి గ మ ప ధ ని' అనునవి సంకేతాక్షరములగును.

సంగతులు :— ఏదైన రాగాలాపనలో గాని సంగీత రచనలయందలి సాహిత్య భాగములందుగాని ఆయా రాగలక్షణము ననుసరించి రంజకముగనుండునట్లు చేయు మార్పులకు సంగతులని పేరు.

సంగమాన :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము. ఆరోహణము- స రి గ మ ప ని ధ ని స. అవరోహణము- స ని ప ధ పమగరిమగస.

సంగ్రహచూడామణి :— ప్రాచీన లక్షణకారుడగు శ్రీ గోవిందాచార్యులచే రచింపబడిన యొక గ్రంథమునకు పేరు. ఈ కాలములో వాడుకయందుగల కనకాంగి, రత్నాంగి, గానమూర్తి మొదలగు 72 మేళకర్తలయొక్క పేర్లను యేర్పఱచినది యీ మహనీయుడేయని చెప్పుదురు.

సంగీత ఆకారము :— సంగీత రచనయొక్క స్వరూపమునకుగల పేరు. దీనినే ఇంగ్లీషులో 'మ్యూజికల్ ఫారమ్' అని చెప్పుదురు.

సంగీతకళ :— మానవులు తమ మేధాశక్తిచే విశ్వజన మనోరంజకముగా శృతులను సమ్మేళనముచేసి గాత్రమునందుగాని వాద్యమునందుగాని ప్రదర్శించునది సంగీత కళయగును.

సంగీతకళానిది :— ప్రాచీన తెలుగు వాగ్గేయకారుడగు శ్రీ తచ్చూరు పెదశింగరాచార్యులు, చిన శింగరాచార్యులచే లక్ష్య లక్షణములతో రచింపబడిన యొక సంగీత గ్రంథమునకు పేరు.

సంగీతకళానిధి :— మద్రాసు మ్యూజిక్ అకడమివారు క్రీ. శ. 1929 నుండి ప్రతి సంవత్సరము డిశంబరు నెలలో జరుపు ఆల్ ఇండియా మ్యూజిక్ కాన్ఫరెన్సులకు అధ్యక్షులుగా నెన్నుకొను ఉత్తమ తరగతికి చెందిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసులకు యిచ్చునట్టి మహోన్నతమైన బిరుదు. ఈ బిరుదునొందిన విద్వాంసుల పేర్లను యీ క్రింద దెలుపుట గమనించునది.

1929 - శ్రీ టి. వి. సుబ్బారావు బి.ఏ., బి; యల్;

1930 - కీ॥ శే॥ శ్రీ గాయక శిఖామణి యల్. ముత్తయ్య భాగవతర్.

1931 - కీ॥ శే॥ శ్రీ గాయక శిరోమణి, పి. స్వామినాథయ్యర్.

1932 - కీ॥ శే॥ శ్రీ విద్వాన్ టైగర్ కె. వరదాచారియర్.

1933 - కీ॥ శే॥ శ్రీ విద్వాన్ కె. పొన్నయ్య పిళ్ళై.

1934 - కీ॥ శే॥ శ్రీ విద్వాన్ టి. యస్. సభేశయ్యర్.

1935 – శ్రీ విద్వాన్ సంగీత శాస్త్రరత్న కె వాసుదేవాచారియర్.

1936 – కీ॥శే॥ శ్రీ విద్వాన్ ఉమయాల్‌పురం స్వామినాథయ్యర్.

1937 – కీ॥శే॥ శ్రీ అగరమాంగుడి చిదంబర భాగవతర్.

1938 – శ్రీ సంగీత రత్నాకర అరియకుడి రామానుజ అయ్యంగార్.

1939 – శ్రీ విద్వాన్ ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్.

1940 – కీ॥శే॥ విద్వాన్ శ్రీ కల్లిడైకురిచి యమ్. వేదాంత భాగవతర్.

1941 – సంగీత రత్నాకర, ప్రొఫెసర్ శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడు.

1942 – విద్వాన్ – శ్రీ కారైకుడి యమ్. సుబ్బరామ భాగవతర్.

1943 – విద్వాన్ – శ్రీ పల్లడం సంజీవ రావు.

1944 – శ్రీ టి. యల్. వెంకట్రామయ్యర్ బి. ఏ; బి. యల్;

1945 – విద్వాన్ శ్రీ మహారాజపురం విశ్వనాథయ్యర్.

1947 – రాజ్యసేవానిరత శెమ్మంగుడి శ్రీనివాసయ్యర్.

1948 – ఆస్థాన విద్వాన్ కుంభకోణం రాజమాణిక్యం పిళ్ళె.

1949 – విద్వాన్ శ్రీ ముదికొండ సి. వెంకటరామయ్యర్.

1950 – విద్వాన్ శ్రీ కరూరు చిన్నస్వామి అయ్యర్.

1951 – విద్వాన్ శ్రీ చెంబై వైద్యనాథ భాగవతర్.

1952 – వైణిక విద్వాన్ శ్రీ కారైకుడి డి. సాంబశివయ్యర్.

1953 – విద్వాన్ శ్రీ టి. యన్. స్వామినాథ పిళ్ళె మొదలగువారు.

సంగీతకళాప్రదర్శిని :— విజయవాడ వాస్తవ్యుడగు శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిచే 1954 లో వ్రాయబడిన ఒక సంగీతలక్ష్య లక్షణగ్రంథము పేరు.

సంగీతకీర్తనలకు మొదటి రచనలు :— శ్రీ జయదేవుని గీతగోవింద మహాకావ్యములోని "అష్టపదులే" సంగీత కీర్తనలకు ప్రప్రథమ రచనలుగా చెప్పబడుచున్నవి.

సంగీతకేసరి :— సంగీతకళానిధి, సంగీత సాహిత్యవిద్వాన్ శ్రీ కల్లిడైకురిచి యమ్. వేదాంతభాగవతర్ కుగల ప్రసిద్ధ బిరుదు.

సంగీతకౌముది :— సంగీతవిద్వాన్ శ్రీ తిరువయ్యార్ 'సుబ్రహ్మణ్యయ్యర్'చే రచింపబడిన యొక సంగీతలక్షణ గ్రంథమునకు గల పేరు. ఇందు కటపయాది సంఖ్యకనుసరించు 35 తాళముల పేర్లు గలవు.

సంగీతగ్రంథములు కాకనే తాళములను గుఱించి వ్రాయబడిన గ్రంథములు :— "శిలప్పదికారమ్" పట్టుప్పాట్టు, కళ్ళాడము, పురాణనూరు వంటి అతి ప్రాచీన తమిళ గ్రంథములు యీ రకమునకు చెందిన గ్రంథములగును.

**సంగీతచంద్రిక** :— ప్రాచీనుడగు మిష్టర్ 'మాణిక్య ముదలియార్' రచించిన యొక ద్రావిడ సంగీత గ్రంథమునకు గలపేరు.

**సంగీతచింతామణి** :— 'ద్వాన్ శ్రీ 'కె. వి. శ్రీనివాస అయ్యంగార్' చే రచింపబడిన యొక గ్రంథమునకు పేరు.

**సంగీతచూడామణి** :— ప్రాచీన వాగ్గేయ కారుడగు నొక పండితునిచే రచింపబడిన ప్రసిద్ధ సంగీతగ్రంథమునకు పేరు.

**సంగీతదర్పణ గ్రంథస్థమైన పురుషరాగములు** :— శ్రీరాగము, వసంత, భైరవ, పంచమ, మేఘ, బృహన్నాటరాగములు.

**సంగీతదర్పణము** :— శ్రీ దామోదర పండితునిచే రచింపబడిన యొక సంగీత గ్రంథమునకు గలపేరు.

**సంగీతధ్వని** :— క్రమముగా నియమిత కాలములో వచ్చు కదలికలవల్ల పుట్టు ధ్వనికి సంగీతధ్వనియని పేరు. దీనికిని నియమిత కాలములేని, క్రమముకాని, కదలికలైన సంగీతశబ్దమునకును ఈ రెంటికి తారతమ్య మున్నను తెలిసికొనుట ఒక్కొక్కప్పుడు కష్టముగనే యుండును. అయితే వీటి తారతమ్యము స్థాయిలనుబట్టియు, తీయగా వచ్చుటనుబట్టియు, తీవ్రతను బట్టియు, గంభీరతనుబట్టియు, శ్రేష్టతను బట్టియు చెప్పవచ్చును. ఉ॥ కంజీరా, ఘటం, మృదంగముల ధ్వనులు.

**సంగీతపరికరము** :— సంగీతస్వరముల నుద్భవింపజేయు శక్తిగల పనిముట్టు లేక పదార్థము లేక సాధనమును 'సంగీత పరికర'మని చెప్పబడును.

**సంగీతప్రకాశిక** :— పురాతనమైన ఒక ప్రసిద్ధ సంగీతగ్రంథమునకు గలపేరు.

**సంగీతప్రదాయిని** :— శ్రీమాన్ కె. వి. శ్రీనివాస అయ్యంగారుచే రచింపబడిన యొక సంగీత గ్రంథమునకు పేరు.

**సంగీతప్రథమబోధిని** :— గుంటూరు వాస్తవ్యుడగు శ్రీ ఏకా సుబ్బారావుచే తెలుగు (1938) లో ప్రకటింపబడిన యొక సంగీతగ్రంథమునకు పేరు.

**సంగీతపాఠము** :— శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహాచార్యులు వ్రాసిన ఒక చిన్న సంగీత పుస్తకమునకు పేరు

**సంగీతపారిజాతము** :— ప్రాచీన ప్రసిద్ధ వాగ్గేయకారుడైన శ్రీ అహోబలునిచే (1650)లో రచింపబడిన యొక సంగీతలక్షణ గ్రంథమునకు గలపేరు. దీనిలో వీణ యొక్క పాదవునుబట్టి స్వరములనిర్ణయించి వ్రాసెను. దీనిని శ్రీ దీనానాథుడు క్రీ. శ. 1724 లో పారశీక భాషలోనికి తర్జుమా చేసెను. హిందుస్తాని సంగీతములోనికాఫి రాగమును యితడే కల్పించెనని చెప్పుదురు.

**సంగీతమకరంద గ్రంథస్థమగు ద్వావింశతి శృతులు నవియుండు స్వరములు** :
స- సిద్ధా, ప్రభావతీ, కాంతా, సుప్రభా.
రి- శిఖా, దీప్తిమతీ, ఉగ్రా.
గా- హ్లాదీ, నిర్విరి.
మ- దిరా, సర్వసహా, శాంతి, విభూతి

పం- మాలినీ, చపలా, బాలా, సర్వరత్నా.
ధై- శాంతా, వికలినీ, హృదయోన్మలిని.
ని- విశారిణీ, ప్రసూనా.
పైదెలిపిన 22 శ్రుతులు అవి యుండు స్వరములు 'నారదుని' చే 'సంగీతమకరందము' నందు పేర్కొనబడినవని గ్రహించునది.

**సంగీతమకరందము :—** 'నారదుని'చే రచింపబడిన యొక ప్రాచీన సుప్రసిద్ధ సంగీతలక్షణ గ్రంథమునకు గల పేరు.

**సంగీతము :—** దత్తిలమునిచే వ్రాయబడిన యొక ప్రాచీన సంగీతలక్షణ గ్రంథమునకు 'దత్తిలసంగీతము' అని పేరు.

**సంగీతమునకు యోగ్యమగు ధ్వనులు :—** ఒక సెకండుకు 30 మొదలు 4,000 స్పందనముల వఱకుగల ధ్వనులు మాత్రము సంగీతమునకు యోగ్యమైనవిగా నుండునని శాస్త్రజ్ఞులు కనుగొనిరి.

**సంగీతమును నక్షత్రశాస్త్రముతో జతపఱచిన గ్రంథములు :—** 'శిలప్పదికారమ్' అను ప్రాచీన తమిళ గ్రంథములోను, 'చైనామ్యూజిక్' అను గ్రంథములోను సంగీతమును నక్షత్రశాస్త్రమునకు జతపఱచి వ్రాసినట్లు పూర్వకాలమునందలి మధ్యయుగమునకు చెందిన రచయితలు వ్రాసిరి.

**సంగీతము యిరువది రెండు శ్రుతులు స్వరావళి :—** శ్రీమాన్ విరజమూరి వరాహ నరసింహాచార్యులచే 1928 లో తెలుగులో వ్రాయబడిన ఒక చిన్న గ్రంథమునకు పేరు.

**సంగీతములోని వివిధరకములు అమలు నందున్న దేశములు :—** యూరప్‌లోను, ఇండియాలోను సంగీతములోని ప్రతిరకము అనగా కచ్చేరి సంగీతము పవిత్ర సంగీతము, నృత్యసంగీతము, నాటకసంగీతము మొదలగు నన్ని రకముల సంగీతములు అమలులోనున్న దేశములగుచున్నవి. గనుక ఆ దేశములు యీ రకమునకు చెందును.

**సంగీతములో విశేష గమకములుగల దేశములు :—** మిక్కిలి ఉత్కృష్టమైన సంగీత విధానములు అమలునందున్న ఇండియా, వంటి దేశములు సంగీతములో విశేష గమకములుగల దేశములగుచున్నవి.

**సంగీతరకము :—** సంగీత రచనయొక్క శైలి లేక విధమునకుగల పేరు. దీనినే ఇంగ్లీషులో 'మ్యూజికల్ టైపు' అని చెప్పుదురు.

**సంగీతరచన :—** ఒక రచన ఏజాతికి చెందినదో ఆజాతి లక్షణమున కనువగునట్టి రాగతాళములలో వ్రాయబడునట్టి రచన లేక ప్రబంధమునకు పేరు.

**సంగీతరచన :—** ఒక నిర్ణీతమైన రాగ తాళములలో పాడుటకు రచింపబడినట్టి సాహిత్యము లేక జతిస్వరమువంటి రచనకుగల పేరు.

**సంగీతరచనలో నిశ్శైలి :—** ఏ గాయకుడైనను తనకు యితర రచనలెన్ని వచ్చియున్నను త్యాగరాజుని రచననే పాడుటకిష్టపడును. ఇందుకు ముఖ్యకారణమేమనగా! ఆ మహనీయుని సంగీత రచనలందలి ఆకర్షణీయమైన, సమ్మోహితమైన రచనా శైలియే కారణమగును. మఱియు ఆయన కృతులపై రాగభావము వెన్నవలె తేలు

చుండును. సంగీత భావను స్వచ్ఛమైన రూపములో నుపయోగించెను. ఇతని రచనలకింతటి సౌందర్యము గలుగుటకు యీ శైలియే ప్రధానకారణమగును.

సంగీత రచయితలగు ప్రాచీన తెలుగు వాగ్గేయకారులు :— ఈ దిగువ పేర్కొనిన రచయితలు యీతరగతికి చెందుదురు. శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులు, శ్రీ తాళ్ళపాక చిన్నయ్య, శ్రీ భద్రాచల రామదాసు, శ్రీ నారాయణతీర్థులు, శ్రీ క్షేత్రయ్య, శ్రీ గిరిరాజకవి, శ్రీ సోమనాథుడు, శ్రీ పైడాల గురుమూర్తిశాస్త్రి, శ్రీ మానంబుచావడి వెంకటసుబ్బయ్య, శ్రీ త్యాగరాజు, శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ వీరభద్రయ్య, శ్రీ సుబ్రహ్మణ్యకవి, శ్రీ తచ్చూరుశింగరాచార్యులు మొదలగువారు.

సంగీతరత్నము :— 'శ్రీ సుబ్రహ్మణ్యయ్యర్'చే రచింపబడిన యొక సంగీత గ్రంథమునకుగల పేరు.

సంగీతరత్నాకర :— సుప్రసిద్ధ గాయకుడును భారతప్రభుత్వాధ్యక్షులచే మొదటి సన్మానమొందిన శ్రీమాన్ అరియకుడి రామానుజఅయ్యంగారికి గల ప్రఖ్యాతమగు ఒక బిరుదు.

సంగీతరత్నాకర :— సుప్రసిద్ధ వయొలినిష్టును, భారత ప్రభుత్వాధ్యక్షులచే వయొలిన్ వాద్యములో మొదటి సన్మానమొందిన శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడికిగల ప్రఖ్యాతమైన ఒక బిరుదు.

సంగీతరత్నాకరము :— శ్రీ శార్ఙ్గదేవునిచే సంస్కృతములో రచింపబడిన ప్రాముఖ్యమైన ఒక సంగీత లక్షణగ్రంథమునకుగల పేరు. ప్రాచీన సంగీత శాస్త్రమునకు యిదియొక ముఖ్యమగు ప్రామాణిక గ్రంథమగును. ఇందు 7 అధ్యాయములుగలవు.

సంగీతరత్నావళి :— శ్రీమాన్ కె. వి. శ్రీనివాస అయ్యంగార్‌చే రచింపబడిన యొక సంగీత గ్రంథమునకు పేరు.

సంగీతరాజ :— ప్రాచీన సుప్రసిద్ధ సంగీతలక్షణ వేత్తయగు "కుంభకర్ణుడు" రచించిన యొక లక్షణ గ్రంథమునకు పేరు. ఇతనికి "అభినవభరతాచార్య" అను బిరుదుకలదు.

సంగీతలక్షణసంగ్రహము — ఈ నిఘంటువుయొక్క గ్రంథకర్తయగు శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిచే (విజయవాడ)లోగడ వ్రాయబడిన సంగీతగ్రంథములలో మూడవ గ్రంథమునకుగల పేరు.

సంగీతవాద్యములు :— శృతి, లయలకు సంబంధించిన అన్నివాద్యములు సంగీతవాద్యములకు చెందినవగుచున్నను ముఖ్యముగా వీణ, వయొలిన్ (ఫిడల్) గోటు, మురళీ, నాగస్వరము, సారంగ్, సితార్, దిల్‌రుబ వంటి వాద్యములు సంగీతమును శాస్త్రయుక్తముగాను సంపూర్తిగాను ప్రదర్శింపగలిగినవగుటచే వాటినే సంగీతవాద్యములని చెప్పుట మిగుల సమంజసమగును.

సంగీతవాద్యములు :— డాక్టరు శ్రీ

"మీరువాస్తు" చే ఇంగ్లీషులో రచింపబడిన యొక గ్రంథమునకుగల పేరు.

సంగీతవాద్యవిభజన:— సంగీత వాద్యములను 4 రకములుగా విభజింపబడినవి. అవి 1. తంత్రీసాధని, 2. రంధ్రసాధని, 3. చర్మసాధని, 4. లోహసాధనిఅనునవి.

సంగీతవ్యాసకృతి :— "శ్రీ శంకర గణేశ్ వ్యాస్"చే హిందుస్థాని సంగీతమును గూర్చి హిందీలో వ్రాయబడిన ఒక గ్రంథమునకు పేరు.

సంగీతవిద్యాదర్పణము :— కీ|| శే|| శ్రీ ఉమ్మడిశెట్టి వేంకటస్వామినాయుడు (గుంటూరు)చే తెలుగులో రచింపబడిన యొక సంగీత గ్రంథమునకు పేరు.

సంగీతవిభాగము :— గాత్ర సంగీతము, వాద్య సంగీతము, నృత్య సంగీతములను త్రివిధములగు విభాగమునకు పేరు.

సంగీతవిభాగము :— సంగీతములోని రెండు ముఖ్యభాగములగు మనోధర్మ సంగీతము, కల్పిత సంగీతమునకుగల పేరు. మనోధర్మ సంగీతమునందు 1. రాగాలాపన. 2. మధ్యమకాలమ్ లేక తానమ్. 3. పల్లవి. 4. నిరవల్ లేక సాహిత్యప్రస్తారము. 5. స్వరప్రస్తారము అను 5 భాగములను కలిగియుండును. కల్పిత సంగీతమునందు 1. ఆర్ట్ మ్యూజిక్. (టెక్నికల్ మెలొడిస్) 2. శాస్త్రీడ్ మ్యూజిక్. 3. ఒపెరా మ్యూజిక్. 4. డ్యాన్స్ మ్యూజిక్. 5. ఫ్లోక్ మ్యూజిక్ అను 5 భాగములుగనుండును.

సంగీతశబ్దార్థచంద్రిక :— శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిచే తెలుగులో రచింపబడి 1953–1954 లో ప్రకటింపబడిన యీ నిఘంటు గ్రంథమునకు పేరు.

సంగీతశాస్త్రము :— శ్రుతులు, వాటి భేదములు, వాటి యుత్పత్తి, వాటి సమ్మేళనము, సెకెండుకు వాటి వేపనసంఖ్య, స్వరములు, వాటి స్వరస్థానములు, వాటి స్వరభేదములు, వాటి చేరికవలన యేర్పడు జనకరాగములు, వాటినుండిపుట్టు జన్యరాగములు, వాటి విభాగములు, తాళములు, వాటి జాతులు, వాటి అంగములు, మాత్రలు, అక్షరకాలములు, వగైరా వివిధ స్వర, రాగ, తాళ వివరములను తెలియచేయు శాస్త్రమునకుగల పేరు.

సంగీతశాస్త్రము :— శ్రీ కె.వి.యస్.యస్. గిర్మాజీరావుచే తెలుగులో వ్రాయబడిన ఒక లక్షణగ్రంథము. పూర్తిపేరు ఆంధ్ర సంగీతశాస్త్రము.

సంగీతసత్యము :—సంగీతమునకు సంబంధించిన సిద్ధాంతమునకుగల పేరు. అనగా సంగీతములో సప్తస్వరములు, వాటి భేదములగు ద్వాదశ స్వరములు కలవనుటయు, ఒక స్వరము దానిస్థాయితోగాని, లేక స్వరములతోగాని కలిపి పాడినపుడు లేక వాయించునపుడు ఒక సామరస్యమైన ఫలితము వచ్చుననుటయు, షడ్జ, పంచమస్వరముల ధ్వనివిశేషములు, ఒక దానితో నొకటి సంబంధించినవనుటయు, అవి 2 : 3 నిష్పత్తిని కలిగియుండుననియు తెలుపునది సంగీతసత్యమగును.

సంగీతసంప్రదాయప్రదర్శిని :—19–20 శతాబ్దములకుచెందిన 'ఎట్టయాపురము

(క్రీ. శ.) సంస్థాన విద్వాంసుడగు శ్రీ సుబ్బరామదీక్షితులచే 1904 లో తెలుగులో రచింపబడి ప్రశస్తమైన ఒక గొప్ప సంగీతలక్ష్య లక్షణ గ్రంథమునకు పేరు. షుమారు 1250 పుటలుగల ఈ గ్రంథము రెండు పెద్ద భాగములుగానున్నది. కర్ణాటక సంగీతమునందు యిది రెండును ఒక ప్రమాణ గ్రంథములుగానున్నవి.

సంగీతసమయసారము :— శ్రీ పార్శ్వదేవునిచే రచింపబడిన యొక ప్రాచీన ప్రమాణ సంగీత లక్షణ గ్రంథమునకు పేరు.

సంగీతస్వయంబోధిని :— సంస్కృతాంధ్రములయందు పండితులును, సుప్రసిద్ధ వైణికులగు శ్రీ టి. యస్. వెంకటేశ్వర శాస్త్రులచే రచింపబడిన యొక సంగీత గ్రంథమునకు పేరు. దీనిలోగల కొన్ని ఇంగ్లీషు సాంగ్సను భారతీయ సంజ్ఞా శాస్త్రములో ప్రచురింపబడినవి.

సంగీతస్వరప్రస్తారసాగరము : విద్వాన్ శ్రీ ముక్కు నాదముని పండితులచే తెలుగులో రచింపబడి ప్రకటింపబడిన యొక సంగీత గ్రంథమునకు పేరు. ఇందు 72 మేళకర్తలును, వాటినుండి జనించిన 2044 జన్యరాగము లకు ఆరోహణ, అవరోహణములును పేర్కొనబడినవి. ఇందు సంగీత శాస్త్రమునకు సంబంధించిన ముఖ్య విషయములును ప్రముఖ వాగ్గేయకారుల రచనలును గలవు. ఈ రచయిత మద్రాసునందు నివసించెనని తెలియుచున్నది.

సంగీత సర్వార్థసార సంగ్రహము :— తెలుగు వాగ్గేయకారులగు శ్రీ మాన్ తచ్చూరు సింగరాచార్యులును, అళహ సింగరాచార్యులును కలసి తెలుగులో ప్రకటించిన యొక సంగీత గ్రంథమునకు గల పేరు.

సంగీతసారము :— శ్రీ విద్యారణ్యులచే రచింపబడిన యొక సంగీత గ్రంథమునకు పేరు. ఇందు రాగాలాపన ఆలు అంగములుగా పేర్కొనబడినది.

సంగీతసారసంగ్రహము :— మద్రాసు సంగీత విద్వత్సభవారు తెలుగు, ఇంగ్లీషు భాషలలో 1940 లో ప్రచురించిన యొక సంగీత గ్రంథమునకుగల పేరు.

సంగీతసారామృతము :— తంజావూరు 'శ్రీ తులజమహారాజు'చే 1771 లో రచింపబడిన యొక సంగీత లక్షణ గ్రంథమునకుగల పేరు. ఇందు గీత, ఆలాప, ఠాయ ప్రబంధములను పేర్కొనబడినవి.

సంగీతసుధ :— 17 వ శతాబ్దమునకు చెందిన తంజావూరు సంస్థానాధీశ్వరుడగు శ్రీ రఘునాథ నాయకుడు శ్రీ గోవింద దీక్షితుని సహాయమున రచింపబడిన యొక సంగీత లక్షణ గ్రంథమునకు గల పేరు.

సంగీతసుధాంబుధి :— శ్రీమాన్ కె. వి. శ్రీనివాస అయ్యంగారిచే తెలుగులో విరచితమై యమ్. ఆది అండ్ కంపెనీ వారిచే ప్రకటింపబడిన యొక సంగీత గ్రంథము పేరు. ఇందు త్యాగరాజ పంచరత్న కీర్తనములుకూడ గలవు.

సంగీతసుధాకరము :— 'శ్రీ హరిపాల దేవుని'చే రచింపబడిన యొక సంగీతలక్షణ

గ్రంథమునకు గలపేరు. ఇందు ఆలప్తి, రూపకాల ప్తిని గురించి పేర్కొనబడినది.

సంగీతసుధానిధి :— పూర్వము తంజావూరు సంస్థాన ప్రధానమంత్రిగా పనిచేసిన 'శ్రీ గోవిందదీక్షితుల'చే రచింపబడిన యొక సంగీతలక్షణ గ్రంథముపేరు.

సంగీతసూర్యోదయము :— ఇది 16 వ శతాబ్దమునకు చెందిన 'శ్రీ లక్ష్మీనారాయణ'చే రచింపబడిన యొక ప్రాచీన సంగీతగ్రంథమునకు గలపేరు. ఈయన విజయనగర సామ్రాజ్యమేలిన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములో నుండిన వాడుగా తెలియుచున్నది.

సంగీతాకర :— ప్రాచీన సంగీతలక్షణకారుడైన శ్రీ పార్శ్వదేవునికిగల బిరుదు.

సంగీతార్ణవపారగ :— ప్రాచీన సంగీతలక్షణకారుడైన 'శ్రీ యోగనరేంద్రమల్లి'కగల ప్రసిద్ధమైన బిరుదు.

సంచార :—కలయిక, లేక సమ్మేళనము, లేక ప్రయోగమునకుగల పేరు. దీనినే తమిళములో 'పిడిప్పు' అని చెప్పుదురు.

సంచారి :— పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములు లేకనే సాధారణ గీతమునుబోలిన ధాతు (స్వర) రచనకు 'సంచారి' అని పేరు. ఇట్టి సంచారులను శ్రీముద్దుస్వామిదీక్షితులవారి తమ్ముని దత్తపుత్రుడగు శ్రీ సుబ్బరామదీక్షితులు అనేకము రచించిరి. శుద్ధ ధన్యాసిరాగము, రూపకతాళములోని 'గమపాపా' అను సంచారి యిందుకు ఒక యుదాహరణయగును.

సంచారిగీతము :— సాహిత్యము దైవ స్తోత్రమునకు సంబంధించినదిగా యుండు ధాతు. మాతుగల రచనయగు సాధారణ గీతమునకుగల పేరు. దీనినే సామాన్యగీతమనియు, లక్ష్యగీతమనియు చెప్పుదురు.

సంచారివర్ణము :—స్థాయివర్ణము, ఆరోహివర్ణము, అవరోహివర్ణము అను మూడును కలియునట్టి గానక్రియకుగల పేరు. ఉ॥ స మ గ ని ధా, స ని ధ ప ధా - రి మ గ మ గ రి మొదలగునవి.

సంచెలిత :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- సరిగమగపనిధనిపధనిస
అవరోహణము—సనిధనిపధమపగరిమరిగస

సంజీవిని :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి స గ మ ప ని స.
అవరోహణము- స ని ధ ని ప మ గ రి స.

*సంతానమంజరి :— 72 మేళకర్తలలో 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర'కు 'వేంకటమఖి' పెట్టిన మరియొక పేరు.

సంతానమంజరి :— 67 వ మేళకర్తయగు "సుచరిత్ర" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ రి స.

సంతానిక :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

సందర్శిని :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

సందష్టుడు :— దంతములను కఱచుకొని గానము చేయు 'గాయకుని'కి గల పేరు.

సంధిప్రకాశ రాగములు :— సూర్యోదయ, సూర్యాస్తమయ కాలములందు పాడదగిన రాగములకుగల పేరు. ఇవి నారదునిచే చేయబడిన రాగవిభజనలోని 4 విధములలో మొదటిదియగును.

సంపద్వేష్టకతాళము :— ఈ శ్వరుని పంచముఖములలో 4 వదైన తత్పురుష ముఖమునందు పుట్టిన తాళమునకుగల పేరు.

సంపద్వేష్టకము :— "అష్టోత్తర శత" తాళములగు 108 లో మొదటి మార్గ తాళములగు 5 టిలో 4 వ దానికిగల పేరు. దీనికి అంగములు 3 8 8 8 3.

సంపూర్ణ :— సంగీత శాస్త్రము లో 7 స్వరములుగల కొలతకుగల పేరు.

సంపూర్ణ-ఔడవము :— ఆరోహణములో సప్తస్వరములుండి అవరోహణములో ఐదు స్వరములుగల రాగమునకు పేరు. ఉ॥ గరుడధ్వని రాగము. 29 వ మేళ జన్యము. స రి గ మ ప ధ ని స—స ధ ప గ రి స.

సంపూర్ణతానము :— సప్తస్వరములన్నిటితో ప్రస్తరించు తానమునకుగల పేరు. ఇట్టి ప్రస్తారములు మొత్తము 5040 అగును.

వీటికి వ్యతిరేకమైనవి అసంపూర్ణతానము లగును. అనగా 6, 5, 4, 3, 2 స్వరములతో ప్రస్తరించునట్టి తానములగును. ఇట్టి తానములు మొత్తము 872 గలవు. ఏవనగా
స రి, అను 2 స్వరములతో వచ్చు ప్రస్తారములు $(1 \times 2) = 2$.
స రి గ, అను 3 స్వరములతో వచ్చు ప్రస్తారములు $(2 \times 3) = 6$.
స రి గ మ, అను 4 స్వరములతో వచ్చు ప్రస్తారములు $(6 \times 4) = 24$.
స రి గ మ ప, అను 5 స్వరములతో వచ్చు ప్రస్తారములు $(24 \times 5) = 120$.
స రి గ మ ప ధ, అను 6 స్వరములతో వచ్చు ప్రస్తారములు $(120 \times 6) = 720$.
పైన దెలిపిన $720 + 120 + 24 + 6 + 2 = 872$ ప్రస్తారములు అసంపూర్ణ తానము లగును. స రి గ మ ప ధ ని, అను 7 స్వరములతో వచ్చు ప్రస్తారములు $720 \times 7 = 5040$ సంపూర్ణతానములగును. గనుక సంపూర్ణతాన, అసంపూర్ణతానముల మొత్తము $5040 + 872 = 5912$ అని గ్రహించునది.

సంపూర్ణరాగము :— ఆరోహణ, అవరోహణముల రెంటిలోను సప్తస్వరములు వచ్చునట్టి రాగమునకు పేరు. ఉ॥ భైరవి, శంకరాభరణము, కల్యాణి మొదలగునవి.

సంపూర్ణ-వక్రఔడవము :— ఆరోహణములోని 7 స్వరములు వరుసగానుండి అవరోహణములోని 5 స్వరములు వక్రముగానుండు రాగమునకుగల పేరు.

సంపూర్ణ-వక్రషాడవము :— ఆరోహణములోని 7 స్వరములు వరుసగానుండి అవరోహణములోని 6 స్వరములు వక్రముగానుండు రాగమునకుగల పేరు.

సంపూర్ణ-వక్రసంపూర్ణము :— ఆరోహణములోని 7 స్వరములు వరుసగానుండి అవరోహణములోని 7 స్వరములు వక్రముగానుండు రాగమునకు గల పేరు.

సంపూర్ణ-షాడవము:—ఆరోహణములో సప్తస్వరములుండి అవరోహణములో ఆరు స్వరములుండు రాగమునకు పేరు. ఉ॥ భైరవము - 17వ మేళజన్యము. సరిగమపధనిస- సధాపమగరిస.

సంపూర్ణ - సంపూర్ణము :— ఆరోహణ, అవరోహణముల రెంటియందును సప్త స్వరములుగల సంపూర్ణ రాగమునకు పేరు.

సంభావిత :— భరతుడు 'నాట్యశాస్త్రము' వ్రాసిన కాలములో నాట్యములో నుపయోగించు 2 ప్రధాన రచనలలో 2వదైన గీతిలు 4 టిలో మూడవదానికి పేరు.

సంయోగమేరువు :— తాళప్రస్తారము నందలి భేదములగు 14 టిలో 12వ భేదమునకు గల పేరు.

సంరక్షణి :— 67వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము- సరిగమపధనిస.
అవరోహణము- సనిధపమగరిగస.

సంవాది :— సామరస్యమును కలిగించు సూత్రమును భారతదేశ సంగీతములో సంవాది, లేక స్వరసంయోగము అని చెప్పుదురు. ఇది 'వాది'తో సంయోగముగా పలుకునదిగానుండును. ఈ సంవాది స్వరము వాది స్వరమునుండి 9 గాని లేక 13 శృతులచే వేరుచేయబడుచున్నది. వాకి సంవాది పంచమస్థానము లేక మధ్యమ స్థానములోనుండును. అనగా వాదిస్వర విక్రాంతి 1 అయినచో సంవాది లేక $\frac{4}{3}$ స్వరవిక్రాంతి $\frac{3}{2}$ అగును.

సంవేశిని :—69వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- సరిమధనిస.
అవరోహణము- సనిధమరిస.

సంస్కృతకీర్తనల రచయితలు :— శ్రీ మార్గదర్శి శేషయ్యంగార్, అయ్యావాళ్, సదాశివ బ్రహ్మేంద్రము, విజయగోపాలుడు, పైడాల గురుమూర్తిశాస్త్రి, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితర్, శ్యామశాస్త్రి, హెచ్. హెచ్. స్వాతితిరునాళ్, విఠలపంతు, రామచంద్రయతీంద్ర, కామకోటిశాస్త్రి, వాలాజపేట వేంకటరమణభాగవతర్, లింగరాజు అర్సు, మహావైద్యనాథయ్యర్, తచ్చూరు శింగరాచార్యులు, మైసూరు సదాశివరావు మొదలగు ప్రఖ్యాత రచయితలకు గలపేరు.

సంస్కృతములోని పవిత్రరచనలు :— శ్రీ ఆదిశంకరులవారి భజగోవిందస్తోత్రము, శ్లోకములు, మార్గికలు, దండకములు, స్తోత్రములు, అష్టకములు మొదలగు పవిత్ర రచనలకు గలపేరు.

సంస్కృతములోగల ప్రమాణ సంగీత లక్షణగ్రంథముల రచయితలు :—
శార్ఙ్గదేవుడు- సంగీతరత్నాకరము.
రామామాత్యుడు- స్వరమేళకళానిధి.
సోమనాథుడు- రాగవిబోధము.

వేంకటమఖి- చతుర్దండి ప్రకాశిక. మొదలగు రచయితలు ముఖ్యులగుదురు.

సంక్షేప రామాయణ కీర్తనలు :— శ్రీ 'త్యాగరాజు'నిచే రచింపబడిన యొక ప్రత్యేక కీర్తన రచనలకుగల పేరు.

స్కందతాళము :—'రత్నాకర'గ్రంథస్థమైన 120 తాళములలో 107 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 8 । 8 0 0 8 8.

స్కందపురాణకీర్తనలు :—1810-1896 కాలమువాడైన శ్రీ 'కవికుంజరభారతి'చే రచింపబడిన ప్రఖ్యాతమగు తమిళ రచనలకు గలపేరు.

స్తంభము :— సాత్వికభావములోని 8 విధములలో మొదటి దానికిగల పేరు.

స్పందనము :— ఒక వస్తువుయొక్క వణకెడి క్రియకు స్పందనము లేక 'స్పందించుట' యని పేరు.

సక :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములోని కటపయాది సంఖ్యగల 'ఖండజాతి ధ్రువతాళము' నకుగల పేరు. దీనికి అంగములు । 0 । ।. మాత్రలు 4¼. అక్షరకాలములు 17.

సఖి :— ఉపనాయికలలోని 8 రకములలో 8 వ రకపు నాయికకుగల పేరు.

[illegible] :— తాళ అంతరిత అంగముల చేర్పబడిన 8 గణములలో [illegible]వ దానికిగల పేరు. దీనికి అంగములు [illegible].

సజగిరి (Sazagiri) :— పర్షియాలోని గొప్ప సంగీత విద్వాంసుడగు, 'అమిర్ ఖుస్రూ' సృష్టించిన ఒక రాగమునకు పేరు.

సజ్జనానంది :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

సజుకాంభోజి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ రి స ప మ ధ ని స.
అవరోహణము- స ని ప ని మ గ రి స.

సత్యభూషణి :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స.

సత్యవతి :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ ప ధ స.
అవరోహణము- స ని ధ ని ప ధ ప గ రిస.

సత్యవతి :— 67 వ మేళకర్తయగు "సుచరిత్ర" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ మ రిస.

సత్వము :— వ్యభిచారీ భావము యేర్పడుటకు మూలమైన వాక్కు, అంగము, సత్వము అను 3 టిలో 3 వ దాని పేరు.

సదానంద :— సూళాది సప్తతాళ అలంకారములకిచ్చిన 7 పేర్లలో 7 వ దానికి యిచ్చినటువంటి పేరు.

సదాశివ :— మైసూరు శ్రీ "సదాశివ రావు" తనయొక్క సంగీత రచనలందు పెట్టుకొనిన ముద్రకు పేరు. వీరి ముద్ర గలరచనకు ఉదాహరణముగా 'పాచాము గోచరుండని' అను ఆఠాణా రాగము, ఆదితాళములోని కృతిని చూడవచ్చును.

సన్నమీటు :—వీణవంటి వాద్యములలో నాదము సూక్ష్మముగా పలుకునటుల మీటుటకు "సన్నమీటు" అని పేరు.

సనాదము :— "సంగీతకౌముది" అను గ్రంథములోని తాళప్రకరణములో గ్రహ లక్షణమునందు పేర్కొనబడిన 9 గ్రహము లలో 7 వ దానికిగల పేరు.

సన్నిపాతము :— సశబ్దమార్గక్రియలలో 4 వ దానికి గలపేరు. ఇది అభిముఖముగా నిలుపబడిన రెండు హస్తములతో సమ ముగా ఘాత (దెబ్బ) వేయుటయగును.

సన్నివా సన్నిచక్రమ్ :— 'తాళసముత్తి రమ్' అను తమిళ్ గ్రంథములో పేర్కొన బడిన తాళములలో 3 వ దాని పేరు.

సన్నిహిత :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ మ ప ధ మ గ రి స.

సన్దీపినీ :— ద్వావింశతి శ్రుతులగు 22 టిలో 16 వ శ్రుతియగు 'ద్విశ్రుతిధైవ తము'నకుగల పేరు. ఉ|| మాయామాళవ గౌళ, తోడి, రాగములు యీ శ్రుతిగల రాగముల కుదాహరణములగును.

సప్త :—ఏడు అనుసంఖ్యను తెలియజేయు నట్టి దానికిగల పేరు.

సప్తకము :—ఏడు అనుసంఖ్య లేక సప్త స్వరములకుగల పేరు.

సప్తతంత్రులగోటు :— 7 తంత్రులుగల మెట్లులేని గోటువాద్యమునకుగల పేరు. ఇందుగల 7 తంత్రులలో మీది 4 తంత్రులు వాద్యమునర్చుటకును, క్రింది 3 తంత్రులు తాళము వేయుటకు నుపయోగింతురు.

సప్తతంత్రులతంబుర :—శ్రీ 'త్యాగరాజా ని'చే ఆశీస్సులొందిన 'షట్కాలగోవిం దమారార్' అను సుప్రసిద్ధ ప్రాచీన విద్వాంసు డుపయోగించిన తంబురకుగల పేరు. ఇందుగల 7 తంత్రులలో 3 తం త్రులు మధ్యషడ్జములుగను 3 తంత్రులు మంద్రపంచమములుగను 1 తంతి మంద్ర షడ్జముగను శ్రుతిచేయబడుచుండెనని చెప్పుదురు.

సప్తతంత్రుల ఫిడేలు (వయొలిన్) :— 7 తంత్రులతోకూడిన ఫిడేలుకుగల పేరు. దీనిని యిప్పుడు మైసూరు ఆస్థాన విద్వాన్ టి. చౌడయ్య అను సుప్రసిద్ధ వయొలినిష్టును, ఆయన శిష్యులును సాధా రణముగా వాయించుచుందురు. దీని నాద ము గంభీరముగానుండును. దీనిలోనుండు 7 తంత్రులలో 1 మంద్రషడ్జముగను, 2, 3 అను మంద్ర పంచమ, మంద్ర పంచమ ములుగను, 4, 5 మంద్రషడ్జ, మధ్యషడ్జ ములుగను 6, 7 మంద్ర పంచమ, మధ్య పంచమములుగను శ్రుతిచేయుదురు. అనగా యీ తంత్రుల శ్రుతులు స - ప ప - స స - ప ప అనెడి స్వరములుగానుండును.

సప్తతంత్రులవీణ :— 7 తంత్రులు గలిగిన వీణకుగల పేరు. వీటిలో కొన్నిటికి ధ్వనిని పెంపొందించుటకు యెక్కువ తంత్రులున్న ను మీాది 4 తంత్రులే వాయింపబడును.

సప్తతాళములు :—సప్తఅలంకారములకు యేర్పడిన 7 తాళములగు ధ్రువ, మఠ్య, రూపక, ఝంప, త్రిపుట, అట, ఏక తాళములకుగల పేరు.

సప్తతాళేశ్వరమ్ :— ప్రాచీన ప్రముఖ వాగ్గేయకారుడైన, శ్రీ పచ్చిమిరియం ఆది అప్పయ్య కుమారుడు 'వీణ కృష్ణయ్య' రచించిన రచనకు పేరు. ఇతడు మైసూరు విజయనగరం, కోటకోట, సంస్థానాధి పతులమీాద 8 ప్రబంధములను రచించెను.

సప్తమశ్రుతికము :— $\frac{9}{8}$ చతుశ్శ్రుతికము $+ \frac{10}{9}$ త్రిశ్రుతికము $= \frac{5}{4}$ సప్తమశ్రుతికము గును. అనగా $\frac{9}{8} \times \frac{10}{9} = \frac{10}{8} = \frac{5}{4}$ శ్రుతికిగల పేరు.

సప్తశుద్ధజాతులు :— షడ్జగ్రామములోని షడ్జి, నిషాది, ధైవతి, ఆర్షభి అను, 4 జాతులును, మధ్యమ గ్రామములోని గాంధారి, మధ్యమ, పంచమ అను 3 జాతులును కలిసి $4 + 3 = 7$ జాతులకుగల పేరు.

సప్తస్వరఅధిదేవతలు :— స - అగ్ని, [illegible] - బ్రహ్మ, గ - సరస్వతి, మ - శివుడు, [illegible] - విష్ణు, ధ - వినాయకుడు, ని - [illegible] అను అధిదేవతలకు పేరు.

[illegible]ములు :— స - కత్తి, [illegible], గ - గద, [illegible] - చక్రము, ప - భిండిపాలము, ధ - నాగాచము, ని - అంకుశము అను ఆయుధములకు గలపేరు.

సప్తస్వరఆహారములు :— సప్తస్వరము లు వరుసగా స - పెరుగు అన్నము, రి - పాయసము, గ - ఫలహారము, మ - చిత్రాన్నము, ప - పిండి, ధ - శుద్ధాన్నము, ని - నానబియ్యములను ఆహారముగా గలిగి యుండుటచేగల పేరు.

సప్తస్వరఛందస్సులు :—స-అనుష్టుప్, రి - గాయత్రి, గ - త్రిష్టుప్, మ - బృహతి, ప - పంక్తి, ధ - ఉష్ణిక్, ని - జగతి, అనువాటికిగల పేరు.

సప్తస్వరజాతులు :— స - బ్రాహ్మణ, రి- క్షత్రియ, గ- వైశ్య, మ- బ్రాహ్మణ, ప- బ్రాహ్మణ, ధ- క్షత్రియ, ని- వైశ్యజాతులకు గలపేరు.

సప్తస్వరద్వీపములు :— స - జంబు, రి - శాక, గ - కుశ, మ - క్రౌంచ, ప- శాల్మలి, ధ - శ్వేత, ని - పుష్కర ద్వీపములకు గలపేరు.

సప్తస్వరదేహములు :— స - స్థూలము, రి - సూక్ష్మము, గ - స్థూలము, మ - పొడుగు, ప- సమపుష్టి, ధ- పొడుగు, ని- అతిస్థూలములుగా నుండుటచే గల్గినపేరు.

సప్తస్వరనక్షత్రములు :— సప్తస్వరము లగు "స రి గ మ ప ధ ని" వరుసగా స- శతభిషం, రి- చిత్త, గ- ధనిష్ఠ, మ- మఖ, ప- ఉత్తర, ధ- పూర్వాషాఢ, ని- అనూరాధ నక్షత్రములకు గలపేరు.

సప్తస్వరప్రయోగనామములు :— ఏకస్వరి, త్రిస్వరి, చతుస్వరి, పంచస్వరి, షట్ స్వరి, సప్తస్వర ప్రయోగములకు వరుసగా, ఆర్చిక, గాతిక, సామిక, స్వరాంతరి, ఔడవ, షాడవ, సంపూర్ణములని పేరు.

సప్తస్వరప్రస్తారములు :— సంపూర్ణతానములో స, రి, గ, మ, ప, ధ, ని, అను 7 స్వరములతో వచ్చు ప్రస్తారములకుగల పేరు. ఇది 720 X 7 = 5040 ప్రస్తారములు యేర్పడును. వీటి వివరములు సంపూర్ణతానములో జూచునది

సప్తస్వరపుష్పములు :— సప్తస్వరములగు స రి గ మ ప ధ ని, అను 7 స్వరములు వరుసగా స- జాజి, రి- చంపక, గ- సురపొన్న, మ- మల్లె, ప- మొగలి, ధ- గన్నేరు, ని- తామరపుష్పములనుగల వియగుటచే యేర్పడినపేరు.

సప్తస్వరబీజాక్షరములు:— సప్తస్వరములగు 'స రి గ మ ప ధ ని' అను 7 స్వరములు వరుసగా ఓం, ఆం, హ్రాం, రీం, ఇం, గ్లాం, హ్రాం అను బీజాక్షరములను గలిగియుండును, ఈ సప్తస్వర బీజాక్షరములతో యేర్పడు షట్కోణమునకు సప్తస్వర బీజాక్షర షట్కోణమని పేరు.

సప్తస్వరభూషణములు :— సప్తస్వరములగు 7 టిలో స- ముత్యము, రి- నీలము, గ- వజ్రము, మ- వైడూర్యము, ప- మరకతము, ధ- గోమేధికము, ని- పుష్యరాగములను భూషణములను కలిగియుండుటచే గలిగిన పేరు.

సప్తస్వరములభార్యలు :— స- గంధర్వస్త్రీ, రి- కిన్నరి స్త్రీ, గ- యక్ష స్త్రీ, మ- కింపురుష స్త్రీ, ప- నాగ స్త్రీ, ధ- దేవ స్త్రీ, ని- రాక్షస స్త్రీలను భార్యలుగా గలిగియుండుటచే గలిగిన పేరు.

సప్తస్వరములు :— సప్తస్వరములగు షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములను 7 స్వరములకు గల పేరు.

సప్తస్వరరసములు :— 'స రి గ మ ప ధ ని' అను 7 స్వరములు వరుసగా స- రౌద్రరసము, రి- వీరరసము, గ- కరుణారస, శాంతరసములు, మ- హాస్యరసము, ప- శృంగారరసము, ధ- భీభత్సరసము, ని- భయరస, అద్భుతరసములనుగలిగియుండుటచే గలిగిన పేరు.

సప్తస్వరవంశములు :— స- దేవ, రి- ఋషి, గ- దేవ, మ- దేవ, ప- పితృ, ధ- ఋషి, ని- రాక్షస వంశములకు చెందినవగుటచే గలిగిన పేరు.

సప్తస్వరవస్త్రములు :— సప్తస్వరములగు 7 స్వరములు వరుసగా స- తెలుపు, రి- పీతాంబరము, గ- ఎఱ్ఱని, మ- నీలము, ప- పసుపు, ధ- చిత్ర, ని- శ్యామల వర్ణములుగల వస్త్రములకు పేరు.

సప్తస్వరవారములు :— షడ్జాది సప్తస్వరములు 7ను వరుసగా స- ఆది, రి- సోమ, గ- మంగళ, మ- బుధ, ప- గురు, ధ- శుక్ర, ని- శని వారములందు పుట్టియుంచినందున గలిగిన పేరు.

సప్తస్వరవాహనములు :— స- హంస, రి- సింహము, గ- గండభేరుండము, మ- జింక, ప- సాళువము, ధ- చిలుక, ని- గోరువంక వాహనములకు గల పేరు.

సప్తస్వరవిలేపనములు :— సప్తస్వరములగు 7 టిలో స- కుంకుమ, రి- అగరు, గ- కస్తూరి, మ- పచ్చకర్పూరము, ప- గోరోజనము, ధ- చందనము, ని- కదంబ పొడిగలవిగానుండుటచే గలిగిన పేరు

సప్తస్వరవృక్షములు :— సప్తస్వరములు వరుసగా స- మామిడి, రి- ఖర్జూర, గ- అరటి, మ- నిమ్మ, ప- దానిమ్మ, ధ- ద్రాక్ష, ని- పొన్న వృక్షములకు గల పేరు.

సప్తస్వరసాదృశధ్వనులు :— షడ్జాది సప్తస్వరములు వరుసగా షడ్జము- నెమలి, రిషభము- ఎద్దు, గాంధారము- మేక, మధ్యమము- క్రౌంచపక్షి, పంచమము- కోవిల, ధైవతము- గుఱ్ఱము, నిషాదము- ఏనుగు ధ్వనులకు గల పేరు.

సప్తాశ్వకిరణి :— 34 వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప రి స.

అందుగల భాగముగాని పాడునపుడు తాళము సంగీతము ఒకేసారి తాళఘాత మీద ప్రారంభించుటను సమమని చెప్పబడును.

సమ :— నవసంధి తాళములగు 9 టిలో 2 వ దానికి గల పేరు.

సమఎడుప్పు :— అనగా సమముగా యెత్తుట అని అర్థము. సంగీతము లేక పాటయు తాళమును ఒకేసారి తాళఘాత యందు ప్రారంభించుటకు తమిళములో చెప్పబడునట్టి పేరు. ఎడుప్పు అనగా తమిళములో ఎత్తుట అని అర్థము.

సమఎడుప్పుకీర్తన :— కీర్తనయు తాళమును ఒకేసారి తాళఘాతయందు ప్రారంభించునట్టి కీర్తనకుగల పేరు. ఉ॥ శ్రీరఘువర. భైరవిరాగము – ఆదితాళము.

సమఎడుప్పుపల్లవి :— పల్లవి, తాళము ఒకేసారి తాళముయొక్క మొదటి ఘాత యందు ప్రారంభించునట్టి పల్లవికి పేరు. ఉ॥ పాలించుటకుసమయమిదేనుహరే శ్రీకృష్ణ- అను కాంభోజిరాగము- ఆదితాళములోని పల్లవి సమఎడుప్పుపల్లవి యగును.

సమకంకాలతాళము :— అష్టోత్తరశత తాళములగు 108 టిలో 75 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు 8 8 I. మాత్రలు 5- అక్షరకాలములు 20.

చారియర్. 5. హరికేశ నల్లూరు యల్. ముత్తయ్యా భాగవతర్, 6. కల్లిడైకురిచి యమ్. వేదాంత భాగవతర్, 7. వీణ కృష్ణమాచారియర్, 8. యమ్ యస్. రామస్వామి అయ్యర్, 9. పాపనాశ శివన్, 10. తిరువళ్ళూరి శంకరనారాయణయ్యర్, 11. మాయవరం టి. ఆర్. విశ్వనాథశాస్త్రి, 12. వేరూరు శ్రీనివాసాచారి జాతీయ రచనలు రచించిన భాస్కరదాసు మొదలగువారికిగల పేరు.

సమక్రియ:— 66 వ మేళకర్త యగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ గ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

సమగ్రహము :— సంగీతము లేక పాటయు తాళమును ఒకేసారి తాళ మొదటి ఘాతయందు ప్రారంభించునట్టి దానికిగల పేరు. గ్రహము అనునది సంస్కృతములో యెత్తుట అని అర్థము.

సమతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 53 వ తాళమునకు పేరు. దీనికి అంగములు I I ◡ 0 ◡ 0.

సమతాళము :— 'అష్టోత్తరశతతాళము' లగు 108 టిలో 56 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు I I 0 0 ◡. మాత్రలు 3¼. అక్షరకాలములు 13.

సమతాళము :— 'భరతశాస్త్రిరమ్' అను గ్రంథములో పేర్కొనబడిన 9 తాళములలో 3 వ తాళమునకు గలపేరు.

సమతాళము :— శ్రీ 'పింగళనిఘంటు'నిచే పేర్కొనబడిన 9 తాళములలో 1 వ తాళమునకు గలపేరు.

సమపూర్ణతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశి తాళములలో 65.C తాళమునకు పేరు. దీనికి అంగములు 8 8 I.

సమము :— 'సంగీతకౌముది' అను గ్రంథములో 22 వ పేజీయందు పేర్కొనబడిన గ్రహలక్షణములోని 9 గ్రహములలో మొదటి గ్రహమునకు గలపేరు.

సమయతి :— ఒక తాళావర్తములోగల అంగములు ఒకేరీతిగానుండినచో దానిని 'సమయతి' లేక 'పిపీలకయతి' అని చెప్పబడును. దీనికి అంగములు ఉ॥ ◡ ◡ ◡ ◡ ◡ ◡ లేక I I I I I I గానుండును.

సమ్ర :— గాంధార గ్రామములోని మొదటి మూర్ఛనయగు నన్దా, కు 'నారదుని'చే రచింపబడిన 'సంగీతమకరందము' లో పేర్కొనిన పేరు.

సమూహనాట్యము :— 'శిలప్పదికారమ్' అను అతిప్రాచీన తమిళ గ్రంథములో పేర్కొనబడిన 3 విధములగు నృత్యములలో మొదటిదానికి పేరు.

సమోద్భవము :— షడంగములలో 5 వదైన ప్లుతమునకుగల విశేషనామములలో మొదటిదానికి గలపేరు.

సరసకల్యాణి :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

సరసప్రియ :— 72 వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

సరసభాషిణి :— 34 వ మేళకర్తయగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ మ గ రి స.

సరసమంతిని :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ప మ గ రి స.

సరసవాణి :—31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ మ గ రి స.

సరసవాహిని :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.
ఇది వక్రసంపూర్ణ - షాడవరాగమగును.

సరస్వతి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము- స ని ప ధ ప మ గ రి గ స.

సరస్వతి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ రి స.
శ్రీ త్యాగరాజుని 'అనురాగములేని' అను ప్రసిద్ధకృతి యీరాగములోనిదైయున్నది.

సరస్వతీమనోహరి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ స.
అవరోహణము- స ధ ని ప మ గ రి స.
శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన 'ఎంత వేడుకొందు రాఘవ' అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదైయున్నది.

సరస్వతీకంఠాభరణ తాళము:— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 115 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 8 । । 0 0.

సరస్వతీరంజని :— 42 వ మేళకర్తయగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ రి స.

*సరసాంగి :— 27 వ మేళకర్త రాగమునకు గల పేరు. ఇది 5 వ 'బాణ' చక్రములోని 3 వ మేళకర్తరాగమగును.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక చ. రి - అం. గాం - శు. మ - శు. ధై - కా. నిషాదస్వరములుండును. శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ చే రచింపబడిన 'మనవిచేకొనవయ్యా' అను కృతియు, శ్రీ స్వాతి తిరునాళ్ మహారాజాచే రచింపబడిన 'జయజయపద్మనాభ' అను కృతియు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

సరసానన :— 27 వ మేళకర్తయగు ''సరసాంగి'' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

సరసీరుహప్రియ :— 34 వ మేళకర్త యగు 'వాగధీశ్వరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ రి స.

సరసీరుహము :— 44 వ మేళకర్తయగు ''భవప్రియ'' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని ధ స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

సరళము :— షడంగములలో 3 వ దైన ''లఘువు'' నకుగల విశేషనామములలో 2 వ దానికి గలపేరు.

సర్పాంధ్రి :— 41 వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
ఇది వక్రషాడవ - సంపూర్ణరాగమగును.

సర్పిశహ :— నారదుని చే రచింపబడిన 'సంగీత మకరందము' నందలి 22 శృతుల లో పంచమమునకుగల 4 శృతులలో 2 వ శృతికి గల పేరు.

సర్వమంగళ :— 71 వ మేళకర్తయగు 'కోసలము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ రి స.

సర్వరంజని :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ మ ప మ గ రి స.

సర్వరత్న :— 'నారదుని' చే రచింపబడిన ''సంగీతమకరంద'' మను గ్రంథములో పేర్కొనిన 22 శృతులలో పంచమమునకు గల 4 శృతులలో 4 వ దానికి పేరు.

సర్వలఘువు :— తాళాంగములు వేరు వేరుగా చూపక అక్షరకాలములలో ఒకేరీతిగా యెంచుదానికి పేరు.

సర్వవాద్యము :— దక్షిణ భారతములో ముఖ్యముగా కొన్ని ప్రాచీన దేవాలయ ములలో జరుగు వుత్సవ సమయములందు ప్రదర్శించునట్టి వివిధ సంగీత, లయవాద్య ములను కలిపి చెప్పునట్టి పేరు. ఈ సర్వ వాద్యమునం దుపయోగించు వాద్యము లను యీక్రింద తెలుపుట గమనించునది.
1. బ్రహ్మతాళము, 2. నందికేశ్వర వాద్యము, 3. శుద్ధమద్దలము, 4. భేరికై వాద్యము, 5. మల్లారివాద్యము, 6. ఝ ల్లారివాద్యము, 7. ఢంకావాద్యము, 8. నగారావాద్యము, 9. డమారవా ద్యము, 10. రాజవాద్యము, 11. మురళీ వాద్యము, 12. నాగస్వరవాద్యము, 13. ముఖవీణవాద్యము, 14. భుజంగ స్వరము (మాగుడి), 15. తిరుచిన్నమ్, 16. దవళైసంగు, 17. నవురి, 18. బాంకా, 19. వీణ, 20. వయొలిన్ మొదలగు వాద్యములు సర్వవాద్యమునకు చెందును.

సర్వస్వరగమకవరికరాగము :— ఒక రాగములోని అన్ని స్వరములు గమక, వరికలతో పాడదగిన రాగమునకు పేరు. ఉ॥ భైరవి, కల్యాణి మొదలగురాగములు.

సర్వాలాంగి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

సర్పార్ద :— పూర్వము పర్షియాలోని గొప్ప సంగీత విద్వాంసుడగు 'అమిర్ ఖుస్రూ' సృష్టించిన యొక రాగము పేరు.

సర్వాంగి :— 57 వ మేళకర్తయగు "సింహేంద్రమధ్యమము" యొక్క జన్యరాగము. ఉభయ ఔడవరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

సరిగమపాధసని :— శ్రీ టి. యస్. సి. వేంకటనారాయణాచార్యులచే రచింపబడిన స్వరాక్షర రచనా పంచకముగల ఒక చిన్న పుస్తకమునకు పేరు.

సరిరాజ :— మానవ కంఠస్వరమునుండి పలుకు స్వరములకుగల పేరు.

సర్పిణి :— తాళము వేయుటలో కుడి చేతిని ఎడమచేతిచుట్టు 4 అక్షరకాలములు చుట్టుటకు "సర్పిణి" అని పేరు.

సరోజిని :— 35 వ మేళకర్తయగు "శూలిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

సల్లాపము :— 14 వ మేళకర్తయగు "వకుళాభరణము" జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

సల్లాసిని :— 13 వ మేళకర్తయగు "గాయకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

సవ్వీరము :— 47 వ మేళకర్తయగు "సువర్ణాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ప ధ ప మ గ రి స.

సశబ్దక్రియ :— ఎడమచేతిమీద కుడి చేతితో శబ్దముకలుగునట్లు కొట్టుటకు పేరు.

సహజశృతికత్వము :— సహజశృతులతో కూడుకొన్న స్వరములను మేళవింప జేయుటకుగల పేరు. దీనినే ఇంగ్లీషులో జస్ట్ ఇంటోనేషన్ (Just Intonation) అని చెప్పుదురు.

సహజశృతులు :— తంతివాద్యములలో తంత్రులపై సహజముగా సుధ్వనించెడి ధ్వనులకు గలపేరు.

సహజస్పందనములు :— స్పందించెడు ఒక వస్తువును యే యితర శక్తులతో ప్రమేయములేకుండా వదలినచో స్పందించునట్టి వాటికిగల పేరు.

సహాయుక్త :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" జన్యరాగము.

ఆరోహణము— స రి మ గ మ ధ స.
అవరోహణము— స ని ప మ గ రి స.

సహవాసిని :— 31 వ మేళకర్తయగు "యాగప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ని ప గ రి స.

సహస్రబుద్ధి :— ద్వావింశతి శృతులను గుఱించి విశేషముగ పరిశోధనచేసి యనేక విషయములను కనుగొనిన ఒక ప్రాచీన సంగీత లక్షణకారునికిగల పేరు.

సహ్యాజ :— 6 వ మేళకర్తయగు "తానరూపి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

సహానుకంపనములు :— శుద్ధముగా శృతిచేయబడిన ఒక వీణలో ఒక తంతిని ధ్వనింపచేసినపుడు దాని ప్రక్కనున్న తంతికూడా దానంతట అదే స్పందించు నట్టి దానికి 'సహానుకంపనము'లని పేరు. వీటినే ఇంగ్లీషులో "సింపతిక్ వైబ్రేషన్స్" అని చెప్పుదురు.

స్థలముద్ర :— సంగీత రచనలలో వుప యోగింపబడు ద్వాదశముద్రలగు 12 టి లో 8 వ ముద్రకు పేరు. దీనినే 'క్షేత్ర ముద్ర'యనికూడ చెప్పుదురు.

స్థవప్రియ :— 51 వ మేళకర్తయగు 'కామవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

స్థవరాజ :— 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ మ గ స.

*స్థవరాజము :— 72 మేళకర్తలలో 46 వ మేళకర్తయగు 'షడ్విధమార్గిణి' కి 'వేంకటమఖి' పెట్టిన మరియొక పేరు.

స్పందనము :— ఒక వస్తువు, వణకెడి క్రియకు 'స్పందించుట' లేక 'స్పందన' మని చెప్పబడును.

స్మరరంజని :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

స్రద్విణి :— 29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ గ ప ని ధ ని స.
అవరోహణము— స ధ ని ధ ప మ గ రి స.

స్రవంతి :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

స్లర్ :— కొన్ని స్వరములను కలిపి వాటి నన్నిటిని ఒకే పదజాలముగను, మాధుర్యముగను వాయింపవలెనని తెలియపఱుచుటకు ఆంగ్లేయ సంగీతములో స్వరముల మీద గీయబడు వంకరగీతకు ఇంగ్లీషులో పేరు.

స్వచ్ఛతాళములు :— క్లిష్టమైనట్టియు వేయుటకు అంతగా సులభము కానట్టి తాళములకు గలపేరు.

స్వనామముద్ర :— సంగీతరచనలందు వుపయోగింపబడు ద్వాదశముద్రలగు 12 టిలో మొదటిదగు వాగ్గేయకార ముద్రలోని రెండు రకములలో మొదటిదాని పేరు. రెండవది అన్యనామముద్ర యగును. యిట్టి అన్యనామముద్రగల రచయితలలో శ్రీ ముద్దుస్వామి దీక్షితర్ (గురుగుహ) శ్రీ సుబ్బరాయశాస్త్రి (కుమార) శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ (వెంకటేశ) శ్రీ వీణ కుప్పయ్యర్ (గోపాలదాస) శ్రీ స్వాతి తిరునాళ్ (పద్మనాభ) శ్రీ గోపాలయ్యర్ (వెంకట) మొదలగువారు ముఖ్యులగుదురు.

స్వనామముద్ర రచయితలు :— శ్రీ త్యాగరాజు, శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ జయదేవుడు, శ్రీ నారాయణతీర్థులు, శ్రీ గురుమూర్తిశాస్త్రి, శ్రీ రామ్నాడ్ శ్రీనివాసఅయ్యంగార్ మొదలగువారు స్వనామ ముద్రగల రచయితలగుదురు.

స్వభూ :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ ప మ గ రి స.

స్వయంభూధ్వనులు :— ఆధారషడ్జము ననుసరించి వాటియంతట యవే కలుగునట్టి సున్నితమైన ధ్వనులకు గలపేరు. వీటినే ఇంగ్లీషులో అప్పర్ పార్షల్ టోన్స్ (Upper partial Tones) అని చెప్పుదురు.

స్వయంభూస్వరములు :— అనురణనాత్మకధ్వనులు లేక స్వయంభూధ్వనులకుగల మరియొక పేరు.

స్వయంవర :— 2 వ మేళకర్తయగు 'రత్నాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

స్వరఅష్టకము :— మధ్యషడ్జమునుండి తారస్థాయి షడ్జముతో చేరి యేర్పడునట్టి స రి గ మ ప ధ ని స అను 8 స్వరములకు గలపేరు.

స్వరకళానిధి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము—స మ గా మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ రి గ స.

స్వరగతాధ్యాయము:—శ్రీ శార్ఙ్గదేవునిచే రచింపబడిన 'సంగీత రత్నాకర' గ్రంథములోని 7 అధ్యాయములలో మొదటి అధ్యాయమునకు గలపేరు.

స్వరజ్ఞానము :— ఒక సంగీత రచనను పాడుచుండునపుడుగాని, వాద్యముపై వాయించుచుండునపుడుగాని విని దాని రాగఛాయ ననుసరించి స్వరములు వ్రాయగలశక్తి గలిగియుండునపుడును, యేదైన ఒక రాగములోగల సంగీత రచనను దాని స్వరముల ననుసరించి పాడమనినచో శాస్త్రయుక్తముగా పాడగలిగినపుడును, యేదైన ఒక రాగములోని సంగీత రచనలో జాగాచేసి కొన్ని ఆవర్తముల కల్పనస్వరములను పాడగలిగినపుడును ఆ వ్యక్తికి

స్వరజ్ఞానముకలదందురు. అనగా పాడిన రాగమును లేక రచనను స్వరపరచుట, వ్రాసిన స్వరములను రచనను ఆ రాగము ననుసరించి పాడగలుగుటకు స్వరజ్ఞానమని చెప్పుదురు.

స్వరచింతామణి :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి' జన్యరాగము. ఆరోహణము– స రి గ మ ప ని ధ ని ప స. అవరోహణము– స ని ధ ప మ రి స.

స్వరజతి :— పల్లవి అనుపల్లవి, చరణము, అను విభాగములుగలిగి వేరువేరు ధాతువులు కలిగిన చరణములుగల రచనకు పేరు. కొన్ని స్వరజతులలో అనుపల్లవి లేకనే పల్లవి, చరణములు మాత్రమే యుండి సాహిత్యము భక్తి, శృంగార, వీరరసములలో నొకదానికిచెందిన యిష్ట దేవతా ప్రార్థనగాగాని, యేదైన ఒక వీర గాథను సంబంధించినదిగాగాని యుండును.

స్వరజతులనురచించిన ప్రఖ్యాతరచయితలు :— శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ ఆదియప్పయ్య, శ్రీ స్వాతితిరునాళ్, శ్రీ వాలాజపేట కృష్ణస్వామి భాగవతర్, శ్రీ చిన్ని కృష్ణదాసు మొదలగు వారు ప్రఖ్యాత స్వరజతి రచయితలగుదురు.

స్వరదము :—దీనినే ఇంగ్లీషు లో ట్యూనింగ్ ఫోర్క్ (Tuning fork) అని చెప్పుదురు. ఇది గాయకులకుగాని, వాద్యకులకుగాని హార్మోనియము లేకనే తమకు కావలసిన శృతులను తెలుసుకొని తంబుర, వయొలిన్, వీణ, మృదంగము వంటి వాద్యములను శృతిచేయుటకు పనికి వచ్చు ఒక చిన్న లోహపు పనిముట్టు అగును. ఇందు 1 మొదలు 5 లేక 6 శృతులవరకు అరశృతులనుకూడ కలిగియుండి, ఆశృతులను తెలుపుటకు సన్నని గీతలుండును. గాయకులు తమకుకావలసిన శృతి ననుసరించి ఆ గీతమీదికి లోహపుముల్లును జరపి వూదినచో కావలసిన శృతి వినపడును. అప్పుడు దానినిబట్టి శృతిని చేసుకొందురు.

స్వరపల్లవి :—జతి స్వరము వలెనుండు యొక విధమైన రచనకుగల పేరు. ఈ స్వరపల్లవులు ముఖ్యముగా వీణ మీద నభ్యసించుటకేర్పడినవై కృతులకు ముందుగా నేర్పబడు సాహిత్యములేని స్వరరచనలగును. ఈ స్వరపల్లవుల శైలి కృతులను బోలియుండును.

స్వరప్రస్తారము :— ఒక సంగీత రచనలోగాని పల్లవిలోగాని స్వరములను ఆయా రాగ, తాళముల ననుసరించి విశేషకల్పనలతో ప్రస్తరించుటకు పేరు.

స్వరపాసేజి :— చిట్టస్వరమువలెనుండు స్వరముల యొక్క వరుసభాగమునకు గల ఇంగ్లీషు పేరు.

స్వరబత్ :— కుడిచేతి వ్రేళ్ళతో తంత్రులను మీటుచూ ఎడమచేతి వ్రేళ్ళతో తంత్రుల నదుముచూ వాయింపబడు నొక రకమైన తంత్రీ వాద్యమునకుగల పేరు. ఇది హిందుస్థాని సంగీతమునందు విశేషముగా నుపయోగించుదురు.

స్వరభూషణి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.
శ్రీత్యాగరాజు యాత్రకై 'కంచి'కి వెళ్ళి నపుడు అచ్చటి శ్రీ వరదరాజస్వామిపై 'వరదరాజ నినుకోరవచ్చితి' అను కృతిని యీ రాగములోనే రచించెను. మరియు అచ్చటనే రాగపంజరిరాగములో 'వరదా నవనీతాశపాహి' అను కృతిని రచించి, కామాక్షీదేవిమీద మధ్యమావతి రాగములో 'వినాయకునివలెను' అను కృతిని రచించెను.

స్వరభేదము :— సాత్త్వికభావములోని 8 విధములలో 4 వ దానికి 'స్వరభేద'మని చెప్పబడును.

స్వరమంజరి :— శ్రీమాన్ తిరుచ్చూరు పెద శింగరాచార్యులు, చిన శింగరాచార్యులచే 1914 లో తెలుగులో రచింపబడిన యొక చిన్న గ్రంథమునకు పేరు.

స్వరమండలము :— భారతదేశమున వుపయోగించు 'శత తంత్రీవీణ' కుగల మరియొక పేరు. దీని నాదము అతి మాధుర్యముగను, సున్నితముగను వుండును.

స్వరమతి :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

స్వరమేళకళానిధి :— ప్రాచీన వాగ్గేయకారుడగు 'శ్రీరామామాత్యుని' చే రచింపబడిన యొక్క ప్రసిద్ధ ప్రామాణిక సంగీత లక్షణ గ్రంథమునకు పేరు.

స్వరము :— ప్రబంధములోని 6 అంగములలో మొదటిదానికి గల పేరు.

స్వరము :— స్వయముగా రంజింపజేయు ధ్వనివిశేషమును స్వరము లేక సంగీతాక్షరము లేక సంగీతస్వరమని చెప్పబడును. అనగా శృతికి వెంటనే కలిగెడి స్నిగ్ధమైనదియును, అనురణనాత్మకమైనదియును శ్రోతృచిత్త సుఖావహముగ నుండునదియు నగుదానిని స్వరమనబడును.

స్వరములకాలము :— స్వరముల యొక్క వేగ పరిమాణమును తెలుపునట్టి దానికి గల పేరు.

స్వరములవిలువ :— హ్రస్వస్వరమునకు ఒక అక్షరకాలమును, దీర్ఘస్వరమునకు రెండు అక్షరకాలములును, యీ స్వరములకు ప్రక్కన కామా(,)యున్నచో దానికి ఒక అక్షరకాలమును, కామాపైన చుక్క (;) యున్నచో దానికి రెండు అక్షరకాలములును లెక్కించి స్వరముల విలువను గ్రహింపవలెను.

స్వరరంజని :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గా మ రి స.

స్వరవర్ధని :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

స్వరవర్ణసుధానిధి :— కాకినాడ వాస్తవ్యులగు శ్రీ మునగంటి పాపరాల రావుచే రచింపబడిన ఒక సంగీత గ్రంథము.

స్వరవేది :— ఇది 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగముగా చెప్పబడిన ఒక అపురూపరాగము.

స్వరసంచారములు :— మనోధర్మ సంగీతములో నొకభాగమగు కల్పనస్వరములకు గలపేరు. రాగభావము యొక్క రమ్యమైన పలువిధములగు కల్పనస్వరములను ఆయాస్వరములకు తగిన శృతులతోను హెచ్చుతగ్గు స్థాయిలతోను మార్పులు జేయుచూ పల్లవి లేక కృతియొక్క యేభాగమందైనను తాళమునకు తగినట్లు ప్రదర్శించుటను 'స్వరసంచార'మని చెప్పబడును.

స్వరసప్తకము :— సప్త స్వరములగు షడ్జ, రిషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములు లేక 'సరిగమ పధని' అను 7 సంకేత స్వరములకు 'స్వరసప్తక' మని చెప్పబడును.

స్వరసమ్మేళన పద్ధతి :—ఒకేసమయమున జేయు సంవాదిస్వరముల సమ్మేళనమునకు గలపేరు. దీనినే ఇంగ్లీషులో 'హార్మొనికల్ సిస్టం'ము (Harmonical systam) అని చెప్పుదురు.

స్వరస్థానము :— స్వరముపుట్టునట్టి లేక పలుకునటువంటి తావునకుగలపేరు. తంత్రీవాద్యములలో వ్రేళ్ళు అనుకొనేందుకు వీలగు చదునైనబల్ల (ఫింగర్ బోర్డు) పై నుంచు జామిట్రికల్ చుక్కల వంటి గుర్తుగల చోటులకు స్వరస్థానములని పేరు. మరియు చిన్నచిన్న విశ్రాంతులు గలకొన్ని శృతులుగల ప్రదేశమునుగూడ స్వరస్థానమందురు. దీనిని రాగ విభజనకు ఒక పరిమాణముగ గైకొందురు. ఇట్టివి 12 స్వరస్థానములుగల కోలతకు ఒక స్థాయియని చెప్పుదురు.

స్వరస్థానవర్ణము :— పల్లవి, అనుపల్లవి, చరణ, ముక్తాయిస్వర, ఎత్తుగడ స్వరములుగల ఒక విధమగు వర్ణరచనకుగల పేరు. ఇందు స్వరముల క్రిందసాహిత్యముగా అవే స్వరాక్షరములుయుండి సాహిత్యమువలె అర్థమును గలిగియుండును. ఉ॥ సరిగా నిదా నిపా మరి నిసీ పద సమా గమ, అనుతోడిస్వరస్థానవర్ణముయిందుకుముఖ్యవుదాహరణయగును. ఇది శ్రీ ముద్దుస్వామి దీక్షితుల తండ్రి శ్రీ రామస్వామి దీక్షితులు మహాప్రభువైన శ్రీ మణలిచిన్నయా ముదలియార్ (మదరాసు) మీద రచింపబడినదగును. (సం. సం. ప్ర. 71 పుట)

స్వరసాహిత్యము :— కృతి రచనలందు గల చిట్టస్వరమునకు సరియైన సాహిత్యము రచింపబడి జతపఱచినపుడు ఆ రెంటిని కలిపి స్వరసాహిత్యమని చెప్పుదురు. ఉ॥ శ్రీ శ్యామశాస్త్రి యొక్క 'ఓజగదంబ' అను ఆనందభైరవి రాగ, ఆదితాళము కృతిలోని చిట్టస్వరములో

పమగరిసని– స మ గ రి స ని – స గ రి ని॥
వరసితగిరి – నిలయుని ప్రియ – ప్రణయిని,॥

యు, శ్రీ సుబ్బరాయశాస్త్రి యొక్క 'జననీనిన్నువినా' అను రీతిగౌళరాగ, చాపుతాళము కృతిలోని చిట్టస్వరములో

ని ప ని । ని స ని ని ॥ సా, । ; ని స ॥
ని ర వ । ధి క సు ఖ ॥ దా, । ; య కి ॥
గ రి స । ని స– గ గ ॥ మా మ । గ గ రి స॥
యనుచు । విని– ని ను ॥ చా ల । గొలిచితి॥

అను నదియు, శ్రీ మైసూరు సదాశివ రావు,యొక్క 'వాచామగోచరుండని' అను అఠాణారాగ ఆదితాళకృతి చిట్టస్వరమున
సా ని ధా, - స ని ధా, - స ని ప ధా॥
శ్రీ ని ధా, - న బు ధా, - త్రిహరదా॥
అనునదియు స్వరసాహిత్యములకు ముఖ్యవుదాహరణములగును.

స్వరసాహిత్యముగలకృతిరచయితలు :— శ్రీ మైసూరు సదాశివరావు, శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ సుబ్బరాయశాస్త్రి మొదలగువారు మనోహరమైన స్వరసాహిత్యము గల కృతిరచయితలగుదురు.

స్వరసాహిత్యరచయితలలోముఖ్యుడు:— ఎక్కువ కృతులకు మనోహరమైన స్వర సాహిత్యములను రచించిన శ్రీ మైసూరు సదాశివరావు స్వరసాహిత్య రచయితలలో ముఖ్యుడుగా చెప్పవచ్చును

స్వర్గలఘువు :— 3 అక్షరకాలములుగల ఒక జాతి లఘువునకు గలపేరు. దీనినే 'త్రిశ్రజాతి లఘువు' అని చెప్పబడును.

స్వర్ణకాంతి :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ ప మ ధ ని స.
అవరోహణము- స ని ప మ గ స.

స్వరాంతర :— అసంపూర్ణములగు ఆర్చిక, గాధిక, సామిక, స్వరాంతర, ఔడవ, షాడవములను 6 టిలో 4 వ దానికిగలపేరు. ఇది ఆరోహణ, అవరోహణములరెంటియందును నాలుగేసి స్వరములలెక్కగలదైయుండును.

స్వరాంతర-ఔడవము :— ఆరోహణములో 4 స్వరములును, అవరోహణములో 5 స్వరములునుగల రాగమునకు పేరు. ఉ॥ భానుచంద్రిక రాగము. 8 వ మేళకర్తయగు హనుమతోడి జన్యము.
స మ ధ ని స - స ని ధ మ గ స.

స్వరాంతర-వక్రఔడవము:— ఆరోహణమందుగల 4 స్వరములు వరుసగానుండి అవరోహణమందుగల 5 స్వరములు వక్రముగనుండు రాగమునకు పేరు.

స్వరాంతర-వక్రషాడవము:— ఆరోహణమందుగల 4 స్వరములు వరుసగానుండి అవరోహణమందుగల 6 స్వరములు వక్రముగనుండు రాగమునకు పేరు.

స్వరాంతర-వక్రసంపూర్ణము:— ఆరోహణమందుగల 4 స్వరములు వరుసగానుండి అవరోహణమందుగల 7 స్వరములు వక్రముగనుండు రాగమునకు పేరు.

స్వరాంతర-షాడవము :— ఆరోహణములో 4 స్వరములును, అవరోహణములో 6 స్వరములునుగల రాగమునకు పేరు. ఉ॥ నవరసకన్నడ. 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
స గ మ ప స - స ని ధ మా గ రి స.

స్వరాంతర - సంపూర్ణము :— ఆరోహణములో 4 స్వరములును, అవరోహణములో 7 స్వరములును వరుసగానుండు రాగమునకుపేరు. ఉ॥దేశ్యగౌళ. 19 వ మేళకర్తయగు 'ఝంకారధ్వని' జన్యరాగము.
స గ మ ప స - స ని ధ ప మ గ రి స.

స్వరాది :— మార్గసంగీతమును మాత్రమే యెఱింగిన 'గాయకునికి' గలపేరు.

స్వరాభరణము :— 49 వ మేళకర్త యగు 'ధవళాంబరి' జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ స.
ఇగి షాడవ–ఔడవరాగమునకు చెందును.

స్వరార్ణవము :—శ్రీ త్యాగరాజునికి 'నారదమహర్షి' అనుగ్రహించిన యొక అపూర్వ సంగీత లక్షణగ్రంథమునకు పేరు. శ్రీత్యాగరాజుని దివ్యగానము వినగోరి యొకప్పుడు సన్యాసి రూపమున వచ్చిన నారదమహర్షిని త్యాగరాజు గుర్తించి 'శ్రీ నారద నాదసరసీరుహభృంగ శుభాంగ' యని ప్రార్థించగనే నారదుడు సంతసించి త్యాగరాజునకు మాత్రమే కనుపడునట్లుగా అనుగ్రహించియొసగిన దివ్యగ్రంథము. ఈ గ్రంథమునుగుఱించి త్యాగరాజు తన రచనలందుకూడ పేర్కొనెను. అయితే ఈ గ్రంథము తరువాత కొన్నాళ్ళకు తగులబడిపోయెనని చెప్పుదురు.

స్వరావళి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.
శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన 'ప్రారబ్ధమిట్లుండగ' అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదైయున్నది.

స్వరావళి :— సంగీతములో ప్రారంభమున నేర్చుకొనుటకు తగినట్లుగా 'మాయామాళవగౌళరాగము'లో ఆదితాళమునందు శ్రీ పురందరదాసునిచే రచింపబడిన 'సరళీ స్వరము'లకుగలపేరు. ఉ॥ స రి గ మ ప ధ ని స – స ని ధ ప మ గ రి స మొదలగునవి.

స్వరాక్షరపల్లవి :— స్వరములతోనే సాహిత్యమువలె అర్థము వచ్చునటుల స్వరములను యిమిడ్చి రచించు పల్లవిని 'స్వరాక్షర పల్లవి' అని చెప్పబడును. ఉ॥ <u>సరిగ</u> – <u>పాగ</u> ఇచ్చేనా – <u>సాదా పాగ</u> ఇచ్చేనా, అనుమోహనరాగములోని స్వరాక్షర పల్లవి యిందుకు ఒక శాస్త్రీయమైన వుదాహరణ యగును.

స్వరాక్షరప్రబంధము :— స్వరాక్షరములతో కూడుకొనిన ఒకరకపు ప్రబంధరచనకు గలపేరు. ఇది 2 విధములు. 1. శుద్ధ, 2. మిశ్ర అనునవి.

స్వరాక్షరము :— సంగీత రచనలయందు గల సాంకేతిక సౌందర్యమునకు స్వరాక్షరము అని పేరు. రచయిత తన కృతులలో సాహిత్యము వుండవలసిన తావులందు సాహిత్యమునకు బదులు స్వరాక్షరములనే నైపుణ్యముగా వుపయోగించి సాహిత్యములోని అర్థమునకును, గాంభీర్యమునకును, యేవిధమైన లోటులేకుండా రచించుస్వరములుగాయుండును.

స్వరాక్షరరచయితలు :— శ్రీ స్వాతి తిరునాళ్ మహారాజు, శ్రీ రామస్వామి శివన్ మొదలగువారు ప్రఖ్యాతమైన స్వరాక్షర రచయిత లగుదురు.

స్వరాక్షరవర్ణము :— 'శ్రీ రామస్వామి శివన్' చేరచింపబడిన 'కాంభోజిరాగము'

ఆదితాళములోని 'పంకజాక్షిపై నీకు' అను వర్ణము ప్రఖ్యాతమైనస్వరాక్షరవర్ణమునకు ఒక ముఖ్య వుదాహరణ యగును.

స్వర్ణాంబరి :— 18 వ మేళకర్తయగు 'హాటకాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

స్వరిత :— ఋగ్వేదములో పలుకు మధ్యమస్వరమైన "స" అనుస్వరమునకు వేదశాస్త్రరీత్యా యివ్వబడినపేరు.

స్వరోదాత్తము :— సంగీత రచనలలో తాళమునందు వేయు ఘాతలందు గాక మధ్యభాగములందు స్వరములను నొక్కి పాడుటకు 'స్వరోదాత్త'మని పేరు.

## సా

సాంత్వభాషిణి :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ స.

సాంబవినుత :— శ్రీ ప్రొఫెసర్ పి. సాంబమూర్తి (బి. ఏ; బి. యల్;)చే రచింపబడిన రచనలందుగల ముద్రకుపేరు.

సాకి :— మహారాష్ట్రపద్ధతిలో చేయునట్టి హరికథా కాలక్షేపములందు పాడునటువంటి ఒకవిధమైన సంగీతరచనకుపేరు.

సాగు :— 5 వ మేళకర్తయగు 'మానవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప గ స.

సాత్వికభావము :— భావములు 5 రకములలో 3 వ దానికి గలపేరు. అనగా అన్యుల సుఖ దుఃఖములయందు అనుకూల్యముతో యేమనస్సు ప్రవర్తించుచుండునో అట్టి సాత్విక మనస్సునుండి గలుగుభావము'సాత్వికభావ'మనబడును. అవి 8 విధములు. 1. స్థంభము, 2. స్వేదము, 3. రోమాంచము, 4. స్వరభేదము, 5. వేపథువు, 6. వైవర్ణ్యము, 7. అశ్రువు, 8. ప్రళయము అనునవి.

సాత్వికాభినయము :— చాక్షుస, వ్యంజక, మను భేదంబులుగల యొకరకపు 'అభినయము'నకుగలపేరు.

సాధారణగాంధారము :— గాంధార స్వరములలోని 3రకములలో రెండవరకమైన స్వరమునకు పేరు. ద్వావింశతి శృతులలో 7 వ శృతియైన 'రతికా' అను నామము గలది. దీని విశ్రాంతి $\frac{6}{5}$. సెకండుకు వచ్చు వేపనసంఖ్య 288. తిరుగుసెంట్లు విలువ 316. ఉ॥ ఖరహరప్రియరాగము, యీగాంధారమునకు వుదాహరణయగును.

సాధారణగీతము :— గీతములలోని రెండు రకములలో మొదటిదానికిగల పేరు. దీనిని సామాన్యగీతమనియు, లక్ష్యగీతమనియు, సంచారిగీతమనియు చెప్పుదురు. వీనినే ఇంగ్లీషులో సాధారణముగా ఆర్డినరీ గీతాస్ అని చెప్పుటకలదు.

సాధారణరాగవిభజన :— ఘన, నయ, దేశ్యరాగములుగను, కర్నాటక, దేశ్య రాగములుగను చేసినఒక విభజనకు పేరు.

సాధారిణీసంగ్రహమూర్ఛనలు:— వక్రముగను లేక అవక్రముగను వుండునట్టి (1) స్వరాంతర-సంపూర్ణములు (2) సంపూర్ణ-స్వరాంతరములు (3) స్వరాంతర-షాడవములు (4) షాడవ స్వరాంతరములు (5) స్వరాంతర-ఔడవములు (6) ఔడవ-స్వరాంతర ములను మూర్ఛనలకుగల పేరు.

సాధ్వి :— 50వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ స.

సాభినందనము :— 'సంగీతకౌముది' అను లక్షణ గ్రంథములో గ్రహలక్షణము నందు పేర్కొనబడిన నవగ్రహములలో 8వ గ్రహమునకుగల పేరు.

సామ :— 28వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ రి స.
శ్రీ త్యాగరాజుని 'శాంతములేక' అను ప్రసిద్ధకృతియు, శ్రీవీణ కృష్ణమాచార్యుల 'కరుణాకర' అను కృతియు, శ్రీ సదాశివ బ్రహ్మేంద్రసరస్వతి యొక్క 'మానస సంచరరే' అను కీర్తనయు యీ రాగము లోని ప్రసిద్ధ రచనలగును.

సామకన్నడ :— 17వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధా ప మ రీ స.

సామకురంజి :— 12వ మేళకర్తయగు 'రూపవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ని ప మ గ రిస.

సామగానరాగములు :— ఆరోహణ, అవరోహణముల రెంటియందును సమ స్వరములుగల భైరవిరాగము సామగాన గణితమునకు సరిపోవుటవలనను, ప్రస్తుత సంగీతవిధానములో సామగానకాలతకు సరిగాసరిపోవురాగములేదుగనుకను భైరవి రాగమును సామగాన రాగమని చెప్ప వచ్చును. మరియు గాంధార నిషాదములు ఒక్కొక్కప్పుడు కొంచెము హెచ్చైనను 'ఖరహరప్రియ' రాగమునుగూడ సామ గాన రాగముగాచెప్పవచ్చును.

సామగానస్వరనామములు :— క్రుష్ట, ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, మన్ద్ర, అతిస్వార్యయను 7 టిని సామగాన స్వరము లనిచెప్పబడును.

సామగానస్వరములకుసరిపోవురాగము:– 19వ మేళకర్త జన్యమగు 'చిత్తరంజని' (స రి గ రి గ మ ప ధ– ని ధ ప మ రి గ రిస) రాగము శాస్త్రయుక్తముగ పాడినచో సామగాన స్వరములకు సరిపోవును. త్యాగరాజుని 'నాదతనుమనిశం' అను ప్రసిద్ధ కృతి యీ రాగమందే గలదు. భైరవి, ఖరహరప్రియ రాగములు సామగానస్వర ములకు యించుమించుగా సరిపోవును.

సామగానస్వరములమధ్యనుండు విశ్రాంతులు :— 1. ని-స, 2. గ-మ, 3. మ-ప, యీ రెండేసిస్వరముల మధ్యనున్నవి చతుశ్శృతి విశ్రాంతులనియు, (హెచ్చుస్వరము 9/8) 1. స-రి, 2. ప-ధ, యీ రెండేసి స్వరముల మధ్యనున్నవి త్రిశ్శృతి విశ్రాంతులనియు, (తగ్గుస్వరము 10/9) 1. రి-గ, 2. ధ-ని యీ రెండేసి స్వరముల మధ్యనున్నది ద్విశ్శృతి విశ్రాంతులనియు (అర్ధస్వరము 16/15) చెప్పబడును.

సామగానస్వరములవిలువ :— సామగాన స్వరముల కొలతలు యీ దిగువ విధముగా నుండుట గ్రహించునది. స...1 గాయెంచినచోమిగతస్వరములగు రి 10/9, గ 32/27, మ 4/3, ప 3/2, ధ 5/3, ని 16/9, స 2. యీ శేషియోగల భిన్నములుగా నుండును. వీటిని ప్రాచీన సామగాన కొలతలో 'శుద్ధస్వర సప్తక'మని చెప్పుదురు.

సామగానస్వరములు :—మ గ రి స ని ధ ప అను సామసప్తకమునకు గలపేరు.

సామగానస్వరశృతులు :— సామగాన స్వరములగు 7 న్నూ, వరుసగా 4, 3, 2, 4, 4, 3, 2 శృతులను గలిగియుండును.

సామంతజింగ్ల :—32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము—స ని ప ధ ని పమగమరిస.
ఇది సంపూర్ణ -వక్రసంపూర్ణరాగమగును.

సామంతమల్లారు :— 17వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

సామంతము :— 30 వ మేళకర్తయగు 'నాగానందిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

సామంతవేళావళి :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ప ధ స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

సామంతశిఖామణి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ స.

సామంతసాళవి :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సామనారాయణి :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ప ధ ని ప మ రి స.

సామబర్బరి :— 48 వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ని ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

సామలాపిని :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

సామవరాళి :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సామసప్తకము :— సామవేదమును పఠించునపుడు అందుపలుకు 'మ గ రి స ని ధ ప' అను 7 స్వరములకుగల పేరు.

సామస్వరావళి :— 43 వ మేళకర్తయగు 'గవాంబోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ స.
అవరోహణము— స ధ ప ధ మ గ రి స.

సామసాళవి :— 23 వ మేళకర్తయగు 'గౌరీమనోహరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సామ్యతాళములు :— రెండేసి తాళములు ఒకేమాదిరిగానున్నచో నట్టితాళములకు గలపేరు. ఉ॥ రతితాళము, త్రిభంగి తాళము. ఈ రెండును సమముగానుండును.

సామాన్య :— నాయికలలోని 3 రకములలో 3వ రకమునకు చెందినదానికిగల పేరు. ఈ నాయిక కళా ప్రాగల్భ్యత గలిగినది గాను, ధనాశచే జనులయందు యనురాగముగలదిగానుండి, మందులైనను, భగ్నకాములైనను, పాషండులైనను, బాలులైనను, వృద్ధులైనను వారియెడల తానను రాగము గలదానివలె నటించునదిగానుండును.

సామిక :— అసంపూర్ణ భేదములగు షాడవ, ఔడవ, స్వరాంతర, సామిక, గాథిక, ఆర్చిక అను ఆరువిధములలో 4వ దానికిగల పేరు. ఇది స రి గ. అనువిధమున మూడేసి స్వరముల కొలతను గలిగియుండును.

సామిసోగాయంతి :— పురాతన కాలమందు ఋగ్వేదపఠనములో మూడు స్వరములవఱకు పాడుటకు పేరు. వీటిలో మొదటిదగు ఆర్చినోగాయంతి — ఏకస్వర గాయనమగును. రెండవదగు గాథినోగాయంతి— రెండుస్వరములవఱకు పాడుట యగును.

సాయుజ్యదాయిని :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

సార :— సూళాది 35 తాళములకుగల శ్రీకరాది నామములలో 2 వ తాళమగు త్రిశ్రజాతి మఠ్యకు "సార" అని పేరు. దీనికి అంగములు । ౦ ।. మాత్రలు 2. అక్షరకాలములు 8.

సారంగ :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి గ మ రి స.
ఇది భాషాంగరాగము. అవరోహణములో 'రి గ మ రి స' అను వక్రసంచారములో శుద్ధమధ్యమము పలుకును. శ్రీత్యాగరాజుని 'ఎంతభాగ్యము' 'ఓడనుజరిపే' 'నీవాడ నేగాన' అను కృతులు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

సారంగకాపి :— 20 వ మేళకర్తయగు "నఠభైరవి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి ప మ రి ప రి మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

సారంగనాట :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప స స.
అవరోహణము– స ని స ధ ప మ గ రి స.

సారంగబౌళి :— 10 వ మేళకర్తయగు "నాటకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ప స ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ గా రి స.

సారంగభ్రమరి :— 56 వ మేళకర్తయగు "షణ్ముఖప్రియ" జన్యరాగము.
ఆరోహణము– స మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

సారంగమారువ :— 44 వ మేళకర్తయగు "భవప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ ప గ రి స.

సారంగలలిత :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ రి మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ రి స.

సారంగి (Sarangi) :— హిందుస్థాని సంగీతమును ప్రదర్శించు తంతివాద్యము లలో మిగుల ప్రాముఖ్యమైన యొక వాద్యమునకుగలపేరు. దీనిని వయొలిన్‌లో వలె విల్లు(కమాను)తో తంత్రులను రాపిడి చేయుచూ ఎడమచేతి వ్రేళ్ళయొక్క గోళ్ళమీద తంత్రులను అంటియుండునట్లుచేసి లాగుచూ స్వరస్థానముల నేర్పరచుకొని వాద్యమొనర్తురు. సాధారణముగా దీనిని హిందుస్థాని సంగీతకచ్చేరిలన్నిటియందును, ఆల్ ఇండియా రేడియో స్టేషను లన్నిటియందును నేడు ప్రక్క వాద్యముగను వాద్యసమ్మేళనము నందును వుపయోగించుచున్నారు.

సారణి :— మధ్యస్థాయి షడ్జతంతికిగల మరియొక పేరు. ఇది వయొలిన్‌లో 2 వ తంతిగను. వీణలో మొదటి తంతిగను, తంబురలో 2, 3 తంత్రులుగను వుండును.

సారదభైరవి :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ప గ రి స.

సారదా :— 11 వ మేళకర్తయగు 'కోకిలప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

సారధిగౌళ :— 8 వ మేళకర్తయగు 'హనుమతోడి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– ని స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ప మ గ రి స.

సారబిందు :—63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ని ప మ గ స.

సారమతి :— 20వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.
శ్రీ త్యాగరాజుని చే రచింపబడిన 'మోక్షముగలదా' అను కృతి యీ రాగములోని ఒక ప్రసిద్ధరచనయగును.

సారవాదిని :— 44వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ రి మ రి స.

సారసతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 తాళములలో 103 వ తాళమునకు గల పేరు. దీనికి అంగములు I 0 0 0 I I.

సారసప్రియ :— 27వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గా మ ప ధ ని స.
అవరోహణము— స ని ప ధా మ గ రి స.

సారసము :—61వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ప మ గ రి స.

సారికలు :— వీణలో స్వరస్థానములకై యేర్పఱచిన మెట్లకు 'సారికలు' అని పేరు.

సారోద్ (Sarode) :— తంత్రీవాద్యములలో కుడిచేతితో తంత్రులను మీటుచూ ఎడమచేతితో వాద్యమొనర్చు నొకరకపు వాద్యమునకు పేరు. దీనినే 'సరోద్' అని కూడా చెప్పుదురు. దీనిని హిందుస్థాని సంగీతమును ప్రదర్శించుటకుపయోగింతురు. ఉత్తర భారతదేశములో శ్రీ శ్యామ్ గంగూలీ, శ్రీ హాఫీజ్ ఆలీఖాన్ మొదలగువారు ఈ వాద్యమునందు విశేషముగు ప్రతిభగలవారైయున్నారు.



సాలగము :— 72 మేళకర్తలలో 37వ మేళకర్తకుగల పేరు. ఇది 7వ 'ఋషి' చక్రములోని మొదటి మేళకర్తయగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి – శు. గాం – ప్ర. మ – శు. ధై – శు. నిషాదస్వరములుండును.

సాలగము :— రెండేసి తాళములు కలియునట్టి తాళమునకుగల పేరు.

సాలగము :— ఛాయాలగ రాగమునకు గల మరియొక పేరు.

సాలగరాగము :—ఇతర రాగలక్షణములనుగూడ కలిపిపాడునట్టి రాగమునకు పేరు. ఉ॥ భైరవి, సారంగ, కాంభోజి, ముఖారి రీతిగౌళ మొదలగు రాగములు యీ రకమునకు చెందును.

సాలగసూడ :— శుద్ధసూడ ప్రబంధములోగల రెండు భాగములలో రెండవ భాగమునకుగల పేరు.

సాలలప :— 28వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి గ మ గ స.

సాలాకీక :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గి మ ప ని.
అవరోహణము—ధపమగస ని ధ ని ప ని స.
ఇది నిషాదాంత్యమైన షాడవ - ఔడవ రాగమునకు చెందును.

సావిత్రి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.
ఇది ఉభయ ఔడవరాగమునకు చెందును.

సావిత్రి :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

సావేరి :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' యొక్క జన్యరాగము. ఔడవ - సంపూర్ణము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
శ్రీ త్యాగరాజుని 'రామబాణత్రాణ' 'పరాశక్తి' అను కృతులును, శ్రీ శ్యామ శాస్త్రిల 'శంకరి శంకురు' "దురుసుగా కృపజూచి" అను కృతులును, శ్రీ ముద్దుస్వామి దీక్షితుని 'శ్రీరాజగోపాల' అను కృతియు, శ్రీవీణకుప్పయ్యర్ 'సరోజాక్షు' అను కృతియు, శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ 'ఎటునమ్మి నా' అను కృతియు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

సావ :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సాస్వగ :— 65 వ మేళకర్తయగు "మేచకల్యాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ రి స.

సాహిత్యప్రస్తారము :— మనోధర్మ సంగీతములోని 3 వ భాగమునకు సాహిత్య ప్రస్తారమని పేరు. దీనినే తమిళములో "నిరవల్" అని చెప్పుదురు.

సాహిత్యము :— సంగీత రచనలోని పదములు లేక మాటలకు సాహిత్యమని పేరు.

సాహిత్యములేని సంగీత రచనలు :— శ్రీ ముద్దుస్వామి దీక్షితులవంటి ప్రఖ్యాత సంగీత రచయితలు యూరపియన్ సాంగ్స్ (కీర్తనల) ననుసరించి రచించిన సాహిత్యములేని స్వచ్ఛమైన స్వర (సోల్ఫా) రచనలకుగల పేరు.

సాహుళి :— 17 వ మేళకర్తయగు "సూర్యకాంతము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సాళంగనాట :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" జన్యరాగము.
ఆరోహణము— స రి స మ ప ధ స.
అవరోహణము— స ధ పసనిసధపమగరిస.

సాళగభైరవి :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

శ్రీ త్యాగరాజుని "పదవినీసద్భక్తి" "సంగీతశాస్త్ర" అను ప్రసిద్ధ కృతులు యీ రాగములో గలవు.

సాళగవేళావళి :— 47 వ మేళకర్తయగు "సువర్ణాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

సాళవి :— 37 వ మేళకర్తయగు "సాలగము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సాళవిబంగాళ :— 23 వ మేళకర్తయగు "గౌరిమనోహరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

స్థానభ్రష్టుడు :— త్రిస్థానములను విడచి గానముచేయు "గాయకుని"కి గలపేరు.

స్థానము :— చోటు, లేక ప్రదేశము లేక ఉండవలసిన తావు. స్వరములు వాద్యములందు పలుకు తావులను స్వరస్థానములందురు.

స్థాయి :— గాత్రమును స్థిరపఱచునదియు స, తో మొదలిడి ని, తో అంతమగు సప్తస్వరములు లేక వాటి విభాగములగు ద్వాదశ స్వరములుగల ఒక భాగమునకు స్థాయి అని పేరు. ఇవి 5 విధములుగలవు, అవి ఏవనగా అనుమంద్ర, మంద్ర, మధ్య, తార, అతితార స్థాయిలనునవి. వీటిలో చాలావరకు వీణాది జంత్రవాద్యములందు పలికింతురు. సాధారణముగా గాత్రగానమునందుమంద్ర, మధ్య, తారస్థాయిలగుత్రిస్థాయిలు లేక $2\frac{1}{2}$ స్థాయిలుమాత్రమే పలుకును.

స్థాయి :— షడ్జాది నిషాదాంత్యమగు ద్వాదశ స్వరములుగల ఒక భాగమునకు పేరు. దీనినే ఇంగ్లీషులో ఆక్టేవు అందురు.

స్థాయియందుగల ద్వావింశతి శృతుల యొక్క సెంట్లు యేర్పడు వివరము:—

శృతులు — సెంట్లు...... సెంట్లు — సెంట్లు
స ... 0 ♦...................
రి1 ... 0 + పూ. శృ. 90 = 90
రి2 ... 90 + ప్ర. శృ. 22 = 112
రి3 ... 112 + న్యూ. శృ. 70 = 182
రి4 ... 182 + ప్ర. శృ. 22 = 204
గ1 ... 204 + పూ. శృ. 90 = 294
గ2 ... 294 + ప్ర. శృ. 22 = 316
గ3 ... 316 + న్యూ. శృ. 70 = 386
గ4 ... 386 + ప్ర. శృ. 22 = 408
మ1 ... 408 + పూ. శృ. 90 = 498
మ2 ... 498 + ప్ర. శృ. 22 = 520
మ3 ... 520 + న్యూ. శృ. 70 = 590
మ4 ... 590 + ప్ర. శృ. 22 = 612
ప ... 612 + పూ. శృ. 90 = 702
ధ1 ... 702 + పూ. శృ. 90 = 792
ధ2 ... 792 + ప్ర. శృ. 22 = 814
ధ3 ... 814 + న్యూ. శృ. 70 = 884
ధ4 ... 884 + ప్ర. శృ. 22 = 906
ని1 ... 906 + పూ. శృ. 90 = 996
ని2 ... 996 + ప్ర. శృ. 22 = 1018
ని3 ...1018 + న్యూ. శృ. 70 = 1088
ని4 ...1088 + ప్ర. శృ. 22 = 1110
స ...1110 + పూ. శృ. 90 = 1200

పైదెలిపిన సెంట్లు పాశ్చాత్యులు ఒక స్థాయిలో విభజించదగిన అతిసూక్ష్మనాదములు 1200 గా నిర్ణయించిరి. వీటికే ఇంగ్లీషులో 'సెంట్లు' అని చెప్పబడును. పైదెలిపిన 22 శృతులకు సెంట్లను విభజించి తెలుపుటలో వుపయోగించిన సంకేతాక్షరములను పూ. శృ. అనగా పూర్ణశృతి (90 సెంట్లు) అనియు, ప్ర. శృ. అనగా ప్రమాణశృతి (22 సెంట్లు)అనియు, న్యూ. శృ. అనగా న్యూనశృతి (70 సెంట్లు) అనియు, పై దెలిపిన విధమున వీటిలో ఒక్కొక్కదాని చేరికవల్లనే 22 శృతులకు సెంట్లు యేర్పడుననియు తెలుసుకొనవలెను.

స్థాయివర్ణము :— గానము మొదట యే స్వరముతో ప్రారంభమగునో తిరిగి అదే స్వరమునందు వచ్చి నిలచెడి గానక్రియకు 'స్థాయివర్ణ'మని పేరు. ఉ॥ సా పా సా, సా పా సా, స రి స, రి గ రి మొదలగునవి. మరియు ఒకే స్వరము పలుసార్లు వచ్చుటకుకూడ స్థాయివర్ణమని పేరు. ఉ॥ స స స స – రి రి రి రి మొదలగునవి.

స్థాయిసంచారము :— రాగాలాపనలో మధ్యమ కాలములో పాడునట్టి మరియొక పద్ధతికి పేరు. ఇది రెండు విధములు.
1. ఆరోహణ స్థాయిసంచారము.
2. అవరోహణ స్థాయిసంచారమునునవి.

స్థాయిస్వరము :— రాగసంచారములో గాయకుడు యేస్వరముతో ప్రారంభించునో అదే స్వరమున ముగించుటకుగలపేరు. ఇట్టి స్థాయిస్వరముల రచనకు శ్రీ శ్యామశాస్త్రిల 'కామాక్షీ' అను భైరవిరాగ స్వరజతి చక్కని వుదాహరణమగును.

స్థాయిస్వరములనిష్పత్తి :— ప్రధానమైన మధ్యస్థాయి స్వరములకు తారస్థాయి స్వరములు 1 : 2 నిష్పత్తిలోను, అతి తారస్థాయి స్వరములు 1 : 4 నిష్పత్తిలోను, మంద్రస్థాయి స్వరములు 2 : 1 నిష్పత్తిలోను, అను మంద్రస్థాయి స్వరములు 4 : 1 నిష్పత్తిలోను యుండును.

స్థాయీభావము :— భావములు 5 టిలో 5 వ దానికిపేరు. సజాతీయ, విజాతీయములచే తిరస్కరింపబడక క్షీరసముద్రమువలె అన్ని భావములను తనలో చేర్చుకొని ప్రకాశించునది స్థాయీభావమనబడును. ఇది 8 విధములు. 1. రతి. 2. ఉత్సాహము. 3. శోకము. 4. విస్మయము. 5. హాస్యము. 6. భయము. 7. జుగుప్స. 8. క్రోధము అనునవి.

స్వాధీనపతిక :— 'అష్టవిధనాయిక'లగు 8 రకముల నాయికలలో మొదటిదానిపేరు. ఈమె అనుదినము ప్రియునిచే లాలింపబడునదిగాయుండును.

## సి

సింగకుటి :— 19 వ శతాబ్దమునకుచెందిన "అంబాయిరమ్" అనే దక్షిణభారత దేశ ప్రఖ్యాత వయొలినిష్టుకు వయొలిన్ వాద్యములోగల ప్రజ్ఞా విశేషమునకు మెచ్చుకొని ప్రాచీన వాగ్గేయకారుడగు 'శ్రీపైడాల గురుమూర్తిశాస్త్రి' యిచ్చిన బిరుదు. "సింగకుట్టి" అనగా తమిళములో సింహపుపిల్ల అని అర్థము.

సింగనందన :— "అష్టోత్తరశత" తాళములగు 108 తాళములలో 37వ తాళమగు "సింహానందన"కు గలమరియొక పేరు.

సింగనందన :— భరతుని "నాట్యశాస్త్రమ్" అను గ్రంథములోని పంచతాళములకు గల ఉపతాళముయొక్క పేరు.

సింగనాద :— "అష్టోత్తరశత" తాళములగు 108 తాళములలో 32 వ తాళమగు "సింహానాద" తాళమునకుగల మరియొక పేరు.

సింజిని :— 43 వ మేళకర్తయగు "గవాంభోధి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

సింధు :— 17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప మ ధ స.
అవరోహణము—స ని ధ మ ప గ మ రి స.

సింధు :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప స.
అవరోహణము— స ని ధ ప నిధపమగరిస.

సింధుకన్నడ :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము—స మ గ మ రి గ మపధపస.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సింధుక్రియ :— 11 వ మేళకర్తయగు "కోకిలప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

సింధుగౌరి :— 7 వ మేళకర్తయగు "సేనాపతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

సింధుఘంట :— 20 వ మేళకర్తయగు "నరభైరవి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ప ని.
అవరోహణము— ధ ప మ గ రి స.

సింధుఘంటాణము :— 37 వ మేళకర్తయగు "సాలగము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

సింధుచింతామణి :— 9 వ మేళకర్తయగు "ధేనుక" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ గ మ ధ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

సింధుతరంగిణి :—15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సింధుదేశ్య :— 38 వ మేళకర్తయగు "జలార్ణవము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి స గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సింధుధన్యాసి :— 22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యొక్క జన్యరాగము.

ఆరోహణము- స గ మ ప ని స
అవరోహణము- స ని ప మ గ స.
ఇది 'ఉదయరవిచంద్రిక' రాగమునకుగల మరియొక పేరు. శ్రీత్యాగరాజునిచే రచింపబడిన 'ఎంతనేర్చినా' అను ప్రసిద్ధకృతి యీ రాగములోనిదిగా చెప్పుదురు.

సింధునాట :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము-స గ రి గ మ ని ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

సింధునాటకురంజి :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

సింధునాదము :— 38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప మ రి స.

సింధుభైరవి :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- మ ప ధ ని ధ స రి గ మ.
అవరోహణము- గ రి స ని ధ ప మ గ మ.

సింధుమందారి :—29 వ మేళకర్తయగు 'ధీరశంకరాభరణము' జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ని ధ ప గమధపమరిస.
'శ్రీపట్నం సుబ్రహ్మణ్యయ్యర్' చేరచింపబడిన 'కరుణించుటకిదె' అను కృతి యీ రాగములోని ఒక ప్రసిద్ధరచన యగును.

సింధుమారువ :— 54 వ మేళకర్తయగు 'విశ్వంభరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప స.
అవరోహణము- స ని ధ ని ప మ గ రి స.

సింధుమాళవి :— 6 వ మేళకర్తయగు 'తానరూపి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని ప ని స.
అవరోహణము- స ని ప మ రి స.

సింధురామక్రియ :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ప ధ ప మ గ స.
శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన "సుధామాధుర్య" "దేవాదిదేవ" అను ప్రసిద్ధకృతులు యీ రాగమునందే గలవు.

సింధురామక్రియ :— 45 వ మేళకర్త "శుభపంతువరాళి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి గ స.

సింధుసాళవి :— 19 వ మేళకర్తయగు "ఝంకారధ్వని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స మ ప ధ ని ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

సింధూముఖి :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప స.
అవరోహణము- స ని ధ ప ని ధ మ గరిస.

సింధోత్తమ :— 23 వ మేళకర్తయగు "గౌరీమనోహరి" యొక్క జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ప మ గ రి గ స.

సింహతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 101 వ తాళమునకు పేరు. దీనికిఅంగములు । O । । ।.

సింహనందనతాళము :— 'అష్టోత్తర శత' తాళములగు 108 టిలో 37 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 8 । 3 । 8 0 0 8 8 । 3 । 3 8 । । +. మాత్రలు 32. అక్షరకాలములు 128. ఈ తాళములో శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ ఒక క్లిష్టమైన పల్లవిని, శ్రీ మహావైద్యనాథయ్యర్ ఒక ప్రశస్తమైన తిల్లానను రచించి పాడి చిరకీర్తినొందిరి.

సింహనందనతాళ తిల్లాన రచయిత :— ఆవర్తనమునకు 128 అక్షరకాలములుగల సింహనందనతాళములో ప్రఖ్యాతమైన "తిల్లాన"ను రచించిన శ్రీ మహావైద్యనాథయ్యర్ కుగల గౌరవనామము.

సింహనందనతాళపల్లవి గాయకుడు :— అటు తాళములతో కూడిన సంకీర్ణతాళమైన సింహనందన తాళము (128 అక్షరకాలములు)లో పల్లవిని రచించి అత్యద్భుతముగా ప్రదర్శించిన ప్రఖ్యాత రచయిత, గాయకుడగు శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ కుగల సార్థక గౌరవనామము.

సింహనన్దనతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 35వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 8 । 3 । 8 0 0 8 8 । 3 । 3 8 । । +.

ఈ తాళములో 6 తాళములుగలవు. అవి చచ్చత్పుట, రతి, దర్పణ, కోకిలప్రియ, అభంగ, ముద్రితమఠతాళము లనునవి.

సింహనాదతాళము :— "సంగీత రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 31 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు । 8 8 । 8.

సింహనాదతాళము :— 'అష్టోత్తర శత' తాళములగు 108 టిలో 32 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు । 8 8 । 8. మాత్రలు 8. అక్షరకాలములు 32.

సింహనాదము :— 38 వ మేళకర్తయగు "జలార్ణవము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప మ రి స.

సింహప్రాస :— 'శ్రీత్యాగరాజుని' రచనలందుగల కొన్నిటిలో వుపయోగించిన ఒక జాతి ప్రాసకు "సింహప్రాస" అని పేరు.

సింహమధ్యమ :— 43 వ మేళకర్తయగు "గవాంభోధి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని స.
అవరోహణము- స ని మ గ రి స.

సింహలఘువు :— మిశ్ర సంకీర్ణలఘువు అనెడి 8 అక్షరకాలములుగల ఒకరకమైన లఘువునకుగల పేరు.

సింహలీలతాళము :— 'అష్టోత్తర శత' తాళములగు 108 తాళములలో 9 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు । 0 0 0 ।. మాత్రలు 3½. అక్షరకాలములు 14.

సింహలీలతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 10 వ తాళమునకు పేరు. దీనికి అంగములు 0 0 0.

సింహవాహిని :— 27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.
శ్రీ త్యాగరాజునిరచన "నెనరుంచరా" అను ప్రసిద్ధకృతి యీ రాగములోని దగును.

సింహవిక్రమతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 8 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 8 8 । 3 । 8 3.

సింహవిక్రమతాళము :— 'అష్టోత్తర శత' తాళములగు 108 టిలో 11 వ తాళమునకుగల పేరు. దీనికి అంగములు 8 8 8 । 3 । 8 3. మాత్రలు 16. అక్షర కాలములు 64.

సింహవిక్రీడితతాళము :— 'అష్టోత్తర శత' తాళములగు 108 టిలో 25వ తాళమునకు పేరు. దీనికి అంగములు । । 3 8 । 8 3 । 3. మాత్రలు 17. అక్షరకాలములు 68.

సింహవిక్రీడితతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 27 వ తాళము నకుగలపేరు. దీనికి అంగములు । 3 8 3 3 8 । 8 3 । 3.

సింహస్వరూపి :— 64 వ మేళకర్తయగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ధ ని స.
అవరోహణము- స ని ప మ గ స.

సింహళ :— "సంగీత రత్నాకరము" పై సంస్కృత వ్యాఖ్యానమును వ్రాసిన ఒక ప్రాచీన ప్రసిద్ధ లక్షణకారుడు.

సింహారవము :— 58 వ మేళకర్తయగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప మ రి గ రి స.

సింహేళకాపి :— 24 వ మేళకర్తయగు "వరుణప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ని ప మ గ స.

సింహేళభైరవి :— 23 వ మేళకర్తయగు "గౌరీమనోహరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

సింహేళము :— 18 వ మేళకర్తయగు "హాటకాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ని ప మ గ రి స.

సింహేళవరాళి :— 26 వ మేళకర్తయగు "చారుకేశి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ మ రి స.

సింహేళవసంతము :— 25 వ మేళకర్తయగు 'మారరంజని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప మ ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ రి స.

సింహేళసావేరి :— 30 వ మేళకర్తయగు “నాగానందిని” యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ గ స.

సింహేంద్రడ :— 29 వ మేళకర్తయగు “ధీరశంకరాభరణము” జన్యరాగము.
ఆరోహణము— స మ గ ధ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సికాంభోజి :— 52 వ మేళకర్తయగు ‘రామప్రియ’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

సితార్ (Sitar) :— తంత్రీ వాద్యములలో మెట్లుగల్గిన మీటు వాద్యమునకుగల పేరు. దీనిని హిందుస్థాని సంగీతమును ప్రదర్శించుటకు ముఖ్యంగాను పయోగించుదురు.

సిద్ధ :—నారదునిచే రచింపబడిన ‘సంగీత మకరంద’మను గ్రంథములో పేర్కొనిన 22 శ్రుతులలో షడ్జమునకుగల 4 శ్రుతులలో మొదటిదానికి గలపేరు.

సిద్ధసేన :— 22 వ మేళకర్తయగు ‘ఖరహరప్రియ’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ప ధ స.
అవరోహణము—స ని ధ మ ప మ రి గ రి స.
శ్రీ త్యాగరాజుని ‘ఎవరైనాలేరాపెద్దలు’ అను ప్రసిద్ధకృతి యీ రాగములోగలదు.

సిద్ధార్ను :— ‘తాయుమానవర్’ రచించిన తమిళములోని 18 రచనలకుగలపేరు.

*సిమ్హేంద్రమధ్యమము :— 57 వ మేళకర్తరాగమునకు గలపేరు. ఇది 10 వ ‘దిశి’ చక్రములోని 3 వ మేళమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములు గాక చ. రి— సా. గాం— ప్ర. మ— శు. ధై— కా. నిషాద స్వరములుండును. శ్రీత్యాగరాజుని “నీదు చరణములే” “నతజనపరిపాలక” అను కృతులును, శ్రీదీక్షితుని“కామాక్షి” అను కృతియు, శ్రీపురందరదాసుని“హరిహరి” అను కీర్తనయు, శ్రీ స్వాతితిరునాళ్ యొక్క“రామరామ”అనుకృతియు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

సిరుచ్చి :— “వనపాదచూడామణి”చే రచింపబడిన “తాళసముత్తిరమ్” అను ప్రాచీన తమిళ గ్రంథమునందు పేర్కొనబడిన 5 వ తాళమునకుగల పేరు.

## సీ

సీతాపంచమం :— 9 వ మేళకర్తయగు ‘ధేనుక’ యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

*సీతారామవిజయము :—ఇది శ్రీ త్యాగరాజునిచే రచింపబడిన యొక పవిత్ర గ్రంథమునకుగల పేరని తెలియుచున్నది. కాని ఈగ్రంథమెచ్చటనుకనుపించుటలేదు.

సీమంతిని :— 57 వ మేళకర్తయగు ‘సిమ్హేంద్రమధ్యమము’ జన్యరాగము.

ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ప మ గ రి స.
ఇది సంపూర్ణ-ఔడవరాగమునకుచెందును.

సీమంతినీప్రియ :— 52వ మేళకర్త యగు 'రామప్రియ' జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

సీర :—సూళాదిసప్తతాళ అలంకారము లకిచ్చిన 7 పేర్లలో 4 వదానికి గలపేరు. మిగతవి 1. ఇంద్రలీల, 2. మహావజ్ర, 3. నిర్ఘోష, 5. కోకిల, 6. అవర్త, 7. సదానంద అనునవి.

స్వీయ :— నాయికలలోని 3 విధముల లో మొదటి నాయికకుగల పేరు. అనగా సంపత్కాలమందును, విపత్కాలమం దును, తనను పాణిగ్రహణము చేసికొనిన భర్తను విడువక యుండు నాయికయగును.

స్త్రీరాగము :— 'నారదుని' 'సంగీతమక రందము'లో పేర్కొనిన రాగనామముల నుబట్టి చేసిన రాగవిభజనలోని 3 రకము లలో రెండవ రకమునకు గలపేరు.

స్త్రీరాగములు :— ఈదిగువ తెలుపబడిన స్త్రీరాగములు ఆయా పురుషరాగములకు భార్యలుగా గ్రహించునది. భైరవికి-మేఘ రంజి, దేవక్రియా, కురంజిరాగములును, భూపాలకు, బిలహరి, మలహరి, భాండ రాగములును, శ్రీరాగమునకు- అంధాళీ, భల్లాతీ, సాహులీరాగములును, ఫలమంజ రికి- దేశీముఖారి, లలితరాగములును, వసం తకు- రామక్రియ, వరాళి, గౌళరాగము లును, మాళవికి- గుండక్రియ, ఘూర్జరి, ఝాళిరాగములును, బంగాళకు- కల్యాణి, ఆహిరి, సావేరిరాగములును, నాటకు- ఘంటారవము, కాంభోజి, శంకరాభరణ రాగములును భార్యలగుటచే నవి స్త్రీ రాగములగును.

## సు

సుందరభైరవి :— 53వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

సుందరాంగిణి :— 72వ మేళకర్తయగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ ప గ రిస.
ఇది ఔడవ-వక్రసంపూర్ణమునకుచెందును.

సుందరేశనాటకము :— చెయ్యూరు నివాసియగు 'శ్రీచెంగల్వారాయశాస్త్రి'చే రచింపబడిన ఒకసుప్రసిద్ధనాటకముపేరు.

సుఖ:— గాంధార గ్రామములోని 7 మూర్ఛనలలో 6వ మూర్ఛనకుగల పేరు. ఇది 'ప' స్వరముతో ప్రారంభమగును. అనగా ప ధ ని స రి గ మ ప యగును.

సుఖకరి :— 52వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి స ప ధ ని స.
అవరోహణము- స ని ధ ప మ గ స రి స.

సుఖదాయిని :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

సుఖధ్వని :— 53 వ మేళకర్తయగు 'గమనశ్రమ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

సుఖనీలాంబరి :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సుఖప్రియ :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి గ మ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

సుఖస్వరావళి :— 48 వ మేళకర్తయగు 'దివ్యమణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ని స రి గ మ ప ధ ని.
అవరోహణము— ప మ గ రి స ని స.
ఇది నిషాదాంత్యరాగమునకు చెందును.

సుఖావహము :— ఏది వినుటకు మనోరంజకముగనుండునో అద్దానిని 'సుఖావహ' మని చెప్పుదురు.

సుగంధికుంతలాంబాంకితరచనలు :— తిరుచినాపల్లి వాస్తవ్యుడగు శ్రీకవిమాతృభూతయ్య'చే దేవీపరముగా 'త్రిశిరగిరి' ముద్రతో రచింపబడిన రచనలకుగల పేరు. ఈయన అద్భుత గానమునకు మెచ్చి తంజాపూరు శ్రీ ప్రతాపసింహ మహారాజు ఈయనకు రు 10,000 లు బహూకరించినట్లుగా చెప్పుదురు.

సుగాత్రి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

సుగుణభూషణి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రిస.

సుగోషిణి :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ రి మ స.

*సుచరిత్ర :— 72 మేళకర్తలలో 67 వ మేళకర్తకుగల పేరు. ఇది 12 వ 'ఆదిత్య' చక్రములోని మొదటి మేళకర్త రాగమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములు గాక ష. రి— అం. గాం— ప్ర. మ— శు. ధై— శు. నిషాదస్వరములుండును.

సుజనరంజని :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

సుజస్కావళి :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.

ఆరోహణము— స మ గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ని ధ ప మ గ స.

సుధ :— 35 తాళములలో 'త్రిశ్రజాతి ఏకతాళము'నకుగల పేరు. దీనికి అంగములు 1. ఆవర్తమునకు అక్షరకాలములు3.

సుధాకళ్యాణి :— 65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

సుధాకాంభోజి :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

సుధాంభోది :— 43 వ మేళకర్తయగు 'గవాంభోధి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

సుధాలహరి :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

సుధాసాగరము :—38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

సునాద :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

సునాదప్రియ :— 57 వ మేళకర్తయగు 'సింహేంద్రమధ్యమము' జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సునాదము :— 'సంగీతకౌముది'లో గ్రహలక్షణమందు చెప్పబడిన నవగ్రహములలో 9 వ దానికి 'సునాద' మని పేరు.

సునాదవినోదిని :—65 వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

సుప్రకాశి :— 52 వ మేళకర్తయగు 'రామప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ప స.
అవరోహణము— స ని ధ ని ప మ గ రి స.

సుప్రకేతన :— 17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ని ధ ప గ రి స.

సుప్రదీపము :— 17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.
శ్రీ త్యాగరాజుని 'వరశిఖివాహన' అను ప్రసిద్ధకృతి యీరాగమునందే గలదు.

సుప్రభ :— నారదుని 'సంగీతమకరందము'లో పేర్కొనబడిన షడ్జమునకుగల 4 శ్రుతులలో 4 వ దానికిగల పేరు.

సుప్రవాహిని :— 63 వ మేళకర్తయగు 'లతాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

సుప్తి :— వ్యభిచారీభావములోని 33 విధములలో 23 వ దానిని 'సుప్తి' అందురు.

సుపోషిణి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి స మ ప ని ధ స.
అవరోహణము— స ధ ని ప మ రి మ స.
ఇది ఉభయ వక్రషాడవము. గాంధార వర్జ్యము. శ్రీ త్యాగరాజుని 'రమించువారెవరురా' అను ప్రసిద్ధకృతి యీరాగములో నే గలదు. ఇది పాశ్చాత్య సంగీతశైలి ననుసరించి రచింపబడిన కృతియగును.

సుబ్రహ్మణ్య :— శ్రీ శరభోజీ, శివాజీ మహారాజుల ప్రారంభకాలమందు పంచనదక్షేత్రమునందు నివశించిన ద్రావిడ బ్రాహ్మణుడగు 'శ్రీ దురైస్వామయ్య' రచించిన కీర్తనలందుగల ముద్రకు పేరు.

సుబ్రహ్మణ్య :— తెలుగులో 'అధ్యాత్మ రామాయణ కీర్తనలు' అనుగ్రంథమును రచించిన 'శ్రీసుబ్రహ్మణ్యకవి' యొక్క రచనలందుగల ముద్రకు పేరు.

సుబ్రహ్మణ్యము :— ప్రాచీన వాగ్గేయకారుడై సంగీత త్రిమూర్తులలో నొకరైన 'శ్రీ శ్యామశాస్త్రి' కి ఆయన తల్లిదండ్రులు మొదట పెట్టినటువంటి పేరు.

సుబ్రహ్మణ్యశాస్త్రి :— ద్వావింశతి శృతులను గురించి విశేషముగా పరిశోధనలు సలిపిన తంజావూరులోని ఒక సుప్రసిద్ధ పండితునికి గలపేరు.

సుభాషిణి :— 16 వ మేళకర్తయగు 'చక్రవాకము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ధ ని స రి గ మ ప.
అవరోహణము— మ గ రి స ని ధ ని స.

సుమద్యుతి :— 57 వ మేళకర్తకు 'వేంకటమఖి' పెట్టిన నామము. ఇది 10 వ 'దిశి' చక్రములోని 3 వ మేళమగును.

సుమద్యుతి :— 57 వ మేళకర్తయగు 'సింహేంద్రమధ్యమము' జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సుమనప్రియ :—శ్రీ యల్. ముత్తయ్య భాగవతర్ యొక్క రచనలందలి 'శ్రీ శరవణ' అనురచనకుయేర్పఱచిన రాగము పేరు.

సుమనీసరంజని :— 56 వ మేళకర్తయగు 'షణ్ముఖప్రియ' జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

సుమబౌరి :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

సుముఖి :— గాంధార గ్రామములోని 7 మూర్ఛనలలో మూడవమూర్ఛనకుగల పేరు. అనగా స రి గ మ ప ధ ని స యగును.

సుర :— 35 తాళములలో 25 వ తాళమగు 'మిశ్రజాతి ఝంపెతాళము' నకుగల పేరు. దీనికి అంగములు । ∪ 0. ఆవర్తమునకు అక్షరకాలములు 10.

సురటి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ ప మరిస.
శ్రీ త్యాగరాజుని రచనలగు గీతార్థము, భజనపరుల, పరాఙ్ముఖమేలరా, అనుకృతులును, పతికిహారతి అను మంగళము, శ్రీవీణ కుప్పయ్యర్ యొక్క పరదేవి అనుకృతియు, శ్రీ దీక్షితుని బాల సుబ్రహ్మణ్యం, అనుకృతియు, శ్రీ స్వాతి తిరునాళ్ మహారాజు యొక్క 'సదారామ' అను కృతియు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

సురటినాయకం :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ని స.
అవరోహణము– స ధ ప మ గ స.
ఇది స్వరాంతర – ఔడవరాగమగును.

సురటిమల్లారు :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

సురభూషణి :— 4 వ మేళకర్తయగు 'వనస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప స.
అవరోహణము– స ని ధ ని ప మ రి స.

సురభైరవి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి ప మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ స.
ఇది వక్రషాడవ – ఔడవరాగమగును.

సురమణి :— 48 వ మేళకర్తయగు "దివ్యమణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

సురరంజని :— 36 వ మేళకర్తయగు "చలనాట" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ ప ని స.
అవరోహణము– స ని ప గ రి స.

సురవరాళి :— 13 వ మేళకర్తయగు "గాయకప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ స.

సురసింధు :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" జన్యరాగము.
ఆరోహణము– స మ గ మ ధ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

సురసేన :— 27 వ మేళకర్తయగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.

సురేంద్రనాథమోహన్ ఠాకూరుదాసు :— ద్వావింశతి శ్రుతులను గురించి మిక్కిలి పరిశోధనలుచేసిన ఒక ప్రాచీన సంగీత లక్షణకారునికి గలపేరు.

సువర్ణముఖారి :— 59 వ మేళకర్తయగు 'ధర్మవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ మ గ రి స.

*సువరాంగి :— 47 వ మేళకర్త రాగమునకుగల పేరు. ఇది 8 వ 'వసు' చక్రములో 5 వ మేళకర్తయగును.
ఆరోహణము– స రి గ మ ప ధ ని స.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములుగాక శు. రి – సా. గాం – ప్ర. మ – చ. ధై – కా. నిషాద స్వరములుండును.

సువర్ణాంబరి :— 50 వ మేళకర్తయగు 'నామనారాయణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ని స.
అవరోహణము– స ని మ గ రి స.

సువ్రత :— 13 వ మేళకర్తయగు 'గాయకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ధ స.
అవరోహణము– స ధ మ గ రి స.

సుశారీరము :— తారస్థాయిలో గూడ సునాయాసముగా రాగము సంచరింపగలిగి మాధుర్యము, రక్తి, గంభీరము, మార్దవము, ఘనత, స్నిగ్ధత, కాంతిగల శారీరమునకు "సుశారీర" మని పేరు.

సుషక్రము :— సంగీత వాద్యమును ఒకే వ్యక్తి వాయించునపుడు గలుగు పేరు.

సుషిర :— సంగీత వాద్యముల విభజనలోని రెండవ రకమునకుగల పేరు.

సుస్వర :— 'భావభట్టుని' చే రచింపబడిన 'అనూపసంగీత విలాసము' అను గ్రంథములో పేర్కొనబడిన 22 శృతుల విధానములో పంచమమునకుగల 4 శృతులలో 4 వ శృతికి గల పేరు.

స్థితిప్రియ :— 15 వ మేళకర్తయగు 'మాయామాళవగౌళ' జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ స.

స్ఫుటాలాపిని :— 61 వ మేళకర్తయగు 'కాంతామణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ని స.
అవరోహణము– స ని ప మ గ స.

స్ఫుటాలాపిని :— 72 వ మేళకర్తయగు "రసికప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ స.

స్ఫుటితము :— స్పష్టోచ్చారణ గలదా లేదాయను సందియముగల ధ్వనికి పేరు.

స్ఫురితము :— ఆరోహణ జంటస్వరములలో రెండవ స్వరమునందు షుమారు $\frac{3}{4}$ అక్షరకాలము నిలిచికొట్టి దానిక్రింది స్వరము యొక్క ఛాయను రాజేయుటకు గల పేరు.

స్మృతి :— వ్యభిచారీ భావములలోని 33 విధములలో 12 వ దానికి గల పేరు.

సూడప్రబంధము :— శార్ఙ్గదేవాదులు విభజించిన ప్రబంధములలోని 3 విధములలో మొదటి రకమునకుగల పేరు.

సూత్రఖండము :— 'రాగాంగ లక్షణ గీతము' యొక్క మొదటిభాగమునకు పేరు.

సూత్రధారి :— 27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

సూత్కారి :— గానము చేయుటలో సీత్కారముతో "ఉస్" అని గానము చేయు 'గాయకుని'కిగల పేరు.

సూపరము :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సూరదాసు :— హిందుస్థాని సంగీతములోని భక్తిరస కీర్తనల ప్రాచీన రచయిత.

*సూర్యకాంతము :— 72 మేళకర్తలలో 17 వ మేళకర్తకుగల పేరు. ఇది 3 వ 'అగ్ని'చక్రములోని 5వమేళకర్తయగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమ స్వరములుగాక శు. రి— అం.గాం— శు. మ— చ. థై— కా. నిషాద స్వరములుండును. శ్రీ త్యాగరాజుని "ముద్దుమోము" అను ప్రసిద్ధకృతి యీ రాగమునందే గలదు.

సూర్యాంశరాగము :— 'నారదుని' చే "సంగీతమకరందము"లో పేర్కొనబడిన రాగవిభజనలోని నాలుగు రకములలో మొదటిదానికిగల రెండు విధములలో మొదటిదాని పేరు. దీనిలో రెండవది "చంద్రాంశరాగ" మగును.

సూళాది :— 'తాళమాలిక' వంటి ఒకవిధమగు సంగీత రచనకు గలపేరు.

సూళాది :— "శ్రీ పురందరదాసుని" చే రచింపబడిన యొక విధమగు రచనకుగల పేరు. ఈ సూళాదులు ప్రసిద్ధాలంకార సప్తతాళంబులును, రగణ మఠ్యంబును, ఉద్గ్రాహ, ధ్రువ, ఆభోగ ధాతువులతో ఏక కళగా విళంబ, మధ్యలయలుగలదై వర్ణ క్రమంబులతో సాహిత్యరూపమై యుండును. ఉ॥ తందేయా గీతా యాగి యిందిరేశయనగే, అను భూపాలరాగము, రూపకతాళములోని శ్రీ పురందరదాసుని సూళాది రచన యిందుకొక ముఖ్య వుదాహరణయగును. [రగణమఠ్యమనగా ఒక గురువు ఒక చతురశ్ర లఘువు ఒక గురువు గలది యగును.]

సూళాదితాళములు :— శ్రీకరాది నామములుగల 35 తాళములకు సూళాది తాళములని పేరు. ఇవి 108 తాళముల తరువాత యేర్పడినవిగా తెలియుచున్నది.

సూళాదిసప్త అలంకార నామములు :— ఇంద్రనీల,మహావజ్ర,నిర్ద్గోష, సిర, కోకిల, ఆవర్త, సదానంద అనువాటికిగల పేరు.

సూళాదిసప్త అలంకారములు :— ధ్రువాదిసప్తతాళ అలంకారములకు పేరు.

సూళాదులు :—'శ్రీ పురందరదాసుని'చే విరచితమైన గీతమువంటిరచనలకుగలపేరు. ఈయనకు 'పదసాహిత్య రచయిత'యను బిరుదుకూడ గలదని తెలియుచున్నది.

సూక్ష్మకాలములు :— పరమేశ్వరునివలన బుట్టిన క్షణ, లవ, కాష్ట, నిమిష, కళ, చతుర్భాగములకుగల పేరు. అనగా యివి తాళదశ ప్రాణములలోని మొదటిదగు 'కాలము' నందలి 12 విధములగు కొలతలలో మొదటి 6 కొలతలు యగును.

సూక్ష్మము :—నాదము హృదయమందుండునపుడు 'సూక్ష్మము' అని చెప్పబడును.

సూక్ష్మరూపి :— 28 వ మేళకర్తయగు 'హరికాంభోజి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ స.

స్థూలకాలములు :— తాళదశప్రాణములలోని మొదటిదగు 'కాలము' నందలి ద్వాదశ ప్రమాణములలో 2 వ భాగమునకుచెందిన షడంగము లనబడు అను ద్రుత, ద్రుత, లఘు, గురు, ప్లుత, కాకపాదములకు 'స్థూలకాలము' లనిపేరు.

## సె

సెంట్లు (Cents) :— పాశ్చాత్య సంగీత వేత్తలు ఒక స్థాయిని 1200 భాగములుగా విభజించి ఆ భాగములకు పెట్టిన పేరు. అయితే యీ సెంట్లు అనెడిధ్వనులు మన కర్నాటక సంగీతమునందలి ద్వావింశతి శృతులవలె చెవి గ్రహించుటకు వీలుగల ధ్వనులుమాత్రము కావని గ్రహించునది.

సెంపట :—శెంపట అను తాళమునకుగల మరియొక పేరు. ఇది "కథాకళి" నృత్యమునందుఆదితాళమునకుబదులుగావాడుదురు.

## సే

సేనాగ్రణి :—7 వ మేళకర్తయగు 'సేనాపతి'కి 'వేంకటమఖి' పెట్టినపేరు. ఇది 2వ 'నేత్ర'చక్రములోని మొదటిమేళమగును.

సేనాగ్రణి :— 7 వ మేళకర్తయగు "సేనాపతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సేనాజయంతి :— 67 వ మేళకర్తయగు 'సుచరిత్ర' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

సేనాపతి :— 7 వ మేళకర్తయగు 'సేనావతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని స.
అవరోహణము— స ని ధ ప ధ మ గ రి స.

సేనామణి :— 17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సేనామనోహరి :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి గ స.

*సేనావతి :— 72 మేళకర్తలలో 7 వ మేళకర్తకు గలపేరు. ఇది రెండవ 'నేౖత' చక్రములోని మొదటి మేళకర్తయగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమ స్వరములు గాక శు. రి— సా. గాం— శు. మ— శు. ధై— శు. నిషాదస్వరము లుండును.

సేరసేన :— 58 వ మేళకర్తయగు 'హేమవతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ రి మ ప ని స.
ఆవరోహణము— స ని ధ ప మ గ రి స.

సేవధి :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ధ ప గ రి స.

స్వేదము :— సాత్త్విక భావములోగల 8 విధములలో 2 వ దానికి "స్వేదము" అని పేరు. మిగిలినవి 1. స్థంభము, 3. రోమాంచము, 4. స్వరభేదము, 5. వేపథువు, 6. వైవర్ణ్యము, 7. అశ్రువు, 8. ప్రళయము అనునవి.

## సై

సైంధవక్రియ :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
ఆవరోహణము— స ని ప మ రి స.
ఇది సంపూర్ణ – ఔడవమునకు చెందును.

సైంధవగౌళ :— 7 వ మేళకర్తయగు 'సేనావతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ మ రి స.

సైంధవి :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— ని ధ ని స రి గ మ ప నీ.
అవరోహణము— ధ ప మ గ రి స.

సైకతశ్రోణి :— 66 వ మేళకర్తయగు 'చిత్రాంబరి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

సైరంధ్రి :— 36 వ మేళకర్తయగు 'చలనాట' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప రి స.

స్వైరిణి :— 3 వ మేళకర్తయగు 'గానమూర్తి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.

## సొ

సౌౖబమ :— నవసంధి తాళములనబడు 9 తాళములలో మొదటి దానికిగల పేరు.

సోభన్‌లు :— పర్షియన్ సంగీతములో ఉత్తర హిందూస్థానములోని సంగీతము నందుగల "రాగిణీ" విధానమునకు సరిపోవు నట్టి రాగములకు గలపేరు.

సోమ :— 14 వ మేళకర్తయగు 'వకుళాభరణము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

సోమకిరణి :— 41 వ మేళకర్తయగు 'పావని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ రి స.

సోమక్రియ :— 31 వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స ప మ రి గ మ ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ మ రి స.

సోమగిరి :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము- ని స రి గ మ ప ధ.
అవరోహణము- ప మ గ రి స ని స.
ఇది ధైవతాంత్యరాగమునకు చెందును.

సోమఘంటాణము :— 40 వ మేళకర్తయగు 'నవనీతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ని ధ ని స.
అవరోహణము- స ని ప ధ మ గ రి స.

సోమతరంగిణి :— 17 వ మేళకర్తయగు 'సూర్యకాంతము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి స గ మ ప మ ధ నిస.
అవరోహణము- స ని స ధ ప మ గమరిస.

సోమదీపకము :— 24 వ మేళకర్తయగు 'వరుణప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ ప ధ ని స.
అవరోహణము- స ని ప మ గ స.

సోమదీపరము :— 35 వ మేళకర్తయగు 'శూలిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప మ ధ ని స.
అవరోహణము- స ధ ప మ గ మ రి స.

సోమనాథీయము :— ప్రాచీన సంగీత లక్షణకారుడైన 'సోమనాథు'డను ఆంధ్ర వాగ్గేయకారుడు వ్రాసిన యొక మీమాంస గ్రంథమునకు గలపేరు.

సోమనాథుడు :— 16-17 శతాబ్దములకు చెంది క్రీ. శ. 1609 లో 'రాగవిబోధము' అను ప్రమాణ సంగీత లక్షణగ్రంథమును వ్రాసిన ఆంధ్ర వాగ్గేయకారుడు. తూర్పుగోదావరిజిల్లా వాస్తవ్యుడు. వీణా వాద్యములో ఒక క్రమమైన పద్ధతిని కనిపెట్టిన మహానుభావుడు.

సోమనాథుని తాళవిభజన :— 'శ్రీసోమనాథుని'చే అష్టోత్తరశత తాళములగు 108 టిలో 7 ప్రథమ తాళములనియు, 27 శుద్ధతాళములనియు, మిగిలినవి 74 మిశ్ర తాళము లనియు, విభజింపబడిన ఒక విధమైన తాళవిభజనకు గలపేరు.

సోమనాధుని ద్వావింశతి గమకములు:—

| | |
|---|---|
| 1. అక్షిప్తము | 12. దీర్ఘకంపితము |
| 2. అదీర్ఘము | 13. దీర్ఘిక |
| 3. ఆహితము | 14. దీర్ఘోల్లసితము |
| 4. ఉచ్చరితము | 15. ప్రస్తుతము |
| 5. ఉల్లసితము | 16. భ్రమితము |
| 6. ఉల్లాసితము | 17. మూర్ధ్ని |
| 7 కరస్థితము | 18. క్షిప్తము |
| 8. కుంచితము | 19. లలిత |
| 9. కోమలము | 20. లలితోత్తమ |
| 10. గుంఫితము | 21. సమోల్లసితము |
| 11. దీర్ఘ | 22. సూక్ష్మాంతరము |

అను పై 22 గమకములకు గలపేరు. ఇది శ్రీ సోమనాధునిచే రచింపబడిన 'పండితారాధ్యచరిత్ర' అను ఆంధ్ర ద్విపదకావ్యమునందు పేర్కొనబడి యున్నవి.

సోమప్రతాపము :— 26 వ మేళకర్తయగు 'చారుకేశి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

సోమప్రభావళి :— 37 వ మేళకర్తయగు "సాలగము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

సోమభూపాలము :— 30 వ మేళకర్తయగు "నాగానందిని" జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప మ ధ స.
అవరోహణము— స ధ ని ప మ గ రి స.

సోమభైరవి :— 12 వ మేళకర్తయగు "రూపవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ప ధ ని ప మ గ రి స.

సోమమంజరి :— 62 వ మేళకర్తయగు "రిషభప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ప మ రి గ రి స.

సోమమంజరి :— 67 వ మేళకర్తయగు "సుచరిత్ర" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ రి స.

సోమముఖి :— 27 వ మేళకర్తయగు "సరసాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి మ గ స.

సోల్కట్టు :— తాళశబ్దములగు జతులతో కూడిన రచనకు తమిళములోని పేరు.

సోల్కట్టుస్వరము :— జతులతోకూడిన స్వర రచనకు తమిళములోని పేరు.

సోల్ఫాపాసేజి (Solfapassage) :— సంగీత ప్రదర్శనములో అప్పటికప్పుడు వివిధరాగములలో స్వరములను కల్పించి పాడుటకు ఇంగ్లీషులో చెప్పబడు పేరు.

సోహనీ :— హిందుస్థాని సంగీతములోని ఒక రాగమునకు గలపేరు. ఇది కర్నాటక సంగీతములోని 53 వ మేళకర్తయగు "గమనశ్రమ" జన్యమైన 'హంసానంది' రాగమునకు సరిపోవునదిగా యుండును.
స రి గ మ ధ ని స — స ని ధ మ గ రి స.

స్తోత్రప్రియ :— 38 వ మేళకర్తయగు 'జలార్ణవము' యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ స.
ఇది ద్విస్వర వర్జరాగమునకు చెందును.

స్తోత్రము :— తాళముగలిగినట్టి సంస్కృతములోని యితర పవిత్ర రచనకుగల పేరు. శ్రీ ఆది శంకరాచార్యులు వ్రాసిన 'భజగోవిందస్తోత్రము' సంస్కృతమునగల పవిత్రసంగీతములోని ప్రఖ్యాతమైనస్తోత్ర రచనకు ఒక ముఖ్య వుదాహరణయగును.

స్రోతస్విని :— 21 వ మేళకర్తయగు "కీరవాణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ స.
ఇది ఉభయ ఔడవరాగమునకు చెందును.

స్రోతోవహాయతి :— ఒక తాళావర్తము లోగల అంగములు నదివలె మొదట కురుచయై రాను రాను పెరిగిపోవునదిగానుండు దానికిగల పేరు. ఉ॥ ∪ 0 । 8 3. మ పా ధా, నీ; సా;, యీ విధముగా తాళాంగములుగాని, స్వరములుగాని లేక సాహిత్యములుగాని యుండునని గ్రహించునది. ఈక్రింద పేర్కొనిన శ్రీ ముద్దుస్వామి దీక్షితర్, చే రచింపబడిన కృతిలోని భాగము యిందుకు ముఖ్య వుదాహరణమగును.

(1) శమ్
ప్రకాశమ్
స్వరూప ప్రకాశమ్
తత్వ స్వరూప ప్రకాశమ్
సకలతత్వ స్వరూప ప్రకాశమ్
శివశక్త్యాదిసకలతత్వస్వరూపప్రకాశమ్.

ఈ క్రింద పేర్కొనిన శ్రీ త్యాగరాజుని రచనయగు 'బుద్ధిరాదు' అను శంకరాభరణ రాగము, చాపుతాళములోని కృతికూడ యిందుకు ఒక ముఖ్యవుదాహరణగా తీసుకొనదగును.

(2) అమృతపానము
వాగామృతపానము
భక్తుల వాగామృతపానము.

పై దెలిపిన 2 రచనలభాగములు స్రోతోవహాయతులు గల కృతులకు చక్కని వుదాహరణములుగా గ్రహింపవలెను. దీనికి వ్యతిరేకమైనది గోపుచ్ఛయతి యగును. దీనియొక్క అంగములు ఆవుతోకవలె 3 8 । 0 ∪ ఈవిధముగా నుండును.

## సౌ

సౌండ్ :— శ్రీ 'టి. యస్. కృష్ణస్వామి' చే ఇంగ్లీషులో ధ్వనినిగురించి రచింపబడిన ఒక సంగీతగ్రంథమునకు గలపేరు.

సౌండ్ అండ్ మ్యూజిక్ :— శ్రీ 'సిడ్లీ టెయిలర్' అను పాశ్చాత్య పండితుడు ధ్వని,మరియు సంగీతములనుగురించి ఇంగ్లీషులో వ్రాసిన ఒక గ్రంథమునకు పేరు.

సౌందర్య :— 52 వ మేళకర్తయగు "రామప్రియ" యొక్క జన్యమైన వక్రనిషాదాంత్యమునకు చెందిన రాగము.

ఆరోహణము- స రి గ ప మ ధ ని.
అవరోహణము- ప మ గ రి స ని స.

సౌందర్యము :— ఉద్దీపన విభావము లోని 4 విధములలో 1 వదైన గుణములు 7 టిలో 4 వ దానికిగల పేరు.

సౌకుమార్యము :— ఉద్దీపన విభావము లోని 4 విధములలో 1 వదైన గుణములం దలి 7 విధములలో 7 వ దానికిగల పేరు.

సౌఖ్యదాయిని :— 48 వ మేళకర్తయగు "దివ్యమణి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ స.

సౌగంధిని :— 37 వ మేళకర్తయగు "సాలగము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ధ స.
అవరోహణము- స ని ధ ప మ గ రి స.

*సౌగంధిని :— 37 వ మేళకర్త రాగమునకు "వేంకటమఖి" పెట్టిన పేరు.

సౌత్ఇండియన్ మ్యూజిక్‌బుక్ IV :— శ్రీ ప్రొఫెసర్ పి. సాంబమూర్తి (బి. ఏ; బి.యల్;)చే దక్షిణభారతములోని కర్నాటక సంగీతశాస్త్రమును గుఱించి ఇంగ్లీషులో వ్రాయబడిన 4 వ గ్రంథము పేరు.

సౌత్ఇండియన్ మ్యూజిక్ సీరీస్ I-III :— ప్రొఫెసర్ శ్రీ పి. సాంబమూర్తి (బి. ఏ; బి. యల్;)చే ఇంగ్లీషులో రచింపబడిన I-III భాగములుగల గ్రంథమునకు పేరు.

సౌధామిని :— 57 వ మేళకర్తయగు "సింహేంద్రమధ్యమము" జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ని స.
అవరోహణము- స ని ప మ గ స.

సౌమ్య :— "భావభట్టుని"చే పేర్కొన బడిన 22 శృతుల పద్ధతిలో 'ధైవతము'నకు గల 3 శృతులలో మొదటి శృతికిగల పేరు.

* సౌరసేన :—27వ మేళకర్తయగు 'సర సాంగి'కి వేంకటమఖి పెట్టిన పేరు.

సౌరాష్ట్రి :— ఇది సౌరాష్ట్రదేశమున జనించినట్లుగా తెలుపు రాగమునకు పేరు.

సౌరాష్ట్రము :— 15 వ మేళకర్తయగు "మాయామాళవగౌళ" జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ధ ని స.
అవరోహణము- స ని ధా ప మ గ మరిస.
శ్రీ త్యాగరాజుని "శ్రీగణపతిని" "ఎంతనుచువర్ణింతు" అను కృతులును, "నీనామరూపములకు" అను మంగళము, శ్రీ దీక్షితుల "వరలక్ష్మి"అను కృతియు, శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ యొక్క "నిన్నుజూచిధన్యుడనైతి" అను కృతియు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

సౌవీర :— గ్రామత్రయము నందుగల 21 మూర్ఛనలలో 8 వ మూర్ఛనకుగల పేరు. ఇది మధ్యమ గ్రామ మూర్ఛనలం 7 టిలో 1 వది యగును. ఇది 'మ' తో ప్రారంభమగును. అనగా "మ ప ధ ని స రి గ మ" యని తెలియదగును.

సౌవీరము :— 47 వ మేళకర్తయగు "సువర్ణాంగికి" వేంకటమఖిపెట్టినటువంటిపేరు.

హంకఘంటారవము :—20 వ మేళకర్త యగు "నఠభైరవి"యొక్క జన్యరాగము.
ఆరోహణము— సరిగమరిమపనిధనిపధనిస.
అవరోహణము సనిధనిపనిధమగరిగమరిగస

హంసకాంభోజి :— 14 వ మేళకర్తయగు "వకుళాభరణము"యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ రి స.

హంసకోసలి :— 70 వ మేళకర్తయగు "నాసికాభూషణి"యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.

హంసగంధర్వము :— 30 వ మేళకర్త యగు "నాగానందిని" జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ని ప మ రి స.

హంసగమని :— 52 వ మేళకర్తయగు "రామప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ స.
అవరోహణము— స ని ధ ప మధపమగరిస.
గాయకశిఖామణి శ్రీయుత్. ముత్తయ్యభాగవతర్ యొక్క "శ్రీ మహిషాసుర" అను ప్రసిద్ధ కృతి యీ రాగమునందే గలదు.

హంసగాంధారి :— 25 వ మేళకర్తయగు "మారరంజని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప ధ మ గ రి స.

హంసగిరి :— 72 వ మేళకర్తయగు "రసికప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప ధ ని ప మ గ స.

హంసగీర్వాణి :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

హంసఘంటాణము :— 35 వ మేళకర్త యగు "శూలిని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ప మ గ మ రి స.

హంసతాళము :— 'రత్నాకర' గ్రంథస్థమైన 120 దేశితాళములలో 96 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు ।। ◡.

హంసదీపకము :—23 వ మేళకర్తయగు "గౌరీమనోహరి"యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

హంసదీపరము :— 42 వ మేళకర్తయగు "రఘుప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ప స.
అవరోహణము— స ని ప ధ ని ప మగరిస.

హంసధ్వని :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ని స.
అవరోహణము— స ని ప గ రి స.
ఇదిఔడవరాగము. దీనిని శ్రీరామస్వామి దీక్షితులవారు కల్పించిన రాగముగా చెప్పుదురు. "జలజాక్షి"అను తానవర్ణము, త్యాగరాజాని "రఘునాయక" "శ్రీరఘు

"పులుమతిదుబుట్టి" అనునదియు, శ్రీ దీక్షితుని "వాతాపి గణపతింభజే" అనునదియు, శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ యొక్క "మనసుకరుగ" అనునదియు, శ్రీ పాపనాశశివన్ యొక్క "పరాశక్తి" అనునదియు, శ్రీ వీణకుప్పయ్యర్ యొక్క "వినాయకా నినువినాబ్రోచుటకు" అనునదియు ఈ రాగములోని ప్రసిద్ధరచనలగును.

హంసధ్వనిలో గ్రహస్వరభేదముచే యేర్పడు రాగము :— హంసధ్వని రాగములో ప-ను షడ్జముగ చేసి మొదటి స్వరస్థానములందే పాడినచో లేక వాయించినచో యేర్పడు 'నాగస్వరావళి' రాగము.

హంసనటని :— 18 వ మేళకర్తయగు "హాటకాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప స.
అవరోహణము— స ప మ గ రి స.
ఇది స్వరాంతర - ఔడవరాగమగును.

హంసనాదతాళము :— "అష్టోత్తరశత" తాళములగు 108 టిలో 31 వ తాళమునకు గలపేరు. దీనికి అంగములు I I 3 0 0 8. మాత్రలు 8. అక్షరకాలములు 32.

హంసనాదతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 30వ తాళము పేరు. దీనికి అంగములు I 3 0 0 3.

హంసనాదము :— 60 వ మేళకర్తయగు "నీతిమతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ రి స.
శ్రీ త్యాగరాజునిచే విరచితమైన "బంటురీతి కొలువియ్యవయ్య" అను ప్రసిద్ధ కృతి యీ రాగమునందే గలదు.

హంసనారాయణి :— 51 వ మేళకర్తయగు "కామవర్ధని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ప మ గ రి స.

హంసవిభోగి :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి మ గ స.

హంసనీలాంబరి :— 39 వ మేళకర్తయగు "ఝాలవరాళి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

హంసపంచమము :— 21 వ మేళకర్తయగు 'కీరవాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని ధ ని ప స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

హంసప్రభావళి :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ని స రి గ మ ప ధ ని.
అవరోహణము— ధ ప మ గ రి గ స.

హంసపాదము :— షడంగములలో 6 వదైన కాకపాదమునకుగల విశేషనామములలో 2 వ దానికి గలపేరు.

హంసభ్రమరి :— 58 వ మేళకర్తయగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

హంసభూపాలుడు :— "సంగీతరత్నాకరము"పై ఆంధ్ర భాషావ్యాఖ్యానము వ్రాసిన ఒక ప్రాచీన లక్షణకారుని పేరు.

హంసభోగి :— 38 వ మేళకర్తయగు "జలార్ణవము" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.

హంసరసాళి :— 41 వ మేళకర్తయగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

హంసలఘువు :— 7 అక్షరకాలములు గల "మిశ్రజాతిలఘువు"నకుగల పేరు.

హంసలీలతాళము :— "అష్టోత్తర శత" తాళములగు 108 టిలో 20 వ తాళము నకుగల పేరు. దీనికి అంగములు । । ◡. మాత్రలు 2¼. అక్షరకాలములు 9.

హంసలీలతాళము :— "రత్నాకర" గ్రంథస్థమైన 120 దేశితాళములలో 19 వ తాళము పేరు. దీనికి అంగములు । ◡ । ◡.

హంసలీలప్రబంధము :— "అష్టోత్తర శత" తాళములగు 108 టిలో 20 వ తాళము 'హంసలీల' యొక్క పేరుగల ఒక రక్తమైన ప్రబంధమునకు పేరు.

హంసవేళావళి :— 42 వ మేళకర్తయగు "రఘుప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ప ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

హంసశ్రేణి :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ ప ధ స.
అవరోహణము— స ని ప మ గ స.

హంసానంది :— 7 వ మేళకర్తయగు "సేనావతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ప మ గ రి స.

హంసానంది :— 53 వ మేళకర్తయగు "గమనశ్రమ" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.
'శ్రీస్వాతితిరునాళ్' యొక్క 'పాహిజగజ్జనని' అను కృతియు, శ్రీ ముత్తయ్య భాగవతర్ యొక్క "నీదుమహిమ" అను కృతియు, శ్రీ సుబ్రహ్మణ్య భారతి యొక్క "భారతదేశమెన్రు" అను కీర్తనయు, శ్రీ పురందరదాసుని యొక్క "కండేనా" అను కీర్తనయు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

హంసనిభోగి :— 29 వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి మ గ స.

*హనుమతోడి :— 8 వ మేళకర్తరాగము నకుగల పేరు. ఇది 2 వ 'నేత్ర' చక్రము లోని రెండవ మేళకర్తరాగమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ పంచమములుగాక శు. రి – షా. గాం – శు. మ – శు. ధై – కై. నిషాద స్వరములుండును.

హనుమతోడి :— 'హరికాంభోజి' రాగములో ధైవతమును షడ్జముగా చేసికొని అదే స్వరస్థానములందు వాయించిన లేక పాడిన యేర్పడు రాగము.

హనుమన్మతపురుషరాగములు :— భైరవము, కౌశికము, హిన్దోళము, దీపకము, శ్రీరాగము, మేఘరాగములు 6టికిగల పేరు.

హనోకహ :— 22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మరిగమరిస.

హమీర్ కల్యాణి :—65వ మేళకర్తయగు 'మేచకల్యాణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— { స రి గ మ ప ధ ని స. / స రి గమపధనిపధపస.
అవరోహణము— { స ని ధ ప మ గ రి స. / స ని ధ ప గ మ గరిస.
ఈ రాగములో స రి స ప మ ప ధ ని స, ధ ప స ని రి స— ప మ గ మ (దీర్ఘ శుద్ధ మధ్యమము) రి స ప ధ స అనునవి ముఖ్య ప్రయోగములగును. శ్రీ త్యాగరాజుని 'మానములేదా' అనుకృతియు, 'నీదాసానుదాసుడ' అను కృతియు, శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ యొక్క 'వేంకటశైలవిహార' అను కృతియు యీ రాగము లోని ప్రసిద్ధ రచనలగును.

హయ :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములోని 'చతురశ్రజాతి ఝంపె' తాళమునకుగల మరియొక పేరు. దీనికి అంగములు । ◡ 0. అక్షరకాలములు 7.

హయలీలప్రబంధము :— 'తురగలీల' అను పేరుగల ఒకరకమైన ప్రబంధమునకు 'హయలీలప్రబంధ' మని పేరు.

హర :— 'ఓరియంటల్ మ్యూజిక్' అను గ్రంథములో పేర్కొనిన 'సంకీర్ణజాతి రూపకతాళము' నకుగల మరియొక పేరు. దీనికి అంగములు 0 ।. అక్షరకాలములు 11.

హరనర్తన :— 35వ మేళకర్తరాగమగు 'శూలిని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ రి మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ధ ని మ గ రి గ స.

హర్షము :—భావములు 5 టిలో 4వదైన వ్యభిచారిభావములోని 33 విధములలో 15వ దానికి "హర్షము" అని పేరు.

హరికథాకాలక్షేపములందుపయోగించెడి వివిధ రచనలు :—ఆర్యలు, శ్లోకములు, పద్యములు, విరుట్టములు, అభంగలు, దోహరాలు, ఓవిలు, నామావళులు, ఖ్యాల్, లావని, సాకి, దిండి, పంచపది మొదలగు రచనలను హరికథలందు పాడుట కుపయోగింతురు.

*హరికాంభోజి :— 28వ మేళకర్తరాగమునకు గలపేరు. ఇది 5వ 'బాణ' చక్రములోని 4వ మేళకర్త రాగమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమ స్వరములుగాక చ.రి— అం. గాం— శు. మ— చ. ధై— కై. నిషాద స్వరములుండును. శ్రీ త్యాగరాజుని 'రామనన్ను బ్రోవరా' 'దినమణివంశ'

'ఎంతరానీతన' 'ఉండేదేరాముడొకడు' "ఎందుకునిర్దయ" అను కృతులు, శ్రీ దీక్షితుని 'ఆనందబాలాకృష్ణ' అను కృతియు, శ్రీ మైసూరు సదాశివరావు యొక్క 'సాకేతనగరనాథ' అను కృతియు యీ రాగములోని ప్రసిద్ధ రచనలగును.

*హరికేదారగౌళ :— 28 వ మేళకర్త యగు 'హరికాంభోజి'కి శ్రీ వేంకటమఖి పెట్టిన మరియొక పేరు.

హరికేశపుర :— సుప్రసిద్ధ గాయకశిఖామణియగు శ్రీయల్.ముత్తయ్యాభాగవతర్, రచించిన సంగీత రచనలందుగల ముద్రకు పేరు. ఈయన స్వగ్రామము తమిళదేశమునందుగల హరికేశనల్లూరు.

హరిచందనప్రియ :— 72 వ మేళకర్త యగు 'రసికప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

హరిణాశ్వము :— మధ్యమ గ్రామములోని 7 మూర్ఛనలలో 2 వ దాని పేరు. దీనికి 'గ' ప్రారంభస్వరము. అనగా 'గ మ ప ధ ని స రి గ' యగును.

హరిణాక్షి :— 70 వ మేళకర్త యగు 'నాసికాభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

హరిదాసస్వామి :— అక్బరు చక్రవర్తి కాలమునాటి గొప్పసంగీతవిద్వాంసుడును, "శ్రీ తాన్‌సేన్"(తన్సమిశ్రుడు) యొక్క గురువునగు యోగికిగల పేరు. ఈ మహనీయుని గానమువలన యెన్నియో విచిత్రములు జరిగియుండెనని ప్రతీతిగలదు.

హరినారాయణి :— 22 వ మేళకర్త యగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గా మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

హరిప్రియ :— 27 వ మేళకర్త యగు 'సరసాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

హరేణాపి :— 42 వ మేళకర్త యగు 'రఘుప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

హలముఖి :— 33 వ మేళకర్త యగు 'గాంగేయభూషణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

హసిత :— పురాతన గ్రంథస్థమైన 'ఆరోహిఅలంకార' జాతిలోని శాస్త్రీయమైన పేర్లలో 3 వ దాని పేరు. దీనికి ఉ॥ స రి రి గ గ గ మ మ మ మ పపపపప.

హస్తిని :— 37 వ మేళకర్త యగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ రి స.

హ్రస్వగతి :— 'శ్రీభావభట్టుని' చే విరచితమైన 'అనూపసంగీత విలాసము' అను

గ్రంథములోని 22 శృతులలో గాంధార శృతులలోని రెండవదానికి గలపేరు.

హ్రస్వతానము :— నాట, గౌళ, ఆరభి శ్రీ, వరాళి, మొదలగు ఘనరాగ తానములకు అడ్డువచ్చి వాటి ప్రాముఖ్యమును చెడగొట్టునటువంటి తానమునకుగల పేరు.

హ్రస్వము :— షడంగములలో 3 వదైన లఘువునకుగల విశేషనామములు 4 టిలో 3 వ దానికిగల పేరు.

హ్రస్వస్వరసాంకేతికము :— స్వరములు వ్రాయునపుడు వాటిప్రక్కన వుంచబడు కామాగుర్తు (,) కుగల పేరు. ఈ కామాపై చుక్కగల గుర్తు (;) వున్నచో దానిని "దీర్ఘస్వర సాంకేతిక"మనబడును.

# హా

హాటకాంగి :— 47 వ మేళకర్తయగు 'సువర్ణాంగి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

*హాటకాంబరి :— 18 వ మేళకర్తరాగమునకుగల పేరు. ఇది 3 వ "అగ్ని" చక్రములోని 6 వ మేళకర్తరాగమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ, పంచమములు గాక శు. రి— అం. గాం— శు. మ— ష. ధై— కా. నిషాదస్వరములుండును.

హారధారిణి :— 37 వ మేళకర్తయగు 'సాలగము' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

హారభూషణి :— 39 వ మేళకర్తయగు 'ఝాలవరాళి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ని స.
అవరోహణము— స ని ప మ గ స.

హార్పు :— ఇది యొకరకమునకుచెందిన సంగీతవాద్యమునకుగల పేరు.

హార్మొని (Harmony) :— స్వరములు ఒకటితో నొకటి యింపుగా చేరుటకుగల శబ్దవిశేషమునకు ఇంగ్లీషులోని పేరు.

హార్మొనికల్ మైనర్ స్కేల్ (Harmonical minor scale) :— కర్నాటక సంగీతములో "కీరవాణి" మేళకర్తను పోలిన పాశ్చాత్య సంగీతములోని ఒక మేళమునకుగల పేరు.

హార్మొనిక్సు :— 'సోమనాథుని' చే పేర్కొనబడిన స్వయంభూస్వరమునకు ఇంగ్లీషులోని పేరు. సంస్కృతములో దీనినే "అనురణనాత్మకధ్వని" యందురు.

హార్మొనియము :— త్రిస్థాయి లకు సరిపోలు గలిగినట్టి గాలి సంబంధమైన యూరపియన్ సంగీత వాద్యమునకుగల పేరు. ఇదియిప్పుడు భారత దేశమంతటను వాడబడుచున్నది. ఇది రెండువిధములు I.

శ్రుతి హార్మోనియము 2. సంగీతము ప్రదర్శించుటకు వీలుగల హార్మోనియము.

హాలాయుధప్రియ :— 44 వ మేళకర్తయగు 'భవప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ స.

హావవిలాసిని :— 69 వ మేళకర్తయగు 'ధాతువర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ రి స.

హాస్యము :— స్థాయీ భావము లోని 8 విధములలో 5వ దానికి హాస్యమని పేరు.

హాస్యరసము :— రాగ నవరసములగు 9 టిలో 5వ దానికి 'హాస్యరస' మని పేరు.

హ్రాదిని :— 64 వ మేళకర్తయగు 'వాచస్పతి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స గ మ ప ని స.
అవరోహణము– స ధ ప మ గ స.

హ్లాదమాన :— ప్రాచీన గ్రంథస్థమైన అలంకారములలో 'సంచారి అలంకార' జాతులలోని శాస్త్రయుక్తమైన 3 పేర్లలో 2 వ దాని పేరు. ఉ॥ స గ రి స – రి మ గ రి – గ ప మ గ – మ ధ ప మ అనునవి.

హ్లాది :— నారదుని "సంగీత మకరంద ము" లో పేర్కొనిన 'గాంధారము' నకుగల 2 శృతులలో 1 వ దానికిగల పేరు.

## హి

హిందుగంధారవము :—20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ధ ని ధ స.
అవరోహణము– స ని ధ ని ప ధ మ గ రి గ స.

హిందుదేశసంగీతము :— హిందు దేశములో నమలునందున్న సంగీత విధానము నకుగల పేరు. ఇది ప్రపంచములో కెల్లబహు పురాతనమైనదియై, విపులములగు రాగ, తాళ పద్ధతులచే బహు చమత్కారము లైన గమకముల నుపయోగించుటచే యితరదేశ సంగీతములన్నిటికంటెను యిది కడుపుత్తమమైనదిగా యెంచబడుచున్నది.

హిందుమ్యూజిక్ :—శ్రీ పి. రామచంద్ర రావు (బి. ఎ; బి. యల్.) చే ఇంగ్లీషులో వ్రాయబడిన ఒక చిన్న పుస్తకము.

హిందుస్థాని, కర్నాటకసంగీతములరెంటి లోను యొకటిగానేయుండురాగములు :— యమునాకల్యాణి, బెహాగ్, ఖమాసు, అఠాణా, కల్యాణి మొదలగు రాగములు యీరకమునకు చెందినవగును.

హిందుస్థానికాపి :—22వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి మ ప ని స.
అవరోహణము– స ని ధ ని ప మ గ రి స.
ఈ రాగమున ఆరోహణమునందు కాకలీ నిషాదము, "మ గ మ" అను సంచారమున అంతరగాంధారము "ని ధ ని" అను సంచారమున కైశికీ నిషాదము పలుకును.

హిందుస్థాని రాగములందు కీర్తనలరచించిన రచయిత :— తమిళ పండితుడగు

అనతాండవపురం శ్రీ 'గోపాలకృష్ణభారతి' అనేక హిందుస్థాని రాగములందు కీర్తనలు రచించుటచే గలిగిన పేరు.

హిందుస్థానిసంగీతపద్ధతి :— శ్రీ విష్ణునారాయణ భాత్ ఖండే' చే మరాటీ, హిందీ భాషలలో వ్రాయబడిన 7 భాగములుగల గ్రంథమునకు పేరు.

హిందుస్థానిసంగీతము :— ఉత్తరహిందుస్థానమునందు అమలునందున్నటువంటి సంగీత విధానమునకు గల పేరు.

హిందుస్థానిసంగీతము :— శ్రీ 'టి. రామచంద్రన్'చే వ్రాయబడిన యొక సంగీత గ్రంథమునకు గల పేరు.

హిందుస్థాని సంగీతమునుండి లభించిన పారిభాషికపదములు :— కోమల, తీవ్ర మొదలగు పదములు యీ రకమునకు చెందిన పారిభాషిక పదములగును.

హిందుస్థాని సంగీతమునుండి లభించిన రాగములు :— మాండ్, బెహాగ్, కాఫీ ఝంఝూటి, ఖమాన్ మొదలగు రాగములు యీరకమునకు చెందినవగును.

హిందుస్థాని సంగీత విభజనకాలము:— 'సంగీతమకరంద' గ్రంథకర్తయగునారదుని కాలమునందే యీవిభజన జరిగినట్లు తెలియుచున్నది గనుక నారదునికాలమగును.

హిందుస్థానిసంగీతశాస్త్రపరిశోధకులు:— ఆదిగురువగు శ్రీ పురందర విఠలుడు, శ్రీ గోపాలనాయకుడు మొదలగువారీరకమునకు చెందిన పరిశోధకులగుదురు.

హిందోళకన్నడ :— 31వ మేళకర్తయగు 'యాగప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ గ స.

హిందోళకాపి :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ స.

హిందోళదర్బారు :— 32 వ మేళకర్తయగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ రి స.
ఈరాగము స్వరాంతర-షాడవరాగమునకు చెందిన వుదాహరణమగును.

హిందోళదేశిక :— 10 వ మేళకర్తయగు 'నాటకప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స మ రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ప ని ధ మ గ రి స.

హిందోళదేశాక్షి :— 68 వ మేళకర్తయగు 'జ్యోతిస్వరూపిణి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ని స రి గ మ ప ధ.
అవరోహణము— ని ధ ప మ గ రి స.
ఇది నిషాదాంత్యరాగమునకు చెందును.

హిందోళనాయకి :— 33 వ మేళకర్తయగు 'గాంగేయభూషణి' జన్యరాగము.
ఆరోహణము— స మ గ మ ప స.
అవరోహణము— స ని ధ ప మ గ మ రి స.
ఇది వక్రస్వరాంతర — వక్రసంపూర్ణరాగమునకు చెందిన వుదాహరణయగును.

హిందోళమాళవి :— 33 వ మేళకర్త యగు 'గాంగేయభూషణి' జన్యరాగము.
ఆరోహణము— స మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ధ మ ప మ రి స.

హిందోళము :— 20 వ మేళకర్తయగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ స.
శ్రీ త్యాగరాజుని "సామజవరగమన" "మనసులోనిమర్మము" అను కృతులు, శ్రీ దీక్షితుని "నీరజాక్షి కామాక్షి" అను కృతియు, శ్రీ వేదనాయకంపిళ్ళై యొక్క "కరుణాలయే" అను కృతియు, శ్రీ స్వాతితిరునాళ్ యొక్క "పద్మనాభ పాహి" అను కృతియు, శ్రీ పురందరదాసుని "యారెరంగన" అను కీర్తనయు యీ రాగములోని సుప్రసిద్ధ రచనలగును.

హిందోళము :— శుద్ధసావేరి రాగములో ధైవతమును షడ్జముగ చేసి అదే స్వరస్థానములందు వాయించిన లేక పాడినచో యేర్పడునట్టి రాగము.

హిందోళవసంతము :— 20 వ మేళకర్త యగు 'నఠభైరవి' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ ని ధ స.
అవరోహణము— { స ని ధ ప మధమగస. / స ని ధ మ గ రి గ స.
శ్రీ త్యాగరాజుని "రారాసీతారమణీ" అను ప్రసిద్ధకృతి యీ రాగమునందేగలదు.

హిందోళసారంగ :— 32 వ మేళకర్త యగు 'రాగవర్ధని' యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప స ని స.
అవరోహణము— స ని ధ ప నిధమగమరిస.

హిందోళసావేరి :— 33 వ మేళకర్త యగు 'గాంగేయభూషణి' జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప మ ధ ని స.
అవరోహణము— స ని ప ధ మ రి స.

హితప్రియ :— 28 వ మేళకర్తయగు "హరికాంభోజి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ ని ప మ రిమగస.

హితభాషిణి :— 18 వ మేళకర్తయగు "హాటకాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ని ధ ని స.
అవరోహణము— స ని ప మ గ రి స.

హిమ్మవర్ధని :— 8 వ మేళకర్తయగు "హనుమతోడి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ప ని స.
అవరోహణము— స ని ధ ప మ ధ మగరిస.

హిమవాలుక :— 4 వ మేళకర్తయగు "వనస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

హిమాంగి :— 8 వ మేళకర్తయగు "హనుమతోడి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని ధ స.
అవరోహణము— స ని ప ధ మ గ రి స.

హీరధారిణి :— 64 వ మేళకర్తయగు "వాచస్పతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.

హ్రీదతాంతిని :— 50 వ మేళకర్తయగు "నామనారాయణి"యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ని ధ స.
అవరోహణము– స ని ధ ప మ గ స.

## హీ

హీంకారి :— 24 వ మేళకర్తయగు "వరుణప్రియ" యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప ధ స.
అవరోహణము– స ధ ప మ గ రి స.

హీన :— "ఓరియంటల్ మ్యూజిక్"అను ఇంగ్లీషులోని గ్రంథములో పేర్కొనబడిన కటపయాది సంఖ్యగల"త్రిశ్రజాతి మఠ్య తాళము"నకు గలపేరు. దీనికి అంగములు I 0 I. అక్షరకాలములు 8.

హీనస్వరము :— గంభీర నాదములేని గాయకునియొక్క కంఠధ్వనిని "హీన స్వరము" అని చెప్పబడును.

## హు

హుంపితము :— "జారు"అను గమకమును బోలియుండి ఆరోహణమునగాని అవరోహణమునగాని బయలుదేరినది మొదలు నిలుచువఱకు "హుం" అను విధమున నుండు "నాదము"నకు గలపేరు.

హుసేని :— 22 వ మేళకర్తయగు 'ఖరహరప్రియ' యొక్క జన్యరాగము.
ఆరోహణము– స రి గ మ ప మపనిధనిస.
అవరోహణము– స ని ధ ప మ గ రి స.
ఈరాగములో శ్రీ త్యాగరాజుని 'వినతా సుతరారా' 'సర్వలోక' 'రామాని న్నే' అను కృతులును, శ్రీ రామ్నాడ్ శ్రీనివాస అయ్యంగారి 'శ్రీరఘుకులనిధిం' అను కృతియు, క్షేత్రజ్ఞుని 'అలిగితే' 'భాగ్యమాయ' అను ప్రసిద్ధపదమును గలవు.

హృదయ :— పంచమ స్వరము యొక్క జన్మస్థానమైన పంచస్థానములలో 2 వ దానికి 'హృదయ' అనిపేరు.

హృదయోన్మలిని :— నారదుని 'సంగీత మకరందము' అను గ్రంథములో పేర్కొనిన 22 శృతులలో ధైవతమునకుగల 3 శృతులలో 3 వ దానికి గలపేరు.

హృష్యకము :— మధ్యమగ్రామములోని 7 మూర్ఛనలలో 7 వ మూర్ఛనకుగల పేరు. ఇది "ప" నుండి ప్రారంభమగును. అనగా "ప ధ ని స రి గ మ ప"అగును.

## హె

హెచ్చుధ్వని :— తారస్థాయికి సంబంధించినధ్వని లేక హెచ్చుగానుండు ధ్వనికిగల పేరు.

హెచ్చుస్థాయి :— త్రిస్థాయిలలోని 3 వ దైన తారస్థాయికిని, పంచస్థాయిలలో 5 వదైన అతితారస్థాయికినిగల పేరు.

హెచ్చుస్థాయివరుసలు :— త్రిస్థాయిలలో 3 వదైన హెచ్చుస్థాయియగు తారస్థాయిలోకూడ సంచారము లుండునట్లు తాళయుక్తముగా నేర్పఱచిన స్వరరచనలకుగలపేరు. ఇట్టి రచనలు 5 గలవు.

హెజ్జజ్జి :— 13 వ మేళకర్తయగు "గాయకప్రియ" యొక్క జన్యరాగము,
ఆరోహణము— స రి గ మ ప ధ స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇది షాడవ - సంపూర్ణమునకు చెందును.

# హే

హేమపింగళ :— 41 వ మేళకర్తయగు "పావని" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స ని స రి గ మ ని ధనిపస.
అవరోహణము— స ప మ గ రి స.

హేమప్రియ :— 58 వ మేళకర్తయగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

హేమభూషణి :— 33 వ మేళకర్తయగు "గాంగేయభూషణి" జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

హేమలత :— 60 వ మేళకర్తయగు "నీతిమతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

*హేమవతి :— 58 వ మేళకర్తరాగమునకుగల పేరు. ఇది 10 వ "దిశి" చక్రములోని 4 వ మేళకర్తరాగమగును.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ని ధ ప మ గ రి స.
ఇందు షడ్జ—చ. రి – సా. గాం – ప్ర. మ – పంచమ – చ. ధై – కై. నిషాదస్వరము లుండును. ఈ రాగములో ఆది తాళము నందు 'మంచిసమయమురా శ్రీరామయిది' అనునట్టి ఒక ప్రసిద్ధమైనకృతి గలదు.

హేమవాహిని :— 58 వ మేళకర్తయగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి ప మ ప ధ ని స.
అవరోహణము— స ధ ప మ గ స.

హేమాంగి :— 1 వ మేళకర్తయగు "కనకాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ గ రి స.

హేమాంబరి :— 55 వ మేళకర్తయగు "శ్యామలాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ధ స.
అవరోహణము— స ధ మ గ రి స.

హేమాంబరి :— 58 వ మేళకర్తయగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి గ మ ప ధ ని స.
అవరోహణము— స ప మ గ రి స.

హేరంభప్రియ :—66 వ మేళకర్తయగు "చిత్రాంబరి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.

హైమవతి :— 19వ మేళకర్తయగు "ఝంకారధ్వని" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి మ ప ని స.
అవరోహణము- స ని ప మ రి స.

హైయంగవీనము :— 40వ మేళకర్త యగు "నవనీతము" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ధ ని స.
అవరోహణము- స ని ధ మ గ రి స.

# హౌ

హౌన్నయ :— ప్రాచీన ప్రసిద్ధవాగ్గేయకారుడును, "చతుర్దండి ప్రకాశిక" గ్రంథకర్తయునగు శ్రీవెంకటమఖియొక్క గురువగు శ్రీతానప్పాచార్యుల, తండ్రిపేరు.

# క్ష

క్షణప్రభ :— 1వ మేళకర్తయగు "కనకాంగి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ స.

క్షణిక :— 8వ మేళకర్తయగు "హనుమతోడి" యొక్క జన్యరాగము.
ఆరోహణము- స గ మ ప ధ స.
అవరోహణము- స ధ ప మ గ స.

క్షణము :— 100 తామరరేకులుగల ఒక బొత్తిని సూదితో గ్రుచ్చునపుడు అందు ఒక తామరరేకు తెగుకాలమునకు "క్షణ" మని పేరు. ఇది సూక్ష్మకాలములు 6 టిలో మొదటిదియగును.

క్షపా :— 29వ మేళకర్తయగు "ధీరశంకరాభరణము" జన్యరాగము.
ఆరోహణము- స రి గ మ ప ని స.
అవరోహణము- స ని మ గ రి స.
ఇది షాడవ - ఔడవ రాగమగును.

# క్షా

క్షాంతి :— నారదుని "సంగీతమకరంద" మను గ్రంథములో పేర్కొనబడిన 22 శ్రుతులకుగల పేర్లలో "మధ్యమము" నకుగల 4 శ్రుతులలో 3వ దానికి 'క్షాంతి' అని పేరు.

# క్షి

క్షితి :— ద్వావింశతి శ్రుతులగు 22 టిలో 14వ శ్రుతియగు 'పంచమము'నకుగల పేరు.

# క్షీ

క్షీరాబ్ధిశాస్త్రి :— వేదాంత సంబంధమైన గాథలను కీర్తనలుగా రచించిన 'తిరువత్యేలి' వాస్తవ్యుడగు నొక ప్రాచీన రచయితయొక్క పేరు. ఈయనసంగీత, సాహిత్యములందు మిగుల సమర్థుడుగా తెలియుచున్నది. ఈయన బ్రాహ్మణుడు.

## క్షే

క్షేత్రజ్ఞులు :— 17 వ శతాబ్దమునకు చెందిన ప్రాచీన సుప్రసిద్ధ తెలుగుపద రచయితకుగల పేరు. ఇతడు తెలుగు బ్రాహ్మణుడు. నివాసము కృష్ణా జిల్లాలోని 'మొవ్వ' అను గ్రామము. గోపాలభక్తుడు. తన అపూర్వ పదరచనలచే శ్రీ గోపాలస్వామిని కీర్తించి దైవసాక్షాత్కారము నొందిన పుణ్యపురుషుడు. ఇతడు అపర నారాయణతీర్థులుగా నెంచబడెను.

క్షేత్రముద్ర :— సంగీత రచనలలోనుపయోగించెడి ద్వాదశ ముద్రలలో 8 వ ముద్రకు పేరు ఉ॥ తేవారమ్, తిరుప్పుగళ్ వంటి రచనలందు ఇట్టిముద్రలుండును.

క్షేత్రయ్యపదములు — శృంగార రసమంజరి :— సుప్రసిద్ధులైన 'శ్రీ విస్సా అప్పారావు' పంతులుచే సంకలనమైన యొక గ్రంథమునకు పేరు. ఇందు క్షేత్రయ్య పదములను, వాటికి సంబంధించిన అనేక ముఖ్య విషయములను వివరముగా పేర్కొనబడి యున్నది.

క్షేత్రియపదములు :— ప్రాచీన ఆంధ్ర వాగ్గేయకారుడైన శ్రీ "క్షేత్రజ్ఞుని"చే రచింపబడిన శృంగార రసప్రధానమగు 'సంగీత' రచనలకుపేరు. ఇవి 4000 వఱకు గలవు. వీటిలో తంజావూరు శ్రీ విజయ రాఘవనాయకుని కోరికపై రచింపబడిన విజయరాఘవపంచరత్నములవంటి అనేక పదములుకూడ చేరియున్నవి. ఇవి 'మువ్వ గోపాల' ముద్రను గలిగియుండును.

క్షేపిణి :— 12 వ మేళకర్తయగు "రూపవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స గ మ ప ధ స.
అవరోహణము— స ధ ప మ గ స.
ఇది ద్విస్వరవర్జ రాగమునకు చెందును.

క్షేమకరి :— 58 వ మేళకర్తయగు "హేమవతి" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.
ఇది ఉభయ — ఔడవరాగమునకు చెందునట్టి ప్రతిమధ్యమ రాగము.

## క్షో

క్షోణి :— 67 వ మేళకర్తయగు "సుచరిత్ర" యొక్క జన్యరాగము.
ఆరోహణము— స రి మ ధ ని స.
అవరోహణము— స ని ధ మ రి స.
ఇది ద్విస్వర వర్జరాగమునకు చెందును.

క్షోభిణి :— ద్వావింశతి శృతులగు 22 టిలో 22 వ శృతియగు "చ్యుతషడ్జ నిషాదము"నకుగల పేరు. ఇట్టి శృతిగల రాగములకు కల్యాణిరాగము, కురంజిరాగములు ముఖ్య వుదాహరణములగును.

సంపూర్ణము



సుప్రసిద్ధులగు

ప్రాచీన, నవీన వాగ్గేయకారులు,

గాయకులు, వాద్యకులు, రచయితలు.

అనుబంధము

## అ

*అంకయ్య :— నేటి ఆంధ్ర గాయకులలో మంచిపేరుగడించినట్టి సంగీతవిద్వాంసులలోనొకరు. ఈయన ప్రస్తుతము హైదరాబాదు ప్రభుత్వ సంగీతకళాశాలయందు గానకళాధ్యాపకులు గా నున్నారు.

అక్కిళ్‌స్వామి :— 19 వ శతాబ్దమునకు చెందిన సంస్కృత కీర్తనల రచయితయగు యతీంద్రుడు. ఈయన రచనలలో కల్యాణిరాగములోని 'తావకకరకమలే' యను కీర్తన సుప్రసిద్ధము. ఈయన నివాసము చిదంబరక్షేత్రమునకు సమీపమున గల 'కొల్లడము' అగ్రహారము.

అచ్యుతదాసర్ :—19 వ శతాబ్దపు చివర భాగమునకుచెందిన వేదాంతకీర్తనల రచయితయగు సుప్రసిద్ధ తమిళ విద్వాంసుడు. ఈయన కీర్తనలు 'అచ్యుతదాస' అను స్వనామ ముద్రను గలిగియుండును.

అచ్యుతనాయక్ :— క్రీ॥ శ॥ 1577–1614 కాలమునకుచెందిన తంజావూరు రెండవ మహారాజు. ఈయన సంగీతకళను అత్యధికముగా ప్రోత్సహించిన కళాపోషకుడు. తండ్రి శ్రీ చేవప్పనాయక మహారాజు. సంగీత విద్యానిపుణుడైన శ్రీ గోవిందదీక్షితులను ప్రధాన మంత్రి గా యేర్పఱచుకొని రాజ్యమేలెను.

*అచ్యుతరామశాస్త్రి (ఈమని) :— సుప్రసిద్ధ వైణికుడుగా పేరొంది యిటీవలనే మరణించిన ప్రముఖ సంగీత విద్వాంసుడు. 19–20 శతాబ్దములకుచెందినవాడు. ఆంధ్ర బ్రాహ్మణుడు. నివాసము ద్రాక్షారామము. ఈయన కుమారుడే నేటి ప్రసిద్ధ వైణికుడగు శ్రీ ఈమని శంకరశాస్త్రి యగును.

అడియార్కునల్లార్ :— 'శిలప్పదికారమ్' అను ప్రాచీన తమిళ గ్రంథమును వ్యాఖ్యానించినట్టి ఒక వ్యాఖ్యానకర్త. ఇతడు తమిళములో గొప్ప విద్వాంసుడు.

అణ్ణాక్కుట్టిఅయ్యర్ :— 18–19 శతాబ్దములకుచెందిన ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. ఇతడు శ్రీ శ్యామశాస్త్రిలకు సహచరుడును, మిత్రుడును యగును.

అణ్ణాచ్చిఅయ్యర్ :— క్రీ॥ శ॥ 1798–1832 కాలమునకుచెందిన తంజావూరు నేలిన శ్రీ శరభోజి మహారాజుయొక్క ఆస్థాన సంగీత విద్వాంసుడు. ఈయన గొప్ప గాయకుడు, వైణికుడగును.

అదిత్‌రామ్‌జీ (పండిత) :— 'సంగీత ఆదిత్య' అను గ్రంథమును రచించిన గుజరాత్ లోని ఒక ప్రాచీన ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. గొప్ప లక్షణకారుడు.

*అనంతకృష్ణశర్మ (రాళ్ళపల్లి) :— సంగీత సాహిత్యములలో విశేష పాండిత్యముగల సుప్రసిద్ధ విద్వాంసులు. వీరు మైసూరు యూనివర్సిటీలో చాలాకాలము పనిచేసి ప్రస్తుతము తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ నందు సంగీత కళాపరిశోధకులుగా పని చేయుచున్నారు. అతి ప్రాచీనమైన శ్రీ

అన్నమాచార్యుల సంకీర్తనములను ప్రచారములోనికి తెచ్చుటకు విశేషమగు కృషి చేయుచున్నారు. ఆంధ్ర వైష్ణవ బ్రాహ్మణులు. నివాసము తిరుపతిక్షేత్రము.

అనంతపద్మనాభగోస్వామి :— తంజావూరు శ్రీ శెరఫోజీ, శివాజీ మహారాజుల కాలమునకుచెందిన సుప్రసిద్ధ హరికథా కాలక్షేపకుడగు విద్వాంసుడు. ఈయన క్రీ॥ శ॥ 1837 లో తిరువాన్కూరు మహారాజగు శ్రీ స్వాతి తిరునాళ్ యొక్క సమక్షమున కాలక్షేపముచేసి 'కోకిలకంఠ' అను సార్థకమైన బిరుదునొందెను. ఈతనికి 'మేరుస్వామి' అను పేరుకూడగలదు.

అనంతరామభాగవతర్ :— క్రీ॥ శ॥ 1867–1919 కాలమునకుచెందిన సుప్రసిద్ధ గాయకుడు. మైసూరు ఆస్థాన సంగీత విద్వాంసుడు. ఈయన తమిళనాడులో పాలఘాట్ తాలూకా 'తొండికులమ్' అను గ్రామములో 27–10–1867 తేదీన జన్మించెను. క్రీ॥ శ॥ 1919 లో మరణించెను.

* అన్నమాచార్యులు (తాళ్ళపాక) :— క్రీ॥ శ॥ 1424–1503 కాలమునకుచెందిన సుప్రసిద్ధ రచయిత. ఆంధ్ర నందవరీక బ్రాహ్మణుడు. తిరుపతిలో నివశించెను. శ్రీ వేంకటేశ్వరుని భక్తుడు. 'సంకీర్తనాచార్య' 'ద్రావిడాగమసార్వభౌమ' అను ప్రఖ్యాత బిరుదులుగల ప్రసిద్ధుడు. శ్రీ వేంకటరమణునిపై ఈయన రచించిన భక్తిపూరితములగు సంకీర్తనములు షుమారు 20 వేలవరకు రాగిరేకులయందు లిఖింపబడి తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పరిషత్ మందిరమున నేటికిని గలవు. వీటిని తిరుపతి దేవస్థానమువారు విశేష వ్యయప్రయాసలతో ముద్రించుచున్నారు. ఈమహనీయుని వర్థంతిమహోత్సవములను ప్రతి సంవత్సరము ఫాల్గుణ బ ౧౨ లు మొదలు 3 దినములు దేవస్థానమువారు దిగువ తిరుపతియందు మహా వైభవముగా జరుపుచుందురు.

అన్నామలైరెడ్డియార్ :— తమిళములో 'కావడిచిందు'లను రచించిన సుప్రసిద్ధ డగు ప్రాచీన రచయిత. ఈయన రచనలందు స్వనామ ముద్రయుండును. వీటిలో కొన్నిరచనలు పల్లవి సంగీతమునందుగూడ నేడు పాడబడుచున్నవి.

అన్నాస్వామిశాస్త్రి :— క్రీ॥ శ॥ 1827–1900 కాలమునకుచెందిన ప్రసిద్ధగాయకుడు. గొప్ప వయొలినిష్టు. ఈయన అనేక కీర్తనలను రచించెను. జననము 7–4–1827. ఈయన శ్రీ శ్యామశాస్త్రికి మనుమడును, శ్రీ సుబ్బరాయశాస్త్రికి దత్తపుత్రుడును, శ్రీ పంజుశాస్త్రికి పుత్రుడును యగును.

అప్పయ్య (అఠాణా) :— తంజావూరు సంస్థానమునకుచెందిన ప్రముఖ విద్వాంసుడు. ఈయన అఠాణారాగాలాపనయందత్యద్భుతమైన ప్రతిభగలవా డగుటచే 'అఠాణా' అను రాగమునే బిరుదుగా నొందిన మహనీయుడు.

అప్పర్ :— తమిళములో 'తేవారమ్' రచనలనురచించిన ముగ్గురు సుప్రసిద్ధులలో నొకరు. ఈయనకు వాగీశ, వాచకాధిపతి, యను బిరుద నామములుకూడ గలవు.

*అప్పారావు (విస్సా) :— సంగీత, లక్ష్య లక్షణములందు విశేషముగు కృషి సలిపిన సుప్రసిద్ధ విద్యావేత్తలు. తెలుగులో "క్షేత్రయ్య పదములు, శృంగారరసమంజరి" అను ప్రసిద్ధ గ్రంథమునకు సంకలన కర్తలు. త్యాగరాజకీర్తనల 'సవ్యాఖ్యాన' మను గ్రంథమునకు సంపాదకులు. ఆంధ్ర నియోగిబ్రాహ్మణులు. నివాసము విశాఖ పట్టణము. ప్రస్తుతము ఆంధ్రా యూనివర్సిటీలో సంగీతశాఖాధికార సభా సభ్యులుగా నియమింపబడి యున్నారు.

అప్పాస్వామిఅయ్యర్ :— 19 వ శతాబ్దమునకు చెందినట్టి ప్రసిద్ధ గాయకుడు. ఈయన సుప్రసిద్ధ గాయకుడైన శ్రీ మహావైద్యనాథయ్యర్ కు సోదరుడగును.

అప్పుకుట్టిఅయ్యర్ :— 18 - 19 శతాబ్దములకు చెందిన గొప్ప సంగీతవిద్వాంసుడు. నాగపట్నము వాస్తవ్యుడు. ఈయన తన అద్వితీయ గానప్రతిభకు గర్వించి గాయకులందరిని సవాలు చేయుచుండగా గాయకులు శ్రీశ్యామశాస్త్రిని అనేకముగా ప్రార్థించి యితనితో పోటికి నిలిపిరి. శ్రీ శ్యామశాస్త్రిలు ఒక పల్లవిలోనే యితనిని ఓడించెను. వెంటనే యితడు మైసూరు సంస్థానమునకు వెడలిపోయి యచ్చటనే స్థిరపడి పోయెను.

అబ్రహామ్‌పండితర్ :— తమిళములో 'కరుణామృతసాగరమ్' అను గ్రంథమును రచించిన ప్రసిద్ధ గ్రంథకర్త. ఈగ్రంథము 1500 పుటలను గలిగిన రెండుభాగములుగ నుండి ప్రాచీన తమిళసంగీతమును గురించిన యనేక ముఖ్యవిషయములను గలిగి యున్నది. ఈయన గొప్ప లక్షణ విద్వాంసుడు ప్రభుత్వమువారిచే 'రావుసాహెబ్' అను బిరుదునుకూడ పొందియుండెను.

అబ్దుల్‌కరీమ్‌ఖాన్ :— కర్నాటక సంగీతమునందు విశేష కృషిచేసినట్టి సుప్రసిద్ధ హిందుస్థాని సంగీతవిద్వాంసుడు. మాధుర్యమైన గాత్రసంపదగల గాయకుడు. ఈయన మొదట మద్రాసునందు కొంత కాలము వుండి 'ఆర్యసంగీత విద్యాలయ' మును స్థాపించి అనేకమంది విద్యార్థులకు తగిన శిక్షణ యొసగెను.

అబ్దుల్‌హలీమ్‌జఫర్‌ఖాన్ :— 'సితార్' వాద్యమునందు విశేష ప్రావీణ్యము గలిగిన నేటి సుప్రసిద్ధ హిందుస్థాని సంగీత విద్వాంసుడు. ఉత్తరదేశీయుడు.

అభినవగుప్తుడు :— 11 వ శతాబ్దమునకు చెందిన కాశ్మీర బ్రాహ్మణుడు. గొప్ప లక్షణకారుడు. భరతుని నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానకర్త. నారదుడు తన 'సంగీత మకరంద'మను గ్రంథములో యీయనను 'మహామహేశ్వరాచార్యు' డని పేర్కొనెను.

అమరసింగ్‌మహారాజు :— క్రీ॥శ॥ 1788-1799 కాలమునకుచెందిన తంజావూరు సంస్థానాధీశ్వరుడు. ఈయన అనేకమంది వాగ్గేయకారులను తన ఆస్థానవిద్వాంసులుగా నియమించి పోషించిన మహారాజు.

అమృతలింగంపిళ్లె :— శ్రీ త్యాగరాజుని శిష్యకోటికి చెందిన యొక సుప్రసిద్ధ గాయకుడు. ఇతడు సంగీత లక్ష్య లక్షణములందు గొప్ప పండితుడు.

**అయ్యా :—** 19వ శతాబ్దమునకు చెందిన ప్రసిద్ధ గాయకుడు. సంస్కృతము, తెలుగు, తమిళ భాషలందు గొప్ప పండితుడు. ఇతడు ప్రఖ్యాత తమిళ, తెలుగు కీర్తనల రచయితయగు శ్రీ ఆనయ్యాకు సోదరుడు.

**అయ్యాభాగవతర్ :—** శ్రీ త్యాగరాజుని శిష్యకోటికి చెందిన గొప్ప విద్వాంసుడు. పల్లవిగాయకుడు. ప్రముఖ వయొలినిస్టు. ప్రసిద్ధ వైణికుడగును. తమిళ బ్రాహ్మణుడు.

**అయ్యాస్వామి :—** శ్రీ ముద్దుస్వామి దీక్షితుని శిష్యకోటికి చెందిన ప్రసిద్ధ విద్వాంసుడు. ఈయన తానవర్ణములను, పదములను రచించిన రచయిత యగును.

**అరబట్టనావలర్ :—** సంగీత నృత్యముల పై తమిళములో 'బరతశాస్త్రిరమ్' అను గ్రంథమును రచించిన ప్రఖ్యాత గ్రంథకర్త. ప్రాచీనుడైన గొప్ప లక్షణకారుడు.

**అరుంపదవురైయాసిరియర్ :—** 'శిలప్పదికారమ్' అను ప్రాచీన తమిళ గ్రంథ వ్యాఖ్యాతలలో సంగీత వ్యాఖ్యానకర్త యగు పండితుడు. ఇతడు 'అడియార్కునల్లార్' కంటె ముందువాడుగా తెలియుచున్నది.

**అరుణగిరినాథర్ :—** తమిళములో 'తిరుప్పుగళ్' రచనలను రచించిన ప్రఖ్యాత రచయిత. సంస్కృత, తమిళ భాషలందు గొప్ప పండితుడు. ఈయనకు 'చంద్రశావలప్పెరుమాన్' అను బిరుదుకలదు. ఈయన రచనలు 35, 175, 108 తాళము లందుగూడ గలవు. ఈ రచనలలో మోహనలోని 'ఏఱుమయిలు' అనునదియు, కురం జిల్లాలోని 'నాదవిందుకలాదీ' అనునదియు సుప్రసిద్ధములు. ఇతడు క్రీ॥ శ॥ 1422 - 1449 వఱకుగల శ్రీ విజయనగర ప్రౌఢ ప్రతాపదేవరాయలు చక్రవర్తి (II) కాలమునాటివాడుగా తెలియుచున్నది.

**అరుణాచలకవిరాయర్ :—** తమిళములో 'రామనాటకము'ను రచించిన ప్రఖ్యాత గ్రంథకర్త. సంస్కృత, తమిళములందు గొప్ప పండితుడు. ఇతడు క్రీ॥ శ॥ 1711-1788 కాలమునకు చెందినవాడు. తంజావూరుజిల్లా 'తిల్లైయాది' గ్రామవాస్తవ్యుడు. ఈయన రచనలలో మోహనరాగములోని 'ఏన్‌పళ్ళికొండీరయ్యా' అనునది ఒక ప్రసిద్ధ రచనయగును.

**అరుణాచలశాస్త్రి :—** శ్రీ త్యాగరాజుని తరువాతికాలమువాడైన ప్రసిద్ధ కృతికర్త. అరుణాచల, అరుణాద్రి, అరుణగిరి అను ముద్రలతో సంస్కృతమున అనేక కృతులను రచించెను. ఈయన రచనలలో బేగడలోని 'శివశంకరశంభో' అను కృతియును, హుసేనిలోని 'శ్రీమహాగణాధిపతి' అను కృతియును ప్రసిద్ధములుగా నున్నవి.

**అశ్వతితిరునాళ్ :—** క్రీ॥ శ॥ 1756-1788 కాలమునకుచెందిన తిరువాన్కూరు రాజకుమారుడు. అనేక కృతులను రచించిన ప్రముఖ విద్వాంసుడు. ఈ కృతులలో అనేకము నేటికిని అచ్చటి 'పద్మనాభస్వామి' సన్నిధియందు పాడబడుచున్నవి.

**అహోబలుడు :—** క్రీ॥ శ॥ 1650 లో 'సంగీత పారిజాతము' అను ప్రమాణ సంగీతలక్షణగ్రంథమును సంస్కృతమున

రచించిన సుప్రసిద్ధ గ్రంథకర్త. వీణ యొక్క తంత్రులపై స్వరముల విలువలను వివరించిన ప్రథమ సంగీత శాస్త్రవేత్త. ఈతని గ్రంథము హిందుస్థాని సంగీతము నందొక ముఖ్య గ్రంథమని చెప్పవచ్చును.

అళగనంబిపిళ్ళె :— 19-20 శతాబ్దము లకు చెందిన ప్రఖ్యాత మృదంగ విద్వాంసుడు. నివాసము కుంభకోణము. ప్రక్క వాద్యమునందతిసమర్థుడు. ఈయనకు 'అభినవనందికేశ్వర' అను బిరుదుగలదు.

అళగియచొక్కనాథర్ :— సుప్రసిద్ధ తమిళపదములను రచించిన ప్రఖ్యాత రచయితయైన ప్రాచీన విద్వాంసుడు. ఈయన నివాసము 'తిరునల్వేలి' జిల్లాకు చెందిన యొక గ్రామము.

అళత్తూరుసోదరులు :— ఇప్పటికాలము నగల సుప్రసిద్ధ గాయకశిఖామణాలలో విశేష ప్రఖ్యాతిగల గాయకులు. పల్లవి పాడుటయందు మిగుల సమర్థులు. తమిళ బ్రాహ్మణులు. వీరి సంగీత కచ్చేరీలు మిక్కిలి రక్తివంతముగా నుండును.

## ఆ

ఆత్మనాథభాగవతర్ :— 19వ శతాబ్దమునకుచెందిన ప్రసిద్ధగాయకుడు. త్రిస్థాయిలందు అనర్గళముగా పాడగల్గిన మాధుర్యమైన కంఠధ్వని గలవాడగుటచే 'వజ్రకంఠ' అను బిరుదుతో పిలువబడెను. ఇతడు 'ఆవడైయార్ కోవిల్' నందు భక్తిరస కీర్తనలను పాడుటకు నియమింపబడి యచ్చటనే జీవితము గడపెను.

*ఆదినారాయణదాసు :— భద్రాచల రామదాసు వంశమునకుచెందిన ప్రాచీనుడైన ప్రఖ్యాత కీర్తనల రచయిత. ఈయన రచనలు స్వనామ ముద్రగలిగి భక్తిరస యుతముగా నుండును. ఈయన మద్రాసులోగల 'మాంబళము' నందు నివశించెను.

ఆదిమూర్తిఅయ్యర్ :— క్రీ॥ శ॥ 1824-1865 కాలమునకుచెందిన తంజావూరు శివాజీ మహారాజుయొక్క ఆస్థాన విద్వాంసుడు. గొప్ప వైణికుడు. ఇతడు ప్రసిద్ధవాగ్గేయకారుడైన శ్రీ పల్లవి గోపాలయ్యర్ యొక్క కుమారుడగును.

ఆదియప్పయ్య (పచ్చిమిరియం) :— క్రీ॥ శ॥ 1730 లో జనించిన ఒక ప్రసిద్ధ ప్రాచీనవాగ్గేయకారుడు. కర్నాటకమధ్వ బ్రాహ్మణుడు. సంగీత, సంస్కృతములందు గొప్ప పండితుడు. తంజావూరు శ్రీ ప్రతాపసింహ (1741-1764) శ్రీ తులజాజీ (1765-1787) మహారాజుల ఆస్థాన సంగీత విద్వాంసుడు. రక్తి, దేశ్య రాగములందు 'శ్రీ వెంకటరమణ' ముద్రతో అనేక కృతులు, తానవర్ణములు రచించిన మహానుభావుడు. భైరవిరాగము, అటతాళములోని "విరిబోణి"అను వర్ణము ఈయన రచనలలోసుప్రసిద్ధమైనది. ఈయనకు"తానవర్ణమార్గదర్శి" అను ప్రఖ్యాత బిరుదుగలదు. ఈయన శిష్యులే శ్రీ శ్యామశాస్త్రిలు, శ్రీపల్లవిగోపాలయ్యర్, శ్రీ ఘనం కృష్ణయ్యర్ లగుదురు. మైసూరు శ్రీ వీణ శేషన్న ఈయన వంశములోని వాడనియే కొందరు చెప్పుదురు.

ఆదివాయిలర్ :— నృత్య, నటనలపై తమిళములో 'బరతసేనాపతీయ' మను ప్రశస్త గ్రంథమును రచించిన ప్రఖ్యాత గ్రంథకర్త. ఈ గ్రంథమును మద్రాసు కళాక్షేత్రమువారు ప్రచురించిరి.

ఆనందకుమారస్వామి :— సంగీత, నృత్యములను గురించి వ్రాసినఒక ప్రఖ్యాత వ్యాసరచయిత. ప్రసిద్ధ కళావిమర్శకుడు. ఈయన భారతీయ కళావిశిష్టతనుగురించి అమెరికా మొదలగు పాశ్చాత్యదేశములందు విశేషప్రచారమొనర్చిన మహనీయుడు.

*ఆనందగజపతి :— 10–2–1850 – 23–5–1897 కాలమునకుచెందిన విజయనగర సంస్థానాధీశ్వరుడు. ఈయన 1879 లో పరిపాలనకు వచ్చెను. సంగీత సాహిత్యములలో గొప్ప పండితుడు. కళాపోషకుడు. ఆంధ్ర దేశపు మహారాజులలో మిగుల విద్యావంతుడు. శ్రీ తచ్చూరు శింగరాచార్య సోదరులకు సంగీతగ్రంథముల ప్రకటనకై తగు ధనసహాయమొనర్చిన త్యాగనిరతుడు.

ఆనయ్య :— తంజావూరు శ్రీ శెర్ఫోజీ మహారాజుల ఆస్థాన విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. జననము 'వైయిచేరి' గ్రామము. సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుడు. 'ఉమాదాస' ముద్రతో తెలుగు, తమిళములందు అనేక కృతులను రచించిన ప్రసిద్ధుడు. ఈయన రచనలలో సావేరినామక్రియలోని 'ఇంతపరాకా' అను కృతియు, కేదారములోని 'భజనశాయవే' అను కృతియు, శంకరాభరణములోని 'మహిమ తెలియ తరమా' అను కృతియు, రీతిగౌళలోని 'పరాకేలబాలా' అను కృతియు సుప్రసిద్ధములు. ఈయన శిష్యుడే సుప్రసిద్ధ గాయకుడైన శ్రీ మహావైద్యనాథయ్యర్ అని చెప్పుదురు.

ఆనోఖీలాల్ :— తబలా వాద్యమునందు విశేషమగు ప్రావీణ్యముగడించిన నేటి సుప్రసిద్ధ లయ విద్వాంసుడు.

ఆయిల్యంతిరునాళ్ :— తిరువాన్కూరు సంస్థానాధీశ్వరులకు చెందినయొక గొప్ప విద్వాంసుడు. పల్లవిపాడుటయందతి సమర్థుడు. తన ఆస్థానమందు అనేకమంది గాయకులను ఆస్థానవిద్వాంసులుగా నేర్పఱచుకొని పోషించినప్రభువు. ఈయన కాలమందే శ్రీ మహావైద్యనాథయ్యర్ కును, శ్రీ కోయంబత్తూరు రాఘవయ్యర్ కును ఒక పోటీ జరిగినదని చెప్పుదురు.

ఆలీ అక్బరుఖాన్ (ఉస్తాద్) :— నేఁడు 'సరోద్' వాద్యమునందతి సమర్థతగల హిందుస్థాని సంగీత విద్వాంసుడు.

ఆళుడైయపిళ్ళైయార్ :— 'తేవార' రచయితలు ముగ్గురిలో నొకరైన శ్రీ 'తిరుజ్ఞాన సంబంధర్' కు గల మరియొక పేరు.

## క

కల్లీనాధుడు :— 'సంగీతరత్నాకరము' పై 'కలానిధి' అను వ్యాఖ్యాన గ్రంథమును వ్రాసిన గొప్ప పండితుడు. క్రీ॥ శ॥ 1475–1553 కాలమునకు చెందినవాడు. 'చతుర కల్లీనాధు' డను మరియొక పేరుకూడ గలదు. 'అభినవ భరతాచార్య' డను బిరుదునొందెను. విద్యానగర మేలిన ఇమ్మడి దేవరాయల యొక్క ఆస్థాన పండితుడు.

కవికుంజరభారతి :— క్రీ॥ శ॥ 1810 - 1896 కాలమునకు జెందిన శివగంగ, రామ్నాడ్ రాజుల ఆస్థాన పండితుడు. అనేక శాస్త్రములను చదివెను. స్కాంద పురాణ కీర్తనలు యీతని ముఖ్యరచనలు. 'కందునిచరిత్రము'నునాటకముగ వ్రాసెను.

కవిమాతృభూతయ్య :— 'త్రిశిరగిరి' ముద్రతో శ్రీ సుగంధి కుంతలాంబాంకిత కీర్తనలు, పదములు రచించిన సుప్రసిద్ధ విద్వాంసుడు. ఆనంద భైరవిరాగము, ఆది తాళములోని 'నీమదిచల్లగ' అనుకృతి యీతని ప్రసిద్ధరచనలలో నొకటియగును. ఒకనాడితడు దేవిని, తన లేమినిగూర్చి 'కాశికప్పణమీవలనమ్మ' అని కీర్తింప, నారాత్రి స్వప్నమున దేవిసాక్షాత్కరించి నాభక్తుడగు ప్రతాపసింహుని వలన నీ లేమి దీరునని చెప్పి ఆదేరాత్రి ప్రతాపసింహునికి స్వప్నమున ఆదేశించెను. వెంటనే మహారాజు మాతృభూతయ్యను రావించి పదివేలరూపాయలిచ్చి సన్మానించెను. ఇతడు త్రైలింగ్య బ్రాహ్మణుడు. నివాసము తిరుచునాపల్లి.

## కా

కాచిశాస్త్రి (కంచి) :— 'శ్రీ సుబ్బరాయ శాస్త్రి' యొక్క శిష్యుడును, అల్లుడునగు నొక ప్రసిద్ధ గాయకుడు. ఈయనకు 'కంచి కాచిశాస్త్రి' యను మరియొక పేరుకూడ గలదు. 19 వ శతాబ్దమునకు చెందినవాడు.

*కామరాజు :— ప్రాచీనుడైన సుప్రసిద్ధ వయొలిన్ విద్వాంసుడు. లయలోను, అభినయములోను అతిసమర్థుడు. ఆంధ్రుడు. ఉత్తరసర్కారులకు చెందినవాడు.

*కామేశ్వరరావు (భమిడిపాటి) :—'త్యాగరాజు ఆత్మవిచారము' అను గ్రంథమును రచించిన నేటి గొప్ప సాహిత్య పండితుడు. ఈయనకు ఆంగ్లభాషలోకూడ ప్రావీణ్యముగలదు. తెలుగు బ్రాహ్మణుడు. నివాసము తూర్పు గోదావరి జిల్లా.

## కు

కుంభకర్ణనరేంద్ర :— 'అభినవ భరతాచార్య' దను బిరుదుగల ప్రాచీన లక్షణకారుడు. ఇతడు 'సంగీతరత్నాకరము'పై సంస్కృతవ్యాఖ్యానగ్రంథమును వ్రాసెను.

కుప్పయ్యర్ (వీణ) :— శ్రీత్యాగరాజుని ప్రియశిష్యుడు. సామవేది బ్రాహ్మణుడు. నివాసము తిరువొత్తియూరు. వయొలిన్ వాద్యమునందుమిక్కిలి ప్రతిభగలవాడు. కోవూరు సంస్థాన విద్వాంసుడు. 'గోపాలదాస' ముద్రతో అనేక కృతులు, తిల్లానాలు, తానవర్ణములు రచించెను. 'గానచక్రవర్తి' అను బిరుదునొందెను. నారాయణగౌళ రాగాలాపనలో ఈయనకుగల అద్భుత ప్రజ్ఞావిశేషమునకు నారాయణగౌళ కుప్పయ్యర్ అని పిలువబడెను. ఆనందభైరవిలోని 'కనికరము లేక పోయెనే' కాంభోజిలోని 'కొనియాడిన' అనునవి యీతని ప్రసిద్ధ రచనలగును. 'పల్లవిస్వరకల్పవల్లి' అను గ్రంథము యీయన కృషివల్లనే కుమారుడు త్యాగయ్యర్ ప్రకటించెనని చెప్పుదురు.

కుప్పుస్వామయ్య :—శ్రీ శ్యామశాస్త్రి సమకాలికుడగు సుప్రసిద్ధ విద్వాంసుడు. 'వరదవెంకట'ముద్రతో ఈయన అనేక కృతులను, పదములను రచించెను.

*కుమారస్వామి (చదలవాడ) :— ఆంధ్ర దేశములో వయొలిన్, మృదంగవాద్యము లలో విశేష ప్రావీణ్యము సంపాదించి అకాలమరణము నొందిన ప్రసిద్ధ వాద్యకుడు. ఆంధ్రుడు. గుంటూరు వాస్తవ్యుడు.

కృష్ణన్ (టి. యన్) :— నేటి యువకులలో మిక్కిలి అభివృద్ధికి వచ్చిన ప్రసిద్ధ వయొలిన్ విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. నివాసము మద్రాసు.

కృష్ణప్ప (బిడారం) :— మైసూరు సంస్థానమునకు చెందిన ప్రఖ్యాత గాయకుడు. కర్నాటక బ్రాహ్మణుడు. రామభక్తుడు. విశేష వ్యయ ప్రయాసలతో ఒక గొప్ప రామమందిరమును మైసూరునందు నిర్మించి తన జీవితమును సార్థకముచేసికొని మరణించిన పుణ్యపురుషుడు. ఈయన శిష్యుడే మైసూరు శ్రీ టి. చౌడయ్య యగును.

కృష్ణభాగవతర్ (తంజావూరు) :— క్రీ॥ శ॥ 1847 – 1903 కాలమునకు చెందిన సుప్రసిద్ధ హరికథా కాలక్షేపకుడు. ఈయన 'నందనార్' చరిత్రమును అత్యద్భుతముగా కాలక్షేపము జేయువాడని చెప్పుదురు. 'హరికథాకాలక్షేప జనకు' డను బిరుదుతో ప్రఖ్యాతి నొందెను.

*కృష్ణమూర్తి (నేదనూరు) :— నేటియువకులలో మిక్కిలి అభివృద్ధికివచ్చిన ప్రసిద్ధ గాయకుడు. ఆంధ్ర బ్రాహ్మణుడు. మాధుర్యమైన గాత్రసౌష్టవము గలవాడు.

*కృష్ణమూర్తి (వాసా) :— బొబ్బిలి సంస్థాన వైణికవిద్వాంసుడు. గమకమార్గములందతిసమర్థుడుగా పేరొందినప్రాచీనుడు.

కృష్ణమూర్తిశాస్త్రి (బూదలూరు) :— గోటువాద్యములో అసమాన ఖ్యాతినార్జించిన నేటి ప్రముఖవిద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. వయోవృద్ధుడు.

*కృష్ణయ్య (నిరాఘాటం) :— ప్రాచీన ఆంధ్ర గాయకులలో మిక్కిలి పేరుగల విద్వాంసుడు. ఈయన విజయనగర ప్రాంతము వాడుగా తెలియుచున్నది.

కృష్ణయ్య (వీణ) :— శ్రీ పచ్చిమిరియం ఆదియప్పయ్య కుమారుడు. వైణికశ్రేష్టుడు. మైసూరు, విజయనగరం, కొత్తపేట సంస్థానాధిపతులమీద 'సప్తతాళేశ్వరమ్' అను ప్రబంధమును రచించి ఆ ప్రబంధ మాతువులలో ఆయా రాజుల నామాక్షరములందొక్కొక్క యక్షరము నిమిడ్చిన మహనీయుడు. లక్ష్య లక్షణములందు సమర్థుడు. కర్నాటకమధ్వబ్రాహ్మణుడు.

కృష్ణయ్యర్ (కున్నకుడి) :— రామ్నాడ్ రాజావద్దనున్న ఆస్థాన సంగీత విద్వాంసుడు. ఈయన కృతులు, తిల్లానాలు అనేకము రచించెను. తమిళ బ్రాహ్మణుడు.

కృష్ణయ్యర్ (ఘనమ్) :— 'ఉదయర్ పలాయము' రాజగు 'శ్రీయువరంగభూపతి' యొక్క ఆస్థాన సంగీత విద్వాంసుడు. తమిళబ్రాహ్మణుడు. శృంగారరసప్రధానమగు పదములు రచించుటలో మిగుల సమర్థుడు. గొప్ప పల్లవి పాటకుడు. 'బొబ్బిలి కేశవయ్య' వద్ద కొన్ని సంగీత విషయములు నేర్చుకొనెను. శ్రీ త్యాగరాజు ఈతని గానమువిని మెచ్చుకొనెను.

కృష్ణయ్యర్ (చల్లగాలి) :—క్రీ॥శ॥ 1833–1855 కాలమునకుచెందిన తంజావూరు శ్రీ శివాజీమహారాజు ఆస్థాన విద్వాంసుడు. గొప్ప గాయకుడు. ప్రసిద్ధ వైణికుడు. తమిళ బ్రాహ్మణుడు.

కృష్ణయ్యర్ (తిరుక్కొడికావల్):—19–20 శతాబ్దములకుచెంది అసమాన ఖ్యాతి నార్జించిన సుప్రసిద్ధ వయొలిన్ విద్వాంసుడు. ఈయన ఒక్క తంతిమీదనే త్రిస్థాయిలు అనర్గళముగా వాయించగల అద్భుత సాధకుడని గొప్ప ప్రతీతిగలదు. తమిళ బ్రాహ్మణుడు.

కృష్ణయ్యర్ (స్వరబత్) :—‘స్వరబత్’ వాద్యములో విశేష ప్రావీణ్యముగలిగిన ప్రాచీన సంగీత విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు.

కృష్ణస్వామి (టి. యస్.) :— ధ్వనిని గురించి విశేషముగ కృషిచేసి ‘సౌండ్’ అను గ్రంథమును ఇంగ్లీషులో వ్రాసిన సుప్రసిద్ధ సంగీత శాస్త్రకారుడు.

## కూ

*కూవన స్వామయ్య(కార్వేటినగర్) :—17 వ శతాబ్దమునకుచెందిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. తెలుగు బ్రాహ్మణుడు. నవరోజు, మోహన, కేదారగౌళ, నాటకురంజి రాగములలోని తానవర్ణములు ఈతని ప్రసిద్ధ రచనలగును.

## కే

*కేశవయ్య (బొబ్బిలి) :— బొబ్బిలి సంస్థాన సంగీత విద్వాంసుడు. ఆంధ్ర సాతాను వైష్ణవుడు ‘భూలోకచాపచుట్టి’ అను ప్రసిద్ధ బిరుదుతో అనేక సంస్థానములకువెళ్ళి సవాలుచేసెను. త్యాగరాజు ఈతని గానమును వినెను. ఒకసారి ఈయన తంజావూరులో శ్రీ శ్యామశాస్త్రి తోకూడ పోటీచేసినట్లు చెప్పుదురు.

*కేశవరావు (మారెళ్ళ) :— నేటి యువకులలో మిక్కిలి అభివృద్ధికివచ్చిన వయొలిన్ విద్వాంసుడు. అంధుడు. ఆంధ్ర బ్రాహ్మణుడు. సంగీత కళానిధి శ్రీ ‘ద్వారంవేంకటస్వామినాయుడు’యొక్క ప్రముఖ శిష్యకోటికి చెందినవాడు.

## కో

కోటేశ్వరయ్యర్ :— సుప్రసిద్ధ కీర్తనల రచయితయగు ప్రాచీన విద్వాంసుడు. ఈయన రచనలలో దర్బారురాగములోని ‘శ్రీవేణుగోపాల’అనుకీర్తనయు, ధన్యాసి రాగములోని “కృపైపారయ్య”అను కీర్తనయు సుప్రసిద్ధములు.

## గ

గంగూలీబాయ్ :— హిందుస్థాని సంగీతమునం దసమాన కీర్తిగడించిన నేటి ప్రఖ్యాత గాయకురాలు. ఈమె గానము అతి మాధుర్యముగనుండును.

గణేశయ్యర్ :—శ్రీ త్యాగరాజుని శిష్యకోటికిచెందిన ఒక ప్రసిద్ధ గాయకుడు. 18–19 శతాబ్దములకు చెందినవాడు.

## గి

*గిర్మాజీరావు (కె. వి. యస్. యమ్.) :—“ఆంధ్ర సంగీతశాస్త్రము” అను గ్రంథ

ముసు తెలుగులో రచించిన ఒక గ్రంథకర్త. నివాసము గుత్తి. ఆంధ్ర బ్రాహ్మణుడు.

గిరిజాదేవి :— హిందుస్థాని సంగీతము నందు విశేష ప్రావీణ్యము గడించిన నేటి సుప్రసిద్ధ గాయకురాలు.

*గిరిరాజకవి :— క్రీ॥శ॥ 1684 - 1711 కాలమునకు చెందినట్టి శ్రీషహాజీమహారాజు సంస్థానమున బహు సత్కారములనొందిన సుప్రసిద్ధ తెలుగు విద్వాంసుడు. తెలుగు, సంస్కృతములలో గొప్ప పండితుడు. తెలుగులో వేదాంత సంబంధమగు భక్తి రసకీర్తనలను రచించిన మహనీయుడు. ఈయన శ్రీ త్యాగరాజునికి తాతయగును.

# గు

*గురుమూర్తిశాస్త్రి (పైడాల) :— 18 వ శతాబ్దమునకు చెందిన చతుశాస్త్ర పండితుడు. తెలుగు మురికినాటి బ్రాహ్మణుడు. సంగీతమునందతిసమర్థుడు. స్వనామముద్రతో అనేక గీత, లక్షణగీత, ప్రబంధ, కీర్తనాదుల రచించిన ఘనుడు. ఈయన గీతములు 1000 వఱకునుండుటచే 'వేయి గీత' అను బిరుదునొందెను. ఈయన చిన్నతనమందే 'శ్రీ మణలి చిన్నయ్యా ముదలియార్'చే బహు సన్మానముల నొందిన గొప్ప పండితుడు.

*గురురాయాచార్యులు :— విజయనగర సంస్థాన విద్వాంసుడగు గొప్ప పండితుడు. ప్రాచీన ఆంధ్ర వైణికుడు. ఘన, నయ, దేశ్యములం దతిసమర్థుడు. అనేక తాన వర్ణములు, స్వరజతులు, జక్కిణదరువులు, స్వరపల్లవులు, శబ్దపల్లవులు, గీతములను రచించిన ప్రతిభాశాలి. వీణయందు షట్కాలములు వాయించగల ఘనుడు. మహారాజుచే ఛత్ర, చామరాది బహుమానము లొందినవాడు. ఈయన కుమారుడే వైణిక శ్రేష్టుడగు శ్రీ 'శీతారామప్ప' యగును.

*గురురాయాచార్యులు :— వైణిక శ్రేష్టులైన శ్రీ శీతారామప్పగారి కుమారుడు. తాతగారివలె గొప్ప ప్రఖ్యాతినొందిరి. వీరి కుమారుడే ప్రసిద్ధ వైణికశిఖామణి యగు కీ॥శే॥ లైన శ్రీ వీణ వెంకటరమణదాసు అని చెప్పుదురు.

# గో

గోపాలకృష్ణన్ (ఆర్. యస్.) :— నేటి యువకులలో మిక్కిలి అభివృద్ధికివచ్చిన వయొలిన్ విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. సంగీత విద్వాన్ శ్రీ పరూరు సుందరమయ్యర్ కుమారుడు.

గోపాలకృష్ణభారతి :— క్రీ॥ శ॥ 1811 - 1881 కాలమునకు చెందిన సుప్రసిద్ధ తమిళకవి, గొప్ప వైణికుడు. ఆజన్మ బ్రహ్మచారి. 'నందనార్' చరిత్రము నాటకముగ వ్రాసి ప్రదర్శింపజేసెను. ఈతని రచనలందు 'గోపాలకృష్ణ' ముద్ర యుండును. ఈయన రచనలలో ధన్యాసిలోని 'కనకసభాపతి' జగన్మోహినిలోని 'శివకామసుందరి' అనునవి ప్రసిద్ధ రచనలగును.

గోపాలయ్యర్ (పల్లవి) :— క్రీ॥శ॥ 1788 - 1832 కాలమునకు చెందిన శ్రీ తంజావూరు అమరశింగ్, శరభోజీమహారాజుల ఆస్థాన విద్వాంసుడు. ద్రావిడ బ్రాహ్మణులలో

పౌత్రుడు. సంగీతము, సంస్కృతము, తెలుగు, తమిళములందు గొప్ప పండితుడు. అనేక కీర్తనలు, వర్ణములు 'వేంకట' ముద్రతో రచించెను. ఈతని రచనలలో తోడిలోని 'అంబనాదు' అను కృతియు, 'కనకాంగి' అను అటతాళవర్ణము, కల్యాణిలోని 'వనజాక్షి' అను అటతాళవర్ణమును సుప్రసిద్ధములు. గొప్ప పల్లవిపాటకు డగుటచే 'పల్లవి' అను బిరుదునొందెను.

గోవిందదీక్షితర్ :—తంజావూరు సంస్థాన ప్రధానమంత్రియగు సుప్రసిద్ధ విద్వాంసుడు. అనేక లక్షణగీతములు వ్రాసెను. శ్రీ రఘునాథ భూపాలాంకితముగా 'సంగీత సుధానిధి' అను గ్రంథమునొకటి వ్రాసినట్లు చెప్పుదురు. కాని ఈ గ్రంథ మెచ్చటను కనుపడుటలేదు. సంగీతసాహిత్య విద్వాంసుడు. కర్ణాటక స్మార్త బ్రాహ్మణుడు. ఈయన కుమారుడే 'చతుర్దండిప్రకాశిక' గ్రంథకర్తయగు శ్రీ 'వెంకటమఖి' యగును.

గోవిందమారార్ (పట్టాల) :—పల్లవిని ఆఱుకాలములందు సునాయాసముగా పాడగల గొప్ప విద్వాంసుడు. ఈతడు శ్రీత్యాగరాజునుదర్శించి ఆయనఆశీర్వాదములను బడసెను. ఈయన తంబురకు 7 తంత్రులుండు ననియు, అందు 3 మధ్య షడ్జములుగను, 3 మంద్రపంచమములుగను, 1 మంద్రషడ్జముగను శ్రుతిచేయబడునని చెప్పుదురు.

గోవిందరాజపిళ్ళె (మాయవరం) :—నేటి ప్రసిద్ధ వయొలినిస్టులలో నొకరుగా పేరుగడించిన వయొలిన్ విద్వాంసుడు.

గోవిందశివన్ :—శ్రీ త్యాగరాజుని శిష్యకోటికి చెందిన ఒక ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. మధ్యార్జునమ్ శ్రీ దుర్గాస్వామయ్యర్ యొక్క కుమారుడు. తమిళ బ్రాహ్మణుడు.

*గోవిందస్వామయ్య (కార్వేటినగర్) :—17 వ శతాబ్దమునకు చెందిన కార్వేటినగర సంస్థాన విద్వాంసుడు. తెలుగు బ్రాహ్మణుడు. అనేకపదములు తెలుగున రచించిన గొప్ప సమర్థుడు.

గోవిందస్వామినాయకర్ (మద్రాసు) :—నేటి ప్రసిద్ధ వయొలినిస్టులలో నొకరుగా పేరుపొందిన వయొలిన్ విద్వాంసుడు.

గోవిందస్వామిపిళ్ళె :—19-20 శతాబ్దములకుచెంది, వయొలిన్ వాద్యములో అఖండకీర్తిగడించిన సుప్రసిద్ధ విద్వాంసుడు. నివాసము తిరుచినాపల్లి. ఈయన శిష్యుడే ప్రసిద్ధుడైన తెలుగు వయొలినిస్టు అగు శ్రీ కె. యస్. వెంకట్రామయ్య (పాప) యగును.

గోవిందాచార్యులు :—"సంగ్రహ చూడామణి" అను గ్రంథమును తెలుగులో రచించిన ప్రఖ్యాత ప్రాచీన గ్రంథకర్త. కనకాంగి, రత్నాంగి, గానమూర్తి అను 72 మేళకర్తలపేర్లను యీ మహనీయుడే యేర్పఱచెనని తెలియుచున్నది.

*గోవిందామాత్యులు :— సంగీతశాస్త్రమును ఆంధ్రభాషలో పద్యకావ్యముగా రచించిన మహనీయుడు. తెలుగు ఆరువేల

నియోగి బ్రాహ్మణుడు. ఈయన శ్రీ 'వేంకటమఖి'కి ముందువాడని చెప్పుదురు.

## ఘం

*ఘంటయ్యశాస్త్రి (వారణాశి) :— ఆంధ్ర దేశములోని నేటి సుప్రసిద్ధ మృదంగ విద్వాంసులలో నొకరుగా కీర్తిగడించిన పండితుడు. ప్రక్క వాద్యమునందు మంచి నైపుణ్యముగలదు. ఈయన శ్రీ కుంభకోణం కోదండరామయ్యర్ వద్ద కొంతకాలము శిక్షణపొందెను. వారణాశి సోదరులలో రెండవవారు. మొదటివారు సుప్రసిద్ధులగు శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిలు.

## చ

చండీదాసు :— 15 వ శతాబ్దమునకు చెందినట్టియు, భక్తిరస కీర్తనలను రచించిన యొక ప్రసిద్ధ రచయిత. ఈయన కీర్తనలు రాధాకృష్ణ ప్రేమతత్వమునకు సంబంధించి యుండును. ఇతడు ఉత్తర దేశీయుడని తెలియు చున్నది.

చంద్రశేఖరసరస్వతి :— 18 వ శతాబ్దములోని కామకోటి పీఠమునకు చెందిన 62 వ పీఠాధిపతి యగు యతీంద్రుడు. శివాష్టపది, శివగీతమాలా అను గ్రంథములను రచించిన గ్రంథకర్త. ఈయన రచించిన శివాష్టపదులలో 20 రచనల వఱకు శ్రీ జయదేవుని అష్టపదుల ననుసరించి కర్నాటక సంగీతములోని రాగ తాళములందు రచింపబడినవై యున్నవి.

## చి

చిట్టిబాబునాయుడు :— 'కీటు హిందు మ్యూజిక్' అను ప్రశస్తమైన సంగీతగ్రంథము ను ఇంగ్లీషులో వ్రాసి ప్రకటించినట్టి ఒక సుప్రసిద్ధ గ్రంథకర్త.

చిట్టివైద్యనాథయ్యర్ :— వయొలిన్, మృదంగవాద్యములందు అత్యద్భుత ప్రావీణ్యము గలిగిన ఒక ప్రాచీన విద్వాంసుడు. ప్రక్కవాద్యమునందు విశేష అనుభవము గలవాడు. ఈయన తంజావూరు జిల్లాలోని 'అరంతాంగి' వాస్తవ్యుడని చెప్పుదురు.

చిట్టివెంకటస్వామయ్య :— నాగపట్నమునకు చెందిన ప్రసిద్ధ వేణువాద్యకుడు. ప్రాచీన సంప్రదాయ విద్వాంసుడు.

చిదంబరం (యన్. యస్.) :— తమిళములో కీర్తనలు రచించిన సుప్రసిద్ధ రచయిత. ఈయన రచనలలో 'కోకిలప్రియ' రాగములోని 'పాడుంగీతం' అనునది ఒక సుప్రసిద్ధ రచనయగును.

చిదంబరనాథయోగి :— 18 వ శతాబ్దమునకు చెందిన యతీంద్రుడు. శ్రీ రామస్వామి దీక్షితులకు శ్రీ విద్యామంత్రోపదేశ మొనర్చిన మహనీయుడు. శ్రీ రామస్వామిదీక్షితుని కుమారుడగు శ్రీ ముద్దుస్వామి దీక్షితుని వెంటనిడుకొని కాశీకి వెళ్ళి 5 సంవత్సరములు ఆ కాశీక్షేత్రమం దుంచుకొని శ్రీ విద్యారహస్యముల నేర్పి మంత్రసిద్ధి నొందించి పంపిన మహానుభావుడు. ఈయన సమాధి కాశీలో హనుమాన్‌ఘాట్ యందు నేటికిని గలదు.

చిదంబరభాగవతర్ (మాంగుడి) :— 19 - 20 శతాబ్దములకు చెందిన ప్రఖ్యాత హరికథా కాలక్షేపకులు. సంస్కృతము,

తెలుగు, తమిళ భాషలందు గొప్ప పండితుడు. శృంగార, హాస్య, భక్తిరసములతో హరికథా కాలక్షేపముజేసి సభికులను తన్మయులుగా జేయగల ప్రతిభాశాలి. కొన్ని కృతులనుగూడ రచించెను. ఈయనకు 'అభినవ భరతాచార్య' 'మహాకథక కంఠీరవ' అను ప్రశస్థమైన బిరుదులు గలవు. మరియు క్రీ॥ శ॥ 1937 లో మద్రాసు సంగీత పరిషత్ వారిచే 'సంగీత కళానిధి' అను బిరుదునుకూడ పొందెను.

చిదంబరభారతి :— 19 వ శతాబ్దమునకు చెందిన ప్రఖ్యాత తమిళరచయిత. ఈయన పెరియపురాణ కీర్తనలను రచించెను. ఈ రచనలు స్వనామ ముద్రగలిగి యుండును. ఇతడు గొప్ప గాయకుడు.

చిన్నపక్కిరి :— 20 వ శతాబ్దమునకు చెందిన ప్రసిద్ధ నాగస్వర విద్వాంసుడు. రాగాలాపనలో మిక్కిలిసమర్థుడు. ఇతడు ప్రముఖ గాయకుడు, రచయిత యగును.

*చిన్నపీరు (యస్.) :— నేటి ఆంధ్ర దేశపు నాగస్వర విద్వాంసులలో మిక్కిలి ప్రసిద్ధిగలవాడు. నివాసము గుంటూరు జిల్లా చిలకలూరిపేట.

*చిన్నయ్య (తాళ్ళపాక) :—15 వ శతాబ్దమునకు చెందిన తిరుపతి తాళ్ళపాక రచయితలలో ప్రసిద్ధిగలవాడు. ఈయన తండ్రి పెద్దతిరుమలయ్య. తాత అన్నమాచార్యులు. నందవరీక బ్రాహ్మణుడు. ఆంధ్రుడు. శ్రీ ఏడుకొండల వేంకటరమణుని భక్తుడు. ఈయన భజనసంప్రదాయమునకు మూలపురుషుడు. ఇతనిచే రచింపబడిన తోడయమంగళము, శరణు, హెచ్చరిక మొదలగు కీర్తనలు సుప్రసిద్ధములు. ఈతని తోడయమంగళ కీర్తనలు శ్రీ త్యాగరాజు సైతము తన నిత్య భజనలో పాడెడివారని తెలియుచున్నది.

చిన్నయ్య (తంజావూరు) :— క్రీ॥ శ॥ 1806 – 1856 కాలమునకు చెందిన ప్రసిద్ధ విద్వాంసుడును, రచయితయగును. ఇతడు శ్రీ ముద్దుస్వామి దీక్షితుల శిష్యుడు. ఈయన అనేక కృతులు, వర్ణములు రచించెను. ఆరభి రాగములోని 'అంబాసారంబా' అనునది ఈయన ప్రఖ్యాత రచనయగును. ఇతడు మైసూరు ఆస్థానమునందు పది సంవత్సరము లుండెనని చెప్పుదురు.

చిన్నయ్యముదలియార్ (మణలి) :— 18 వ శతాబ్దమునకు చెందిన గొప్ప కళాపోషకుడు. వెంకటకృష్ణ ముదలియార్ అను పేరుకూడ కలదు. ఇతడు 108 రాగతాళమాలికను రచించిన శ్రీ రామస్వామి దీక్షితులకు కనకాభిషేకము జేసెను. శ్రీ బాలస్వామి దీక్షితులను 'వయొలిన్' వాద్యమునందు విశేషప్రావీణ్యము సంపాదించుటకు మిక్కిలి ప్రోత్సహించెను.

చిన్నవైత్తి :— 19 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ గాయకుడు. మైసూరు ఆస్థాన విద్వాంసుడు. ఇతనికి, ఈతని పెద్దతండ్రి కుమారునికి వైద్యనాథన్ అను ఒకటే పేరున్నందున తమిళములో చిన్న వైత్తి, పెరియవైత్తి, యని పిలిచెడివారు.

*చిన్నశింగరాచార్యులు :— శ్రీతచ్చూరు శింగరాచార్య సోదరులలో రెండవ

వాడు. 19 వ శతాబ్దమునకు చెందినవాడు. ప్రసిద్ధగాయకుడు, గ్రంథరచయిత, లక్ష్య లక్షణవిద్వాంసుడగును. ఈయన శ్రీశ్యామ శాస్త్రి మనుమడగు శ్రీ అన్నాస్వామి శాస్త్రి శిష్యుడు. నివాసము మదరాసు.

*చిన్నస్వామయ్య (కరూరు) :— నేటి ప్రసిద్ధ వయొలినిస్టులలో నొకరుగా పేరొందిన ప్రముఖ విద్వాంసుడు. తెలుగు మురికినాటి బ్రాహ్మణుడు. తండ్రి ఫిడల్ నరసయ్య త్యాగరాజుని శిష్యపరంపర లోనివాడు. చిన్నస్వామయ్య 1950 లో మద్రాసు సంగీత పరిషత్ వారిచే 'సంగీత కళానిధి' బిరుదునొందెను. ఈయన సోదరులే పెద్దదేవుడు(1860–1886)చిన్న దేవుడు (1862–1900) అను ప్రఖ్యాతగాయకులు.

చిన్నస్వామిదాసరి :— క్రీ॥ శ॥ 1828–1881 కాలమునకు చెందిన సుప్రసిద్ధ రచయితయగు విద్వాంసుడు. ఇతడు తమిళము లోను, సంస్కృతములోను అనేక భక్తి రస కీర్తనలు రచించెను.

చిన్నస్వామిదీక్షితర్ :— క్రీ॥ శ॥ 1778–1823 కాలమునకు చెందిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. తెలుగు, సంస్కృతములందు గొప్ప పండితుడు. ప్రసిద్ధ వైణికుడు. శ్రీ ముద్దుస్వామి దీక్షితుని చిన్నసోదరుడు. 'నారాయణదాస' అను ముద్రతో అనేక కృతులను రచించెను. వీటిలో తోడిరాగములోని 'నారదగానలోల కరుణాలవాల' అనునది సుప్రసిద్ధమగును.

చిన్నస్వామిముదలియార్ (ఏ.యమ్.) :— 'ఓరియంటల్ మ్యూజిక్' (ప్రాచ్య సంగీతము) అను గ్రంథమును 1892 లో యూరపియన్ నొటేషన్‌తో ప్రచురించిన ప్రముఖ గ్రంథకర్త. ఇది కర్నాటక సంగీతమునుగురించి వ్రాయబడిన యొక ప్రశస్థ గ్రంథము. ఈయన మద్రాసు సెక్రటరీయేట్ లో సూపరింటెండెంటుగను, మద్రాసు యూనివర్శిటీలో సంగీత కళాపరిశోధకులుగను పనిచేసెను.

*చిన్నికృష్ణదాసు :— 19 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ రచయిత. తెలుగులో అనేక స్వరజతులను, కృతులను రచించెను. వీటిలో 'ఖమాసు రాగము'లోని 'సాంబశివాయనవే' అను స్వరజతియు 'బిలహరి రాగము'లోని 'ఎంతో బ్రహ్మానంద'మను కృతియు సుప్రసిద్ధములగును.

## చె

* చెంగల్వరాయశాస్త్రి (మారుపెద్ది) :— క్రీ॥ శ॥ 1810–1900 కాలమునకు చెందిన సుప్రసిద్ధ రచయిత. తెలుగు బ్రాహ్మణుడు. తెలుగు, సంస్కృతములందు గొప్ప పండితుడు. 'చెయ్యూరు' జమీందారు వద్ద షుమారు ఒక అర్ధశతాబ్దమువరకు యుండెను. సంగీత, భరతనాట్యములందు అనేకమంది విద్యార్థులను చక్కగా తయారుచేసిన గొప్ప సమర్థుడు.

## చొ

చొక్కనాధనాయక్ :— క్రీ॥ శ॥ 1701–1731 కాలమునకు చెందిన మధురను పరిపాలించినట్టి రాజు. శ్రీ తిరుమలనాయకుని మనుమడు. సంగీతకళను విశేషముగా ప్రోత్సహించిన ప్రభువు. 'శ్రీ ఘనమ్ శీనయ్య' ఈయనవద్ద ఆస్థానవిద్వాంసుడుగ నుండి విశేషముగా ప్రోత్సహింపబడెను.

చొక్కలింగంపిళ్లె :— శాస్త్రీయ భరత నాట్యమందు విశేష ప్రావీణ్యముగల యొక ప్రాచీన పండితుడు. 'పందనల్లూర' పాఠశాలకు చెందినవాడు. ఈయన అనేకమంది విద్యార్థులకు తగిన శిక్షణ యొసంగి మిక్కిలి అభివృద్ధికి తెచ్చెను.

## చౌ

చౌడయ్య (టి.) :— మైసూరు ఆస్థాన విద్వాంసుడగు సుప్రసిద్ధ వయొలినిష్టు. మైసూరు మహారాజుచే 'సంగీత రత్న' అనుబిరుదమునొందెను. సప్తతంత్రుల ఫిడెల్ వాయించుటకితడే ప్రారంభకుడుగా చెప్ప వచ్చును. ఈయన శ్రీ బిడారం కృష్ణప్ప గారి శిష్యుడు. నివాసము మైసూరు.

## జ

జయదేవుడు :— 12 వ శతాబ్దమునకు చెందిన గొప్ప కృష్ణభక్తుడు. ఉత్తరదేశపు బ్రాహ్మణుడు. నివాసము బెంగాలులోని దిందుబిల్వము. సంస్కృతములో 'గీత గోవింద'మను శృంగార మహాకావ్యమును 12 సర్గలలో 24 అష్టపదులుగా రచించిన మహనీయుడు. ఒక్కొక్క రచన - 8 పాదములను గలిగియుండుటచే అష్టపదు లని వీటికిపేరువచ్చెను. ఈయనగురువుపేరు గోవర్ధనాచార్యులు. తన భార్య పద్మా వతికి భగవద్దర్శనమైనట్లుగా 19 వ అష్ట పదియందు పేర్కొనెను. సంగీత రచనల కీయష్టపదులే ప్రప్రథమములగును.

జ య రా మ న్ (లాల్‌గుడి) :— నేటి యువకులలో మిక్కిలి అభివృద్ధికివచ్చిన సుప్రసిద్ధ వయొలిన్ విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. ప్రక్కవాద్యమునం దతి సమర్థుడు.

*జయరామయ్య (టి. కె.) :— నేటి సుప్రసిద్ధ వయొలినిష్టులలో నొకరుగా పేరొందిన ప్రముఖ విద్వాంసుడు. తెలుగు బ్రాహ్మణుడు. ఈయన ప్రస్తుతము ఢిల్లీ లోని ఆల్ ఇండియా రేడియో స్టేషను యందు నిలయ విద్వాంసుడుగానున్నాడు.

## జొ

జొహాన్నెస్ (టి. సి. ఆర్.) :— 'భార తీయ సంగీత స్వయంబోధిని' అను ప్రసిద్ధ సంగీతగ్రంథమును రచించిన ప్రఖ్యాత సంగీత లక్ష్య లక్షణ విద్వాంసుడు.

## జో

జోగ్ (వి. జి ) :— వయొలిన్ వాద్యము లో అఖండ ప్రఖ్యాతినొందిన నేటి సుప్ర సిద్ధ హిందుస్థాని సంగీత విద్వాంసుడు.

## ఠా

ఠా కూ ర్ (అర్. యస్. యమ్.) :— శృతులను గుఱించి విశేషముగా పరిశోధ నలు సల్పిన ప్రాచీన సంగీతలక్షణకారుడు.

## త్యా

త్యాగయ్యర్ (తిరువెత్తియూరు):— శ్రీ వీణకుప్పయ్యర్ కుమారుడగు సుప్రసిద్ధ లక్ష్యలక్షణ విద్వాంసుడు. తమిళ బ్రా హ్మణుడు. మద్రాసునందు నివసించెను. 'సంకీర్తన రత్నావళి' అను సంగీత గ్రంథ మును రచించెను. 'గోపాలదాస' ముద్ర తో తన తండ్రి అనంతరము అనేకవర్ణ ములు, కృతులు రచించెను. ఖరహరప్రియ రాగములోని 'త్యాగరాజ' శ్రీరాగము లోని 'కోరివచ్చితి' అను కృతులు ఈయన ప్రఖ్యాత రచనలగును. ఇతడు 1917 వ

సంవత్సరము సెప్టెంబరు నెల (కృష్ణపక్ష విదియ) యందు స్వర్గస్థుడయ్యెను.

*త్యాగరాజు (కాకర్ల) :— క్రీ॥శ॥ 1759–1847 కాలమునకు చెందిన సుప్రసిద్ధ గాయక శిఖామణి. వాల్మీకాంశ సంభూతుడు. సుకవిసామ్రాట్. సంగీత త్రిమూర్తులలో నగ్రగణ్యుడు. తెలుగు మురికినాటి వైదీకబ్రాహ్మణుడు. క్రీ॥శ॥ 1759 కి సరియగు సర్వజిత్ సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమి సోమవారము మేషరవి ఉదయం 15–30 గడియలకు కటకలగ్నమున తిరువారూరులో జన్మించెను. వీరి పూర్వులు ఆంధ్రరాష్ట్రములోని కర్నూలుజిల్లా కంభంతాలూకా 'కాకర్ల' గ్రామమునుండి దక్షిణదేశము వలసపోయిరి. త్యాగయ్య తండ్రి రామబ్రహ్మము. తల్లి సీతమ్మ. తాత గిరిరాజబ్రహ్మము. ముత్తాత పంచనదబ్రహ్మము. జ్యేష్ట సోదరులు జప్యేశుడు, రామనాథుడు. 2 వ సోదరుడు చిన్నతనమునందే మరణించెను. మొదటిభార్య పార్వతి మరణించగా ఆమె చెల్లెలు కమలాంబను వివాహమాడెను. కూతురు సీతాలక్ష్మి. సంగీత గురువు సొంఠి వెంకటరమణయ్య. త్యాగయ్య సంస్కృతము, ఆంధ్రము, సంగీతములలో అసమానపాండిత్యము గలవాడు. శ్రీ రామకృష్ణానందస్వామిచే రామషడాక్షర మంత్రోపదేశ మొంది 96 కోట్ల తారకమంత్రమును జపించి శ్రీరామచంద్రుని దివ్యసాక్షాత్కారమునొందిన పుణ్యపురుషుడు. మరియు నారదోపాస్తి మంత్రోపాసనా ఫలితమున నారదుని దర్శించి ఆయన అనుగ్రహమున 'స్వరార్ణవ' మను దివ్య సంగీత గ్రంథమును బడసెను. ఈ మహనీయుని సంగీత రచనలు నేడు 2,400 వరకు కనుపడుచున్నవి. వీటిలో శివ, విష్ణుసంబంధమైన కీర్తనలును, దివ్యనామ సంకీర్తనలు, ఉత్సవసంప్రదాయ కీర్తనలే గాక ప్రహ్లాదభక్తి విజయము, నౌకాచరిత్రమువంటి ప్రబంధరచనల కీర్తనలుగలవు. వీటిలో "గంభీరవాణి" రాగమువంటి అనేక అపురూప రాగములందుకూడ కీర్తనలు గలవు. వాల్మీకి తన 24,000 శ్లోకములుగల రామాయణమును శ్రీ త్యాగరాజ రూపమున అవతరించి 24,000 కీర్తనలలో రచించెనని ఒక ప్రతీతి గలదు. ఈ మహనీయుడు తన మరణకాలమును గుర్తెరింగినందున సన్యసించి ది 6–1–1847 కు సరియగు పరాభవ సంవత్సర పుష్య బహుళ పంచమి తిథియందు బ్రహ్మైక్యానుసంధాన మొందెను. వీరి వర్ధంతి మహోత్సవములు వీరి సమాధిగల 'తిరువయ్యూరు' నందును, తదితరచోట్లను మహా వైభవముగా నేటికిని జరుపుచున్నారు. వీరికి 15 మంది శిష్యులు గలరు. వారిలో శ్రీ వీణకుప్పయ్యర్, వాలాజాబాద్ వేంకటరమణ భాగవతర్ లు ముఖ్యులగుదురు.

## తి

తిరుజ్ఞానసంబంధస్వామిగళ్ :— తమిళములో 'తేవారములు' రచించిన ముగ్గురు ప్రసిద్ధరచయితలలో యీయనవొకరు. నాటరాగములోని 'తోడుడైయ' అనునది వీరి ప్రసిద్ధ రచనయగును.

తిరునావుక్కరసుస్వామిగళ్ :— తమిళములోని 'తేవార' రచయితలు ముగ్గురులో నొకరు. ఈయనకు 'అప్పర్' అను మరియొక పేరుకూడ గలదు. దేవగాంధారి

రాగములోని 'మాదర్పినైకణ్ణి' అనునది వీరి ప్రసిద్ధ రచనయగును.

*తిరుమలయ్య (ప్రయాగ) :— సంగీతములో విశేషమగు కృషిచేసినట్టి ప్రాచీన ఆంధ్రవిద్వాంసుడు. నివాసము గుంటూరు.

## తం

తులజాజీమహారాజు :— క్రీ॥ శ॥ 1765—1787 కాలమునకు చెందిన తంజావూరు మహారాజు. ఈయన 'సంగీతసారామృత' మను లక్షణగ్రంథమును 1770 లో రచించెను. ఈయన సంగీతకళను విశేషముగా ప్రోత్సహించినట్టి సంస్థానాధీశ్వరుడు.

తులసీదాసు :— భక్తిరసకీర్తనలను రచించిన ప్రాచీన సుప్రసిద్ధపండితుడు.భక్తుడు.

## ద

దండాయుధపాణిపిళ్ళె :— సుప్రసిద్ధుడైన భరతనాట్య విద్వాంసుడు. 'చిత్రంబలకురవంజి' అను నాట్యనాటకమును రచించెను. ఇతడనేకమంది విద్యార్థులకు మంచి శిక్షణ యొసగి అభివృద్ధికి తెచ్చెను.

దత్తిలుడు :— 'దత్తిలము' అను సుప్రసిద్ధ ప్రమాణ లక్షణగ్రంథమును సంస్కృతమున రచించిన ప్రాచీన లక్షణకారుడు. ఇతనికే 'దత్తిలముని'అనుపేరుకూడగలదు.

*దక్షిణామూర్తిశాస్త్రి (కరూరు) :— త్యాగరాజు కాలమునకు చెందిన సుప్రసిద్ధ తెలుగు కీర్తనల రచయిత. తెలుగు ములికినాటి బ్రాహ్మణుడు. 'గర్భపురి' ముద్రతో అనేక కీర్తనలు రచించెను. వీటిలో 'గౌరీమనోహరి'లోని 'బ్రోవసమయమిదే రామయ్య' 'తోడి' లోని 'ఏమనిపొగడుదు' అను రచనలు సుప్రసిద్ధములు.

దక్షిణామూర్తిపిళ్లె (పుదుక్కోట) :— దక్షిణ భారతములో మృదంగ, కంజీరా వాద్యములలో అఖండకీర్తి గడించిన సుప్రసిద్ధ తమిళ విద్వాంసుడు. గొప్ప దైవభక్తుడు. పుదుక్కోటలో 'శ్రీ దండాయుధపాణి' స్వామి ఆలయ నిర్మాణము గావించి తన జీవితమును సార్థకముచేసికొన్న గొప్ప కళారాధకుడు. ఈయన 19-20 వ శతాబ్దములకు చెందినవాడగును.

*దక్షిణామూర్తిశాస్త్రి (సుసర్ల) :— త్యాగరాజుని శిష్యపరంపరకుచెందిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. ఆంధ్ర వైదీక బ్రాహ్మణుడు. నివాసము కృష్ణాజిల్లా పెదకళ్ళేపల్లి గ్రామము. శిష్యులను అభివృద్ధికి తెచ్చుటలో గొప్ప సమర్థుడు. ఈయన శిష్యుడే కీ॥ శే॥ గాయకసార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్యపంతులు. వీరుభయుల వార్షికోత్సవములు నేటికిని విజయవాడలో జరుగుచున్నవి.

## దా

దామోదరమిశ్ర :— ప్రాచీన సంగీ లక్షణకారులలో గొప్ప ప్రసిద్ధిగల విద్వాంసుడు. ఇతడు శ్రీ 'భావభట్టుని' కంటె ముందువాడని తెలియుచున్నది.

దాసరి :— శ్రీ శ్యామశాస్త్రిల శిష్యకోటికిచెందిన సుప్రసిద్ధ నాగస్వర విద్వాంసుడు. 19 వ శతాబ్దమునకుచెందినవాడు. ఈతనినిగురించి ఒక అద్భుత కథకలదు. ఒకనాడు'తిరువయ్యారు'లోస్వామివారి

ఉత్సవమునందు శుద్ధసావేరి రాగమాలాపించి 'దరిని తెలుసుకొంటి' అను కృతిని అద్భుతముగా నాగస్వరములో వాయించుచుండగా అదే వీధిలోనివశించునట్టి శ్రీ త్యాగరాజువిని పరవశుడై వెంటనే వీధిలోనికివచ్చి దాసరిని కౌగలించుకొని తన ఆనందమును వెలిబుచ్చెనట. దాసరి యీ అద్భుతానికి ఆశ్చర్యపడెనని చెప్పుదురు.

## ది

దిలీపకుమారరాయ్ :— హిందుస్థాని సంగీతములో గొప్ప ప్రతిభగల గాయకుడును, రచయితయునగును. ఈయన గానము బహురంజకముగనుండునని చెప్పుదురు.

## దీ

దీనానాధుడు :— అహోబలుని 'సంగీత పారిజాత' గ్రంథమును పారశీక భాషలోనికి క్రీ॥ శ॥ 1724 లో తర్జుమా చేసినయొక ప్రాచీన సంగీత పండితుడు.

## దు

దురైస్వామిఅయ్యంగార్ (మైసూరు):— మైసూరు సంస్థానమునకుచెందిన నేటి సుప్రసిద్ధ వైణిక విద్వాంసుడు. ఈయన వీణా వాద్యము బహురంజకముగను, సంప్రదాయసిద్ధముగను వుండును.

దురైస్వామిఅయ్యర్ (మధ్యార్జునమ్) :— ప్రాచీనుడైన సుప్రసిద్ధ పల్లవి విద్వాంసుడు. గొప్ప రచయిత. తెలుగులో 'సుబ్రహ్మణ్య' ముద్రతో అనేక కృతులను, వర్ణములను రచించెను. 1929 లో ఈయన యొక్క 4 కృతులుంగల ఒక చిన్న పుస్తకము ప్రకటింపబడెను.

దురైస్వామిఅయ్యర్ (టి. ఎ) :—ఇతడు గొప్ప పల్లవి పాటకుడు. కొచిన్ సంస్థాన గాయకుడగు అప్పుభాగవతర్ కుమారుడు.

దురైస్వామిఅయ్యర్ (మణత్తట్టై) :— క్రీ॥ శ॥ 1865–1926 కాలమునకుచెందిన ప్రసిద్ధ గాయకుడు. సావేరి రాగాలాపనలో విశేష ప్రతిభగలవాడగుటచే ఆ రాగమునే బిరుదుగానొంది పిలువబడెనని చెప్పుదురు. మద్రాసులో నివశించెను.

దురైస్వామిఅయ్యర్ (పులియూర్) :— సుప్రసిద్ధ రచయితయగు ప్రాచీనసంగీత విద్వాంసుడు. శ్రీసరస్వతీదేవినిగూర్చినాట రాగములో, ఆదితాళమునందు రచించిన "సరసీరుహాసనప్రియే" అను కృతి ఈతని యొక్క ప్రసిద్ధ రచనయగును.

దురైస్వామిక్ కవి రాయర్ :— తమిళములో "సుబ్రహ్మణ్యస్వామిపై" స్వనామ ముద్రతో కీర్తనలు రచించిన ప్రఖ్యాత రచయిత. ఈయన రచనలలో బేగడ రాగములోని 'ఇన్నుమ్ పరాముగమేనో' అనుకీర్తన సుప్రసిద్ధమగును.

దురైస్వామయ్య (పంచనదము) :— శ్రీ శరభోజి మహారాజుకాలమున పంచనద క్షేత్రమున నివశించిన ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు. "సుబ్రహ్మణ్య" ముద్రతో సులభశైలిగా అనేక కీర్తనలను రచించెను. తెలుగు, సంగీతములందు మిక్కిలి పండితుడు. ద్రావిడ బ్రాహ్మణుడు.

# దే

దేవాలు (కె. బి.) :— ద్వావింశతి శృతు లనబడు 22 శృతులను గురించి విశేషపరి శోధనలు సల్పిన ప్రాచీనుడగు నొక గొప్ప సంగీత శాస్త్రకారుడు.

*దేవుడయ్య (కరూరు) :— సంగీతము లోను, తెలుగులోను మంచి పాండిత్యము గల విద్వాంసుడు. తెలుగు మురికినాటి బ్రాహ్మణుడు. కరూరు దక్షిణామూర్తి శాస్త్రికి వరుసకు సోదరుడు. ఈయన "గర్భపురి" ముద్రతో అనేక కృతులను రచించెను. శ్రీత్యాగరాజుని కాలమువాడు.

# ధ

ధనకోటి అమ్మాళ్ (వీణ) :— 19_20 శతాబ్దములకు చెందిన సుప్రసిద్ధ వైణిక రాలు. పదములను వాయించుటలో కడు సమర్థురాలు. ఈమె వాద్యమును విను టకు విద్వాంసులు సయితము యీామె యింటికి వచ్చుచుండెడివారు. ఈమె మనుమరాండ్రె శ్రీ మ తు లు ముక్త, బృంద, అభిరామ అను నేటిగాయనీమణులు. ఈమె యిటీవలనే స్వర్గస్థురాలయ్యెను.

# న

నటరాజసుందరంపిళ్ళై :— 'దీక్షితర్ రచనలు' అను నొక సంగీత గ్రంథమును రచించిన సుప్రసిద్ధ గ్రంథకర్త.

నరశింగమెహతా :— శ్రీ "మహాత్మా గాంధీజీ" చే ఆకర్షింపబడిన 'వైష్ణవజనతో' వంటి భక్తిరస కీర్తనలను రచించిన గుజ రాత్ దేశీయుడగు విద్వాంసుడు.

*నరసింగరావు (ద్వారం) :— నేటి ఆంధ్ర దేశ వయొలినిస్టులలో మంచి పేరు గడించిన సంగీత విద్వాంసుడు. శ్రీ విజయనగరం మహారాజావారి సంగీత కళాశాలలో అధ్యాపకులుగానుండి ప్రస్తు తము శ్రీనాయుడుగారిస్థానమున అధ్యక్షు లుగా నియమింపబడినట్లు తెలియుచున్న పండితుడు.

*నరసింహదాసు (తూము) :— తెలుగు లో సుప్రసిద్ధ భక్తిరసకీర్తనలను రచించిన ప్రాచీనపండితుడు. ఆంధ్రబ్రాహ్మణుడు.

నరశింహయ్యంగార్ (నామక్కల్) :— పల్లవిగానమును ప్రదర్శించుటలో విశేష ప్రఖ్యాతిగల ప్రాచీన సంగీత విద్వాంసు డు. తమిళ వైష్ణవ బ్రాహ్మణుడు.

*నరసింహము (క్రాపవరపు) :— 'గాన తరంగిణి' అనునొక చిన్న సంగీతగ్రంథమును ప్రకటించిన గ్రంథకర్త. ఆంధ్రబ్రాహ్మ ణుడు. నివాసము మచిలీపట్టణము.

నరసయ్య (శంకరాభరణం) :— శంక రాభరణ రాగాలాపనలో అసమాన ప్ర తిభా విశేషముగల ఒక ప్రాచీన విద్వాం సుడు. ఈతని రాగాలాపనా సామర్థ్య మునకు ఆ రాగబిరుదే తార్కాణమగును.

# నా

*నాగభూషణము (హరి) :— ఆంధ్ర దేశములోని సుప్రసిద్ధ జంత్ర (వాయు లీనము) గాత్ర విద్వాంసులలో మిక్కిలి కీర్తిగడించిన ప్రముఖ సంగీత విద్వాం సుడు. నివాసము కృష్ణాజిల్లా మచిలీపట్ట ణము. బి. ఏ. డిగ్రీనొంది న్యాయవాదు

లుగ నుండిరి. సంగీత, సంస్కృత, తెలుగు, ఇంగ్లీషు భాషలందు మిక్కిలి పండితులు. గొప్ప రచయిత. సనాతనపరుడు. అనేక సంస్థానములందు సన్మానము లొందిరి. 'వాగ్గేయకారకరత్న' అను ప్రసిద్ధ బిరుదు గలదు. వీరి ముగ్గురు కుమారులును మంచి అభివృద్ధికి వచ్చిరి. ఈయన శిష్యులే వయొలినిస్టులగు శ్రీ శిష్టు సర్వశాస్త్రి, శ్రీ శిష్టు బ్రహ్మయ్యశాస్త్రి యగుదురు.

*నాగభూషణము (నోరి) :— నేటిఆంధ్ర దేశ వయొలినిష్టులలో మంచిపేరు గడించిన సంగీత విద్వాంసుడు. ప్రస్తుతము హైదరాబాదు ప్రభుత్వ సంగీత కళాశాలలో అధ్యాపకులుగా నున్నారు.

*నాగరత్నము (బెంగుళూరు) :— సుప్రసిద్ధ గాయకురాలుగా కీర్తినొందిన తెలుగు సంగీత విద్వాంసురాలు. త్యాగరాజ భక్తురాలు. ఈమె తన జీవితమంతయు శ్రీ త్యాగరాజస్వామి కైంకర్యమునకేయంకిత మొనర్చి "తిరువయ్యూరు"నందలి శ్రీ అయ్యవారి సమాధి వద్ద నొక గొప్ప భవనము నిర్మించెను. ఏటేటా ఈ భవనమునందే శ్రీ త్యాగరాజస్వామివారి వర్ధంతి మహోత్సవములను గాయకులు జరుపుచుందురు. ఈమె కొలది సంవత్సరముల క్రిందటనే స్వర్గస్థురాలయ్యెను.

నాగరాజరావు (కుంభకోణం) :— తమిళ దేశములో మురళీవాద్యములో విశేషకీర్తి నార్జించి గతించిన ప్రముఖ విద్వాంసుడు.

నాగోజీరావు (పి) :— ద్వావింశతి శృతులను గురించి విశేషముగా పరిశోధనలు సలిపిన ప్రాచీన సంగీత లక్షణకారుడు.

నాదమునిపండితులు (యమ్.) :— 'సంగీత స్వరప్రస్తారము' అను సంగీత లక్ష్య లక్షణగ్రంథమును రచించి 1914 లో ప్రకటించిన గొప్ప విద్వాంసుడు. ఈ గ్రంథములో ప్రసిద్ధ వాగ్గేయకారుల వివిధ రచనలేగాక 72 మేళకర్తలలో జనించిన 2044 జన్యరాగములును, వాటి ఆరోహణ, అవరోహణ స్వరములును, శృతులును పేర్కొనబడి యున్నవి.

నారదుడు :— 'సంగీత మకరందము' అను ప్రమాణమగు లక్షణగ్రంథమును రచించిన ప్రాచీన వాగ్గేయకారుడు. ఈయన కాలమునసే కర్నాటక, హిందుస్థాని సంగీతములను విభజన కలిగినట్లు చెప్పుదురు. ఈయన తన "సంగీతమకరంద" గ్రంథమునందు యీ క్రింది 4 విధములుగా రాగములను విభజించుట గమనింపవలెను.

I సంధిప్రకాశరాగములు.
II ఉదయ, మధ్యాహ్న, సాయంకాల రాగములు. (ఆయా కాలములలో పాడదగినవి.)
III సూర్యాంశ, చంద్రాంశ రాగములు.
IV (1) ముక్తాంగకంపిత రాగములు,
(2) అర్ధకంపితరాగములు,
(3) కంపవిహీన రాగములునవి.

*నారాయణన్ (యస్. వి. యస్.) :— నేటి మృదంగ విద్వాంసులలో మిక్కిలి ప్రసిద్ధిగలవాద్యకుడు. మద్రాసుఏ.ఐ.ఆర్. లో నిలయవిద్వాంసుడుగా నున్నాడు.

*నారాయణతీర్థులు :— 16 వ శతాబ్దమునకుచెందిన వాగ్గేయకారులలో కడుంగొప్పవాడు. శ్రీకృష్ణ భక్తుడు. కృష్ణాజిల్లాకు చెందిన ఆంధ్రబ్రాహ్మణుడు. ప్రసిద్ధ

రచయిత. సంగీత, సంస్కృతాంధ్రము లలో గొప్ప విద్వాంసుడు. ఈయనకు చిరకాలముగా కడుపునొప్పి వ్యాధి వుండెను. ఆ బాధకు తాళలేక తీర్థయాత్రలకై బయలువెడలి తంజావూరుజిల్లా "నాడుకావేరి" గ్రామముచేరి ఆ రాత్రి నిద్రించుచుండెను. స్వప్నమున దైవము కనుపించి రేపుపుదయమునకొక వరాహమును జూతువు. దానిని వెంబడించి అది యచ్చట నదృశ్య మగునోయచ్చట నీ కృష్ణలీలా తరంగిణిని గానము చేసినచో నీ బాధ నివారణ యగునని చెప్పెను. అదేవిధముగా వరాహమును వెంబడించగాఅది 'భూపతిరాజ పురము'వరకువెళ్ళి యచ్చటగల "వేంకట రమణస్వామి" ఆలయమున ప్రవేశించి యదృశ్యమయ్యెను. వెంటనే తీర్థుల వారు తన కృష్ణలీలాతరంగిణిని భక్తితో గానముచేయగా కడుపునొప్పిబాధ నివారణయయ్యెను. అదిమొదలు వరాహపురియ నబడునచ్చటనే నివసించుచూ కొన్నాళ్ళకు సిద్ధినొందిరి. శిష్యులు వారి శరీరమును ఆ దేవాలయ సమీపమందే సమాధిచేసిరి. ఈ సమాధివద్దకు నేటికిని భక్తులువచ్చి దర్శించిపోవుచుందురు.

*నారాయణదాసు (ఆదిభట్ట) :— ఆంధ్ర దేశములో హరికథా కాలక్షేపములందు అద్వితీయమైన కీర్తిగడించిన సుప్రసిద్ధ విద్వాంసుడు. తెలుగుబ్రాహ్మణుడు. సంగీతము, తెలుగు, సంస్కృతములందు గొప్ప పండితుడు. రామాయణాది అనేక గ్రంథములను రచించిన గ్రంథకర్త. కవిగాను, రచయితగాను, కాలక్షేపకులుగాను అఖండ ప్రఖ్యాతినొందిన ప్రసిద్ధ పురుషులు. అనేక సంస్థానములందు బహు సన్మానములనుబడసి 'హరికథాపితామహ' వంటి బిరుదులనొందిన సమర్థుడు. వీరి గ్రంథములలో కొన్ని అచ్చుతెలుగునందు గలవు. శ్రీ విజయనగరం మహారాజావారి సంగీత కళాశాల అధ్యక్షులుగా చాలా కాలముపనిచేసికొలదిసంవత్సరముల క్రింద టనే స్వర్గస్థులైరి. వీరికిప్రసిద్ధులగు అనేక మందిశిష్యులుగలరు. వారిలో శ్రీ వాజిపేయాజుల సుబ్బయ్య, శ్రీ నేతి లక్ష్మీనారాయణశాస్త్రి మొదలగువారు ముఖ్యులు.

నారాయణయ్యంగార్ (కె. యస్.) :— గోటు వాద్యమునందు విశేష ప్రావీణ్యముగల ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. మైసూరు రాష్ట్రమునకు చెందినట్టి వైష్ణవ బ్రాహ్మణుడు.

నారాయణరావువ్యాస్ :— హిందుస్థాని సంగీతములోవిశేషకీర్తినార్జించిన సుప్రసిద్ధ గాయకుడు. ఈయన బొంబాయినగరమున గంధర్వ విద్యాలయమునొకటి స్థాపించి విద్యార్థులకు తగు సంగీత శిక్షణ యొసగు చున్నారు.

*నారాయణస్వామి (తిరుపతి) :— సుప్రసిద్ధ కీర్తనలజావళీలరచయితయగుప్రాచీన సంగీత విద్వాంసుడు. నివాసము తిరుపతి. ఈయన రచనలలో నాటకురంజి రాగములో 'పరాకేల సరస్వతి' పున్నాగవరాళిక రాగములో 'ఇకనైన నామొర' అనునవి సుప్రసిద్ధములు.

నారాయణస్వామి (నల్లూరు) :— భరత నాట్యములో అసమాన ప్రతిభగల

విద్వాంసుడు. ఈయన శిష్యుడే సుప్రసిద్ధ నటకుడైన శ్రీ "రంజన్" అని చెప్పవచ్చును.

## ని

నిస్సార్‌హుస్సేన్‌ఖాన్ :— హిందుస్థాని సంగీతమునందు విశేష ప్రావీణ్యము గడించిన నేటి సుప్రసిద్ధ గాయకుడు. ఉత్తర దేశీయుడు.

## నీ

నీలకంఠయ్యర్ :— శ్రీ త్యాగరాజుని శిష్యకోటికి చెందిన ప్రముఖ విద్వాంసుడు. 18 - 19 శతాబ్దములకు చెందినవాడు.

## నై

నైనాపిళ్ళై (సుబ్రహ్మణ్యపిళ్లై) :— 19 - 20 శతాబ్దములకు చెందిన సుప్రసిద్ధ గాయక శిఖామణులలో నొకరుగా ప్రఖ్యాతి గడించిన ప్రముఖ సంగీతవిద్వాంసుడు. కంజీవరవాస్తవ్యుడు. తమిళుడు. లయ జ్ఞానములోను, స్వరజ్ఞానములోను అఖండ ప్రజ్ఞగలవాడు. త్యాగరాజుని కీర్తనలను పైకి తెచ్చుటలో అతిసమర్థుడు. ఈయన కచ్చేరీలు అత్యద్భుతముగానుండి సభికులను తన్మయులను జేయుచుండెడివి. ఈయన శిష్యుడే నేటి ప్రసిద్ధ గాయకుడగు శ్రీ చిత్తూరు సుబ్రహ్మణ్యపిళ్ళై యగును.

## ప

పంచనదయ్యర్ (తరంగంబాడి) :— సుప్రసిద్ధ కీర్తనల రచయితయగు ప్రాచీన పండితుడు. ఈయన రచనలలో రాగమాలికలో "ఆరభిమానం" అనునది యొక సుప్రసిద్ధ రచనయగును.

పంచాపకేశభాగవతులు :— శ్రుతులను గుఱించి విశేష పరిశోధనలు సల్పిన యొక ప్రాచీన సంగీత లక్షణ విద్వాంసుడు.

పంచాపకేశశాస్త్రి (తిరుప్పళనమ్) :— 19-20 శతాబ్దములకు చెందిన సుప్రసిద్ధ హరికథాకాలక్షేపవిద్వాంసుడు. సంగీత, సంస్కృత, తమిళ భాషలందు గొప్ప పండితుడు. రామాయణాది కాలక్షేపములను మహారాష్ట్ర సంప్రదాయములో గానము చేయుటలో వీరికిగల సామర్థ్యము అపారము. సభికులను రంజింపజేయుటకు తగినట్లు అనేక యితిహాసములతో కాలక్షేపము చేయగల సమర్థులు. ఈయన షుమారు 20 సం॥ ముందే మరణించిరి.

పంజుశాస్త్రి :— శ్రీ శ్యామశాస్త్రియొక్క మొదటి కుమారుడును, శ్రీ సుబ్బరాయశాస్త్రికి జ్యేష్ఠ సోదరుడునగు ప్రముఖ సంగీత విద్వాంసుడు. 18-19 శతాబ్దములకు చెందినవాడు.

పట్టమ్మాళ్ (డి. కె.) :— దక్షిణభారతములో నేటి సుప్రసిద్ధ గాయనీ మణులలో నొకరుగా విశేష ప్రఖ్యాతి గడించిన విద్వాంసురాలు. ఈమెకు 'గానసరస్వతి' అను బిరుదుగలదు. నివాసము మద్రాసు.

పట్టాభిరామయ్య (ధర్మపురి) :— జావళీ రచయితలలో మిగుల ప్రసిద్ధుడైన ప్రాచీన సంగీతవిద్వాంసుడు. ఈయన జావళులు 'ధర్మపురీశ' ముద్రతోనుండి వినుటకు బహు రంజకముగా నుండును. ఈ రచనలలో కాంభోజిలోని 'ఏమిమాయము

జేసితివి' కానడలోని 'వానిపొందు' మొదలగునవి మిగుల సుప్రసిద్ధములు.

*పద్మనాభాచార్యులు :— ఆంధ్రదేశమునకు చెందిన సుప్రసిద్ధ వైణికవిద్వాంసుడు. ప్రాచీనుడు. గొప్ప సాహిత్యజ్ఞానము గలవాడు. విజయనగర ప్రాంతమునకు చెందినవాడని తెలియుచున్నది.

పరమేశ్వరభాగవతర్ :— క్రీ॥శ॥ 1815-1892 కాలమునకుచెందిన తిరువాన్కూరు సంస్థాన ప్రధాన అస్థాన విద్వాంసుడు. 18 వ ఏటనే యీపదవి నొందిన ప్రసిద్ధ గాయకుడు. గొప్పరచయిత. అనేక కీర్తనలు వ్రాసెను. పాలఘాట్ బ్రాహ్మణుడు. ప్రసిద్ధ గాయకుడైన శ్రీ కోయంబత్తూరు రాఘవయ్య యీయన శిష్యుడగును.

పరిమళరంగడు :— 19 వ శతాబ్దమునకుచెందిన సుప్రసిద్ధ పదరచయితయగు విద్వాంసుడు తమిళదేశస్థుడు. ఈయన తెలుగునందు ప్రాస యమకములతోను 'పరిమళరంగ' ముద్రతోను అనేక పదములు రచించిన ప్రసిద్ధ పురుషుడగును.

ప్రతాపసింహమహరాజు :— తంజావూరు నేలిన శ్రీ అమరసింహమహారాజు కుమారులు. సంస్కృత, మహారాష్ట్ర భాషా విచక్షణులు సంగీతములోను, మృదంగవాద్యములో నతిసమర్థులు. ఈయన మహారాష్ట్ర భాషలో రచించిన 'నవరత్నమాలిక'యను రాగతాళమాలిక కడు ప్రసిద్ధమైనది. ఈయన శివాజీమహారాజుకు ముందువాడని తెలియుచున్నది.

## పా

*పానకాలరావు (మునగంటి) :— 'స్వరవర్ణసుధానిధి' అను సంగీత గ్రంథమును రచించిన ప్రాచీన విద్వాంసుడు. ఆంధ్ర బ్రాహ్మణుడు. 19-20 శతాబ్దములకుచెందిన కాకినాడవాస్తవ్యుడు.

పాపనాశశివన్ :— నేటి సుప్రసిద్ధ తమిళ కీర్తనల రచయితలలో మిక్కిలి ప్రముఖుడగు విద్వాంసుడు. ఈయన రచనలు మిగుల రంజకముగనుండుటచే యిప్పటి గాయకులు సంగీతకచ్చేరిలందు యీ కీర్తనలుకూడ పాడుచుందురు. వీటిలోమోహనలోని 'కపాలి' అను కీర్తన సిమ్హేంద్ర మధ్యమములోని 'ఇహాపరం' అను కీర్తన కేదార గౌళలోని 'స్వామికిసరి' మొదలగు కీర్తనలు సుప్రసిద్ధములగును.

పాపవినాశముదలియార్ :— 18 వ శతాబ్దమునకుచెందిన ప్రముఖ కీర్తనల రచయిత. ఈయన 'పాపవినాశ' అను స్వనామముద్రతో అనేక కీర్తనలను రచించెను.

పాప్లే (హెచ్. ఏ) :— 'మ్యూజిక్ ఆఫ్ ఇండియా' అను గ్రంథమును 1921 లో ఇంగ్లీషునందు వ్రాసి ప్రకటించిన ప్రసిద్ధ సంగీత శాస్త్రకారుడు. ఈ గ్రంథమున సంగీతమునకు సంబంధించిన అనేక ముఖ్యవిషయములు పేర్కొనబడియున్నవి.

*పార్థసారధి (యన్. సి.) :— 'గానకళాబోధిని' అను సంగీత గ్రంథమును తెలుగులో యిటీవల ప్రకటించిన యొక గ్రంథకర్త, ప్రసిద్ధ వైణికుడు. ప్రస్తుతము మద్రాసు

నందు ఒక సంగీత కళాశాలను స్థాపించి నడుపుచున్నారు.

పార్వతీకర్ (వి. ఆర్.) :— హిందుస్థాని సంగీతమునందు విశేష ప్రావీణ్యముగల ఉత్తరదేశపు విద్వాంసుడు. ఈయన స్వరమండల, రుద్రవీణ వాద్యములను అత్యద్భుతముగా ప్రదర్శించగల యోగీశ్వరుడు. ప్రస్తుతము తిరుపతి క్షేత్రమందు నివసించుచున్నారు. నాదోపాసన వల్లనే భగవత్సాక్షాత్కారము నొందుటకు కృషిచేయుచున్న గొప్ప భక్తుడు.

పార్శ్వదేవుడు :— 'సంగీత సమయసారము' అను ప్రమాణ సంగీత లక్షణ గ్రంథమును రచించిన ప్రాచీన గ్రంథకర్త. సుప్రసిద్ధ లక్ష్య లక్షణ విద్వాంసుడు.

## పి

*పిచ్చిహరి (దాలిపర్తి) :— ఆంధ్రదేశమునకు చెందిన నేటి సుప్రసిద్ధ నాగస్వర వాద్యకులలో మిక్కిలి పేరుగడించిన విద్వాంసుడు, ఆంధ్రుడు. 'నాగస్వర కోవిద' అను బిరుదునొందెను. ఈయన నివాసముకృష్ణాజిల్లాలోనిమచిలీపట్టణము.

*పినాకిపాణి (యస్.) :— నేటి ఆంధ్ర గాయకులలో మంచిపేరుగడించినసుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. పదములు పాడుటయందు విశేష అనుభవముగలవారు. యమ్. బి; బి. యస్; డిగ్రీనొంది ప్రస్తుతము విశాఖపట్టణములోని ప్రభుత్వవైద్యశాలయందు డాక్టరుగా పనిచేయుచున్నారు.

## పు

పుండరీకవిఠలుడు :— అక్బరు కాలము నాటి ప్రసిద్ధ హిందుస్థాని సంగీత విద్వాంసుడు. శ్రీ 'రాజా బరహాన్‌ఖాన్' యొక్క ఆస్థాన విద్వాంసుడు. షడ్రాగ చంద్రోదయము, రాగమాల, రాగమంజరి, నర్తననిర్ణయమను గ్రంథములను రచించిన పండితుడు. సంస్కృతమునందు విశేష పాండిత్యముగల గొప్ప కవి. హిందుస్థాని సంగీతములో రాగ, రాగిణీ, పుత్రములను రాగవిభజనచేసి ఒక క్రమమైన పద్ధతిలో తన గ్రంథములందు పేర్కొనెను.

పుట్టాచార్యులు :— మైసూరు రాష్ట్రమునకుచెందిన ప్రసిద్ధ మృదంగవిద్వాంసుడు. ఈయన కుమారుడు చి|| రాముకూడ మృదంగ, కంజీరా వాద్యములందు మిగుల ప్రవీణత గలవాడు. వీరినివాసము బెంగుళూరు.

పురందరదాసు :— క్రీ|| శ|| 1486 – 1564 కాలమునకు చెందిన కీర్తనల రచయితలలో అగ్రగణ్యుడు. పండరినాథుని భక్తుడు. తన ధనమంతయు దానధర్మములకు వినియోగించిన త్యాగధనుడు. కన్నడము, సంగీతములందు గొప్ప పండితుడు. కర్నాటక సంగీతమున ప్రథమశిక్షణ కుపకరించు స్వరావళి, అలంకార, పిళ్ళారి గీతములును, ఠాయ, ప్రబంధ, సూళాదులను రచించిన మహానుభావుడు. ఈయనకు 'కర్నాటకసంగీత పితామహ' అనియు, 'ఆదిగురువు' అనియు బిరుదులుగలవు. 'పురందరవిఠల' ముద్రతో షుమారు 4,75,000 దేవరనామములు రచించినట్లు

తన రచనయందు పేర్కొనిన మహనీయుడు. ఈయన కుటుంబములోని వారందరును భక్తులును, రచయితలని చెప్పుదురు. త్యాగరాజు తన 'ప్రహ్లాదభక్తి విజయ'మను గ్రంథ ప్రారంభమునందు ఈ మహనీయుని ప్రస్తుతించెను. ఈ భక్త శిఖామణి క్రీ॥ శ॥ 1564 సం॥కు సరియగు రక్తాక్షి సంవత్సర పుష్యబహుళ అమావాశ్యయందు స్వర్గస్థులైరి.

పుష్పవనమ్ (మధుర) :— దక్షిణభారతములో చిన్నవయస్సందే అసమాన కీర్తిగడించి తన యద్భుత గానకళా ప్రావీణ్యముచే శ్రోతలను తన్మయులుగా జేయుచూ అకాల మృత్యువునకు గురియైన సుప్రసిద్ధ గాయకశిఖామణి. తమిళ బ్రాహ్మణుడు. 19 - 20 శతాబ్దములకు చెందినవాడు.

## పె

*పెద్దతిరుమలయ్య (తాళ్ళపాక) :— శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులవారి కుమారుడైన ప్రసిద్ధ రచయితయగు గొప్ప భక్తుడు. నందవరీక బ్రాహ్మణుడు. ఆంధ్రుడు. నివాసము తిరుపతి. 16 వ శతాబ్దమునకు చెందినవాడు.

పెద్దదాసరి :— తంజావూరు నాయక రాజుల కాలమునకుచెందిన ప్రసిద్ధ పద రచయితయగు విద్వాంసుడు. గొప్ప నరసింహభక్తుడు. ఈయననుగురించి ఒకకథ గలదు. ఒకనాడు తంజావూరు సంస్థానాధీశ్వరుడు పెద్దదాసరిని పిలిపించి తనను స్తుతించుచూ ఒకపదమును పాడమనగా యితడు నిరాకరించినందున వురిశిక్ష విధించెను. శిక్ష అమలుపఱచుటకు ముందు ఒకసారి దేవుని దర్శించి వత్తునని అనుజ్ఞ తీసుకొని దాసరి ఆలయములోనికి వెళ్ళి స్వామియం దైక్యమయ్యెను. ఈయద్భుత సంఘటనచే రాజు తనయపచారమున కెంతయు దుఃఖించెనని చెప్పుదురు.

*పెద్దశింగరాచార్యులు (తచ్చూరు):— 19 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ లక్ష్యలక్షణ విద్వాంసుడు. ఆంధ్ర వైష్ణవ బ్రాహ్మణుడు. శ్రీ సుబ్బరాయశాస్త్రి శిష్యుడు. సంస్కృత, తెలుగు భాషలందు గొప్ప పండితుడు. స్వనామముద్రతో అనేక కృతులు, జావళులు రచించిన ఘనుడు. కొన్ని సంగీత గ్రంథములను కూడ రచించెను. ఈయన రచనలలో కల్యాణి రాగములోని 'దేవీమీనాక్షి ముదం' అను కృతి మిగుల ప్రసిద్ధమగును. ఈయన మద్రాసునందు నివసించెను.

*పెరుమాళయ్య (వీణ) :— తంజావూరు ఆస్థాన విద్వాంసుడు. వైణికుడు. ఆంధ్ర బ్రాహ్మణుడు. యావద్భారతమందుగల యనేక సంస్థానములందుకచ్చేరీలు జేసిరత్న ఖచితమగు వీణయు, బహు సన్మానము లొందిన ఘనుడు. కొత్తకోట సంస్థానాధిపతియగు శ్రీ రఘునాథభూపాలుని సభలో ఒకేరాగమును వరుసగా 20 రోజులు వాయించి 10 వేలరూపాయల సన్మానము నొందిన ప్రతిభావంతుడు. సావేరి, సౌరాష్ట్రి రాగములందు యీయన రచించిన అటతాళవర్ణములు మిగులప్రసిద్ధములగును.

## పై

*పైడిస్వామి :— ఆంధ్రులలో నాగస్వరవాద్యమునందు మంచిపేరుగడించి ఇటీవలనే అకాలమరణము నొందిన విద్వాంసుడు. రాజమండ్రి వాస్తవ్యుడు. ఈయన శిష్యుడే నేటి అంధగాయకుడగు చి॥ శ్రీ యమ్. యస్. బాలసుబ్రహ్మణ్యశర్మ యగును.

## పొ

పొన్నయ్యపిళ్ళె (కె.) :— తంజావూరు వాస్తవ్యుడైన ప్రసిద్ధ సంగీత లక్ష్యలక్షణ విద్వాంసుడు. అన్నామలై సంగీతకళాశాలలో అధ్యాపకులుగా పనిచేసిన ప్రముఖ గాయకుడు. అనేక కృతులను రచించెను. వాటిలో మధ్యమావతిలోని 'నిన్ను సారెకు' కీరవాణిలోని 'భక్తపాలన' రామప్రియలోని 'శ్రీ రాజరాజేశ్వరి' అను కృతులు ప్రసిద్ధములగును.

పొన్నుస్వామి :—శ్రీ సుబ్బరాయశాస్త్రి శిష్యకోటికి చెందిన ఒక ప్రసిద్ధ గాయకుడు. 19 వ శతాబ్దమునకు చెందినవాడు.

పొన్నుస్వామిపిళ్ళె (మధుర) :— 19-20 శతాబ్దములకు చెందిన సుప్రసిద్ధ నాగస్వర విద్వాంసుడు. ఈయన వాద్యము శాస్త్రయుక్తముగానుండి విశేష రంజకముగా నుండెడిది. ఈయన కొలది సంవత్సరముల క్రిందటనే మరణించెను.

## ఫ

ఫయ్యాజ్ ఖాన్ :—హిందుస్థాని సంగీతమునందు అద్వితీయమైన ప్రావీణ్యముగల సుప్రసిద్ధ గాయకుడు. ఉత్తరదేశీయుడు.

ఫలూస్కర్ (డి. వి.) :— హిందుస్థాని సంగీతములో అపారమైన కృషిచేసిన నేటి సుప్రసిద్ధ గాయకుడు. ఈయన గానము అత్యద్భుతముగా నుండును.

## బ

బడేగులామ్అలీఖాన్ :— హిందుస్థాని సంగీతమునందు యావద్భారత ప్రఖ్యాతి గల్గిన నేటి సుప్రసిద్ధ గాయకుడు. మాధుర్యమైన ఈయన గానపోకడలు ఊహాతీతమైనవిగా నుండి సభికులను తన్మయుల జేయును.

*బ్రహ్మయ్యశాస్త్రి (వారణాశి) :—ఆంధ్రదేశములో వయొలిన్ వాద్యములో సిద్ధహస్తులుగా విశేష ప్రఖ్యాతినొందిన నేటి ప్రముఖ సంగీత విద్వాంసులు. కీ॥ శే॥ శ్రీ విశ్వదాత కె. నాగేశ్వరరావు పంతులుగారి అధ్యక్షతన సంగీత కళానిధి, విద్వాన్ మైసూర్ శ్రీ కె. వరదాచారియర్ చే సువర్ణ ఘంటాకంకణము నొందిన పండితులు. నివాసము కృష్ణాజిల్లాలోని మచిలీపట్టణము. వీరి శిష్యులే సుప్రసిద్ధ కథకులగు ప్రయాగ సంగమేశ్వరశాస్త్రి.

## బా

*బాలమురళీకృష్ణ (మంగళంపల్లి) :— నేటి ఆంధ్ర గాయకులలో మిక్కిలి పేరుగడించిన ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. వయొలిన్, మృదంగ వాద్యములందుకూడ మంచి ప్రావీణ్యముగల యువకుడు. 'జనకరాగ కృతిమంజరి' అను గ్రంథమునకు గ్రంథకర్త. ఇటీవల భారతప్రభుత్వాద్య

ఘుల సమక్షమున గానప్రదర్శన మొనర్చి వారి మన్ననలనొందిన సమర్థుడు. 'గాన సుధాకర' బిరుదుగలవాడు. ప్రస్తుతము విజయవాడ ఏ. ఐ. ఆర్. నందు సంగీత పర్యవేక్షకుడుగా పనిచేయుచున్నాడు. వైదీక బ్రాహ్మణుడు. నివాసము విజయవాడ.

బాలసరస్వతి :— దక్షిణభారతములో శాస్త్రీయ భరతనాట్యమునందు విశేష ప్రావీణ్యము గడించిన నేటి సుప్రసిద్ధ నర్తకురాలు. నివాసము మద్రాసు.

బాలస్వామిదీక్షితర్ :— క్రీ॥శ॥ 1786 — 1858 కాలమునకుచెందిన ఎట్టయపుర సంస్థాన విద్వాంసుడు. వీణ, వయొలిన్, సితార్, స్వరబత్, మృదంగ వాద్యములలో మిక్కిలి ప్రతిభగలవాడు. శ్రీ ముద్దుస్వామి దీక్షితుని కనిష్టసోదరుడు. బాలకృష్ణశర్మ అను పేరుగలవాడు. శ్రీ కుమార ఎట్టప్ప మహారాజుచే వేయువరహాల విలువగల కెంపులు చెక్కబడిన సింహాలలాటములుగల జత తోడాలను చేతులకు తొడగబడిన మహావిద్వాంసుడు.

బాలసుబ్రహ్మణ్యము (జి. యన్.) :— దక్షిణ భారతములో నేటి సుప్రసిద్ధ గాయక శిఖామణులలో మిగుల కీర్తినార్జించిన ప్రముఖ విద్వాంసుడు. త్రికాలము పాడగలిగిన మాధుర్యమైన గాత్రధర్మము గలవాడు. తిరువాన్కూరు ఆస్థాన సంగీత విద్వాంసుడు. ఇంగ్లీషులో యమ్. ఏ; ఆనర్సు డిగ్రీనొందిన సమర్థుడు. కీర్తనల రచయిత. ఈయన రచనలలో 'సదా పాలయ' అను మోహనరాగములోని కృతి సుప్రసిద్ధము. మదరాసునందు నివాసము. తమిళ బ్రాహ్మణుడు.

బాలు :— శ్రీ సుబ్బరాయశాస్త్రి శిష్యకోటికి చెందిన యొక ప్రాచీన ప్రసిద్ధ వయొలిన్ విద్వాంసుడు.

## బి

బిల్వవనమ్ :— శ్రీ ముద్దుస్వామి దీక్షితుల శిష్యకోటికిచెందిన ప్రముఖ విద్వాంసుడు. సంగీతమునందు మిగుల సమర్థత గలవాడు.

బిస్మిల్లా :— 'షెహనాయ్' వాద్యములో యావద్భారత కీర్తిగడించిన సుప్రసిద్ధ హిందుస్థాని సంగీతవిద్వాంసుడు. ఈయన వాద్యము అతి మనోహరముగా నుండును. ఈయన నివాసము కాశీక్షేత్రము.

## బో

బోధేంద్రసద్గురుస్వామి :— ప్రసిద్ధమైన భగవన్నామ సంకీర్తనలను రచించిన ప్రఖ్యాత రచయిత. ఈయన రచనలలో తోడిలోని 'సతమని ప్రణుతింపుచును' అను కీర్తన సుప్రసిద్ధము. ఈయన కొన్ని నామావళులుకూడ రచించెను. కంజీవరమున నివసించెను. ఈయతీంద్రునకు బోధేంద్ర సరస్వతి అనియు తమిళమున బోధేంద్రాళ్ అనియు పేర్లుగలవు.

## భ

భండార్కర్ (పి. ఆర్.) :— శృతులను గురించి విశేషముగా పరిశోధనలు సల్పిన ప్రాచీన సంగీత లక్షణ విద్వాంసుడు.

భరతమోహిని :— భరతనాట్యమునందు విశేష ప్రావీణ్యముగల నొక ప్రసిద్ధమైన ప్రాచీన నర్తకురాలు.

భరతాచార్యులు :— 'నాట్యశాస్త్రము' అను సుప్రసిద్ధ ప్రమాణగ్రంథమును సంస్కృతమున రచించిన యొక ప్రాచీన లక్షణకారుడు. 5-6 శతాబ్దములకు చెందినవాడు. కాళిదాసునికంటె ముందువాడు. ఈతని గ్రంథము సంగీత, నాట్యశాస్త్రములకు సంబంధించిన గ్రంథము లన్నిటికంటెను అతి పురాతనమైనది. 'భరత' అనుపేరు భావ, రాగ, తాళముల ప్రథమాక్షర సంయోగముచే నేర్పడినదగును.

## భా

భాత్ఖండె (వి. యన్) :— హిందుస్థాని సంగీతములో అనేక గ్రంథములు రచించిన సుప్రసిద్ధ సంగీత లక్షణ విద్వాంసుడు. 10-8-1860 తేదీన జన్మించెను. మహారాష్ట్ర బ్రాహ్మణుడు. ఈయన గ్రంథములందు జనక, జన్యరాగవిభజన చేయబడెను. ఈయన శిష్యుడే లక్నో హిందుస్థాని మ్యూజిక్ కాలేజి ప్రిన్సిపాలు యగు శ్రీ కృష్ణనారాయణ రత్నజంకర్.

*భావనారాయణరావు (ద్వారం) :— సంగీత లక్ష్య లక్షణములందు విశేషకృషి చేసి బి. ఏ; డిగ్రీనొందిన ప్రసిద్ధ గాయకుడు. వయొలినిస్టు. శ్రీ విజయనగరం మహారాజావారి సంగీత కళాశాలలో అధ్యాపకులుగా పనిచేయుచున్నారు.

భావభట్టు :— 17 వ శతాబ్దమునకు చెందిన గొప్ప సంగీత లక్షణకారుడు. ఈయన సంస్కృతములో 'అనూపసంగీత విలాసము' 'అనూప సంగీత రత్నాకరము' 'అనూప సంగీతాంకుశ' అను మూడు గ్రంథములను రచించెను. వీటిలో నాద, శృతి, స్వర, రాగముల గురించియు, గాత్రజ, యంత్రజముల గురించియు ఆ కాలమునగల 70 ముఖ్యరాగముల నేగాక యిప్పటి అనేక రాగములను గురించి కూడ పేర్కొనెను.

భాస్కరదాసు :— తమిళములో సుప్రసిద్ధ జానపదగేయములను, జాతీయ గీతములను రచించిన ప్రఖ్యాత రచయిత.

## మ

మంజూనాథ్ :— మైసూరు రాష్ట్రమునకు చెందిన సుప్రసిద్ధఘటవాద్యవిద్వాంసుడు. నివాసము బెంగుళూరు. బ్రాహ్మణుడు.

మణిఅయ్యర్ (మధుర) :— కర్నాటక సంగీతములో నేడుగల సుప్రసిద్ధ గాయక శిఖామణులలో గొప్ప కీర్తిగడించిన ప్రముఖ విద్వాంసుడు. తమిళబ్రాహ్మణుడు. స్వరకల్పన చేయుటలో యీయనకుగల సామర్థ్యము అపారము.

మణిఅయ్యర్ (టి. యన్.) :— దక్షిణ భారతములో నేడు అసమాన కీర్తిగడించిన సుప్రసిద్ధ మృదంగ విద్వాంసుడు. పాలఘాట్ బ్రాహ్మణుడు. లయజ్ఞానమందును, పాటననుకరించి వాయించుటయందును యీయనకుగల సామర్థ్యము అపారము. ఈయన శిష్యులనేకులు గలరు. వారిలో శ్రీ కల్పాతి రామనాథము, శ్రీ ఎల్లా సోమన్న, శ్రీ అట్లూరి వెంకటేశ్వరరావు మొదలగువారు ప్రసిద్ధులగుదురు.

మతంగుడు :—'బృహద్దేశి' అను ప్రసిద్ధమైన ప్రమాణ లక్షణగ్రంథమును సంస్కృతమున రచించిన ప్రాచీన లక్షణకారుడు. ఈ గ్రంథమున దేశీయ రాగములనుగూర్చియు, వాయు జంత్రములను గూర్చియు వివరింపబడెను. ఇతడు శార్ఙ్గదేవునికంటె ముందువాడని తెలియుచున్నది.

మహాలింగము (టి. ఆర్.) :— నేటి సుప్రసిద్ధ వేణువాద్యకులలో విశేష ప్రఖ్యాతి గడించిన ప్రముఖ విద్వాంసుడు. శృతి, లయ, రాగ, స్వర జ్ఞానములందు మిక్కిలి ప్రతిభగలవాడు. తమిళ బ్రాహ్మణ యువకుడు. నివాసము మద్రాసు.

మహావైద్యనాథయ్యర్ :—1844 – 1893 కాలమునకు చెందిన సుప్రసిద్ధ గాయకశిఖామణి. ఈతని గానము గంధర్వగానమని స్తుతించెడివారు. ఇతడు 7 వ ఏటనే ప్రసిద్ధ గాయకుడై 12 వ ఏటనే 'మహా' అను బిరుదునొందెను. 72 మేళకర్తలలో రాగమాలికనురచించి ప్రదర్శించెను. మహారాజు లనేకులచే బహు సన్మానములొంది 7-1-1893 వ తేదీన స్వర్గస్థుడయ్యెను.

## మా

మాణిక్యవాచకస్వామి :— తమిళములో 'తిరువాచకము'లను రచించిన ప్రాచీన సుప్రసిద్ధ రచయిత. ఈయన రచనలలో ఆరభి రాగములోని 'ముత్తినెజేయతియాద' అనునది ఒక ముఖ్యరచనయగును.

మాణిక్యముదలియార్ :— 'సంగీత చంద్రిక' అను ప్రసిద్ధ సంగీత లక్షణగ్రంథమును రచించిన ప్రాచీన గ్రంథకర్త.

మాణిక్యవర్మ :— హిందుస్థాని సంగీతమునందు నేడు మిక్కిలి ప్రసిద్ధినొందిన గాయకురాలు. ఈమె గాత్రము అతి మాధుర్యముగానుండి రంజకముగా నుండును.

మాముండియాపిళ్ళై :— మృదంగవాద్యములో మిక్కిలి కీర్తిగడించిన ప్రాచీన తమిళ విద్వాంసుడు. శ్రీ పుదుక్కోట దక్షిణామూర్తిపిళ్ళె సమకాలికుడు. ఈయన కుమారుడే నేటి ప్రఖ్యాత మృదంగ విద్వాంసుడగు శ్రీ పళని సుబ్రహ్మణ్యపిళ్ళెయగును.

మారిముత్తుపిళ్ళె :— శ్రీ చిదంబర 'నటరాజస్వామి'పై అనేక భక్తిరస కీర్తనలను తమిళములో రచించిన ప్రఖ్యాత ప్రాచీన రచయిత. ఈతని రచనలలో 'యదుకులకాంభోజి రాగము'లోని 'కాలైతూక్కి' అనునది సుప్రసిద్ధమగును.

## మీ

మీనాక్షిసుందరంపిళ్ళె :— దక్షిణ భారతములో డోలు (తవిల్) వాద్యమునందు విశేష ప్రఖ్యాతినొంది యిటీవలనే మరణించిన ప్రసిద్ధ విద్వాంసుడు.

మీర్ వార్తు (డాక్టరు) :— సంగీతవాద్యములను గురించి విశేషపరిశోధనలుచేసి ఇంగ్లీషులో నొక గ్రంథమును ప్రకటించిన ప్రఖ్యాత గ్రంథకర్త.

## ము

ముత్తయ్య భాగవతర్ (యల్.) :— 19-20 శతాబ్దములకుచెందిన సుప్రసిద్ధ

గాయకుడు. హరికేశనల్లూరు వాస్తవ్యుడు. గాయకశిఖామణి బిరుదుగలదు. సంగీత కచ్చేరీలను, హరికథాకాలక్షేపములను చేయగల ప్రతిభగలవాడు. సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుడు. ఈయన రచించిన కీర్తనలు యీయన జీవితకాలములోనే మిక్కిలి ప్రచారములోనికి వచ్చినవి. ఇందుకుముఖ్యకారణము ఆయన కీర్తనలకుగల రాగభావ శైలియేయగును. మైసూరు ఆస్థాన విద్వాంసుడుగానుండి 1936 లో కన్నడములో 'శ్రీ చాముండాంబాష్టోత్తర శతనామ సంకీర్తనావళి' గ్రంథమును రచించెను. 1930 లో మద్రాసు మ్యూజిక్ అకడెమీవారిచే 'సంగీత కళానిధి' అను బిరుదునొందెను. ఈయన రచనలలో శంకరాభరణములోని 'సహజగుణరామ' షణ్ముఖప్రియలోని 'వల్లీనాయక' ఉదయరవిచంద్రికలోని 'హిమగిరి తనయే' కాంభోజిలోని 'రత్నకంచుక' అను కీర్తనలు మిగుల సుప్రసిద్ధములగును.

ముత్తుతాండవర్ :— శ్రీ నటరాజస్వామిపై అనేకమగు భక్తిరస కీర్తనలను రచించిన ప్రాచీన ప్రఖ్యాత విద్వాంసుడు. ఆభోగిరాగములోని 'సేవిక్కవేండుమ్' అనునది ఈయనయొక్క ప్రసిద్ధ రచనలలో నొకటియగును.

ముద్దుస్వామిదీక్షితర్ :— క్రీ॥ శ॥ 1775–1835 కాలమునకుచెందిన సంగీత త్రిమూర్తులలో నొకరైన సుప్రసిద్ధ గాయక శిఖామణి. ఈయన హంసధ్వనిరాగమును సృజించిన శ్రీ రామస్వామిదీక్షితుని కుమారుడు. శ్రీ [illegible], గోవిందదీక్షితుల సంతతివాడు. సర్వవిద్యాపారంగతుడు. చిదంబరనాథయోగి శిష్యుడు. ఇతడు గురువుతోకలిసి కాశీకివెళ్ళి 5 సంవత్సరములుండి శ్రీ విద్యా రహస్యములను తెలిసికొని హిందుస్థాని సంగీతములో విశేష కృషిచేసి తిరిగివచ్చెను. శ్రీ సుబ్రహ్మణ్యోపాసనాఫలితమున స్వామివారి అనుగ్రహమునొంది 'గురుగుహ' ముద్రతో షుమారు 300 రచనలు రచించెను. వీటిలో నవగ్రహ కృతులు, నవావర్ణ కృతులు, పంచలింగస్థల కృతులు, తానవర్ణములు, రాగమాలికలు, లక్షణ గీతములును గలవు. వీరి రచనలలో శుభపంతువరాళిలోని 'శ్రీ సత్యనారాయణం' శంకరాభరణంలోని 'అక్షయలింగవిభో' అను కృతులు మిగుల ప్రసిద్ధములగును. ఈయన క్రీ॥ శ॥ 1835 లో తులకృష్ణ (ఆశ్వీయుజ బహుళ) చతుర్దశియందు స్వర్గస్తుడయ్యెను. ఈయనకు 9 మంది శిష్యులుగలరు. వారిలో తిరుక్కాడయూరు భారతి, అవడయార్ కోవిల్ 'వీణ వెంకట్రామయ్య' వంటివారు ముఖ్యులగుదురు.

ముష్తాక్‌హుసేన్‌ఖాన్ (ఉస్తాద్) :— హిందుస్థాని సంగీతములో విశేషకీర్తిగడించిన నేటి ప్రఖ్యాత విద్వాంసుడు.

## మే

మేరుస్వామి :— ప్రఖ్యాత హరికథాకాలక్షేపకుడగు ప్రాచీన విద్వాంసుడు. ఈయనకు 'అనంతపద్మనాథ గోస్వామి' యను మరియొక పేరుగలదు.

# యు

యువరంగభూపతి :— దక్షిణదేశములో సంగీతకళను విశేషముగా ప్రోత్సహించిన 'ఉదయర్ పలాయము' సంస్థానాధీశ్వరుడు. శ్రీ తులజాజీ మహారాజు కాలము నాటివాడు. ఈయన అనేకమంది పండితులను ఆస్థాన విద్వాంసులుగానుంచుకొని పోషించెను. ఇతనిమీద వాగ్గేయకారులు రచించిన పదములను 'యువరంగ పదము' లని చెప్పుటకలదు.

# యె

యెహూదీమెనూహిన్ :— వయొలిన్ వాద్యములో ప్రపంచ ప్రఖ్యాతినొందిన సుప్రసిద్ధ పాశ్చాత్య సంగీత విద్వాంసుడు. ఈయన గత సంవత్సరము మన ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ పండితుని ఆహ్వానముపై ఇండియావచ్చి యిచ్చటి ప్రధాన నగరములందు అత్యద్భుతమైన తన వయొలిన్ వాద్యమును ప్రదర్శించి భారత ప్రజల మన్ననలను పొందెను. ఈయన మన కర్నాటక హిందుస్థాని సంగీతముల లోని విశిష్టతనుగుర్తించి మిగులశ్లాఘించెను.

# ర

రంగరామానుజయ్యంగార్ (ఆర్.) :— తమిళములోను తెలుగులోను శ్రీ త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రుల కృతులను ఆఱుభాగములుగా గల 'కీర్తనమణిమాల' అను గ్రంథమును రచించిన నేటి ప్రసిద్ధ గ్రంథకర్త. నివాసము మద్రాసు.

రఘునాథనాయకుడు :— తంజావూరుసంస్థానాధీశ్వరుడగు సుప్రసిద్ధ ప్రాచీన విద్వాంసుడు. తన ప్రధానమంత్రి శ్రీ గోవింద దీక్షితుల సహకారముతో 'సంగీతసుధ' అను లక్షణగ్రంథమును రచించిన మహారాజు. కర్నాటక సంగీతమును చాలా వఱకు పరిష్కరించి మనకు మార్గదర్శకుడైన రాజు. వీణకు ఒకస్థాయిలో 12 స్వరస్థానము లుండునట్లు మెట్లను యమర్చుట యీయన కాలమునుండియే అమలులోనికి వచ్చెనని తెలియుచున్నది.

రమణయ్యచెట్టి :— 'జలతరంగ' వాద్యములో విశేష ప్రావీణ్యముగలిగిన నేటి సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. ఈయన నివాసము మదరాసునగరము.

రవిశంకర్ (పండిత) :— 'సితార్' వాద్యములో యావద్భారత ప్రఖ్యాతి నొందిన నేటి సుప్రసిద్ధ హిందుస్థాని సంగీత విద్వాంసుడు. ఈయన వాద్యమును శ్రీ 'యెహూదీ మెనూహిన్' సయితము మెచ్చుకొనెను.

రసూలన్‌బాయ్ :— హిందుస్థాని సంగీతములో నేడు విశేష ప్రఖ్యాతిగడించిన సుప్రసిద్ధ గాయకురాలు. ఈమె గాత్రము అతి మాధుర్యముగా నుండును.

# రా

*రాజమన్నారు (పి. వి.) :— నేటి మద్రాసు హైకోర్టుకు ప్రధాన న్యాయమూర్తులుగానున్న సుప్రసిద్ధ విద్యావేత్తలు. సంగీత సాహిత్యములందు విశేష కృషి చేసినవారు. ప్రస్తుతము భారత ప్రభుత్వము వారు యేర్పఱచిన సంగీత, నాట్యకళా పరిషత్ కు అధ్యక్షులుగా నున్నారు. గ్రంథక

రచయితలు. ఆంధ్రులలో అత్యున్నత పదవిలోనున్న సంగీత రసికాగ్రేసరులు.

రాజమాణిక్యంపిళ్లై (కుంభకోణం) :— నేటి సుప్రసిద్ధ వయొలినిస్టులలో మిక్కిలి పేరుగలిగిన సంగీత విద్వాంసుడు. ప్రక్క వాద్యమునం దతి సమర్థుడు. తిరువాన్కూరు సంస్థాన విద్వాంసుడు. ఈయన క్రీ॥శ॥ 1949 లో మద్రాసు సంగీత పరిషత్ వారిచే జరుపబడిన సంగీత మహాసభకు యధ్యక్షతవహించి 'సంగీతకళానిధి' అను బిరుదును పొందెను. నివాసము కుంభకోణము.

రాజరత్నంపిళ్ళె (టి. యన్.) :—దక్షిణ భారతములో నాగస్వర వాద్యములో నేడు అసమాన కీర్తిగడించిన ప్రముఖ విద్వాంసుడు. రాగాలాపనయం దతి సమర్థుడు. నివాసము కుంభకోణము.

*రామకృష్ణయ్యాపంతులు (పారుపల్లి) :— ఆంధ్రదేశమందలి సుప్రసిద్ధ గాయకులలో విశేష కీర్తిగడించిన ప్రముఖ సంగీత విద్వాంసుడు. 'గాయక సార్వభౌమ' అను బిరుదుగలదు. గురుభక్తిగలవాడు. తమ గురువైన కీ॥ శే॥ శ్రీ సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిలయొక్క వర్ధంతి మహోత్సవములను కడు భక్తితో 30 సంవత్సరములకు పైగా జరిపినట్టి మార్గదర్శకుడు. ఆంధ్ర నియోగిబ్రాహ్మణుడు. నివాసము విజయవాడ. ఈయన షుమారు 3 సంవత్సరముల క్రిందటనే స్వర్గస్థులైరి. వీరు అనేకమంది శిష్యులను తయారుచేసిరి. వారిలో శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ శ్రీ చిలకలపూడి వేంకటేశ్వరశర్మ వంటి గాయకులును, శ్రీ అన్నవరపు రామస్వామి, శ్రీ సరిదె సుబ్బారావు, శ్రీ యన్. సి. కృష్ణమాచార్యులు వంటి వయొలినిస్టులును ప్రసిద్ధులుగా నున్నారు.

*రామచంద్రరావు (పోలవరపు) :— సంగీతమునందు విశేష కృషిచేసిన నేటి సుప్రసిద్ధ పండితుడు. బి. ఏ; బి. యల్; డిగ్రీనొందిన ప్రముఖ న్యాయవాదులు. మురళీవాద్యమునందు విశేష ప్రతిభగలవాడు. ఆంధ్ర నియోగిబ్రాహ్మణుడు. ఈయన నివాసము విజయవాడ.

*రామచంద్రరావు (చింతలపల్లి) :— మైసూరు రాష్ట్రమునకు చెందిన సుప్రసిద్ధ గాయకుడు. మైసూరు ఆస్థాన సంగీత విద్వాంసుడగు శ్రీ చింతలపల్లి వెంకట్రావు యొక్క కుమారుడు. తెలుగు మురికినాటి బ్రాహ్మణుడు. ఈయన నివాసము బెంగుళూరు.

రామదాస్ :— భక్తిరసప్రధానమైన యనేక సంగీత రచనలను రచించిన ప్రాచీనుడగు నొక గుజరాతీ విద్వాంసుడు.

*రామదాసు (భద్రాచల) :—16 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ కీర్తనల రచయిత. తెలుగు నియోగిబ్రాహ్మణుడు. గొప్ప రామభక్తుడు. భద్రాచలము తహశీలుదారుగా నున్నప్పుడు సర్కారు ధనము ఆరులక్షల వరహాలు శ్రీరామ కైంకర్యమునకు వినియోగించినందున గోల్కొండ తానీషాచే 12 సంవత్సరములు శిక్షింపబడెను. ఆసమయములో ఈయన రచించిన కీర్తనలు మిగుల భక్తిపూరితములు.

షితని ప్రార్థనలచే శ్రీరామునకు అనుగ్రహము కలిగి బంధవిముక్తుని చేయగా తరించిన పుణ్యమూర్తి. ఈ మహనీయుని గురించి శ్రీ త్యాగరాజు సయితము తన రచనలగు దేవగాంధారిలోని 'క్షీరసాగర శయన' తోడిలోని 'బృందావనలోల' అనెడి కృతులయందు కొనియాడెను.

*రామమూర్తి (అశ్వధాటి) :— ఆంధ్ర దేశములో మృదంగవాద్యములో అసమాన కీర్తిగడించి గతించిన ప్రఖ్యాత మృదంగ విద్వాంసుడు. ఈయన నివాసము మచిలీపట్టణము. ఈయన శిష్యుడే కీ॥ శే॥ శ్రీ పొట్లూరి వీరరాఘవయ్య చౌదరి యగును.

రామలింగస్వామి :— తమిళములో 'తిరువరుట్పా' రచియించిన ప్రఖ్యాత రచయిత. వీరి రచనలలో సురటి రాగములోని 'మాట్రటియాద' రాగమాలికలోని 'తన్నైయరిందు' అను రచనలు మిగుల ప్రసిద్ధములగును.

రామస్వామిదీక్షితర్ :— క్రీ॥ శ॥ 1735-1817 కాలమునకుచెందిన ప్రముఖ సంగీత లక్ష్యలక్షణ విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. శ్రీ ముద్దుస్వామిదీక్షితునికి తండ్రి. హంసధ్వని రాగమును సృష్టించిన ప్రసిద్ధ పండితుడు. 'నాటకాది విద్యల' అను 108 రాగతాళమాలికను రచించి 'శ్రీ మణలి వెంకటకృష్ణ ముదలియార్'చే కనకాభిషేకమొందిన మహానుభావుడు. ప్రతి ఏకాదశియందును జయదేవుని 24 అష్టపదులను పాడుచుండువాడు. ఈయన క్రీ॥శ॥ 1817 ధాతు సంవత్సర మాఖ శివరాత్రియందు శ్రీపురమను తిరువారూరులో స్వర్గస్థుడయ్యెను.

రామస్వామిభాగవతులు (ప్రతాప) :— శ్రుతులనుగురించి విశేషపరిశోధనలు సల్పిన ప్రాచీన సంగీత లక్షణకారుడు.

రామస్వామిశివన్ :— శ్రీ మహావైద్యనాథయ్యర్‌కు జ్యేష్ట సోదరుడగు సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. 'గుహదాస' ముద్రతో అనేక కృతులు, వర్ణములు రచించెను. ఈయన రచనలలో కాంభోజిలోని 'పంకజాక్షిపై' అను స్వరాక్షరవర్ణము, జనరంజనిలోని 'పాహిమాం శ్రీ రాజరాజేశ్వరి' సరసాంగిలోని 'నీకేలదయరాదు' అను కృతులు సుప్రసిద్ధములు. మరియు నితడు పెరియపురాణ. కీర్తనలనుగూడ రచించెను. ప్రసిద్ధ గాయకుడుగా పేరొందెను.

*రామసుబ్బయ్య (వారణాశి) :— 19-20 శతాబ్దములకుచెందిన ఆంధ్రదేశ సుప్రసిద్ధ గాయకులలో మేటియైన విద్వాంసుడు. దక్షిణభారతమంతయు పర్యటించి అనేక సభలుచేసి అఖండ ప్రఖ్యాతినార్జించిన ప్రఖ్యాత గాయకుడు. ఈయన చిన్న వయస్సునందే అకాలమరణమునొందెను. నివాసము గుంటూరు జిల్లా పొన్నూరు. వైదీక బ్రాహ్మణుడు. ఈయన శిష్యుడే ప్రసిద్ధ గాయకుడై గతించిన శ్రీ తాడిగడప శేషయ్యయగును.

రామానందయతీంద్రులు :— 18 వ శతాబ్దమునకుచెందిన ఒక ప్రసిద్ధ రచ

యిత. ఈయన రచనలలో 'గౌరీరాగ ప్రబంధము' మిగుల ప్రసిద్ధమైనది.

రామానుజయ్యంగార్ (అరియకుడి) :— కర్నాటక సంగీతములోగల నేటి సుప్రసిద్ధ గాయకశిఖామణులలో మిగుల ప్రముఖుడైన సంప్రదాయ విద్వాంసుడు. సంగీత రత్నాకర, సంగీత కళానిధి బిరుదులనొందిన ప్రతిభగలవాడు. 1938 లో మద్రాసు సంగీత పరిషత్ వారు జరిపిన సంగీత మహాసభకధ్యక్షతవహించి 'సంగీత కళానిధి' బిరుదునొందెను. మరియు ఇటీవల భారత ప్రభుత్వాధ్యక్షులచే ప్రముఖ గాయకుడుగా మొదటిసన్మానమొందిన ప్రసిద్ధ పురుషుడు. తమిళ వైష్ణవ బ్రాహ్మణుడు.

*రామామాత్యుడు :— 16 వ శతాబ్దమునకు చెందిన తెలుగు నియోగి బ్రాహ్మణుడు. గొప్ప సంగీత లక్షణకారుడు. విజయనగర రామదేవరాజు (1472-1550) కోరికపై 'స్వరమేళకళానిధి' అను గ్రంథమును రచించిన ఘనుడు. ఈ గ్రంథమున 20 మేళములను అనేక జన్యరాగములను పేర్కొని ఉత్తమ, మధ్యమ, అధమ రాగములుగా విభజించెను. ఇప్పటి 4 తంత్రులు (మీది) గల వీణ ఈయన కాలమునుండియే అమలులోనికి వచ్చెనని చెప్పుదురు. ఈయనకు 'అభినవభరతాచార్య' అను ప్రసిద్ధ బిరుదుగలదు.

రామారావు (తంజావూరు) :— శ్రీ త్యాగరాజునికి మిగుల అభిమాన పాత్రుడైన ప్రముఖ సంగీత విద్వాంసుడు. ఈయన నివాసము తంజావూరు.

## ల

లక్ష్మణపిళ్ళె (టి.) :— సుప్రసిద్ధ తమిళ కీర్తనల రచయితయగు సంగీత లక్ష్యలక్షణ విద్వాంసుడు. నివాసము దక్షిణ భారతములోని త్రివేంద్రము. ఈయన రచనలలో సావేరిలోని 'కార్తరుళ్వాయ్' అనునది ఒక సుప్రసిద్ధ రచనయగును.

లక్ష్మీకాంత మహారాజు :— సంగీత, సంస్కృతములలో గొప్ప పండితుడును, క్షత్రియుడునగు ప్రాచీనరచయిత. ఈయన కీర్తనల శైలి బహు చమత్కారముగ నుండును.

లక్ష్మీనారాయణ :— 'సంగీత సూర్యోదయము' అను ప్రసిద్ధ సంగీత లక్షణ గ్రంథమును రచించిన ప్రాచీన సంగీత విద్వాంసుడు. ఈయన విజయనగర సామ్రాజ్యమేలిన శ్రీ కృష్ణదేవరాయల కాలమున యుండినట్లుగా తెలియుచున్నది.

## లి

లింగరాజు అర్సు (మైసూరు) :— మైసూరు సంస్థానమునకు చెందిన ప్రముఖ కీర్తనల రచయితయగు విద్వాంసుడు. స్వనామ ముద్రగల ఈయన రచనలలో 'నీలాంబరిలోని' 'శృంగారలహరి' అను చిట్టస్వరముగల కృతి ఒక సుప్రసిద్ధ రచనయగును.

## లో

లోచనకవి :— 'రాగతరంగిణి' అను ప్రసిద్ధ లక్షణగ్రంథమును రచించిన ప్రాచీన గ్రంథకర్త. ఈ గ్రంథము హిందుస్థాని సంగీత సంప్రదాయముగా రచింపబ

డెను. దీనిలో 12 జనక రాగములును, వాటి మూర్ఛనలును, జాతులనుంచి రాగములను గ్రహించు విధమును పేర్కొనబడియున్నది.

## వ

*వరదయ్య (వీణ) :— శ్రీ బొబ్బిలి కేశవయ్య వంశస్థుడైన ప్రసిద్ధ వైణిక విద్వాంసుడు. గొప్ప రచయిత. అనేక కీర్తనలు, వర్ణములు "శ్రీరంగేశ" ముద్రతో రచించిన ప్రాచీన పండితుడు.

*వరదరాజయ్యంగార్ (వింజమూరి):— ఆంధ్ర గాయకులలో విశేష ప్రఖ్యాతి గడించిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. బి. ఏ; డిగ్రీనొందెను. మంచిధీమాతో పాడగల గాయకుడు. ఈయననివాసము గుంటూరు. ప్రస్తుతము మద్రాసులో నున్నారు. ఈయన సోదరుడే శ్రీ వింజమూరి శ్రీనివాసాచారి. బి. ఏ; బి. యల్; డిగ్రీనొంది మురళీవాద్యమునందు ప్రావీణ్యము గడించిరి. ఈయన సంగీత కళాభివృద్ధికై గానసభను స్థాపించి విశేషముగా కృషి చేయుచున్న కళారాధకుడు.

వరదాచారియర్ (కె,) :—టైగర్ విద్వాన్ అను ప్రశస్తమైన బిరుదునొంది కీ|| శే|| సుప్రసిద్ధ సంగీత లక్ష్యలక్షణ విద్వాంసుడు. గొప్పగాయకుడు. అపురూప రాగములందు సయితము అనర్గళముగా ఆలాపనచేసి రంజింపచేయగల సమర్థుడు. 1932 లో మద్రాసు సంగీత పరిషత్ వారిచే "సంగీత కళానిధి" అను ప్రసిద్ధమైన బిరుదునొందిన ప్రఖ్యాతపురుషుడు. శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ శిష్యులు. శ్రీవైష్ణవ బ్రాహ్మణులు. మద్రాసునందు నివసించెను.

*వరాహనరసింహాచార్యులు (వింజమూరి) :— కాకినాడ వాస్తవ్యులగు సంగీతశాస్త్ర పరిశోధకులు. 'శృతులు స్వరావళి' అను చిన్న గ్రంథమును రచించెను. ఆంధ్ర వైష్ణవ బ్రాహ్మణుడు.

వసంతకుమారి (యమ్. యల్.) :—నేటి సుప్రసిద్ధ గాయినీమణులలో విశేష ప్రఖ్యాతినొందిన ప్రసిద్ధ విద్వాంసురాలు. ఈమెకు 'సంగీతవాణి' అను ప్రశస్తబిరుదు గలదు. ఈమె గాత్రము గమకయుతమైన మంచి వదుగుబడిగలిగి మాధుర్యముగా నుండును. ఈమె నివాసము మదరాసు.

వసంతకోకిల (యన్. సి.) :— సుప్రసిద్ధ గాయకురాలుగా మంచి కీర్తిగడించి యిటీవల అకాలమరణమునకు గురియైన విద్వాంసురాలు. ఈమె మద్రాసులో నివసించెను.

## వా

వాదిరాజు :— కన్నడములో అనేక భక్తిరస కీర్తనలు రచించిన ప్రాచీన సుప్రసిద్ధ రచయితయగు గొప్ప పండితుడు.

వాసుదేవాచారి (కె.) :— మైసూరు ఆస్థానమునకు చెందిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. లక్ష్యలక్షణములందు గొప్ప పండితుడు. అనేక కీర్తనలను రచించెను. ఈ రచనలు 'వాసుదేవ' అను స్వనామ ముద్రగలిగి యుండును. మైసూరు మహారాజుచే 'సంగీతశాస్త్రరత్న' బిరుదును, 1935 లో మద్రాసు సంగీత పరిషత్ వారిచే 'సంగీత కళానిధి' బిరుదును పొందెను. ఇటీవల భారతప్రభుత్వముచేకూడ సన్మానింపబడెను. ఈయన రచనలలో

ఖమాసులోని 'బ్రోచేవారెవరురా' అను నది ఒక సుప్రసిద్ధ రచనయగును.

వ్యాసరాయస్వామి :— కన్నడములో అనేక భక్తిరసకీర్తనలు రచించిన ప్రాచీన సుప్రసిద్ధ రచయితయగు విద్వాంసుడు.

## వి

వినాయకపట్వర్ధన్ :— హిందుస్థాని సంగీతములో విశేష కీర్తిగడించిన నేటి ప్రఖ్యాత గాయకుడు. ఈయన పూనానగరమున సంగీతవిద్యాలయమునొకటి స్థాపించి నడుపుచున్నారు. సంగీత రచయిత. గ్రంథకర్త.

విజయగోపాలుడు :— 17 వ శతాబ్దమునకు చెందిన భక్తిరసకీర్తనల రచయిత. ఈయన రచనలు తెలుగు, సంస్కృత భాషలందుండి 'విజయగోపాల' ముద్రను గలిగియుండును.

విమల్‌వకాడే :— హిందుస్థాని సంగీతములో మిక్కిలి ప్రసిద్ధిగల గాయకురాలు. ఈమె గాత్రము మాధుర్యముగ నుండును.

విలాయత్‌హుసేన్‌ఖాన్ (ఉస్తాద్) :— ఈ కాలమునకుచెందిన సుప్రసిద్ధుడైన హిందుస్థాని సంగీతవిద్వాంసుడు. ఉత్తరదేశీయుడు.

విల్వాద్రిఅయ్యర్ (టి. యస్.) :— ఘటవాద్యములో విశేష ప్రావీణ్యముగల నేటి ప్రసిద్ధ విద్వాంసుడు. అయ్యజ్ఞానమందలి సమర్థుడు. తమిళ బ్రాహ్మణుడు.

విష్ణుదాస్ :— గుజరాతీభాషలో భక్తిరస కీర్తనలు అనేకము రచించిన ప్రాచీన విద్వాంసుడు. గుజరాతీయుడు.

విష్ణుదిగంబర్ :— యావద్భారత ప్రఖ్యాతిగల ప్రాచీన సుప్రసిద్ధ హిందుస్థాని గాయకుడు. భక్తుడు. ఈయన అనేకమంది శిష్యులను తయారుజేసెను.

## వీ

*వీరభద్రయ్య (మార్గదర్శి) :— 18 వ శతాబ్దమునకు చెందిన ప్రసిద్ధ కీర్తనల రచయిత. తెలుగు త్రైలింగ్య బ్రాహ్మణుడు. తంజావూరు శ్రీ ప్రతాపసింహ మహారాజు (1741 - 1765) కోరికపై 'ప్రతాపరామ' ముద్రతో రక్తి, దేశీయరాగములందు అనేక కీర్తనలు రచించిన మహనీయుడు. దక్షిణదేశ సంగీతము యీయన వల్లనే ఒకపద్ధతికి వచ్చుటచే 'మార్గదర్శి' అను ప్రశస్తమైన బిరుదునొందెను.

వీరభద్రయ్య (పాలఘాట్) :— నేటి సుప్రసిద్ధ మృదంగవిద్వాంసులలో మిక్కిలి కీర్తిగడించిన ప్రముఖ విద్వాంసుడు. నివాసము బెంగుళూరు. తమిళ బ్రాహ్మణుడు.

*వీరయ్యచౌదరి (పర్వతనేని) :— ఆంధ్ర గాయకులలో ప్రసిద్ధినొందిన గాయకుడు. 'భావోద్దీపనగాయక' అను బిరుదుగలదు. నివాసము గుంటూరు. ఈయన ప్రస్తుతము ఆంధ్రా యూనివర్సిటీ బోర్డు అఫ్ స్టడీస్ (మ్యూజిక్) మెంబరుగా నున్నారు.

*వీరరాఘవయ్యచౌదరి (పొట్లూరి) :— ఆంధ్రదేశములో విశేష కృషిచేసి మృ

దంగ, కంజిరా వాద్యములలో మిక్కిలి ప్రావీణ్యముగడించిన ప్రముఖ విద్వాంసుడు. కమ్మవారు. ఈయన మొదట శ్రీ అశ్వథాటి రామమూర్తి వద్దను, తరువాత శ్రీ పుదుక్కోట దక్షిణామూర్తిపిళ్ళె వద్దను, తదుపరి శ్రీ పళని సుబ్రహ్మణ్య పిళ్ళె వద్దను మృదంగవిద్య నభ్యసించి మిక్కిలి అభివృద్ధికివచ్చెను. ఈయన 1942 లో మరణించెను. ఈయన శిష్యులే మృదంగ, కంజిరా వాద్యములందు మిక్కిలి ప్రావీణ్యముగల శ్రీ మహదేవు రాధాకృష్ణరాజు, శ్రీ నర్రా గోపాలకృష్ణయ్య చౌదరి యగుదురు. వీరు తమ గురువు యొక్క వర్ధంతిని మిక్కిలి భక్తిశ్రద్ధలతో తమ నివాసస్థానమైన విజయవాడయందు ప్రతిసంవత్సరము జరుపుచుందురు.

వీరరాఘవయ్యర్ (చల్లగాలి) :—'తంజావూరు' సంస్థానమునకుచెందినయొక ప్రాచీన సంగీత విద్వాంసుడు. ఈయన లక్ష్య లక్షణములందతిసమర్థుడు. తమిళ బ్రాహ్మణుడు.

*వీరరాఘవశర్మ (ఓగిరాల) :— 'దేవీగానసుధ' అను కీర్తనల గ్రంథమును రచించిన యొక గ్రంథకర్త. ఈ రచనలు దేవీస్తవముగా నుండి భావయుక్తముగా నుండును. ఆంధ్ర బ్రాహ్మణుడు. ఈయన ప్రస్తుతము పశ్చిమగోదావరి జిల్లాలోని కొవ్వూరు గ్రామమునందు నివసించుచున్నాడు.

*వీరరాఘవాచార్యులు (పందెనపల్లి) :— ప్రాచీనుడగు సుప్రసిద్ధ వైణిక విద్వాంసుడు. ఆంధ్రుడు. లయజ్ఞానమునందతి సమర్థుడు. ఈయన విశాఖ మండలమునకు చెందినవాడని తెల్పియుచున్నది.



వీరుస్వామిపిళ్లె (పి. యస్.) :— తమిళదేశమున నేటి సుప్రసిద్ధ నాగస్వర విద్వాంసులలో మిక్కుటి ప్రఖ్యాతిగల విద్వాంసుడు. సంగీత లక్ష్య లక్షణము లందు మిగుల సమర్థుడు.

# వె

*వెంకటనారాయణాచార్యులు (టి. యన్. సి.) :—నేడు ఆంధ్రదేశము నందుగల సుప్రసిద్ధ వైణికులలో నొకరైన సంగీత విద్వాంసుడు. ఆంధ్ర వైష్ణవ బ్రాహ్మణుడు. నివాసము గుంటూరు. 'వైణిక శిరోమణి' అను బిరుదుగలదు. జాతిభేద సప్తతాళసహిత శతరాగ రత్నమాలిక' 'రాగనక్షత్రమాలికా'ది గ్రంథములకు గ్రంథకర్తలు. ప్రస్తుతము ఆంధ్రయూనివర్సిటీ సంగీత పరీక్షాధికారులుగా నున్నారు.

వెంకటమఖి :— 17 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ లక్ష్యలక్షణ విద్వాంసుడు. 'చతుర్దండీ ప్రకాశిక' అను ప్రమాణ గ్రంథమును సంస్కృతమున రచించిన మహానుభావుడు. తండ్రి గోవింద దీక్షితులు. గురువు తానప్పాచార్యులు. తంజావూరు శ్రీ విజయరాఘవభూపాలుని కోరికపై క్రీ॥శ॥ 1660 లో రచించిన 'చతుర్దండిప్రకాశిక' అను గ్రంథములో వీణ, శృతి, స్వర, మేళ, రాగ, ఆలాప, ఠాయ, గీత, ప్రబంధ, తాళములనుగురించి వ్రాసెను. మరియు రాగాంగ, ఉపాంగ, భాషాంగ, రాగలక్షణములనుబట్టి శ్లోకములు వ్రాసి గీతములను రచించెను. శ్రీజయదేవ కవి ననుసరించి తిరువారూరు 'శ్రీ త్యాగరాజస్వామి'ని స్తుతించుచూ 24 అష్టపదులను రచించెను. ఈయనను గురించి ఒక

అద్భుతకథ కలదు. ఈయన ఒకప్పుడు సేతుయాత్రకై పోవుచుండగా దారిలో దొంగలు బాధింపసాగిరి. వెంటనే లలిత రాగమున 'అరనిబిడ కంటక దుష్ప్రదేశ' అను గీతమును పాడగనే శ్రీ రామలక్ష్మణులు కోదండపాణులై వచ్చి యాచోరుల బాధను దీర్చినట్లుగా చెప్పుదురు.

*వెంకటప్పయ్యశాస్త్రి (మహావాది) :— నేటి ఆంధ్రదేశ సుప్రసిద్ధ గాయకులలో మంచి కీర్తిగడించిన సంగీత విద్వాంసుడు. మనోధర్మముతో పాడి రంజింపచేయగల సమర్థుడు. 'అభినవ సంగీత సాహిత్య భావ సమ్మేళన చక్రవర్తి' అను బిరుదుగలదు. ఆంధ్ర వైదీకబ్రాహ్మణుడు. ఈయన నివాసము గుంటూరు.

*వెంకటరమణదాసు (వీణ) :— ఆంధ్ర దేశములో 19వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధవైణికులలో అగ్రగణ్యుడుగా పేరొందిన ప్రాచీనవిద్వాంసుడు. ఘన, నయ, దేశ్యములం దతిసమర్థుడు. గొప్ప సాధకుడు. విజయనగర వాస్తవ్యుడు.

వెంకటరమణభాగవతర్(వాలాజీబాద్):— శ్రీ త్యాగరాజుని శిష్యులలో ముఖ్యుడు. ప్రాచీన లక్ష్య లక్షణ విద్వాంసుడు. సౌరాష్ట్రి బ్రాహ్మణుడు. తన గురువును ధ్యానించుచూ ధ్యానశ్లోకములు, మంగళాష్టకములు రచించెను. గురువుగారి కుమార్తె సీతాలక్ష్మి యొక్క వివాహమునకు 'శ్రీ కోదండరామస్వామి' చిత్రపటమును వ్రాయించితెచ్చిసమర్పింపగా త్యాగరాజు మహదానందముతో 'నన్నుపాలింప నడచి వచ్చితివో' అను కృతిని మోహనరాగములో కీర్తించెను. ఈయన 18-19 శతాబ్దములకు చెందినవాడు.

వెంకటరమణయ్య (సొంఠి) :— తంజావూరు ఆస్థాన సంగీత విద్వాంసుడు. శ్రీ త్యాగరాజునికి సంగీత గురువు. ఒక్క సంవత్సరములో త్యాగయ్యకు సంగీతమునందుగల లక్ష్య లక్షణ విషయములనెల్ల నేర్పిన మహానుభావుడు. బ్రాహ్మణుడు. ఈయన తిరువైయ్యూరునందు నివశించెను.

*వెంకటరాజు (కోలంక) :— నేటి ఆంధ్ర యువకులలో మృదంగ వాద్యమునందు మిక్కిలి ప్రఖ్యాతి గడించిన మార్దంగిక విద్వాంసుడు. ఈయన బాల్యమునుండియు 'సంగీతకళానిధి' శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారి ఆదరాభిమానములతో ప్రక్కన వాయించి అభివృద్ధికి వచ్చిన గుణవంతుడు. ఈయన నివాసము తూర్పుగోదావరిజిల్లాలోని తుని గ్రామము.

*వెంకటరమణదాసు :— ప్రసిద్ధమగు భక్తిరస కీర్తనలను రచించిన యొక ప్రాచీన పండితుడు. గొప్ప భక్తుడు.

*వెంకటవిఠలదాసు :— సుప్రసిద్ధమగు తెలుగు కీర్తనలను రచించిన ప్రాచీన విద్వాంసుడు. ఈయన గొప్ప భక్తుడు.

*వెంకటస్వామినాయుడు (ద్వారం):— వయొలిన్ వాద్యములో యావద్భారత ప్రఖ్యాతినొందిన నేటి సుప్రసిద్ధ సంగీత లక్ష్యలక్షణ విద్వాంసుడు. భారత ప్రభుత్వాధ్యక్షులచే వయొలిన్ వాద్యమున మొదటి సన్మానమునొందిన ప్రథము

ఆంధ్రుడు. శ్రీ విజయనగరం మహారాజా వారి సంగీత కళాశాలకధ్యక్షుడు. ఆల్ ఇండియా రేడియో మ్యూజిక్ ఆడిషన్ బోర్డు సభ్యుడుగా పనిచేసిన ప్రసిద్ధుడు. ఆంధ్రా యూనివర్సిటీలో సంగీతాధికార సభాసభ్యుడుగను, పరీక్షాధికారిగను యున్నట్టి పండితుడు. మద్రాసు మ్యూజిక్ అకడెమీ వారిచే 1941 లో జరుపబడిన సంగీత మహాసభకధ్యక్షతవహించి 'సంగీత కళానిధి' అను బిరుదును, శ్రీ మైసూరు మహారాజావారిచే 'సంగీతరత్నాకర' అను బిరుదును, ఆంధ్రా యూనివర్సిటీవారిచే 'కళాప్రపూర్ణ' అను బిరుదును మరియు గాంధర్వ విద్యాభూషణ, గానకళావిశారద, డాక్టరు వంటి ప్రఖ్యాత బిరుదులను పొందిన సమర్థుడు. మరియు కర్నాటక, హిందుస్థాని, పాశ్చాత్య సంగీతములను ప్రత్యేకముగను, సశాస్త్రీయముగను, జనరంజకముగను వయొలిన్‌యందు ప్రదర్శింపగల ఏకైక భారతీయుడు. ఇటీవల మద్రాసు నగరమున జరిగినసభలో శ్రీ గవర్నరుగారి అధ్యక్షతను రు 35 వేల రూపాయలకు పైబడిన అఖండ సన్మానమొందిన ఘనుడు. ఈయన అనేకమంది గానకళోపాసకులను మిక్కిలియభివృద్ధికి తెచ్చిరి. అట్టివారిలో శ్రీ ద్వారం నరశింగరావు, శ్రీ ద్వారం భావనారాయణరావు, శ్రీ మారెళ్ళ కేశవరావు మొదలగు వారు ప్రసిద్ధులుగానున్నారు.

వెంటస్వామినాయుడు (ఊమ్మిడిశెట్టి):— 'విద్యాదర్పణ' మను సంగీత గ్రంథమును తెలుగున రచించిన యొక ప్రాచీన గ్రంథకర్త. ఈయన గుంటూరునందు నివశించెనని చెప్పుదురు.

వెంకటసుబ్బయ్య (సొంఠి):— సంగీతము, తెలుగుభాషలయందు మిగుల పండితుడగు ప్రాచీన తైలింగ్య బ్రాహ్మణుడు. శ్రీ వెంకటమఖి సంప్రదాయములను బాగుగా నెఱిగినవాడు. శ్రీ త్యాగరాజుని గురువు యొక్క తండ్రి. శ్రీ తులజాజీ మహారాజు (1765–1787) పై బిలహరి రాగములో నొక విచిత్రమైన వర్ణమును రచించి కీర్తినొందిన ఘనుడు. ఈయన శ్రీ మణలిచిన్నయాముదలియార్ చే గొప్ప సన్మానమునొందెనని చెప్పుదురు.

* వెంకటసుబ్బయ్య (మానంబుచావడి):— శ్రీ త్యాగరాజుని శిష్యకోటికిచెందిన ప్రాచీన ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. తెలుగు మురికినాటి బ్రాహ్మణుడు. శ్రీ వేంకటేశ్వరునిపై అనేక కీర్తనలు 'వెంకటేశ' ముద్రతో రచించిన భక్తుడు. తన గురువగు త్యాగరాజుని స్తుతించుచూ 'స్వామికి సరియెవరనవచ్చు' అను కృతిని రచించి, గురువునందు తనకుగల భక్తిని చాటుకొనిన మహనీయుడు. వయొలిన్ వాద్యమునందతి సమర్థుడు.

* వెంకటాద్రి అప్పారావు (వుయ్యూరు):— సంస్కృతము, తెలుగు, సంగీతములందు విశేష కృషి యొనర్చిన యొక జమీందారు. ఈయన శ్రీ జయదేవుని 'గీతగోవింద' ము ను శ్రీ నారాయణతీర్థుల 'కృష్ణలీలాతరంగిణి' తెలుగులోనికి యనువదించినట్టి విద్యావంతుడైన ప్రముఖఆంధ్రుడు. నివాసము కృష్ణాజిల్లాలోనినూజివీడుగ్రామము.

* వెంకటాద్రిస్వామి (అల్లూరి):— సుప్రసిద్ధమైన తెలుగు కీర్తనలను రచించిన

ప్రాచీన విద్వాంసుడు. ఈయన కీర్తనలు మిగుల భక్తిరసముగానుండును.

వెంకట్రామయ్య (యినుపసనిగెల) :— సుప్రసిద్ధ కీర్తనల రచయితయగు ప్రాచీన విద్వాంసుడు. ఈయన రచనల కాఠిన్యతనుబట్టి 'యినుపసనిగెల' అనుమాట పేరుకు ముందు బిరుదుగాచేర్చబడి పిలువబడెను.

*వెంకట్రామయ్య (కె. యస్.) :— నేటి సుప్రసిద్ధ వయొలినిస్టులలో విశేష ప్రఖ్యాతిగల సంగీత విద్వాంసుడు. తెలుగు మురికినాటి బ్రాహ్మణుడు. కీ॥ శే॥ శ్రీ గోవిందస్వామిపిళ్ళెయొక్క ప్రముఖ శిష్యుడు. నివాసము మదరాసు. ఈయనకు పాపా వెంకట్రామయ్యఅను పేరు కూడాగలదు. తిరువాన్కూరు ఆస్థాన సంగీత విద్వాంసుడు.

వెంకట్రామయ్యర్ (టి.యల్.) :— నేడు భారత రాజధానియైన ఢిల్లీనగరమందు సుప్రీమ్‌కోర్టు జడ్జీగా పనిచేయుచున్న సుప్రసిద్ధ సంగీత లక్ష్యలక్షణ విద్వాంసుడు. శ్రీ దీక్షితులవారి కృతులను విశేషముగా పాఠముచేసిన పండితుడు. 1944 లో మద్రాసు మ్యూజిక్ అకాడెమీవారిచే 'సంగీతకళానిధి' అను బిరుదునొందిన సమర్థుడు. ప్రస్తుతము ఆల్ ఇండియా రేడియో మ్యూజిక్ ఆడిషన్‌బోర్డు అధ్యక్షుడుగానున్నారు. తమిళ బ్రాహ్మణుడు. ఈయన శ్రీ సుబ్బరామ దీక్షితుల కుమారుడైన శ్రీ 'అంబి దీక్షితుల' యొక్క శిష్యుడని [illegible]

వెంకట్రామయ్యర్ (ముడికొండాన్) :— నేటి సుప్రసిద్ధ గాయకులలో మిక్కిలి పేరుగల సంగీత విద్వాంసుడు. 1949 లో మద్రాసు మ్యూజిక్ అకాడెమీవారిచే 'సంగీత కళానిధి' అను బిరుదునొందిన ప్రసిద్ధుడు. నివాసము మద్రాసు.

వెంకట్రామశాస్త్రి (మెరట్టూరు) :— తెలుగు పద రచయితలలో మిక్కిలి ప్రఖ్యాతిగల విద్వాంసుడు. ఈయన పదములు పదసౌష్టవముగలిగి శృంగార రస ప్రధానముగా నుండును. త్రైలింగ్య బ్రాహ్మణుడు. ఈయన శ్రీ శరభోజీ (1800–1832) శ్రీ శివాజీ మహారాజుల కాలమునాటివాడుగా తెలియుచున్నది.

వెంకట్రామశాస్త్రి (ఆర్. కె.) :— నేటి ప్రసిద్ధవయొలినిస్టులలో మంచి అనుభవము గల విద్వాంసుడు. మద్రాసు ఏ.ఐ.ఆర్. నందు నిలయవిద్వాంసుడుగా నున్నాడు.

*వెంకట్రావు (మునుగంటి) :— ఆంధ్ర గాయకులలో మంచిపేరుగలిగిన సంగీత విద్వాంసుడు. బ్రాహ్మణుడు. 'గాయక చక్రవర్తి' అను బిరుదుగలదు. ఈయన నివాసము కాకినాడ.

*వెంకటేశ్వర దీక్షితర్ (శ్రీధర) :— సుప్రసిద్ధమగు భక్తిరస కీర్తనలను రచించిన ఒక గొప్ప భక్తుడు. అనేక స్తోత్రములనుగూడ రచించెను. 'అయ్యావాళ్' అని పిలువబడెను. ఈయన తిరువిశైనల్లూరు (ద. ఇం.) నందు నివసించెను.

*వెంకటేశ్వరశర్మ (చిలకలపూడి) :— సంగీత, సాహిత్యములందు పండితుడైన

నేటి సుప్రసిద్ధగాయకుడు. 'గాయకరత్న' అను బిరుదుగలడు. ఆంధ్ర నియోగి బ్రాహ్మణుడు. ప్రస్తుతము ఆల్ ఇండియా రేడియో మ్యూజిక్ ఆడివజన్ బోర్డు సభ్యుడుగానున్నారు. ఈయననివాసము విజయవాడ.

*వెంకటేశ్వర్లు (ఓ లే టి) :— నేటి ఆంధ్ర గాయకులలో నొకరుగా పేరొందిన విద్వాంసుడు. బి. ఏ; డిగ్రీనొందెను. ఆంధ్రబ్రాహ్మణుడు. విజయవాడ ఏ.ఐ. ఆర్ లో కొంతకాలము సంగీతశిక్షకుడుగా పనిచేసెను. ఈయన ప్రస్తుత నివాసము మదరాసు.

*వెంకయ్య (నందిగాన) :— బొబ్బిలి సంస్థాన విద్వాంసుడగు నొక ప్రాచీన సుప్రసిద్ధ వైణికుడు. అతిసాధకుడు. లయజ్ఞానమందతి సమర్థుడు. ఈయన బావమరదియే సుప్రసిద్ధ వైణికుడైన కీ॥శే॥లగు శ్రీ తుమరాడ సంగమేశ్వరశాస్త్రియగును.

# వే

వేదనాయకంపిళ్ళై :— క్రీ॥శ॥ 1824 - 1889 కాలమునకు చెందిన ప్రాచీనుడగు సుప్రసిద్ధ కీర్తనల రచయిత. నివాసము తంజావూరు. ఈయన రచనలలో 'సర్వ సమయ సమరస కీర్తనలు' 'ప్రతాప ముదలియార్ చరిత్ర' కీర్తనలు ముఖ్యమైనవి. వీటిలో హిందోళలోని 'కరుణాలయ నిధియే' పూర్వకల్యాణిలోని 'కరుణాకర' కామవర్ధనిలోని 'కడైక్కణ్' అను కీర్తనలు సుప్రసిద్ధములు. ఈయన చాలాకాలము డిస్ట్రిక్టు మునిసిఫ్‌గా పని చేసియుండినట్లు తెలియుచున్నది.

వేదాంతభాగవతర్ (యమ్.) :—19-20 శతాబ్దములకు చెందిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. లక్ష్య లక్షణములం దతి సమర్థుడు. 'సంగీతకేసరి' అను బిరుదు గలదు. 1940 లో మద్రాసు మ్యూజిక్ అకాడెమీవారు జరిపిన సంగీతమహాసభ కధ్యక్షత వహించి 'సంగీత కళానిధి' అను బిరుదునొందెను. తమిళ బ్రాహ్మణుడు. 'కల్లిడైక్కురిచ్చి' అను గ్రామములో నివశించెను. ఈయన కొలది సంవత్సరముల క్రిందటనే స్వర్గస్థుడయ్యెను.

# వై

వైకుంఠశాస్త్రులు :—సంగీత, సంస్కృత, వ్యాకరణములలో మిక్కిలి ప్రతిభగల ప్రాచీన విద్వాంసుడు. సంస్కృతములో రక్తి, దేశీయరాగములందు అనేక కీర్తనలు రచించెను. అవి 'వైకుంఠ' ముద్రగలిగి యుండును. ఈయన చోళదేశీయుడగు ద్రావిడ బ్రాహ్మణుడు.

వైద్యనాధభాగవతర్ (చెంబై) :— పాలఘాట్ కు చెందిన నేటి సుప్రసిద్ధ గాయకుడు. ఈయన గాత్రము విశేష వదుగు బడి గలది యగుటచే యీయన కచ్చేరీలు కూడ మిక్కిలి రంజకముగా నుండును. తమిళ బ్రాహ్మణుడు. 1951 లో మద్రాసు మ్యూజిక్ అకాడెమీవారిచే 'సంగీత కళానిధి' అను బిరుదునొందెను.

వైద్యనాధయ్యార్ (కోనేరిరాజపురం) :— 19 వ శతాబ్దమునకు చెందిన ప్రఖ్యాత గాయక శిఖామణులలో అఖండ కీర్తినార్జించిన ప్రాచీన విద్వాంసుడు. ఈయన సంగీత కచ్చేరీలు అత్యద్భుతమైనవనియు

శ్రోతలను తన్మయుల గావించెడివని చెప్పుదురు. తమిళ బ్రాహ్మణుడు.

వైద్యనాథయ్యర్ (మహారాజపురం) :— నేటి సుప్రసిద్ధ గాయక శిఖామణులలో నొకరై సంప్రదాయ సిద్ధముగ పాడగలిగిన ప్రముఖ సంగీత విద్వాంసుడు. పల్లవియందు మంచి ప్రావీణ్యము గలవాడు. ఈయన శిష్యుడే తిరువాన్కూరు ఆస్థాన విద్వాంసుడును, సంగీతకళాశాల అధ్యక్షుడునగు శ్రీ శెమ్మంగుడి శ్రీనివాసయ్యర్ యని చెప్పుదురు.

## శ

*శంకరశాస్త్రి (ఈమని) :— నేటి సుప్రసిద్ధ వైణికులలో విశేషకీర్తి నార్జించిన ప్రముఖ విద్వాంసుడు. తెలుగు బ్రాహ్మణుడు. ఈయన మద్రాసులోని జైమినీ స్టూడియోనందు సంగీతదర్శకుడుగా పనిచేయుచున్నాడు. ఈయన ప్రఖ్యాత వైణికుడై కీ॥ శే॥ డైన శ్రీ ఈమని అచ్యుతరామశాస్త్రి కుమారుడగును.

*శంకరశాస్త్రి (పిరాట్ల) :— ఆంధ్రగాయకులలో మంచి పేరుగడించి కీ॥ శే॥ డైన సంగీత విద్వాంసుడు. ముక్త్యాలసంస్థాన పండితుడు. శ్రీ తిరువొత్తియూరు త్యాగయ్యర్ శిష్యుడు. ఈయన సోదరుడు శ్రీ శివరామయ్యకూడ వయొలిన్ వాద్యమున ప్రవీణుడు. వీరు ఆంధ్ర బ్రాహ్మణులు. కృష్ణా జిల్లాలోని జగ్గయ్యపేట గ్రామమునందు నివసించిరి.

శరభశాస్త్రి :— దక్షిణభారతములో మురళీ వాద్యమునందు అఖండ ప్రఖ్యాతిగడించిన ప్రాచీన సుప్రసిద్ధ విద్వాంసుడు. ఆ కాలములో వేణువాద్యమునందు ఈయనకు సమానులు లేరనియే చెప్పుదురు. ఈయన 19 వ శతాబ్దమునకు చెందిన బ్రాహ్మణుడు.

## శా

శార్ఙ్గదేవుడు :— 13 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ సంగీత లక్షణకారుడు. గొప్ప సంస్కృత పండితుడు. యాదవ వంశస్థుడు. క్రీ॥శ॥ 1210 – 1224 వఱకు 'దౌలతాబాదు' అను దేవగిరిని పరిపాలించిన 'సింహణరాజు' కాలమునాటివాడు. ఈయన అచ్చటనున్నపుడే సంస్కృతములో 'సంగీతరత్నాకర' మను గొప్ప లక్షణగ్రంథమును రచించెను. ఇది కర్ణాటక సంగీతమునకొక ప్రమాణ గ్రంథమగును. ఇది 7 అధ్యాయములతో కూడుకొని యున్నది. మరియు 'అధ్యాత్మవివేక' మను వేదాంత గ్రంథమునుగూడ రచించెను. ఈయన సంశయములు లేనివాడగుటచే 'నిశ్శంకు' డను బిరుదునొందెను. కాశ్మీర బ్రాహ్మణుడు. దక్షిణదేశమునకువచ్చి స్థిరపడినట్లు చెప్పుదురు.

*శ్యామశాస్త్రి (తంజావూరు) :— క్రీ॥ శ॥ 1763 – 1827 కాలమునకు చెందినవాడై సంగీతత్రిమూర్తులలో నొకరైన సుప్రసిద్ధ గాయకశిఖామణి. గొప్పభక్తుడు. ఈయన మొదటిపేరు సుబ్రహ్మణ్యము. కాని తల్లిదండ్రులు ముద్దునకు 'శ్యామకృష్ణ' యని పిలుచుచుండిరి. ఈయన సంస్కృతాంధ్రములలోను, సంగీతములోను గొప్ప ప్రతిభగల విద్వాంసుడు. మొదట తన మేనమామవద్దను, తదుపరి శ్రీ సంగీత

స్వామివద్దను యనేక సంగీతవిద్యా రహస్యములను గ్రహించిన సమర్థుడు. ఈయన శ్రీవిద్యా వుపాసనచే 'శ్రీకామాక్షీదేవి' యొక్క అనుగ్రహమునొంది సాటిలేని గాయకుడుగను, రచయితగను కీర్తిగడించి షుమారు 300 వఱకు కృతులను, స్వరజతులను రచించిన మహనీయుడు. ఈ రచనలలో భైరవిలోని 'కామాక్షీ'అను స్వరజతియు, ఆనందభైరవిలోని 'ఓ జగదంబ' 'మరి వేరేగతి'అను కృతులును, కల్యాణిలోని 'బిరాన వరాలిచ్చి' శంకరాభరణము లోని 'సరోజదళనేత్రి' వంటి కృతులును సుప్రసిద్ధములగును. ఇవి 'శ్యామకృష్ణ' ముద్రగలిగి యుండును. దేవీస్తవమే వీటి ముఖ్యభావము. ఈయన వల్లనే శ్రీ ముద్దుస్వామిదీక్షితులు శ్రీవిద్యా మంత్రోపదేశమునొందెను. శ్యామశాస్త్రిలు నిగ్రహానుగ్రహ శక్తులుగల గొప్ప మహనీయుడు. తనభార్య స్వర్గస్థురాలు కాగా తానుగూడ 5 వ దినమున నే తనువు చాలింతునని తన శిష్య, బంధు, మిత్రాదులకు తెలిపి ఆదేవిధముగా 1827 సం॥కు సరియగు వ్యయసంవత్సర మకర మాస శుక్ల దశమి తిధియందు స్వర్గస్థుడైన పుణ్యపురుషుడు. ఈయన పూర్వులు తెలుగు దేశమునుండియే తమిళదేశమునకు వలసపోయిరని చెప్పుదురు.

శి

శివరామ్ (వడిలాల్) :— 'సంగీత కళాధర్' అను ప్రశస్థ సంగీత గ్రంథమును రచించిన గుజరాతీయుడైన భావనగర సంస్థాన విద్వాంసుడు. ప్రాచీనపండితుడు.

*శివరామశాస్త్రి (పాలపర్తి) :—సుప్రసిద్ధ గాయకుడుగా పేరొందిన విద్వాంసుడు. ఆంధ్ర వైదీక బ్రాహ్మణుడు. నివాసము గుంటూరుజిల్లా నరసరావుపేట. వయొలిన్ వాద్యమునందు కూడ ప్రావీణ్యముగలదు. ఈయన సోదరుడు శ్రీనాగభూషణశాస్త్రి మంచి వైణికుడు. ఈ సోదరులు ప్రతిసంవత్సరము శ్రీ గణపతినవరాత్రమహోత్సవములను కడు వైభవముగా జేసెడివారు. వీరుభయులు కొలది సంవత్సరముల క్రిందటనే స్వర్గస్థులైరి.

శ్రీ

శీనయ్య (ఘనమ్) :—సంగీత, సంస్కృతాంధ్రములందు మిక్కిలి ప్రావీణ్యముగల ప్రాచీన విద్వాంసుడు. శ్రీ విజయరంగ చొక్కనాధ భూపాలుని కటాక్షముచే మంత్రిశేఖరు డయ్యెను. తెలుగులో అనేక కీర్తనములు, పదములు, 'మన్నారురంగ' ముద్రతో రచించెను. ఈయన 17 వ శతాబ్దమునకు చెందినవాడు. క్షేత్రజ్ఞుని సమకాలికుడు.

శ్రీకాంత్ :— 'రసకౌముది' అను ప్రశస్థ సంగీతగ్రంథమును రచించిన గుజరాతీయుడగు నొక ప్రాచీన విద్వాంసుడు.

శ్రీకృష్ణదాస్ :— భక్తిరసపూరితమైన యనేక కీర్తనలను రచించిన గుజరాతీయుడగు నొక ప్రాచీన విద్వాంసుడు.

శ్రీనివాసయ్యంగార్ (రామ్నాడ్) :— 19 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ గాయకశిఖామణి. తమిళ వైష్ణవ బ్రాహ్మణుడు. శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ శిష్యుడు. తెలుగులో అనేక కృతులను,

తానవర్ణములును, జావళీలను, 'శ్రీనివాస' ముద్రతో రచించిన ప్రసిద్ధ రచయిత. ఈ రచనలలో కానడలోని అటతాళవర్ణము, కేదారగౌళలోని 'సరగునపాలింప' కృతియును, పూర్వకల్యాణిలోని 'పరమపావన' కృతియును ప్రసిద్ధములగును. ఈయన శిష్యుడే నేటి ప్రసిద్ధ గాయకుడగు శ్రీ అరియకుడి రామానుజయ్యంగార్ అగును.

శ్రీనివాసయ్యంగార్ (సి. ఆర్.) :— సుప్రసిద్ధ లక్ష్యలక్షణ సంగీతవిద్వాంసుడు. గొప్ప రచయిత. పురాణభాషాప్రవీణుడు. 'సంగీత విమర్శకుడు' 'అభినవ త్యాగబ్రహ్మ' 'కీర్తనాచార్య' అను బిరుదులు పొందినవాడు. మద్రాసులో మైలాపూరు నందు నివసించెను. ఈయన కొలది సంవత్సరముల క్రిందటనే స్వర్గస్థుడయ్యెను.

శ్రీనివాసయ్యంగార్ (కె. వి) :— 'గానభాస్కర'మను ప్రసిద్ధ సంగీత గ్రంథము రచించిన ప్రాచీన లక్ష్యలక్షణ సంగీతవిద్వాంసుడు. ఈయన 'త్యాగరాజ హృదయము' అను సంగీత గ్రంథమును మూడుభాగములుగాచేసి స్వరసాహిత్య, అర్థ, తాత్పర్యములతో షుమారు300 త్యాగరాజ కృతులను ప్రకటించిన సమర్థుడు.

శ్రీనివాసయ్యర్ (పి.) :— 'కర్నాటిక్ మ్యూజిక్' అను నొక గ్రంథమును ఇంగ్లీషులో రచించిన సుప్రసిద్ధ గ్రంథకర్త. తమిళ బ్రాహ్మణుడు.

శ్రీనివాసయ్యర్ (శెమ్మంగుడి) :— దక్షిణ భారతములో నేటి సుప్రసిద్ధ గాయక శిఖామణులలో నొకరైన ప్రముఖ వి-

ద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు. నివాసము కుంభకోణము. తిరువాన్కూరు సంస్థాన విద్వాంసుడు. సంగీతకళాశాలాధ్యక్షుడు. 1947 లో మద్రాసు మ్యూజిక్ అకడెమీవారిచే 'సంగీతకళానిధి' అను బిరుదును, తిరువాన్కూరు మహారాజుచే 'రాజ్యసేవానిరత' యను బిరుదును పొందిన ప్రముఖ పండితుడు.

*శ్రీనివాసరావు (యస్) :— ఆంధ్ర గాయకులలో రాయలసీమకు చెందిన ప్రముఖ విద్వాంసుడు. మధ్వబ్రాహ్మణుడు. బి.ఏ; బి.యల్; డిగ్రీ నొందినట్టివాడు. ఈయన విజయవాడ ఏ. ఐ. ఆర్. స్టేషనుయందు కొంతకాలము ప్రోగ్రాము అసిస్టెంటుగా పనిచేసిరి.

శ్రీనివాసులు (మధుర) :— మధురమీనాక్షీదేవి పరిచారకుడై యాదేవి యనుగ్రహమున అనేక కీర్తనలను 'విజయగోపాల' ముద్రతో రచించిన మహానుభావుడు. తమిళ బ్రాహ్మణుడు. ఈయన మధుర శ్రీ విజయరంగ చొక్కనాథ నాయకుని కాలమునాటి వాడుగా చెప్పుదురు.

శ్రీపాదరాజు :— కన్నడములో అనేకములగు భక్తిరస కీర్తనలను రచియించిన ప్రఖ్యాత పండితుడు. ప్రాచీన రచయిత. ఈయనవలెనే 'శ్రీ కనకదాసు' 'శ్రీ జగన్నాథదాసు' మొదలగువారుకూడ కన్నడములో అనేక భక్తిరసకీర్తనలను రచించియుండిరి.

*శ్రీరామమూర్తి (డి.) :— నేటి ఆంధ్ర గాయకులలో పేరుగల నొక విద్వాంసుడు.

'సంగీతభూషణ' బిరుదుగలదు. ప్రస్తుతము విజయనగర సంగీత కళాశాలయందధ్యాపకులుగా నున్నారు. ఆంధ్రబ్రాహ్మణుడు.

## శం

శుద్ధానందభారతి :— సుప్రసిద్ధుడైన తమిళరచయితయగు నొకప్రాచీన విద్వాంసుడు. ఈయన రచనలలో 'మాండ్ రాగము'లోని 'ఆడుకిరాన్' అను కీర్తనయు కేదారరాగములోని 'సకలకళావాణి' అను కీర్తనయు సుప్రసిద్ధములు.

## శే

శేషన్న (వీణ) :— మైసూరు సంస్థానమునకు చెందిన సుప్రసిద్ధ వైణిక శిఖామణి. అపారమైన సాధకము గలవాడు. 19 – 20 శతాబ్దములకు చెందినట్టి ప్రాచీన విద్వాంసుడు. మైసూరునందు నివసించెను.

శేషయ్యంగార్ (మార్గదర్శి) :—16–17 శతాబ్దములకు చెందిన ప్రఖ్యాత కీర్తనల రచయిత. శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు. సంగీత, సంస్కృతములలో గొప్ప పండితుడు. 'కోసల' ముద్రతో సంస్కృతమున అనేక కీర్తనలను రచియించెను. ఈ రచనలలో అఠాణాలోని 'శ్రీరుక్మిణీశ' అనునది సుప్రసిద్ధమగును. ఈయన అయోధ్యనుండి శ్రీరంగమునకువచ్చి యచ్చటనే స్థిరపడినట్లు చెప్పుదురు.

*శేషయ్యర్ (పల్లవి) :— సుప్రసిద్ధ సంగీత లక్ష్యలక్షణ విద్వాంసుడు. తెలుగు మురికినాటి బ్రాహ్మణుడు. గొప్ప పల్లవి పాటకుడు యగుటచే 'పల్లవి' అనుబిరుదును పొందెను. ఈయన 'స్వనామముద్ర'తో వర్ణములు, కృతులు, తిల్లానాలు అనేకముగా రచించెను. ఈయన ఒకసారి సావేరి రాగమును 8 గంటలు వరుసగా పాడినట్లు ఒక ప్రతీతిగలదు. ఈయన తండ్రి సుబ్బయ్యర్ శ్రీ త్యాగరాజునికి శిష్యుడగును.

## శో

శోభనాద్రి :— శ్రీ సుబ్బరాయశాస్త్రి శిష్యుడగు గొప్ప గాయకుడు. ఈయన సామాన్య గీతములను, లక్షణగీతముల ననేకము రచించిన ప్రసిద్ధ రచయితయగును.

## స

*సంగమేశ్వరశాస్త్రి (తు మ రా డ) :— 19 – 20 శతాబ్దములకు చెందిన ప్రఖ్యాత వైణిక శిఖామణియగు ఆంధ్ర వైదీకబ్రాహ్మణుడు. వీణలో షట్కాలముల ననర్గళముగా వాయింపగల గొప్పసాధకులు. నివాసము పిఠాపురము. (తూ॥ గో॥జిల్లా) ఈయన విశ్వకవి శ్రీ రవీంద్రనాథ ఠాకూర్ చే విదేశముల కాహ్వానింపబడిన ప్రముఖ విద్వాంసుడు. కొలది సంవత్సరములక్రిందటనే యీయనస్వర్గస్థుడయ్యెను.

సంగీతస్వామి :— శ్రీ శ్యామశాస్త్రి వద్ద అనేక సంగీతవిషయములను గ్రహించిన ప్రసిద్ధుడగు యతీంద్రుడు. శ్రీ శ్యామశాస్త్రిల రచనలలో ఆనందభైరవిరాగములోని 'ఓజగదంబ' అను కృతియందుగల 'వరసితగిరినిలయుని' అను స్వరసాహిత్యము యీ యతీంద్రునిచేతనే రచింపబడినదని కొందరు పెద్దలు చెప్పుదురు.

సంజీవరావు (పల్లడం) :— వేణువాద్యములో అఖండ ప్రఖ్యాతిగడించిన నేటి

సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. ఈయన 1943 లో మద్రాసు సంగీతపరిషత్ వారిచే 'సంగీతకళానిధి' అను గొప్ప బిరుదము నొందెను. మధ్వ బ్రాహ్మణుడు.

సదాశివబ్రహ్మేంద్రసరస్వతి :— "శ్రీ కామకోటి పీఠాధిపతియైన పరమశివేంద్ర సరస్వతి" యొక్క శిష్యులు. 'పరమ హంస' ముద్రతో సంస్కృతమున అనేక కీర్తనలను రచించిన మహనీయుడు. ఈయన రచనలలో 'మానససంచరరే' అను సామరాగములోని కీర్తన మిగుల సుప్రసిద్ధమగును. మరియు శివమానసికపూజ, ఆత్మవిద్యా విలాసమ్, బ్రహ్మసూత్ర వృత్తి, అను గ్రంథములనుగూడ రచించి నట్టి ప్రాచీనుడగు యతీంద్రుడు.

సదాశివరావు (మైసూరు) :— మైసూరు ఆస్థానసంగీతవిద్వాంసుడగు గొప్పరచయిత మహారాష్ట్ర బ్రాహ్మణుడు. 'సదాశివ' ముద్రతో అనేక వర్ణములు, కృతులు, తిల్లానాలు రచించిన ప్రఖ్యాతపండితుడు. స్వరసాహిత్యముగల యీయన కృతుల లో అఠాణారాగములోని 'వాచామ గోచరుండని' అను కృతి మిగుల సుప్రసిద్ధమగును.

సభాపతిఅయ్యర్ (మధ్యార్జునమ్) :— 19 వ శతాబ్దమునకు చెందిన త్యాగరాజుని శిష్యుడు. ప్రసిద్ధ విద్వాంసుడు. 'రాజ గోపాల' ముద్రతో తెలుగులో అనేక పదములను రచించిన ఘనుడు. ఈయన తండ్రి పేరు దురైస్వామయ్యర్.

సభేశయ్యర్ (టి. యస్.) :— క్రీ॥ శ॥ 1872 – 1948 కాలమునకు చెందిన లక్ష్య లక్షణ సంగీత విద్వాంసుడు. శ్రీ రాజా అన్నామలై సంగీత కళాశాలకు ప్రథమ అధ్యక్షులు. 1934 లో మద్రాసు సంగీత పరిషత్ వారిచే 'సంగీతకళానిధి' అను గొప్ప బిరుదు నొందెను.

సరస్వతీరాణె :— హిందుస్థాని సంగీత ములో యావద్భారత ప్రఖ్యాతి గడించిన నేటి సుప్రసిద్ధ గాయకురాలు. ఈమె బొంబాయి రాష్ట్రమునకు చెందినదగును.

*సర్వశాస్త్రి (శిష్టు) :— సుప్రసిద్ధ వైణికుడగు ప్రాచీన విద్వాంసుడు. తెలుగు బ్రాహ్మణుడు. ఈయన సోదరులు చలమయ్య, భగవానులు కూడా వీణావాద్యమునందతి సమర్థులుగా పేరొందినవారగుదురు.

సహజిమహారాజు (తంజావూరు) :— క్రీ॥ శ॥ 1684 – 1711 వఱకు తంజావూరు నేలిన రెండవ మహారాష్ట్ర రాజు. సంస్కృ, తాంధ్ర, మహారాష్ట్ర, హిందుస్థాని భాషలలో గొప్ప పండితుడు. సంగీత సాహిత్యవిద్యా పారంగతుడు. పై దెలిపిన భాషలలో అనేక కీర్తనలను రచించెను. తిరువారూరి "శ్రీవీధి విటంక త్యాగరాజ స్వామి"పై తెలుగున 'పల్లకి సేవాప్రబంధము'ను రచించిన మహనీయుడు. ఈ రచనను నేటికిని ప్రతి శుక్రవారము శ్రీ త్యాగరాజస్వామివారి పవళింపు ఉత్సవ సమయమందు పాడుచుందురు.

## సా

*సాంబమూర్తి (పి.) :— నేడు దక్షిణ భారతములో కర్ణాటక సంగీతశాస్త్రము

నందు విశేషమగు కృషిచేసి ఆశాస్త్రమును విద్యార్థులకు సయితము సులభగ్రాహ్యమగునటుల ఒక క్రమమైన పద్ధతిలో ఇంగ్లీషులోను, తమిళములోను, తెలుగులోను అనేక గ్రంథములను రచించి ప్రకటించిన సుప్రసిద్ధ గ్రంథకర్త. మరియు జర్మనీవంటి పాశ్చాత్య దేశములను సైతము పర్యటించి అచ్చటి సంగీత విధానములనుగూడ యెక్కువగా పరిశోధించినట్టి పండితుడు. ఆంధ్రా యూనివర్సిటీలో సంగీతాధికారసభా సభ్యుడుగను, మదరాసు యూనివర్సిటీలో సంగీతశాఖాధ్యక్షుడుగను పనిచేయుచున్నారు. వీరు షుమారు 25 సంవత్సరములుగా కర్నాటక సంగీతమునకు చేసిన అమోఘమైన సేవకు ప్రతిఫలముగా 1953 లో మద్రాసు పురజనులు వీరికి రజతోత్సవమును జరిపి 'సంగీతకళా శిఖామణి' అను బిరుదునొసంగి గొప్పగా సన్మానించిరి. వీరికి ఫిడల్, వేణువాద్యములందుకూడ ప్రవీణత కలదు. బి. ఏ; బి. యల్; డిగ్రీలనొందిరి. సంగీతకళోపాసకులను విశేషముగా ప్రోత్సహించు సుస్వభావము గలవారు. తెలుగు బ్రాహ్మణులు. నివాసము మదరాసు.

సాంబశివయ్యర్ (కారైకుడి) :— నేటి ప్రఖ్యాత వైణిక శిఖామణులలో అగ్రగణ్యుడుగా పేరొంది భారతప్రభుత్వాధ్యక్షులచే వీణావాద్యమున మొదటి సన్మానమొందిన వైణికశిరోమణి. 1952 లో మద్రాసు సంగీతపరిషత్ వారు జరిపిన యావద్భారత సంగీతమహాసభకు అధ్యక్షత వహించి 'సంగీతకళానిధి' అను బిరుదునొందిరి. వయోవృద్ధుడు. తమిళ బ్రాహ్మణుడు.

సాదిక్ అలీఖాన్ :— హిందూస్థాని సంగీతమును వీణావాద్యమునందు అద్భుతముగా ప్రదర్శించగల నేటి ప్రముఖవిద్వాంసుడు.

*సారంగపాణి :— తెలుగులో శృంగార, హాస్యరస పూరితమైన పదములను రచించిన ప్రాచీన విద్వాంసుడు. తెలుగు బ్రాహ్మణుడు. ఈయన పదములందు 'వేణుగోపాల' ముద్రగలిగి యుండును.

స్వాతితిరునాళ్ మహారాజు:—క్రీ॥శ॥1829–1847 కాలమునందుగల తిరువాన్కూరు మహారాజు. సంస్కృతము, తమిళము, తెలుగు, మళయాళము, మణిప్రవాళము (మళయాళము, సంస్కృతము) హిందుస్థాని, మహారాష్ట్ర భాషలందు అనేక కీర్తనలు రచించిన బహుభాషా కోవిదుడగు సుప్రసిద్ధ పండితుడు. గొప్ప సంగీత విద్వాంసుడు. 'పద్మనాభ' ముద్రతో కృతులు, పదములు, వర్ణములు, తిల్లానాలు, రాగమాలికలు యనేకము రచించిన మహనీయుడు. ఈయన రచనలు షుమారు 300 వఱకు యుండును. అందు కొన్ని స్వరాక్షరములతో కూడియుండును. ఈ రచనలలో వాచస్పతిరాగములోని 'పాహి జగజ్జనని' అనునది యొక ప్రసిద్ధరచన యగును.

స్వామినాథపిళ్ళై (టి. యస్.) :— నేటి సుప్రసిద్ధ మురళీవాద్యకులలో మిక్కిలి సమర్థుడగు విద్వాంసుడు. ఈయన 1953 లో మద్రాసు మ్యూజిక్ అకడెమీవారిచే 'సంగీతకళానిధి' అను గొప్ప బిరుదు నొందెను.

## సి

సిద్ధేశ్వరీదేవి :— హిందుస్థాని సంగీతము నందు విశేష ప్రావీణ్యముగలిగినట్టి నేటి సుప్రసిద్ధ గాయకురాలు.

## సీ

సీతారామయ్య (తోడి) :— శ్రీ శరభోజి మహారాజు కాలమునకు చెందిన సుప్రసిద్ధ గాయకుడు. తోడి రాగాలాపనలో యీయనకుగల సామర్థ్యము అపారమగుటచే మహారాజులు సైతము యీయన తోడి రాగాలాపనను కుదువబెట్టుకొని విశేషముగా ధన మిచ్చెడివారని చెప్పుదురు. ఈయన అనేకతావులలో సంగీత సభలు చేసి గొప్పగొప్ప సన్మానములొందినట్లు చెప్పుదురు.

సీతారామయ్య (సోజిరి) :— శ్రీ త్యాగరాజుని శిష్యకోటికిచెందిన యొక ప్రాచీన సంగీత విద్వాంసుడు. నివాసము తిరువయ్యారు. ఈయనను గురించి ఒక విశేషమైనగాధను చెప్పుదురు. ఇతడు శిష్యుడుగా చేరకముందు త్యాగయ్యకు భక్తిగా కీర్తనలు పాడుటతప్ప పల్లవి పాడగల పాండిత్యము లేదని నిరసించుచుండేవాడట. ఒకనాటిరాత్రి యితడు త్యాగయ్యగారు నివసించునట్టివీధిని బోవుచుండగా అయ్యగారు సౌరాష్ట్రరాగ మాలాపించి అందు నొక కృతిలోని భాగమును పల్లవిగా నేర్పఱచుకొని అత్యద్భుతముగా ప్రస్తరించి స్వరకల్పనలు చేయుచుండెనట. అదివినిన సీతారామయ్య ఆనందపరవశుడై లోపలికి వెళ్ళి త్యాగరాజునకు సాష్టాంగ నమస్కార మొనర్చి తన అపరాధమును చెప్పుకొని క్షమాపణ కోరెనట. అది మొదలే యితడు శిష్యుడుగా చేరెనని చెప్పుదురు.

*సీతారామయ్య (బలిజేపల్లి) :— సుప్రసిద్ధ గాయకుడుగా పేరొందిన కొలది సంవత్సరముల క్రిందటనే మరణించిన సంగీత విద్వాంసుడు. ప్రసిద్ధుడైన శ్రీ లక్ష్మీకాంతకవికి యీయన సోదరుడు. ఆంధ్ర వైదిక బ్రాహ్మణుడు. గుంటూరులో నివసించెను.

## సు

సుందరభాగవతర్ (ఉమయాల్‌పురం):- శ్రీ త్యాగరాజుని శిష్యకోటికి చెందిన ప్రసిద్ధ విద్వాంసుడు. ఈయన సోదరుడు కృష్ణభాగవతర్ కూడ త్యాగరాజుని శిష్యుడే యగును. వీరు తమిళ బ్రాహ్మణులు. ప్రాచీన పండితులు.

సుందరమూర్తి స్వామిగళ్ :— తమిళములో ప్రఖ్యాతమైన 'తేవారములు' రచించిన ముగ్గురు ప్రాచీన సుప్రసిద్ధ రచయితలలో నొకరు.

సుందరేశయ్యర్ (ఘటమ్) :— దక్షిణ భారతములో ఘటవాద్యమునందు అఖండ కీర్తిగడించి షుమారు 10 సంవత్సరముల క్రిందట మరణించిన సుప్రసిద్ధ విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు.

సుబ్బయ్యర్ (నెయ్యక్కరప్పట్టి) :— శ్రీ పల్లవి శేషయ్యర్ యొక్క కుమారుడు. శ్రీత్యాగరాజుని శిష్యకోటికిచెందిన ప్రముఖుడగు ప్రాచీన సంగీత విద్వాంసుడు.

సుబ్బరామదీక్షితర్ :— శ్రీ ముద్దుస్వామి దీక్షితుని తమ్ముడగు శ్రీ బాలస్వామి దీక్షితులయొక్క దత్తకుమారుడు. బాలస్వామి దీక్షితునికి కుమార్తె కుమారుడు. సుప్రసిద్ధ సంగీత లక్ష్యలక్షణ విద్వాంసుడు. ఎట్టయపురము సంస్థాన విద్వాంసుడు. సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుడు. అనేక వర్ణములు,కృతులు, రాగమాలికలు, సంచారిలు రచించిన ప్రతిభావంతుడు. మరియు తెలుగులో ప్రథమాభ్యాస పుస్తకమును, సంగీత సంప్రదాయ ప్రదర్శిని అను గ్రంథమును రచించెను. ఇది రెండుభాగములుగా నుండి షుమారు 1250 పేజీలు గలిగియుండును. ఈగ్రంథములు కర్నాటక సంగీత లక్ష్య, లక్షణములకు ప్రమాణగ్రంథములని చెప్పవచ్చును. ఈగ్రంథములను శ్రీ ఎట్టయపుర సంస్థానాధీశ్వరులు విశేష వ్యయముచేసి 1904 లో ప్రకటించిరి.

సుబ్బరామభాగవతర్ (కారైకుడి) :— సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడుగా పేరు గడించిన తమిళ బ్రాహ్మణుడు. ఈయన 1942 లో మద్రాసు మ్యూజిక్ అకడెమీ వారిచే 'సంగీతకళానిధి' అను గొప్పబిరుదు నొందెను.

సుబ్బరామయ్యర్ (వైదీశ్వరన్‌కోవిల్):— తమిళములో సుప్రసిద్ధ పదరచయితయగు సంగీత విద్వాంసుడు. ఈయన రచనలు బహు రసవంతముగానుండి 'ముద్దుకుమార' ముద్రగలిగియుండును.

సుబ్బరాయర్ (ధర్మపురి) :— తెలుగులో అనేక ప్రసిద్ధమైన జావళీలను రచించిన ప్రాచీన రచయిత. ఈయన రచనలు 'ధర్మపురి' ముద్రగలిగి సామాన్యులకు సైతము అర్థమగునట్లుండి రంజకముగా నుండును. ఈయన రచనలలో ఖమాసులోని 'ఇదినీకుమర్యాద' అను జావళియు ఫరజులోని 'స్మరసుందరాంగుని' అను జావళియు సుప్రసిద్ధములగును.

సుబ్బరాయశాస్త్రి :— శ్రీ శ్యామశాస్త్రి యొక్క రెండవకుమారుడు. సంగీత లక్ష్య, లక్షణ విద్వాంసుడు. క్రీ॥శ॥ 1803 కు సరియగు దుందుభి సం॥ సింహమాస, కృత్తిక నక్షత్రమున జన్మించెను. తెలుగు, సంస్కృతము, తమిళములలో గొప్ప పండితుడు. శ్రీ శ్యామశాస్త్రివద్దను, శ్రీ త్యాగరాజు వద్దను సంగీతవిద్య నభ్యసించెను.'కుమార' ముద్రతో స్వరజతులను మధ్యమకాల సాహిత్యము, చిట్టస్వరములుగల అనేక కృతులను రచించెను. ఈయన రచనలలో రీతిగౌళలోని 'జననీనినువినా' అనుకృతియు, కల్యాణిలోని 'నిన్నువినాగతిగాన' అనుకృతియు సుప్రసిద్ధములు. ఈయన దుర్మతిసంవత్సర చాపమాస కృష్ణదశమి యందు దివంగతు డయ్యెను.

సుబ్బయ్యర్ (జలతరంగం) :— జలతరంగ వాద్యములో మిగుల సుప్రసిద్ధుడుగా పేరొందిన ప్రాచీన విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు.

సుబ్బలక్ష్మి (యమ్. యస్.) :— నేడు యావద్భారతములో ప్రఖ్యాత గాయినీ మణిగా విశేష కీర్తినార్జించిన సుప్రసిద్ధ తమిళ సంగీత విద్వాంసురాలు. మధురాతి మధురమైన యీమె కంఠధ్వని మాధుర్యముచే, ఈమె గానము సంగీత కచ్చేరీల

యందును, చలనచిత్రములందుగూడ దేశీయులచే విశేషముగా నాకర్షింపబడినది. ఈమె జన్మస్థానము మధుర. ప్రస్తుతనివాసము మద్రాసు. ఈమెకు 'కోకిలగాన' యను బిరుదుగలదు. మరియు నీమె భారత ప్రభుత్వాధ్యక్షులచే 15-8-54 వ తేదీన "పద్మవిభూషణ" అను ప్రశస్తమైన రెండవతరగతి బిరుదునొందిన మొదటి గాయకురాలగును.

*సుబ్రహ్మణ్యకవి :— 'అధ్యాత్మ రామాయణ' మను ప్రశస్తమైన కీర్తనల గ్రంథమును రచించిన సుప్రసిద్ధ ప్రాచీనవిద్వాంసుడు. ఆంధ్ర బ్రాహ్మణుడు.

సుబ్రహ్మణ్యదీక్షితులు (పాలఘాట్) :— హార్మోనివాద్యములో అద్భుతమైనప్రతిభగల నేటిసుప్రసిద్ధసంగీతవిద్వాంసుడు. ఈయన కర్నాటక సంగీతములో, రాగ, తాన, పల్లవులనుసయితము తనిగాను, ప్రక్కవాద్యముగానుకూడ ప్రదర్శింపగల గొప్ప సమర్థుడు. తమిళ బ్రాహ్మణుడు. నివాసము పాలఘాట్.

సుబ్రహ్మణ్యపిళ్ళె (చిత్తూరు) :— దక్షిణ భారతములోని ప్రఖ్యాత గాయకులలో నొకరుగా కీర్తిగడించిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. అన్నామలై సంగీతకళాశాలయం దధ్యాపకులుగా నున్నారు. ప్రస్తుతము ఆల్ ఇండియా రేడియో మ్యూజిక్ అడివిసన్ బోర్డులో సభ్యులుగానుండిరి.

సుబ్రహ్మణ్యపిళ్లె (పళని) :— మృదంగ వాద్యములో విశేష ప్రఖ్యాతిగల సుప్రసిద్ధ విద్వాంసుడు. సుప్రసిద్ధుడై, కీర్తిశేషుడైన శ్రీ పళని ముత్తయాపిళ్ళె ద[illegible] కుమారుడు. ఈయన శిష్యుడే ప్రసి[illegible] దంగ వాద్యకుడగు శ్రీ దండ[illegible] రామమోహనరావు(విజయవాడ) [illegible]

సుబ్రహ్మణ్యభారతి :— సుప్రసిద్ధ [illegible] కీర్తనల రచయితయగు ప్రాచీన [illegible] సుడు. గొప్పగాయకుడు. ప్రశ[illegible] యీయన కీర్తనలలో నాటకురం[illegible] 'జాతిగళ్ ఇల్లైయడి' అనునదిఒకటి[illegible]

సుబ్రహ్మణ్యయ్యర్ (తిరువారూరు) [illegible] 'సంగీతకౌముది' అను సుప్రసిద్ధ [illegible] లక్షణగ్రంథమును రచించిన ప్ర[illegible] గ్రంథకర్త. తమిళ బ్రాహ్మణుడు.

సుబ్రహ్మణ్యయ్యర్ (ముసిరి) :— [illegible] సుప్రసిద్ధ గాయకులలో విశేషకీర్తి[illegible] చిన ప్రముఖ సంగీత విద్వాంసుడు. 19[illegible] లో మద్రాసు సంగీతపరిషత్ వారు [illegible] సంగీతమహాసభ కధ్యక్షతవహించు[illegible] 'సంగీత కళానిధి' అను బిరుదునొందిరి ప్రస్తుత[illegible] మద్రాసులోని 'సెంట్రల్ కాలేజీ ఆ[illegible] కర్నాటిక్ మ్యూజిక్' అను కేంద్రప్రభుత్[illegible] సంగీత కళాశాల కధ్యక్షులుగా నున్నారు. తమిళబ్రాహ్మణుడు. నివాసముమద్రాసు.

సుబ్రహ్మణ్యయ్యర్ (నేమమ్) :— 18[illegible] శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. ఈయన శ్రీ త్యాగరాజుని శిష్యకోటికి చెందినవాడు.

సుబ్రహ్మణ్యయ్యర్ (పట్నం) :— 1845-1902 కాలమునకు చెందిన ప్రాచీన సుప్రసిద్ధ గాయకశిఖామణి. అష్టసహస్ర [illegible]

హ్మణుడు. శ్రీ త్యాగరాజుల ననుసరించి అనేక వర్ణములు, కృతులు, తిల్లానాలు, జావళ్ళు, రచించిన సుప్రసిద్ధ పండితుడు. బేగడ రాగాలాపనలో యీయనకుగల అద్భుతప్రావీణ్యమునకు "బేగడసుబ్రహ్మణ్యయ్యర్" అని పిలువబడెను. 128 అక్షర కాలములుగల 'సింహానందన' అను గొప్ప తాళమునందొక పల్లవిని రచించి అత్యద్భుతముగా గానముచేసిన ఏకైక విద్వాంసుడు. మద్రాసునందునివసించెను. ఈయన గురువు శ్రీ మానంబుచావడి వెంకట సుబ్బయ్యర్ అని చెప్పుదురు.

*సుబ్రహ్మణ్యశాస్త్రి (పుచ్చా) :— సంస్కృత పండితుడై సంగీతశాస్త్రమందుకూడ విశేష కృషిచేయుచున్న సమర్థుడు. ప్రస్తుతము హైదరాబాదు ప్రభుత్వ యాజమాన్యమున సంగీతశాస్త్ర పరిశోధకులుగా నున్నట్లు తెలియుచున్నది. ఈయన "సంగీత మార్తాండ" అను నొక గ్రంథమును రచించెను. ఆంధ్ర వైదీక బ్రాహ్మణుడు.

*సుబ్బారావు (టి.వి.) :— సంగీత లక్ష్య లక్షణములందు విశేషమగు కృషియొనర్చిన సుప్రసిద్ధ పండితులు. గొప్ప న్యాయవాదులు. వీరు 1929, 1930 సంవత్సరములందు మద్రాసు సంగీత పరిషత్సభవారిచే జరుపబడిన సంగీత మహాసభల కధ్యక్షత వహించి 'సంగీతకళానిధి' అను బిరుదు నొందిరి. మరియు మద్రాసు టీచర్సు మ్యూజిక్ కాలేజీ అధ్యక్షులుగను, ఆంధ్రా యూనివర్శిటీ మ్యూజిక్ బోర్డు అధ్యక్షులుగను, మైసూరు యూనివర్శిటీ మ్యూజిక్ బోర్డు సభ్యులుగను, ఆల్ ఇండియా రేడియో మ్యూజిక్ ఆడిషన్ బోర్డు ఉపాధ్యక్షులుగను వున్నారు. అంతేగాక అపూర్వ త్యాగరాజ కీర్తనలు, క్షేత్రయ్య పదములు, రాగతాళచింతామణి, అభినయ దర్పణాది గ్రంథములకు పరిష్కర్తలు. తెలుగు బ్రాహ్మణులు. ఇంటిపేరు తిపానూరు. నివాసము మద్రాసు.

సుబ్బుకుట్టిఅయ్యర్ (వీణ) :— సుప్రసిద్ధుడైన ప్రాచీన వైణిక విద్వాంసుడు. రాగాలాపన, పల్లవి, స్వరకల్పనలయందు మిగుల సమర్థుడు. తమిళ బ్రాహ్మణుడు.

## సూ

*సూర్యనారాయణ (దూర్వాసుల) :— సంగీత, సాహిత్యములందును, వీణలో షట్కాలములు వాయించుట యందును మిక్కిలి ప్రతిభగల ప్రాచీన విద్వాంసుడు. ఆంధ్రబ్రాహ్మణుడు. విజయనగర ప్రాంతమువాడు.

## సే

*సేతురామయ్య (వి.) :— నేటి సుప్రసిద్ధ వరుమొలినిష్టులలో నొకరుగా పేరొందిన సంగీత విద్వాంసుడు. తెలుగు మురికినాటి బ్రాహ్మణుడు. సప్తతంత్రుల ఫిడేల్‌పై నభ్యాసము గలవాడు. మద్రాసు ఏ. ఐ. ఆర్. నందు నిలయ విద్వాంసుడుగానున్నాడు.

## సో

*సోమనాధుడు :— 'రాగవిబోధ'మను సుప్రసిద్ధ ప్రమాణ సంగీత లక్షణ గ్రంథమును సంస్కృతమున రచించిన ప్రాచీన ఆంధ్ర వాగ్గేయకారుడు. ఈయన గ్రంథమున 15 వికృతస్వరములతో నూతనపద్ధ

తిని 960 మేళములను కనిపెట్టెను. ఈయన సుప్రసిద్ధ గాయకుడును, వైణికుడగును.

## హ

హబీబుదీన్‌ఖాన్ :— తబలా వాద్యమునందు నేడు విశేష ప్రఖ్యాతిగలిగిన యొక విద్వాంసుడు. ఉత్తరదేశీయుడు.

హరిదాసస్వామి :— అక్బరు చక్రవర్తి కాలమునకు చెందిన ప్రసిద్ధ గాయకుడు. లక్షణకారుడు. ఈయన బృందావన తీరమందు నివసించెనని చెప్పుదురు.

హరిహరయ్యర్ :— 'గెత్తు' అను తంత్రీ సంబంధమైన లయవాద్యమునందు నేడు విశేషప్రఖ్యాతిగల్గిన గొప్ప విద్వాంసుడు. తమిళ బ్రాహ్మణుడు.

## హీ

హీరాబాయిబరోడేకర్ :— హిందుస్థాని సంగీతమందు నేడు విశేష ప్రఖ్యాతిగలిగియున్న సుప్రసిద్ధ గాయకురాలు.

## హొం

హొన్నప్పభాగవతర్ :— మైసూరురాష్ట్రమునకు చెందిన నేటి ప్రసిద్ధ గాయకుడు. సుప్రసిద్ధ నటకుడు. కర్నాటక బ్రాహ్మణుడు. నివాసము బెంగుళూరు.

హొన్నయ :— 'చతుర్దండి ప్రకాశిక' అను ప్రమాణ లక్షణగ్రంథమును రచించిన శ్రీ వెంకటమఖికి గురువైన శ్రీ తానప్పాచార్యునియొక్క తండ్రి. ఈయన ప్రాచీన విద్వాంసులలో చాలా గొప్పవాడు.

## క్షీ

క్షీరాబ్ధిశాస్త్రి :— వేదాంత సంబంధమైన కీర్తనలు రచించిన ప్రాచీనుడగు ప్రసిద్ధ విద్వాంసుడు. ఈయననివాసముతిరువళ్వోలి.

## క్షే

*క్షేత్రజ్ఞులు :— 17 వ శతాబ్దమునకు చెందిన సుప్రసిద్ధ పదరచయితయగు ప్రాచీన వాగ్గేయకారుడు. తెలుగు బ్రాహ్మణుడు. నివాసము కృష్ణాజిల్లాలోని మువ్వ గ్రామము. సంస్కృ, తాంధ్రములందును, సంగీతమందును ప్రసిద్ధుడైన పండితుడు. గొప్ప కృష్ణభక్తుడు. శ్రీ గోపాల మూల మంత్రోపాసనాలిఫతమున, స్వామి యనుగ్రహమునొంది 'మువ్వగోపాల' ముద్రతో 4,000 పదములను రచించిన మహనీయుడు. తంజావూరు శ్రీ విజయరాఘవ నాయకుని కోరికపై రాజాంకితముగా విజయ రాఘవ పంచరత్నములను 5 పదములను రచించినఘనుడు. మధుర, తంజావూరు, గోలకొండ, విజయనగర మహారాజుల సమక్షమున తన పదరచనలు ప్రదర్శించి బహుసన్మానము లొందినవాడు. ఈయన రచనలలో ఆనందభైరవి రాగములోని 'మంచిదినము నేడే' హుసేని రాగములోని 'అలిగితే భాగ్యమాయె' అను పదములు సుప్రసిద్ధములు. ఈయన వర్ధంతివుత్సవములు యిటీవలకృష్ణాజిల్లాలోని "మువ్వ" అను గ్రామములో ప్రారంభింపబడి జరుపబడుచున్నవి.

సమాప్తము

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | కాలం. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 5 | 2 | 6 | ఉత్పృత్తుల | ఉత్పత్తుల |
| 6 | 1 | 23 | సంబందర్ | సంబంధర్ |
| 11 | 1 | 14 | తాళ్ళపాకం | తాళ్ళపాక |
| 11 | 2 | 18 | హనుమత్తోడి | హనుమతోడి |
| 18 | 1 | 23 | హార్మానిక్స్ | హార్మోనిక్స్ |
| 19 | 1 | 14 | మనగా | యనగా |
| 20 | 1 | 2 | చెయునపుడు | చేయునపుడు |
| 20 | 1 | 13 | నుండుట | నుండుట |
| 21 | 2 | 16 | రాగమును | రాగము. |
| 22 | 2 | 28 | ఆనగా | అనగా |
| 23 | 1 | 1 | సంగీతముమ | సంగీతమును |
| 25 | 1 | 16 | ఉడైయార్ పాలెమ్ | ఉదయార్పాళయము |
| 25 | 1 | 22 | భాట్ ఖండే | భాత్ ఖండె |
| 26 | 1 | 18 | తాళ్ళపాకం | తాళ్ళపాక |
| 32 | 1 | 20 | రొర్పరచు | యేర్పఱచు |
| 42 | 2 | 15 | ధురంధర | దురంధర |
| 48 | 2 | 9 | తాళ్ళపాకమ్ | తాళ్ళపాక |
| 49 | 2 | 5 | వాఇయ | వఇయ్య |
| 56 | 1 | 2 | గాచేరి | గారిచే |
| 57 | 1 | 2 | ముకు | మునకు |
| 79 | 1 | 26 | ని ధ ని ఫ | ని ధ ని ఫ |
| 86 | 2 | 1 | గుయ | యగు |
| 90 | 1 | 4 | పంచము | పంచమము |
| 93 | 1 | 24 | కుంజరదాన | కుంజరదాన |
| 95 | 2 | 2 | యుక్క | యొక్క |
| 100 | 1 | 6 | స్వర్గలలో | సర్గలలో |
| 100 | 2 | 3 | పేరుగల | పేరుగలదు. |
| 102 | 1 | 21 | తాళ్ళపాకం | తాళ్ళపాక |
| 104 | 1 | 5 | ఆవరోహణము | అవరోహణము |
| 110 | 1 | 5 | తంరగిణి | తరంగిణి |
| 110 | 2 | 14 | తాళంగములను | తాళాంగములను |
| 111 | 2 | 20 | సంకర్నాటకగీత | కర్నాటకసంగీత |
| 115 | 1 | 28 | పెరుంగళ్ | పెరుంగుళమ్ |
| 127 | 2 | 5 | ఘనంసిధు | ఘనసింధు |
| 128 | 1 | 23 | గానికి | దానికి |

| పుట. | కాలం. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 132 | 1 | 7 | ఎకడమీ | అకాడమి |
| 134 | 1 | 16 | సా̣ సా పా సా | సా̣ సా పా సా |
| 141 | 2 | 25 | స రి గ ను | స̣ రి గ మ |
| 145 | 2 | 1 | యుక్తమైన | యుక్తమైన |
| 158 | 1 | 16 | మిని | జైమిని |
| 158 | 2 | 16 | నుతన | తన |
| 161 | 1 | 22 | టుమిరి | తుమ్రీ |
| 164 | 2 | 2 | వాయిచుందురు. | వాయించుదురు. |
| 170 | 1 | 18 | చిన్నసామి | చిన్నస్వామి |
| 170 | 2 | 10 | ఆవరోహణము | అవరోహణము |
| 170 | 2 | 21 | స̇ ని ధ గ రి ప. | స̇ ని ధ గ రి స. |
| 175 | 2 | 14 | తాళ్ళపాకం | తాళ్ళపాక |
| 175 | 2 | 25 | తాళ్ళపాకం | తాళ్ళపాక |
| 176 | 2 | 9 | శిలప్ప | శిలప్ప |
| 182 | 1 | 6 | ముగు | ములగు |
| 182 | 1 | 3&7 | హిందూ | హిందు |
| 182 | 1 | 11 | హిందూ | హిందు |
| 184 | 1 | 8 | తాళ్ళపాకం | తాళ్ళపాక |
| 184 | 1 | 15 | సంబంధార్ | సంబంధర్ |
| 184 | 1 | 20 | తాళ్ళపాకం | తాళ్ళపాక |
| 184 | 2 | 3 | దీక్షితార్ | దీక్షితర్ |
| 184 | 2 | 14 | సంబంధార్ | సంబంధర్ |
| 186 | 1 | 6 | త్రివేంద్రమ్ | ట్రివేంద్రమ్ |
| 187 | 2 | 23 | హిందూ | హిందు |
| 190 | 1 | 17 | హింటూ | హిందు |
| 190 | 2 | 2 | గీతానుగము | గీతానుగమము |
| 190 | 2 | 6 | నృత్తానుగము | నృత్తానుగమము |
| 190 | 2 | 10 | ద్వయానుగము | ద్వయానుగమము |
| 191 | 1 | 21 | హిందూస్తానీ | హిందుస్తానీ |
| 191 | 2 | 16 | దీక్షితార్ | దీక్షితర్ |
| 193 | 2 | 23 | ద్రావిడగాన | ద్రావిడాగమ |
| 196 | 1 | 24 | దిల్ రూబ | ధిల్రుంబా |
| 196 | 1 | 27 | హిందూ | హిందు |
| 205 | 2 | 14&28 | ముతుస్వామి | ముద్దుస్వామి |
| 205 | 2 | 27 | దీక్షితార్ | దీక్షితర్ |
| 206 | 1 | 1 | ముత్తు | ముద్దు |
| 209 | 1 | 22 | ముత్తు | ముద్దు |

